శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**

**KAKINADA.**

కీ ర్తి శే షు లై న

## శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారాయ బహద్దరు మహారాజావారి

స్మా ర క సం చి క

## THE COMMEMORATION VOLUME OF MAHARAJA OF PITHAPURAM



[illegible]


సంపుటము ౫౨-౫౩ సంచికలు ౫-౬, ౧-౨

do 52 - 53 do 5 - 6, 1-2

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు :

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

పోషకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,

జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక


**Journal of the Telugu Academy**

**KAKINADA.**

సంవత్సరము చందా రు 3—0—0.

సంపుటము 52 శోభకృత్ మాఘ-ఫాల్గుణములు } సంచికలు 5-6
,, క్రోధి చైత్ర-వైశాఖములు }
,, 53 ,, జ్యేష్ఠ-భాద్రపదములు సంచికలు 1-2

సంపాదకుడు : కుందూరి ఈశ్వరదత్తు.


## విషయసూచిక

అనుబంధములు.

# నివాపాంజలి

శ్లో॥ శతేషు జాయతే శూరః సహస్రేషు చ పండితః।
వక్తా దశసహస్రేషు దాతా భవతి వా న వా॥

శ్లో॥ శ్రోత్రం శ్రుతేనైవ న కుండలేన దానేన పాణిర్న తు కంకణేన
విభాతి కాయః కరుణాపరాణాం పరోపకారేణ న చందనేన॥

శ్లో॥ పద్మాకరం దినకరో వికచం కరోతి
చంద్రో వికాసయతి కైరవ చక్రవాలం
నాభ్యర్థితో జలధరోఽపి జలం దదాతి
సన్తః స్వయం పరహితే విహితాభియోగాః॥

లోకములో వదాన్యులనగా వాసికెక్కిన శిబి, దధీచి, బలి, కర్ణాదులున్నారు కాని వారి వితరణము పురాణ కథనములు. సూర్యనారాయణుని యీవి యపరిమితము; ఈతడొనర్చిన సాహిత్యపోషణ మొక పాటిది. వాఙ్మయ సేవ సారస్వతసేవయు మున్నగునది. మహాత్ముడు భరతఖండమున నడుగుపెట్టి హరిజనోద్ధరణమని నిమ్నజాత్యుద్ధరణమని ప్రచారరణభేరిని మ్రోగించుటకు మున్నెన్నడో యీమహారాజు అనాథశరణాలయములను, ప్రసూతివైద్యశాలలను నిర్మించి, బాలికల కుచితవిద్యాసౌకర్యములు గల్పించి, వేలు లక్షలు వ్యయముచేసెను మదరాసు రాష్ట్ర శాసనసభ్యుడుగా నుండి నిమ్నజాతిమానవుల నామముల తుదను 'గాడు' (సుబ్బిగాడు, సత్తిగాడు) అను నీచవాచకమును తొలగింప తీర్మానమును ప్రవేశపెట్టి తన సర్వజన సౌభ్రాతృత్వమును ప్రదర్శించెను. ఈతడొనర్చిన దానములు నిగూఢములు. అతడు వానిని జన్మదినోత్సవములు, సన్మానసంరంభములు, సమారాధన సంతర్పణముల వాంఛింపకయే యొనర్చియుండెను.

ఆకాలమున నీతి యరుంధతీసతీ నక్షత్రములవలె కంటికగపడి యునగుపడక యుండలేదు. నియమము నభఃకుసుమము కాలేదు.

రిక్షయు దీక్షయు క్షీణింపలేదు. మహారాజు నీతి నియమములకు బద్ధుడై, నిరాడంబరజీవియై, నివాళినీరాజనములు కిచ్చగింపక త్రికరణశుద్ధిగ, నిరంతర కార్యోత్సాహియై పరోపకార పారీణుడయ్యెను. భగవద్గీతమొదలు భరతనాట్యము వఱకాంధ్రసంస్కృతి యను పేర పెట్టి యుపన్యాసములనిచ్చి యెఱుంగడు. బిరుదములు నుపగినవాడు కాడు. పూలహార కోలాహలముల కలవడలేదు.

నిఘంటు నిర్మాణము

మహారాజు జీవించి యుండగనే నిఘంటునిర్మాణము పూర్తిగానించు పుణ్యము పరిషత్తునకు లభింపలేదు పరిషత్కార్యదర్శులు శ్రీ దంటు భాస్కరరావుగారు నిఘంటునిర్మాణము సమాప్తి గావింప బద్ధకంకణులై మొదట కొంత ప్రయత్నము గావించి, తర్వాత యాతనాయములు గల్గినను సరకుసేయక, యిప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్రభాషా శాఖాధ్యక్షులగు శ్రీ దివాకర్ల వెంకటావధానిగారి పర్యవేక్షణమున నీకార్యమెట్లయినను గొనసాగింప ధృత్యున్నతోత్సాహులై దీక్షవహించియున్నారు.

కృతజ్ఞత

ఈ స్మారకసంచికకు వ్యాసములు బంపించిన విద్వద్వరేణ్యులకు నమస్కారములు. అడిగిన తడవుగ మహారాజునుగూర్చి యెన్నియోవిషయముల దెల్పిన శ్రీ తారక ప్రతినాయులును, ధర్మసాధని పత్రికాధిపతులునగు కంభంపాటి రామశాస్త్రిగారికి నమస్కృతులు. వీరు మహారాజావారి రెండు ప్రతికృతుల నిచ్చియున్నారు. ఈరెండును గాక మహారాజు బాల్య యౌవనప్రాయముల నాటిరెండు ప్రతికృతులు పిఠాపురము రాజావారి స్థానికోన్నత పాఠశాలలోనుపాధ్యాయులగు శ్రీ నారాయణదాసు M, A. L. T. శ్రీ సూర్యారావు B. A. Bed. వారివలన లభించినవి. వారిద్దఱకు చేమోడ్పు.

శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ప్రతిబింబము ముద్రాక్షరశాలవారు యొసంగిరి సంచిక సుందరాకారముగ ముద్రించిన ముద్రాక్షరశాలాధికారులకు వందనములు.

## అ ను బం ధ ము లు

ఇటీవల పరిషత్తులోని ముద్రితాముద్రిత గ్రంథపట్టికలవ్రాయు నపుడు, వ్రాతప్రతులలో సాహిత్యచింతామణి యను సంస్కృతాలంకారగ్రంథము గన్పడెను. ఇది చక్కని వ్రాతప్రతి. ప్రతాపరుద్ర యశోభూషణమును బోలి సూర్యరాయేంద్రుని సంబోధించు శ్లోకములతో నున్నది. శ్రీ చావలి రామసుధీవరేణ్యునిచే స్వవిరచిత బుధరంజనీ వ్యాఖ్యానసహితముగా గ్రథితము. అముద్రితమని తెలియవచ్చినది. ఇట్టిగ్రంథమాంధ్రపండిత బృందమునకర్పించుటకై, ప్రతిసంచికయందును గొంతభాగము ప్రకటితమగును.

వాసవదత్తాపరిణయము రెండవగ్రంథము. దీనికొక వ్రాతప్రతియు నొక తాళపత్రప్రతియు భాండాగారమునగలవు. దీనిని క్రీ.శ. 1897 సం॥ శ్రీ వీరేశలింగముగారు పరిష్కరించి ప్రచురించియున్నారు. ఇప్పుడీ ముద్రితప్రతియు నలభ్యము. గ్రంథకర్తయగు నక్కలంక వీరభద్రకవి పిఠాపురసంస్థాన ప్రథమాస్థానకవి. కృతికర్తయగు మాధవనృపాలునివఱకు రావువంశమును గవివర్ణించియున్నాడు కావున సంస్థానచరిత్రకమూల్యమైన యాధారము. సూర్యరాయబహాద్దరీగ్రంథమును దన యుపన్యాసములో బ్రశంసించియుండెను. ఇప్పుడీ గ్రంథమును వ్రాత, తాళపత్ర, ముద్రితప్రతులతో సంప్రతించి, పునర్ముద్రణమొనర్చి, సంచికలో వెల్వరింప నిర్ణయము. ముద్రితప్రతి యొకటి యెరవుగనిచ్చిన శ్రీ నిడుదవోలు వెంకటరావుగారికి మానమస్కారములు. ఈయనుబంధము అత్యంతశ్రద్ధతో ముద్రించుచున్న శ్రీపతి ముద్రాక్షరశాలవారి కభినందనములు.

## స ం చి కా ప్ర చు ర ణ ము లు

సంచికాప్రచురణమున కనివార్యముగ కాలవిలంబనము కలుగుచుండెను. నేడు ఆంధ్రవాణి సారస్వతసార్థవాహుల విహారవీథుల విహరించుచున్నది. చులకనయగు గద్యపద్య కథాకరగాయనిపనల నేర్పుగొన్నది. కుచతటములు బయలుపడు సుందరీచిత్రపటము ముఖాచ్ఛాదన పత్రములపై గాన్పించు, లోన నీతి నియమ రహితములగు కాముక కాముకీ సమాగమ కథానికలు చిత్రపటములతో మేళగించు, తాత్కాలికముగ చిత్తము రంజింపజేయు చెత్తగ్రంథములు వెల్వడుచున్న కాలమున,నియమబద్ధమగు సాహిత్యపత్రికనుజదువు వారెవ్వరు! ప్రభువుల నిండోలగమున నివాళులందిన భాషాలలన, స్వార్థపరులగు ప్రచురణకర్తల వాకిళ్ళ నిలువుకొలువు గావించుచున్నది ఇక ప్రాచీనగ్రంథ పఠనమునకు, ప్రచురణమునకు స్వస్తి. స్మారకసంచికా ప్రచురణోద్దేశము కలసివచ్చి, వెలువడని సంచికలనన్నిటి నొక సంపుటముగా గూర్చి, ప్రకటించి, యింతటినుండి సకాలమున పత్రిక వెలువడ సంకల్పము వహించితిమి. ఈ కార్యమునకు పండితవరేణ్యుల సహకారమవసరము.

## పండితసహకార ప్రార్థనము.

ఆంధ్రదేశమున పూర్వపద్ధతులపై నింకను గౌరవ ప్రపత్తులు గల పండితవరేణ్యులు గలరు. వారు నూతనములగు భాషాపరిశోధనములు గావించి, యుత్తమరచనల నొనర్చి, యీపత్రికాముఖమున ప్రకటించుటకవకాశమును గల్పింప ప్రార్థితులు.

## క్ష మా యా చ న ము

లేఖకదోషములతో ముద్రణాస్ఖాలిత్యములును దొరలినవి స్ఫోటక పిటకములవలె పెక్కుపుటలయందు పొటమరించినవి. అచ్చు

కూర్పు ప్రతుల సరిజూచుట నవమకష్టము. కావున దోషముల మన్నింప ప్రార్థన.

## నివాపాంజలి

పుణ్యరాశియు, స్వారాజ్యవాసియు నైన శ్రీశ్రీశ్రీ రావు వేంకట కుమారమహీపతి సూర్యారావుబహద్దరు మహారాజునకు, ఆంధ్ర సాహిత్యపరిషత్కార్యవర్గమువారు త్రిశుద్ధిగ స్మారకసంచికారూపమున నీ నివాపాంజలి నర్పించుచున్నారు.

మహారాజావారి జననము— 5-10-1885

... మరణము— 6- 3-1964

— సంపాదకుడు.

(67వ పుటలోని కొండవలిశిలాశాసన పాఠము తప్పుగాపడినది. నూతనపాఠము రాబోవుసంచికలో ప్రకటింపబడును.)

---

## రచయితల పరిచయము

(1) శ్రీ అక్షయలింగకవి (గున్నేపల్లి) వీరు కృష్ణామండల స్థానికోన్నత పాఠశాలలలో ప్రధానాంధ్రోపాధ్యాయులై, పదవీవిరమణము నొంది కాకినాడలో నివసించుచున్నారు. వీరు విద్వాన్ పరీక్షయందు తీర్ణులు.

(2) శ్రీ కృష్ణశాస్త్రి (కాకరపర్తి) వీరు కౌశికాభ్యుదయము, అన్యాపదేశము, కంచుఢక్క మొదలగు గ్రంథముల రచించిరి. కవిమూర్ధన్యప్రౌఢకవిచంద్ర బిరుదాంకులు. పరిషత్కార్య నిర్వాహక సభ్యులు.

(3) శ్రీ తమ్మయ్య (బండారు) వీరు శివకవులను గూర్చియు, శైవమతమును గూర్చి యనేకవ్యాసములు వ్రాసియున్నారు. సోమనాథునిజీవితము వ్రాసియున్నారు. బసవపురాణము, భీమేశ్వరపురాణము క్రీడాభిరామము మొదలగు గ్రంథములను సంస్కరించి ప్రచురించియున్నారు. విమర్శకాగ్రేసర, ఇతిహాససామ్రాట్టు బిరుదాంకితులు. పరిషదధ్యక్షులు.

(4) శ్రీ పాపయ్యశాస్త్రి (చిలుకూరి) ఉభయభాషాప్రవీణ, భాషాప్రవీణ పట్టములనందినవారు, పిఠాపురము రాజావారి ప్రభుత్వ కళాశాలలో నాంధ్రభాషోపన్యాసకులు. శ్రీనాథకృతిసమీక్ష; కవితాసమీక్షాది గ్రంథములు రచించిరి. ఉదయసుందరి, పద్మావతి యను గ్రంథములను సంస్కృత హిందీమూలముల నుండి యనువదించిరి. కొంతకాలము ఆంధ్రనిఘంటు కార్యాలయమున బనిచేసిరి. పరిషత్కార్య నిర్వాహకసభ్యులు.

(5) శ్రీ మృత్యుంజయకవి (గున్నేపల్లి) వీరు చిరకాలము తూర్పుగోదావరిమండలమున నున్న స్థానికోన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా పనిచేసి, చల్లపల్లి గద్వాల జయపూర సంస్థానములందు సత్కారములను బడసిరి. వీరు దివంగతులు

(6) శ్రీ మల్లిఖార్జునరావు (కోగంటి-దుర్గా)

వీరు కృష్ణామండల స్థానికోన్నతపాఠశాలలో ఆంధ్రపండితులుగానుండి, యిప్పుడు పాముఱ్ఱుగ్రామములో విశ్రాంతి గైకొనుచున్నారు. ఆధునిక కవులచరిత్ర, రత్నమాల, శబ్దోత్పత్తిశతకములు వ్రాసియున్నారు.

(7) శ్రీ రామచంద్రకీర్తి (వేదుల) వీరు బి యె. ఆనర్సు విద్వాన్ పట్టభద్రులు. పిఠాపురరాజావారి ప్రభుత్వకళాశాలలో ఆర్థికశాఖాధ్యక్షులుగ నున్నారు. వెంకటరామకృష్ణకవులలో రామకృష్ణకవిగారి కుమారులు మహారాజవారి సన్నిధిని గొంతకాలము గడిపియుండిరి. పరిషత్కార్య నిర్వాహకసభ్యులు

(8) శ్రీ వెంకటనరసయ్య (జాస్తి) వీరు చిలకలూరిపేటలో హైయర్ సెకండరీ స్కూలులో ప్రధానాంధ్రపండితులుగా నున్నారు. ఉభయభాషాప్రవీణ పరీక్షయందు త్తీర్ణులు. కథలు, గేయములు, జీవితచరిత్రలు వ్రాసియున్నారు.

(9) శ్రీ వెంకటనరసింహము (కాకర్ల వెంకటరామ)

వీరు ఎం.ఎ. డాక్టరుపట్టభద్రులు. ఆంధ్రవిశ్వవిద్యాలయ ఆంధ్రభాషాశాఖాధ్యక్షపదవి వహించియున్నారు. ఆంధ్రభాషా పరిశోధకులు. ఆంధ్రప్రబంధకవులగూర్చి పెక్కువ్యాసములు వ్రాసియున్నారు.

(10) శ్రీ వేంకటరావు (నిడుదవోలు) మద్రాసు విశ్వవిద్యాలయమునం దాంధ్రశాఖాధ్యక్షులుగానుండి, ఉద్యోగవిరమణమైన తర్వాత, హైదరాబాదులో భాషాపరిశోధన నిమిత్తము భారతప్రభుత్వమువారి విశ్వవిద్యాలయ ధనసహాయ సంఘమువారిచే మాసవేతనమునొందుచున్నారు. ఆంధ్రభాషాపరిశోధకవేత్తలు బహుగ్రంథకర్తలు దక్షిణదేశాంధ్రవాఙ్మయము, ఆంధ్రశాసనకవులు, ఉదాహరణవాఙ్మ

యము మొదలగునవి వీరి పరిశోధకగ్రంథములు. మహారాజు వారి యభిమానపాత్రులు

(11) శ్రీ వీరబ్రహ్మకవి (శ్రీరామ్) వీరు నానారాజన్య చరిత్ర, పీఠికాపురసంస్థానచరిత్రము, ప్రియదర్శిక మొదలగు గ్రంథములను రచించిరి.

(12) శ్రీ సత్యనారాయణశాస్త్రి (మధునాపంతుల)

వీరిప్పుడు వీరేశలింగోన్నత ఆస్తిక పాఠశాలలో నాంధ్రోపాధ్యాయులుగానున్నారు. కొన్నాళ్ళు 'ఆంధ్రి' యను సారస్వతమాస పత్రికకు సంపాదకులుగానుండిరి. ఆంధ్రపురాణము, ఆంధ్రరచయితలు, రత్నపాంచాలిక మొదలగు గ్రంథములను రచించిరి. సంస్కృతాంధ్రగ్రంథములందు మృదుమధురమగు కవిత్వము చెప్ప నేర్చినవారు.

(13) సీతారామమూర్తి (తుమ్మల) వీరు చిరకాలము గుంటూరుమండలములో నిస్థానికోన్నతపాఠశాలలో నాంధ్రోపాధ్యాయులుగానుండి యిప్పుడు అప్పికట్లలో విశ్రాంతిని గాంచుచున్నారు. ఆత్మకథ, ఆత్మార్పణము, పరిగపంట, మొదలగు తెలుగు కావ్యములనురచించిరి. అభినవతిక్కన బిరుదాంకితులు. తెలుగు జిలిబిలిపలుకులతో కవితనల్లు తెలుగులెంక.

(14) సూర్యనారాయణశాస్త్రి (ఖండవిల్లి) వీరు తూర్పుగోదావరీమండల పరిషత్తువారి అంబాజీపేట స్థానికోన్నత పాఠశాలలో నాంధ్రోపాధ్యాయులు.

(15) సూర్యనారాయణశాస్త్రి (దువ్వూరి) వీరు స్థానిక సత్యలింగనాయకర్ ఉన్నతపాఠశాలలో నాంధ్రోపాధ్యాయులుగానున్నారు. అహల్య, నీలకంఠవిజయము, మొదలగు కావ్యములురచించిరి. ఉభయభాషాప్రవీణపట్టము నొందినవారు. పరిషత్కార్యదర్శులలో నొకరు.

కె.వి.ఆర్

—♦—

హరిహరదేవాయనమః.

# సూర్యాస్తమయః.

శ్లో. సన్మార్గగామిని గతేఽస్తమయం తు సూర్యే
హా! హన్త! సారసముహాసుమనా హతాశః
సంకోచ మావహతి మాధుకరోదర స్సన్
కో వా నివారయతి లోకగతస్వభావమ్. 1

శ్లో. వేంకటకుమారమహీపతి
సూర్యారాయాభిధో మహారాజః
యాస్యతి దివ మితి చాన్యా
నిరయా న్నిరయా ద్విహాయ తం లక్ష్మీః. 2

శ్లో. శ్రీమద్రావుకులప్రదీపకమణౌ
సూర్యాధిపేఽస్తంగతే
నిష్క్రాంతా స్సుకవీశ్వరా బుధవరా
విశ్వాసపాత్రాశ్రితాః
నిర్యాతా స్సుహృద స్సబాంధవజనాః
పౌరాతనా స్సేవినో
రాజ్యశ్రీరపి నిర్గతా; నహి జహౌ
త్వేకైవ కీర్తిందిరా. 3

శ్లో. గతవతి నరనాథే నైజరత్నాలిదక్షే
విరమతి హి కృతజ్ఞా సత్యలోకప్రయాణమ్
ప్రవిశతి ధృతి మాసా ద్యాంధ్రసాహిత్యనామ్నాం
పరిషదుదరభూమి మాంధ్రగీర్వాణవాణీ. 4

శ్లో. వికలా వికలా లోకా, స్సకలా స్సకలా అపి
సుకవిప్రకరా హన్త!, సూర్యరాయే దివంగతే. 5

శ్లో. ఏక స్సూర్యనృపో రాజా, రాజా దోషాకరో న హి
కవివైరీ గురుద్రోహీ, పాంథమానధనాప. హా 6

శ్లో. లోకం విహాయ పరలోకగతోఽపి రాజన్!
నో నో విహాయ భవదీయ విహాయితాని
యాతా న్యనాథశరణాలయకాని తాని
విద్యాలయాని భవనాని సమున్నతాని. 7

శ్లో. త్వయా నాచరితం ధర్మం, త్వయా చానత్కృతం కవిం
త్వయా నపఠితం గ్రంథం, నో జానే సూర్యభూవిభో! 8

శ్లో. కో వాధారః కవీంద్రాణాం, బాంధవానాం క ఆశ్రయః
గిరాం దేవ్యాః క ఆలంబ, స్స్వర్గీయే సూర్యభూవిభౌ. 9

శ్లో. శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటురూపం
బ్రాహ్మీం పున శ్శాశ్వతికం సృజంతీ
భవంత ము జ్జీవయ తీహ లోకే;
నిర్యాతు తే నశ్వరభౌతికాంగమ్. 10

శ్లో. శ్రీమద్దేవులపల్లి సోదరకవీ
ద్రష్టుంమనా యాసి కిం?
సారప్రౌఢశతావధాన నిపుణౌ
వా రామకృష్ణౌ కవీ
ధీమంతం వరపానుగంటికులజం
లక్ష్మీనృసింహం కవిం
సాహిత్యప్రియ! సూర్యరాయ! కవితా
పీఠాంధ్రభోజాంక! భో! 11

శ్లో. ఆప్నోతు దైనందినవర్ధనోన్నతిం
శ్రీ రావు సూర్యాధిపపావనాన్వయం
శ్రియా ధియా సద్యశసా చిరాయుషా
కవీశ్వరాశాసనవర్షణేన చ. 12

కాకినాడనగరీ, 25-6-64.

కవిమూర్ధన్యః ప్రౌఢకవిచంద్రః
కాకరపర్తి కృష్ణశాస్త్రీ.



"పార్థివాభ్యుదయ కావ్యమ్"

యద్రాజధానీ చరణాయుధేశ
ఘృణా జగస్వ ద్గురు సంపదాఢ్యా
జాగర్తి సా పీఠపురీ సమాఖ్యా
విఖ్యాత విద్వ త్ప్రచయ ప్రచారా. ౧
ధీమత్కవీశోత్కర వజ్రపేటీ
వేదప్రసార ప్రియ విప్రకోటీ
మహోవినిర్భర్త్సిత దేవ వాటీ
పీఠపురీ రావు నృపాల ధాటీ. ౨
ఏలా ఝరీ సారవృష త్ప్రసంగా
కుంతీ రమానాథ కృతానుషంగా
పీఠపురీ దక్షిణవారణాసీ
ప్రథావతీ భాతి వసుంధరాయామ్. ౩
హుంకారిణీ యత్ర ధరాప్రచారిణీ
పీఠాంబికా యత్ర కృతావలంబినీ
గయాంఘ్రి సంపర్క సరత్తరంగిణీ
సా యత్ర పీఠనగరీ విరాజతే. ౪
సత్యాశ్రయః కోఽపి ధరాభృదింద్రో
బలిష్ఠ పిష్ఠాభిధ దుర్గ మేతత్ ।
పురా నరేంద్రాన్ సకలా న్విజిత్య
దదర్శ తత్రేతి చరిత్ర విశ్రుతిః. ౫
వేంగీ నతాంగీ గళదేశ రత్న
భూషాయితం పత్తన ముత్తమం తత్ ।
ప్రపాలితం మల్లపదేవనామ్నా
శతాబ్దకే ద్వాదశకే చ క్రైస్తవే. ౬
నైయాయికై ర్వ్యాకరణ ప్రవీణై

ర్వేదాంతవిద్యా ప్రవణై స్సుధీగణైః
షడ్దర్శనీవేదిభి రాంధ్ర విష్ణు
వక్షోమణీవ ప్రతిభాతి సాపురీ. ౭

రావ్వన్వయాంభోధి రఖండ రాజ్య
లక్ష్మీ సముత్పత్తి విభూతి హేతుః
రేచర్ల గోత్రాతిపవిత్రితో౽భూ
త్ప్రతా భిధానే పుటభేదనే౽స్మిన్. ౮

ద్వితీయసర్గః

రావు సంతతి సంతానతరో ర్మూల మనాకులమ్
భాతి రాజ్యకళాలోలం పద్మనాయక సత్కులమ్. ౧

వర్మ శబ్దస్య వెల్మేతి దేశ్యరూపః ప్రవర్తితః
తస్మాత్ క్షత్త్రి సదృగ్గోత్ర మితి చారిత్రకప్రథా. ౨

తస్మిన్. వెల్మమహాంభోధా వుత్థితం రావుకౌస్తుభమ్
తన్మణౌ సింగభూకాంత ఏకః కాంతిమయో ఘృణిః. ౩

రత్నపాంచాలికా గ్రంథ రసార్ణవ సుధాకరా
యేన ప్రణీతా సర్వజ్ఞే నామరీవా క్సమర్చితా. ౪

కిం వర్ణనేన బహునా సర్వే రావుకులోద్భవాః
విద్వత్పోషణ సద్భావాః కృతికాంతా మనోధవాః. ౫

సర్వే సంగీత సాహిత్య కళాలీలావతీ రతాః
సర్వే ఖర్వేతర ప్రజ్ఞా స్సర్వే సర్వజ్ఞమార్గగాః ౬

సింగభూపాల ఏవైకః కథిత స్తత్ప్రసక్తితః
సర్వేషాం రావు వంశ్యానా మేష రాజోపలక్షకః. ౭

ఏకోనవింశతితమం పురుషం తత్కులోద్భవమ్
గంగాధరాభిధం భూమినాథమాళిం వయం స్తుమః. ౮

## తృతీయసర్గః

గీర్వాణాంధ్ర సమస్త కావ్యకృతధీః పాశ్చాత్యభాషాసుధీః
హిందూస్థానిక వాఙ్మయీ హిత మతి శ్రీరావు గంగాధరః
క్ష్మాజాని ర్నిజనీతి వాఙ్నిపుణతా సంతర్జిత న్యాయవా
ద్యక్షో వెల్మనృపాల పాళీకృత సాష్టాంగ ప్రణామక్రియః. ౧
భద్రోద్వాహ మహాకృతిట్కవయితా నిర్నిద్ర విద్వద్వ్రతో
యస్యాస్థాన సభాంగణేఽ వసత సుబ్రహ్మణ్య ధీమద్వరః
శ్రీమద్దేవులపల్లి సోదరబుధా యస్య ప్రియా సత్కవీ
తద్గంగాధర రామరాయ నృపతే ర్వర్ణ్యా వితర్ణి ర్బుధైః ౨
విశ్వఖ్యాత విపశ్చితో బులుసు శ్రీ పాపయ్యసచ్ఛాస్త్రిణో
వైశిష్ట్యం సకలం విభావ్య మనసా స్వస్థాన విద్వన్మతే
స్థానే భూరిధరాప్రదానముఖ సమ్మానేన సంపూజయ
ద్రాజా యస్స జయ త్యభంగయశసా గంగాధరశ్రీధరః. ౩
రాజ్యశ్రీ పరిరంభ సంభృత లసద్వక్షః కవాటోద్భటో
లోకఖ్యాత మనోజ్ఞ సప్తమహిషీ కల్యాణ కల్యోదయః
సోఽయం భాతి సమస్త మంగళ కళా లీలా విలాసాత్మక
శ్రీగంగాధర నామరాజతిలక శ్రీకృష్ణ కల్పో నృపః. ౪
రాజ్యం రక్షతి రామరాయనృపతౌ వీతివ్యథా స్సర్వదా
సర్వే నష్టి మవాపు రిత్యతిశయ వ్యాఖ్యా కృతా పండితైః
యస్యానుగ్రహ వారివాహ నివహోద్వృష్టి ర్న తై స్మాసర్యతే
చిత్రం చిత్ర మహో! కవీశ్వర వచో వైయాత్య మేత త్ఖలు. ౫
‘శ్రీకైలాసమహాల్’ సమాఖ్య భవనం సమ్మాన్య మభ్రంలిహం
శ్రీమ త్పీఠపురీయదుర్గ నిలయం యేన ప్రతిష్ఠాపితమ్
తేనాలంకృత మద్య దైవవశతః కైలాససన్మందిరం
నో నిత్యం ఖలు జీవనం త్రిజగతీ రాజ్యాధిపస్యాపి చ. ౬

పీఠీపట్టణ నేతృసంచిత మహాపుణ్య శ్రియ స్సత్ఫలం
మంగాంబా మహనీయ గర్భ విలసచ్ఛ్రీ శుక్తి ముక్తాఫలమ్
సంస్థానీ కవిజాత చాతక పయోవాహః కళాకోవిద
శ్రీమద్వేంకట సూర్యరాడ్వసుమతీనాథోఽజని శ్రీఖనిః. ౭
శ్రీమత్పార్థివ భాద్రమాసి బహులే పక్షే తు త్రాయోదశీ
యాదిత్యాహ్వయవాసరే గుణమణి శ్రీమంగమాంబాసతీ
క్రీస్త్వబ్దాంతర భూత దిగ్వసు ధరా సంఖ్యాకసంవత్సరే (౧౮౮౫)
సూర్యారాయ మసూత విస్మయకర శ్రేయోవిలాసాశ్రయమ్. ౮

చతుర్థసర్గః

పాణిగృహీతీ సాధ్వీ, చిన్నాంబా సద్గుణైక నికురంబా
మానవతీమూర్ధమణి, స్సూర్యవిభో ర్విజయ తే నితాంతమ్. ౧
కపిలేశ్వరపుర పరివృఢ, తిలకస్య ప్రశస్యవినయ భాగ్యస్య
వేంకటరంయ్యప్ప, రాయస్య తనూద్భవా హి చిన్నాంబా. ౨
సంతు పతిరతా శ్చతశ, స్తథాపి చిన్నాంబికా సమా నైకా
నాప్యజని రాజవంశే, పతిహిత పద్యానుగా మహాసాధ్వీ. ౩
శ్రీచిన్నాంబా మానస, పరోజ సూర్యాయితోఽపి శ్రీసూర్యః
కృతికాంతా స్స్వీకృత్యా, తత్యాజ లసన్నిజైక పత్నీత్వమ్ ౪
కవయ స్సుధియ శ్చతశ, స్సూర్యవిభో స్సద్గుణౌఘ సంపత్తిమ్
అభివర్ణయంతి బహుధా, బహుధన ధాన్యాదివైభవా స్సంతః. ౫
సుప్రత్యహ మపి కించన, సారస్వత సేవనాతి కౌశల్యమ్
స్తౌమి తదవనీభర్తు, ర్థీమద్గణ్యాం కవీంద్రగణశరణ్యామ్. ౬

పంచమసర్గః

యస్యాస్థానే సురపతి సభా సన్నిభే గౌతమీయా
ప్రఖ్యాతోఽభూ ద్విబుధమదగజానీకసింహో నృసింహః

శ్రీపాదాఖ్య ప్రథిత జననఖ్యాత కీర్తిందుమూర్తిః
కాశీతర్కోద్భట గణకృతానేక సాష్టాంగదండః. ౧
ఆమ్నాయార్థ ప్రవచనచణో లక్ష్మీనారాయణాఖ్య
స్సంఖ్యావాన్ శ్రీవడలి కులజ స్సాధు విద్యాప్రబోధైః
వాదీభానాం ముఖనిగరళై ర్వాగ్రహోదగ్రమూర్తి
స్తస్యాస్థానే సురపతి సభా సన్నిభే కోవిదోఽభూత్. ౨
నానాశాస్త్రం సుచిర పఠన శ్రద్ధధానః ప్రవీణ
శ్ఛాత్రశ్రేణేః సమధిగత సుమాభ్యర్చనాచర్చితాంఘ్రిః
వేదీ వాదీ ప్రథితగురుధీ స్సూర్యనారాయణాహ్వ
తస్యాస్థానే సురపతిసభా సన్నిభే లబ్ధవర్ణః. ౩
అద్వైతార్థ ప్రకటన విధౌ శంకరాచార్య దేశ్యో
వశ్య శ్శిష్యప్రవర విహితస్తోత్ర పాఠక్రమస్య
శాస్త్రజ్ఞానీ నృహరి రమలో దెందులూర్యన్వయేందు
స్తస్యాస్థానే సురపతి సభాసన్నిభే సూరిశూరః. ౪
ఘంటాగ్రంథ ప్రకటన విధి శ్రీధురీణౌ ప్రవీణౌ
దృశ్య శ్రవ్య ప్రభృతి కృతిరాట్కర్తృతోపాత్తకీర్తి
మూర్తీభూత ప్రచుర వినయౌ రామకృష్ణౌ కవీంద్రౌ
తస్యాస్థానే కవయితృపదం లబ్ధవంతౌ మహాంతౌ. ౫

శ్రీపానుగంటి నరసింహ కవీశ్వరీయ
హృద్యానవద్య రస గద్య కవిత్వధాటీ
సాక్షీ బభూవ నృపతే స్సుకవిత్వ విద్యా
సక్తేః పరం విబుధ పోషణ బద్ధ శక్తేః. ౬
శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు సత్కృతి
ప్రియస్య శ్రీరావునృపాల మౌళేః
యశ స్సదా వాఙ్మయ భద్రదేహ
రూపేణ సంస్థాస్యతి మంజులేన. ౭

రావు సూర్యధరాజానే రనాథశరణాలయమ్
యావ త్తిష్ఠతి ధారిణ్యాం యశ స్తావ త్ప్రకాశతే ౫
రావు సూర్యాధరాజానే రాంధ్రసాహిత్యసత్సభా
యావ త్తిష్ఠతి ధారిణ్యాం తావ త్కీర్తిః ప్రకీర్త్యతే. ౬

—మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

## మహారాజస్మృతి.

ఏ మహారాజసత్కృతులచే విద్వత్క
వీంద్ర బృందము కృతకృత్య మయ్యె
ఏ విభూత్తము సాహితీవిశిష్టత నాంధ్ర
సాహిత్యపరిషత్తు జనన మందె
ఏ నృపాలకృపా సమృద్ధి శ్రీ సూర్యరా
యాంధ్రనిఘంటుసంప్రాప్తి దనరె
ఏ రసజ్ఞుని మహోదారభావనిరూఢి
వివిధసంస్థలు కళాన్వితము లయ్యె
అట్టి పీఠపురాధీశుఁ డమృతహృదయుఁ,
డార్తజనకల్పశాఖి, భాషాభిమాని
వేంకటకుమారసూర్యరాడ్విభుఁడు నేఁడు
సకలమును బాసి కనియె శాశ్వతపదమ్ము. ౧
ఆంధ్రభోజుని నిన్న నడఁగించె శోభకృ
ద్వత్సరమ్మున కెంత మత్సరమ్మొ?
రావువంశప్రవర్ధను నిన్న మడియించె
ఫాల్గునమ్మున కెంత పలువతనమొ?

బహుళసత్కార్యధూర్వహు నిన్నుఁ గబళించె
బహుళమ్మునకు నెంత యహితగుణమొ?
సకలపండితజనాశ్రయు నిన్ను సమయించె
నష్టమి యెంత నికృష్టమతియొ?
అద నెఱింగి వీని నన్నుఁట నైక్యమై
ప్రాణ మెడపె శుక్రవాసరమ్ము
సూర్యభూప! నీదు సుతహితాదికబంధు
వితతి యెట్లు నిన్ను విస్మరించు. 2

లేరే? క్రూరులు, దుండగుల్, వెడమతుల్, లేరే? కృతఘ్నుల్,దురా
చారుల్, జారులు, చోరు, లజ్ఞులు, దురాశాపీడితుల్, హంతకుల్
లేరే? వారలు కానరారె? మఱి యేలీలన్ సుశీలున్, మహో
దారున్ నిన్ను హరించె ధూర్తవిధి నిర్దాక్షిణ్యచేతోవిధిన్. 3

దేవు ననం బ నేటికిఁ? బదింబదిగా నిటు సర్వలోకసం
భావితుఁ, డాదయామయుఁడు; పాపుల నొప్పరికించి పుణ్యుఁ గొం
పోవుఁగదయ్య! స్వస్థలికిఁ బూర్వకృతమ్ముల మీఱనౌనె? నీ
జీవిత మెంతయేనియుఁ బ్రసిద్ధివహించె నృపాలమండలిన్. 4

ఆలకింపవె? 'సుకృతీ గతాయు' వనెడు
సూరిజనసూక్తి, కీర్తివిస్ఫూర్తి వెలయు
భవ్యమూర్తివి, నినుఁగూర్చి వగవనేల ?
శాంతిఁ గనుఁగాత! సకలసజ్జనగణమ్ము. 5

మెహెర్ భవన్.
జగన్నాయికపూర్,
కాకినాడ-2.
విద్వాన్; గున్నేపల్లి అక్షయలింగకవి.

# అభినవభోజ సంస్మృతి.

—o—

కం. తెలుఁగున మంచి నిఘంటువు
గలుగదె యిందాఁక నంచుఁ గరముగ మదిలోఁ
దలఁచుచు వెచ్చించితి ల
క్షలు దానికి, సూర్యరాయజనపతివర్యా !

కం. రాజవు దాతలయందున్,
రాజవు సుగుణాఢ్యులందు, రాజవు బుధులన్,
రాజవు సంస్కారపరుల,
రాజవు భూపతుల, సూర్యరాయమహీశా !

కం. ధనమన్న లెక్కచేయని
ఘనుఁడవు, సద్భావములను గలవాఁడవుగా
నినుఁ బోల్పఁ గడఁగ నెవ్వరుఁ
గనరా రన వాస్తవమ్ము గాదే యరయన్.

కం. జనవాణిని నెలకొల్పితి,
జనవాణినిఁ బంపి నీవు సకలదిశలకున్
జనవాణిఁ దెలిపినాఁడవు,
జనులందఱు మోదమొందఁ జనపతివర్యా !

కం. రప్పించితి సత్కవులను
జెప్పించితి నీవు వారిచేతను గవితన్
ఇప్పించితి బహుమతులను
మెప్పించితి సూర్యరాయ ! మేదినియందున్.

కం. పోషించితి కవిరాజులఁ
బోషించితి నీవు మున్ను బుధసత్తములన్
బోషించితి వాశ్రితులను
బోషించి తనాథగణము భూపతిచంద్రా !

కం. జోహారులు నవభోజా !
జోహారులు సర్వవిభుండ ! జోహార్లుప్రభూ !
జోహారులు సదయహృదయ !
జోహారులు దేశభక్త ! జోహారు లివే.

కం. కవితల్లజు లనఁగఁ దెలుఁగు
కవితయనఁగ సంతసంబు గలుగును నీకున్
మివులన్ హృదయములోనన్
అవురా! శ్రీసూర్యరాయ! యలవియె? పొగడన్.

కం. మనుజుం డెవఁడేనియుఁ దా
ననిశము యత్నింపవలయు యశము గడింపన్
చనునే పశువు విధంబున
మని చచ్చుట ధరణియందు మనుజుం డెవఁడేన్.

కం. సత్కారము లొనరించితి
సత్కార్యము లాచరించి జగతీస్థలిలో
సత్కవిపోషక ! పడసితి
సత్కవి సత్తములచేత సంస్తుతులఁ గడున్.

కం. మనుజుని ధర్మము విడిచిన
మనుజుం డీజగతియందు మనుజుం డగునే?
మనుజుని రూపంబును గలి
గిన నీచమృగంబని పలికిరి గద సుకవుల్.

కం. ధన్యుండుగద నీజనకుండు
ధన్యుండవుగాదె నీవు ధరణీస్థలిలో
ధన్యముగద నీదేశము
ధన్యయ నీమాతృదేవి ధరణీనాథా !

శ్రీ విద్వాన్ కోగంటి దుర్గామల్లికార్జునరావు,
భారతీసమితి, పామర్రు, కృష్ణాజిల్లా.

ఓం

# కాళిదాసు - ప్రకృతి సహజీవనము.

"ప్రకృతికిన్ భాష్యప్రణేతల్ కవుల్"

మహాకవులు ప్రకృతిలోని రహస్యములను సుమధుర వాగ్గుం ఫనములతో వివరించి విస్పష్టము సేయుచుందురు. ఇట్టిమహాకవులలో గాళిదాసు ♦ కనిష్ఠికయందు లెక్కింపఁదగినవాఁడు. ప్రస్తుతములో నీ మహాకవి కావ్యపాత్రలకుఁ గల "ప్రకృతిసహజీవనము" ఎట్టిదో కనుఁ గొందము.

ఈశ్వరుఁడు తపస్సు చేసికొనుచుండఁగా నకాలమున మదన ప్రేరణముచే వసంతుఁడు వచ్చి స్థాణ్వాశ్రమములో విజృంభించును. ట్టి వసంతవిజృంభణమును వర్ణించుచు గాళిదాసు తన కుమార ంభవములో

లగ్నద్విరేఫాంజన భక్తి చిత్రం, ముఖే మధుశ్రీ స్తిలకం ప్రకాశ్య
రాగేణ బాలారుణ కోమలేన, చూతప్రవాళోష్ఠ మలంచకార"

(3 సర్గ 20 శ్లో)

వసంతశోభయనునదే యిట నొకలక్ష్మి (లలన)
శోభాప్రారంభ మనునదే యాశోభాలక్ష్మియొక్క ముఖము
శోభలో నొకభాగమైన తుమ్మెదలబారులే యాస్త్రీముఖము ౧.౨
దలి కాటుకరచనలు. తిలకమను పుష్పమే యామెకుఁ దిలకము.
పొట్టు) బాలసూర్యుని రక్తిమయే (ఆమెకు) లాక్షారాగము.
మామిడిచిగురే తదధరోష్ఠము. అనఁగా వసంతలక్ష్మి, తనముఖము
ను తుమ్మెదబారు లనెడు కాటుకధరించి, తిలకపుష్పమనెడు తిల

---

♦ పురాకవీనాం గణనాప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసః.

కమునదిద్దుకొని, బాలార్క-రాగ మనెడులాక్షారాగముతో మామిడి చిగు రనెడు తన యధరోష్ఠమును (వసంత శోభాలక్ష్మి) అలంకరించుకొనెను. చూచితిరా ! కాళిదాసకావ్యలక్ష్మి ప్రకృత్యలంకరణములతోఁ దన శరీరము నలంకరించుకొని సాక్షాల్లక్ష్మివలె కలకలలాడుచు నెంతగాఁ బ్రకాశించుచున్నదో! ఇట కాళిదాస కావ్యలక్ష్మికిఁ బ్రకృతిలక్ష్మితో నభేదము వర్ణితమైనది. దీనిచే మానవశరీరమునకుఁ బ్రకృత్యలంకరణమే సహజామృతాలంకరణ మనియుఁ బ్రకృతితో నైక్యముగ జీవించుటయె జీవితమునకు సహజానంద మనియు నిట ధ్వనించుచున్నది. ఇట్టి "ప్రకృతిసహజీవన" విధానమును కాళిదాసు తనకావ్యములలో సమయము దొరకినపుడెల్ల జాఱవిడువలేదు. వర్ణనములోను

పార్వతీకన్యక వాసంతపుష్పములతో నలంకృతయై యీశుని యిరవుఁ జేరుచున్న సందర్భములలో

అశోకనిర్భర్త్సితపద్మరాగ మాకృష్టహేమ ద్యుతికర్ణికారం
ముక్తాకలాపీకృతసింధువారం వసంతపుష్పాభరణం వహంతీ
(సర్గ 3 శ్లో 53)

నగరాజపుత్రి మణిమయ భూషణములకుఁ బదులు వసంతకాలిక పుష్పముల నలంకరించుకొన్నది. అట్టి పుష్పములలో గొన్ని అవియామెకుఁ బద్మరాగమణిమయాభరణముల కాంతులను మించియున్నవి. ఇట్లే యామె యలంకరించుకొన్న కొండగోగుపువ్వు లామెకు సువర్ణాభరణముల స్థానము నాక్రమించుకొన్నవి. ఇట్లే యామె సింగారించుకొన్న సింధువారపుష్పములు మౌక్తికాభరణములను బోలియున్నవి. ఇట్లామె యలంకరించుకొన్న యప్పటి యకాలవాసంతపుష్పాభరణములు, మణ్యాభరణములై చెన్నొందుచున్నవి. కాఁగా, ఆ పువుబోడి పువ్వులోఁ బూవై తావిలోఁ దావియై యిట్లామె, ప్రకృతిజీవిత

మును మేళవింపఁజేసి తన జీవితమును మధురమయము గావించిన ట్లిట మనకవి చూపినాఁడు.

ఇట్లే యీశ్వరసేవకై నగరాజపుత్రి వచ్చుచున్నప్పటి యొయ్యారములు

"ఆవర్జితా కించి దివ స్తనాభ్యాం, వాసోవసానా తరుణార్క-రాగం
పర్యాప్తపుష్ప స్తబకావనమ్రా, సంచారిణీ పల్లవినీ లతేవ" (3-54)

"లేతసూర్యుని రక్తిమవంటిరాగము కలచీరెను ధరించి నగజ స్తన భారముచే నీషన్నమితయై వచ్చుచున్నది. ఇట్లు వచ్చుచున్నయీ గిరిజాకన్యక యెట్లుండె ననఁ గావలసినన్ని వన్నెలతో వఱలుచున్న చాలినన్ని పూగుత్తుల బరువుతోఁ గొంచెమువంగి, చిగురుటాకుల సోయగములతో శోభాయమానమై, నడచివచ్చుచున్న లతాకుమారివలె నున్నది." ఇచ్చటి యుపమానబలముచే నగరాజపుత్రి ప్రకృతిశోభారూపిణియై శరీరముదాల్చి నడచివచ్చుచున్న సాక్షాత్ప్రకృతిలక్ష్మియో యన్నట్లుండలేదా ? "మానవజీవితము, ప్రకృతితోఁ గలిసిమెలసి ప్రకృతి ప్రేమభావముతో నున్ననాఁడే యట్టివారి జీవితము మధురమయమై మహితానంద నిలయమగును" అని మనమహాకవి యిట నిరుపమానమగు నుపమానబలముచే సూక్ష్మముగ సూచించుచున్నాడని భావించెదను. తరువాతి శ్లోకములలో సైతము ఈ గిరిజ ధరించిన వాసంత పుష్పములు ఈమె సహజసౌందర్యమును సందీపింపఁజేయఁగా నప్పటి యీమె సౌందర్యము రతిదేవికిఁగూడ సిగ్గును గల్గించుచున్నదఁట.* ఇదంతయు గిరిజాకన్యకయొక్క ప్రకృతిసహజీవన ప్రభావభాసితమేకదా !

తపశ్చరణములోనున్న పార్వతియంగములయందు విలాస

---

* చూ. సర్గ. 6. శ్లో 37 to 47; సర్గ 7. 8, 11, 13, 16, 26, 73; సర్గ. 8. 30 to 47, 74 మొ.

ములు కానరాకున్నవనియు నవి పీరుధము (లత) లందే వీక్షింపఁబడు చున్నవనియు భావించి మన మహాకవి

"గిరిజ తాను నియమములో నున్నంతవఱకుఁ దనకు విలాసగ్రహణము యుక్తము కాదని తపశ్చరణకాలములో నాయాంగిక విలాసములను జిన్నిలతలందును, విలాసవీక్షితము (చూపు)లను ఆఁడు లేళ్ళ దృష్టుల యందును దాచుకొన్నదివలె నుండెను." చూ. సర్గ 5 శ్లో 13) దీనిని బట్టి ప్రకృతిసహజీవనమే మానవజాతికి సహజసందీప్తము లైన చక్కని విలాసములను బ్రసాదించు నని ప్రస్ఫుట మగుచున్నది. మఱియు నీ దృశ్యమాన ప్రకృతియందు మన మహాకవికిఁగల పుత్రప్రేమను పార్వతీ ముఖమున నతఁ డిట్లు ప్రకటించినాఁడు.

"అతంద్రితా సా స్వయమేవ వృక్షకాన్
ఘటస్తనప్రస్రవణైర్వ్యవర్ధయత్।
గుహోఽపి యేషాం ప్రథమాప్త జన్మనాం న పుత్ర వాత్సల్య
మపాకరిష్యతి" - (5-14)

"గిరిరాజపుత్రి తన పాలిండ్లను బోలిన నీటికడవలతోఁ దత్తపోవనము లందలి చిన్నవృక్షములకు, బయస్సులను బోలిన పయములను(నీటిని) బోసి పుత్రప్రేమతో నా వృక్షములను దనచేతులారం బెంచెను.కను కనే కుమారస్వామి పుట్టిన పిమ్మటకూడ మొదట పుత్రప్రేమతోఁ బెంచిన యావృక్షములయెడ నామెకుఁ బుత్రప్రేమ పోలేదు" ఇట్లు స్థావరములయం దేకాక జంగమములయందును (వెళ్ళు మొ) ఈమె చూపిన వాత్సల్యభావ మపూర్వమైనది. (చూ. 5-15)

ఇట్లు చరాచర ప్రకృతియందు పార్వతికిఁగల 'సహజీవనము'మున్ముందు విశ్వప్రేమగా వికసించి పరిమళించును. మఱియు హిమవద్వర్ణనములో కాళిదాసుని ప్రకృతి వర్ణనాపాటవముకూడ మానవజీవితమునకుఁ బ్రకృతి సహకార మెంతయవసరమో చక్కఁగఁ దోఁచుచున్నది.

గిరిరాజు తనయింటిలో స్థావరములతోపాటు జంగమములకుఁ

గూడ స్థానమిచ్చినాఁడు. హిమవన్నగముపై సంచరించెడు చమరీ మృగములు తమ వింజామరలతో హిమవంతుని "గిరిరాజ" శబ్దమును సార్థకము చేయుచున్నవి." (చూ. సర్గ 1-10) పార్శ్వములలో వింజామర చాలనము రాజచిహ్నమే కదా! కనుకఁ బరస్పర సహకారభావముతో సముజ్జ్వలమైన "సహజీవన"ముభయతారకమై పరస్పర శ్రేయోదాయక మగుచుండునని యీవర్ణనము సూచించుచున్నది. ఇట్లే హిమనగముపైఁగల యోషధులు మున్నగు ప్రకృతివస్తుసమృద్ధియంతయు హిమవంతుని యైశ్వర్యమునకు నిదానమై వనిత "రాజత్వ"మును దీపింపఁ జేయుచున్నది. ఈ హిమవంతుని విశిష్టతను రాయబారులై వచ్చిన సప్తర్షులచే మన మహాకవి యిట్లుపలికించును. 'ఓ రాజా! పర్వత (శిలా) రూపములోనున్న నీస్వరూప కాఠిన్యమంతయు నీస్థావర(పర్వత) రూపములలో సమర్పితమైయున్నది. సత్పురుషారాధనమైన జంగమ (మానవ) రూపము మా యెదుట భక్తినమ్రమై నిలిచియున్నది. దీనిచే ప్రకృతిరూపములలో నైక్యమగుట సంపూర్ణజీవికకుఁ బ్రతీకమని తెలియుచున్నది.

ప్రకృతితో "సహజీవన" విధానమును దెలిపెడు పద్యములు కాళిదాసీయములు కొల్లలైకొమరు మిగులుచున్నవి.
వీనిలో మచ్చున కొక శ్లోకార్థము.

"పార్వతీ పాణిగ్రహణానంతరమున ఆమెతోఁ గూడియున్న యీశ్వరుఁడు శరత్కాల లక్షణములతోఁ గూడియున్న లోకము వలె నుండెను." కనుక శరత్కాల లక్షణములు లోకమునఁ గన్పట్ట వలెను. చూడుఁడు. గిరిజ యధికమైన ముఖచంద్ర కాంతికలది. శరత్కాలముకూడ నధిక నిర్మలమైన చంద్రికాంతి కల్గియుండును. ఇట్టి చంద్రికాంతి సంబంధముచే (భూలోకములోని) కలువలు చక్కఁగ వికసించును. గిరిజాముఖ చంద్రికాంతిచే నీశ్వరుని నేత్రముల నెడు

కల్వలు చక్కగ వికసించినవి. (సంతోషముచే) ఇక శరత్కాలములో జలములు బురద లేక నిర్మలములై యుండును. ఇట్లే యీశ్వరుని చిత్తము అనెడు జలములు గిరిజ అను శరత్కాలసంబంధముచే నిర్మలములై యున్నవి. కనుక శరత్కాలములో, లోకము తల్లక్షణలక్షితమైనట్లు గిరిజాశరత్సంబంధముచే నీశ్వరలోకము తల్లక్షణలక్షితమై యుండెను.B" (7-74) ఇట నిర్మల ప్రకృతికలశరత్కాలముతో సహజీవనము కల్గుటచేతనే యీవినూత్న దంపతులకుఁగూడ "నేత్రవికసన, చేతః ప్రసాదాదిసుమధుర శరత్కాల గుణములు కల్గి వారిజీవితము మాధుర్యమయమై మహానందనిలయమై పరిఢవిల్లినది. దీనికి సహజీవనమే మూలమనుట మఱవరానిది కదా ?

ఇఁక మేఘసందేశమును వీనులవిందుగావిందము. మధ్యేమార్గములో మేఘునకు రేవానదీజలసేవన మత్యావసరమని యక్షుఁడు మేఘునకుఁ దెలిపెడు సందర్భములో "తస్యాస్తిక్తై ర్వనగజమదై ర్వాసితం వాంతవృష్టి| ర్జంబూకుంజప్రతిహతరయం తోయ మాదాయగచ్ఛేః| అంతస్సారంఘన! తులయితుం నానిలశ్శక్ష్యతిత్వాం| రిక్తస్సర్వోభవతి హిలఘుః పూర్ణతాగౌరవాయ||" (మేఘసందేశము సర్గ 1 శ్లో 20) ఓ మేఘుఁడా! నీవు వర్షించినపిమ్మట తిరిగి నీవు గురుత్వము (బరువు) పొందుటకై దారిలోని రేవానదీజలములను త్రావుము. ఆ జలములు వన్యపుటేనుఁగుల మదజలములతోఁ గలియుటచేఁ గొంచెము వెగటు చెందియుండును. అట్టి తిక్తజలములను సేవించిన నిన్నిఁక నేవాతము కంపింపఁ జేయజాలదు. లోపల సారములేనివాఁడు చులకనైనవాఁడై లఘుత్వమును బొందును. కనుక పూర్ణత్వము గురుత్వమును గల్గిం

---

B "తయాప్రవృద్ధానన చంద్రకాంత్యా ప్రఫుల్లచక్షుః కుముదః కుమార్యా| ప్రసన్నచేతస్సలిలశ్శివోభూ | త్సంసృజ్య మానశ్శర దేవలోకః||" (చూ. కు. సం. స. 7. శ్లో 74)

చును" ఇట "ప్రకృతితో సహజీవనము మానవునకు ముఖ్యాతి ముఖ్యము"ను విషయము త్రిభంగులుగా జెప్పఁబడినది. చూడుఁడు.

ఒకటి : మేఘుఁడు వర్షించినపిమ్మట చులకనై గాలిదెబ్బకెగుర గొట్టఁబడును గాన ఇట్టిగాలిదెబ్బ లేకుండుటకై లోపటనీరుండవలెను.

రెండు : పుణ్యాజీవనుఁడు ప్రకృతిసిద్ధములైన పవిత్ర నదీజలములను సేవించి ప్రకృతిప్రియుఁడై ప్రకృతి సహజీవనభాగ్యముతో ధన్యజీవి యగుచుండును.

మూఁడు : వాంతి చేసికొన్నవాఁడు (వాంతవృష్టిః) వాంతి వెళ్ళినపిమ్మట తప్పకకషాయము సేవించవలెను. (తిక్తైర్వాసితంతోయమాదాయ) ఇట్లు వాంతవృష్టి తిక్తజలసేవనముచేయుటచే నిట్టివానిని అనిలః = వాతరోగము పీడింపదు. C (తులయితుం శ్యక్ష్యతి) స్వతః శరీరబలము లేనివాడు (రోగమునకు చులకనయగును.) అనఁగాఁ బింప శక్తిలేనివాఁడు సులభముగా రోగగ్రస్తుఁడగును." కనుక మానవునకుఁ బ్రకృతి సహజీవనము ఆరోగ్యభాగ్యప్రదమై వానికి సర్వాభ్యుదయ సంపాదకమగును. ఇదిలేనివాఁడు సులభముగ దుఃఖభాగియై యిహపరసుఖములకు దూరుఁడగును. ఈ శ్లోకార్థము మన మహాకవి ప్రకృతి సహజీవన ప్రియత్వమును ముమ్మాఱు త్రివిధములఁ జాటుటలేదా ? ఇఁకఁ "ప్రకృతితోఁగలిసి మెలఁగినవానికి ఐహికభోగానుభవము మనః ప్రమోదము నిత్యసన్నిహితము" అనువిషయమును సూచించుచు మన మహాకవి యక్షునిముఖమున ని ట్లనిపించును.

"నీచైరాఖ్యం గిరి మధివసేస్తత్ర విశ్రామ హేతోః।
త్వత్సంపర్కాత్పులకితమివ ప్రౌఢపుష్పైః కదంబైః

C ఇందుకు బాహటుడు తన వైద్య గ్రంథములో "...లఘుతిక్తైః కషాయావా యోనిసర్గాత్కఫాపహైః। కృతశుద్ధేః క్రమాత్పీత పేయాదేః పథ్యభోజినః। వాతాదిభిర్న బాధాస్యాదింద్రియైరివయోగినః॥ ఇంద్రియ నిగ్రహముచే యోగులకు ఇంద్రియ బాధలేనట్లు పథ్యముగానున్న వానికి వాతరోగాదిబాధ కలుగదు.

యః పణ్యస్త్రీరతి పరిమళోద్గారిభిర్నాగరాణాం ।
ఉద్దామాని ప్రథయతి శిలావేశ్మభిర్యౌవనాని ॥"
మేఘసందేశము సర్గ. 1 శ్లో 26)

ఓ మేఘుఁడా! నీవు మార్గాయాసమును నివారించుకొనుటకు మార్గములో 'నీచైః' అను గిరిని అధిష్ఠింపుము. ఆ గిరి నీ సంపర్కవిశేషము చేత (పులకాంకురములు కలదయ్యెనా ? అనునట్లు వికసించిన చక్కని కదంబపుష్పములు కల్గియుండును. అప్పర్వతపు చఱియల యందు ప్రౌఢనిర్భర యౌవనపరిపాకప్రాభవముగల భోగస్త్రీలు తమ (కనుకూలురైన) ప్రియులతోఁగూడి - సుఖములఁ దేలిమునుఁగుచుండగా వారువసించిన శిలాగృహములు తద్రతిపరిమళములచే వాసితములై యచ్చటి నాగరకులయొక్క యుద్దామమగు యౌవనప్రభావములను వ్యక్తముసేయుచుండును. అట్టి శిలాగృహములతో నొప్పుచున్న నీచైః పర్వతము నో మేఘుఁడా! సేవించివెడలుము"ఇట యువతులకు జీవితపరమార్థ మిదియ యనిపించెడు భోగభాగ్యమునకు భాజనమై ప్రకృతిదృశ్య ప్రకాశితమైన యీపర్వతముయొక్క సేవనము (ఈ ప్రకృతిసహజీవనము) లేనివానికి ఇట్టి భాగ్యములను జూచుభాగ్యమబ్బునా? ఇట్టి పర్వతములపై సంచరణభాగ్యము (సహజీవనము) లేని యువతీయువకుల కట్టి యథేచ్ఛ భోగానుభవప్రాప్తి యెట్లు చేకూరఁగలదు? ఇట్టి యైహికభోగానుభవభాగ్యముఁ బడయఁగోరువారు ప్రకృతిదృశ్యభాజనములైన యిట్టి పర్వతప్రాంత దేశములను, సరిత్తటసైకత భూములను, ఉపవనభూములను విహారయాత్ర మిషచే సేవించుచుందురుకదా! కాఁగా మానుషానందప్రాప్తికి, మాధుర్యమయ జీవితయాత్రాసిద్ధికి నిట్టి ప్రకృతిసహజీవన విధానము పరమ సాధనమగుచుండునను విషయముపై గిరివర్ణనముచే సూచింపఁబడుట లేదా ?

ఇట్టిదే మఱియొక సన్నివేశము అలకాపట్టణవర్ణనా సందర్భమున మన మహాకవి

"అక్షయ్యాంతర్భవననిధయః ప్రత్యహం రక్తకంఠై
రుద్గాయద్భిర్ధనపతియశః కిన్నరైర్యత్రసార్థం।
వైభ్రాజాఖ్యం విబుధవనితావారముఖ్యాసహాయా
బద్ధాలాపా బహిరుపవనం కామినో నిర్విశంతి (2-10)

"తమయిండ్లలో నిధులు కల్గియున్న యలకాపట్టణస్థకాముక జనము అప్సరస్త్రీలనెడు వారస్త్రీలతో సరససల్లాపములు సేయుచుందురు. మఱియు కమ్మని (sweetest) కంఠమాధుర్యములతో కుబేరకీర్తిని కీర్తించెడు కిన్నరస్త్రీలతోఁ గూడి (యా కాముకులు) వైభ్రాజము+ అనెడు నుద్యానవనములో సుఖభోగము లనుభవించుచుందురు."

ఇట కామిజనమునకు కిన్నరస్త్రీలతోడి భోగానుభవప్రాప్తికి తదానందానుభవసిద్ధికి ఆటపట్టయిన దీయుద్యానవనస్థప్రకృతియేకదా! ఇట్టి ప్రకృతితో కామిజనమునకు సహజీవనము లేనినాఁడు వారికిఁ కిన్నరస్త్రీలతోఁ బ్రాప్తించిన ఆనందము కళావిహీనమై యుండెడిది కదా! ఇట్లే మిగిలిన కాళిదాసీయములు మల్లికాపుష్పములవలె నెచ్చటఁబట్టి చూచిన నచ్చటే ప్రకృతి సహజీవన

రూప సౌరభములను వెదజల్లుచు, మహితభావ

మకరందములతో బాఠకులకామెత (విందు)లొసంగుచుండును.

ఇఁక రఘువంశకావ్యోద్యానమును దర్శించుదము. దిలీపమహారాజు భార్యాసమేతుఁడై కులగురువగు వసిష్ఠుని యాశ్రమమునకుఁ బోవుచు వనములో

---

+ వైభ్రాజము అనెడు నేనుఁగు చేరక్షితమైన దగుటచే నీ యుద్యానమున కీ పేరు సార్థకము. (చూ. శంభురహస్యమ్.

"సరసీ ష్వరవిందానాం వీచి విక్షోభశీతలం। ఆమోదముప జిఘ్రంతౌ స్వనిశ్వాసానుకారిణం॥ (చూ. రఘు. సర్గ । శ్లో 43)

"దిలీపదంపతులు వనములోని సరస్సులయందలి పద్మపరిమళములను, వీచికాసంపర్కముచే జల్లనై యున్న వానిని, దమ నిట్టూర్పు వాయువుల ననుకరించుచున్న వానిని బీల్చుకొనుచు బయనించుచున్నారు". ఇట నీదంపతుల ప్రకృతి సహజీవనము, సర్వభూతముల యందును ఆత్మావలోకన భాగ్యము అనునివి వీరిజీవితములకు దివ్యత్వమొసంగఁ జాలినవి.

"హైయంగవీనమాదాయ ఘోషవృద్ధా నుపస్థితాన్।
నామధేయానిపృచ్ఛంతౌ వన్యానాం మార్గశాఖినాం॥"(1-45)

ఈ దిలీపదంపతులు అప్పుడే వెన్నకాచిన ఘృతమును అమ్మఁ దెచ్చుచున్న ముసలిగొల్లలను దమమార్గములో నున్న వృక్షముల నామధేయములను ఆప్యాయముగ నడిగి తెలిసికొనుచుఁ బయనించుచున్నారు." ఇచ్చట స్థావర జంగమరూప ప్రకృతితో నీ సార్వభౌముని సహజీవన విధాన మత్రుత పూర్వమై సర్వభూతమయుఁడైన విష్ణువు యొక్క యంశ సంజాతత్వమును బ్రకటించుచున్నది. ఇప్పటి శుష్కహృదయులకు ఈ పాటి చెట్ల యోగక్షేమపృచ్ఛ మూర్ఖ పరిపాకమై నట్లనిపించుఁగాక.

ప్రపంచ గత వస్తువులన్నిటిలోఁ బరమేశ్వర కళను బ్రత్యక్షీకరించుకొనఁ జాలిన దిలీపమహారాజువంటి కరుణామూర్తులకు, జీవకోటితో సమసుఖదుఃఖభాగులైన యిట్టి పురుషోత్తములకు, ఇట్టి జీవన్ముక్తులకు జీవకోటియొక్క యోగక్షేమ పృచ్ఛ నిసర్గసిద్ధమేకదా! ఇట దిలీపుఁడు వృక్షములలోఁ బరమేశ్వర కళను జూడఁ గల్గిన మహనీయుఁడు కనుకనే తన మార్గములోని చెట్లలోఁ గూడ దత్కళను జూచి వాని యోగక్షేమ మారయఁగల్గెఁ బ్రేమామృతము నొలికింపఁ

గల్గినాఁడు. ఇట్టి ప్రకృతి ప్రణయత్వమే యీ మహారాజు సంతానమైన రఘుమహారాజులోఁ గూడ ప్రతిఫలించి పాదుకొన్నది. పరికింపుఁడు గురుదక్షిణార్థియై తన సన్నిధికి వచ్చిన వరతంతు శిష్యుని రఘుమహారాజు కుశలప్రశ్న వేయు సందర్భమున మన మహాకవి

"ఆధారబంధప్రముఖైః ప్రయత్నైస్సంవర్ధి
తానాంసుతనిర్విశేషం కచ్చిన్నవాయ్వాదిరుపప్లవో వశ్రమచ్ఛిదా
మాశ్రమపాదపానాం॥ (సర్గ 5. శ్లో 6)

ఓ కౌత్సమహర్షీ! మీ తపోవనములోని వృక్షములకు సుడిగాలి మున్నగు వాని వలన నుపద్రవములు కల్గుట లేదు కదా! మీరా వృక్షములకుఁ గుదుళ్ళుంగో నీరు పోయుట మొదలగు ప్రయత్నములతో వానిని బుత్రులవలెఁ బెంచితిరి. అవి సంతతము మీ శ్రమను బాపుచుండునవి. "అట్టి మీ యాశ్రమ వృక్షములు కుశలమే కదా!" ఇట రఘుమహారాజునకు వనపాదపముల యెడఁ గల నిస్స్వార్థ ప్రేమ యతనిలోఁ గల "వసుధైవకుటుంబక' మ్మను విశ్వప్రేమను నిదర్శనమై ప్రకృతితో మానవజీవితమున కుండవలసిన "సహజీవన" సిద్ధాంతమును సిద్ధాంతీకరించుచున్నది.

ఇఁక కాళిదాసు శాకుంతల నాటకములోని సహజీవనమును సమీక్షించుదము. దుష్యంతుఁడు కణ్వాశ్రమములోఁ ప్రవేశించునపుడు శకుంతల చెలికత్తెలు వినోదసంభాషణము సేయుచున్న సందర్భము. చెలి శకుంతలతో 1 సఖి! శకుంతలే! త్వత్తోపి తాత కాశ్యపస్య ఆశ్రమ వృక్షః ప్రియతర ఇతితర్కయామి యన్నవమాలికా పేశలాత్వమప్యేతేషామాలవాల సేచనే నియుక్తా"

---

చెలి- 1 ఓ శకుంతలా! తండ్రియైన కాశ్యపునకు (కణ్వుడు) ఈ యాశ్రమ వృక్షము నీ కన్న నెక్కుడు ప్రియమైనదని తలంచెదను. ఎందుకనియా? నవమాలికా పుష్ప సుకుమార స్పృశ సుకుమారగాత్రివైన నిన్ను కూడ (తాత) ఈ వృక్షసేచనము అను కఠినకార్యమందు నియోగించినాఁడు.

శకుంతలా—"సఖి! న కేవలం తాతనియోగః అస్తి మమాపి ఖలు సోదరస్నేహాపదేషు"

ఈ భావి భరతమాత యొక్క భావములో నిట్టి సహజ ప్రకృతి ప్రేమ బాల్యముననే పాదుకొని విశ్వప్రేమగాఁ బరిణమించినది.

సఖి శకుంతలే! ...త్వయాకృత నామధేయా వనజ్యోత్స్నేతి
ఏనాం విస్మృతాసి? శకుంతలా తథాయది ఆత్మాన
మపి విస్మరిష్యామి. మన భరతమాత యొక్క యీ ప్రకృతి
ప్రేమను కణ్వర్షి ముఖమున మనకాళిదాసర్షి యిట్లు పలికించును
"పాతుంనప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషుయా
నాథత్తేప్రియమండనాపి భవతాం స్నేహేనయాపల్లవం!
ఆద్యే వః కుసుమప్రసూతి సమయే యస్యాభవ త్యుత్సవః
సేయం యాతిశకుంతలా పతిగృహం సర్వైరనుజ్ఞాయతాం"
శకుంతలను (అంకము 4 శ్లో 9)

అత్తవారింటికిఁ బంపుచు కణ్వుఁడు శకుంతలకు సెలవొసంగుఁడని ఆశ్రమ వృక్షములతో నిట్లనుచున్నాఁడు. తపోవనమున శకుంతలకు బంధువులైన యాశ్రమ వృక్షములారా! మీకు ముందుగా జలముల నియ్యనిదే ఏ శకుంతల తాను ముందుగా జలములను ద్రావఁదలఁపదో పువ్వులన్న మురిసిపోవునే శకుంతల మీ యందుగల మైత్రిచే మీ చిగురుటాకు నైనఁ దుంపలేదో, మీకు పువ్వు పుట్టఁగనే ఏ శకుంతల ఉత్సవము జరిపినదో అట్టి మీ యాప్తబంధువు ఆ శకుంతల నేఁడత్త వారింటికి వెళ్ళుచున్నది. మీ రామెకు సెలవొసంగుఁడు."

కాళిదాసుని ధర్మమూయని యీ భరతమాత యొక్క విశ్వ ప్రేమ" విశ్వవ్యాప్తమై విరాజిల్లినది. ఇట్టి ప్రేమకు మూలము ఈమె యొక్క "ప్రకృతి జీవన" మేయని ప్రస్ఫుటమైనది కదా! మన భారతమాత (శకుంతల) పుత్రులలో శ్రీ పిఠాపురము రాజావారివంటి ధన్యాత్ములైన వారియందే తల్లి గుణము భాసించుచుండును.

ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి, ముంగండ.

# శ్రీ పీఠికాపురమహారాజ దానవిభవాభివర్ణన

---

ఆశ్రిత బాంధవాప్తాళికిఁ దొమ్మిది
లక్షల రూప్యము లరయ నొసఁగె
కాకినాడను గల కాలేజి కయి రెండు
లక్షలరూప్యము ల్దగ నొసంగె
శిబికర్ణ ముఖుల మించి యనాథశరణాల
యము నిల్ప లక్షద్వయంబు నొసఁగె
అచ్చోటఁ దదుపయోగార్థమై మఱికొన్ని
భవనాళి కఱ లక్ష వ్యయ మొనర్చె
అతులితైరోపామహాయుద్ధనిధివిరా
ళముగ నిశ్చింతమై లక్ష యిచ్చె
శుద్ధరాణ్మందిరహితకారిణీపాఠ
శాలకు నేఁబదివే లొసంగె
ఆపగిదిని బీఠికాపురపాఠశా
లకుఁ గూడ నొక యఱ లక్ష యిచ్చె
అతిమాత్రదుర్భరవ్యాధినిర్మూలశో
ధనకు నేఁబదివేల ధన మొసంగె
కలకత్తఁగల సిటీకాలేజి పోషణ
కొఱకు ముప్పదివేలు గుప్పవోసె
తగఁ గాకినాడన్న దానసమాజంబు
వెలయింప ముప్పదివే లొసంగె
యుద్ధమాశజీ నుపయోగించు మోటార్ల
కొఱకు ముప్పదివేలు గూడ నొసఁగె

ప్రవిమలాస్తికమతబ్రహ్మమందిరమున
కిరువదియైదువే లిచ్చి నిలిపె
దేవులపల్లిసుధీవర ఋణముక్తి
కై యిరువదియొకవేయి యిచ్చె
సౌతాఫ్రికాను గష్టములందు భారతీ
యులకుఁ బదేనువే లొసఁగి ప్రోచె
కాకినాడఁ బ్రసూతికాంతావసర వైద్య
శాలకుఁ బండ్రెండు వే లొసంగె
శ్రీ పీఠికాపుర స్త్రీ వైద్యశాలకుఁ
బదివేలవఱకు రూప్యంబు లిడియె
ఇద్దాని పోషణ కేటేటఁ బదివేల
కెక్కుడు ధన మీయ నేర్పరించె
ఐరోపసంగ్రామమందు బాధితహైంద
వాళిపై దయఁ బదివేలు పంపె
స్వర్గీయ యెడ్వర్డు స్మారకచిహ్నాళి
కయి పదివేలరూప్యంబు లిచ్చె
స్వపురిని శ్రీ జార్జిపట్టాభిషేకస
త్రార్థంబు పదివేలు వ్యయ మొనర్చె
ప్రథితాంధ్రసాహిత్య పరిషత్తుఁ బోషింపఁ
బదివేలరూప్యముల్ పరగ నిచ్చె
రామాయణంబును వ్రాసిన యల వాసు
దాసున కైదువేల్ దగ నొసంగె
స్తుతగుణశాలి శ్రీ సోమనాథకవికి
రెండు లేనూర్లు సంప్రీతి నొసఁగె

విద్వద్గరిష్ఠుండు వేంకటరాయశా
స్త్రికి రెండువేలయాచితముగ నిడె
నగరమా పునహా నున్న వితంతుశరణాల
యమునకు నొక్క సహస్ర మొసఁగె
కాకినాడపురిని గల బాలికాపాఠ
శాలకు నొక సహస్రంబు నిడియె
సదయత మద్రాసు జంతుబాధానివా
రకసంస్థకును సహస్రంబు నిచ్చె
రహిఁ గవిరత్న వీరబ్రహ్మకవి కొక
వేయి నూటపదార్లు పేర్మి నొసఁగె
ఇంక గుప్తదానము లవి యెన్నియోని
గలవు వానిని వర్ణింపఁగలమె ? కీర్తి
కాయుఁడైనట్టి శ్రీ పీఠికాపురీశుఁ
డలరఁగలఁడు స్వర్లోకమం దనవరతము.

సహస్రావధాని, శ్రీరామ్ వీరబ్రహ్మకవి.

# సజీవపాత్ర చిత్రణము-పింగళిసూరన

సజీవపాత్ర నిర్మాణము నందుఁ బ్రబంధకవులలో నగ్రగణ్యుఁడు పింగళి సూరనార్యుఁడు. పాత్రల చిత్తవృత్తులను బ్రదర్శించుటలో నీతఁడు తిక్కనకు సాటి యనఁదగినవాఁడు.

పాత్ర రచనావిధానమును బరోక్షమనియుఁ బ్రత్యక్షమనియు రెండువిధములుగా విభజింపవచ్చును. ఇందుఁ బరోక్షపద్ధతిని నాటక కర్తలుఁ బ్రత్యక్షపద్ధతి నాఖ్యానకవులు ననుసరింతురు. పరోక్షపద్ధతి యనఁగాఁ బాత్రల మనోభావములను పాత్రలముఖముననే పలికించుట. ప్రత్యక్షపద్ధతి యనఁగాఁ గవి తనంతటఁ దానే పాత్రలనుగూర్చియు వాని యింగితాకారచేష్టాదులఁ గూర్చియుఁ బలుకుట. సూరనార్యుఁడు నాటకముల వ్రాయకున్నను బాత్రనిర్మాణమునందు మాత్రము నాటక కవిగానే పేర్కొనఁదగినవాఁడు. అందును మనోధర్మవేత్తృత లేనివారికిఁ బ్రగాఢములు దురూహములు నగు నాతని పాత్రల చిత్తవృత్తు లగమ్యములుగా నుండును. ఇందులకు నిదర్శనముగా నీక్రింది యుదాహరణములఁ జూడఁదగును.

"మణికంధరుని వలచినట్లు కనఁబడిన కలభాషిణి నలకూబరుని పొం దాసించుటకుఁగల హేతువద్దియో నిరూపింపవలయు నన్నచోఁ బ్రణయప్రపంచమునఁ గల యొకధర్మరహస్యమును గుర్తెఱుంగ వలయును. కామ్యవస్తువు దుర్లభమైనప్పుడు తదాభాసమేనియుఁ గొంత వఱకు నాత్మను దనుపు ననునది ప్రణయ ప్రకృతిధర్మము. ఈధర్మము తెలియనప్పుడు కలభాషిణీచరిత్రము దూష్యముగనే కన్పట్టును. ఆ పాటి మనసు చలించుటయు ధర్మశాస్త్రానుసారముగ వ్యభిచారమే యయ్యు నది ప్రకృతిసిద్ధమగుటచేఁ బరిహరింపరాని యొక హృదయ ధర్మముగ గణనీయమైనది. ఎట్టిధైర్యము కలవారికైన నొకానొక యవస్థలో హృదయదౌర్బల్యము తటస్థించుటయు, దాని ప్రభావమున నారు కీలుబొమ్మలవలె వర్తించి తుదకు వివేకము కలిగి నిర్వేదము

నొందుటయుఁ గావ్యప్రపంచముననే కాక లౌకికప్రపంచమునను గలదు. కలభాషిణిలో నీ ఘాయాభిలాషయు హృదయదౌర్బల్యము నేకమై యామూర్తిని లోకులకు మరవగాహము చేసినవి. సుగాత్రి శాలీనుల స్వభావముల గుర్తెఱుంగవలయునన్న సహజసౌందర్యము నకును నిరాడంబరచిత్తవృత్తికిని బింబప్రతిబింబభావము కలదనెడి ధర్మమును ముందు గ్రహింపవలయును. ఈ ప్రణయమూత్రమే యీ కథకు మూలము."

చూడఁజూడ నీయన స్త్రీపాత్రములు పురుషపాత్రముల కంటె మేలైరములని గోచరించును. ఇట్లనుటచే నా పురుషుల రేఖలుగాని రంగులుగాని చెడినవని తలంపరాదు. ఈయన స్త్రీ పాత్రిలలో షేక్స్పియరు సృజించిన స్త్రీ పాత్రలవలెనే ప్రేమ మూర్తులు కొన్నియు ప్రజ్ఞామూర్తులు కొన్నియు కలవు. కలభాషిణి సుగాత్రి మున్నగు వారు ప్రేమమూర్తులు. శుచిముఖి, రాగవల్లరి మున్నగువారు ప్రజ్ఞా మూర్తులు.

ప్రతియోగ సంఘటనముచేఁ (By creating the contrast) బాత్రల స్వభావమును గాని, రూపమును గాని ప్రతిభాసింపఁ జేయుట శిల్పధర్మములలో నుత్తమమైన ధర్మము. ఈ రెండు కావ్యములలో (క ళా. పూ. ప్ర. ప్ర.) నీ ప్రతియోగ సన్నివేశము పెక్కుచోట్ల శోభ నాపాదించుచున్నది. కలభాషిణికి రంభకు, మణికంధరునకునల కూబరునకు, నారదునకుఁ దుంబురునకుఁ, శుచిముఖికి రాగవల్లరికి, నీ ప్రతియోగసంఘటనము కల్పింపఁబడినది. రూపచిత్రణమునందును నీ ధర్మముల నాయన మఱువలేదు. వృద్ధురాలగు సుముఖాసత్తి రూప మొకపద్యమునను బునర్యౌవన ప్రాప్తయైన యామెరూప మింకొక పద్యమునను శయ్యాగృహమునం దలంకృతమైన సుగాత్రిరూప మొకపద్యమునను, నిరలంకృతయై పూఁదోటలోఁ బనులుచేయు నామె

రూప మింకొక పద్యమునను, మణిస్తంభునిచేఁ జిక్కి చకితయైయున్న కలభాషిణి రూప మొకపద్యమునను, నాతని చేయి జారి పడినప్పటి యామెరూప మింకొక పద్యమునను వర్ణించి, యవస్థాభేదములను బట్టి యాయారూపములు చెందు మార్పులను సూరనార్యుఁడు సూచించినాఁడు.

ఇంతవఱకు నిమ్మహాకవి పాత్రరచనా విధానమునందలి మూల సూత్రములను బరిశీలించియున్నాము. ఇఁక నొక్కొక్క పాత్రను దీసికొని యా పాత్రను జిత్రించుటలోఁ గవి చూపిన ప్రజ్ఞాకౌశలమును బరిశీలింతము.

సూరనార్యుని పాత్ర రచనా నైపుణికి నికషోపలము వంటిది కళాపూర్ణోదయము. ఏతత్కథా విధానము నం దంతటను తేజస్వినియై యొప్పుచున్నది కలభాషిణి. కవియు నీ పాత్ర నిర్మాణమునందే తన యావచ్ఛక్తిని వినియోగించియున్నట్లు గ్రంథము నామూలాగ్రముగాఁ బఠించిన వారికిఁ దోపకపోదు. కళాపూర్ణుఁడును తేజస్వియే యయ్యు నాయన తేజము మానవదుర్నిరీక్ష్యమై యున్నది. ఆతఁడు దివ్యుఁడా మానవుఁడా యను సందియ ముదయించు నంతటి మాహాత్మ్య మాతని యందుఁ జూపట్టును. కలభాషిణియందు మానవసహజములే కాక స్త్రీజనోచితములును నగు గుణగణము లన్నియును గలవు.

తొలిజన్మమునఁ గలభాషిణి బ్రహ్మలోకమునందలి పెంపుడు చిలుక. సరస్వతీశాపవశమున నది భూలోకమునఁ బుట్టవలసి వచ్చెను. అంతట ద్వారకానగరమున నొక వేశ్యాగృహమునఁ గలభాషిణి యను పేర నా చిలుక జనించెను.

కలభాషిణి నృత్తగీతాదులయం దసమాన పాండిత్యమును గణించెను. యౌవన సౌందర్యముల కాటపట్టయిన యామె యవ్వీటి విటజనుల హృదయములఁ గలంచుచుండెను. శ్రీకృష్ణుని కొలువు

కూటము గూడ నామెకుఁ జిరపరిచితమైయే యుండెను. శ్రీకృష్ణుని యనుగ్రహమున జాంబవతీలలామ కలభాషిణిని వీణావాదన ప్రౌఢను గావించెను. యువతియు సౌందర్యవతియునే కాక యీమె నిరుపమాన బుద్ధిమతియు నై యుండెను. ఆమె యేక సంథాగ్రాహి. మణికంధరునిచే నొక్కమారే చదువఁబడిన దండకము నామె నారదుని యొద్ద నప్ప గించి తన యనుపమానమగు జ్ఞాపకశక్తికి నిలింపమౌనియు నివ్వెఱఁ నందునట్లు కావించెను. మేధాసంపదకుఁ దోడునీడయైన వాక్చాతు ర్యము నామెకుఁ గలదు. ద్వారవతిలోని యుద్యానవనములో రంభా నలకూబరులను గూర్చి యీమె నారదుని బ్రశ్నించునప్పుడే యీమె వాక్చమత్కృతి మనకు సువ్యక్తమగును. కలహాభోజనుఁ డామె నల కూబరుని గాంక్షించుచున్నదనియును రంభకుఁ బ్రతిద్వంద్విగా నిలువఁ దగిన గుణగణము లీమెయందుఁ గల వనియును నెఱింగియే రంభాగర్వ భంగమును మనసులో నిడికొని కలభాషిణికిఁ గామరూపసిద్ధి నొసంగి నాఁడు.

కలభాషిణి మనోరథ సిద్ధికిఁ గొంత మార్గము గోచరించినది. ఇంతలోనే యీమె కాపాలికుని (మణిస్తంభుని) మాయావాగురులలోఁ దగుల్కొనినది. కాని మృగేంద్రవాహనాప్రభావమున విగతజీవ కా లేదు. ఇంతటి విషమపరిస్థితులయందుఁ గూడ నామె నలకూబరుని గామించుచునే యున్నది. మాయానలకూబరుని జూచి నలకూబరుఁ డను భ్రాంతిచే నారదవరప్రభావమున రంభారూపధారిణియై యాతని గూడినది. కాని యంతమున నామెఁ గూడినవాఁడు నలకూబ రుఁడు కాక, యీమెవలెనే మాయరూపమును ధరించిన మణికంధరుఁ డై నాఁడు. అప్పుడామె పడిన పశ్చాత్తాపమునకు మేర లేదు. కాని యీ పశ్చాత్తాప మెందులకు? ఒక వంక మణికంధరునియందు వలపు నిలిపియు నింకొకవంక నలకూబరుని గామించు నామెహృదయ

నామెకే దురవగాహమైనది. తన్నుఁ గూడినవాఁడు తన చిన్ననాఁటి నేస్తకాఁడగు మణికంధరుఁడే యని తెలిసినప్పు డామెయానందము మిన్నుముట్టినది. కాని యేమి ప్రయోజనము? వలపు ఫలింపనున్న తఱి నిరువురును దుర్వారశాపోపహతులైరి. అప్పటి కలభాషిణీ హృదయావేదనము నూహింపవలయునే కాని మాటలలోఁ జిత్రింప నలవికానిది. కవి దాని నీక్రింది రీతిని బొందుపఱచియున్నాఁడు.

"శ్రీయుతమైన దివ్యమణి చేతికి నబ్బఁగఁ బారవైచి త
చ్ఛాయ యొకింత యున్కిఁ గని చాలఁ గ్రహించితి గాజుపూసకై
నా యవివేక మేమనుకొనం? దుద తన్మణి యబ్బెనన్న న
త్యాయతతత్సమాగమసుఖాప్తికి నోఁచమి నెంచి కుందెదన్"

"ఇట్టి మాట లిప్పు డే నాడుకొనుటయు
ననుచితంబు "వారవనిత పలుకు
లిచ్చకంబు" లనక యెవ్వరు నమ్మద
రదియుఁ గాక దృష్ట మన్య వాంఛ"

మణికంధరుని యనులాపవాక్యములు కూడ నామె దుఃఖోపశమనమును గలిగింపలేక పోయినవి ఆమె మనసు మాఱిపోయినది. యౌవనసుఖాసక్తియుఁ దదన్వేషణానురక్తియు నంతరించినవి. దైవోపహతయు, దుఃఖోపహతయు నగు నామెయందిట్టి మనఃపరివర్తనము కలుగుట సహజమే. వనితాలోకమునకుఁ బాతివ్రత్యము కంటె పరమంబైన సిద్ధి వేఱొండు లేదని యామె కప్పుడు తోఁచినది. ఈ హృదయపరివర్తనముతోడనే సుముఖాసత్తి నుద్దేశించి యామె యిట్లు పలికినది.

"పూతంబయ్యె మదీయ పుణ్యయుగ మోపుణ్యంపుటిల్లాల నీ
పాతివ్రత్యముచందమున్ విన మదిన్ భావింపఁగా నెట్టి దు
ర్నీతి ప్రక్రియ వారికైనఁ గృపతో నీ విచ్చినం గల్గుఁ ద
త్పాతివ్రత్యము నాకు మీఁద నయినం బ్రాపింప దీవింపవే"

ఆసన్న మరణయైయున్న యామె తుదికోర్కె యిది. మరణావసరమున నిట్టి పవిత్రమనోరథముఁ గల్గియున్నవారు జన్మాంతరమున జగదీశుని కృపకుఁ బాత్రు లగుటలో నబ్బుర మేమి కలదు.

మణికంధరుఁడొక గంధర్వుఁడు, నారద శిష్యుఁడు. కలభాషిణిని గాంచినంతనే యాతఁడు చెప్పిన పద్యమును బట్టియు శ్రీకృష్ణునిపై నాతఁడు చెప్పిన దండకముఁ బట్టియుఁ దీర్థయాత్రావసరమున నాతఁడు చేసిన విష్ణుస్తోత్రమును బట్టియు నాతఁడొక కవి యనియు మన మూహింప వచ్చును. పరస్పరద్వేషమును మాని సంగీత సాహిత్యము లీతనియందుఁ జక్కఁగా నెలకొనియున్నవి. ఈతనికిఁ గల యీ సంగీతసాహిత్య విద్యాప్రావీణ్యమును నతని యపూర్వసౌందర్యమును గలభాషిణి కతనియందుఁ గల ప్రేమకుఁ గారణము లైనవి. ఈతఁడును నృత్తగీతాదులయందును రూపలావణ్యములయందును నిరుపమానమైయున్న కలభాషిణిని కామించినాఁడు. స్వర్లోకమునుండి భూలోకమునకు దిగివచ్చుచు నీతఁ డుద్యానవనమునఁ 'దమి పూఁదీఁగెలఁ దూగుటుయ్యాలల' నూగుచున్న కలభాషిణిని గాంచి యామె సౌందర్యమును బ్రస్తుతించినప్పుడే, తనకుఁ దెలియకుండఁగనే యామెను బ్రేమించినాఁ డనవచ్చును. కాని యిరువురును మునిశాపభయమునఁ బ్రణయ ప్రసంగములఁ జేయరైరి.

మణికంధరుఁడు దివ్యక్షేత్రసందర్శనాభిలాషతో ద్వారవతి వీడినాఁడు. నానాక్షేత్రముల సందర్శించినాఁడు. ఘోరతపము గావించియుఁ దపస్సిద్ధిని గాంచలేక పోయినాఁడు. దేవవేశ్యాభుజంగుఁడైనాఁడు. రంభయందలి మోహమును వీడలేక తపోవ్యయమునైనఁ బాటింపక మాయానలకూబరుఁడై మాయారంభను గూడినాఁడు. తుదకు నిజనలకూబరునిచే శపింపఁబడి పశ్చాత్తప్తుఁడై మృగేంద్రవాహానాలయమునఁ గలభాషిణిని మఱలఁ గలసికొనినాఁడు. కాని

తాను వలచిన సుందరిని దనచేతితోనే చంపవలసిన యవస్థ తటస్థమైనది. అన్యమార్గము గోచరింపమి నాతఁడా క్రూరకార్యమున కొడంబడినాఁడు. అనంతరము శల్యాసురుని సంహరించి యాతని వర ప్రభావమునఁ దానును మడిసి, కళాపూర్ణుఁడై జన్మించినాఁడు.

మణిస్తంభుని ప్రకృతి చాల విచిత్రమైనది. ఈతని జీవితమును ద్విధా విభజింపవచ్చును. ఒకటి శాలీననామమున వ్యవహరింపఁబడిన జీవితము. రెండవది మణిస్తంభనామమున వ్యవహరింపబడిన జీవితము. ఈతని జీవితమునందలి కొన్ని ఘట్టములను గమనించినచో నీతఁడొక మహాకాముకుని యట్లు గోచరించును. కొన్నికొన్ని యంశములను బరిశీలించినఁ బరమశాక్తేయుని యట్లు గోచరించును. శాలీననామమున నున్నప్పు డాతఁడు తన భార్యకు సంతాననిరోధము కలుగునట్లుగను నిత్యయౌవనయై యుండునట్లుగను ననుగ్రహింప భాషాయోషను బ్రార్థించినాఁడు. ఆమెకు దేవి యొసఁగిన వరము తన యభిప్రాయమునకు వ్యతిరేకముగ నుండుటచే నతఁడు హఠాత్తుగా శతతాళదఘ్నమగు మడుగులోనికి దూకి యాత్మహత్యాప్రయత్నమునకుఁ గూడ వెనుదీయలేదు. ఆర్యమతానుసార మాత్మహత్య మహాపాతకము. ఆర్యులు గార్హస్థ్యమునకు సంతానమునే మహాఫలముగాఁ జెప్పియున్నారు. శాలీనుఁడు రెండు ధర్మములను గూడ మనసునం దిడుకొనినట్లు కన్పట్టదు. మఱియు నీతఁడు దివారాత్రములు భేదమును బాటింపక భార్యను గవయువాఁడు. ఇది కూడ సదాచార విరుద్ధమే. ఈతని రెండవజీవితమునఁ గూడ నీతఁ డాచరించిన పనులు మానవ ప్రకృతి విరుద్ధములు, కాముకత్వద్యోతకములు నై యున్నవి. పురుషత్వమును దన భార్య పొందఁగా నీతఁడు స్త్రీత్వమును బొంది తన కాముకత్వమును వ్యక్తీకరించియున్నాఁడు. మృగేంద్రవాహన, కలభాషిణులతోఁ గూడ నీతనిని దూరమున నొక పొదరింటిలోఁ బారవైవగా

నీతఁ డేకాంతమున నున్నకలభాషిణిని జూచి మోహపరవశుఁడై యామెను గౌగిలించి యామె మానభంగమును గావింప యత్నించి నాఁడు. ఆమె యాక్రోశమును విని నలకూబరరూపమున నున్న మణికంధరుఁడు రాఁగా నీతఁడు పిఱికిపందయై పాఱిపోయినాఁడు. కాని యీతఁడు గావించిన కొన్ని కార్యములు మహాసాహస ప్రచుర ములై యున్నవి. మృగేంద్రవాహనానుగ్రహమున దూరశ్రవణమును, దూరదృష్టిని సంపాదించుటకై యీతఁడు చేసిన పను లీతని శౌర్య మును వేనోళ్ళఁ జాటుచున్నవి. వంచన చేసి కలభాషిణిని మృగేంద్ర వాహనాలయమునకుం గొని వచ్చి యామె నఁట బలి నీయఁ గడంగి నాఁడు. క్రూరుఁడును, హృదయ విహీనుఁడును, గాముకుఁడును నగు నీతనికిఁ బుణ్యవశమున సుగాత్రి భార్యయైనది. ఈమె హైందవ నారీ లోకమున కాదర్శపాత్రియ యని చెప్పనొప్పును. ఈమెకుఁ బతియే సర్వస్వము. మనోవాక్కాయముల నాతని నెదిరింపకుండుటయే యామె దీక్ష. సుగాత్రనామమున నీమె యున్నప్పు డీమె భర్తయెడఁ జూపిన యనురాగము కడుంగడు శ్లాఘ్యమై యున్నది. తన తల్లి తన భర్త సేవగించుకొనుచున్నను దా నాతనిమాట కెదురాడలేదు. సులభకోపియు నతిసాహసియు నగు తన భర్త మడుగులో దూకిన యనంతరము కూడ నీమె తన పాతివ్రత్యము నట్లే నిలిపికొని సన్న్యాసినియై కాలము గడపినది.

సుగాత్రి దయామయి. మృగేంద్ర వాహనాలయమునఁ గల భాషిణిని మణిస్తంభుఁడు బలి నీఁబోఁగా నీమె తన కంఠము నామె కంఠమున కడ్డుగా నిడినది. భర్త సౌఖ్యమే తన సౌఖ్యము. భర్తృ సేవయే భగవత్సేవ యని నమ్మికొనియున్న హైందవనారీమణుల కీయమ చరిత్ర నిత్యము పఠనీయము.

కళాపూర్ణోదయమును జదివిన వారికిఁ గవి యిక్కావ్యమునకు వేశ్య నేల నాయికను జేసినాఁడను ప్రశ్న జనింపకపోదు. ఇట్టి కల్పనము నానాటి పండితలోక మాదరించదేమో యను సందియము కవిహృదయమునఁ గూడ లేకపోలేదు. అందులకే కథాప్రారంభమున ద్వారవతిని వర్ణించుచు.

“అందును వారు వీ రనక యందఱు ధర్మధురీణులైన వా
రందఱు శుద్ధభాగవతు లందఱు వేదవిభూషి నున్నవా
రందఱు సాత్త్వికప్రవరు లందఱుఁ దత్త్వ మెఱింగినట్టి వా
రందఱు సత్కృపానిరతు లందఱుఁ బావను లెన్ని చూడఁగన్.

“ఇట్టట్టన నేటికిఁ ద
త్పట్టణమున నున్నయట్టి ప్రజ లే జాతిం
బుట్టిన వారలు వంద్యులు
గట్టిగఁ దద్వినుతి నెల్ల కలుషము వాయున్”

ఇందుఁ “తత్పట్టణమున నున్నయట్టి ప్రజ లేజాతిం బుట్టిన వారలు వంద్యులు’ అను వాక్యము పై యూహకుఁ బ్రబలాధారముగ నున్నది. కవి కేసందియమును లేకున్న నీవిషయము నింత తెలిచి చెప్పవలసినంత యవసరము గన్పట్టదు.

ఇట్టి పాత్రను గల్పించి నాయికను జేయుటలోఁ గవి యుద్దేశ్య మేమి ? యను ప్రశ్నకు సమాధానమిచ్చుటకుఁ బూర్వ మిట్టి నాయికా పాత్ర నిర్మాణ మితః పూర్వ మేవాఙ్మయము నందైనను గలదా యను సంశయమును జర్చింపవలయును. ఇంతకుఁ బూర్వమిట్టి నాయిక సంస్కృతమునందును దమిళమునందును గూడఁ గలదు. మృచ్ఛకటికమునందలి వసంతసేన యిట్టిదే. తమిళమునందలి మణి మేఖ లాదులలో వేశ్యయే నాయికయైయున్నది. పెద్దన మనుచరిత్రము నందలి వరూధినియు వేశ్యయే కాని యామె స్వర్వేశ్య కాని సూర

నార్యుఁ డీ పాత్రల మనసున నిడికొని కలభాషిణీపాత్రను నిర్మించి నాఁ డని తలంచుట కవకాశము చాలను. ఇట్టి పాత్రను సృజించుటలో నాతని కొకమహత్తరాశయము గలదు. ఆ రోజులలోఁ దక్కువ కులమువారి చరిత్రమును గావ్యముగా వ్రాయువారే లేరు. భౌతిక ప్రపంచమునందు వలెనే కావ్యప్రపంచమునందును సంపన్నులకు మాత్రమే స్థానము గలదు. రాజులును రాణులును ననుభవించు శృంగారము చూచుట కుదాత్తముగా నున్నను నంతరమునఁ గృత్రిమమై స్వభావవిరుద్ధమై గోచరించును వారి శృంగారములో రతి కున్నంత స్థానము ప్రణయమున కుండదు. ప్రణయపూర్వకమైన శృంగారానుభవ మకృత్రిమ స్వభావులైన సామాన్యసంసారుల కే చెల్లును. సూరనార్యుఁడు బోధింపఁదలచిన ధర్మములలో నిది యొకటి కావుననే యా హీనకులజ నాతఁ డాదరించెను. అట్లయ్యు వేశ్యనే యేల నాయికను జేయవలయు నన్నచో నద్దాని కనేకకారణములు గలవు. ఆతఁడు చెప్పఁదలచుకొన్న కథలోఁ జిత్ర విచిత్రములగు ప్రణయగాధ లిమిడియున్నవి. మఱియు నాతఁడు కల్పించుకొనిన కథా ప్రణాళికను బరిశీలించితిమే నందు నాయికా పాత్రమునకు వేశ్యయే యుచితమైనదని మనకు సువ్యక్తము కాకపోదు. మఱియుఁ బాత్రల యుత్తమత్వమునకుఁ గులీనతకంటె శీలసంపన్నత పరమ ప్రమాణమని గ్రహింపఁ గలిగిననే కాని కలభాషిణి యాదరపాత్రము కాదు. దీనికి సహృదయులే ప్రమాణము.

ఇఁకఁ బ్రభావతీ ప్రద్యుమ్నమునందలి పాత్రరచనా విశేషమును బరిశీలింతము. సూరనార్యుని రచనయం దన్నిటను బురుషుల కంటె స్త్రీలకే యెక్కుడు ప్రాధాన్య మీయఁబడినది. ఈ గ్రంథము నందలి పాత్రలలో శుచిముఖి ప్రజ్ఞామూర్తి. ప్రభావతి ప్రణయమూర్తి. ఇందు శుచిముఖీ పాత్రము తిలకాయమానమై యున్నది. చూడఁ

జూడ నా యంచగరితకొఱకే కవి యిమ్మహాప్రబంధమును రచించెనా యని కూడఁ దోచును. భారతమున శ్రీకృష్ణపాత్రమునందు సోమయాజి యాత్మీయత ప్రతిఫలించినటులే యిందు శుచిముఖి పాత్రమున సూరన యాత్మీయత ప్రతిఫలించుచున్నదని ప్రౌఢ విమర్శకుల యభిప్రాయము. కళాపూర్ణోదయమునఁ గలభాషిణీ పాత్రమునఁ బ్రేమ ప్రవాహము పొంగిపొరలినది. ప్రభావతీ ప్రద్యుమ్నమున శుచిముఖిపాత్రమునందుఁ బ్రజ్ఞావిశేషము మిన్నుముట్టినది. హృదయ దౌర్బల్యముచేఁ గలభాషిణి మహాకష్టములకు లోనైనది. బుద్ధిబలముచే శుచిముఖి యొరుల కష్టములకుఁ గూడఁ దరణోపాయమైనది. సూరనార్యుని పాత్రరచనా నైపుణ్యమును, రాజకీయ వేతృత్వమును, హృదయ గాంభీర్యమును యుక్తి ప్రత్యుక్తి కౌశలమును నెఱుఁగవలయునన్నచో శుచిముఖిపాత్రము బరిశీలింపఁ వలయును

చతుర్ముఖుని తేరు మోయు సారంగధరాఖ్యుని కూతురు శుచిముఖి. వాగ్దేవతయే సమస్తవిద్యల నామెకుఁ గఱపి తనంతటి దానిగ నొనర్చినది. అతివాఙ్మహిమాఢ్యయగు నీ రాజహంసికిని దనప్రోది రాచిలుకకును భాషామోహ కైత సెప్పఁ బోటీ పెట్టినది. అందు జయము గాంచిన శుచిముఖి నామె గారవించి "యుపమాతిశయోక్తి 'కామధేను' బిరుదము నొసంగి, గండపెండరము నొక్కదాని నయ్యబల తదంఘ్రి మూలమునఁ దొడిగినది.

తొలుదొల్త నీ యంచగరిత మన కిందుని యుద్యానవనమునందు సాక్షాత్కరించును. ఇంద్రుఁడు వజ్రనాభవధోపాయము నాలోచించు చుండఁగా వియద్గంగలో నట్టిటుఁ దిరుగాడు నంచలపిండు గాన వచ్చినది వానిం జేరఁజీరి యాతఁడు తన కార్యావసరముల నెఱిం గించు చుండఁగాఁ దనవరుఁ డెఱిఁగింప నీ హంసి వజ్రి మోల నిలిచి

తన వాగ్నైపుణ్యమును సమయోచిత బుద్ధికౌశలమును వెలయించినది. ఇందోపేంద్రుల బుద్ధికి నగమ్యములైన యూహలు కూడ నీ రాజహంసికి సుసాధ్యములైనవి. మఱియుఁ దాను వజ్రనాభుని నగరిలోఁ దిరుగు తఱిని, వినినవియుఁ గనినవియు నగు నంశములఁ గోడీకరించి తర్కించి సహేతుకమైన యొక నిశ్చయమున కామె వచ్చినది. ప్రభావతికి స్వప్నమునఁ బార్వతి సాక్షాత్కరించి ప్రద్యుమ్నుని చిత్ర మొసఁగుటయు నా స్వప్నవిషయముగఁ బ్రభావతికి నామె చెలికత్తె యగు రాగవల్లరికి జరిగిన సంభాషణము సర్వమును దాను వినిన దంతయు నిం(దు)న కెఱింగించినది. చెప్పుటయే కాక తన సిద్ధాంతము నీ క్రింది రీతిని వ్యక్తము చేసినది.

"ఆయింతి ప్రద్యుమ్ను జాయగాఁ బలికిన
గౌరి మాటకుఁ దప్పు కలుగ దనుము
దనుజవిరోధిపుత్రునకు నా దుష్టదై
త్యుఁడు దనంతఁ దనూజ నొసఁగఁ డనుము
ప్రద్యుమ్నుఁ డట్లు ప్రభావతీపతియైన
దానవునకుఁ బోకు తప్ప దనుము
వజ్రపురము ప్రభావతి కొఱకు కేలుట
యసురకు జయమైనఁ బొసగ దనుము
చిత్రఫలకంబు ప్రత్యక్ష సిద్ధమగుటఁ
జేసి యూకల యధిక విశ్వాసయోగ్య
మదియు వేకువ గావున నచిరభావి
ఫలము దేవేంద్ర! నీ వెంచి తెలిసికొనుము."

దేవేంద్రున కామె వాగ్వైదగ్ధ్యమును యుక్తిప్రత్యుక్తి నైపుణ్యమును సహేతుకవిమర్శ జ్ఞానమును ముదము గొల్పినవి. ఆతఁడు సంతసము పట్టఁజాలక "వాగ్దేవతవో కాక యూకె దిద్దిన కవివో" అని

రాజహంసిని ప్రశంసించి యామె నే శ్రీకృష్ణుని కడకు నీ విషయము నెఱింగింపఁ బంపినాఁడు శ్రీకృష్ణుఁడు గూడ నీ రాజహంసి బుద్ధివిశేషమున కాశ్చర్యపడినాఁడు. వజ్రరాక్షసునిపైకిఁ దనకొడుకు యుద్ధమున కేగుట రుక్మిణికి హితవుగా నుండదని హంసి గ్రహించి శ్రీకృష్ణుని యేకాంత మిమ్మని కోరినది. ఇట్లు సూక్ష్మాతిసూక్ష్మములైన విషయములందు గూడ నీ రాజహంసి కేమఱుపాటు గాని పొరపాటు గాని కానరాదు. రాజకీయ వేత్తకు ముఖ్యముగాఁ గావలసిన రహస్యగోపనమును వాఙ్నైపుణ్యమును, గంభీర హృదయమును నీమెకు బాగుగా నలవడినవి.

శ్రీకృష్ణునితోడి రాజకీయప్రసంగములో హంసి వజ్రనాభవధఁ గావింప సమర్థుఁడు ప్రద్యుమ్నుఁడే యని నిర్ణయించుకొనినది. తరువాత ద్వారవతి వీడిపోవుచు మధ్యమార్గమున నున్న యొక యుద్యానవనమునందుఁ దురగారూఢుఁడై కందుకకేళిం దేలు ప్రద్యుమ్నుని గాంచినది. వినోదాసక్తమై యున్న యువ్వీరుని మనసు ప్రభావతిపై మరలునట్లు గావించుట భవిష్యత్కార్యమున కుపయోగపడు నని గ్రహించినది. కాని పిలువనిపేరంటమున కేగుట రాజనీతి విరుద్ధము కదా! కావున నాతఁడే తమ్ముఁ బిలుచునట్టి యవసరము గల్పింపవలయును. ప్రజ్ఞాధురీణయగు శుచిముఖి కిది కష్టసాధ్యము కాదు. వెంటనే తన చెలికత్తెతోఁ బ్రద్యుమ్నునకు శ్రవణగోచరమగునట్లుగా నల్ల యతఁడే యీతఁడు గానోపు నని పలికినది. కందుకకేళీలోలుఁడగు ప్రద్యుమ్నుని మనసు హఠాత్తుగా నీయంచపిండు వైపు మరలినది. తన ప్రసంగమును వారు చేయఁగారణ మేమియో యడుగవలయునని ప్రద్యుమ్నుఁ డా యంచల నెలుగెత్తి పిలిచినాఁడు. శుచిముఖి యెత్తు నెగ్గినది. అవకాశము కలిగిన విడుచునదికాదు శుచిముఖి. ఆతని ప్రసంగము వచ్చిన తెఱం గెఱింగించుచుఁ బ్రసంగవశ

మునఁ జెప్పినట్లు ప్రభావతీ సౌందర్యమును సంస్తుతించినది. ఇప్పటి కింతే చాలునని యచ్చోటు వీడినది.

మూఁడవరంగమున నామె ప్రభావతి యుద్యానవనమునఁ గానవచ్చును. ప్రభావతి ముందఱ నామె చూపిన ప్రజ్ఞావిశేష మద్భుతావహము. ఈ సంభాషణమునం దామె యాశించిన ప్రయోజనము లనేకములు గలవు. ఒకవంకఁ బ్రభావతికిఁ బ్రద్యుమ్ను నిపై వలపు గలుగునట్లు చేయవలయును. ఇందులకుఁ బరమేశ్వరియే పునాది వైచినది. కాని యాచిత్ర ఫలమునందలి పురుషుని వంటి పురుషుఁ డెందైనఁ గలఁడా యను సందేహము ప్రభావతియందుఁ బ్రగాఢమై తుదకు నిస్పృహగాఁ బరిణమించుచున్నది. దానిని బోనడచుట శుచిముఖి పనియైయున్నది. ఇది సాధించు టంత కష్టకార్యము కాకపోయినను బ్రద్యుమ్ను నచ్చటకు రప్పించుట కష్టతరము. బ్రహ్మవరప్రభావమున వజ్రనాభుని యనుజ్ఞ లేనిదే యొరు లెవ్వరు నానగరుఁ బ్రవేశింపఁజాలరు. ప్రద్యుమ్నుని కాతఁడు ప్రవేశము నొసంగుననుమాట కలలోనైన నూహింపరాని విషయము. ఇఁక నాతని యనుజ్ఞ వడయుటకుఁ బ్రభావతీసాహాయ్య మత్యావశ్యకము. మఱియుఁ బ్రభావతికి రహస్యభంగము కాకుండఁ బ్రద్యుమ్ను నటకు రావింపవలయును. ఈ విషమసమస్యాపరిష్కారమునకై శుచిముఖి యోజించుచుండఁగాఁ బ్రద్యుమ్నుని లేఖ దైవవశమున నటఁ జేరినది. ఆ లేఖం గాంచి ప్రభావతి యొడలు మఱచినది. పిదప విరహము పొంగి పొరలినది. ప్రద్యుమ్నుని గూడకున్నఁ బ్రాణములు నిలుచుటయే కష్ట మనిపించినది. కాని యేమి లాభము. శుచిముఖికిఁ గలిగిన విషమ సమస్యయే యిప్పు డామె నెదుర్కొనినది. దానిని బరిష్కరింప శుచిముఖి తప్ప నన్యాధార మామెకు గోచరింపలేదు. శుచిముఖికిఁ గావలసినదియు నదియే. ఆమె ప్రార్థనముపై శుచిముఖి యొక

యుపాయ మామె కెఱిగించినది. తన్నెట్లయిన వజ్రనాభుని సన్నిధికిఁ గొంపోయినఁ బ్రద్యుమ్ను నటకు రహస్యభంగము కాకుండ రావింపఁ గలనని ప్రతిజ్ఞ చేసినది. ప్రభావతీ సాహాయ్యమున వజ్రనాభుని దరి కేగి తన హావభావ్యము చేతను శాస్త్ర పాండిత్యము చేతను నాతని మెప్పించి మెలమెల్లగా భద్రనటుని వృత్తాంతమును జారవిడిచినది. వజ్రనాభుఁడును నాతని రాకకనుజ్ఞ నిచ్చినాఁడు. ఇంతలో నీదుర్ఘట కార్యము ముగిసినది. శుచిముఖి కావించిన దుర్ఘట కార్యములును నింతతో ముగిసిన దనవచ్చును. ప్రద్యుమ్నాదుల వజ్రనాభుఁడెఱిఁగి వారిపై నాతఁడు సైన్యముల నంపుతఱి నామె యా వృత్తాంతమును శ్రీకృష్ణునకుఁ దెలియఁ జేయుటయే యామె కడసారి పనియని చెప్ప వచ్చును.

ఈ కార్యకలాపము జరుగుచున్నంతకాలము ప్రభావతి కామె నిజవృత్తాంతము నావంతయు నెఱిఁగింపలేదు. ప్రభావతీ సౌఖ్యమునకై యే తానంతటి పాటుపడుచున్నట్లు నటించినది. తుదకు బ్రద్యుమ్నుఁడును గదసాంబులు నొకరి రహస్య మొకరెరుంగకుండ నామె మెల గినది. ఇంతటి నేర్పు నింతటి రహస్య గోపన సామర్థ్యము నింతటి ప్రజ్ఞా విశేషమును సామాన్యుల కలవడునవి కావు. సూరనార్యు డీపా త్రమున నొక మహామాత్యుని ప్రదర్శించినాఁడనవచ్చును.

పాత్ర నిర్మాణ కౌశలము కవుల కందఱకు నబ్బునట్టిది కాదు. మఱియు నొక్కొక్క కవి కొక్కొక్క దానియందభిరుచి యుండును. ఒక కవికి వర్ణనాభిమానము మెండుగా నుండును, ఇంకొక్కనికిఁ గథా కల్పనమునందుఁ బ్రీతియధికమై యుండును. వేఱొక్కనికిఁ జిత్ర

నిర్మాణమునందాసక్తి యుండును. ఈ మూడింటిని సమరసభావమున నడుపఁగల కవులరుదుగా నుందురు. ఏ కవికి దేనియందభిరుచి మెండుగా నున్నది యను విషయ మొక్కటియే మనకిటఁ జర్చనీయము.

డా. కె. వి. ఆర్. నరసింహము, (M A PHD)

# శ్రీ సూర్యరాయశతకము

— ० —

శా. శ్రీమత్సర్వచరాచరాత్మకజగద్బృందైక నిర్మాణ లీ
లామాయామహిమన్ ద్రిమూర్తులకు మూలంబైనబ్రహ్మంబునిన్
సామంతార్చితపుత్రపౌత్రధనధాన్య శ్రీయుతుం జేయుతన్.
బ్రేమన్ రావుకులాబ్ధి శీతలఘృణీ ! శ్రీ సూర్యరాయాగ్రణీ !

శా. శ్రీ గంగాధరభూవరౌరసుని కోర్కెల్ దీర్చి తత్సత్కృతుల్
నే నై కొందు నటంచు మున్ వెడలు కుంతీమాధవున్ మీఱి ని
న్నేగన్ బ్రోవుతఁ గుక్కుటేశ్వరుఁ డిలన్ శ్రీమంగయాంబాపురం
ధ్రీగర్భోజ్జ్వలశుక్తిమౌక్తికమణీ ! శ్రీ సూర్యరాయాగ్రణీ ! 2

శా. శ్రీరాధామధురాధరసుధన్ సేవించి పట్టంపుదే
వేరుల్ చొక్కఁ గళల్ స్పృశించుచుఁ బదార్వేల్ గోపికల్ వేడఁ గ్రీ
డారక్తుం డగుకుంతిమాధవుఁడు వేడ్కన్ భాగ్యభోగ్యాన్వయ
శ్రీరాజాభ్యుదయమ్ము నీకొసఁగుతన్ శ్రీ సూర్యరాయాగ్రణీ ! 3

మ. జగదభ్యున్నతసృష్టికర్త యని త్రింశత్కోటిదేవాళి పె
ద్దగ మన్నించినపద్మజుండు తన విద్యాప్రౌఢి వాటిల్ల సై
న్యగజాశ్వాయురభీష్ట వస్తుసముదాయం బీవుతన్ నీకు వై
రిగణోలూకవిలోకనాంబరమణీ ! శ్రీ సూర్యరాయాగ్రణీ ! 4

మ. కలుగున్ మెట్టిన వెండి పట్టినను బంగారమ్ము మాయట్టి వా
రలకా కూటికి గుడ్డకున్ గొఱ హరిబ్రహ్మాదు లర్థింపఁ గో
ర్కెలు చేకూర్చితి నంచు భర్త మధురోక్తిన్ శంక వారింప భా
సిలు శ్రీ శాంకరి నీకొసంగుత సిరుల్ శ్రీ సూర్యరాయాగ్రణీ ! 5

మ. దళదింద్రోపలనీలవేణి, త్రిజగత్కల్యాణి, కైవల్యని
శ్చలనిశ్రేణి, సరోజపాణి, మధుమాసస్వైరసంచారకో
కిలవాగ్వాణి, యుపేంద్రురాణి చపలక్రీడారతిన్ బాసి భా
సిలు నీ సౌధగృహమ్ములో నిరతమున్ శ్రీ సూర్యరాయాగ్రణీ ! 6

మ. ఇల వాగ్దేవి కవీంద్రమానసములం దింపొంది కావించు మం
జులవాగ్జృంభిత సత్ప్రబంధముల వించున్ వారలం బ్రోచుని
శ్చలచిత్తుండ వటంచు నీముఖసరోజంబందు నిత్యమ్ము భా
సిల విచ్చేయదె ? హంసయానయగుటన్ శ్రీసూర్యరాయాగ్రణీ! 7

మ. భువి విశ్వేశ్వరవీరలింగశతకమ్ముల్, గద్యపద్యావళుల్
శివలీలామహిమాదికావ్యములు వ్రాసెన్ గున్నెపల్ల్యన్వయో
ద్భవుఁ డౌ బాణకవీంద్రుఁ డీశ్వరకృపన్ దత్పుత్త్రమృత్యుంజయో
క్తవరై తత్కృతి నీ సిరిన్ బెనుచుఁ గాతన్ సూర్యరాయాగ్రణీ ! 8

శా. భోజుం డక్షరలక్ష లిచ్చెఁ దురగీభూషాగ్రహారాంబరాం
భోజాక్షీమణు; లిచ్చె రాయలు మనస్స్ఫూర్తిన్ గృతుల్ గాంచియా
రాజుల్, తత్కవు; లాబహూకృతులు సర్వం బేగివంగాసి బల్
తేజం బందుచునుండెఁ దచ్చరితముల్ శ్రీసూర్యరాయాగ్రణీ ! 9

శా. జ్ఞానానందమయాత్ములౌ విపులశాస్త్రజ్ఞుల్ భువిన్ సప్తసం
తానంబున్ గని యందు సత్కృతి ప్రశస్తంబంచుఁ గీర్తింప నౌ
నౌ నంచున్ శిరసావహించి నృపు; లత్యాసక్తి నేతాదృశ
శ్రీ నింపొందఁగఁ జూచుచుందు రెపుడున్ శ్రీసూర్యరాయాగ్రణీ! 10

శా. స్వారస్యమ్ముగ నుండ దేమొకొ కవిత్వంబంచు నెవ్వారిలో
వారే సందియ మందుచున్ బుధులు గావ్యమ్ముల్ వెసన్ వ్రాయకు
న్నా రయ్యారె! వధూవరుల్ తమకు సంతానమ్ముచేఁ గీర్తి పో
నీ రానీ కని పెంచకుందురె భువిన్ శ్రీసూర్యరాయాగ్రణీ !

మ. పలుసన్మార్గులు, చక్రపాలనకళాభ్యాసుల్, మహారాజవ
శ్యులు, సమ్రాట్టులు, లోకబాంధవులు, తేజస్వంతులై పొల్చి; రి
య్యిల; నెవ్వా; రలపద్మనాయకకులాధీశావతంసంబ వై
చెలువౌ నిన్ను నుతింపఁగా వలవదే ? శ్రీసూర్యరాయాగ్రణీ !

మ. చెలువౌ నేనుఁగులున్, గుఱ్ఱాలు, వరదాసీదాసజాలంబు మే
డలు, వాడల్, బలుపాడిపంటలును బేఁటల్, గోట లింకెన్నియో
కల; వెవ్వా రయినన్ నుతించుటకు శక్యంబా! సహస్రాంశమున్
దెలియం జేయఁగనౌనె నీ సకల భూతిన్ శ్రీ సూర్యరాయాగ్రణీ

మ. ధరణీరాజ్యము నేలె మీజనకుఁడౌ తద్వేంకట శ్రీమహీ
శ్వరగంగాధరరామరాయలు కృపన్, శాంతమ్మునన్ భూతిచేఁ
దిరమౌకీర్తిని, ధైర్యశౌర్యముల నాత్మీయాఖ్య సార్థమ్ముగా
నెరయన్ విద్యల భోజుఁడో యనఁగ నెంతే సూర్యరాయాగ్రణీ!

శా. తారై యుండెడు సాటిబోటులను గోఁకన్ మీటఁ బట్టంపు దే
వేరిం జేసి నిజేశుఁ డెల్లపుడు ఠీవిన్ గారవింపన్ మహో
దారున్ నిన్గడు పారఁ గన్నసుచరిత్రారత్న మా మంగయాం
బా రాజ్ఞిన్ మది సన్నుతింపఁగ వశంబా? సూర్యరాయాగ్రణీ!

మ. లలి నీయేనుఁగుమీఁద వెండి సునుడాల్ చౌడోలుఁ గీలించి మే
తెలి మైచాయ హుమాయివాయి గుజరాతీకెంపు రాకళ్ళమిం
పలరన్ గూరిచి మోసలన్ నిలుపఁగా నై రావతోచ్చైశ్శ్రవం
బు లనన్ బొల్చి నిజేంద్రుఁ డీ వగుటఁ దెల్పున్ సూర్యరాయాగ్రణీ!

మ. పొలుపౌ భద్రగజేంద్రమండలరుచిన్ భూలోక దేవేంద్రని
శ్చలభూతిన్ బ్రకటించినాఁడ వని మేషత్వమ్మునన్ గాంచువా
రలకుం గూర్చుచుఁ బ్రోవ వేగతులఁ బాఱంజూచుచున్ బీఠికా
స్థలసింహాసన మెక్కినాఁడె తొలుదొల్తన్ సూర్యరాయాగ్రణీ!

మ. భవదీయోజ్జ్వలశౌర్యశోణతిలకప్రాయాంకసత్కీర్తికాం
తవివేకైకపతివ్రతామహిమ విన్నం జాలుఁ దా జాడ శా
త్రవసామ్రాజ్యరమావనూటి నినుఁ జేరన్ నవ్వి దాక్షిణ్యమూ
ర్తి వటంచున్ మను క్షీరనీరఫణితిన్ శ్రీ సూర్యరాయాగ్రణీ !

మ. శ్రమసాధ్యైకబుధావనోద్ధతి కుమారస్వామికిన్ ఖ్యాతిఁగూ
ర్పమి గంగాధరరాజమౌళికిఁ గుమారస్వామివై మర్త్యలో
కమునం దశ్రమచే ననేకబుధవర్గత్రాణపారీణకీ
ర్తిమతల్లిం గొనె నాను; రెల్లరు నినున్ శ్రీ సూర్యరాయాగ్రణీ !

మ. విలసత్త్వద్గుణకీర్తనమ్ములను తీవిం జేయుచున్ సత్కవీం
ద్రుల జిహ్వాగ్రమునందుఁ 'దత్తత హి ధిత్తోంత క్త ధిత్తాంగ ళాం
గ్గళతా తైత్తైహి' యంచు నిత్యమును నృత్యం బాడు వాగ్దేవి గ
జ్జెలకీ లూడిచి విశ్రమింప దవురా ! శ్రీ సూర్యరాయాగ్రణీ !

మ. ప్రమదం బల్లన జాఱ భూభరణశోభన్ దాల్తు మెన్నండమై
ప్రమదం బల్లన మీఱ భూభరణశోభన్ దాల్చె నొక్కండు బిం
కమునన్ వీనిదె యంచు నిన్గని శిరఃకంపమ్ముఁ గావించి కూ
రిమిచే దిక్కరికోటి కేలు మొగుచున్ శ్రీ సూర్యరాయాగ్రణీ!

మ. జయభేరీముఖభాంకృతుల్ మొరయ నాజానేయరాజమ్ము నె
క్కియుఁ దద్వీరరసమ్ముఁ దాఁచి మృదుసంగీతమ్ము సాహిత్యమున్
బ్రియభావమ్మునఁ బేరెదన్ గదియ నౌ నీ జైత్రయాత్రాచమ
త్క్రియ లోకేశత వెల్లడించు బళిరా ! శ్రీ సూర్యరాయాగ్రణీ !

మ. అరులన్ గెల్చి బిఱాన గుఱ్ఱపు సవారై వచ్చు నిన్ జూచుసుం
దరు లింపొందిరి తెప్పలార్పమి మనోనాథుండు విచ్చేయు ముం
దర నాత్మీయ గృహాంగణమ్ము లనువొందన్ బీఠికాపట్టణేం
దిర కీలించిన సాలభంజిక లనన్ శ్రీ సూర్యరాయాగ్రణీ! 23

శా. యోగించెన్ మనకింక వేంకటకుమారోర్వీంద్రసూర్యాఖ్య యో
జా గేలా యని నీ కృపాబలతితిక్షాభోగ తేజోలతల్
సాగన్ రూపకళాగుళుచ్ఛములు మ్రోలన్ వ్రేలెడిన్ మే లయో
రే ! గంగాధరభూవరాత్మజమణీ ! శ్రీ సూర్యరాయాగ్రణీ !

మ. కలలోనైనఁ బరాంగనం గని యెఱుంగన్; నేరఁ డీ వాగ్రమా
నలినాక్షీమణులన్ వరించి యెటు లానందించె నాత్మస్తవ
మ్ములనైనన్ విననొల్లఁ డీకృతుల నామోదించి యెట్లందెఁ బల్
చెలువం బీతని రీతి యందు రిల నిన్ శ్రీసూర్యరాయాగ్రణీ! 25

మ. అకటా! చూడ భుజంగికానికరభోగాసక్తుఁ డీ శేషుఁ డే
టికిఁ బల్నాలుకల నిండు కూటములఁ బ్రోధిన్ నేర్చె; నీ శైలన
ప్తక మిం కెందులకంచు భూపులన చేపట్టెన్ గుణం బెంచి మ
చ్చికతో ని న్ననుకూలనాయకునిగా శ్రీసూర్యరాయాగ్రణీ!

మ. లలితైశ్వర్యకృపాకళాభ్యుదయ లీలన్ జూచి మూర్తిత్రయీ
నిలయం బీవె యటంచు భూసురవరుల్ నిత్యైహికాముష్మికా
ఖిలసౌఖ్యమ్ములఁ గోరి సుస్థిరమతిన్ గీర్తించుచున్నారు భా
సిలు నీ నామమె దివ్యమంత్ర ఫణితిన్ శ్రీసూర్యరాయాగ్రణీ!

మ. కరముల్ రాజుల కిచ్చి సూర్యుఁ డత డాకర్షించె సన్మార్గమున్
గరముల్ రాజులొసంగ సూర్యుఁ డితఁ డాకర్షించె సన్మార్గ; మి
ద్దరి సన్మార్గత బోధయాఁ బరవధూభోగైకపత్నీవ్రత
స్థిరవృత్తుల్ గన నంచు మెత్తురు నినున్ శ్రీసూర్యరాయాగ్రణీ!

మ. అకటా! మత్తచకోరకాహ్లాకపూర్ణైనన్ సుఖం బూని పూ
నికతో వేఁడివెలుంగుజోమ నెపుడున్ నిందించు; నయ్యారె! రా
వుకులీనుం డగు నీవు శాత్రవుల రేపున్ మాపుఁ బీడింప వా
రికి నోరెత్తవు గాదె? మాటకయినన్ శ్రీసూర్యరాయాగ్రణీ!

మ. వలపౌ కస్తురిచుక్కబొట్టు, తెలినల్వం గట్టుమేల్కట్టు, వి
ద్యలచేఁ బొల్చెడి జన్నిగట్టు, వెలహెచ్చౌ పచ్చహారంబట్టు, కెం
పుల జాళ్వామణికట్టు, తుమ్మెదల సొంపు జెంపలం గొట్టు నీ
జిలుగున్ నాగగు మీసకట్టు సొగసౌ శ్రీసూర్యరాయాగ్రణీ!

మ. కళ కాంతుల్ గల పోఁడ్ర, మేలిమిహొయల్ గ్రాఁ సేయుమైజాడ, క్రొం
దళుకుం బూఁపొదరిండ్లనీడ, జనహృద్యం బైన బల్ వాడ, ని
ర్మలసౌఖ్యప్రద మైనమేడ, జయసంపత్కందుకక్రీడఁ జేఁ
జెలువౌ నీ నగుమోము జూడ సొగసౌ శ్రీ సూర్యరాయాగ్రణీ !

మ. తెళుకుంజూపుల వాఁడి, నిబ్బరపు సిబ్బెం పుబ్బుబల్ గబ్బి గు
బ్బల జొబ్బిల్లెడి వేఁడి, రాచిలుక బాబా పాదుసా దాడి, గా
ణలు వీణెల్ బచరించు తోడి, పరిపూర్ణజ్ఞాన మౌ పాడి, భా
సిలు నీ జోడుగుత్తాలగాడి సొగసౌ శ్రీ సూర్యరాయాగ్రణీ ! 32

మ. పతిభక్తిన్ మను నారి, పేశలవచోవ్యాసంగ యౌ కీరి, స
త్కృతులన్ వ్రాసెడి సూరి, త్వజ్జయజయ శ్రీభేరి, భాస్వత్సితా
న్వితమౌ నారికెడంపు వారి, వరమాణిక్యాదిరత్నైకచి
త్రిత మౌభారి గణింతు రార్యులు సభన్ శ్రీసూర్యరాయాగ్రణీ !

మ. మినుకన్ వజ్రపు రవ్వ బారు, పిడుగున్ మేల్కొల్పి రమ్మంచు మున్
జను క్రొక్కారు తెఱంగుతీరు, నునుకూసం బూడ్చు లే కోడిక్రా
చునిగార మ్మగు కోఱసౌరు, రిపులన్ స్రుక్కింప నీ కేలఁ దా
ల్చిన కైజాఱు మెఱుంగు తారు నొకటౌ శ్రీ సూర్యరాయాగ్రణీ!

మ. చికిలీచేసినవాలు, ముద్దువగలం జెన్నారు ప్రోయాలు, బా
యక విద్వత్కవు లుండుహాలు, శివపూజాసక్త మౌ కేలు, ఫు
ల్లకపుం గొజ్జఁగి నీటి జాలు, నునుజాళ్వాపట్టు మేల్సేలు, భా
సిలు నీ మేని మెఱుంగుడాలు సొగసౌ శ్రీ సూర్యరాయాగ్రణీ !

మ. సోగై వాడని పండుటాకు, విన నాజూకైన మేల్వాకు, చే
డాగుల్ చెందని కెంపుడాకు, పలునీడల్ గ్రమ్ము వ్రేల్టాకు, వే
వేగన్ వ్రాసెడి చేతిపాకు, బలుఁదీవిన్ వచ్చు నీషోకు న
ల్గి గోల్పోని మెఱుంగు బాకు సొగసౌ శ్రీ సూర్యరాయాగ్రణీ !

మ. బిగి కౌఁగిటి హసంబు, సందు గని ప్రావి ల్బ్యాబు లేకంబు, కం
దుగి కిం పై తగువిందు, విందు గని సంతోషించు ఖామందు, మం
దుగతిన్ వీడనిపొందు, పొందుఁగఁ గవీంద్రుం బ్రోచు నీయట్టిఁ కొం
జిగి రాసింగపుఁగందుఁ గందురు బుధుల్ శ్రీ సూర్యరాయాగ్రణీ!

మ. ఎకసక్కెం బగుమాట, మాటమరఁ గట్టిట్టన్న చో వేఁట, వే
టకటాంకుల్ గల పేఁట పేటవిరు లుండల్ సేయు మైమాట, మా
టకు నీ రందనియాట, యూటగు కవాటం బల్లనన్ వీడి వై
రికిఁ జో టిచ్చినకోట గోటలకనా శ్రీ సూర్యరాయాగ్రణీ! 38

మ. వసుధన్ త్వద్రిపుదుర్యశోభృశనభోవ్యాసంగముం గాంచి కాం
చి సదాకారితసత్రఘామపటలాక్షీణద్యుతిన్ బూని పూ
ని సుమీ వెల్వెలఁబాఱనట్టి జలదానీకం, బఖండస్థితిన్
వెస; నత్యంతఘనప్రసిద్ధి నెనసెన్ శ్రీ సూర్యరాయాగ్రణీ! 39

శా. ఔరా! నీదు విరోధు లెల్ల నిజరాజ్యభ్రష్టులై ఘోరకాం
తారప్రాంతములన్ జరించుచుఁ గిరాతస్త్రీలు, కాత్మీయకాం
తారత్నంబులు పాటలం గఱపఁగన్ వారిచ్చు తత్తండుల
క్షీరాదుల్ గొని సంతసింతు రచటన్ శ్రీ సూర్యరాయాగ్రణీ!

మ. పొలుపౌ నీ విపులప్రతాప మిల రేపున్ మాపు దీపింప దు
ర్బలులై శాత్రవకోటి మూల నివసింపన్ ఘూకలోకమ్ము వా
రలతోఁ బూటకుఁ బూటకున్ నిజవిచారం బాతయుం దెల్పు; మ
ద్దెలతో మున్మును జోలు చెప్పె ననురీతిన్ సూర్యరాయాగ్రణీ!

మ ధనధాన్యమ్ముల లెక్కఁజూడక భవత్పట్టాభిషేకోత్సవ
మ్మునకున్ భూసురకోటి మెచ్చఁగ, సితాపూపాన్నపానాదులన్
దనివిం దీరఁగఁ జేసి పేదలకు సన్నం పన్నవస్త్రమ్ములు; లా
య్యన నిప్పించితి, వెల్లరున్ వినుతిసేయన్ సూర్యరాయాగ్రణీ!

మ. అల బ్రహ్మాదిపిపీలికావినికరపర్యంతమ్ము శ్రీశుండు రం
జిలు చందమ్మున నెల్లవారియెడ దాక్షిణ్యముతో నుండి మ
ర్త్యుల విద్యాగుణశీలముల్ గనుచు నుద్యోగమ్ము లిప్పించి కో
ర్కెలు చేకూర్పఁగ నీకె చెల్లును భువిన్ శ్రీ సూర్యరాయాగ్రణీ!

మ. అనరా దొక్కజనాళిపై ననుచుఁ దిర్యగ్జంతుజాలమ్ము మీఁ
దను నీ కున్నది ప్రేమ లేనియెడ బీదల్ సాదల్ మేపి తె
చ్చిన మేలౌ వృషభాదిజంతువుల వాసిం జూచు చేటేట వా
రిని బ్రోత్సాహము సేయ సొమ్ము లిడు దే? శ్రీసూర్యరాయాగ్రణీ!

మ. ఇల నీ దర్శనభాగ్యముం మరగి మున్నే రాజులం గోర క
ఫ్పులపాలైన కవీంద్రచక్రములపైఁ బూర్ణానుకంపామతిన్
గలకాలమ్ము వసుప్రసారమున సౌఖ్యస్ఫూర్తిఁ గావించినా
వెలమిన్ సార్థకనామధేయ మన నీదే సూర్యరాయాగ్రణీ! 45

మ. తను దా నాకులపాటుఁ జెందు నలమందారమ్ము; కర్ణుండు గ్రు
క్కునఁ దేమిం బ్రకటింపకుండి చెవిపోగుల్ దెంచి తా నర్థి కి
చ్చెను; సర్వమ్మును గల్గి గడ్డిఁదిని జేజేగడ్డ జీవించుచుం
డెను; నీ కైనవత్తు; రీవికి భువిన్ శ్రీ సూర్యరాయాగ్రణీ! 46

మ. క్రమమాభోగజయోన్నతుల్ హరికుమారప్రక్రియన్ బొల్చు; వి
క్రమమున్ శాంతము రూపమున్ హరికుమారప్రక్రియన్ దాల్చు, ధ
ర్మమతిత్యాగకళాస్థితుల్ హరికుమారప్రక్రియన్ గెల్చు. గూ
రిమిచే నీ; కనుచున్ వచింతురు బళీ! శ్రీసూర్యరాయాగ్రణీ!

శా. భాసిల్లెన్ భవదీయమూర్తిఁ దిలకింపన్ బీఠికాపట్టణో
ర్వీసామ్రాజ్యరమార్పితాంస మయి, దోర్వీర్యప్రసాదైకనా
సా సామంతశిరోవతంస మయి, పుణ్యశ్రీమదాంధ్రభూదే
వీసన్మానసరాజహంస మయి రీవిన్ సూర్యరాయాగ్రణీ! 48

శా. నాకాధీశ సమానభోగ! రిపుసేనాకంజపున్నాగ! ల
క్ష్మీకోలాహల శౌధభాగ! జయలక్ష్మీకేళికాభోగ! లో
కైకవ్యాపకకీర్తిపూగ! బుధవిద్యారక్షణోద్యోగ! గౌ
రీకాంతాప్తపదానురాగ! వినుమా! శ్రీసూర్యరాయాగ్రణీ! 49

మ. అమితం బౌచను విచ్చినాఁ డనుచు భృత్యశ్రేణి రాజేంద్రు ప్రాం
తమునన్ బల్వగ నొద్దికన్ మెలఁగకున్నన్ గీడగున్ నాదు దీ
పమె కాదా యని ముద్దుబెట్టుకొనఁబోవన్ మూతిపైఁ గాలకు
న్నె? మహాభోగకరైకచక్రయుతపాణీ! సూర్యరాయాగ్రణీ! 50

మ. తన కెంతెంతటి విద్య లబ్బినను యాథార్థ్యమ్ము లేకున్న స
జ్జనపూజాన్వితుఁడై మెలంగునె? ప్రశస్తంబైన శాకమ్ము నే
ర్పునఁ బాక మ్మొనరించుచోఁ దగినయుప్పున్ వేయ కెన్నెన్ని చే
ర్చినఁగానీ తిన జిహ్వ కెట్లు హిత వౌ! శ్రీసూర్యరాయాగ్రణీ!

శా. దీనత్వమ్మును జెంది కోవిదుఁడు ప్రార్థింపన్ రసజ్ఞుండు లో
లో నా నంతిపురిం జరింపక దయాళుత్వమ్ముతోఁ బ్రోవ రాఁ
డే? నీవే గతి యంచుఁ బల్కు గజరాజేంద్రున్ విలోకించి ల
క్ష్మీనారాయణుఁ డూరకుండెనె? భువిన్ శ్రీసూర్యరాయాగ్రణీ!

మ. సిరి గోల్పోవునె? భాగ్యవంతుఁడు పరశ్రేయస్స్థితిం గోరు ధీ
వరు కార్యమ్ములఁ జక్కఁజేయ జనతావాక్యం చ కర్తవ్య మం
చు రసజ్ఞుం డగుఱేఁడు సర్వజనసంస్తుత్యక్రియల్ చేసి సు
స్థిరసామ్రాజ్యసుఖమ్ములం బడయడే? శ్రీసూర్యరాయాగ్రణీ!

మ. సుమతుల్ దీనులఁ గాచువేళ శ్రమ మంచున్ జిత్తమం దెంచ; రు
త్తమబుద్ధిన్ గరుణించి ప్రోతురు; కపోతమ్మున్ గృపన్ గాచి సా
శ్వము రంజిల్ల నిజామిషం బొసఁగె, భాస్వత్కీర్తికై మున్ను గూ
రిమితోడన్ శిబిచక్రవర్తి జగతిన్ శ్రీసూర్యరాయాగ్రణీ! 54

శా. సారస్యమ్ము నెఱుఁగు పూరుషవతంసమ్మున్ బుధుల్ వేడుకోఁ
బ్రారంభించిన నాలకించి తన యావచ్ఛక్తిచే మున్న ద
త్సూరుల్ మెచ్చఁ దనంతవారిగ నొనర్చున్ నీరముల్ చేరఁగా
క్షీరమ్ముల్ స్వగుణ మ్మొసంగుపగిదిన్ శ్రీ సూర్యరాయాగ్రణీ!

మ. కృతు లర్పించినచో గుణగ్రహణపారీణుండు తత్తచ్ఛ్రమ
త్కృతికిన్ సంతస మందుచున్ సుకవికోర్కెల్ దీర్చి పోషించు నీ
క్షితిలో సన్నుతిఁ జేయుమానవుని భక్తిశ్రద్ధలం జూచి శ్రీ
పతి రక్షింపక యూరకుండునె? దలంపన్ సూర్యరాయాగ్రణీ!

మ. కృతికన్యామణియందు భ్రాంతి విలసత్కీర్తిం బ్రవర్తించు ధీ
యుతు లావారికె కాక యొండొరులకున్ యోచింపఁగా నేటికిన్
సతి హేలావతియై చమత్కృతిగతుల్ సల్పన్ బ్రశంసింప నీ
క్షితిలో షండున కేల తద్గుణతతుల్ శ్రీ సూర్యరాయాగ్రణీ! 57

మ. రసికాగ్రేసరకోటికిన్ ఘనకవీంద్రప్రోక్తకావ్యమ్ము వి
శ్వసనీయమ్మును రుచ్యమైనటులు దేవానాంప్రియశ్రేణి; కె
ట్లు సదా విశ్వసనీయ మౌ? నళులు గ్రోలున్ దమ్మిపూఁదేనియన్
వెస జోటీఁగలు గ్రోల వాలునె? భువిన్ శ్రీ సూర్యరాయాగ్రణీ!

మ. పరిపూర్ణత్వముగల్గు బల్సరసు లేప్రాంతమ్మునం దుండరో
స్థిరబుద్ధిన్ గవు లచ్చటన్ దనరుటల్ చిత్రమ్ముగా; దెట్లనన్
బరిపూర్ణత్వము గల్గు బల్సరసు లేప్రాంతమునం దుండునో
స్థిరబుద్ధిన్ గవు లచ్చటం దనరవే? శ్రీ సూర్యరాయాగ్రణీ! 59

మ. ఇలలోనన్ బరమార్థు లెల్లరు మనోభీష్టమ్ము లర్పించి రం
జిలు శ్రీమత్పురుషోత్తమున్ వెదకుటల్ చిత్రమ్ముగా; దెట్లనన్
విలసిల్లం బరమార్థు లెల్లరు మనోభీష్టమ్ము లర్పించి రం
జిలు శ్రీమత్పురుషోత్తమున్ వెదకరే శ్రీ సూర్యరాయాగ్రణీ!

మ. కుముదోత్సాహముఁ జేయుచుండు హరిణాంకుండున్, సరోజాత సం
ఘము నెల్లన్ వికసింపఁజేయు రవి, లోక శ్రేణి రంజిల్లఁ దో
యము లిచ్చున్ జలదుండు, ధర్మనిరతుల్ యత్నమ్ము లేకున్నఁగూ
రిమి చేకూరఁ జరింతు; రిట్లు పుడమిన్ శ్రీ సూర్యరాయాగ్రణీ! 61

శా. సారాచారవివేకవంతులు ప్రతిజ్ఞాభంగముం జేయ; నె
వ్వారున్ జాలరు శంకరుండు యతియై భల్లాణధాత్రీశ్వరున్
జేరం బోయి నిజాభిలాషఁ దెలుపన్ జేకూర్ప వానిన్ యశ
శ్శ్రీరంజిల్లఁగఁ జేసిఁ మెచ్చుకొనఁడే? శ్రీ సూర్యరాయాగ్రణీ!

శా. రాజేంద్రుండు ప్రసిద్ధుఁడైనను గవీంద్రశ్రేణిచే సద్యశో
రాజిం జెంది మఱింత హెచ్చుగ జగత్ప్రఖ్యాతిఁ దా నొందెడిన్
దేజోంచన్మణిదర్పణం బయినఁ గానీ సానలం దీర్చినన్
రాజిల్లుం గద పూర్వకాంతి పొలుపొందన్ సూర్యరాయాగ్రణీ!

మ. చిలుకన్ గన్గొని తెచ్చి పంజరమునన్ జెన్నొందఁగా నుంచి ప
లుక్కులఁ బల్కించుచు సంతసించుపగిదిన్ లోకేశ్వరుల్ పండి తేం
ద్రుల రావించి ప్రసంగముల్ వినియెదర్ దుర్మార్గులన్ గాకులన్
జెలువొందంగన రొక్కచంద మగుటన్ శ్రీ సూర్యరాయాగ్రణీ!

శా. సౌందర్యమ్ము వహింపకున్నను సభాస్థానమ్మునన్ గౌరవం
బందంజాలును గోవిదుండు నిజవిద్యన్; దివ్యకస్తూరికా
బృందం బందము లేక రేవడివలెన్ వెల్గొందినన్ దావిచేఁ
జెందన్ లేదె? జనాదరాతిశయమున్ శ్రీ సూర్యరాయాగ్రణీ!

మ. వసుధన్ మర్త్యుఁడు రూపులేక చెడిపోవం డెన్నఁడున్ సద్గుణ
మ్ము సమగ్రమ్ముగ నుండెనేని సుజనున్ భూషింపరే? కేతకీ
ప్రసవం బాసవహీనమైన దరిఁజేరం బోవవే? తేంట్లు భూ
రిసుగంధాన్వితమై చెలంగుటను బేర్మిన్ సూర్యరాయాగ్రణీ!

మ. విమలం బైనయనమ్మునన్ మనుజుఁ డుర్విం గల్గు సత్పండితో
త్తములం గూడి చరింప వారలకు; నుద్యత్కీర్తి వాటిల్లు స్వ
ర్ణము రత్నమ్ములఁ గూడెనేని గడు నానందమ్ము గల్గించుఁ బే
రిమిమైఁ గన్గొన బంధుపద్మతరణీ! శ్రీసూర్యరాయాగ్రణీ! 67

మ. చతురార్థధ్వనిహీన మాకృతి, సభాస్థానమ్మునన్ మంజువా
క్ప్రతిభాభ్యున్నతిలేని సూరితతి, రాగజ్ఞాన సంపత్కళా
న్వితసాహిత్యము లేని గాణగతి, ప్రావృట్కాలమందున్ ఫల
స్థితిచే మించని మేదినీసతి వృథా శ్రీసూర్యరాయాగ్రణీ! 68

మ. భయమున్ భక్తియు లేనియాలు, గుణలోపం బూనురత్నాలు, ని
ర్దయతోఁ దెల్పిన యానవాలు, వెతఁగో రానట్టి చుట్టాలు, న
వ్యయధర్మాత్మలు లేనిప్రోలు, తెగవ్రేయక్ లేని బల్ డాలు, న
ప్రియముల్ పల్కువకీలు మెచ్చరు బుధుల్ శ్రీసూర్యరాయాగ్రణీ!

మ. వనితారత్నము లేని యిల్లు, తృణభూభాగమ్ములోఁ జల్లు, స్యం
దనమున్ బాసిన బండికల్లు, నడువన్ బాధించు లేముల్లు, భో
జనకాలమ్మున సల్లు పల్లు, నవిలో జ్యాహీన మౌ విల్లు, ధా
త్రిని మర్త్యాళికిఁ బెల్లుబాధ లివియే, శ్రీసూర్యరాయాగ్రణీ! 70

మ. రమణీయం బగు మంచిముత్యముఁ గవీంద్రశ్రేణి యందైకమ
త్యము, వాక్ఛ్రీ లొనరించునృత్యము, గురూత్తంసమ్ముబోధించుకృ
త్యము, దేవుండును మెచ్చుసత్యము, ననిత్యం బెంచి సాధించు ని
త్యము విద్వజ్జనహృద్య మౌచు గన నింపౌ సూర్యరాయాగ్రణీ!

మ. విమలామోదము గల్గుసూనము, జగద్విఖ్యాతమౌ నన్నదా
నము, శ్రావ్యమ్మగ నుండుగానము, మనోజ్ఞం బైన నీ సన్నిధా
నము రాజత్ గజరాజయానము, చిదానందస్వరూపేశ్వరాం
ఘ్రిమహత్త్వమ్ము నెఱుంగుజ్ఞాన; మలరున్ శ్రీసూర్యరాయాగ్రణీ!

మ. వలిమేల్పట్టు వితానముల్ సుగుణసంపద్యుక్త సంతానముల్,
వెలలేనట్టి విమానముల్, నృపసభావిఖ్యాతసన్మానముల్,
వెలిలోఁ జూచునిదానముల్ పరమఋత్విగ్యాగసంధానముల్,
విలసత్త్వత్కవితాభిమాన; మలరున్ శ్రీ సూర్యరాయాగ్రణీ!

మ. పతి చిత్తమ్మున కింపొనర్చుసతి, యాపత్సౌఖ్యకాలమ్ములన్
వితతాభ్యున్నతి దెల్పు మిత్రతతి, సద్విద్యాపరిశ్రాంతిసం
యుతమై యొప్పెడిపుత్రసంతతి, భువిన్ యోజింపఁగా వీర లీ
క్షితిలోఁ బుణ్యులకున్ లభింతు రెపుడున్ శ్రీసూర్యరాయాగ్రణీ!

మ. ధరణిన్ మున్నొనరించు పుణ్యతతిచేతన్ బొల్చు మర్త్యాళికిన్,
బరు లాత్మీయజనమ్ము లౌదు, రిల దివ్యంబైన సస్యావళిన్,
బరిపూర్ణమ్ముగఁ బండుచుండు వనమైనం బట్టణం బౌను సు
స్థిరసామ్రాజ్యరమామనోహరమణీ! శ్రీ సూర్యరాయాగ్రణీ!

శా. మున్నే మేమి లిఖించెనో నలువ తత్పుణ్యమ్మునన్ మర్త్యుఁడున్
జెన్నొందున్ సుఖదుఃఖముల్ వడయుచున్ లేమిన్ విచారించి సం
పన్నత్వమ్మున హాళిఁ జెంద వశమా? ప్రారబ్ధకర్మమ్ములన్
భిన్నం బెవ్వఁడు సేయ నోపు జగతిన్ శ్రీ సూర్యరాయాగ్రణీ!

శా. సాధుల్ చేసినపుణ్యసంఘమున నైశ్వర్యమ్ము సిద్ధించుఁ బల్
క్రోధుల్ చేసిన పాపలేశమునఁ జేకూరుంగదా లేమి దు
ర్వ్యాధివ్యూహము పాపసంకలితమై బాధించు సద్వైభవ
శ్రీధన్యత్వమునన్ లభించు ధరణిన్ శ్రీ సూర్యరాయాగ్రణీ! 77

మ. తతబంధుప్రచయమ్మునందుఁ బ్రియముల్, దాక్షిణ్యమున్ భృత్యసం
తతిపై, భక్తి గురూత్తమవ్రజముపై, ధాత్రిన్ రిపుశ్రేణిపై
నతి శౌర్యమ్మును, నీతి రాజతతిపై వ్యాపించు మర్త్యాళి; కీ
ప్సితముల్ చేకుఱు రావుసత్కులమణీ! శ్రీ సూర్యరాయాగ్రణీ!

మ. అనికిన్ బోవుట, శక్తిఁ గొల్చుట, యరణ్యశ్రేణిఁ గో వేఁట సీ
ల్వనికార్యమ్ములు దిద్దఁబోవుట, మహావాణిజ్యముల్ సేయుటల్,
కొనసాగన్ ఫల మబ్బుఁ, గానియెడఁ జిక్కుల్ వచ్చుటే కాక యుం
డిన ప్రాణమ్ములు నూడు వారల కిలన్ శ్రీ సూర్యరాయాగ్రణీ!

మ. నలినాప్తుం; డపరాద్రియం దుదయమైనన్ స్వర్ణశైలమ్ము చం
చలమైనన్ జ్వలనుండు చల్లనయినన్ జక్రాంతిపైఁ గంజ ము
జ్జ్వలమైనన్ గురుశుక్రు లొక్కటయినన్, సప్తాంబుధుల్ స్రుక్కినన్
జెలువౌ కీర్తికి మాట తప్పరు బుధుల్ శ్రీ సూర్యరాయాగ్రణీ!

మ. తనకార్యమ్ములు సిద్ధినొందుట; కసత్యమ్మున్ నరుం డాడఁ బా
పనికాయమ్ము ఘటించుటబ్బురమె? యశ్వత్థామయున్ గూలి నా
డని యేనుంగునెపమ్మునం బలికి ధర్మాధీశులోకమ్ముఁ దాఁ
జెనటింబోలి యుధిష్ఠిరుండు గనఁడే; శ్రీ సూర్యరాయాగ్రణీ!

మ. వరశార్దూలము కాలివాఁడినఖమున్ వస్త్రాదు చేమించుడాల్
తరవారిన్, విలసత్ పతివ్రతకుచద్వంద్వమ్ము, లుద్ధార్థముల్
బరులన్ ముట్టఁగనీయకుందు రిలఁ బ్రాణం బున్నపర్యంతమున్
స్థిరలక్ష్మీయుత పద్మనాయకమణీ! శ్రీ సూర్యరాయాగ్రణీ! 82

మ. వినయం బైనవివేకసాధనములన్ వెల్గొందఁగా నెంత చె
ప్పిన నాత్మీయగుణమ్ము దుర్నయునకుం బెం పొందుచుండుం గదా!
ఘనమాధుర్యసితాన్వితం బయినదుగ్ధంబుల్ సదా పోసి పెం
చినఁగానీ విష మెట్లుపోవు ఫణికిన్ శ్రీ సూర్యరాయాగ్రణీ! 83

మ. అతిలుబ్ధుం డగువాఁడు తాఁ దినమి; నన్యాక్రాంతముం జేయమిన్
సతతం బర్థము వృద్ధిఁజేసి నృపతిస్వాధీనముం జేయు, వే
గతులన్ దేనియఁ గూడఁబెట్టి వినియోగం బేమి వాటిల్లె; నీ
క్షితిలోనన్ మధుమక్షికావితతికిన్ శ్రీ సూర్యరాయాగ్రణీ! 84

మ. పరమజ్ఞానము సంగ్రహించు సుజనవ్రాతప్రభావమ్ముఁ బల్
సరసజ్ఞుం డెఱుఁగున్ ఖలప్రతతి యేచందమ్మునం గాంచు, నీ
రరుహానీకమరందవైభవము సారంగం బెఱుఁగున్ దలం
పరహిన్ దర్దుర మే మెఱుంగు; నిల శ్రీమత్సూర్యరాయాగ్రణీ!

మ. ఇల సన్మార్గుని గాంచి మెచ్చుకొనఁబో; రెవ్వారు దౌర్జన్యసం
కవితప్రాభవుఁడైనవానికి నమస్కారమ్ము గావింతు; రెం
దుల నెట్లన్నను గంగిగోవునకు మున్మ న్మార్గ, మీా నేర్తురే ?
చెలఁగన్ బెబ్బులికిన్ దొలంగినక్రియన్ శ్రీసూర్యరాయాగ్రణీ!

మ. మొనగాఁడై బవరమ్ములో రిపుగణంబున్ గూల్చు ధైర్యాత్ము నిం
గని వర్ణింతురు గాని చొచ్చి రణరంగంబందు భీతిల్లు పం
దను నిందింపరె? వీరశేఖరులు విద్యాహీనుఁ డెండెందుఁ జే
రిన సన్మానము నొందఁ డెన్నఁడు భువిన్ శ్రీసూర్యరాయాగ్రణీ!

శా. పౌరుల్ నీరసునిన్ గనుంగొనుచు దుర్వ్యాపారపారీణులై
నేరం బించుక లేకపోయినను వానిం బట్టి బాధింతు రా
నా; రోలంబము; లెందుగట్టి జిగి మాయన్ రంధ్రముల్ సేయఁగాఁ
జేరున్ సత్కవిరాజనిర్జరమణీ! శ్రీసూర్యరాయాగ్రణీ! 88

శా. అత్యాసక్తి నొనర్చుకర్జమునఁ గట్టా! చేటు వాటిల్లఁ ద
త్కృత్యం బార్యులు మాన రెన్నఁడును సత్కీర్తిం గొనంజేతు; రా
దిత్యుల్ వార్ధి మథింపఁ గల్గుగరళోద్రేకార్తికిన్ దాళుచున్
నిత్యత్వమ్మునకై సుధం గనరె? మున్ శ్రీసూర్యరాయాగ్రణీ!

శా. ఆర్యుల్ దుర్జనలోకకార్యమునకై యత్నమ్ము గావింపఁ ద
త్కార్యమ్ముల్ సమకూడ వేని ఫలితార్థం బార్యులం జేరెడిన్
ధైర్యం బూని సురాసురావళి సుధన్ సాధించిరే కాని, దో
ర్వీర్యం బూనినరాక్షసుల్ వడసిరే? శ్రీసూర్యరాయాగ్రణీ! 90

శా. శ్రీమంతుం డు బుధేంద్రుపైఁ గినిసి దాక్షిణ్యమ్ము వోనాడుచున్
సామంతమ్మున నిల్లుఁ గొల్లగొన భాస్వద్విద్యకున్ లోప మౌ
నా? మున్నున్న సరోజకేళి విధి కిన్కన్ మాన్పినన్ హంసకున్
బ్రేమన్ బాలును నీరు వేర్పఱుపదే శ్రీసూర్యరాయాగ్రణీ! 91

మ. పొరిదిన్ బూజ్యుఁ డపూజ్యుఁ డన్నను, నపూజ్యుం బూజ్యుఁ డన్నన్ సుధీ
వరులే కర్త లనంగ నేల? భువి నెవ్వా రన్న నట్లౌను; న
ల్వురునుం ద్రొక్కిన త్రాయి మ్రొక్కినను దేవుం డౌటనిక్కమ్మొకా!
స్థిరలక్ష్మీకర బంధుకంజతరణీ! శ్రీసూర్యరాయాగ్రణీ! 92

మ. గుణవంతుం డగుపుత్రకుండు గలుగన్ గోత్రమ్ము శోభిల్లు దు
ర్గుణుఁ డైనం గులమంతయుం జెడును సంకోచమ్ము లే దెందు రా
వణుఁ డాత్మీయబలమ్ము లెల్లను నశింపం జేయుచుండన్ విభీ
షణుఁ డింపొందఁడె? సర్వసౌఖ్యములు హెచ్చన్ సూర్యరాయాగ్రణీ!

మ. వసుధన్ మూర్ఖుఁడు పండితేంద్రుఁ డొకలావణ్యమ్మతోనుండ నిం
పెసఁగన్ వారిగుణమ్ము, లేర్పడును ధీ నొచంగ; నెట్లన్న వా
యసముం గోయిల చూచువారి కొకరూపై నన్ వచింపన్ సమం
జస మైనట్టి పికంబు తేటపడు భాస్వత్సూర్యరాయాగ్రణీ! 94

మ. లలితంబై తగు రూపమున్ గళయు, శీలమ్మున్, గులమ్మున్ ఫల
మ్ముల నీఁజాలునె? పూర్వజన్మసుకృతంపుం భాగ్యముల్ చక్కగా
ఫలియించున్ ధరణీరుహమ్ములబలెన్ గాలానుకూలమ్ముగాఁ
జెలువొ పీఠపురీ నృపాలకమణీ! శ్రీసూర్యరాయాగ్రణీ! 95

మ. ప్రణుతశ్రీగుణపూర్ణ రావుకులపారావారరాకాసుధా
ఘృణివై, క్రూరవిరోధియూథధరణీభృద్వజ్రధారైకధో
రణివై, సర్వకళావిశారదమనోరాజీవశోభానభో
మణివై విశ్రుతకీర్తిఁ గాంచితివి శ్రీమత్సూర్యరాయాగ్రణీ! 96

శా. శ్రీకృష్ణాబ్జభవాత్మజాప్తి నిజదాక్షిణ్యోరువిద్యావిశే
షాకారమ్ములఁ జెంద నీ విజయమున్ దాస్యమ్ము, నైశ్వర్యమున్
శ్రీకైవల్యపదానురక్తిమతి లక్ష్మీదీప్తి దోశ్శక్తియున్
శ్రీకృష్ణాబ్జభవాత్మజాప్తిఁ దనరెన్ శ్రీసూర్యరాయాగ్రణీ! 97

మ. తనరన్ గానుకగా నొసంగితి భవత్పట్టాభిషేకోత్సవ
మ్మునకున్ మున్ నవరత్నకీలితరథమ్మున్ నాఁటి కీర్తుల స
జ్జను లెల్లం గని సంతసించు కరణిన్ శార్దూలమత్తేభముల్
గొన నీ వర్షాఁడ వంచు నిచ్చితిని నీకున్ సూర్యరాయాగ్రణీ! 98

మ. విలసద్బంధుజనాబ్జమిత్ర! రసికోర్వీనాయకస్తోత్ర! మం
జులవాగ్బృందసమేతవక్త్ర! జనసంస్తుత్యార్యసన్మిత్ర! ని
ర్మలశోభాయితరమ్యగాత్ర! వరరామారాయసత్పుత్ర! కీ
ర్తిలతాంగీయుతభవ్యగోత్ర! కొనుమా! శ్రీసూర్యరాయాగ్రణీ!

మ శశికాశేశయశమ్ము నీ కెసఁగ నాచంద్రార్కమున్ శాలివా
హశకబ్రహ్మాక రేఖభూగణితసంఖ్యాంచత్ ప్లవంగాబ్దమా
ర్గశిరస్వచ్ఛచతుర్దశీందుభవవారంబందు సంపూర్తిఁ జే
సి శతం బిచ్చితిఁ బద్యరత్నము లివే! శ్రీసూర్యరాయాగ్రణీ!

కందగీతగర్భచంపకమాల

చం. సురధరధీరసుస్థిరయశోభరపూర్ణవితీర్ణికర్ణభా
స్వరచరితాన్వితా! హరికృపారసపూరమహాగభీర! భీ
కరవరజైత్రసంభృతవికస్వరతేజ! కవీంద్రభోజ! బం
ధురగుణధీమతీ! స్తుతవిధుస్మరరూపక! సూర్యభూపతీ! 101

గర్భస్థకందము

కం. ధరధీర! సుస్థిరయశో
భరపూర్ణ! వితీర్ణికర్ణ! భాస్వరచరితా!
వరజైత్రసంభృతవిక
స్వరతేజ! కవీంద్రభోజ! బంధురగుణధీ! 102

గర్భస్థ గీతము

గీ. స్థిరయశోభరపూర్ణ ! వితీర్ణికర్ణ !
హరికృపారసపూర ! మహాగభీర !
భృతవికస్వర తేజ ! కవీంద్రభోజ !
స్తుతవిధుస్మరరూపక! సూర్యభూప ! 103

శశిధ్వజబంధము

కం. శ్రీమత్ సూరికవీశ్వర
కామితసత్కార్యలోల ! కవితారామ
వ్యామోహాఖేల ! జగదభి
రామశ్రీనిలయపీఠ రాజ్యనృపాలా ! 104

చక్రధ్వజబంధము

కం. పురహారధరవరదరశర
హరదలదంబురుహసద్యశోంచితలీలా !
పరమురహారవరజాలా !
సురుచిరతరగుణవిశాల ! సూర్యనృపాలా ! 105

ఆగ్నేయాస్త్రబంధము

కం. ధర సూర్య ధైర్యశౌర్య
స్థిరకార్యస్థైర్య ! సద్రసికవరగంగా
ధరనరవరపుణ్యశ్రీ
పరిపాకఫలైకచర్య ! బహుళౌదార్యా! 106

నవరత్నమాలాబంధము

కం. పరపరనరవరదరకర !
పురహారకరసారవీర ! మురహారసార
స్థిరతరవరపురకరధర !
సురచరధరధీర ! శూర ! సూరనృపాలా ! 107



## తులాబంధము

కం. శ్రీమత్సూర్యారాయా !
సామజరిపుహారిహయాసిసత్కంబుసుధా
సోమసుధాధామబుధా
రామయశోగేయ ! హరిహరబుధవిధేయా ! 108

—గున్నేపల్లి మృత్యుంజయకవి.

## ల ఘు టీ క.

7. మానసము = హృదయమనెడి మానస సరోవరము. యానము = వాహనము, నడక.

10. సప్త సంతానములు = 1. తటాకము, 2. నిధి. 3. అగ్రహారము 4. దేవాలయము 5. వనము. 6. కృతి 7. పుత్రుఁడు.

12 సన్మార్గులు = మంచిమార్గము కలవారు, నక్షత్రమార్గము గల సూర్యులు. చక్రపాలనకళాభ్యాసుల్ = రాష్ట్రపరిపాలనవిద్యాభ్యాసము కలవారు, చక్రవాకముల రక్షించెడు సూర్యులు, మహారాజవశ్యులు = గొప్ప గొప్ప రాజులు వశ్యులుగాఁ గలవారు, చంద్రుడు వశ్యముగాఁ గల సూర్యులు సమాప్తులు = మండలాధిపతులు, సూర్యులు, లోకబాంధవులు = జగజ్జనుల కాప్తులు, సూర్యులు తేజస్వంతులు = పరాక్రమము కలవారు-దీప్తి గల సూర్యులు, పద్మనాయకులు = వెలమవారు, పద్మముల కధిపులగు సూర్యులు.

14. వేంకట శ్రీ మహీశ్వర గంగాధరరామ = వేంకట శ్రీమహీ = శోభాయుక్తమైన భూమి, ఈశ్వర = శివుఁడు, గంగా = ఆకాశగంగ, ధర = పర్వతము, రామ = పరశురాములు, సార్థము = అర్థయుక్తము.

19. శ్రమసాధ్యైకబుధావనోద్ధతి = కష్టసాధ్యమగు దేవతలను మాత్రమె రక్షించెడి యౌద్ధత్యము, గంగాధరరాజమౌళికి = శ్రీగంగాధరరామరాయలు వారనెడి రాజ శిరోభూషణమున కనియు, చంద్రశేఖరునికనియు, కుమారస్వామియై = కుమారప్రభువనెడి షణ్ముఖుఁడై, బుధులు = పండితులు, దేవతలు. మతల్లి = ప్రశస్తవాచకము.

20. 21 ప్రమదము = సంతోషము, ఏనుఁగుల కెన్నిదిచోట్లను బుట్టు దానాదిమదము. కేలుమొగుచు = నమస్కరించు, తొండమువంచు.

24. వేంకటకుమారోర్వీంద్రసూర్యాఖ్య = వేంకట = విష్ణువు, కుమార = కుమారస్వామి, ఉర్వి = భూమి, ఇంద్ర = దేవేంద్రుఁడు, సూర్య =

సూర్యుఁడు. వేంకట కుమార = మన్మథుఁడు; ఉర్వీంద్రసూరి = భూలోక బృహస్పతి.

26. భుజంగికలు = జారస్త్రీలు, ఆడు పాములు, భోగము = సుఖము, పాము పడగ, సానులు = వేశ్యలు, కొండచరియలు, కూటములు = కలయికలు, పర్వత శిఖరములు. అనుకూలనాయకునిగా = తగిన యజమానునిగా, అనుకూలుఁడను శృంగారనాయకునిగా.

45. రాజు = ఱేఁడు, చంద్రుఁడు, అప్పులు = ఋణములు, నీళ్లు. కవీంద్ర చక్రములు = కవీశ్వరుల సముదాయము. జలపక్షులలో శ్రేష్ఠములైన చక్రవాకములు. వసు = ధనము. కిరణము.

47. i హరికుమార = హరి = ఇంద్రుఁడు, కుమార = షణ్ముఖుఁడు.
ii హరి = సింహము, కు = భూమి, మార = మన్మథుఁడు.
iii యమ, చంద్ర, సూర్య, విష్ణు తనయులగు ధర్మజ, బుధ, కర్ణ, బ్రహ్మలు.

59. సరసులు = రసికులు, కొలఁకులు; కవి = కవీశ్వరుఁడు, జలపక్షి.

60. పరమార్థులు = ఉత్తములైన యాచకులు, పరమార్థము గల వారు, పురుషోత్తముఁడు = పురుష శ్రేష్ఠుఁడు, విష్ణువు.

97. శ్రీకృష్ణాజ్జభవాత్మజులు = శ్రీకృష్ణ = విష్ణువు, అజ్జభవ = బ్రహ్మ, ఆత్మజుఁడు = మన్మథుఁడు, కృష్ణ = అర్జునుఁడు, అజ్జ = చంద్రుఁడు, భవ = ఈశ్వరుఁడు, వ్యాస, శశాంక, శంకరకుమారులగు శ్రీశుక, బుధ, షణ్ముఖులు.

100. శశికాశేశయశము = చంద్రుని వంటియు, తెల్లువంటియు, శివుని వంటియు తెల్లని కీర్తి, శాలివాహ శక బ్రహ్మ కరేభ భూగణిత సంఖ్యాంచత్ ప్లవంగాబ్దము = శాలివాహన శకమున, బ్రహ్మ = 9 కర 2 ఇభ = 8, భూ 1(అంకానాం వామతో గతిః)1829 సంఖ్యలతో గూడిన ప్లవనామవత్సరము. మార్గశిర స్వచ్ఛ చతుర్థ శీందు భవవారము = మార్గశిర శుద్ధ బుధవారము.

106. పుణ్య శ్రీ పరిపాక ఫలైకచర్య = సుకృత సంపదయనెడి పరిపక్వ ఫలము యొక్క ముఖ్యమైన చర్య గలవాఁడా.

107. పరపర నరవర దరకర = పర = ఉత్కృష్టమైన, పరనరవర = శత్రురాజులకు, దరకర = భయము కలిగించువాఁడా, పురహర = రుద్రునివంటి, కరసార = చేష్ట బలిమిగల, వీర = పరాక్రమము గలవాఁడా, వర = శ్రేష్ఠమైన, పుర = పట్టణములు, కర = కప్పములు గలిగిన, ధర = భూమి గల వాఁడా!



# పిఠాపుర ప్రాచీన చరిత్ర.

పిఠాపురము తూర్పుగోదావరీ మండలము నందెగాక అఖిలాంధ్రప్రదేశము నందలి పట్టణములలోని యత్యంత ప్రాచీన నగరములలో నొకటి. దీని ప్రథమ ప్రసంస గుప్త సామ్రాజ్యాధినేత యగు సముద్రగుప్తుని గయా శాసనములోని దక్షిణ దిగ్విజయ యాత్ర వర్ణనమునందు గలదు. ఇతడు క్రీ.శ. 330–375 వఱకు గుప్త సామ్రాజ్య మేలిన మహా శౌర్య సంపన్నుడు. ఇతడు దక్షిణదేశములపై విజిగీషామనీషం దండెత్తిపోయి తూర్పు తీరముననున్న ఉత్కళ, కళింగ ఆంధ్ర ద్రవిడ భూపాలకుల నుక్కడగించి పశ్చిమ దేశముల మీదుగా జేరుకొనెను. ఈ శాసనములో నియ్యది పిష్టపురమని పేర్కొనబడెను. (1)

"కౌసలకమహేంద్ర; మహాకాన్తారక వ్యాఘ్రరాజ; కౌరాళక మణ్టరాజ; పైష్టపురక మహేంద్ర; గిరికొట్టూరక స్వామిదత్త; ఐరణ్డపల్లకదమన; కాంచేయక విష్ణుగోప; అవముక్తక నీలరాజ; వైంగేయక హస్తివర్మ; పాలక్కడోగ్రసేన; దైవరాష్ట్రక కుబేర; కౌస్థలపురక ధనంజయ; ప్రభృతి సర్వదక్షిణాపథ రాజగ్రహణ మోక్షానుగ్రహజనిత ప్రతాపోన్మిశ్ర మహాభాగ్యస్య"—

ఈ శాసన కాలము చెప్పబడకపోయినను సముద్రగుప్తుడు స్వర్గస్థుడైనపిమ్మట వ్రాయబడుటచే క్రీస్తుశకము నాల్గవ శతాబ్దము నాల్గవభాగమునందు లిఖింపబడి యుండును. నాటికే పిఠాపురమొక మండలేశ్వరుని కాణాచియై యుండెను. పిష్టపురము రాజధానిగా మహేంద్రుడను నరేంద్రుడు మండలాధిపతియై యుండెను.

సముద్రగుప్తుని గయాశాసనము తర్వాత కాలక్రమానుసారముగ బాదామి చాళుక్య ప్రభువైన రెండవ పులకేశి సత్యాశ్రయవల్లభ మహారాజు (క్రీ.శ. 611–52) ఐహోలు శాసనములో పిష్టపురదుర్గము పేర్కొనబడినది. ఈ రెండవపులకేశి భూరిపరాక్రముడు ఇతడు పూర్వదిగ్విజయమునకు వెడలి దక్షిణ కోసలదేశము నాక్రమించి

కళింగ వేంగిదేశములపై దండెత్తెను. ఈ దిగ్విజయయాత్రలో పిష్టపుర దుర్గమును వేంగీనగరమును వశపఱచుకొనెను. ఈ వృత్తాంతము పై నుదాహరింపఁబడిన శాసనములో నిట్లు వ్రాయఁబడినది. (2)

పిష్టం పిష్టపురమ్ యేనజాతమ్ దుర్గమదుర్గమమ్ ।
చిత్రం యస్యకలే ర్వృత్తమ్ దుర్గం దుర్గమదుర్గమమ్ ॥ శ్లో. 27

రెండవ పులకేశివల్లభుఁడు కళింగ వేంగిదేశములను జయించిన తరువాత నతని సోదరుడగు విష్ణువర్ధనుని కళింగ వేంగి దేశములకు రాజప్రతినిధిగా నియమించెను. ఈ విష్ణువర్ధనునికే కుబ్జవిష్ణువర్ధనుఁడని పేరు.

ఇతఁడే వేంగి కళింగరాష్ట్రములను బాలించి, స్వతంత్రుడై పూర్వచాళుక్య రాజ్యస్థాపకుఁడాయెను. ఇతనినే ప్రథమ విష్ణువర్ధనుఁడని చరిత్రకారులు పేర్కొనిరి. వేంగి దేశమును క్రీ. శ. 624-641 వఱకు పదునెనిమిది యేండ్లు నిష్కంటముగ రాజ్యపాలనమును గావించి దివంగతుఁడాయెను. ఇతని తిమ్మాపురము శాసనములో నిట్లు గలదు (3).

"శ్రీమత్పిష్టపురవాసకాత్ స్వభుజ విజితదనుతనయ మహాసే నేన మహాసేనాభివర్ధితానాం త్రిభువన మాతృభిర్మాతృభిరభిరక్షితా నాం మానవ్యస గోత్రాణాం హారితిపుత్రాణాం చలుక్యానామాన్వయ మున్నమయితు మసకృదనుభూత రణరాగస్య రణరాగస్యనష్టాసహ్యా విక్రమస్య రణవిక్రమస్య పౌత్రో విపులకీర్తిః కీర్తివర్మనః ప్రియసుతః శక్తిత్రయవశీకృత సకలమహీమండలస్య సత్యాశ్రయ వల్లభమహా రాజస్య ప్రియానుజః...... పరమభాగవతః పరమబ్రహ్మణ్యో మాతా పితృపదానుధ్యాతః శ్రీవిష్ణువర్ధనమహారాజః.

సముద్రగుప్తుని గయా శాసనము నాటికి తూర్పుతీరమున కళింగ దేశమున వేరు వేరు ప్రాంతముల, చిన్నరాజ్యముల స్థాపించుకొని

కొండఋరాజులు స్వతంత్రులై పరిపాలించుచుండిరని తెలిసికొని యున్నాము. ఇట్టి రాజ్యములలో మన పిఠాపురమునకు సంబంధించినవి రెండు. వానిలో దేవపుర రాజ్యము మొదటిది. ఈ దేవపుర (దేవరాష్ట్ర) రాజ్యము నేటి విశాఖపట్టణ మండలము నందలి సర్వసిద్ధి, శృంగవరపుకోట తాలూకా ప్రాంతములు. దీనికి ఎలమంచిలి రాజధానిగానుండెను. ఈ రాజ్యమును మాఠర కులజులగు భూపతులు పాలించుచుండిరి. ప్రకటితములైన శాసనములలో నొకటి దేవపురము నుండియు వేఱొకటి పిష్టపురము నుండియు నొసంగబడినవి. వాసిష్ఠీపుత్ర మాఠరకుల వర్మాభిధానుడగు శక్తివర్మ రాగోలు శాసనములో నతఁడు విజయపిష్ఠపురమునుండి కళింగవిషయములోని రాగోలు (శ్రీకాకుళము తాలూకాలోని రాకలువ) గ్రామమును కుమారశర్మ యను బ్రాహ్మణునికి దానముచేసెనని తెలుపఁబడినది.

"స్వస్తి విజయపిష్ఠపురాత్క లింగాధిపతి ర్మాఠరకులాలంకరిష్ణు ర్వాసిష్ఠీ పుత్త్రో మహారాజశ్రీ శక్తివర్మా కలింగ విషయే రాకలువగ్రామే ...వాసిష్ఠీపుత్ర మాఠరకులచంద్రుడగు మఱియొక వర్మాభిధానుడగు అనంతవర్మ శృంగవరపుకోట శాసనములో నతఁడా శాసనమును విజయ పిష్టపురమునుండి యొసంగినట్లు వ్రాయఁబడినది.

"ఓమ్ స్వస్తి విజయపిష్ఠపురాధిష్ఠానా మహీమండలవ్యాపిశారదేందుకరనిర్మలగుణస్య దేవరాష్ట్రాధిపతే రనేకసమరసంఘట్ట విజయాధిగతయశసో మహారాజశ్రీ గుణవర్మాణః పరమపౌత్రః శక్తిత్రయోపేతరాజ్యసంపదో వాసిష్ఠకులచంద్రమసః శ్రీ మహారాజ ప్రభంజనవర్మణః ప్రియపుత్త్రో స్వబలవిక్రమోపార్జితభూర్నయ వినయసత్త్వసంపన్నాధిగతయశో దేవద్విజాతి గురుజనోనుధ్యాన వర్ధితమహిమా పరమమహేశ్వరో మాతాపితృపదానుధ్యాతః కళింగాధిపతి శ్రీమహారాజ అనంతవర్మా."

పై విషయముల సారాంశమేమనగా పూర్వము కళింగము దక్షిణమున పిఠాపురము వఱకు వ్యాపించి యుండెనను సంగతి. ఈ వర్ణాభిధానులేలిన కళింగరాజ్యము తూర్పుతీరమున శ్రీకాకుళమునుండి పిఠాపురమువఱకుఁగల భూభాగము. వీరి రాజ్యకాలము క్రీ. శ. ఆఱవ శతాబ్దము.

మంచనకవి కేయూరబాహుచరిత్రలో కొమ్మనమంత్రిని గూర్చి వ్రాయుచు నతఁడు 'కళింగరాష్ట్రములోని యెలమంచి లాదిగా నెలమి ముప్పదిరెండు విష్ణుప్రతిష్ఠలు వెలయఁజేసెనని'' చెప్పి యున్నాఁడు. తెనాలిరామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యములోనినిగమశర్మోపాఖ్యానము నందు సభాపతి యను బ్రాహ్మణుని వర్ణించుచు నతఁడు కళింగదేశాభరణంబగు పీఠికాపురం బధిష్ఠించి సకల మహీసురవర్గ శ్రేష్ఠుండై వెలసెనని వ్రాసియున్నాఁడు.

## కొడవలి ప్రాకృత శాసనము.

పిఠాపురమునకు వాయవ్యదిక్కున తొమ్మిదిమైళ్లు దూరమున నున్న కొడవలి గ్రామమునకు మఱి రెండుమైళ్ళు దూరముననున్న చిట్టడవిలోని యొక గుట్టపై ధనందిబ్బయను దిబ్బగలదు. ఇచ్చట బౌద్ధస్తూపమొకటి యున్నది. ఈ దిబ్బకు దక్షిణమున, పడమట నాల్గు లేక ఐదు అడుగుల చతురమును, ఆరు లేక ఏడడుగుల లోతునుగల ఱాతినూతులు గలవు. ఈ ఱాతి నూతులు బౌద్ధమతము నందలి బౌద్ధభిక్షువుల యుపయోగార్థమై వినియోగింపఁబడి యుండవచ్చును. పడమటి దిక్కుననున్న యొక్క ఱాతినూతిపై బ్రాహ్మి లిపిలో ఆంధ్రరాజైన వాసిష్ఠీ పుత్రి స్వామిసిరి చండస్వాతి శాసనమున్నది. ఆ శాసనములో నతని రెండవ సంవత్సరము పరిపాలనకాలమున, ఖడ్గవలిలోని శశయను మంత్రి యొక ఖంగు (?) దాన మొనర్చెనని

తెలుపఁబడినది. ఈ శాసనకాలము క్రీ. శ. 210. అది ఇట్లుండె. ఖద్దవలియే కొండవలిగ్రామము.

1. సిద్ధం...రణో...వాసిఠ
2. పుతస-సామిసిరి
3. చండసాతిస-రజో-వచ్ఛరె
4. మ-హి-ప-ది-ఖద్దవలి
5. అనుచసమి-ఖగుధమ
6. ఠాపిత

కొండవలి శాసనప్రకారము, పిఠాపుర ప్రాంతము ఆంధ్రరాజులగు శాతవాహనుల పాలనమున నుండెనని తెలియనగును. ఇయ్యదియే యీ మండలముననున్న యత్యంత ప్రాచీనమైన శాసనము. సముద్రగుప్తుని దక్షిణదిగ్విజయ యాత్రకు నూఱేండ్లకు పూర్వమున వెలువడినది. ఆంధ్రదేశమున పిఠాపురము ప్రాంతము బౌద్ధ మతావశేషముల కాలవాలమని విశదీకరించుచున్నది.

ఈ శాసనభాష ననుసరించి సాతవాహనులు ప్రాకృతభాషనే రాజభాషగా పరిగణించిరనియు, జనసామాన్యమునందీ ప్రాంతముల నీభాషకే గౌరవము కల్గియుండెననియు నూహింపవచ్చును. దీని తర్వాత నాల్గుశతాబ్దములకుకాని తెలుగుభాషాపదములు శాసనముల కెక్కకపోవుటచే, నీకాలమున తెలుగుభాష వాడుకలో నుండెనా యను సందేహము కల్గుచున్నది.

విష్ణుకుండినులు - పిఠాపురము

శాలంకాయనులకు తర్వాత వేంగిరాజ్యమును బాలించిన విష్ణుకుండినుల కాలమున, పీఠికాపురమున నుండి విష్ణుకుండినుల సామంత మండలీకులు గోదావరీ ఉభయతటములఁ బాలించుచున్నట్లు పృథ్వీ మహారాజు పిష్టపురమున నుండి యిచ్చిన తాండివాడ తామ్రశాస

నము వలనఁ దెలియుచున్నది. ఈ మహారాజు పాగుణార విషయము లోని తాండివాడ యను గ్రామమును కొండమంచి గ్రామవాసియగు భవశర్మ యను బ్రాహ్మణునకు దానమొసంగెను. పాగుణార, లేక పానార విషయము ఇప్పటి పశ్చిమగోదావరి మండలమున నున్న భీమవరము, నరసాపురతాలూకాప్రాంతము. తూర్పుగోదావరి మండలము నందలి ప్రోలినాటివిషయమువలె,నియ్యదియుపశ్చిమగోదావరిజిల్లాలో నత్యంత ప్రాచీన దేశవిభాగములలో నొకటి. తాండివాడ శాసనము లోని కొంతభాగము నుట్టంకించుచున్నాను. (7)

శ్రీ మత్ప్రిష్టపురాత్సకలజగదవనసముద్భూతకీర్తిచారు చంద్రికా సముద్యోతితదిగంతరస్య, మహారాజరణదుర్జయస్య సూనో స్సమతిశయితశక్రవిభూతే ర్వక్రమేంద్రస్య ప్రియతనయ...శ్రీ రమ కాశ్యప గోత్రః పరమబ్రహ్మణ్యో మాతాపితృపాదానుధ్యాతః శ్రీ పృథివీ మహారాజః పాగుణారవిషయే తాండివాడగ్రామ మధివసత......కామకాయన సగోత్రాయ ... భవశర్మణే ... సర్వకరపరిహారేణా గ్రహారీకృత్య గ్రామోయ న్దత్తః''

విష్ణుకుండినుల రాజ్యము తూర్పున నాగావళినుం, గుండ్లకమ్మ నదీమధ్యముల - వ్యాపించియుండెను. తర్వాత వీరిరాజ్యము పూర్వ చాళుక్యు లాక్రమించుకొనిరి.

రాజరాజనరేంద్రుడు - నవఖండవాడ.

గణితశాస్త్రమును దెనుగుగా నొనర్చిన పావులూరి మల్లనకవి, తనతాతయగు మల్లనకు రాజరాజనరేంద్రుడు పీఠపుర పార్శ్వమున నున్న నవఖండవాడ దానమొసంగెనని తన గ్రంథమునందిట్లు వ్రాసి యున్నాడు.

ఉ. శ్రీలలనేశుఁ డంధ్రనృపశేఖరుఁడై చను రాజరాజభూ
పాలకుచేతఁ బీఠపుర పార్శ్వమున న్నవఖండవాడయన్

ప్రోలు విభూతితోఁ బడసె భూరిజనస్తుతుఁడైన సత్కళా
శీలుఁడు రాజపూజితుఁడు శివ్వనపుత్త్రుఁడు మల్లఁ డున్నతిన్.

ఈ నవఖండవాడ గ్రామమునే వెలనాటిచోడ వంశజుఁడైన మూఁడవగొంకరాజు భార్య జయాంబిక క్రీ. శ. 1186 సంవత్సరమున కుక్కుటేశ్వరస్వామికి దానమిచ్చెను.

కుంతీమాధవ దేవాలయములోని శిలా స్తంభముపైనున్న శాసనములు (8).

| సంఖ్య. | శాసనకాలము | శాసనదాత-వంశము నామము. | ఉద్దేశము |
|---|---|---|---|
| 1. | శా. శ. 1108 క్రీ. శ. 1186 | వెలనాటి మూఁడవ గొంకరాజు భార్య జయాంబిక | గంగయికొండ చోడవల నాడులోని యంతర్భాగ మగు ప్రోలునాటిలోని నవఖండవాడయను గ్రామమును దానమొసగెను. |
| 2. | శా. శ. 1117 క్రీ. శ. 1195 | కోన మండలాధిపతులైన మల్లిదేవుడు మనుమ సత్యరాజు. | గుద్దవాడ విషయములోని ఒడియూరను గ్రామము కుంతీమాధవ స్వామికి ధారవోసి యిచ్చెను. ఈ ఒడియూరే దాక్షారామముసమీపమునను న్న ఓదూరు. |
| 3. | శా. శ. 1124 క్రీ. శ. 1202 | పూర్వచాళుక్య వంశములోని బేటవిజయాదిత్యని కాలువతెరము లో పట్టాభిషిక్తుఁడైనవాఁడైన మూఁడవ విజయాదిత్యునికుమారుడుమల్లవిష్ణువర్ధనుడు. | ఇతడు కుంతీమాధవ స్వామి దేవాలయము పోలునాటిలోని గుడివాడగ్రామమును కుంతీమాధవస్వామికి ధార |

వ్రాసెను. ఈ గుడివాడ నేటి పెద్దాపురము తాలూకాలో గలదు.

4. శా. శ. 1313 క్రీ. శ. 1391 | వేమారెడ్డి | కుంతీమాధవ దేవరకు తన తల్లిదండ్రులైన కాటమరెడ్డిగారికిన్ని దొడ్డసానికిని అక్షయ సుకృతముగాను శిలాప్రాకారము నిర్మించెను.

పిఠాపురము నేలిన చిక్కోరవంశజులు.

కన్యాకుబ్జ పరిపాలకుఁడైన గోవిందచంద్రుని రాణి కుమారదేవి సారనాథ్ శాసనమువల్ల పిఠాపురమును చిక్కోర వంశ సంజాతులగు సామంతులు కొంతకాలము పరిపాలించినట్లు తెలియుచున్నది. ఆ శాసనములోని విషయముల నీ దిగువ నిచ్చుచున్నాను. వీరు నేటి వఱకు చరిత్ర కపరిచితులు.

వంశే తస్య నమ స్యపౌరుషజుషి ప్రస్ఫారకీర్త్తావపి
దాక్షిణ్యే చేన సూరాపగామదముషి ప్రత్యర్థిలక్ష్మీరుషి
వీరో వల్లభరాజనామవిదితో మాన్య స్సభూమీభుజాం
జేతాసీ త్పృథుపీఠికాపతి రతిప్రౌఢప్రతాపోదయః.
చిక్కోరవంశకుముదోదయపూర్ణచంద్రః
శ్రీ దేవరక్షిత ఇతి ప్రథితః పృథివ్యామ్
పీఠీపతి ర్గజపతే రపి రాజ్యలక్ష్మీః
లక్ష్మ్యా జగాయ జగదేకమనోహరశ్రీః
కన్యా మహణదేవస్య తస్య కన్యేవ భూభృతః ।
సా పీఠీపతినావోఢా తేన వోఢా స్వయంభువా ॥

పీఠికాధిపతియగు వల్లభరాజునకు నతని సంతతివాడగు దేవరక్షితునకు నెట్టి సంబంధము కలదో తెలియదు. ఈ దేవరక్షితుడు చిక్కోరవంశ తిలకుడని యభివర్ణింపఁబడెను. ఇతడు రాష్ట్రకూటరాజగు మహాణుని కుమార్తెయైన శంకరదేవిని వివాహమాడెను. ఈ దంపతుల కుదయించిన కుమారదేవి గహడవాల కులార్ణవ చంద్రుఁడగు గోవిందచంద్రుని పెండ్లియాడెను. శాసనములో పేర్కొనబడ్డ దేవరక్షితుడు వీరచోడుని (క్రీ. శ. 1089-1094) కాలమున పిఠాపుర దుర్గాధిపతియైయుండవచ్చునని శాసనపరిశోధకుల యభిప్రాయము.(9)

పై శాసనము ప్రకారము ఆయా వంశజుల వంశవృక్ష మీ దిగువ నిచ్చుచున్నాను. ఈ చిక్కోరవంశజుల గూర్చి యింతకన్న చరిత్రాంశములు తెలియవచ్చుటలేదు.




## పిఠాపుర మేలిన కొప్పులవంశ నాయకులు.

కాకతీయ సామ్రాజ్య మంతరించిన పిమ్మట తూర్పుతీరాంధ్రదేశమునందు గోదావరీ దక్షిణ విశాఖపట్టణమండల ప్రాంతము, పిఠాపురము రాజధానిగ కొప్పులవంశమునకుఁ జెందిన సామంతనాయకులు పరిపాలించుచున్నట్లు వారి శాసనములు తెలుపుచున్నవి. ఈ నాయకుల చరిత్ర తెలుపు ముఖ్యమైనశాసనము పిఠాపురము రాజధానిగా నేలిన కొప్పులనామయ నాయకునిచే నివ్వఁబడిన దోనేపూడి శాసనము.

ఈ శాసనములోని పీఠాపురీవర్ణనము, కొప్పుల వంశవృక్షము దిగువ నిచ్చుచున్నాను. (10)

1. అస్తి ప్రశస్త నిధిమండల మాంధ్రిఖండ
మారభ్య గౌతమనదీతట మాకళింగమ్
ఆలోక్య యద్దిషన్నార శైలశృంగ
మారోహణశ్రమఫలమ్ కలయాం బభువుః.

2. పీఠాపురీ జయతి తత్ర సమస్తదేవ
శక్తిప్రయత్నపరికల్పిత తోరణశ్రీః ।
యస్యా స్సునిర్మలనభోముకురాంతరాలే
ధత్తే సురేంద్రనగరీప్రతిబింబలీలమ్.

3. యత్ సౌధాగ్రనిషణ్ణవారవనితావక్త్రేందుమధ్యస్థితః
స్వైరం నైష విభావ్యతే హిమరుచిస్తేభ్యోవిభిన్నాకృతిః
ఏవం చేతసి శంకితేన రచితో ధాత్రా కళంకస్ఫుటమ్
నోచే దీదృశి నిర్మలే కథ మిదమ్ మాలిన్య ముజ్జృంభతే.

4. విఖ్యాతా వీరసామంతసంతతి స్తా మరంజయత్
పారిజాతప్రసూనశ్రీ రివ నందన మేదినీమ్.

5. తదన్వయే కొప్పులనాయకా ద్విభో
రభూత్ వరప్రోలయనాయకప్రభుః ।
యశో యదీయం విభవం చ విక్రమం
సనక్తు మిష్టే వచసా మహీశ్వరః.

6. తస్మా జ్జాతో జయతి విజయీ చోడమాంబాకుమారీ
సౌధశ్రేణీ మిళదరిపురీ సమ్యగాహారదానాత్
జాతప్రీతి శ్శ్రియతి సతతం యత్ర్పతాపం కృశానో
ర్నోచేచ్చేతస్సదహతిపరం వైరివామేక్షణానాం.

7. యం కాంతాః కథయంతి పుష్పవిశిఖం కల్పద్రుమమ్ యాచకో
విద్వాంసః ఫణినాయకం చ సుహృదో రాకాసుధాదీధితిమ్
దేశం యస్సదయం ప్రశాస్తి జలవా నేలానదీమాతృకమ్
యం ప్రాహుః పగమెచ్చుగండబిరుదం ప్రత్యర్థిగర్వాపహామ్.

8. అయం నయనిధి ర్వీరః శ్రీమన్నామయనాయకః
అనల్పాం ఫల మచ్ఛిన్న మాకల్పం భోగసాధనం.

పై శాసనము (క్రీ. శ. 1338, ప్రకారము నామయనాయకుడు గణపతియను విద్వాంసునకు దోనెపూడి యను గ్రామమును దానమిచ్చియుండెను. ఈ నామయ నాయకుని పుత్త్రుడు ప్రోలనాయకుని యొక్కయు నతని భార్య ముప్పమ దేవియొక్కయు రెండు శాసనములు (క్రీ. శ. 1398) సింహాచలమునఁగలవు. ఆ శాసనముల ప్రకారము ఆదులాపల్లి యను గ్రామము సింహాచల నృసింహస్వామి అమృతపళ్ళ వినియోగము నిమిత్తము వారు దానమొసంగి రని తెలియుచున్నది. ఈ శాసనములలో నీవంశజులు ప్రభువులుగనే పరిగణింపబడిరి. అచ్చటనే మఱియొక కొప్పుల కాపయనాయని శాసనమున్నది. కాని యతడు ప్రభువుగాగాని సామంతుడుగాగాని చెప్పఁబడలేదు. ఇతఁడు స్వామి కొక అఖండదీపము దానముచేసెను. ఈకాపయకును మొదట చెప్పబడిన కాపయనాయకునకు నెట్టి సంబంధము లేదనుట స్పష్టము.

కొప్పులవారి వంశవృక్షము.



బెజవాడ మల్లేశ్వరస్వామి దేవాలయములో పరమెచ్చుగండ బిరుదాంకితుడగు కొప్పుల పోలినాయకుని శాసనమొకటి (క్రీ.శ. 1264) గలదు. (12)

ఇతడు కొప్పుల కాపయనాయకుని తండ్రియై యుండవచ్చును. ఈ యూహ సరియైనదని భావించినచో వీరి వంశవృక్షము మీ దిగువ మార్పును జెందును.




దోనెపూడి శాసనములో నామయ గోదావరీకళింగ మధ్యభాగమును బాలించెననియు, సింహాచల శాసనములో కాపయ కృష్ణాగోదావరీ మధ్యభాగమును బాలించుచుండెననియు వర్ణింపబడిరి. బెజవాడ శాసనములో పోలయనాయకునికి పరమెచ్చుగండ బిరుదముకలదు. దోనెపూడి శాసనములో కాపయ పరమెచ్చుగండ, ప్రత్యర్థిగర్వనిర్వాపణ బిరుదాంకితుడు. ఈ కొప్పుల వారి పరిపాలనము కాటయవేమా

రెడ్డి తూర్పునాటి దండయాత్రతో నంతమై వీరి రాజ్యము రాజమహేంద్రివర రెడ్డి రాజ్యములో లీనమయ్యెను.

## శ్రీనాథుని పీఠికాపుర వర్ణనము.

పీఠికాపురవర్ణనము విరివిగాను, మనోహరముగాను వర్ణించిన ప్రథమాంధ్రకవి కవిసార్వభౌముడైన శ్రీనాథమహాకవి. ఆతనిచే రచింపబడిన శ్రీ భీమేశ్వరపురాణము ద్వితీయాశ్వాసమునందు వ్యాసమహర్షి తీర్థయాత్రాసందర్భమున నతడు పీఠికాపురమును దర్శించినపు డా నగర వర్ణనము గావింపబడినది.

సీ. ఏ పట్టనము ప్రోల నేలేఱు ప్రవహించు
బృథివికి ముత్యాల పేరుపోలె
మున్నూట యఱువది మూర్తి భేదములతో
విహరించు నేపీట వేల్పుపిండు
పీఠాంబచెలి యోగపీఠి హుంకృతిదుర్గ
ననిచి కాపుండు నే నగరికెలనఁ
గుంతీమహాదేవి కూర్మి మేనల్లుఁడు
మాధవుం డేపీట మరగినాడు

తే.గీ. పెద్ద గవఁకుల నే పుటభేదనమున
నెలమి నిలుచుండు వ్రీడావిహీనజఘనుఁ
డట్టి పీఠాపురముఁ జేర నరుగుదెంచెఁ
బరమశైవుండు శ్రీపరాశరసుతుండు.

తే.గీ. నారికేళంపు బుట్ట నెన్నడిమి చాయ
దళములందును బోలె సంతతముఁ బొఱు
పాటలీపుష్ప కేతకీ పరిమళములు
పొదల విలసిల్లుఁ బీఠికాపురమునందు.

సీ. ఏఁటేఁట విలిసీట నిరుగారునుం బండుఁ
బ్రాసంగు వరిచేలఁ బసిఁడిచాయఁ
బరిపాకమున వేరుపనసపండుల తావి
యిందిందిరములకు విందుసేయు
వేఁబోఁకఁ బొలుపారు వింధ్యాద్రిపవనంబు
పోఁకపువ్వుల తావి బుక్కిలించు
వేశ్యవాటికలందు విహరించు వలరాజు
ననయంబుఁ జెఱకువిల్లును ధరించు

తే.గీ. నారదంబులవలపు పొన్నలఁ బెనంగి
విచికిలామోదములతోడ వియ్యమందుఁ
బాటలీపుష్ప కేతకీపరిమళములు
పొదల విలసిల్లుఁ బీఠికాపురమునందు.

వ.... కుంతీమాధవదేవునకు విశ్రాంతిప్రదేశంబును, హుంకారిణీ మహాదేవికి విహారసంకేతభవనంబును, బీఠాంబికాలక్ష్మి కాటకూటంబును, హేలాసానికి హాలాపానగోష్ఠీమంటపంబును, ననం దగి భూతభేతాళడాకినీప్రేతరంకభైరవవ్రాతనిర్మిత పాత్రికారవప్రహట్టకుట్టిమం బగు పిఠాపట్టనంబుఁ బ్రవేశించిరంత

సీ. త్రిపుసపుష్పలతామతల్లీపటోలికా
కారవేల్లకుడుంగకముల తోడఁ
గూష్మాండవృంతాకకోలకచించికా
కాయమానకదంబకములతోడ
శాకినీమూలకచ్ఛత్రాకసారణీ
ధాన్యాకమేఘనాదములతోడఁ
బిప్పల్యుపోదకీ పీతపలాండుక
వాస్తుశాఖాకోటివాటితోడ

తే.గీ. రాజనలతోడ శృంగ బేరములతోడఁ
జిఱుగడఁపు బెండలముతోడఁ జేమతోడ
నొప్పు నాలుగు పొలములం దుపవనములు
భువనసారము పీఠికాపురవరమున.

ఉ. హాటకపానపాత్రియును నారఁగఁబండిన మాతులుంగమున్
ఖేటము లోహదండము నొగిం ధరియించి పురోపకంఠశృం
గాటకభూమిభాగమునఁ గాపురముండెడు పీఠికాంబకుం
గైటభదైత్యవైరి ప్రియకాంతకు మొక్కెద నతండు భక్తితోన్.

శా. అంతర్వాణి భజించెఁ గుక్కుటపతిన్ హాలాహలగ్రీవునిన్
శాంతస్వాంతుఁడు గొల్చె దానవచమూసంహారిణిఁ హుంకృతిన్
జింతించెఁ మునిసార్వభౌముఁడు పురక్షేత్రాధిదైవంబులం
గుంతీమాధవుఁ బూజచేసె ఋషివాక్పుష్పోపహారంబులన్.

తే.గీ. హేల నేలాతరంగణీ కూలనిలయ
బాల బారారుణాశోకపల్లవోష్ఠి
వేల వేలావనోద్దేశవిహృతిలోల
నేల నేలాయనక పాడె ఋషివరుండు.

## పిఠాపురము పుత్తర్ మసీదు స్తంభములపైనున్న తెలుగు శాసనములు.

| సంఖ్య | శాసన కాలము | శాసన దాత-వంశము నామము. | ఉద్దేశము |
|---|---|---|---|
| 1. | ప్రమాది సంవ॥ర భాద్రపద కార్తీక మాసములు శా. శ. 1355 (క్రీ.శ. 1433) | వాసిరెడ్డి పోతినేండు | కుంతీమాధవ దేవర గుడిలో పెద్దమండపము గట్టించెను. అల్లాడ రెడ్డి కుమారులైన వీరారెడ్డి గారికిన్నీ, వేమారెడ్డిగారి కిన్ని అక్షయసుకృతంగా చేయించినధర్మము. |

| | | | |
|---|---|---|---|
| 2. | ... | ... | మొదటి శాసనములోని శాసనదాతయే తాటి తోఁట నాటించెను. చూడుడు మూఁడవ శాసనము. "సకళదమ్మాక్షలకున్ను తాటివృక్షమే మూలము" |
| 3. | ... | వేమభూపాలకారుణ్య విమలపాత్రుడు పోత కుమార చంద్రుడు. (మొదటిశాసనములో పేర్కొనబడ్డదాతయే) | ఇది పద్యశాసనము :- కుక్కుటేశ్వరస్వామి ఆలయములో నైదుప్రతిష్ఠలు చేయించెను. కుంతీమాధవదేవ నగరికి సున్నము చేయించెను. లక్ష్మీదేవమ్మను ప్రతిష్ఠించి, ఆవగరు కట్టించెను. నాలుగు లక్షల అఱువై వేలతాళ్లు నాటించెను. |
| 4. | శా. శ. 1352 సాధారణ సం॥ర (క్రీ.శ. 1430) | ... | లక్ష్మీదేవమ్మనగరు కట్టించి ప్రతిష్ఠ చేయించెను. శ్రీబృందావనము తోఁట పెట్టించెను. |
| 5. | శా.శ. 1352 సాధారణసం॥ర | వాసిరెడ్డి పోతినీడు అతనిభార్యపోతసాని కుమారుడు వేమయ్య. | వేమయ్య తనతల్లిదండ్రులకు అక్షయ సుకృతముగా, దేవరకు శ్రీబృందావనము పెట్టించెను. |

మసీదు స్తంభములపై నున్న శాసనములు వాసిరెడ్డి పోతినీడు నతని కుమారుడు వేమయ్యయు వ్రాయించినవి. ఇతడు వేమవీరభద్రా రెడ్లకు సామంతుడై యుండి, పిఠాపురములోని కుంతీమాధవ, కుక్కు టేశ్వరాలయములలో నూతనమంటపములు, దేవతాప్రతిష్ఠలు గావించియుండెను. తా నేప్రాంతమునందలివాడో చెప్పలేదు. ఇతడు కమ్మకులజుడై రెడ్లసామంతుడై యుండెను. ఈ శాసనస్తంభములు కుంతీమాధవ దేవాలయమునకు జెందియుండి, మహమ్మదీయు లీప్రాంత మును దాడిసల్పినపుడు దేవాలయముల భగ్న మొనర్చి, వారు నిర్మిం చిన మసీదునకు స్తంభములుగా వినియోగించియుందురు.

వేమ వీరభద్రారెడ్డి శాసనములు క్రీ.శ. 1444 వఱకు గాన్పిం చుచున్నవి. తర్వాత కపిలేశ్వరగజపతి దక్షిణ కళింగముపై దాడివెడలి యీ ప్రాంతము నాక్రమించెను. అనగా రెడ్డిరాజ్యము అంతరించి గజపతుల రాజ్యము ప్రారంభమయ్యెను. పిఠాపురదుర్గము గజపతులవశమై రాజమహేంద్రవర రాజ్యములో గలసెను. పెద్దాపురము తాలూకా లోని తిరుపతి శ్రీరంగరాయ దేవాలయము నందలి యొక శాసనము వల్ల కపిలేశ్వరమహారాయల సామంతుడైన రఘుదేవనరేంద్రుడు క్రీ.శ. 1458 సంవత్సరమున రాజమహేంద్రవర రాజ్యమును బాలించు చుండె నని తెలియుచున్నది.

కవిసార్వభౌముడు కూచిమంచి తిమ్మకవి
పీఠికాపుర వర్ణనము

పదునెనిమిదవశతాబ్దమునకు జీవించియుండి, పీఠికాపుర సంస్థా నములోని కందరాడ గ్రామనివాసియై, పీఠికాపుర సంస్థానాధిపతియగు రావు నీలాద్రి మాధవరాయ నృపతిచేత కవిసార్వభౌమ బిరుదమందిన కూచిమంచి తిమ్మకవి తాను రచించిన రుక్మిణీపరిణయకావ్యములో పీఠికాపురము నిట్లు వర్ణించెను.

సీ॥ చక్రవాళాహార్య జలధితుల్యోన్నత
ప్రాకార పరిఖా విరాజితంబు
సాంద్రముక్తా సౌధ చంద్రశాలానేక
భర్మనిర్మిత హర్మ్యశర్మదంబు
కరిసైంధవాందోళికా ధేనుధనధాన్య
వనదేవ గృహసరో వర్ణితంబు
విమలచాతుర్వర్ణ్య విద్యత్కవిశ్రేష్ఠ
భటనటామాత్య విస్ఫారితంబు

తే॥ రాజమాహేంద్రవరదుర్గ రాజ్య భూరి
భారసంభరణా శ్రాంత భాసమాన
రావు మాధవ నృప పరిరక్షితంబు
భోగనికరంబు పీఠికాపురవరంబు.

ఈ తిమ్మకవి సోదరుడైన జగ్గకవి తానురచించిన సుభద్రా పరిణయ కావ్యములోఁ దన యగ్రజుడు కుక్కుటేశ్వర కృపాంకూర లబ్ధసత్కవితామహాసామ్రాజ్యభార ధౌరేయుఁడని వర్ణించియున్నాడు.

సీ॥ కౌండిన్యగోత్ర విఖ్యాతునిఁ గూచిమం
చ్యన్వయాంభోధి నీహారకరుని
గంగనమంత్రిశేఖరునకు నంగనా
మణియగు లచ్చమాంబకును సుతుని
బహుకావ్య నిర్మాణ బంధుర ప్రతిభునిఁ
గుక్కుటేశ్వర కృపాంకూరలబ్ధ
సత్కవితా మహాసామ్రాజ్య భారధౌ
రేయుని బుధజన ప్రియచరితుని

సీ॥ ఇందులూరి లింగనారాధ్య దేశికేంద్ర
దత్త మాహేశ్వరాచార్య వృత్తిరతుని
గండరాడ ఘనగ్రామ మందిరుని మ
దగ్రజుని తిమ్మకవిరాజు నభినుతింతు.

కాకతీయులు – పిఠాపురము.

కాకతీయుల పరిపాలన కాలమున పిఠాపురమెవరి యధీనమం దుండెనో తెలుపుట కాధారములు లేవు. కాకతిగణపతి దేవుని కాలమున రేచెర్లరుద్రునకు ప్రధానియైన రాజనాయకుడు కళింగమును జయించి, దాక్షారామ భీమేశ్వరున కఖండదీపము నిల్పెనని, ఉప్పరపల్లి శాసనము వలనఁ దెలియుచున్నది. కొలని గణపతిదేవుని శివయోగ సార పీఠికలో కాకతి గణపతిదేవుని ప్రధానమంత్రియైన ఇందులూరి సోమమంత్రి ఓరుగంటికి తూర్పుభాగమున నున్న దేశముల జయించుట యేకాక, కళింగభూములను సహితము జయించినట్లు వ్రాయబడి యున్నది. రుద్రమదేవి రాజబంధువులనఁదగిన ఇందులూరి అన్నయదేవుడు, కొలనిరుద్రదేవుడు, ఆ కావ్య పీఠికలోనే వారిరువురును ఏక శిలానగర సింహాచలమధ్య భూభాగభరమును దాల్చిరని వర్ణింపఁబడిరి. కాకతీయ సామ్రాజ్య విచ్ఛిన్నకాలము తూర్పుతీరములో మంత్రిల వశమున నుండెనని చెప్పవచ్చును.

ఏలేఱు–ఏలానది

దీనికి పురాణములో కుమారనది యనియు, ఆంధ్రకావ్యములలో కొమరే అనియు, ఏలానది యనియు, నేలే అనియు నామములు. భీమేశ్వరపురాణములో కొమరేటికి కుమారవద్యాక అని మూలము.

శ్రీనాథుడు భీమేశ్వర పురాణములో నేలేఱును బ్రశంసించి యున్నాడు

(1) పిఠాపురవర్ణనములో :–

సీ॥ ఏ పట్టణము ప్రోల నేలేఁబు ప్రవహించు
బృథివికి ముత్తాలపేరువోలె

(2) తే॥ నారికేళంపు బుట్ట నెన్నడిమిచాయ
దళములందును బోలె సంతతముఁ బాఱు
వేణికా పారణులయందు విస్మయముగ
జగతి నెక్కుడి వేలేటి సాటినదులు.

(3) కుమారారామ వర్ణనములో :-

సీ. కొమరేటి కల్యాణ కమల షండంబుల
సౌరభ్య భారంబు సంతరించి...

... ... ... ... ...

ఆంధ్ర శాసనములనుండి కొన్ని యుదాహరణముల నిచ్చుచున్నాను.

(1) అల్లాడ భూపాలుని కుమారుండు వేమారెడ్డింగారి దేవులు జియ్యమల్లసానమ్మ... కుమారారామ చాళుక్య భీమేశ్వర స్థాన సమ్మతిని భీమవరము ఉత్తరసమీపాన కుమారనది”

(2) “పాలూరి వీరమనాయని కుమారుడు, యఱమనాయనిగారు యేలానది వల్లనుండి యెలుతుర్తినది త్రవ్వించి గోవాడ పొలిమేరలోంగాను తెచ్చి గురుగడ్డం గలిపి...”

శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి ప్రణీతమైన రావువంశ ముక్తావళినుండి ఏలానదీవర్ణన పద్యముల రెంటి నీదిగువ నిచ్చుచున్నాను.

మ॥ పరమోత్కృష్టత నొక్కపుణ్యనది శుంభద్గాన సంరంభ బం
భర సంభావిత భూరిసౌరభ లసత్సంకేజ పాళీమనో
హరమై పీఠపురోపకంఠమున నేలాభిఖ్యచే నొప్పు న
ప్పురలక్ష్మీసతి దాల్చినట్టి సొబగా ముత్యాలహారంబునాన్.

సీ. పరిపక్వ ఫలగుచ్ఛ భరనమ్రకదళికా
వననికాయంబు లేవంక గనినఁ
బికకీరసంచార విస్ఫార సహకార
తరుసార మేదుర నరసి చూడ
మధురస మధురజా మధుర సారతరేక్షు
వనికాగణంబులే పజ్జఁగనిన
సముదగ్రలాంగలీ క్రముక భూమీరుహాళీ
ప్రాకారము లేవైపున నరసి చూడఁ

తే. జారుకేదార కోదారసస్య సహిత
సుమహిత క్షేత్రచయము లెచ్చోటఁ గనినఁ
బ్రవిమల స్వాదుతర భూరివారిపూర
భాస్వదేలా మహానదీ ప్రాంతసీమ.

## ప్రోలునాడు – పిఠాపురము.

ప్రోలునాడు తూర్పుగోదావరి మండలములోని ప్రాచీనమైన నాడులలో నొక్కటి. ఈనాడు నేటికిని ప్రసిద్ధి వహించియున్నది. ప్రోలినాటిని పేర్కొన్న అత్యంత ప్రాచీనమైన శాసనము మూడవ విష్ణువర్ధనుని ఈపూరు శాసనము. దానిలో నిట్లున్నది.

"పొల్నాడు విషయే జల యూరునామ గ్రామే పశ్చిమదిశాయాం ఎలియేఱునదీ పశ్చిమతః ప్రభాకరక్షేత్రోత్తరతః కాకండివాడ క్షేత్రపూర్వతః..."

శాసనములో పేర్కొనబడిన జలయూరు నేటి పిఠాపురముతాలూకాలోని జల్లూరు. కాకండివాడయే కాకినాడ; ఎలియేఱే ఏలేరు.

పిఠాపుర శాసనములందు నవఖండవాడయు, గుడివాడయు బోలినాటిలోనివని యిదివఱకే సూచింపబడినవి. నవఖండవాడ పిఠా

పుర సమీపములోని నవఖండవాడయే; గుడివాడ నేటి పెద్దాపురము తాలూకాలోని గుడివాడ యను గ్రామము.

కాకినాడ తాలూకాలోని సర్పవర, చాళుక్యభీమవర గ్రామములలోని దేవాలయ శాసనములందు ప్రోలునాడు, అందలి గ్రామములు చెప్పబడినవి. రామచంద్రపురము తాలూకా దక్షారామ భీమేశ్వరాలయములోని కొన్ని శాసనములందు ప్రోలునాడు, అందలి గ్రామములు పేర్కొనబడినవి.

వీరచోడుని పిఠాపుర శాసనమునందుమాత్రము ప్రోలినాటిలోని వని దాదాపు ఇరవై గ్రామములు చెప్పబడినవి. వానిలోని గ్రామములు, నేటి ఆయా గ్రామముల నామములు గొన్నిటి నీ దిగువ పట్టికలో నిచ్చుచున్నాను.

| శాసనములోని గ్రామనామము. | నేటి గ్రామనామము. |
| --- | --- |
| పొన్నవాడ | పొన్నాడ |
| మల్లప్రోలు | మల్లవరము |
| కొల్లిప్రోలు | గొల్లప్రోలు |
| బెండపూండి | బెండపూడి |
| సింగవిక్రము | శృంగవృక్షము |
| దొణ్డెంగి | తొండంగి |
| దుర్గవాడ | దుర్గాడ |
| భీమాపురము | భీమవరము |
| చేంబ్రోలు | చేబ్రోలు |

ప్రోలునాడను నది, నేటి పిఠాపురము తాలూకా, కాకినాడ, తుని, పెద్దాపురము తాలూకాలలోని కొంతభాగమై యున్నది. దీనిని గూర్చి "ప్రాచీనాంధ్రచారిత్రక భూగోళమును" జదువనగును.

## పంచమాధవులు.

పీఠాపురము లోని కుంతీమాధవదేవాలయము భరతఖండములో ప్రసిద్ధిగాంచిన పంచమాధవ దేవాలయములలో నొకటి. కడమ నాల్గును— కాశీలోని బిందుమాధవ; ప్రయాగలోని వేణీమాధవ, పద్మనాభము (విశాఖపట్టణము జిల్లా) లోని సుందరమాధవ, రామేశ్వరములోని సేతూమాధవ దేవాలయములు.

## హుంకారిణీదేవి - (పురుహూతికాదేవి)

శ్రీ మహాదేవి పదునెనిమిది మూర్తులను ధరించి, పదునెనిమిది పట్టణములలో వెలసి యున్నదని యైతిహ్యము. ఆ పదునెనిమిది పట్టణములలో పీఠాపుర మొకటి.

1. పురుహూతికాదేవి (పీఠాపురము)
2 శాంకరీదేవి (సింహళము)
3. కామాక్షీదేవి (కంచి)
4. ప్రద్యుమ్నా దేవి (శృంగారదీవి)
5. చాముండాదేవి (క్రౌంచీపట్టణము)
6. జోగులాంబాదేవి (అలంపురము)
7. భ్రమరాంబికాదేవి (శ్రీశైలము)
8. మహాలక్ష్మిదేవి (కొల్లాపురము)
9. మీనాక్షీదేవి (మధుర)
10. మహాకాళికాదేవి (ఉజ్జయిని)
11. గిరిజాదేవి (జాజిపురము)
12. మాణిక్యాంబాదేవి (దక్షారామము)
13. కామరూపాదేవి (హరిక్షేత్రము)
14. మాధవేశ్వరీదేవి (ప్రయాగ)
15. వైష్ణవీదేవి (జ్వాలాపురము)

16. మాంగల్యగౌరీదేవి (గయ)
17. విశాలాక్షీదేవి (కాశి)
18. సరస్వతీదేవి (కాశ్మీరము)

ఈ హుంకారిణీదేవి విగ్రహ మిప్పుడు గానరాదు. శ్రీరావు వంశ ముక్తావళిలో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు పిఠాపురమును 'విఖ్యాతాష్టాదశపీఠాధిరాజంబు' అని వర్ణించియున్నారు.

"లంకాయాం శాంకరీదేవీ కామాక్షీ కాంచికాపురే
ప్రద్యుమ్నే శృంఖలా దేవీ చాముండా క్రౌంచపట్టణే
అలంపుర్యాం జోగులాంబా శ్రీశైలే భ్రమరాంబికా
కోలపుర్యాం మహాలక్ష్మీ ర్మాహుర్యా మేకవీరికా
ఉజ్జయిన్యాం మహాకాళీ పీఠాయాం పురుహూతికా ।
ఓఢ్యాణ్యాం గిరిజా దేవీ మాణిక్యా దక్షవాటకే ।
హరిక్షేత్రే కామరూపీ ప్రయాగే మాధవేశ్వరీ
జ్వాలాయాం వైష్ణవీ దేవీ గయామాంగళ్యగౌరికా ।
వారాణస్యాం విశాలాక్షీ కాశ్మీరేతు సరస్వతీ. ॥"

కుక్కుటేశ్వరస్వామి - కవిసార్వభౌముడు
కూచిమంచి తిమ్మకవి.

కుక్కుటేశ్వరస్వామికి ఆంధ్రసారస్వతమునందు ఆచంద్రార్కస్థానము గల్పించిన ధన్యమూర్తి తిమ్మకవి. ఇతడు తన గ్రంథము లన్నింటిని ఈశ్వరాంకితమును జేసి, తాను కుక్కుటేశ్వర కృపాలబ్ధ వికతాధారేయుడనని చెప్పుకొన్నాడు. అతని గ్రంథములనుండి కుక్కుటేశ్వరుని స్తుతించిన కొన్నిపద్యముల నీ దిగువ నిచ్చుచున్నాను.

కం. శ్రీరుచిరపీఠనగరా
గార ! శుభాకార ! భక్తగుణమందారా !

సూరిజనాధార ! సమి
ద్ధీరా ! వరతామ్రమూడ దివ్యశరీరా !
(రసికజనమనోభిరామము)

చం. రతిపతిదర్పభంగ ! మునిరాజమనస్సరసీజభృంగ ! సం
తతకరుణాంతరంగ ! నిజదాసజనావనసంగ ! పద్మినీ
హితసితరుగ్రథాంగ ! వలయీకృతపర్వతశృంగ ! విస్ఫుర
త్కుతలశతాంగ ! పీఠపురకుక్కుటలింగ ! భుజంగమాంగదా !
(సర్వలక్షణసార సంగ్రహము)

సీ. శ్రీకరధవళాంగ ! శ్రితజనావనసంగ !
కరనివిష్టకురంగ ! పురవిభంగ !
తరణిచంద్రరథాంగ ! ధరణీతలశతాంగ !
విదళితానంగ ! గోవృషతురంగ !
వలయీకృతభుజంగ ! విలసితఖట్వాంగ !
ధృతనభోగంగ ! వార్నిధినిషంగ !
మునిమనోంబుజభృంగ ! ఘనసమరాభంగ !
అతిదయాపాంగ ! పుణ్యాంతరంగ !

గీ. శైలజాసంగ ! నీ కొకశతక మిపుడు
గూర్చి యర్పింతుఁ గైకొమ్ము, కోర్కు లిమ్ము
భూనుతవిలాస ! పీఠికాపురనివాస !
కుముదహితకోటిసంకాశ ! కుక్కుటేశ !
(కుక్కుటేశ్వర శతకము)

పిఠాపురము - బౌద్ధస్తూపము.

ఆంధ్రప్రదేశము జైన బౌద్ధమతావశేషములకు నివేశము. అందును తూర్పుతీరాంధ్రము వీనికి ప్రధానక్షేత్రము. శ్రీకాకుళము జిల్లాలోని సాలిహుండము; విశాఖపట్టణ మండలములోని ఆదుఱ్ఱు,

కాపవరము, రంప-ఎఱ్ఱంపాలెము; కోరుకొండ, రాజమహేంద్రవరము; పడమటిగోదావరి మండలములోని గుంటుపల్లి; కృష్ణామండలములోని గుడివాడ, జగ్గయ్యపేట, అల్లూరు; గుంటూరు మండలములోని భట్టిప్రోలు, నాగార్జునునికొండ, అమరావతి; నెల్లూరిమండలములలోని బుద్ధపాడు, మొదలగునవి ప్రసిద్ధ ప్రాచీన బౌద్ధక్షేత్రములు. పంచారామములనబడు కుమారారామ, దక్షారామ, సోమారామ, క్షీరారామ, అమరారామములు ప్రాచీన బౌద్ధసంఘారామములై యుండునని చరిత్రకారుల యూహ.

క్రీ. శ. 1932 సంవత్సరములో భారతప్రభుత్వము వారి పురాతన స్థల ఖనన పరిశోధక శాఖవారు పిఠాపురమువచ్చి, యచ్చటనొక విద్యావంతుడగు భూస్వామి సూచనవల్ల, వారిపొలములలో బౌద్ధస్తూపము కలదని కనిపెట్టిరి. ఇది పిఠాపురమున కీశాన్యమున నొక మైలుదూరమున గలదు. ఈస్తూపను పరిసరములందు ప్రాచీన మృణ్మయపాత్రశకలములును, పెద్దపెద్ద ఇటుకలును, పెంకులును గానవచ్చినవి. ఇది పదియడుగుల యెత్తును, వలయాకారముగ నెనుబది యడుగుల చుట్టుకొలతయును గల్గియున్నది. తర్వాత ప్రభుత్వము వారు దీనిని పరిశోధనముగావించుట కుపేక్షించినారు. (15)

కుక్కుటేశ్వరుడు - కుక్కుట జాతకకథ.

శ్రీ భావరాజు వేంకటకృష్ణారావుగారు ఆంధ్రచారిత్రక పరిశోధక మండలివారి త్రైమాసక పత్రిక యందొక దానిలో రాజమహేంద్రవరము నందలి బౌద్ధశిథిలమునుగూర్చి వ్రాయుచుఁ బ్రసంగవశమున పిఠాపురనామోత్పత్తిని గూర్చి చర్చించిరి. దీనిప్రాచీననామము పిట్టపురమైయుండుననియు, దీనికా పేరు బౌద్ధజాతక కథల యందుగల కుక్కుటజాతకము నుండి కల్గియుండుననియు వారు భావించిరి. వారా జాతకకథ నిచ్చి యుండలేదు. చేజర్లలోని కపోతేశ్వరుడు, నాగార్జునుని

కొండలోని దూబకుట్ట, రాజమహేంద్రవరములోని సారంగధర మెట్ట యిట్టి జాతకకథలకుఁ జెందినవే యని వారి యభిప్రాయము. (16)

శ్రీ కృష్ణరావుగారు కుక్కుట జాతకకథను బేర్కొనలేదు. జాతకకథలలో రెండు కుక్కుట జాతకకథలుగలవు. జాతకకథలు బుద్ధుని పూర్వజన్మవృత్తాంతమును దెలుపునవి. ఆ కథల నుదాహరించుట యప్రస్తుతవిషయము.

కన్యాకుబ్జము నేలిన హర్షవర్ధనుని కాలమున (క్రీ.శ. 600-654) యువాన్-చ్వాంగు అను చైనా దేశయాత్రికుఁడు, ఉత్తర దక్షిణ హిందూస్థానములఁ బర్యటించి, తాను చూచిన, విన్న, విషయముల గ్రంథస్థము గావించియున్నాడు. ఇతని కాలమున పాటలీపుత్ర నగరమున కాగ్నేయమున నొక కుక్కుటవిహారము, లేక సంఘారామ ముండెననియు, దానిని అశోక చక్రవర్తి నిర్మించెననియుఁ, దానిని జూచినప్పటికి శిథిలావస్థయుండెననియు వ్రాసినాడు. గౌతమబుద్ధుని కాలమున సహితము కౌశాంబీనగర సమీపమున నొక కుక్కుట సంఘారామ ముండెనని చరిత్రవలనఁ దెలియుచున్నది.

శ్రీ కృష్ణరావుగా రూహించినటుల నీ కుక్కుటేశ్వర క్షేత్రమున కాపేరు కుక్కుట జాతకకథ ననుసరించి వచ్చియుండెననుటకుఁ బ్రబల సాక్ష్య ముండినగాని చెప్పుటకు వీలులేదు. ఇక్కడ నొక బౌద్ధసంఘారామ ముండవచ్చుననుటకు పిఠాపురము నందున్న బౌద్ధస్థాపమే ప్రమాణము. అట్టి సంఘారామమునకు కుక్కుట విహారమను నామముండెనని చెప్పుటకుఁ దార్కాణమేమియును లేదు. ఇట్టి విహారములేకాక బ్రాహ్మణమతమునకుఁ జెందిన దేవాలయతనముల సహితము దాను జూచితినని యువాన్-చ్వాంగె వ్రాసియున్నాడు. త్రాడును బొంగరములేని యీ చర్చ విరమించుటయే సమంజసము.

1. డాక్టరు ప్లీటుదొరవారి గుప్తరాజుల శాసనములు.
2. ఎపిగ్రాఫియా-ఇండికా సంపుటము-ఆఱు పుట 11
3. ఎపిగ్రాఫియా-ఇండికా సంపుటము-తొమ్మిది. పుట 319
4. ఎపిగ్రాఫియా-ఇండికా సంపుటము-పండ్రెండు. పుట 1-3
5. ఎపిగ్రాఫియా-ఇండికా సంపుటము-ఇరువదిమూడు. పుట 56
6. ఎపిగ్రాఫియా-ఇండికా సంపుటము-పదునెనిమిది. పుట 318
7. భారతి-యువసంవత్సర భాద్రపదమాస సంచిక. పుటలు 495-501
8. ఎపిగ్రాఫియా-ఇండికా సంపుటము-నాల్గు. సంఖ్యలు 4: 10; 33; 47-ఎ.
9. ఎపిగ్రాఫియా-ఇండికా సంపుటము-తొమ్మిది. పుటలు 319-328
10. ఎపిగ్రాఫియా-ఇండికా సంపుటము-నాల్గు. సంఖ్య 51
11. దక్షిణహిందూశాసన సంపుటము-ఆఱు. శాసన సంఖ్యలు 821-822 924
12. దక్షిణహిందూశాసన సంపుటము-నాల్గు. సంఖ్య 765
13. దక్షిణహిందూశాసన సంపుటము-ఆఱు. సంఖ్య 673-677
14. ప్రాచీనాంధ్రచారిత్రిక భూగోళము. పుటలు 40-41, 234-236
15. పురాతనస్థల ఖనన పరిశోధక శాఖాధ్యక్షుని నివేదిక. సంవత్సరము 1930-34
16. ఆంధ్ర చారిత్రిక పరిశోధక మండలివారి త్రైమాసిక పత్రిక సంపుటము-పండ్రెండు పుటలు 17-20

— కుందూరి ఈశ్వరదత్తు.



## శివపంచస్తవములు :- వాని వైశిష్ట్యము

కలియుగమున మానవకోటి సంతరణమునకుఁ బ్రధానోపకరణము భగవన్నామస్మరణమె యని చిరకాలమునుండి పెద్దలు వచించుచున్నారు. పరబ్రహ్మము వేదములలో అగ్ని, రుద్ర, భర్గ, శివేత్యాది నామములతో వాచ్యమయినను రానురానది మన భారతీయ వాఙ్మయములో "శ్వోశ్రేయసం శివం, భద్రం,కల్యాణం మంగళం,శుభమ్" అను నిఘంటూక్తి ననుసరించి మంగళప్రదము సులభోచ్చారణసంయుతమునగు "శివ" యనెడి యక్షరద్వయమున నిక్షిప్తమయినది. "శివస్య ఇదం శైవమ్ అని శివసంబంధమయినది శైవమని చెప్పఁబడినది. భరతదేశమున గీర్వాణ భాషలో శైవవాఙ్మయ మపారముగ విస్తరించియున్నది. శ్రుతులు, స్మృతులు, పురాణములు శివాగమములు శివమహిమను నఖండముగఁ బ్రతిపాదించును. వ్యాసప్రోక్తము లని చెప్పఁబడు అష్టాదశపురాణములలోఁ బది శైవపురాణములే.

"వరుస నెనిమిది యన్యదేవతలఁ జెప్పఁ బడిపురాణంబు లీశ్వరుఁ బ్రస్తుతించుఁ జంద్రమౌళి ప్రభావంబు సమధికముగఁ శ్రుతుల యట్ల పురాణ సంహితలు నొడువు" అని శ్రీనాథమహాకవి కాశీఖండావతారికయందు వక్కాణించియున్నాఁడు. దిగంబరత్వము, భస్మోద్ధూళనము, జటాజూటధారణము, త్రినేత్రములు, సర్పభూషణములు, త్రిశూలధారణము, వృషభవాహనము, శ్మశానావాసము, ప్రమథగణ పరివేష్టనము, మున్నగు శివచిహ్నములన్నియు నమేయమగు శివమహామహిమమునకు ద్యోతకములుగనున్నవి. భారతీయ వాఙ్మయ మహార్ణవమున ననాదినుండియు శివశక్తి మహిమములు ద్రవరూపమున వికీర్ణములయియున్నవి. "ఆనంద సాగరశ్శంభు స్తచ్ఛక్తిర్ద్రవ ఉచ్యతే। శీకరా ఇవసాముద్రా స్తద్దానందకణా గణాః (నరహరిస్వామి బోధసారము")

"యద్ధర్మనామృత సుఖానుభవేన ధన్యా! నేత్రోత్పలాని

చిరమర్ధ నిమీలితాని దృజ్మార్గగోచర రవీందుకరప్రసంగ భంగ్యేన బిభ్రతి శివశ్శివదస్స్వహో స్తు (జగద్ధరభట్టు స్తుతికుసుమాంజలి.)

శివప్రదుఁడగు శివునిఁ గూర్చిన స్తవములు స్తోత్రములు మన దేశమున మొదటి నుండియు నసంఖ్యాకములుగ బహుముఖములుగ వెలసియున్నను వానిలో నైదు మాత్రమే పుణ్యవిశేషముననో పురాతన కాలమునుండి శివపంచస్తవములను గణనగాంచి ప్రసిద్ధినొంది యున్నవి. అవి మహిమ్న, మల్హణ, మలయరాజ, అనామయ, హలాయుధములనునవి. వాని కర్తలు వరుసగ పుష్పదంత, మల్హణ, మలయరాజ, దండి, హలాయుధనామాంకితులు. శంకరాచార్యులు శివానందలహరి మున్నగు శివస్తవము లెన్నియో రచించియున్నారు. వానిలో వేనికి పంచస్తవములలోఁ జేరు భాగ్యము పట్టలేదు-శివభక్తుల దృష్టిలో భక్త్యతిశయము, శక్తి విశిష్టాద్వైత సిద్ధాంతము, శైవత్వము అను మూఁడింటికిఁ బ్రాధాన్యముండుటం జేసియట్టి గుణములు గలిగి పరిమిత సంఖ్య గల శ్లోకములతో విరాజిలు నీయైదు స్తవముల నన్వేషించి పంచకృత్య పరుండు, పంచవదనుండు, పంచభూతాత్మక జగత్సృష్టికారకుఁడునగు పరశివుని భజించుటకుఁ బంచస్తవములే పర్యాప్తములని భావించి వీనికే పంచస్తవ వ్యవహారమును వారుగలిగించియుందురు. మఱియు శివతత్త్వము, షట్త్రింశదాత్మకము (ముప్పదియాఱు) అను వ్యవహారము శైవులలోఁ బ్రచారమందున్నది. అందు చేతనే కాఁబోలు మహిమ్న, మల్హణ, అనామయ స్తవము లొక్కొక్కటి ముప్పదియాఱు శ్లోకములతోను, హలాయుధ స్తవము ఏఁబదినాలుగు 36+ అందలి సగము 18) మలయరాజ స్తవము డెబ్బది రెండు (2×36) శ్లోకములతోను గూర్పఁబడియున్నవి. ఇట్లీ పంచ స్తవకర్తలందఱు షట్త్రింశత్సంఖ్యయందలి వైశిష్ట్యమును, గుర్తించి తత్సంబంధిక సాంకేతికముగనే వీనిని రచించియుందురని నా

మనకీఁ దోఁచుచున్నది. హలాయుధ స్తవమునందుఁ గొన్ని ప్రతులలో 54 మఱికొన్ని ప్రతులలో 67 శ్లోకములు కానవచ్చుచున్నవి. వీని వైశిష్ట్యమును గూర్చి క్రమముగ ముచ్చటించెద (1) మహిమ్న స్తవము. ఈ పంచ స్తవములలోఁ గాలానుక్రమమును బట్టి చూడ నిదియే ప్రాచీనతమముగఁ గానవచ్చుచున్నది. దీని కర్త పుష్పదంతుఁడు, గంధర్వుఁడను ప్రతీతి యనుశ్రుతముగ వినవచ్చుచున్నది. "సకలగుణ వరిష్ఠః పుష్పదంతాభిధానో రుచిర మలఘు వృత్తైః స్తోత్రమేతచ్చకార" అని 35 శ్లోకమున నుగ్గడింపఁబడియున్నది. ఇందు మొదటి 32 శ్లోకములు శిఖరిణీ వృత్తములలోను, చివరి నాలుగు శ్లోకములు మాలినీవృత్తములలోను గూర్పఁబడినవి. దీనికి నుత్తరహిందూస్థానమున విశేష ప్రచారమున్నది. పెక్కుమంది దీనిని గంఠపాఠముగఁ బారాయణ మొనరింతురు. రుద్రాభిషేక సమయములందు రుద్రాధ్యాయము (నమకచమకములు) తోపాటు దీనిని గూడఁ బారాయణము గావింతురు. పుష్పదంతుఁడు శివార్చనమునకయి తనతోఁటలోని పుష్పములతోఁ దృప్తినొందక మఱియొక రాజన్యునితోఁటలోఁ దెల్లవాఱకముందే రహస్యముగఁ బ్రవేశించి యందలి పుష్పములఁ గూడఁ గొనిపోవుచుండెననియు నందుచే నారాజేంద్రుఁడు తన శివపూజకయి పుష్పములు కొఱకు వచ్చుసరికి నందలి పూలచెట్లు పుష్పశూన్యములై యుండుటకుఁ జింతించి యపహర్తను బట్టఁ జాలక యొక కీలకము నూహించి తోఁటచుట్టు శివనిర్మాల్యముల వేయించెననియుఁ జీకటిలో వానిని గుర్తింపక పుష్పదంతుఁడు పుష్పాపచయంబునకై యేతెంచినపుడా శివనిర్మాల్యములఁ ద్రొక్కుటచేఁ దన శక్తిమహిమములఁ గోల్పోయి యెచటికి దాఁటిపోలేక విలపించి యీ స్తవము నాశువుగా రచించి కోల్పోయిన నిజమహిమమును శివానుగ్రహమున మరలఁ బడసెననియు నైతిహ్యము ప్రచారమందు

న్నది. పుష్పదంతుని కాలమును జారిత్రకముగ నిర్ణయించుటకు వలయు నాధారములు మృగ్యములు-అతఁడు చారిత్రిక వ్యక్తియైనను గాక పోయినను జాలఁబ్రాచీనుఁడనినిస్సందేహముగఁ జెప్పనగును. "త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి। ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితిచ రుచీనాం వైచిత్ర్యాత్ ఋజుకుటిలనానా పథ జుషాం। నృణామేకోగమ్య స్త్వ మసీపయసా మర్ణన ఇవ "అను నిందలి యేడవ శ్లోకము నాల్గవ పాదమున కనుకరణము మహాకవి కాళిదాసు రఘువంశ కావ్యదశమ సర్గములో దేవతలొనర్చిన హరి సంకీర్తనములో"బహుధా ప్యాగమైర్భిన్నాః పంథానస్సిద్ధిహేతవః।త్వయే వనిపతంత్యోఘా జాహ్నవీయా ఇవార్ణవే" నుశ్లోకమునఁ గాననగును మధ్యప్రదేశము (Central Provinces) లోని ఓంకార క్షేత్ర మున అమరేశ్వరాలయ మందిరమున నొక శిలపయి నీమహిమ్న స్తవము, హాలాయుధ స్తవము క్రీ॥శ॥ 1063 సంవత్సరములోఁ జెక్కఁ బడియున్నవి. ఇందువలననే యివి చాలఁ బ్రాచీన కాలమునుండియుఁ బ్రచారమొంది ప్రసిద్ధినొందియుండునని తలంపనగును. మహిమ్న స్తవ మును బలుసారులు పారాయణమొనర్చుట చేతనే దాని ననుసరించి శంకరాచార్యులు శివానందలహరిని జాలవఱకు శిఖరిణీ వృత్తములలో రచించినట్లు కాననగును మఱియు మహిమ్న శ్లోకచ్ఛాయలు తరు వాత వెలసిన పెక్కు స్తవములలోఁ గాననగును ఈ మహిమ్న స్తవము పుష్పదంతుఁడు మొదట రచించిన 36 శ్లోకములతోనే యుత్తర హిందూస్థానమునఁ బ్రచారమందున్నది. నేఁడు ముద్రిత గ్రంథములలో ఫల శ్రుతిరూపకముగఁ జివరను గానవచ్చు నధిక శ్లోకములు పదు నొకఁడు "దీక్షాదానంతప స్తీర్థం జ్ఞానం యాగాదికాఃక్రియాః। మహిమ్న స్తవ పాఠస్య। కలాంనార్హంతిషోడశీం" మున్నగునవి తరువాతకాల మున నితరులచే నిందుఁ బ్రక్షిప్తములుగఁ జేర్పఁబడినవి. అవి దక్షిణా

దేశ ప్రతులలోనే కానవగును. ఈ మహా స్తవమునకు గీర్వాణ బాషలోఁ బండితులు రచించిన వ్యాఖ్యానములు రమారమి 25 కలవు.

మహిమ్న స్తవ శ్లోకములు గొన్నిటికి మన యాంధ్రకవుల కృతులలోఁ గూడ ననుకరణములు గానవచ్చును.

"క్రియాదక్షోదక్షః క్రతుపతి రధీశ స్తను భృతాయ్ ఋషీణా మార్త్విజ్యం శరణదసదస్యాస్సురగణాః క్రతుభ్రేష స్త్వత్తః క్రిమఫల విధానవ్యసనినః! ధ్రువంకర్తుశ్శ్రద్ధావిధుర మభిచారాయాహి మఖాః! అను 21 వ శ్లోకమునకు.

"చ॥ తనరఁ గ్రియాతిదక్షుఁడగు దక్షుఁడు తత్క్రతువల్లభుండు, స
న్మునితతి ఋత్విజ్ఞ్మల్ సురసమూహము సభ్యులు తత్ఫలితంబులిం
దనిశము నిచ్చునీవడచి తత్ప్రముఖంబది కర్తృభక్తిమైఁ
దనరని యజ్ఞమైనఁ మదిదానభిచారము గాకపోవున్
నన్నబోదునకుమాతసంభవము ఆ 2 ప. 225)

"బహుళరజసే విశ్వోత్పత్తౌ భవాయనమోనమః అను 31 శ్లోకమునకు

మ॥ భువనోత్పత్తి విధించుచో నభవుఁడై పొల్పొందఁగా దానను
త్సవమున్ బ్రభవించుచో మృడుఁడవై సర్వంబుఁ గల్పాంచఝై!
రవసంక్షోభ నటించునో హరుడవై త్రైగుణ్య శక్తింమువిం!
శివనామాంకము దాల్చునీ మహిమ రాఁజిత్రంబు సర్వేశ్వరా
(అని యథావాక్కుల అన్నమయ్యగారి శతకము)

"అసితగిరిసమం స్యాత్ కజ్జల సింధుపాత్రే అను 34 శ్లోకమునకు.

చ॥ అరయఁ బయోధి పాత్రమునఁనంజన శైలము కజ్జలంబు త
త్సురతరుశాఖ లేఖిని వసుందర పత్రముగా నొనర్చి వాఁ
క్సరసిజనేత్ర వ్రాయగుణసారము పాదమునొందదార మా!
నరస నృపాలమౌళి సుజనస్తువ సద్గుణ సంప్రదాయముల్
(మూర్తి కవి నరసభూపాలీయము)

అరసిన కొలఁది పలుకృతులలో నిట్టి యనుకరణములు గానవచ్చును.

## మల్హణస్తవము

మల్హణుఁడు కాశ్మీరదేశీయుడగు కవిసత్తముఁడు, మల్హణి (పుష్పగంధి)యనువేశ్యకు మిండఁడై చిరకాల మామెతోఁ గామోప భోగముల ననుభవించుచుండెను. తుదకామెచేతనే ప్రబోధితుఁడయి వెన్నంటియామె కౌఁగిలించియుండ శివలింగము నెదుట నిలిచి యాశు వుగా నీస్తవమునరించి శివానుగ్రహమున వేశ్యతోఁ గూడఁ కైలాస మున కేఁగెనని యీ మహాకవి గూర్చి యైతిహ్యము గలదు శ్రీకృష్ణ కర్ణామృత కర్త లీలాశుకుని (బిల్వమంగళుని) కథకు నీతని చరితతో సామ్యమున్నది. ఈతఁడు చాలఁ బ్రాచీనుఁడు.

చారిత్రకముగ నీతనికాల మిదమిత్థముగ నిర్ణయింప నేరము. ఈ స్తవము భక్తిశృంగార భరితముగ సౌభాగ్యజనకముగ మనోహర శైలితో వసంత తిలక వృత్తములలో నలరారుచున్నది. మల్హణుని కథ పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రములో వర్ణిత మయినది. తరువాతఁ నెడపాటి యెఱ్ఱయకవి ప్రబంధరూపకముగ రచించెను. అది మదరాసులో శృంగార గ్రంథమాలలోఁ బ్రకటిత మయినది. మల్హణ స్తవశ్లోకములకుఁ గూడ నాంధ్రకవుల కృతులలో ననుకరణములు కానవగును "క్రీడాప్రపంచ నిరతాశ్శిశవః అను 27 వ శ్లోకమునకు

"ఆడంబోయిన చోట బాలురు వినోదార్థంబు పాషాణముల్
గూడంబెట్టి శివాలయంబనుచుఁ బేర్కొన్నంతటంజేసివా
రావంబోయి సురాంగనాకవిత దివ్యా రామచంద్రోపల
క్రీడాశైల విహారు లౌదురు మిముం గీర్తింప సర్వేశ్వరా !"

(అని యథావాక్కుల అన్నమయ్య)

## మలయరాజస్తవము

మలయరాజు దక్షిణదేశమున మలయాచల ప్రాంతమండలి

మలయవతి యను పట్టణము నేలు దేవరాజునకు నాతని భార్య శచీ దేవికిఁ బుత్త్రుఁడు తండ్రి చిరకాలము సంతతి లేక శివునిఁ గూర్చి తప మొనరింపఁ దదనుగ్రహమున నుజయించినవాఁడు. ఈతని చరిత్రము సర్వవిధముల మార్కండేయుని కథను బోలియుండును. మార్కండే యునకు వలెనే యీతనికిఁ గూడ బదునాఱు సంవత్సరముల యాయు ర్దాయము నే శివుఁడను గ్రహించెను. మరణకాల మాసన్నమగు తఱి జనకులు విచారించుచుండ వారివలన కారణమెఱింగి మార్కండేయుని వలెనే శివలింగము నెదుట నిలిచి కరుణరస పూరితముగ నీ స్తవ మొనర్చి తదనుగ్రహమున మృత్యువును జయించి చిరంజీవియై వర్ధిల్లి జనకుల కానందము గలిగించెను. ఇది మిక్కిలి సాత్త్విక స్తవము. దీనిచే మలయరాజు మృత్యువును జయింపఁ గల్గుటచే దీనిని మృత్యుం జయ మనియు వ్యవహరింపవచ్చును. ఇందుచే బాలకవి కృతమయి నను శివ పంచ స్తవములలో దీనికి మఱియు వైశిష్ట్యము గలదు. ఇది యార్యావృత్తములతో గ్రథితమైనది. "కులిశం కుసుమతి" అను నిం దలి 59 వ శ్లోకమును ధూర్జటి మహాకవి శ్రీకాళహస్తీశ్వర శతకంబులో

"పవి పుష్పనబగు నగ్ని మంచగు నకూపారంబు భూమీ స్థలం
బగు శత్రుండతిమిత్రుఁడౌ విషము దివ్యాహారమౌ నెన్నఁగా
నవనీమండలి లోపలన్ శివశివేత్యాభాషణోల్లాసికిన్
శివనీనామమె సర్వవశ్య కరమౌ శ్రీకాళహస్తీశ్వరా" అని యను

వదించినాఁడు.

"అంభోధిః స్థలతాం" అను భర్తృహరి శతకమందలి భావము గూడ నీకచ్ఛాయగాఁ గన్పట్టుచున్నది. మలయరాజు కాలమును గూడ నిదమిత్థముగ నిర్ణయించుట కాధారములు లేవు. ఈతఁడు చాలఁ బ్రాచీనుఁడనియే తలంపనగును. కర్ణాట దేశమున నీ స్తవమునకు విశేష ప్రచారమున్నది. ఈ స్తవమునందలి 15 శ్లోకములలో మహిమ్న

స్తవాను కరణము స్వల్పముగ భాసితమగుచున్నను జాలవఱకు నిం దలి శ్లోకములు స్వతంత్రభావ భరితములయియున్నవి. హృదయమున నుండి యప్రయత్నముగ జాలువాఱు కరుణభక్తి భావములే యిందుఁ బ్రదర్శితములు.

అ నా మ య స్త వ ము

"దండినః పదలాలిత్యమ్" అను నా భాణకమునకు గీర్వాణవాఙ్మయమున లక్ష్యమైన దండకవియే దీనికర్త. కాలవశమునఁ గుష్ఠవ్యాధి పీడితుఁడయి యనామయము (ఆరోగ్యము) నిచ్ఛగించి యీ శివస్తవము రచించి యారోగ్యమును బడయఁగలిగెనని యైతిహ్యము. మయూరుఁడను కవి గూడఁ గుష్ఠరోగ పీడితుఁడై "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అను సూక్తి ననుసరించి సూర్యునిపయి సంస్కృత స్రగ్ధరోవృత్తములతో శతకము రచించి బాహ్య కుష్ఠము మాత్రము నివారితమయి యంతః కుష్ఠమట్లె నిరిచిపోవ, శతఁడు భాస్కరుని చేతనే ప్రబోధితుండయి, శివునిపై మయూరస్తవమను మఱియొక స్తవము రచించి శివానుగ్రహమున సంపూర్ణారోగ్యమును బడసెనని యైతిహ్యముగలదు. దండికవి నేరుగ నీ యనామయ స్తవము శివునిగూర్చి మందాక్రాంత వృత్తములలోఁ జెప్పి కృతార్థుఁడయ్యెను. ఈతఁడీ శివస్తవమేగాక కావ్యాదర్శము, దశకుమారచరిత్ర, అవంతిసుందరీకథ, ఛంధోవిచితి మున్నగు గ్రంథముల రచించినమహాకవి. ఈతఁడు క్రీ.శ. 640 ప్రాంతమువాఁడని చరిత్రజ్ఞులు నిర్ణయించిరి. అనామయ స్తవమునందలి "యోగీభోగీ" అను 30వ శ్లోకమునకు యథావాక్యులు అన్నమయ్యగారి సర్వేశ్వరశతకములో

మ. సకలాధీశ్వర పట్టభద్రుఁడవు భిక్షాగామి వత్యంత శాం।
త కళాత్ముండవు రౌద్రమూర్తివతి సౌందర్యాంబికాసంగమా

ధికలోలుండవు దివ్యయోగివి మదిం దెల్లంబుగా నెట్టివా
రికిం దాశక్యము నీనిజంబెఱుఁగ వర్ణింపంగ సర్వేశ్వరా !

అనుపద్యమున ననుకరణము కాననగును,

## హలాయుధ స్తవము.

హలాయుధనామాంకితులు వేర్వేఱుకాలమున నిరువురు ముగ్గురు పండితులు కానవచ్చుచున్నారు. మొదట వంగదేశమున నవగ్రామమనుచోట వసించి పిదప దక్షిణదేశమునకువచ్చి, మాన్యఖేటమును బరిపాలించిన రాష్ట్రకూట కృష్ణరాజు నాస్థానమున క్రీ. శ. 760-80 ప్రాంతమందుండిన హలాయుధకవియే యీ శతకకర్త కాఁదగునని పండితులయభిప్రాయము. ఈశతకమేగాక అభిధానరత్నమాలయను హలాయుధకోశము, కవి రహస్యము, మృతసంజీవిని. అను గ్రంథములు రచించెను. పాల్కురికి సోముని బసవపురాణములో హలాయుధుని గూర్చినకథ యొకటియున్నది. చిఱుతొండనంబి తనకుమారుఁడగు సిరియాళునిఁ బుత్త్రమమకారము లేక వధించి మాయా జంగమవేషమునవచ్చి కుష్ఠరోగనివారణమునకయి నరమాంసమర్థించిన శివునకాహారముగా నర్పించితినని, తనకన్న భక్తుఁడు లేఁడని గర్వితమతియై కైలాసమున కేఁగిన తర్వాతఁ బ్రగల్భములు వల్కఁగా నాతని గర్వపరిహారార్థము శివుడు మాయాజంగమ రూపముతో నాతని నిలాతలమునకుఁ దీసికొనివచ్చి నిమ్నవర్ణమున్నగు భక్తులయిండ్లకుఁ గొనిపోయిన సందర్భములో హలాయుధుని యొద్దకుఁగూడ నాతనిఁ గొనిపోయెననియు, హలాయుధుఁడా కథవిని, కుపితుఁడై శివభక్తుని మాంసమునర్థించిన శివునకుఁ గుమారునిఁజంపి యాతనిమాంసము నర్పించిన చిఱుతొండనికి శైవప్రపంచమునుండి వెలియనిచాటి జయఘంట మ్రోఁగించెననియు నీవార్తవిని కైలాసమునుండి పార్వతియు, చిఱుతొండని పత్నియు జంగమువాండ్రవేషములతోవచ్చి ప్రార్థింపహలాయుధుఁడు కరుణించి వారి వెలిని బరిహరించెననియు నాకథయందుఁ గలదు. ఈ మహాభక్తుఁడే, యీ స్తవకర్త కావచ్చును. మంచి మంచి కల్పనలతో, వర్ణనలతో నీ స్తవముల మందాక్రాంత వృత్తము

లతో రచితమయి ప్రౌఢముగ నున్నది. గణపతి పూజలో శబ్దాలంకార వైచిత్రి గల
'అగజానన పద్మార్కం గజాననమహర్నిశమ్।
అనేకదం తం, భక్తా నామేకదంత ముపాస్మ హే॥
అను శ్లోకమును భక్తులు పఠించుట సుప్రసిద్ధము.
శివుని తనయులలో వినాయకుఁ డేకదంతుఁడగుటకుఁ గుమారస్వామి షడాననుండగుటకుఁ జక్కని యుపపత్తుల నీ మహాకవి యీ స్తవ ప్రారంభమున రెండు శ్లోకములలో నిట్లు వివరించినాఁడు.
"విఘ్నం నిఘ్నన్ ద్విరదవదనః ప్రీతయేవోస్తు నిత్యం।
వామేకుంభ త్వక టిత బృహద్దక్షిణౌ స్థూల దంతః।
యశ్శ్రీకంఠం పితరము మయా క్లిష్టం వామార్ధ దేహం।
దృష్ట్వానూనం స్వయమపిదధావర్ధ నారీశ్వరత్వం॥
శ్లాఘ్యః పుత్రస్స భవతికిల, తస్యవత్తుస్స కాశాత్
ధత్తేకశ్చిత్ క్వచిదపి గుణైర్యస్సముత్కర్ష లేఖాం
ఇత్థం వాంచన్ పితురధికతాం పంచవక్త్రస్య నూనం
షష్ఠం బిభ్రద్వందన మపరం పాతు విశ్వం విశాఖః॥
ఈ హాలాయుధ స్తవమునందలి శ్లోకములకుఁ గూడ నాంధ్ర కవుల కృతులలో ననుకరణములు కాననగును. మచ్చునకు "యేషాం యుష్మత్ప్రీతి కృతి గృహం॥ అను 21వ శ్లోకమునకు నాగటూరి శేష నారాధ్యుని పర్వత పురాణములో
"కం॥ మలహరు గుడి గోమయమున
నలికిన మనుజుండు నలుకునఁట కస్తూరీ
మలయజ పంకము దివిష
జ్జలజాయతలోచనాకుచద్వయ మందున్."
అను పద్యాను కరణము చూడఁ దగును.
ఈ పంచ స్తవములలో మలయరాజస్తవ స్థానమున, 36 శ్లోకములతో రచితమయిన బిల్హణ స్తవమను, అర్వాచీన స్తవమను జేర్చి కాకినాడ వాస్తవ్యులు శ్రీ పాడి వేంకటస్వామిగారు క్రీ. శ. 1891

సంవత్సరములోఁ బ్రకటించినారు. అవి సామాన్యపు కాగితములపైఁ జెక్కు తప్పులతో ముద్రితములైనవి. మహిమ్న, మల్హణ, బిల్హణ స్తవముల కప్పటికి వెలసిన పన్నాల రామబ్రహ్మశాస్త్రి, దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి, వింజమూరి లచ్చారాయ, కవివర్యుల యాంధ్రీకరణములు గూడ నందు ముద్రింపఁబడినవి. తరువాత మైసూరు దేశములోఁ బైని పేర్కొనఁబడిన పంచస్తవము లన్నియుఁ గ్రీస్తుశకము పదిమూఁడవ శతాబ్దియందుండిన విశ్వారాధ్యుఁడను ప్రఖ్యాత పండితుఁడు రచించిన సంస్కృత వ్యాఖ్యానములతోఁబ్రకటితములయినవి. అందు మలయరాజ్యస్తవమే గాని బిల్హణస్తవము చేరలేదని చెప్పనవసరములేదు. బిల్హణుఁడసలు కాశ్మీరదేశీయుఁడగు కవి. తరువాత దక్షిణ దేశమునకుఁ దరలివచ్చి పశ్చిమ చాళుక్యరాజు త్రైలోక్య మల్ల విజయాదిత్యుని యాస్థాన కవియై క్రీ. శ. 1030 ప్రాంతమున నుండిన వాఁడు.విక్రమాంకదేవచరిత్రమున్నగు కృతులు సంస్కృతమునరచించినవాఁడు. ఈతఁడు రచించినబిల్హణస్తవము ప్రాచీనమైనది కానందునఁ బూర్వుల గణనములోనిది శివపంచస్తవములలోఁ జేరియుండలేదు. సుప్రసిద్ధ వీరశైవ కవి పాల్కురికి సోమనాథుఁడు తన పండితారాధ్య చరిత్రములో మల్లికార్జున పండితారాధ్యుఁడు శివపూజా సమయమునను,శ్రీశైలయాత్ర యందును బఠించిన శివ స్తవములను బేర్కొనుటలో,

"మహిఁ జెప్పఁబడు మహిమ స్తవంబునను।
మలహరణంబగు మలహణంబునను
శ్రీమయం బైన యనామయంబునను
ఆయత ప్రీతిహలాయుధంబునను."

అనియు, మయూర స్తవము,హలాయుధ మనామయము,మలహణఁబు మహిమ్నంబను స్తవంబు, మలయరాజీయంబును అనియు రెండు నారులుగ డించియున్నాఁడు. వీనిలో బిల్హణస్తవ ముదాహృతము కానందున నది యప్పటికిఁ బ్రచారమంది ప్రసిద్ధికి రానట్లు తలంపనగును. కావునఁ బురాతనుల దృష్టిలో మహిమ్న, మల్హణ, మలయ

రాజ, అనామయ, హాలాయుధ స్తవములయిదు మూలమే వాని విశిష్టతచే శివపంచస్తవములని గణన కెక్కి- యావద్భారత దేశము నను ప్రసిద్ధికెక్కెనని నిరాఘాటముగఁ దలంపవచ్చును. ఈ స్తవము లన్నింటికి నాప్రోత్సాహముచే నామిత్రులు విభూతి పత్రికాధిపతులు, కీర్తిశేషులు శ్రీ పండిత చిదిరెమఠము వీరభద్ర శర్మగారు సికిందరా బాదులో తమ శివధర్మ గ్రంథమాలలో భక్తరంజిని యను పేరితో నాంధ్రమునఁ బ్రతిపదార్థ, టీకాతాత్పర్య, విశేషాంశములతో సమర్థ మగు విపుల పీఠికతో వ్యాఖ్యలను రచించి, యప్పటికి వీనికి వెలసిన విద్వత్కవుల యాంధ్రీకరణములను గూడఁ జేర్చి, 1942 సంవత్సర ములోఁ బ్రకటించియున్నారు. అందులో ననుబంధముగా బిల్హణ స్తవము, దానికి వింజమూరి లచ్చారావుగారి యాంధ్రీకరణము గూడఁ జేర్పఁబడినవి. శివపంచస్తవములకుఁ జిరకాలము క్రిందటనే కర్ణాట దేశీయుఁడు విశ్వారాధ్యుండు రచించిన సమర్థ వ్యాఖ్యానము సంస్కృత భాషలో నున్నను, దాని నెఱుంగక, ఆంధ్ర దేశీయుఁడు తెనాలి రామ లింగ కవి రచించిన యుద్భటారాధ్య చరిత్రమునకుఁ గృతికర్త యునగు ఊరదేశ మంత్రి కూడ సంస్కృతమున స్తుత పంచిక యను పేరితో మఱియొక వ్యాఖ్యానము రచించినాఁడు. కాని యీ పంచస్తవము లలో నాతఁడు మలయరాజీయము గాని, బిల్హణమును గాని చేర్పక వాయుపురాణాంతర్గత మయిన నీలకంఠస్తవమును జేర్చినాఁడు. ఈతని స్తుతి పంచిక, యిప్పటికి నముద్రితమే.

శివపంచస్తవ ప్రతిపాదిక మయిన పరశివబ్రహ్మ పరమతేజము, ఆంధ్రసాహిత్య పరిషత్ప్రతిష్ఠాపకులయిన పుణ్యమూర్తులు శ్రీ పిఠా పురము మహారాజు శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్య రావు గారి యాత్మకు శాశ్వతానంద శాంతి సౌఖ్యములఁ బ్రసాదించుఁ గావు తమని ప్రార్థించుచున్నాను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

బండారు తమ్మయ్య

ఆంధ్రసాహిత్య పరిషదధ్యక్షుఁడు.

# బిల్వమంగళుఁడు యతీశ్వరుఁడే

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

ఆంధ్రసాహిత్యపరిషత్తు, ఆంధ్రభోజులని ప్రసిద్ధి కెక్కిన శ్రీసూర్యరాయప్రభువర్యులపాపున నేఁటికి ఏఁబది యేండ్లకు ముందు అపూర్వములు అమూల్యములు నగు తాళపత్త్రి గ్రంథములను సంపాదించి యుంచినది. ఆ గ్రంథ సంచయములో నిలీనమైయున్న విషయములను వెలికిఁ దీసిన నెన్నియో సమస్యలు పరిష్కృతములై, సంస్కృతాంధ్ర సాహిత్యమార్గములలో నూతనాంశము లెన్నియో వెలువడును. కేంద్ర ప్రభుత్వాధికారుల సహకారమున కడచిన మూఁడేండ్లలో అంధ్రసాహిత్య పరిషద్భాండాగారము నందున్న 'బోధామృతము' అను పేరుగల శ్రీకృష్ణ కర్ణామృతశ్లోకవార్తికము-సంస్కృతగ్రంథము నాగరిలిపిలో పరిషత్ప్రకమునఁ బ్రకటితమైనది. కేంద్రప్రభుత్వాపాచీన గ్రంథ ప్రకటన నిర్ణయసమితి సదస్యులైన శ్రీ డాక్టర్ రాఘవన్ మహాోదయుల నిర్ణయముతో నీ గ్రంథమును ప్రకటించుట సంభవించినది. ఈగ్రంథమునకు మఱియొక ప్రతి యెచ్చటను గలదని యింతవఱకు వినరాలేదు. ఇదివెలికి వచ్చుటచే బిల్వమంగళుఁడను నామాంతరము గల లీలాశుకునకు సంబంధించిన కొన్ని సమస్యలు పరిష్కృతములగుట కవకాశ మేర్పడుచున్నది. అట్టి విషయములను గొన్నిటిని నాయూహ పోడమినంతకుఁ దెలిపెదను.

## బిల్వమంగళుఁడు కేరళదేశస్థుఁడు

బిల్వమంగళుఁడను నామమును ముందుగలిగియుండి, తరువాత లీలాశుకుఁడను పేరఁ బ్రసిద్ధుఁడయిన శ్రీకృష్ణకర్ణామృతకవి తెలుఁగు వాఁడు కాఁడని, కేరళదేశస్థుఁడే యను విషయమును కీ. శే. మానవిల్లి రామకృష్ణకవి ఎమ్. ఏ. గారు ఆంధ్రపత్రిక 1922 దుంధుభి ఉగాదిసంచికలో 'పుష్పాంజలి శ్రీకృష్ణలీలాశుకకవి' అను వ్యాసమున తెలిపియేయున్నారు. తరువాత శ్రీ యమ్. కృష్ణమాచార్యుల

వారు తమసంస్కృతవాఙ్మయచరిత్రములో కవిగారి వాక్యముల నుదాహరించుచు నా నిర్ణయము నంగీకరించియున్నారు. తరువాత సంస్కృత విమర్శకులు కూడ లీలాశుకుఁడు కేరళదేశీయుఁడే యను విషయము నాదరించుచునే యున్నారు.

కాని 'చింతామణి' యను తెలుఁగునాటకము నెఱిఁగిన ఆంధ్రు లెవ్వరును నీనాఁటికిఁ గూడ లీలాశుకుఁడు తెలుఁగువాఁడనియే గాని కేరళదేశీయుఁడని యెఱుఁగఁజాలరు. అట్లు తెలిసినను అంగీకరింపఁజాలరు. కారణమేమన చింతామణీబిల్వమంగళులచరిత్రము తెలుఁగువారిహృదయములలో నంతగ నాఁటుకొని పోయినది. తెలుఁగువారిమనోరంగములలో నాఁటుకొనియున్న భావ మీవిధముగ నుండినది. బిల్వమంగళుఁడు ఆంధ్రుఁడై జన్మించి, కృష్ణా నదీ తీరమందు వసించుచుండి, కృష్ణకావలి యొడ్డునందున్న 'చింతామణి' యను వేశ్యయందు విశేషాసక్తుఁడై, యుండియు, ఆకస్మిక సంఘటనముచే వేశ్యోపదిష్టుఁడై వైరాగ్యము వహించి, తరువాత బాలగోపాల భక్తుఁడై శ్రీకృష్ణ కర్ణామృతమును రచించి లీలాశుకుఁడైనాఁడని వైష్ణవమతానుయాయులలో వేశ్యాసక్తులై మహాభక్తులైన వారు కొంద ఱుండుటచే నీతఁడు వైష్ణవమతావలంబియే యనియు ఇత్యాదిగ నీతనిఁగూర్చి కట్టుకథ లలముకొనియున్నవి. వంగదేశమునందలి వ్యాఖ్యాతలు ఈ కథను వ్యాఖ్యానారంభమున నిబంధించుచు నిది గురుపరంపరాగతమని కూడఁ దెలిపియున్నారు,

'మంగళము' అనేపదము చివరనున్న గ్రామములు ప్రధానముగ దక్షిణదేశమందేకాని తెలుఁగుదేశములో లేవు. 'కోదండ మంగళ' అనెడి సంస్కృతశబ్దము దాక్షిణాత్యసంప్రదాయమునుబట్టి విల్లుమంగళమై, విల్వమంగళము కాఁగా, ఉత్తరదేశములో నీతఁడు బిల్వమంగళుఁడైనాఁడు. విల్వమంగళగ్రామము కేరళదేశమునందుం

డెను గాని కృష్ణానదీతీరమునం దానాఁడు నీ నాఁడునుగూడ లేదు. ఈపేరే యీతఁడు కేరళదేశస్థుఁడని చెప్పక చెప్పుచున్నది. ఇఁక నీతనికి 'చిన్తామణి' యను వేశ్యతోఁ గల సంబంధ మెంతవఱకు సరి పడునో? అది కూడఁ బరికింతము. ఈ పేరు గలవేశ్యతోడి సంబం ధము కలదని యూహించుటకు మూలము కృష్ణకర్ణామృత ప్రారంభ మున 'చిన్తామణిః' అను పదముండుట, కొందఱు వ్యాఖ్యాతలు ఆప దమునకు 'తన్నామికా వేశ్యా' అనునర్థమును చిత్రించుటయును. కాని యాశ్లోకమునకుఁ గల అర్థమునంతను పర్యాలోచనము చేసినచో నిట్టి యర్థము చెప్పుట కుదురదనియే యనిపించును.

శ్లో॥ చిన్తామణిర్జయతు సోమగిరిర్గురుర్మే
శిక్షాగురుశ్చ భగవాన్ శిఖిపిఞ్ఛమౌళిః,
యత్పాదకల్పతరుపల్లవశేఖరేషు
లీలాస్వయంవరరసం లభతే జయశ్రీః

శిష్యచిన్తామణియైన నాగురువు సోమగిరి జయించుఁ గాక. భక్తు లకు శిక్షాగురువు, నెమిలిపింఛము శిరమునఁ దాల్చువాఁడు నగు భగ వంతుఁడును జయించుఁ గాక. సోమగిరిగురు గోపాలకృష్ణదేవుల పాద ము లను కల్పవృక్షపల్లవములను శిరోభూషణములనుగా ధరించు వారి యెడల జయలక్ష్మి, లీలాస్వయంవరానందమును పొందును. దీక్షాగురువైన సోమగిరి పాదములను శిక్షాగురువైన బాలగోపాల దేవుని పాదములను శిరమునఁ దాల్చువారికి విజయము హేలగా లభించును అని భావము.

పై శ్లోకములోని మొదటి రెండు పాదములు రెండు వాక్య ములు. ఆ రెండు వాక్యములకును 'జయతు' అనుపదియే క్రియా పదము. రెండవపాదములో నుండెడి సముచ్చయార్థక చకారముచే 'జయతు' అను క్రియాపదము సంబంధించును. అప్పుడు 'చిన్తామణిః'

అనుపదమునకు చిన్తితార్థప్రదుఁడు అనెడి విశేషణార్థమునే చెప్ప వలెను గాని, 'చిన్తామణి' యను వేశ్య యనెడి విశేష్యార్థమును జెప్పుట సరిపడదు. అట్లు చెప్పఁదలఁచిననాఁడు మఱియొక చకార మును కవి కూర్చియుండవలెను. అది శాస్త్రసంప్రదాయము, కవితా సంప్రదాయమును. మఱియు జయలక్ష్మీస్వయంవరమునకు దీక్షా గురువైన సోమగిరిపాదములను, శిక్షాగురువైన గోపాలదేవుని పాదములను శిరోధార్యముచేయుట భావ్యము గాని, వేశ్యాపాద పల్లవములను శిరోధార్యముఁజేయుట భావ్యము కాదు కదా! అందుచే చింతామణిశబ్దమునకు 'వేశ్య' యను నర్థము చెప్పుట అవిచారితరమ ణీయమే కాని యన్యము కానేరదు.

బోధామృతవ్యాఖ్యానమునం దీచిన్తామణి శబ్దమునకు 'చిన్తి తార్థప్రదుఁడు' అనునర్థ మే యుండినట్లు నిర్వచనము చేయఁబడినది. ఆవివరణ శ్లోకమిది.

మాయా తాపహరోఽచలో విజయతే స్వేష్టప్రదో మేగురు
శ్చిన్తార్యామ్యజసేవ్యచిచ్ఛ్రుతి శిఖజ్ఞానైకభూషో ధియామ్,
సాక్షీష్టప్రదయత్పదద్వయమనోవృత్తిః స్వచిన్మాలిషు
క్రీడార్థం వహతి స్వయంవరరతిస్రోతో జయశ్రీః సదా.

కర్ణామృత శ్లోకములోని చిన్తామణి శబ్దమునకు వ్యాఖ్యానముగాన వార్తిక శ్లోకమున 'స్వేష్టప్రదః' అనుపదము కూర్పఁబడినది. తనకు అభీష్టముల నిచ్చువాఁడని దీని కర్థము. కావున నద్వైత భావనా ప్రతి పాదకమైన యీశ్లోక వార్తిక వివరణమును బట్టి కూడ చిన్తామణి శబ్దమునకు, ఆ పేరుగల వేశ్యయను నర్థము సరిపడదు. మిగిలిన వ్యాఖ్యాతలు కూడ చాలమంది చింతామణిశబ్దమున కీయర్థమునే యంగీకరించియును 'వేశ్య' యను నర్థమును గూడ నాయోజించుచు వచ్చినారు.

బిల్వమంగళుఁడు కేరళ దేశస్థుఁడనుటకు "బోధామృతము" అను నీ శ్లోక వార్త్రిక గ్రంథము కూడ సమర్థకముగా నున్నది. వ్యాఖ్యాతయైన యీ బాలగోపాలయతీంద్రుఁడు కేరళ దేశస్థుఁడను విషయము ఈ క్రింది వాక్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

1. ఇతి శ్రీ బాలగోపాలేన్ద్రకేరళీయయతీశ్వరకృతే కర్ణామృత వార్త్రికే బోధామృతే ప్రథమశతకం సంపూర్ణమ్.

2. ఇతి శ్రీకృష్ణకర్ణామృతాధ్యాత్మ వార్త్రికే ద్వితీయశతకం సంపూర్ణమ్.

3. ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశఙ్కరభగవత్పాద కృతశారీరకమీమాంసాభాష్యపర్యావర్తననిరతేన చిదాభాసచిత్స్వరూప నరనారాయణభక్త శ్రీరాఘవేన్ద్రసరస్వతీ శిష్యేణ కేరళీయేన బాలగోపాలయతీన్ద్రేణ కృతమిదం శ్రీకృష్ణ కర్ణామృతాధ్యాత్మ వార్త్రికం బోధామృతం సంపూర్ణమ్.

ఈ బోధామృత వార్త్రిక రచయిత కేరళ దేశీయుఁడగు యతీశ్వరుఁడైన కారణముననే కేరళ దేశీయుఁడైన లీలాశుకుని కర్ణామృతమునకు బోధామృతమను వ్యాఖ్యానము జేయుట కూడ తత్సమర్థకమే. యని మన మూహింపవచ్చును.

## బిల్వమంగళుఁడు యతీశ్వరుఁడు

బిల్వమంగళుఁడే లీలాశుకుఁడనియు, ఈతఁడునీ లీదామోదరులనుజననీజనకులకుఁ బుత్రుఁడనియు, ఈతనిగురు వీశానదేవుఁడనియు ప్రథమశతకములోఁ జివరఁ గూర్చిన కర్ణామృత శ్లోకమును బట్టి తెలియవచ్చుచున్నది.

కీ. శే. మానవల్లి రామకృష్ణకవిగారిచే పుష్పాంజలి వ్యాసములో నుద్ధృతమైన యీ క్రిందిశ్లోకములలో నీవిషయముతోపాటు బిల్వమంగళుఁడు యతీశ్వరుఁడను విషయముకూడ దెలియవచ్చు చున్నది.

ఆదిత్యప్రజ్ఞసంజ్ఞం యదాదిత్యాదధికం మహః
నిర్జితస్సమదృష్ట్యైవ నిర్లోలం యేన మన్మథః
అర్జితైరత్రకుసుమై రారాదారాధయన్ యయౌ
ఈశానదేవ ఇత్యాసీదీశానో మునితేజసామ్
ఆస్పదస్యహి యస్యాసీదశేషగుణసమ్పదామ్
అద్వితీయ ఇతి ఖ్యాతిరాత్మబుద్ధ్యా న కేవలమ్
తయోరనుగ్రహాపాంగసంప్రాప్తజ్ఞానసాగరాః
సాగరా ఇవ గమ్భీరాస్సన్తి ధన్యాస్సహస్రశః
తయోరేవ కృపాపాత్రం కృష్ణలీలాశుకో మునిః
యదాశ్రమాఙ్గణే నిత్యం రమన్తే తన్త్రవిస్తరాః
తిలకం కులపాలీనాం నీలీతి నిలయం శ్రియామ్
యమలం జనయాంచక్రే యంచ కీర్తించ శాశ్వతీమ్
యస్య దామోదరో నామ పితా సవితృసన్నిభః
అన్యణస్య హి యస్యాసన్నధమర్ణా మరుద్గణాః
యస్య దక్షిణకైలాస లీలాపరిణతం మహః
చర్యాచన్దనగన్ధేన సుగన్ధయతి మానసమ్
కృష్ణలీలాశుకస్యాస్య కిశోర మధిదైవతమ్
స్తుతిరత్నమిదం బ్రూతే వేణువాదిముఖేన్దునా.

ఈ శ్లోకములలోని యర్థమును పర్యాలోచనము చేయుటవలన నీక్రింది విషయములు తెలియవచ్చుచున్నవి. ఆదిత్యప్రజ్ఞుఁడను గురువునకు ఈశానదేవుఁడు శిష్యుఁడు. వారియిరువుర యనుగ్రహావశమున జ్ఞానము నార్జించుకొన్నవారు పెక్కురు గలరు. వారి యాశ్రమమున తంత్రశాస్త్రప్రచారము సాగుచున్నది. ఆయిరువురదయకు పాత్రుఁడైన వాఁడు కృష్ణలీలాశుకముని. ఈతనిఁ గన్న తల్లిదండ్రులు నీలియను సతీతిలకము, సూర్యసన్నిభుఁడైన దామోదరుఁడును. ఇట్టి కృష్ణలీలా

శుకునకు బాలగోపాలకృష్ణుఁ డధిదైవతమై వేణునాదము సేయు ముఖపద్మముతో నీ స్తోత్రరత్నమును పలుకుచున్నాఁడు.

శ్రీరామకృష్ణకవిగారీ శ్లోకముల నెచటనుండి యుదాహరించినారో స్పష్టముగ తెలియరాదు. కృష్ణకర్ణామృతములోని 'ఈశానదేవచరణాభరణేన' ఇత్యాది శ్లోక నిరూపితార్థమునకు ఈ శ్లోకములోని యర్థము విసంవాదము నందుచున్నది. మఱియు దీనిని బట్టి నీలీదామోదర సుతుఁడైన యీతని తొలుతటినామము కృష్ణుఁడనియు, తరువాత లీలాశుకమునియై నాఁడనియు విదితమగుచున్నది. లీలాశుకునకు బాలగోపాలకృష్ణుఁడు ప్రధానారాధ్యదైవతమను విషయము కృష్ణకర్ణామృత శ్లోకములనుబట్టి సుస్పష్టమగుచున్నది. ద్వారకావాసికృష్ణుని విలాసములు, మూఁడు శతకముల మొత్తము శ్లోకములలో, అయిదాఱింటిలోఁదప్పఁ గానరాకుండుటయు దీనికి నిదర్శనము. ఈ క్రిందిశ్లోకము ఈవిషయమునకు సర్వథా సమర్థకమైయున్నది.

పరమిమముపదేశమాద్రియధ్వం
నిగమవనేషు నితాన్తచారఖిన్నాః,
విచినుత భవనేషు వల్లవీనా
ముపనిషదర్థములూఖలే నిబద్ధమ్.

వేదారణ్యములలోఁ బరిభ్రమించుచు దారి తెలియక ఖేదపడువారు గోపికల యిండ్లలో ఉపనిషత్ప్రతిపాద్యార్థమును రోటికిఁ గట్టఁబడియున్న దానిని వెదకికొనుఁడనియు నయుత్తమోపదేశము నాదరింపుఁడనియుఁ దెలిపినాఁడు.

## సోమగిరి వైష్ణవ గురువు కాఁడు

సోముఁడే ఈశానదేవుఁడు. ప్రథమ శతక చరమభాగమునం దుపనిబద్ధమైన యీ క్రింది శ్లోకమును బట్టి యీ విషయమును స్థిరము చేయవచ్చును. ఆశ్లోకమిది.

ఈశాన దేవచరణాభరణేన నీలీ
దామోదర స్థిరయశ స్తబకోద్గమేన
లీలాశుకేన రచితం తవ దేవ కృష్ణ
కర్ణామృతం వహతు కల్పశతాన్తరేపి.

నీలీదామోదరులను తల్లిదండ్రులకు శాశ్వతయస్సునకు పుష్పోద్గమమై ఈశానదేవగురుచరణములను శిరోధార్యము గావించు లీలాశుకునిచే విరచితమైన యీ శ్లోక సంచయము దేవా! కృష్ణా! నీకు కల్పశతములకు కూడ కర్ణామృతమై ప్రవహించుఁగాక యని యీ శ్లోకమున కర్థము. దీనినిబట్టి బిల్వమంగళోపనామకుఁడై నీలీదామోదరసుతుఁడై ఈశానదేవశిష్యుఁడైన కృష్ణుఁడు లీలాశుకుఁడై రచించిన యీ స్తోత్రము బాలగోపాలదేవునకు కర్ణామృతమై ప్రవహించుఁగాక యని యాతఁ డాకాంక్షించినట్లు తెలియవచ్చుచున్నది. ఈశ్లోక విషయానుసంధానమును బట్టి ఈశానదేవుఁడు సోమగిరి కంటె భిన్నుఁడు కాఁజాలఁడు. 'గిరి' అనునది, శంకరాచార్య సంప్రదాయానుగత యతీశ్వరులగు ఆనందగిర్యాదులలోఁ గానవచ్చుటచేత, ఈశాన దేవుని కంటె ననన్యుఁడైన సోమగిరి గురువు అద్వైతమతమునకుఁ జెందిన యతీశ్వరుఁడే యగును. శ్రీ శంకర భగవత్పాదులు కేరళ దేశస్థ కాలటి గ్రామమునందు పెరిగి పెద్దలైన వారేగదా! అందు మూలమునఁ గూడ సోమగిరి గురువు అద్వైత సంప్రదాయమునకుఁ జెందిన వాఁడగుట తథ్యము. ఆతని శిష్యుఁడైన బిల్వమంగళుఁడును అద్వైతమతానుయాయియే యగును. ఈక్రింది శ్లోకము లీలాశుకుని యద్వైతభావనకు ప్రబల నిదర్శకము.

శైవా వయం నఖలు తత్ర విచారణీయం
పంచాక్షరీజపపరా నితరాం తథాపి

చేతో మదీయమతసీకుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూకిశోరమ్.

మేము సహజముగ శివభక్తి తత్పరత గలిగి నిరంతరము పంచాక్షరీ మంత్రజపపరులమే. అయినను నాచిత్తము స్మేరాననుఁడైన బాలగోపాల దేవునే స్మరించుచుండు ననుటలో లీలాశుకుని యద్వైత భావన వ్యక్తమగుచున్నది. ఈ శ్లోకము భర్తృహరి విరచితమైన యీ క్రింది శ్లోకమును స్మరింపఁ జేయుచున్నది.

మహేశ్వరే వా జగతా మధీశ్వరే
జనార్దనే వా జగదన్తరాత్మని,
న వస్తుభేదప్రతిపత్తిరస్తి మే
తథాపి భక్తిస్తరుణేన్దుశేఖరే.

అద్వైతభక్తిభావసముద్బోధకత్వ మీతని రచనలో నోతప్రోతమై యుండిన కారణముననే బాలగోపాలేన్ద్రయతీశ్వరుఁడు శారీరక మీమాంసాభాష్య పర్యావర్తననిరతుఁడై బోధామృతమను నీ యద్వైత వార్తికము నీ శ్లోకముల కనుసంధానము చేయఁ గలిగినాఁడు. ఈ వార్తిక శ్లోకములం దుపనిబద్ధమైన యర్థము సహజమనిపించునే గాని, బలాత్కారముగ ముడిపెట్టినట్లు తెలియవచ్చుటలేదు. కేవలవైష్ణవ త్వమును ప్రతిపాదింపఁదలపెట్టిన వ్యాఖ్యానములలోని విషయములు బలాదానీతములైనట్లు ప్రతిఫలించుచునేయున్నవి. సోమగిరి గురువును వైష్ణవుని జేయుటకు నిరూపితములైన యర్థములే దీనికి నిదర్శనములు.

## లీలాశుకుఁడు ముని

శుకమహర్షి పరీక్షిన్మహారాజునకు శ్రీకృష్ణునియందు ననన్యభక్తిభావము నుపదేశించి, తదనుసంధానమున మోక్షము లభింపఁజేయుటకై శ్రీకృష్ణుని సంపూర్ణావతారవిలాసములను పూర్వాపూర్వావతారముల లోని వివిధవిభవములను వివరించుచు భాగవతపురాణనిర్మాణ

ముచే శుకయోగీంద్రుఁడై నాఁడు. ఆ విధముగ భగవద్భక్తులందఱకు మోక్షము లభింపఁజేయుటకై బిల్వమంగళయతి బాలగోపాలకృష్ణుని బాల్యలీలలను తన్మయత్వముతో నాలపించుటచే లీలాశుకుఁడై నాఁ డని యనుకొనవచ్చును. అతఁడు ముని కానినాఁడు తన రచన భగ వంతునకు కర్ణామృతమై ప్రవహించుఁగాక యను నంతటి చనవును వహింపఁజాలఁడు. నిశ్చయముగ కర్ణామృత కవిరచన కర్ణామృత మను మాటలో నెవ్వరికిని విప్రతిపత్తి లేదు. ఈ కర్ణామృతశ్లోకరచనగా గోపాలదేవుని వేణునాదరవళియే రూపొందెననియు, బాలకృష్ణుఁడే దీనిని పలికె ననియు 'స్తుతిరత్నమిదం బ్రూతే వేణువాదిముఖేన్దునా' అను శ్లోకార్థముచే వ్యక్తమగుచున్నది. ఈ విషయము ప్రథమశత కము నందలి శ్లోకములోని'ది

కమనీయకిశోరదివ్యమూర్తేః
కలవేణుక్వణితాదృతాననేన్దోః,
మమ వాచి విజృమ్భతాం మురారే
ర్మధురిమ్ణః కణికాపి కాపి కాపి

అను నభ్యర్థనముచే సమర్థితమగుచున్నది.

లీలాశుకుని శిష్యుఁడు, దుర్గాప్రసాద యతీశ్వరుఁడు తాను రచించిన శ్రీచిహ్నకావ్యమునందు. "చావమజ్జళధరో యతీశ్వరః" అనియు, చావమజ్జళధరోజఈసరో విల్లమజ్జళధరో వహాోఇజో, అనియుఁ దెలిపియుండుటచే, బిల్వమంగళుఁడుగా నుండినవాఁడే యాతఁడు యతీశ్వరుఁడై నాఁడనుట నిశ్చయము అతఁడే క్రమముగా బాలగోపాలవిలాసగానము చేసి లీలాశుకమునియైనాఁడని యూహిం చుటయే యుత్తమము గాని, గురు మహిమాప్రతిపాదకమైన చింతా మణిశబ్దమునకు చింతామణియను వేశ్యయను నర్థము ససంబద్ధముగ నతికించి, తనూ ౹౹ముగ బిల్వమంగళ యతీశ్వరుని కామె తోడి సంబం

థమును కల్పించి, కల్పితేతివృత్తవిస్తృతితో నాటకాదులు రచిం చుట సంభావ్యము కాదనియు, అట్టి ప్రానిక నామహర్షి యెడల నప చారము చేయుటయే యగుననియు నానునవి.

## కర్ణామృతము శతకత్రయ పరిమితమే

చైతన్యమతానుయాయులయిన ప్రాగుత్తరదేశ వ్యాఖ్యాతలు లీలాశుకవి రచితమయిన కర్ణామృతమునందలి ప్రథమశతకమునకు మాత్రమే వ్యాఖ్యానమును రచియించియుండుటచే అంత మాత్రమే యాతఁడు రచించెననియు, ద్వితీయ తృతీయ శతకములలోని శ్లోక ములు ప్రక్షిప్తములనియు కొందఱు విమర్శకు లొకవాదమును లేవ నెత్తియున్నారు. చైతన్యప్రభువు దక్షిణ దేశయాత్రకు బయలు దేఱిన నాఁడు శ్రీరంగమునందో, పండరీపురసమీపమునందో, శ్రీకృష్ణ భక్తిభావసముద్బోధకములైన యీ కర్ణామృత శ్లోకములు, అంత మాత్రమే వారికి లభింపఁగా, వానిని వంగదేశమునకుఁ గొనివచ్చి తన శిష్యుల కందిచ్చియుండెను. వానికి వారు వారు వ్యాఖ్యానములు సాగించుచు, లీలాశుక విరచిత కర్ణామృత శ్లోకము లంతమాత్రమే యని నిశ్చయము చేసియున్నారు. కాని యీ నిర్ణయము సరియైనది కాదని చెప్పవచ్చును.

చైతన్య ప్రభువున కితర శతక శ్లోకములు లభింపనంత మాత్ర మున అంత మాత్రమే లీలాశుక విరచితము. మిగిలిన రెండు శతక ములు లీలాశుక విరచితములు కావనుట న్యాయముగాదు. బిల్వ మంగళ జన్మస్థలమైన కేరళదేశమున కర్ణామృతము శతకత్రయ పరి మిత మను విషయము నీ క్రింది శ్లోకము తెలుపుచున్నది.

కర్ణామృతం భగవతశ్చరితం రసజ్ఞః
శ్లోకత్రయాధిక శతత్రయ మాదరేణ

శృణ్వన్ పఠన్ననుదినం సముపైతి సిద్ధిం
సిద్ధోయథా సకలలోకవిహారరూపమ్.

ఈ శ్లోకమున నిరూపితమైన విషయమును బట్టి, కేరళదేశమున పారాయణక్రమములో నుండిన యీ కర్ణామృత శ్లోకములు శతకత్రయ పరిమితములే గాని, ఏకశతక పర్యాప్తములు మాత్రము గాదు. మఱియు పరమేశ్వర ప్రేరితుండై బోధామృతమను నీ కర్ణామృతవార్తిక శ్లోకములను రచించిన కేరళదేశీయయతి కూడ, మూఁడు శతకముల లోని శ్లోకములకు వ్యాఖ్యానము చేయుటచే, బిల్వమంగళ విరచితమైన కర్ణామృతము శతకత్రయ పరిమితమే యనుట స్థిరపడుచున్నది. ఆంధ్రదేశస్థులైన వ్యాఖ్యాతలు పాపయల్ల సూరియు, ఆవంచ రామచంద్రబుంధేద్రుఁడును తాము రచించిన వ్యాఖ్యానములను మూఁడు శతకములకు సమగ్రముగ రచించియే యున్నారు. వెలఁగపూడి వెంగనామాత్యుఁడు ఈశ్లోకములకు తెలుఁగు పద్యములు వ్రాయుచు మూఁడు శతకములకు సంపూర్ణముగ వ్రాసియున్నాఁడు. ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయములో కేవలము సంస్కృత శ్లోకములు గలవి. ఆంధ్ర పద్యానువాద సహితములు, ఆవంచ రామ చంద్రబుధేన్ద్ర పాపయల్లసూరివిరచిత వ్యాఖ్యానమేతములు నగు ప్రతులు సుమారు ఇరువది గలవు. వీనిలో పదునెనిమిదింటిలో శతకత్రయమునకు సంబంధించిన శ్లోకములు పద్యములు గలవు. చాల ప్రతులలో ప్రతి శతకము నందు నధికముగఁ గొన్ని శ్లోకములును గానవచ్చుచున్నవి. అందుచే వంగదేశస్థులు తదనుయాయులు 120 శ్లోకములు మాత్రమే లీలాశుక విరచితములని, మిగిలినవి ప్రక్షిప్తములని యూహించుట సరి పడదనియే నామతవి.

## ఈ వ్యాఖ్యానమునకుఁ గలవిశిష్టత

ఈ వ్యాఖ్యానము బైటఁబడనంతవఱకు శ్రీకృష్ణకర్ణామృతము

వైష్ణవగ్రంథ మేయని యావద్భారతమున ప్రసిద్ధి కెక్కినది. ఈ బోధామృత వ్యాఖ్యానము పేరును బట్టియే కర్ణామృతమునకు సరిపడిన వ్యాఖ్యానమనియు, శ్రీశుకోపదిష్ట భాగవతము వివిధమతానుయాయులకు నుపాదేయమైనట్లులు, లీలాశుకోపదిష్టకర్ణామృతము సకల మతానుయాయులకు నాదరానుసంధానయోగ్యమనియు స్పష్టము చేయుచున్నది. బాలగోపాలలీలల నద్వైతభావనతో నెట్లు భావింపవలెనో యాక్రమము నీవ్యాఖానారంభ శ్లోకము లిట్లు తెలుపుచున్నవి.

శ్లో. స్వాత్మావై కృష్ణ ఈశో నిఖిల విమల చిద్వృత్తయో గోపికాహి
స్వాత్మాహంకారవర్గస్సకల సుఖదగోపాస్సధీ తాగమాస్తః
వేణుర్జ్ఞానంసుపిఞ్ఛం స్వవిషయమమలంత ప్రియాబ్రహ్మవిద్యా
గాస్సర్వాణీన్ద్రియాణి ప్రజయతి సకలాధ్యాత్మశాస్త్రార్థ ఏవమ్

శ్లో. స్వాత్మానం కృష్ణమీశం నిఖిలవిమలచిద్వృత్తిరూపాశ్చ గోపీ
స్స్వాత్మాహంకారవర్గాస్సకలసుఖదగోపాన్సధీతాంగమాస్తమ్
వేణుం జ్ఞానంసుపిఞ్ఛం స్వవిషయమమలంత ప్రియాం బ్రహ్మవిద్యా.
గాస్సర్వాణీన్ద్రియాణి ప్రతిదివసమతః ప్రేమభక్త్యాభివన్దే.

ఈవిధముగనే బాలగోపాలలీల లన్నియు నద్వైతానుసన్ధానపరముగ నన్నికర్ణామృత శ్లోకములకు వివిధ విజ్ఞానబోధామృత శ్లోకరూపములుగ మలచఁబడినవి. అద్వైత భావనాభావిత చిత్తవృత్తులైన వారి కీవార్తిక మమృతప్రదము.

కృష్ణకర్ణామృతమునకు శ్రీకృష్ణ మధుర భక్తి భావ ప్రతిపాదకముగ రచింపఁబడిన యీ క్రింది వ్యాఖ్యానము లుపలభ్యములు.

1. సువర్ణచషకవ్యాఖ్య - పాపయల్లసూరి రచించినది.
2. కృష్ణవల్లభ-గోపాలభట్ట విరచితము. (ఈతఁడు చైతన్య శిష్యుఁడు)
3. సారఙ్గరఙ్గద-కృష్ణదాసవిరచితము. (వఙ్గదేశమున)
4. సుబోధిని-చైతన్యదాస విరచితము. (,, )

5. సువర్ణ పాత్రి-బ్రహ్మదత్తవిరచితము. (కొందఱీతఁడాంధ్రుఁడనియు, కొందఱు కేరళీయుఁడనియు నందురు)

6. ప్రప-కృష్ణపండిత విరచితము. (శంకర విరచితముగా ప్రసిద్ధము.)

7. శ్రవణాహ్లాదిని-గోపాలభట్ట విరచితము. (కృష్ణవల్లభ వ్యాఖ్యాన రచయిత కంటె నీతఁడు వేఱు)

8. భగవద్భక్తిరసాయనము-ఆవంచ రామచంద్రబుధేంద్ర విరచితము. (ఈతఁడా త్రేయీతీరస్థ కాజులూరు వాసి. ఆంధ్రుఁడు.)

9. కర్ణానందప్రకాశిని-అజ్ఞాతకర్తృకము.

10. 11. అజ్ఞాతకర్తృకమైన మఱి రెండు వ్యాఖ్యానములు.

బిల్వమంగళుని గూర్చియు, ఆతని కాల నిర్ణయాదికమును గూర్చియు పై నుదాహరించిన కర్ణామృత వ్యాఖ్యానములను గూర్చియు శ్రీ డాక్టరు కె. కుంజన్ని రాజాగారు సప్రమాణముగ సోపపత్తికముగఁ దెలిపియున్నారు. వారిని నేను ప్రశ్నించునంతవఱకు వారికీ వ్యాఖ్యానమొకటి కలదను వార్త తెలియనేలేదు. వారీ విషయము తెలిసికొని యమితానంద భరితులైరి. శారీరకమీమాంసాభాష్యసతత పర్యావర్తన శీలుఁడై అద్వైత వేదాంతశాస్త్రసిద్ధాంతముల నుదాత్త శైలిలో శ్లోకబద్ధము చేసిపెట్టిన యిట్టి వ్యాఖ్యాన మపూర్వము. ఇట్టి వ్యాఖ్యానమును రచించుటచే కర్ణామృతమహత్వము కూడ నినుమడించిన దనవచ్చును. కట్టుకథల మూలమున నేర్పడిన చిత్త సంస్కారముతో బిల్వమంగళుని చింతామణివేశ్యాసంసక్తునిగ భావింపక, ఆతఁడు మొదటినుండియు బిల్వమంగళయతియు లీలాశుకమునియు నై యుండెనని యూహించుట కీవ్యాఖ్యానము సహకారి కాఁగలదని సహృదయులైన పాఠకులకు నామనవి. గంగాదేవి మధురా విజయ కావ్యములో లీలాశుకకవినిగూర్చి పలికిన,

మందారమఞ్జరీస్యన్దిమకరందరసోర్మయః
కస్య నాహ్లాదనాయాలం కర్ణామృతకవేర్గిరః

అను శ్లోకమును స్మరించుచు నీ విషయము నుపసంహరించు చున్నాఁడను.

ఆంధ్రసాహిత్య పరిషత్పక్షమున నీ గ్రంథము వెలుఁగులోనికి వచ్చుటకు సహకరించిన కేంద్రప్రభుత్వాధికారులకు, దీని ముద్రణ మున కనుమతి నిచ్చిన ఆసమితి సదస్యులైన డాక్టరు వి. రాఘవన్ గారికి, సంపాదకుఁడనైన నేను పరిషత్పక్షమున నాహార్దికమైన కృతజ్ఞత నిందు మూలముగఁ దెలుపుకొనుచున్నాఁడను.

లీలాశుకుఁడు ప్రసిద్ధమైన కవియనియు మునియనియు, ఆతఁడే రచించిన బృందావన స్తుతియందలి యీ క్రిందిశ్లోకము, తుదివాక్యము ను తార్కాణించుచున్నది.

శ్లో. బృందావనవ్యసనినస్తవ దేవ కృష్ణ
లీలాశుకేన రచితం విచితం రసాఢ్యైః,
ప్రత్యక్షరం పరిదుహన్ మధు కర్ణయోస్తే
స్తోత్రం తదేతదనిశం విలిహన్తుధన్యాః.

ఇతిశ్రీ మహాకవి కృష్ణలీలాశుకమునివిరచితం షష్టిసంఖ్యం స్తోత్రరత్నసోదరంనామ బృందావన స్తోత్రం సమాప్తమ్. ఈ బృందావనస్తోత్రమును కీ. శే. మానవిల్లి రామకృష్ణకవిగారు శ్రీ తిరుమల వెంకటేశ్వర జరనల్ 225-250 పుటలలో ప్రకటించియున్నారు. ఈ బృందావన స్తోత్రమునందలి రచనాక్రమము కర్ణామృత రచనకు సర్వథా సరిపడియే యున్నది. కర్ణామృతములోవలెనే యిచటఁగూడ లీలాశుకుఁడు కవియై మునియై, దేవా! కృష్ణా! నేను రచించిన ఈ స్తోత్రము నీకర్ణములలో ప్రత్యక్షరమునకు దేనెను జిలుకుచుండుఁగాక

యని వాకొనుచున్నాఁడు. తుదినిగూర్చిన పుష్పికావాక్యమును బట్టి ఆతఁడు మునియైన కవియని తెలియుచున్నది. కావున లీలాశుకుని మునిత్వమును గూర్చి, బిల్వమంగళుని యతిత్వమును గూర్చికాని శంకింపఁ బనిలేదని నా మనవి. కాని యీతనిఁ గూర్చిఁ ప్రచారము లోనికి వచ్చిన ప్రవాదములను బట్టి వ్యాఖ్యాతలలోఁ గొందఱీతనికి చింతామణియను రూపాజీవతో సంబంధము నీతని నిర్వేదమునకు మూలమని తెలుపుట న్యాయ్యముకాదని నా మనవి.

ఆంధ్రసాహిత్య పరిషత్తునందున్న తాళపత్త్ర గ్రంథ సంచయము ఈనాఁడు విమర్శకాధికుల కెట్లు సహకరించుచున్నదో యొక విషయమును తార్కాణించెదను. డాక్టరు. రాఘవన్ మహాశయుల కంతేవాసినియై అమెరికాదేశమునుండి వచ్చి, సంస్కృతములో పిహెచ్. డి కి కృషి చేయుచున్న కుమారి ఫ్రాన్సిస్ విలసన్ అను వనిత, శ్రీకృష్ణకర్ణామృతపరిష్కారమును విషయముగాఁ దీసికొని, శ్రీ రాఘవన్ గారియనుమతితో పరిషద్భాండాగారమునందలి తాళపత్త్ర ప్రతులను పరికింప వచ్చినది. ఆమె యిచటి యీ బోధామృత వ్యాఖ్యానమునందలి విషయమును, ఇతర తాళ పత్త్ర ప్రతులలోని విషయమును గూడ సంకలితముఁ జేసికొనుచు, ఈ మధ్యలో కేరళ దేశమందలి తాళపత్త్రగ్రంథపర్యవేక్షణము సాగించుచు, ఈనాఁడే (క్రోధి-శ్రావణ-కృష్ణచతుర్దశి) నాకొక జాబు వ్రాసిన దామె. దానిలో నామె వ్రాసిన వాక్యములిట్లున్నవి.

At present I am in Trivendram working at the university of Kerala. Perchance I shall visit the Trichur Math whose head is always designated as Bilva mangala Swamiyar and the Saivate temple some miles outside of Trichur which is traditionally conennected with Bilvamangala.

వీనిని బట్టి కూడ బిల్వమంగళుఁడు యతీశ్వరుఁడేయను మాట స్థిరపడుచున్నదను విషయమును దెలుపుకొను చున్నాను.

## శ్రీపిఠాపురము మహారాజావారు — మధురస్మృతులు

[ఆంధ్రసాహిత్య పరిషత్తువారు నడుమనే కీర్తి శేషులైన శ్రీ పీఠికాపురాధీశ్వరుల స్మృతిచిహ్నముగా నొక సంపుటము వెలయించు చున్నామని, దానికి శ్రీ మహారాజావారికిని నాకును గల చిరపరిచయమును దెలుపుచు, నొక వ్యాసము వ్రాయగోరుచు, నా సంపుటము సంపాదకులగు శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారొక విజ్ఞప్తిని బంపిరి పరిషదధ్యక్షులగు శివశ్రీ బండారు తమ్మయ్యగారును నా పేర వ్రాసిరి. కాని నేనట్టి విషయమును గూర్చి వ్రాయునపుడు, శ్రీమహా రాజావారి మాటయటుండనిచ్చి, నేను నా పాండిత్య ప్రగల్భము ప్రక టించు కొనుట కది వ్రాసితినేమో యని లోకమనుకొనునని చాల సందేహించి వ్రాయకూనితిని.

ఇట్టి రచనలు కేవలము వ్యక్తిపరములు గావనియు, భాషా సాహిత్య చరిత్రకేమి. శ్రీ మహారాజావారి స్వరూప స్వభావ విశిష్ట గుణములు సూక్ష్మముగా గ్రహించుటకేమి, యత్యావశ్యకములని సంపాదకులగు శ్రీ దత్తుగారు నన్ను ప్రోత్సహించుటచే, నీ వ్యాసము బంపితిని. అందునకు వారికి నా కృతజ్ఞత.

ఈ వ్యాసమున నాసిన విషయములన్నియు దెలిసిన వారు నేడును నున్నారుగాన, నిందలి వన్నియు యథార్థ కథనములని గ్రహింప వేడుచున్నాను.]

ఇప్పటికి సరిగా నిరువదియు నెనిమిది యేండ్ల క్రిందట ననగా, క్రీ. శ. 1936 ఆగష్టు తే 15 దిని జరిగిన యుదంతము. నా జీవిత దృక్పథమును మార్చి, నా యభ్యుదయమునకు మూలమైనట్టి శుభ సమయము శ్రీ పీఠికాపుర మహారాజేంద్రుల ప్రథమ పరిచయభాగ్యము లభించిన ప్రశస్తదివసము.

కాకినాడలో నేనప్పుడు. నేడు స్టేటు బ్యాంకు "గా నామాం తరము జెందిన ఇంపీరియల్ బ్యాంకు" లో నొక గుమస్తాగా నుంటిని.

ఆనాఁడుదయము 9-30 లకు బ్యాంకునకు వెళ్ళి, ఆఫీసు నందడుగు పెట్టు సమయములో నొక యపరిచిత వ్యక్తి నా కొక చీటి నందిచ్చెను. అందు నాంగ్లేయ భాషలో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు ఇంపీరియల్ బ్యాంకు, కాకినాడ అని యుండెను. ఇది యేమని తెచ్చిన వారి నడిగితిని. ఆయన దానిని శ్రీ పీఠాపురము మహారాజావారు పంపిరనియు, నన్ను చూచుటకు వారు కుతూహలులై యున్నారనియు తాను కారును తీసికొని వచ్చితిననియు జెప్పెను. వెంటనే నేను మా యధికారివద్దకు బోయి, శ్రీ వారి దర్శనము చేసి, పదిపదునైదు నిమిషములలో వచ్చెదనని చెప్పి యనుజ్ఞ గైకొంటిని. అప్పటికి నా యుద్దేశము మహారాజులు మన కంతకంటె నెక్కువ కాలము మాట్లాడుట కవకాశమిత్తురా'' అనియే

కాకినాడలో వారి స్వంత బంగళాలో ముందుగదిలో వారాసీనులై యుండిరి. నారాక, శ్రీ వారి కెఱిఁగించి యచటివారు నన్ను వారి సమక్షమునకు గొనిపోయిరి. వారును, నేను రాఁగానే లేచి నిలువఁబడిరి. నేను వారికి నమస్కరించి "మహారాజా పూర్వము శ్రీ కృష్ణదేవరాయ లాంధ్రదేశముననే గాక దక్షిణదేశమున, ఆంధ్ర భాష చిరస్థాయిగ నుండినట్లు చేసిన మహారాజును చరిత్రలలో మాత్రమే చదివితిని. ఆంధ్రభాషాపోషక తేజముగు, నా యభినవకృష్ణరాయ ప్రభువును నేడు ప్రత్యక్షముగ దర్శించు భాగ్యముగలిగినది" అని వెంటనే ఆముక్తమాల్యదనుండి "శ్రీ కమనీయహారమణి" "ఘనతత్త్వమొంభో" "స్యందనస్థిత బిడౌజ" అను మూడు పద్యములను చదివి మహారాజా తమరు నాకంటె యన్నివిధముల పెద్దలు. సూర్యునకు దీపమున నర్చలిచ్చునట్లు తమచే పద్యత్రయమును సుమాంజలిగా వినయముతో నర్పించుచున్నాను." అని విన్నవించితిని.

ఇవి చదువునంతవఱకు శ్రీ వారట్లే నిలువఁబడి యుండిరి. పైరీ

తేని నేను విన్నవింపఁగనే, తాము కూర్చుండి, నన్ను దగ్గఱగా కూర్చుండ నియమించిరి. వెంటనే వారు శ్రీ కపిలేశ్వర పురాధినేతలు ♦ శ్రీ బులుసు బుచ్చిసర్వారాయడు బహద్దరు వారు ప్రకటించిన చింతల పూడి యెల్లనార్యకృతమగు రాధామాధవమునకు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో నేను వ్రాసిన సమీక్షను తాము చదివితిమనియు, నందు తామీావఱకు విన్నదానికన్న విశేషములున్నవనియు దెలిపి నన్ను శ్లాఘించిరి. తాముకూడ, రాధామాధవకవి రచితమైన మఱియొక ప్రబంధము విష్ణుమాయానాటకము ముద్రింపనున్నామనియు ఆ గ్రంథ పరిష్కరణమునకు పీఠికావి వివరణములకు నాసహాయము వలసి యుండునని తెలిపిరి. నేను నాశక్తి వంచనలేక సాయము చేసెదనంటిని.

ఇంతలో నేనంతకుముందు ప్రకటించిన రావిపాటి త్రిపురాంతకుని "త్రిపురాంతకోదాహరణము"ను శ్రీ మహారాజావారి కిచ్చి యుదాహరణకావ్య ప్రాశస్త్యమును వారికెఱింగించితిని, వారును. "ఈ సాహిత్య ప్రక్రియ నేనెఱుఁగను. మాగురువుగారికి తెలియునేమో అని వెంటనే వారికి కబురు పెట్టిరి. గురువుగారనగా కీర్తిశేషులు శ్రీ వారి ఆస్థానాంధ్రకవీశ్వరులు ఓలేటి వెంకటరామశాస్త్రిగారు. వారు రాగానే, శ్రీవారు లేచి, తత్క్షణమే కూర్చుండి. నన్ను పరిచయ మొనర్చి ఉదాహరణకావ్యములను గూర్చి యడిగిరి. వారును నిది

---

♦ వీరు రాధామాధవమేగాక సుగ్రీవ విజయమను యక్షగానము ప్రకటించియున్నారు. శ్రీ మహారాజావారికి పూర్వమే నన్నెఱిగి, నాసాహిత్య పరిశ్రమను గుర్తించినవారు. వారే నన్ను శ్రీ మహారాజా వారికి పరిచయమొనర్చిన మహానీయులు. ఆంధ్రరాష్ట్రమున ముందు విద్యాశాఖామాత్యులుగానున్న శ్రీ పట్టాభిరామారావుగారి జనకులు. ఈ సందర్భమున వారినామము కృతజ్ఞతతో స్మరించుచున్నాను.

చాల యపూర్వ ప్రక్రియయని యిట్టి రచనచేయుటకు పూను కొనియు, నొకటియైనలక్ష్యము కానరాకుండుటచే విరమించితిమనియు, భాషాసాహిత్యములలో నెంతో పరిశ్రమ చేసిన గాని, నీ గ్రంథము యొక్క ఉనికి, యోగ్యత, గుర్తించుట కష్టసాధ్యమనియు, చెప్పిరి. శ్రీ వారి కా మాటలు విన్నతోడనే కావ్య విశేషములు తెలిసికొన కుతూహలము గలిగినది గోష్ఠి ప్రారంభ మైనది. నేను, పీఠికలో, త్రిపు రాంతకుని ప్రేమాభిరామము క్రీడాభిరామమునకు మాతృక)ను గూర్చి మదన విజయమును గూర్చి వ్రాసిన విషయములు వినిపించు నప్పుడు, వారిది వఱకే క్రీడాభిరామమును కనిచదివి యుండుటచే, నా భాగము వారి నాకర్షించినది నా చేతనున్న పుస్తకము గురువుగారి కీయమని, నన్ను తరువాతి గ్రంథము వివరింపుమనిరి నాకు పీఠిక మూల ముతో సహానది కంఠస్థమగుటచేత నన్నింటిని వివరించితిని ఇది యం తయూ ప్రాచీనసాహిత్యమే గాన శ్రీవారికి వినకుతూహల మైనది. అందలి విషయములు చర్చకురాగా నాగోష్ఠిలో నేను, కాలమును గమనింపలేదు. అప్పుడొక గంట మ్రోగినది. పదకొండు గంటలన్నర అయినది. నేను బ్యాంకు పని అన్నియు మఱచిసాహిత్య ప్రపంచము నబడితిని. అధికారు లెట్టి శిక్ష విధింతురో యనితహ తహ లాడితిని. శ్రీ వారును నా పరిస్థితిని గమనించి లేచిరి. నేనును లేచి వారిని సెల పడుగగా మందహాసముతో నాంగ్లేయభాషలో You can see me when ever you like and also you can write me direct. అని యనుజ్ఞ నిచ్చిరి.

శ్రీ వారికి సుతరాముసు అపరిచితుడనగు నాతో, వారు రెండు గంటల సేపు ప్రథమ దర్శనముననే ప్రసంగించినపుడు, వారికిం గల, ప్రాచీనాంధ్రసాహిత్యాభినివేశ మెంతటిదో యూహింపుడు.

శ్రీ మహారాజావారు మూర్తీభవించిన గ్రాంథిక భాషాభిమాన

మని చెప్పవచ్చును. వారు ప్రకటించు ప్రతిగ్రంథమును నామూలా గ్రముగ పరిశీలింతురు. అంతలి గద్యపద్యములనే గాక ప్రతిశబ్దమును సావధానముగా చిత్తగింతురు. గ్రాంథిక భాషాశబ్ద విషయమై వారి కెంత పట్టుదల గలదో యీ క్రింది యంశము వెల్లడింపగలదు.

శ్రీవారు విష్ణుమాయానాటకము ముద్రించుచున్నారు. అందు మొదటి యాశ్వాసములోనే యీ క్రింది ప్రయోగము వారికి గాన వచ్చినది.

శా. ఆ తేజంబును ... ... ...

... ... ... ... ... వేడ్వేఱుగా

మాతాము చు దలంచి (౧-౨౮) 'మాతము' అను గ్రాంథికరూపమునకు మాతాము. అను వ్యవహారిక రూపము కవి ప్రయోగించినాడు. మఱియు దీనిని మార్పు చేయుటకవకాశము లేకుండ యతి ప్రాసస్థానముల రెంటియందు, నా రూపమునే బంధించి యున్నాడు.

గురువుగారగు వెంకటరామశాస్త్రిగారే దీనికి పరిష్కర్తలు. వారును నిది వ్యావహారికరూపమని, నిచట పాఠాంతరమున్న చూడ వలె ననిరట. అయిన నాతో కూడ సంప్రతించినచో సమంజసముగ నుండునని సూచించిరట.

వెంటనే శ్రీవారు నాకు కాకినాడ కబురంపిరి నేనును పిఠా పురమునకు బోయి వారిని దర్శించి విషయమేమియని విన్నవించితిని. శ్రీవారు "ఇదిగో మహాకవి యైన యెల్లనయే, వ్యావహారిక రూపము ప్రయోగించినాడు. ఆతడట్లు చేసియుండడని నానమ్మకము. పాఠాం తరమున్న దేమో" ఇది యెట్లు ముద్రించుట" యని సెలవిచ్చిరి.

నేను, ఆ పద్యమును, పూర్వోత్తర సందర్భము పరిశీలించి,

మహారాజా ఈ శబ్దము నెంత మాత్రము మార్చుటకు వలనుపడదు. అవి యతిప్రాస నిబద్ధమైయున్నది. 'చూతాము' అనునది వ్యావహారిక రూపమే యైనను కవి యచ్చట ప్రయోగింపవలసినదియే ప్రయోగించినాడు. ఆతనికి ముందే మఱియొక కవి దానిని ప్రయోగించి, ఆశబ్దమునకు గ్రాంథికతావస్థ గల్పించుటచే, నెల్లనయు దానిని వాడియున్నాడు. అంటిని శ్రీవారు దానిని తెలుపమనిరి.

అంతట నేను, అయ్యలరాజు త్రిపురాంతకుడు (తిప్పయ్య) కవి రచించిన యొంటిమిట్ట రఘువీరశతకమునందలి యీ క్రింది శార్దూల పద్యపాదము నుదాహరించితిని ఆశతక కర్త ప్రసిద్ధుడని తెలిపితిని.

శా. హేతిం జేకొని ... ...

... ... ... స్తంభంబులోఁ జూపరా

చూతామంచును వేఁయు ...

శ్రీవారు వెంటనే యాశతకమును దెప్పించి యందీ ప్రయోగము కానవచ్చినందున సంతసించిరి. కవి కూడ క్రీ. శ. 1450 అనగా నెల్లనకు రమారమి నూఱేండ్లు ముందువాడని యందే యుండుటయు వారికి జూపితిని. అయినను శ్రీ వారికది వ్యవహారికమను శంకయు, దాని నెట్లు ముద్రించుటయను సందేహమును నట్లేయున్నవి. శ్రీవారు "కవి గొప్పవాడే కావచ్చును. కాని యదియొక సామాన్యశతకములోనిది. ఏదియైన కావ్యములో నున్నగదా మనము గ్రహించుటకు వీలుండును" అనిరి.

నేనంత యిట్లు వివరించితిని మహారాజా "చూతాము". ప్రయోగమున్న శతకము సామాన్య శతకముగాదు. ఆంధ్ర శతక వాఙ్మయములో నిదియొక విశిష్టశతకము ఈ యయ్యలరాజు త్రిపురాంతకుని మనుమడైన అయ్యలరాజు రామభద్రకవి తన రామాభ్యు

దయ గద్యలో నేమి చెప్పియున్నాడో చిత్తగించండి. "శ్రీమదొంటిమిట్ట రఘువీరశతక నిర్మాణ కర్తృక జగదేక ఖ్యాతి ధుర్య యయ్యలరాజు తిప్పయామాత్య పౌత్ర ... రామభద్ర ప్రణీతంబైన రామాభ్యుదయ ప్రబంధంబున ప్రథమాశ్వాసము. అని గద్య చదివి" ఇట్లు గద్యయం దీశతక నిర్మాణము నుట్టంకించుటయే, యీశతక వ్యాప్తికి నుత్కృష్టతకు దృష్టాంతమని, ఇంతేకాదు, ఈ శతకమును లాక్షణికు లంగీకరించినది కస్తూరి రంగకవి తనరంగరాట్ఛందస్సులో నీ రఘువీర శతకమునుండి పద్యములను లక్ష్యముగా గ్రహించియున్నాడు కాబట్టియే, ఎల్లన దీనిని వ్యావహారికమైనను, తనకావ్యమున ప్రయోగించినాడు." అని ఎల్లన ప్రయోగమును సమర్థించితిని.

మహారాజావారు నా సమర్థనకు చాల మెచ్చుకొనిరి, శ్రీవారు గ్రంథమునందా రూపము, ముద్రించుట కంగీకరించియు, తాము వ్యావహారికరూపము నంగీకరించుచున్నామని పండితలోకము భావించునేమోయని సందేహించిరి. అప్పుడు గురువుగారును, నేనును, ఆశబ్దమునకు, ప్రత్యేకముగా "        " నిట్టి గుర్తులు పెట్టిన, మన మంగీకరించినట్లు కాదని విన్నవించితిమి. వారును సంతసము జెందిరి.

ఈనాడు, గ్రాంథిక వాదులగు మన విద్వాంసులలో, కవులలో, నెంతమందికిట్టి సుశబ్దాపశబ్దవివేచన గలదు? శబ్దముల మాట యటుండనిచ్చి, యసలు మూలగ్రంథముల ప్రసక్తియే మనకు లేదుగదా? ఇట్లు ప్రాచీనకావ్యముల యందేగాక, నవీనకావ్యముద్రణమున శ్రీవారు కడు శ్రద్ధ వహించువారు. తమకు సంస్కృత విద్యాగురువులును, ఆస్థాన విద్వత్కవీంద్రులునగు శ్రీ దేవులపల్లి సుబ్బారాయశాస్త్రులవారు రచించిన మహేంద్రవిజయమును పరిష్కరించి పునర్ముద్రణము చేయించుచున్న సమయమున అందులో

తృతీయాశ్వాసమున. నొకచో "గుణజ్ఞండైన" అనుపదమున యతి స్థానమున 'జ్ఞా' ఉండవలసినచోట 'జ్ఞ' పడినది. గుణజ్ఞండైన' అను నాపదమును చూచి. శ్రీవారు యిది యెట్లు ? ఇట్టి రూపము కలదా? యని శంకించి, నన్ను పిలిపించి యీ ప్రయోగము చూపిరి. నేనును "మహారాజా! ఇది యతిస్థానమున నున్నది. అయిననిది (శ్రీ సుబ్బ రాయశాస్త్రిల వారి స్వహస్త లిఖిత ప్రతినుండి వ్రాయబడిన దగు టచే, మఱియొక పాఠమునుండుట నవకాశము లేదు. ప్రాచీనకాలమున ప్రథమావిభక్తి 'డు' ప్రత్యయము చేరినను. అత్వరూపములు రామడు, భీమడు, సోమడు-మొదలగు శాసనములందున్నవని చెప్పి తిని. వారును కావ్యములలో నున్నవా ? చూపుమనిరి. వెంటనే గౌరన నవనాథచరిత్రమున ననువుగా నాగార్జునడు చెప్పినట్లు" అను ప్రయోగము చూపితిని. ఈనాడు మనమంతగా చదువని గౌరన కృతుల యందు శ్రీ మహారాజావారికి గౌరవము కావున నా ప్రయో గము నట్లేయుంచ ననుమతించి ముద్రణము పూర్తినొందించిరి.

ప్రాచీనాంధ్ర సాహిత్యములో, కావ్యములలోని శబ్దవిషయ మందేగాక, పాఠభేద విమర్శనము సాధు నిర్ణయము వీనియందు శ్రీ వారికి గల యభినివేశము వర్ణనాతీతము. కళాపూర్ణోయమును సుపరిష్కృతముగా ముద్రణ జరుగుచున్న సమయమది.ప్రథమాశ్వాస ములో నున్న "కూఁకటి వేణితో కురులు గూడక మున్న అనుప్రసిద్ధ పద్యములో "అట్టాకలఁ బెట్టెనా నరవ నామెత బాలికకై విటావ ళిన్" అను పాదమున" అరవ నామెత" అనుదానికి యర్థము సరిగ కుదరలేదు. అంతకు ముందు కళాపూర్ణోదయ వ్యాఖ్యాతలును, శ్రీ మల్లాది వారును ఆపదబంధమునకు "అరవన్ =రాజమార్గమున; ఆమెత=విందు" అని వ్రాసిరి. శ్రీ వారికిది యెంతమాత్రము సమ్మ తము కాలేదు. ఆ కాలమునకు గురువుగారగు వేంకటరామ శాస్త్రిలు

గారు దివంగతులైనారు. శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిలుగారి (వీరును కీర్తిశేషులు) ఆధ్వర్యముక్రింద యది జరుగుచుండెను. పాఠ భేదములతోపాటు అచ్చులో ముద్రణస్ఖాలిత్యము లే మాత్రము నుండగూడదని వారి యాశయము కాబట్టి యొక్కొక్క ఫారము ముద్రణ నందుపరికి చాలకాలము పట్టుచుండెను. కళాపూర్ణోదయము వారికత్యంతప్రీతిపాత్రమగు గ్రంథముగావున దీనిపాఠ భేద నిర్ణయము నకై యొక గోష్ఠి గావించిరి. దానికి చెన్నపురినుండి శ్రీ గిడుగు సీతాపతి పంతులుగారును వచ్చిరి. ఆసందర్భమున పైపద్యమును చదివి చివరపాదమున కిట్లర్థము చెప్పితిని.

ఉ. కూఁకటివేణితోఁ గురులు కూడకమున్న కుచప్రరోహముల్
పోఁకలతోడి సామ్యమునుఁ బొందకముున్న నితంబసీమకున్
వ్రేఁకదనంబొకింత ప్రభవింపకమున్న ప్రసూనబాణుఁడ
ప్ఫోఁకలఁబెట్టెఁబో నరవయామొత బాలిక కై విటావళిన్.

దీని నిట్లు "అరవయామొత" అని పాఠభేదముతో చదువగానే శ్రీవారు "ఏమి, పాఠమును మార్చినట్లున్నారే అయినా విశేష మేమో. అర్థముచెప్పండి" అని సెలవిచ్చినారు. నేనును, మహారాజా "అరవనామొత" అనగా నర్థములేదు. అరవ యామొతయనఁగా, అర వాయి + ఆమొత యనగా నర్థమున్నది. ఆమొత, అరవయామొత నలువాయ్-నలువయైనట్లుగా-అరవాయి-అరవమైనది. అరవ-యనగా సగమునోరు-ఆమొత అనగావిందు- అరవయామొత అనగా సగమునోటి విందు. పద్యభావముకూడ అంతేకలభామినికింకను యౌవనోదయము కాకుండగనే బ్రహ్మ విటావళిని బాధించుచున్నాడు అనికదా యిం దలి తాత్పర్యము. యౌవనోదయమైనచో, నది సంపూర్ణమైన విందు. పుష్కలముగా ననుభవింపవచ్చును. ఇచ్చట యౌవనోదయము కాలేదు. కావున చూపుల చేతనే విందు. అనుభవమునకురాదు. అం

దుచేత నిది అరవయామెత సగమునోటివింపు అని నేచదివిన పాఠమును సమర్థించితిని. వారును యౌవనసౌందర్యమును భుజించుటేమి అని ప్రశ్నించిరి. మహాకవి కాళిదాసు శకుంతలవిషయమున అనాఘ్రాతంపుష్పం”-ప్రసిద్ధ శ్లోకములో “నజానేభోక్తారం”అని చెప్పినాడు. శ్రీ వీరేశలింగం పంతులువారు “ఆభాసురగాత్రి సోయగమెవండు భుజింప విరించి వ్రాసెనో అని వ్రాసినారు. అని విన్నవించితిని. వారును, హర్షించిరి వెంటనే అట్టి పాఠమేప్రతియందైనగలదా యనిప్రశ్నించిరి. నేనును వ్రాయసకాండ్రు-యా అనునది యర్థము కాకపోవుటనా వ్రాసియుందురు. ఇంతకు మనము కళాపూర్ణోదయమునకు దేశమునందున్న ప్రతులన్నింటిని సేకరింపలేదుగదా అంటిని-నేను ప్రతిపాదించిన పాఠమునకు శ్రీ సీతాపతి ప్రభృతులు మెచ్చుకొనిరి. అది ముద్రణకెక్కకపోయినను శ్రీవారికి కొక్కొక ప్రాచీన పాఠ నిర్ణయమున పట్టుదల యెంతటిదో సూచించుటకీ యుదంతము తెల్పితిని.

మనకు స్వాతంత్ర్యము వచ్చిన వెనుక దేశభాషలోని సాహితీ విశేషములను, రాష్ట్రేతరులకును, ముఖ్యముగా పాశ్చాత్య ప్రపంచమునకు దెలియుటకు మన గ్రంథములను నాంగ్లేయభాషలోని కనువదించుచున్నాముగదా ఈ పనిని పిఠాపురము మహారాజావారు చాలా కాలము క్రిందటనే తలపెట్టిరి. పింగళి సూరనను గూర్చి ఆంగ్లేయ భాషలో నొక గ్రంథమును కీర్తిశేషులు ఓకుమళ్ళ అచ్యుతరావు గారిచే వ్రాయించిరి. అందులో గ్రంథకర్తలు, కళాపూర్ణోదయమున నాలుగు అంతరార్థ కథలున్నవనియు, నది ఉపనిషత్తులో “ప్రశ్నోపనిషత్తు” అను పేరుతోనున్న కళాపూర్ణోపనిషత్తు మూలముగా రచితమైనది అన్న విషయము ప్రతిపాదించిరి. శ్రీవారు ఆంగ్లేయ భాషలో సిద్ధహస్తులు వారాంగ్లభాషలోనున్న దానిని ప్రత్యక్షరము

పరిశీలించిరి. తెలుగు గ్రంథము వారికి బహుపరిచితము కాబట్టి రెండింటిని సరిచూచునపుడు "ఇందు నిజముగా నంతరార్థ కథలున్నవా? ఉపనిషత్తులకు నీ కథకు సంబంధమున్నదా? అన్న సందేహములు గలిగినవి. వెంటనే నాకు కబురంపిరి. నాకప్పటి కావిషయమేమియు తెలియదు. శ్రీ వారిని దర్శించిన తోడనే పింగళి సూరనను గూర్చిన యింగ్లీషు గ్రంథము కళాపూర్ణోదయమున నంతరార్థ కథలున్నవా? అని యడిగిరి. నేనది ఇంగ్లీషుభాషలోనున్నది గదా ఏపదమును వారుప యోగించిరి? అని యడిగితిని. "Allegory" అని వారు సెలవిచ్చిరి. నేనిట్లంటిని మహారాజా కళాపూర్ణోదయమున నాకు దెలిసినంతవరకు అంతరార్థ కథలు అనగా గుణములను, పాత్రలనుగా సృష్టించి ప్రకృతి సిద్ధములైన మానవులు చెప్పుకొను కథాంశములు వచ్చునట్లు రచితములైనవి. సంస్కృతమున నట్టి రచనకుదాహరణముగా, కృష్ణ మిశ్ర విరచితమైన ప్రబోధచంద్రోదయము" అను నాటకమున్నది. కళాపూర్ణోదయము-ప్రబోధ చంద్రోదయము "అన్న నామసామ్యమును బట్టి-గ్రంథకర్తలు దీనిని ప్రతిపాదించిరి యుందురు' నందలి యుపనిషద్విషయమును గూర్చి శ్రీవారందలి సత్యాసత్యముల నిర్ణయించుటకు, నన్ను మహామహోపాధ్యాయ తాతాసుబ్బరాయశాస్త్రి గారు, ఆమ్నాయార్థవాచస్పతి వఝల లక్ష్మీనారాయణశాస్త్రిగారు మొదలగు మహావిద్వాంసుల కడకునంపి ఆ విషయమును గూర్చి స్థిరమగు నభిప్రాయములను సేకరించిరి. అప్పుడచ్యుతరావు గారేలూరిలో నుండిరి. రాయుడు శాస్త్రిలుగారు విజయనగరములో నుండిరి. ఆంధ్ర సాహిత్య విషయమున నేసందేహము గలిగినను యెంత వ్యయమైన సత్యనిర్ధారణ కావలసినదే. దీని కొఱకు నన్నాయాప్రదేశములకు పంపిరి. ఆ పండితులతో స్వయముగా సంప్రతించి, వారు చెప్పిన విషయములను వ్రాసికొని, శ్రీ వారికి నివేదించిన వెనుక శ్రీవారు తమ

యభిప్రాయమును దృఢపఱచుకొనిరి-సాహిత్య విషయమై తమ యభిప్రాయములను బ్రకటించునప్పుడు శ్రీవారు వ్యక్తులను మనస్సునందుంచుకొనరు. ఈ గ్రంథమునకు పీఠిక వ్రాయుచు, నీ విషయమును గూర్చి యిట్లు స్పష్టముగా వ్రాసియున్నారు.

I do not agree with my friend Atchyuta Rao with regard to allegories in Kalapurnodayamu".

ఇట్టి విమర్శక సాహిత్యదృష్టి మన తెలుగు విద్వాంసులలో నెంతమంది కలవడినదో పాఠకలోకమే నిర్ణయింపగలదు.

తెలుగు గ్రంథములవలె సంస్కృత గ్రంథముల యందు ముఖ్యముగా తెలుగువారు చేసిన సంస్కృత రచనలయందును వారికత్యంతాభిమానము. ఒకప్పుడు నేను, శ్రీవారి పూర్వుడగు సర్వజ్ఞ సింగ మహీపాల రచితమైన "రత్నపాంచాలిక" లేక "కువలయావళి" అను సంస్కృత నాటిక కలదని తెలిపితిని. వారత్యాశ్చర్యమును బ్రకటించి, సింగ భూపాలుని కృతి "రసార్ణవ సుధాకరము తప్ప వేఱేయు మేమెఱుగమే అది యెచ్చట నున్నది. తక్షణమే తెప్పించెదము అని తహ తహతో ననిరి నేనది తిరువాన్కూరు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో నున్నదంటిని వెంటనే వారచటికి వ్రాయించిరి. కాని ప్రత్యుత్తరము బడయజాలరైరి-నేనును కార్యాంతరమున కొంత కాలము వారి దర్శనము చేయనవకాశము లభింపలేదు. వారును నాటిక యందే దృష్టి నిలిపియుండిరి. నేను శ్రీ వారిని దర్శింపగానే ఏది రత్న పాంచాలిక" అచ్చట నుంచి జాబు లేదే యనిరి. నేనును, శ్రీవారికి రెండుదినములలో ప్రత్యుత్తరము నిత్తునని చెప్పి వచ్చితిని. అంతకుముందే-యా గ్రంథము ముద్రితమైనదని తెలిసికొని ముద్రణ కర్తలకు వ్రాసితిని నా యదృష్టముకొలది శ్రీవారడిగిన రెండుదినములలోనే యది నాకు చేరినది- పోస్టులోనది అందుకొన్న తత్ క్షణమే,

కాకినాడనుండి బయలుదేరి, పిఠాపురము వెడలి శ్రీవారిని సందర్శించి హాజరు మనవి చేసితిని. వారు వెంటనే సమక్షమునకు రమ్మనిరి. అప్పుడే రత్నపాంచాలిక నాటిక ముద్రితప్రతిని వారికందజేసితిని. వారు పొందిన యానందమునకు మేర లేదు. చూచినతోడనే చదువవలెనని కోర్కె వారికి కలిగినది. కాని అది నాగరలిపిలో నున్నది. వారు సర్వజ్ఞ సింగభూపాలుని కృత్యంతరము రసార్ణవసుధాకరము తెలుగులిపిలోనే చదివిరి. వారంతట ఈ గ్రంథమును నిప్పుడే కాలవిలంబనము కాకుండ తెలుగు లిపిలో వ్రాయింపుడు. రేపు ప్రొద్దుట 8 గంటలకే యది కావలయును అనిరి. అప్పటికి రాత్రి 8 గంటలైనది. అయినను వారి యుత్కంఠను గమనించి, యారాత్రియంతయు, నొక పండితుని చేత నది తెలుగులిపిలో వ్రాయించి ప్రొద్దుటనే వారు నియమించిన కాలము నకే వారికందజేసితిని. వారు దానిని స్వయముగ జదువుటయే గాక, దానినాంధ్రీకరింపజేసి మూలముతో గూడ ముద్రించిరి. ♦ తామెన్నడును కనివిని యెఱుగని సింగభూపాలుని కృతిని తమకు లభింపజేసినందులకు నన్నెంతయో శ్లాఘించిరి. ఆ నానాటి నుండియే రత్నపాంచాలిక యాంధ్రలోకమెఱిగినది. అనువాదములును బయలు వెడలినవి.

సంస్కృతమునుండి భాషాంతరీకరణము చేయుపద్ధతులను గూర్చి శ్రీవారికి నిశ్చితములైన కొన్ని యభిప్రాయములుండెడివి. సంస్కృతమునకు తెలుగు భాషకు అవినాభావసంబంధమున్నది.

---

♦ దీనిని తొలుత విద్వత్కవులు మధురకవితా విశారదులు నగు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు నా వెనుక, శ్రీ డాక్టరు గిడుగు సీతాపతిగారును భాషాంతరీకరణము గావించి యున్నారు. ఈ రెండును మహారాజావారచ్చు వేయించిరి.

శ్రీ విద్వాన్-పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారును దీని ననువదించి యున్నారు అదియు సరసముగనున్నది.

పదములే భాషలో మూడువంతులు పైగా నున్నవి. కాబట్టి మూలములో నున్న పదములనే, నవియు, తెలుగులో నా యర్థములో నున్న వానినే ప్రయోగింపవలయునని వారియాశయము. దానివలన కవి మూలమున నే యర్థము నే భావము వ్యక్తపఱుపదలచెనో, అది తెలుగున భాషాంతరములో కూడ వచ్చునని వారి యభిప్రాయము.

తెలుగు భాషలో తమ కభిమతములైన గ్రంథములను గూర్చి ఆంధ్రసాహిత్యపరిషత్తు రజతోత్సవ సంచిక యందు నొక వ్యాసము వ్రాసియున్నారు. విస్తరభీతిని వాని నుదాహరింపలేదు. వారి వచన రచన విశదమై, సరళసుందర గ్రాంథికమై విరాజిల్లును ✦ అందులో వారుదాహరించిన గ్రంథములలో నీ క్రింది వైనను వారికత్యంతము నభిమాన పాత్రములు (1) కాలక్రమమునననుసరించి నిన్నెచోడుని కుమారసంభవము (2) నాచనసోముని యుత్తరహరివంశము (3) శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద (4) పింగళి సూరన కళాపూర్ణోదయము (5) ప్రభావతీప్రద్యుమ్నము అనునవి.

వీని యన్నింటిని శ్రీవారామూలాగ్రముగ నవలోకనము చేసి యున్నారు. వీని నన్నింటిని జీర్ణించుకొన్నారని చెప్పినను నవి వారికి పంచప్రాణములన్నను నతిశయోక్తికాదు. వీరాకావ్యములను పఠించు విధానమే వేఱు. ఆ ముద్రితగ్రంథముల కన్నింటికి ప్రతిపుట మధ్యను తెల్లకాగితములంతరమున నా గ్రంథము నాకారముగనే బైండు చేయ బడును. ఆ పుటలలో మూలమున కెదురుగ వ్యాఖ్యావిశేషములను

---

✦ శ్రీమహారాజావారు, వ్రాసిన వ్యాసములు, గ్రంథములకు వ్రాసిన మున్నుడులు మొదలగునవి యన్నియు సేకరించి, యొక గ్రంథరూపమున బ్రకటించిన వారి వచన రచనా వైపుణ్యము తేటపడగలదు.

వ్రాయించబడును. అట్లు వ్రాసిన గ్రంథములను వారు, శ్రీ గురువు గారి ముఖమున నధ్యయనము జేయుదురు. అంతటితో వారికి తృప్తి లేదు. ఆగ్రంథముల కన్నింటికి కూలంకషమైన వ్యాఖ్యలతోను పరిష్కృతమై వెలయవలయునని వారియాశయము అట్టి యాశయముతో శ్రీవారు ప్రభావతీప్రద్యుమ్నమునకు శ్రీ పురాణపండ మల్లయ్య శాస్త్రిల వారిచేత టీకాతత్పర్యములు వ్రాయించి ప్రకటించిరి. ఆ ముక్తమాల్యదకు శ్రీ వేదము వారిని సమగ్ర వాఖ్య వ్రాయించుటకు ప్రోత్సాహము నొసగినది ఏరే చాలకాలమునకు కళాపూర్ణోదయము లఘుటీకతో శ్రీ కాశీబట్ల సుబ్బయ్యశాస్త్రిగారి చేత ప్రకటింప జేసిరి. ఇక నన్నెచోడకవి కుమారసంభవమునకు, నాచన సోముని యుత్తరహరివంశమునకు నట్టి సంపూర్ణ వ్యాఖ్యలు వ్రాయింప దలపెట్టిరి కారణాంతరములచే అది కొనసాగలేదు. కుమారసంభవమునకు తంజావూరి ♦ వ్రాతప్రతితో గూడ సంప్రతింపబడిన పాఠభేదములతో, కొలది విశేషములతో, విమర్శాదర్శక నడుకుదిటి వీరరాజుగారు పైరీతిని గ్రంథము నంతరించి శ్రీ మహారాజావారి కిచ్చిరి. ఉత్తర హరివంశమునకు శ్రీ వీరరాజుగారే యట్టి రీతిని విశేషములతో నొక ప్రతిని శ్రీవారికి సమకూర్చి యిచ్చిరి.

పై వానిలో నొకప్పుడు నా యదృష్టవశమున నన్నెచోడని కుమారసంభవమునకు మా గోష్ఠిలో ప్రసక్తము గలిగినది. శ్రీమహారాజా వారితో గోష్ఠి యనగా కత్తిమీద సాముపంటిది. నాకు తామై

---

♦ కుమారసంభవమునకు కీర్తిశేషులు వేటూరి ప్రభాకర శాస్త్రిల వారి చేత నొకసంపూర్ణ వ్యాఖ్యవ్రాయించుటకు ప్రయత్నించితిమి. కాని అవతారికలోని కొలది పద్యములతోనది యాగినది వారు నాచనసోముని యుత్తర హరివంశమునకు సంపూర్ణముగ వ్రాసిరి. కాని అది ముద్రితముకాలేదు.

ప్రశంగవశమున దెచ్చిన విషయములు తప్ప తక్కినవి మనము ప్రస్తావింపరాదు మనము శ్రీవారికి చెప్పెడి విషయములు జాగరూకతతో చెప్పకపోయిన మరునాడు మనమిక వారి దర్శనమునకు బోవనక్కఱ లేదు. దేనిడమన్నా యే - వారంతకుముందే నా గ్రంథ విషయములు కొన్ని యనుభవపూర్వకముగ నెఱిగియు, కొన్ని పెద్దలవలన వినియు వానిని తమవద్దకు వచ్చువారిని నించుమించుగ పరీక్షించునట్లు ప్రసంగము జరుపుదురు. అది వారు గ్రహించు కోరిక యున్నట్లగపడున కున్నను మనకు మాత్రము, మానసిక పరీక్షయే.

అట్టి సంఘటనమే యొకటి. కుమారసంభవ గోష్ఠిలో తటస్థమై శ్రీవారికి నాయందు శ్రద్ధాభి మానగౌరవములు కలుగుటకు హేతువైనవి.

శ్రీవారు, కాళిదాసు కుమారసంభవ శ్లోకములకు గాక, తక్కిన గ్రంథభాగములోని పద్యములన్నియు నన్నెచోడకవిరాజు స్వీయంరచితములేనా యని ప్రశ్నించిరి అట్లు కాదని యందలి పద్యములు శివమహిమ్న స్తవము, మాఘకావ్యము మొదలుగు వాని నుండి భాషాంతరీకరింపబడినవి చాలగల వని చెప్పితిని. అట్లయిన కాళిదాస మూలమున రతిమన్మథ సంవాదము లేదే నన్నెచోడకవి దానిని స్వంతముగా వ్రాసినాడేకదా "అని తిరిగి ప్రశ్నించిరి నేను వెంటనే దానికి మూలము-బ్రహ్మాండ పురాణములో లలితోపాఖ్యానమున నున్నది యని విన్నవించితిని అట్లయిన నా విషయము మేమింకను పరిశీలింపవలసినదే అది సెలవిచ్చిరి. నాటికి గోష్ఠి ముగిసెను. కొంతకాలమైన వెనుక, తిరిగి కుమారసంభవమును గూర్చి చర్చకు వచ్చినప్పుడు, ముందుగా శ్రీ గురువుగారగు వేంకటరామశాస్త్రిల వారు శ్రీవారు నేనుచెప్పిన వెనుక బ్రహ్మాండపురాణస్థలలితోపాఖ్యానము స్వయముగ చూచి నేను వారికి విన్నవించినది సరియైనదని

చాల సంతోషించిరనియు శ్రీవారితో నిట్లే బహుజాగరూకతతో నుండవలయుననియు నుపదేశమొనరించిరి.

మదరాసు విశ్వవిద్యాలయములో నన్నెచోడమహాకవి కుమార సంభవ ముద్రణము సాగుచున్న సంగతి నాకెఱిగి "ఎవరు చేసినను, నది యభినందనీయమే యని యా గ్రంథ ప్రకటనమునకు విశ్వవిద్యాలయము వారినభినందించితి. ఆనాడు నేను మదరాసు విశ్వవిద్యాలయములో ప్రవేశించుటకు హేతువులలో నన్నెచోడకవి కుమార సంభవ ముద్రణ మొక్కటి. కాబట్టి యీ మహారాజ శిఖామణితో బాటు ఆ నన్నెచోడ మహాకవిరాజ శిఖామణికి, నాటికి నేటికి నేను సర్వదా సర్వథా నాజన్మాంతము కృతజ్ఞతా బద్ధుడనై యున్నాను.

శ్రీమహారాజావారు, ఆంధ్రసాహిత్యవిషయమేదియైన తమకు సంబంధించిన స్వంతవిషయమును గూడ నాతో సంప్రదించువారు. కవిసార్వభౌములు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారొకనాడు శ్రీవారి దర్శనము చేసి నాటికి, ఆనందోదయము" అను నచ్చతెనుగు కావ్యము నంకితమిచ్చెదనని, దాని నంగీకరింపవలయునని కోరిరట. ఆ సంగతి నాకు తెలియదు. ఆ వెనుక రెండుదినములైన వెనుక శ్రీవారు నన్ను రమ్మని కబురు చేసి, యీ వృత్తాంతము నాకు తెలియజేసిరి. నేనును, శ్రీవారిని శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారే నడుమనే రచించి, మీకొసగిరా అని యడిగితిని. దానితో శ్రీవారు వారు క్రొత్తగ దీనిని రచించిరనియు తమ్ము నంకితము గొనగోరుచున్నామని తెలిపి ముద్రిత పుస్తకము నిచ్చిరి. నేను దానిని చూచి, యీ పేరితో నొకకావ్యమును వారంతకు నలువదేండ్లు ముందుగా 'కళావతి' అను తమ పత్రికలో ప్రకటించిరనియు దెలిపి, కాకినాడ వచ్చి, నావద్దనున్న ప్రాత కళావతి పత్రిక చూపితిని. అందలి పద్యములే యిందునుండుటచే మహారాజావారు దాని కృతిపతిత్వమున కెంతమాత్ర మంగీకరింపలేదు.

శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారికి నా వలన నిట్టి సంఘటన యేర్పడుటచే నాపై కినుక వహించిరి. కాని సాహిత్యవిషయముల తెలిసిన విషయములను, మఱుగుపఱచకుండ వెల్లడించి తమకు పయోగము గాకుండ జేసి నందులకు మహారాజావారు నన్ను ప్రశంసించిరి.

శ్రీవారికి "సాహిత్య చక్రవర్తి" అను బిరుదమును నొక్క సువర్ణపతకముపై చెక్కించి నేనును, శ్రీ సీతాపతిగారును వారికి సమర్పించి కృతకృత్యుల మైతిమి.

పైరీతిగా వ్రాయుచు నుపక్రమించిన నింకను నెన్నియో విషయములు ఎన్నియోపుటలు వ్రాయవలసి వచ్చును గాన వ్యాస విస్తర భీతిచే ముగించుచున్నాను. అందులో చాల వఱకు నింకను స్మృతి పథముననే యున్నవి గాని గ్రంథస్థముకాలేదు.

శ్రీ పిఠాపురము మహారాజావారి కీర్తికి పరమాధారముగా, ఆంధ్రసాహిత్యపరిషత్తును శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువును నిలిచి యున్నవి. ప్రాచీన సాహిత్యమునందున ప్రాచీన కావ్య ముద్రణము నందును బొత్తిగా సభిరుచిలేని యీ కాలమున శ్రీవారు తలపెట్టిన కుమారసంభవ, ఉత్తరహరివంశాది ప్రాచీన కావ్యములను కూలంకష వ్యాఖ్యలతో, సుపరిష్కృతమైన ముద్రణములను వెలయించిన, నదియే వారికి మహనీయమగు స్మృతిచిహ్నమగును.

వానితో పాటు శ్రీవారి సంపూర్ణ జీవితచరిత్ర నొకటి రచితము కావలసియున్నది. ఈ రెండింటిని గూడ ఆంధ్రసాహిత్యపరిషత్తు వారు పూనుకొని, పిఠాపుర శ్రీమహారాజేంద్రుల యశశ్శరీరమును నమృతీకరింతురు గాక యని యభ్యర్థనము.

నిడదవోలు వెంకటరావు.

— o —



శ్రీ పిఠాపురము మహారాజా
శ్రీ శ్రీ శ్రీ రావు వేంకట కుమార మహీపతి
సూర్యరావు బహద్దరువారు, C. B. E.

## శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరాయ
## సాహితీ సామ్రాజ్యము

(1)

ఆంధ్రత్వమాంధ్రభాషాచ ఆంధ్రదేశస్వజన్మభూః
తత్రాపి.........  ......నాల్పస్య తపఃఫలం।

(2)

తన దేశంబు, స్వభాష, నైజమత, మాతృప్రాక్కులాచారముం
దన దేహాత్మలనెత్తెఱుంగున, సదా దానట్లు ప్రేమించి, త
ద్ఘనతావ్యాప్తికి సాధనంబులగు సత్కార్యంబులన్ సల్పఁగా
ననువౌబుద్ధియొసంగుసీప్రజకు, దేవా ! భక్తచింతామణీ॥

(3)

పుట్టినె దేశమందొక యపూజ్యుఁడు తానిది మాతృభాష, నే
పుట్టినదేశమిద్దియని పొంగక ప్రాణముగల్గుపీనుఁగై॥

శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరు ఆంధ్రసాహిత్య పరిషత్ప్రతిష్ఠాపకుడు. స్వనామాంకితమైన ఆంధ్ర నిఘంటునిర్మాత. స్వదేశభక్తియు స్వభాషాభిమానమును పుంజీభవించిన పుణ్యమూర్తి. సాహిత్యసేవకై జీవితసర్వస్వమును ధారవోసిన ధన్యుఁడు. అట్టి ధన్యుని స్మరించి ధన్యుల మగుటకే యీసామరకసంచికాప్రచురణము. అదియునుగాక నిట్టి యుత్తమపూరుషుని యాంధ్ర భాషారాధన కథనము భావి యాంధ్రదేశపౌరుల కాదర్శప్రాయముగ నుండఁగలదని యీప్రచురణ ముఖ్యోద్దేశము.

సూర్యరాయేంద్రుని యందుగల విశిష్టతయేమి ? రాజరాజు, మనుమసిద్ధి, వీరభద్రారెడ్డి, కృష్ణరాయప్రభృతి ప్రభువరేణ్యులు తాము ప్రాయముతప్పి, జీవితావసానకాలమందు కృతుల నందుట యను గొన్నికృతులు కాలగర్భమున నణఁగిపోయి జీర్ణములౌటయు వినుటకేగాని కనుటకు మనము నోచకపోవుటయు సంభవించెను.

సూర్యరాయేంద్రుడు పాతికేండ్లనిండుజవ్వన ప్రాయముననే కృతుల నందుటయు, నంతకుపూర్వము శిథిలమైన కృతుల నుద్ధరించుటయు నేర్చెను. ఇది యాతని ప్రాక్తన జన్మసంస్కారఫలము. దేవులపల్లి సోదరదేశికద్వయ యాశీస్సులఫలము, ఇట్టి రాజగురువుల ప్రభావమే యీతని సారస్వత జీవనమును దీర్చిదిద్దినది. తరువాత వేంకటరామ కృష్ణ కవిద్వయ సాహచర్య సంపర్కము నాతని యిష్టార్థసిద్ధికి దోహదము గావించినది. తొల్లి సోమకుండను రాక్షసుఁడు యామ్నా యముల సముద్రములో ముంపఁగ విష్ణుమూర్తి వానిని సంరక్షించి నట్లు, మాతాపితృలను గోల్పోయి చిలికవాలికలైన జీర్ణపర్ణములను ధరించి, దృష్టిపథమునఁ బడఁజాలక పోలిక చెడియున్న యనాథ కృతి కన్యకాలలామల నుద్ధరించిన నితనికితఁడేసాటి !

కృతులనందుటలోఁ దానొక్కఁడె కృతియౌను తత్కృతుల లోని పదరత్నముల నేర్చి, కూర్చి, వానికొక కోశాగారమునునిర్మించి, అధునాతన భావి ఆంధ్రమహాజనుల కందిచ్చి; ఆబాలగోపాలమునకుఁ గరతలామలకముగా నొనర్చు సంకల్పమునందె సారస్వతసేవయున్నది. ఆసేవాసిద్ధి యీ మహారాజునకె లభించినది. నేడుగదా సాహిత్య అకాడమీలని, సారస్వతపరిషత్తులని ఆంధ్రప్రజానీక మెఱుంగుట కల్గుట ! ఇంతకు నర్ధశతాబ్దము క్రిందటనే యట్టి సాహిత్యపరిషత్తు స్వభాషోద్ధరణమునకు నెలకొల్పిన సుకృతి యీ సూర్యారావు బహద్దరుగదా ! ప్రజల ద్రవ్యమున కాసపడక స్వీయభాండాగారము నుండి వేలకువేలు వెచ్చించుట యీయొక్క సంస్థానాధీశ్వరునకే చెల్లినది !

ఆంధ్రప్రదేశ మంతటకు సారస్వత సంచారులనంపి, మూల మూలల నణఁగి మణఁగి యున్న అనర్ఘ సాంస్కృతాంధ్ర కృతిరత్న ముల సేకరించి, ఆంధ్రసాహిత్య పరిషత్తునందు వానికి స్థానమును

గల్పించి, యెడనెడ యొక్కొక దానిని తనదేశజులకు బ్రదర్శింపఁజేయ సమకట్టినవా డీతఁడొక్కఁడే !

భాష నియమబద్ధమని యెఱింగి వ్యవహారిక భాషా వాగ్వాదములకు వాకట్టయి, గ్రాంథిక భాషా పరిరక్షణమునకు బద్ధకంకణుఁడై, దీక్షవహించిన దిట్ట యితఁడొకఁడె, ఇదియొక యసిధారావ్రతముగ సాగించిన ధీరుఁడు.

ఈమహారాజునకిచ్చిన కృతులనుండియు, నీతఁడు ప్రచురించిన కృతులనుండియు, వ్రాసిన గ్రంథపీఠికలనుండియు గొన్నిపద్యములు, వాక్యములు నిందుదాహరింపఁబడినవి. అవి యీతని సుగుణసంపత్తి, సాహిత్య సౌహిత్యము, విమర్శనాపాటవము,స్పష్టముగావించుచున్నవి. ఆంధ్రభాషాపాటవముతో నీతని యాంగ్లభాషా వైశద్యమును జాటుచున్నవి.

సూర్యారాయాంధ్రనిఘంటు ప్రచురణములు

సంపాదకులు - సహాయ పండితవర్గము.

| సంపుటము | | సంపాదకులు | సహాయ పండితవర్గము |
| --- | --- | --- | --- |
| ప్రథమసంపుటము | 1936 | శ్రీ జయంతి రామయ్యపంతులు | (1) తంజనగరము దేవ పెరుమాళ్ళయ్య |
| | | | (2) పురాణపండ మల్లయ శాస్త్రి |
| | | | (3) పేరి పేరయ్యశాస్త్రి |
| | | | (4) శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి |
| | | | (5) శ్రీపాద పాపయ్యశాస్త్రి |
| | | | (6) కూచి నరసింహము |
| | | | (7) చర్ల నారాయణశాస్త్రి |

| | | |
|---|---|---|
| | | (8) పిసుపాటి చిదంబరశాస్త్రి |
| | | (9) వెంపరాల సూర్యనారాయణశాస్త్రి |
| | | (10) దర్భా సర్వేశ్వరశాస్త్రి |
| ద్వితీయసంపుటము 1939 | శ్రీ జయంతి రామయ్యపంతులు | (1) శ్రీ చర్ల నారాయణ శాస్త్రి |
| | | (2) పిసుపాటి చిదంబర శాస్త్రి |
| | | (3) దర్భా సర్వేశ్వరశాస్త్రి |
| | | (4) పిసుపాటి విశ్వేశ్వర శాస్త్రి |
| తృతీయ సంపుటము 1942 | శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి | (1) శ్రీ దర్భా సర్వేశ్వర శాస్త్రి |
| | | (2) వెంపరాల సూర్యనారాయణశాస్త్రి |
| | | (3) ప్రయాగ వెంకటరామ శాస్త్రి |
| | | (4) పిసుపాటి విశ్వేశ్వర శాస్త్రి |
| | | (5) అమలాపురపు విశ్వేశ్వరశాస్త్రి |
| | | (6) బులుసు వెంకటేశ్వర్లు |
| | | (7) చిలుకూరి వీరభద్ర శాస్త్రి |
| | | (8) దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి |

| | | |
|---|---|---|
| | | (9) మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి |
| | | (10) చెఱకుపల్లి అప్పారాయశాస్త్రి |
| | | (11) ఇంద్రకంటి సూర్యనారాయణశాస్త్రి |
| | | (12) చిలుకూరి విశ్వనాథ శాస్త్రి |
| | | (13) పిసుపాటి చిదంబర శాస్త్రి |
| చతుర్థ సంపుటము 1944 | శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి | (1) శ్రీ దర్భా సర్వేశ్వర శాస్త్రి |
| | | (2) ప్రయాగ వెంకటరామ శాస్త్రి |
| | | (3) చిలుకూరి పాపయ్య శాస్త్రి |
| | | (4) ఆకుండి వెంకటశాస్త్రి |
| | | (5) చిలుకూరి వీరభద్ర శాస్త్రి |
| | | (6) ఓలేటి సూర్యనారాయణశాస్త్రి |
| | | (7) బులుసు వెంకటేశ్వర్లు |
| | | (8) దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి |
| | | (9) చెఱకుపల్లి అప్పారాయశాస్త్రి |

| | | |
|---|---|---|
| | | (10) ఇంద్రకంటి సూర్యనారాయణశాస్త్రి |
| | | (11) పాలెపు వెంకటరత్నం |
| పంచమసంపుటము 1958 | శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి | (1) శ్రీ దర్భా సర్వేశ్వర శాస్త్రి |
| | | (2) ప్రయాగ వెంకట్రామ శాస్త్రి |
| | | (3) ఆకుండి వేంకటశాస్త్రి |
| | | (4) బులుసు వెంకటేశ్వర్లు |
| | | (5) చిలుకూరి పాపయ్యశాస్త్రి |
| | | (6) మప్వూరి సూర్యనారాయణశాస్త్రి |
| | | (7) చిలుకూరి వీరభద్రశాస్త్రి |
| | | (8) చెలుకుపల్లి అప్పారాయశాస్త్రి |
| | | (9) సామవేదం శ్రీరామమూర్తిశాస్త్రి |
| | | (10) పన్నాల వెంకటాద్రిభట్టశర్మ |
| | | (11) ఇంద్రకంటి సూర్యనారాయణశాస్త్రి |

| | | |
|---|---|---|
| ఆఱవ సంపుటము 1953 | సంపాదకులు శ్రీ కాశీభట్ల సుబ్బయ్య శాస్త్రి | పంచమసంపుటమును బూర్తి కావించుటకు సహాయపడిన పండిత వర్గమేదినికితోడ్పడిరి. |
| ఏడవ సంపుటము 1958 | ... | ... |

కడపటి పంచమ, షష్ఠ, సప్తమ సంపుటములు ఆంధ్రదేశప్రభుత్వము వా రిచ్చిన రు 5000, భారతప్రభుత్వమువా రొసంగిన రు 8000ల తోను డాక్టరు గిడుగు సీతాపతిగారిచే ఆంధ్రసాహిత్య పరిషత్తువారి పక్షమున నిఘంటు నిర్మాణ పర్యవేక్షణము, గ్రంథ ముద్రణాదికము గావింపబడినవి. క్రీ శ. 1958 సం॥ జూనునెల 12వ తేదీని ఆంధ్ర సాహిత్య పరిషద్వార్షిక మహాసభావేశసమయమున ఉపరాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితవరేణ్యులచే నైదారుసంపుటము లావిష్కరింపఁబడినవి.

ఇప్పటికి 'వ' అను నక్షరములో 'వ్రై' యను నక్షరమున 'వ్రైహేయుము' అనుపదముతో నిఘంటువు ముగిసినది. మిగిలిన భాగ మల్పకాలములోఁ బూర్తిగావించి ముద్రింపించుటకు ఆంధ్రసాహిత్య పరిషత్తువారు దీక్షవహించియున్నారు.

నయనోల్లాసము.

శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి ప్రణీతము

మహారాజావారి కంకితము (1911)

ప్రథమాశ్వాసము:-

కం॥ ఏనొక సమయంబున నొక

మానిత కావ్యంబొనర్పనుది సుత్సుకతం

బూని యడిదెవని చరితం
బైన సముచితముగ నుంతుననుకొను నుండన్.

సీ. శ్రీమన్మహా రాజశేఖర గ్రామణి
పద్మనాయకవర్ణ పద్మహేళి
వేచర్ల గోత్రధాత్రీపాలరత్నంబు
రావువంశాబ్ధి రాకావిధుండు
శ్రీ మంగమాంబికా కృతసుకృతఫలంబు
రామరాట్ప్రభు తపస్సమమూర్తి
పీఠికాపుర రాజ్య విపులవైభవశాలి
సకలబాంధవ పటాంచలసువర్ణ

గీ॥ మఖిల సేవకసేవధి యస్మదాది
భాగధేయైకపుంజ మాబాల్య సమయ
లలితకవితా ప్రసంగాభిలాషి శ్రీకు
మారమహీపతి సూర్యరాణ్మనుజ విభుఁడు.

శా॥ విద్యాభ్యాస విశేషలాలసమతిన్ విద్వన్నుతప్రౌఢిమైఁ
బ్రోద్యద్వైభవ చెన్నపట్టణము నందుత్సాహియై చిత్తవై
శద్యంబొప్పఁగ హృద్యపద్యకవితాసారస్యవిజ్ఞాన సం
పద్యోగస్థితి భోజరాజసమ సంభత్కీర్తి వర్ధిల్లుచున్.

ఉ॥ ఆవిభుదర్శనార్థము మదగ్రిజుఁడేనును గూడియేగి వి
ద్యావినయప్రశాంతి కరుణాదిగుణోన్నతి మించుచున్న యా
త్మేశ్వరమౌళి నచ్చటను గాంచి సముంచితరీతి నుండనా
నావిధ భవ్యకావ్యరచనారుచిరప్రచుర ప్రశంసరాన్.

చం॥ నను రఘురామ దివ్యతరనామ జప ప్రవణాత్మ నార్య సే
వనరతమానసున్ వినయవర్తను దేవులపల్లి వంశజ

న్నని నిజసంశ్రితప్రవరముఖ్యుని వేంకటకృష్ణశాస్త్రినిం
గనుఁగొని యానతిచ్చెనిటు గౌరవపూర్వకమంజులోక్తులన్.

కం॥ ఓ వేంకటకృష్ణసుధీ
మీవంశజులైన బుధులమేయగుణశ్రీ
భావితులయి మత్పూర్వ నృ
పావళికిం దరతరముగ నాశ్రితులుగదా.

కం॥ మీయన్నదమ్ములటువలె
నేయెడ మజ్జనకుచెంత హృదయప్రీతిన్
జేయు నుభయభాషా కవి
తాయుక్తిన్ గౌరవోన్నతస్థితిఁ గనరే.

చం॥ నను రఘురామ దివ్యతరనామ జప ప్రవణాత్మునార్యసే
వనరతమానసున్ వినయవర్తను దేవులపల్లి వంశజ
న్నని నిజసంశ్రితప్రవరముఖ్యుని వేంకటకృష్ణశాస్త్రినిం
గనుఁగొని యానతిచ్చెనిటు గౌరవపూర్వకమంజులోక్తులన్.

కం॥ ఓ వేంకటకృష్ణసుధీ
మీవంశజులైన బుధులమేయగుణశ్రీ
భావితులయి మత్పూర్వ నృ
పావళికిం దరతరముగ నాశ్రితులుగదా.

కం॥ మీయన్నదమ్ములటువలె
నేయెడ మజ్జనకుచెంత హృదయప్రీతిన్
జేయు నుభయభాషా కవి
తాయుక్తిన్ గౌరవోన్నతస్థితిఁ గనరే.

ఉ॥ అన్నిఁటి మీకు నన్నయగు నన్నయశంబునుగన్న నీతిసం
పన్నుఁడు మబ్బురాయ బుధవర్యుఁడు మీరును జెన్ను

మీఱి మా

పిన్నటనాఁటనుండియును విశ్వసనీయగుణప్రవర్తనా
భ్యున్నతి మన్ననల్గనుచునున్న తెఱంగు నెఱుంగుముంగదా.

సీ॥ కృతిసంస్కృతంబున శ్రీరావువంశము
క్తావళి మజ్జనకాజ్ఞఁగూర్చె
సముచితగఁ గుమారశతకంబున కొనర్చె
వ్యాఖ్యార్థ పద్యతాత్పర్యములను
విరచించెను మహేంద్రవిజయ ప్రబంధంబు
నాంధ్రభాషను దజ్ఞతానసంగ.

గీ॥ మఱియును మదంకితంబుగా మాలికలును
చాటుపద్యంబులితరాంక శతకములును
చెన్నపురీ సుబ్బరాయకోవిదుఁడొనర్చెఁ
దలఁప నిది యబ్రమె శతావధానమతికి?

కం॥ తెనుఁగున మావంశావళి
ఘనముగ మాయయ్య యాజ్ఞఁ గైకొని సూక్తుల్
దనరారఁగ మును మీచే
నొనరింపఁగఁబడియె సుజనులోహో యనఁగన్.

కం॥ ఇపుడొక సుశ్లోకుండగు
నృపుని చరిత్రంబు నీతిరీతిఁ జెలంగన్
నిపుణత నొనరింపుఁడు సత
కృపాళుఁడగు రఘువిభుండు కృతిపతిగాఁగన్.

సీ॥ కరివక్త్ర చరితంబు నిరపరాధాపవా
దజమైన యఘము శాంతంబొనర్చుఁ
గార్తవీర్యార్జునగాథ తస్కరకృత
బాధానివారక ప్రథవహించుఁ

త్రైశంకవుని చరిత్రంబు చండాల సం
స్పర్శజ పాపంబుఁ బాపనోపు
నలునిచారిత్రంబు కలిసముద్భూత క
ల్మష వినాశక మన్న మహిమమిం చుఁ

గీ॥ గాన మీచేయఁగల యుపాఖ్యానములల
యెద్దియేనియు నొక్క యైహికఫలాప్తిఁ
జేయఁజాలు నటన్న ప్రసిద్ధివెలయ
వలయు వేంకటకృష్ణవిద్వద్వరేణ్య!

కం॥ అని యానతిచ్చి సముచిత
వినయంబున గారవించి వీటి దానో
ద్యనవద్యబహూకృతులన్
దనిపిన సంతోష పూర్ణతరచిత్తుఁడనై

కం॥ నాతలఁచిన తలఁపులె మా
తాౢతలనేతయుఁ దలంచె గడుసంతోషం
బేతోద్భృశ విధమహిమ
ఖ్యాతుండు విభుఁడెవండొ యని యూహింపన్.

గీ॥ బహుపురాణార్థ విజ్ఞాన మహితమూర్తి
యంధ్రగీర్వాణ కవనవిఖ్యాతకీర్తి
యస్మదగ్రజుఁడైన కుశాగ్రబుద్ధి
సుబ్బరాయార్యుఁడిట్లనుచున్ వచించె.

కం॥ ఆలోచనయేలా మన
కీ లోచనగోచరముగ నెప్పుడు నొక భూ
మీాలోకపాలు మహిమ స
మాలోకితమగుచునుండ మఱచితె, యనుజా.

వ. అని యిట్లానతిచ్చిన నిదియేమి లోచనగోచరంబు
రూపంబుగాని గుణంబుగాదని యించుక
వితర్కించుచునంత.

క॥ మనమునకుం దోఁచెం దోత్రో
నను దినమును భుక్త్యనంతరాచమనంబుం
బొనరించి సంస్మరించెడి
జననాయకముఖ్యమహిమ సామగ్రియిటుల్.

వ. శిష్టజనంబనుదినంబును నభ్యవహారానంతరం
బాచమనం బాచరించి సంస్మరించు వచనంబు.

శ్లో॥ శర్యాతిశ్చ సుకన్యాశ్చ చ్యవనేశ్చేన్ద్ర మశ్వినౌ భోజనాన్తే స్మరన్నక్ష్ణోరక్షుష్మాగ్రామ్యుఃనిష్ఠిపే త్తను వచనంబు తలంబునకుం దోఁచినహా! మహిమంబులోచనగోచరంబనుట కర్థంబిదియ కావలయునని నిశ్చయించుకొని, దీనివలను నుత్తమశ్లోకరాజర్షి వర్ణనంబును, బ్రహ్మర్షి పరిభావంబును, భిషగ్జనసామర్థ్యంబును బతివ్రతామహిమంబును బేర్కొనంబడునని యియ్యుపాఖ్యానంబు నయనోల్లాసంబను పేర నొనరింపఁదలంచి.

(౫)

వారణాసి వెంకటేశ్వర కవికృత
రామచంద్రోపాఖ్యాన కావ్యముద్రణము.
శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి పీఠిక.
(క్రీ॥శ॥ 1911)

శ్రీ పీఠికాపుర మండలాధీశ్వరులు, మహోదారులుఁ, గవిత్వరసజ్ఞులు నాకుం బోషకులునగు, మ. రా. రా. శ్రీ రాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహదరు ప్రభువువారు పురాతన గ్రంథములు దొరకిన లోకోపకారార్థ మచ్చువేయింతురని విని యీ

గ్రామవాస్తవ్యుఁడు హనుమానుల రామచంద్రుని పుత్త్రుఁడు నారాయణమూర్తి యను వైశ్యకుమారుఁడు తన యొద్ద నున్నదానిని దాటియాకులపై వ్రాయఁబడినదాని నక్కడక్కడ శిథిలమైన దాని నిహస్తమును వారి సమ్ముఖమునకుం బంపికొనఁగా శ్రీమంతులగు నా ప్రభువారాశనిక్రిందగు పసదనం బొసంగి పుచ్చుకొని మఱియొక ప్రాఁడీ గ్రంథమును రచించిన కవివంశజుఁడగు ద్విజవరుఁడొక పుస్తకము నట్టిదానిని శిథిలముకానిదానిని వారిసన్నిధికిం బంపికొనఁగా దానిని సైతము గ్రహించి యారెంటిని వారి పాఠశాల యాంధ్రభాషా ప్రధానోపాధ్యాయుఁడను, నాస్థానమున నాంధ్రగ్రంథపరిశోధకుఁడను, వ్యాఖ్యాతను (Editor and Annotator) నగు నాకుం బ్రసాదించి యచ్చొత్తింపఁదగునట్లు సవరించి వ్రాయింపుమని సెల వొసంగిరి. నేను వారి యానతి శిరంబున వహించి యథామతి చక్కం బఱచి యట్లుచేసితి."

మల్లయ్యశాస్త్రి.

(4)

భద్రాపరిణయ కావ్యప్రచురణము.

భద్రాపరిణయప్రబంధము, అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిచే రచింపబడి, మహారాజావారి జనకులగు గంగాధర రామారావు బహద్దరువారికి క్రీ.శ. 1878 సంవత్సరమున కృతిగా నీయఁబడినది. ఆ ప్రబంధమునకు శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రులు గారిచే వ్యాఖ్యానము వ్రాయించి, శ్రీ మహారాజావారు దానిని క్రీ.శ. 1912 సంవత్సరమునఁ బ్రకటించిరి. ఈ గ్రంథమునకు శ్రీ నడకుదుటి వీరరాజుగారు ఉపోద్ఘాతము వ్రాసియున్నారు.

"ఏ తత్ప్రబంధమును సటీకముగ ముద్రింపించి యార్థలోకమునకు నొసంగిన శ్రీ రాజా రావు వేంకటమహీపతి సూర్యారాయ

ప్రభువర్యులకుఁ బరమేశ్వరుఁడాయురారోగ్యంబులఁ బరిపూర్ణముగ నొసంగఁ బ్రార్థించుచు నీ యుపోద్ఘాతమును ముగించుచున్నాను.”

నడకుదుటి వీరరాజు.

ఈ భద్రాద్రిపరిణయములో కవి రావువారి వంశావళి కృతిభర్తయగు శ్రీగంగాధర రామారావుబహద్దరువారి వఱకు నిచ్చియున్నాము.

(5)

ప్రభావతీ ప్రద్యుమ్న కావ్య లఘుటీక.

పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి పీఠిక.

“ఇట్టి యీ ప్రౌఢ కావ్యమునకు లఘుటీక యొనర్పుమని నాకుం బోషకులును మహోదారులు నాంధ్రభాషాభిమానులు శ్రీ పీఠికాపుర మండలాధీశ్వరులునగు మహారాజశ్రీ రాజా రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహదరు ప్రభువువారు శ్రీమంతులగువారి పీఠికాపురోన్నతపాఠశాలయందు నాంధ్ర ప్రధానోపాధ్యాయుఁడను నాస్థానంబున నాంధ్రగ్రంథశోధకుఁడను వ్యాఖ్యాతనునగు నాకానతీయ నేను మహోన్నతులగు వారి యానతి నౌదలంబూని నా తెల్వికిం దగునట్లొక లఘుటీకరచించి ప్రకటించితిని దీనినే మిగుల జతనంబునఁ గాంచినను నాప్రమాదంబుననేని యజ్ఞానంబుననేని దోషంబులు పెక్కులుండనోపును గాన గుణగ్రహణైకతత్పరులగు విద్వాంసుల వాని క్షమియింపవేఁడికొనియెదను.

క్రీ శ. ఇట్లు విన్నవించు విధేయుఁడు.
1913 పురాణపండ మల్లయశాస్త్రి.

(6)

విశ్వగుణాదర్శము.

ఉపోద్ఘాతము.

“అస్మత్ప్రభువులుఁ పీఠికాపురాధీశ్వరులునగు శ్రీశ్రీశ్రీ రాజా

రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారియాజ్ఞానుసారముగ మేమీగ్రంథమును యథాశక్తి నాంధ్రీకరించి వేయినూటపదియార్లు బహుమానముఁ గొంటిమి.

రామకృష్ణకవులు.

అంకిత పద్యములు

సీ॥ శీలవతీమచర్చిక మంగమాంబిక
కడుపుచుమ్మలు వాఱఁ గన్నబిడ్డ,
రాజగంగాధరరామ క్ష్మాజాని
కుఱువెక్కి పెరిగిన కొడుకుఁగుఱ్ఱ,
రమణీయ గుణశాలి రంగాప్పరాయ పృ
థ్వీవల్లభు నమంగు పెండ్లికొడుకు,
కుంతిమాధవుఁడు గోకులభర్త మఱియు పీ
ఠపురంబు నేలు పట్టంపురాజు,

గీ॥ నిఖిల సజ్జన సంస్తవ నీయ శాంత
మూర్తి వికసన్మహోహార కీర్తి సత్య
భాషి యాబాల్యకవితాభిలాషి మహిత
రావు కులహేళి శ్రీసూర్యరాయమౌళి.

వ॥ ఒక్కనాఁడు సుధర్మంబోని నిజసభా భవనాభ్యంతరమున నొడ్డోలగంబుండి సరసకవితాగోష్ఠీ వినోదనపరాయణుండై తనయాస్థాన కవీశ్వరుల రామకృష్ణుల మమ్ము సముచిత సత్కారంబుల గారవించి,

సీ॥ యజ్వ కర్ణాటదేశాధీశ్వరగురుండు
కాంచికామండల కల్పకంబు
తాతార్యుఁడు దిగంతదంతురకీర్తి యె
వ్వాని పితామహు మేనమామ,

యస్తోకమఖకర్త యప్పయార్యాన్వయుండు వి
 ద్వన్మణి యెవ్వాని తండ్రి తండ్రి,
చిత్రకవిత్వవిశేషంబు రఘునాథ
 కవి దీక్షితుండేని గన్నతండ్రి,
తర్క వేదాంత శాస్త్ర తంత్రప్రవీణుం
డెవ్వఁడ వ్వేంకటశాస్త్రి యేర్పరించి
నక్షీణ విద్వద్గుణాదర్శ మాంధ్రభాష
ననువదించెఁడు నాపేర నంకితముగ.

క్రీ.శ. 1917

(7)

కీర్తిశేషులు శ్రీ రావుబహదర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ ఆంధ్రకవులచరిత్రము ప్రథమభాగము (కవికృత గ్రంథములలో పదవ సంపుటము.)

గీ॥ ఏను శ్రీపీఠికాపురాధీశ్వరునకు
నాంధ్రకవులచరిత్రంబు నతిశయాను
రాగమున నంకితమొనర్తు రావుశ్రీకు
మార మహీపతి సూర్యరాణ్మనుజపతికి

క్రీ.శ 1917 కందుకూరి వీరేశలింగము.

(8)

ఆంధ్రసూత్రభాష్యము.

శ్రీ పీఠికాపుర మండలాధీశ్వరులగు శ్రీశ్రీశ్రీ రాజా రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహదరు ప్రభువువారి యాజ్ఞచేతను వారి యాశ్రితుఁడగు పురాణపండ మల్లయ్యశాస్త్రిచే రచింపఁబడినది.

గీ॥ రావువంశాబ్ధి చంద్రుఁడౌ రామరాయ
నౌరసుఁడగు సూర్య నృపాలు నాజ్ఞచేత
నూత్న భాష్యంబుఁ వెలుఁగున నూత్నపఱుతుఁ
గప్పులున్నను దిద్దుఁడు దయదలిర్ప.

క్రీ. శ. 1918. మల్లాద్యశాస్త్రి.

(9)

తాళ్ళపాక తిరువెంగళనాథ కృత
పరమయోగి విలాసము—పీఠిక.

శ్రీ పిఠాపుర సంస్థానాధీశులగు శ్రీశ్రీశ్రీ మహారాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారు ప్రాచీనాంధ్ర గ్రంథసంపాదనమునకై నన్ను నియమించిన కాలమున (1917 సం॥ర) మైసూరులోని మహారాజ కళాశాలాంధ్రోపాధ్యాయులగు బ్ర॥శ్రీ॥ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు నాకిచ్చిన గ్రంథములలో "పరమయోగి విలాసము" కూడఁ జేరియుండెను. ఆప్రతి కొంత శిథిలమై యుండెను. మద్రాసులోని గవర్నమెంటు ఓరియంటల్ లైబ్రరిలో గూడ మఱి యొక ప్రతియుండఁగా రెంటింటికి శ్రీమహారాజావారు ప్రతులను వ్రాయించి బ్ర॥శ్రీ॥ శతావధాని ఓలేటి వేంకట రామశాస్త్రిగారిచేఁ బాఠములను సరిచేయించి ముద్రింపించి జీర్ణోద్ధరణము గావించి యాంధ్రలోకమునకు మహోపకృతిఁ గావించిరి.

ఇట్టి యుద్గ్రంథమును ముద్రింపించి లోకోపకృతి గావించిన శ్రీశ్రీశ్రీ మహారాజావారికిఁ బరమేశ్వరుఁడు పుత్రపౌత్రాభివృద్ధియు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధియు నొసఁగుగాక.

క్రీ శ. 1928 పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

(10)

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

ప్రథమ సంపుటము.

ఆవిష్కరణము

చెన్నపట్టణము.

శ్రీ మహారాజాగారి ప్రత్యుత్తరము:

సభాధ్యక్షా! సభ్యులారా!

శ్రీయుత జయంతి రామయ్య పంతులుగారు నన్నుగుఱించి విశేషమైన వాత్సల్యాతిశయములతో వాక్రుచ్చిన వాక్యములకై వారికి నాకృతజ్ఞతాపూర్వక నమస్కృతులు. నేనీస్తుతికిఁ బాత్రుఁడను గానని సవినయముగ విన్నవించుచున్నాను. ఆంధ్రభాషాభిలాష నాకొకింతకలదని యొప్పుకొనక తప్పదు. కాని మాతృభాషాభిలాష యున్నంత మాత్రమున నది యొక విశేషముగఁ జెప్పుకొనకతప్పదు. మఱియు నీ యభిరుచి మాకు వంశపరంపరగా వచ్చుచున్నదగుటచే నిందులో వింతయావంతయు లేదు.

ప్రాపంచిక వ్యావహారిక విషయమైన విచారమునుండి యించుక సేపైన మనస్సును దొలఁగించి చదువరుల నమందానందకందళిత హృదయారవిందులఁ జేయుచు, మానవస్వభావము మొదలైన విషయముల వ్యక్తపఱచుచు, నుపనిషత్తులాదిగాఁగల యుత్తమ వేదాంత గ్రంథములందలి సత్యముల విశదీకరించు పుస్తకముల నేకములు మన తెలుఁగునఁగలవు. ఇట్టి సద్గ్రంథముల పఠన మకుంఠితముగ జరుగుటకై సమగ్రమైన నిఘంటువుండుట యవసరమనితోఁచినది. ఇందులకై దైవదత్తమైన ద్రవ్యము నొకింత వ్యయపఱచుట భావ్యముగాఁ దలంచి యాభాగుసఁ గావించుచున్నాను.

నేనెంతవలదని విన్నవించినను వినక యీ యుగ్రంథమునకు నా పేరుపెట్టి, నాకు గొప్పగౌరవమును గలిగించిరి. నాయెడలనిట్టి యాదరముఁజూపిన యాంధ్రపరిషత్తువారికి నాకృతజ్ఞతాపూర్వక నమస్కార సహస్రములర్పించుచున్నాను.

శ్రీ రామయ్యగారు చిరకాలమునుండి యీగ్రంథమునకుఁ బ్రధానసంపాదకులుగానున్నారు. మనమార్గములను మాఱనక యితర దేశభాషారీతులుగూడ బాగుగఁ బరిశీలించి నిఘంటునిర్మాణపద్ధతులు నిర్ధారించియున్నారు. కడుంగడు వృద్ధులును, అనారోగ్యవంతులు నయ్యు, వీరివిషయమంటన విశేషముగ శ్రమపడుట శ్లాఘనీయమైన యంశము. దీనికై వీరు వేతనమిసుమంతయుఁ గైకొనుటలేదు. ఈపగిదిని భాషాసేవ చేయుచున్నవీరు, నాయొక్కయు సాహిత్యపరిషత్తుయొక్కయు నాంధ్రలోకముయొక్కయుఁ గృతజ్ఞతకుఁ బాత్రులగుచున్నారు. వీరికీశ్వరుఁడాయు రారోగ్యైశ్వర్యము లొసంగుఁగాత!

ఈ నిఘంటు రచనాకార్యనిర్వహణమునకు ఆంధ్రలోకవిఖ్యాతులైన యుద్దండపండితుల సాహాయ్యభాగ్యము మాకు లభించుచున్నది. ఇది యమూల్యమైన సంగతి యనుటకు సందియము లేదు.

ఈ కార్యమారంభించి విశేషకాలమైనదనియు విలంబమైనదనియుఁ గొందఱందురుగాక. కాని యీనిఘంటు నిర్మాణము దుర్ఘటమైన కార్యము. తేలికగాఁ దేలునది కాదు. ఇది సాధ్యమైనంతవఱకు సమగ్రముగను నిర్దుష్టముగను, నుండుట మాయుద్దేశము; కావున నాలస్యమనివార్యమైనది. మాయుద్యమమునఁగలి కష్టమును దయార్ద్రదృష్టితో దిలకించి, మన్నుమన్నింపవలయునని మనవిచేయుచున్నాను.

ఇపుడీ మొదటిసంపుటము సంపూర్ణమైనది. మిగిలిన భాగములు కొలఁదికాలములోనే వెలువడఁగలవని నమ్ముచున్నాను. దైవము మాయత్నమునకుఁ దోడుపడుఁగాత! క్రీ.శ. 1936

(11)

చింతలపూడి ఎల్లనార్యకృత విష్ణుమాయానాటక గ్రంథ ముద్రణము.

శ్రీ చేకుమళ్ళ అచ్యుతరావుగారు తద్గ్రంథపీఠికలో నిట్లు వ్రాసియున్నారు

"భూగర్భమున నిక్షిప్తమైన కోహినూరు వజ్రమును వెలికిఁదీసి నట్లు, ఈమహాకవిని చెన్నపురి విశ్వకళాపరిషత్తువారు తొలుదొల్త బయలుపఱచి యతని యుత్తమగ్రంథమగు విష్ణుమాయానాటకమును విపులమగు పీఠికతోఁ బ్రకటించిరి. అటుతర్వాత గోదావరీ మండలమునఁనున్న కపిలేశ్వర పురాధినాయకుల యౌదార్యమూలమున నీకవియొక్క ప్రథమప్రబంధమని చెప్పఁనొప్పు రాధామాధవము ముద్రితమై ప్రచురింపఁబడినది. అంతట విద్వత్ప్రభువులును, మనోజ్ఞ కావ్యరసికశిఖామణులును, అగు శ్రీ పీఠికాపుర రాజ్యరమాధవులగు శ్రీ రాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారాయ బహద్దరు మహారాజులుగారీ కవివరేణ్యుని కావ్యరసాస్వాదనముఁ జేసి మకరంద బిందు నిష్యందమంజరీయుతములగు నీకావ్యవల్లరుల కచ్చెరువునొంది యిట్టి యసమాన భాసమాన కవితాప్రావీణ్యముగల కవి విశుద్ధ యశఃప్రతిష్ఠ కర్హుఁడుగాక తక్కొరు లర్హులగుదురా ఆయని తలపోసిరి.

మదరాసు విశ్వకళాపరిషత్తువారు ముద్రింపించినదియు నీకవీంద్రునిచే రచితమైనదియు నైన విష్ణుమాయానాటకమును శ్రీ పిఠాపురము మహారాజావారు చదివి దానియందుఁ గొన్ని స్ఖాలిత్యములుండుట గనిపెట్టి, యుత్తమ ప్రాచీనాంధ్రకవీశ్వరులలో నొకరిచే రచింపబడిన యీ యుత్తమగ్రంథమున కిట్టి యవస్థ తగదని యోచించి వారి యాస్థానమందలి కవీశ్వరులగు శ్రీయుత ఓలేటి వేంకటరామశాస్త్రుల వారిచే సమగ్రపరిశోధనముఁ జేయించి యేతద్గ్రంథమును బునర్ముద్రి

తము గావించి తమ సంస్థానమునఁ సంగ్రథితమైన యాంధ్రగ్రంథమాలలో నొక నూతనప్రసూనముగఁ జేర్పించిరి."

కరుణారసమూర్తియగు పరమేశ్వరుఁడు యాంధ్రసరస్వతీప్రియుఁడగు 'రాజర్షిని' ఆయురారోగ్యైశ్వర్యములనిచ్చి చిరకాలము రక్షించుఁగాక.

క్రీ.శ. 1937. అచ్యుతరావు.

(12)

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిచే పరిష్కృతమైన కళాపూర్ణోదయ ముద్రణగ్రంథమునందు కృతిపోషకప్రశంస.

ఈ ముద్రణము మహారాజావారి సహాయమున వెలసినది.

శ్లో॥ సత్యం జ్ఞానానన్తరూపం
జగజ్జన్మాది కారణమ్,
సదాపాయాత్పరం బ్రహ్మ
శ్రీసూర్యారాయ భూపతిమ్.

సీ॥ వితరణగుణము వివేకింపఁజూతుమా,
నోటికి లేదన్న మాటరాదు;
సత్యంబుకొలఁది ప్రసంగింపఁజూతుమా,
కలలోని మాటైనఁ గల్లగాదు;
ధర్మప్రవర్తన తర్కింపఁజూతుమా,
త్రికరణశుద్ధికి దీటులేదు;
పరిపాలనమురీతి భావింపఁజూతుమా,
సమభావమున కెందుసాటిలేదు;
గీ॥ సాహితీశక్తి చూతుమా, సరసగోష్ఠి
దరిచి చూడని యట్టి గ్రంథంబులేదు,

రాజమాతుర్పిం డె శ్రీసూర్యరాయనృపతి
యాంధ్రదేశంబు భాగ్య దేయంబుగాక.

సీ॥ తాతసాముల నాఁటి ధర్మాన్న సత్రిదే
వస్థాన విపుల సత్పాలనంబు,
వేదశాస్త్ర కవిత్వ విద్యలఁ జేరిన
పండితోత్తముల సంభావనంబు,
శాస్త్రభాషావృత్తి సారస్వతంబులు
బోధించు సంస్థల పోషణంబు,
పరమ దీనానాథ బాలికాబాలుర
రక్షాలయారంభ దీక్షణంబు,

గీ॥ తలఁచిచూడ నుదార వదాన్యగుణుఁడు
రావు శ్రీ సూర్యరాయధరావరుండు
రాజమాతుర్పిండె తానాంధ్రభోజుఁడనఁగ
వసుధఁదను వెత్తు ధర్మదేవతయుకాక.

ఉ॥ ఆతఁడు సూరనార్య కవితాభిరుచిం బ్రకటింపఁజేసిని
ఖ్యాతికిఁ దెచ్చెదీని మునుపందలి వందలతప్పు తేర్చుచున్
వ్రాఁతప్రతుల్ సహాయముగఁ బాఠపరిష్కరణంబొనర్చు నా
చేఁతకు మెచ్చి యిప్పుడు ప్రసిద్ధికిఁదెచ్చెను బేర్మి నీకృతిన్.

క్రీ.శ. 1958.

(13)

శ్రీ ఓరుమళ్ళ అచ్యుతరావుగారు తమ 'విజయనగరసామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రము - ద్వితీయభాగము' అను గ్రంథము.'

కృతిసమర్పణము.

ఈగ్రంథము, అనవరతాంధ్రభాషాపోషకులును, ఆంగ్లాంధ్ర

వాఙ్మయవిశారదులును, ఆంధ్రభోజవిఖ్యాతులును, అనాథజనశరణ్యులునై యఖిలాంధ్రమండలమునందును అప్రతిమాన కీర్తివహించిన, యన్వర్థనామధేయులగు, (శ్రీ) రాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరు సి,బి,ఇ;డి.లిట్. శ్రీశ్రీశ్రీ పిఠాపురము మహారాజావారికి, శ్రీవారి యనుజ్ఞఁబడసి, భక్తిపురస్సరముగా సమర్పింపఁబడినది.

క్రీ.శ. 1939 (శేషమ్మ అచ్యుతరావు గ్రంథకర్త)

(14)

శ్రీ శేషమ్మ అచ్యుతరావుగారు వ్రాసిన "విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రము"-ద్వితీయ భాగమునకు శ్రీ మహారాజావా రాంగ్లమున వ్రాసిన పీఠిక.

For the sake of comparison and determination of the degree of excellence of poem, he had to read many books, Sanskrit and Telugu. This careful study was necessary to show how the poet under review deviated from the author of the likely original source in Sanskrit and how he differed from other Telugu poets in the treatment of the same theme. Mr. Achyuta Rau is one of our ablest literary critics. His criticism is certainly sound and very creditable. His views are supported by well reasoned arguments. His is remarkably impartial. Even in the works of his favourite poets, if there are a few defects, he unhesitatingly points them out. He courageously critises ancient poets, whether his views agree with or differ from long standing traditions. I greatly admire his courage of conviction and honesty of purpose. When he happens to differ from

his contemporary critics, he boldly contradicts language. He studiously avoids scurrilous attacks on his opponents. In fact, this deplorable defect is conspicuous by its absence.

His deep scholarship and sound literary criticism are praiseworthy and deserve special mention. He has read very widely and writes his criticisms on right lines on the whole. In this connection, I may mantion that, on some minor points, in respect of the comparative merits of certain poits, I differ frem my friend, the author. His is an easy, flowing style which is smooth and sweet. Above all it is clear as crystal. He has the happy knack of making his writing very interesting. I have derived great pleasure from a perusal of this book. It is indeed a model production. Other scholars will do well to follow this excellent example. A great deal of work has got to be done in this field.

Mr. Achyuta Rau has written several books on similar lives. He intends to write some more books of this kind. Thus, he has been rendering meritorous service, to the Telugu literature. He has placed the Andhra Desa under a deep debt of gratitude to himself. I hope he will be spared long to contine this commendable work for the benefit of the present and future generations. May God grant him long life, health, happiness and prosperity.

*Rao Venkata Kumara Mahipathi Surya Rao, D. Litt*

MAHARAJAH OF PITHAPURAM.

1939 A. D.

(15)

శ్రీ తేకుమళ్ల అచ్యుతరావుగా రాంగ్లమున వ్రాసిన

పింగళి సూరన జీవిత చరిత్రమునకు మహా

రాజావారు వ్రాసిన ఆంగ్లభూమిక.

We have every reason to be proud of our noble literature and glorious language. The famous ancient king, Krishnadevaraya, a great poet, profound pundit and sound scholar, well versed in various vernaculars, deliberately declared that the Telugu language was best of all vernaculars. Vinukonda Vallabharayudu another ancient and good Telugu poet placed Telugu above Sanskrit. The Telugu language, being most musical, is styled, the Italian of the East. This high appreciation is shown by the Europeans. Telugu is very rich in musical literature. Non-Andhra musicians also, even when ignorant of the meaning, sing some of our most melodious Telugu songs.

My esteemed friend, Mr. T. Achyuta Rau, has, with great success, one his utmost to intepret the beauties of the poems of done of our most illustrious writers. This treatise is truely a treat to read. It is indeed a unique production. I think this is the first and, so far, the only work of its kind written in English or Telugu on such elaborate scale. The writer is one of the few of our best critics. He is thorughly imprtial. While mentioning the merits of his favourite poet, he does not hesitateto point out few things that may appear to be below par. In fact, they are very few and far between. An absolutely perfect poet is not found anywhere in the world, The critic's penetrative study had enabled him to bring out many of the innumerable

qualities of excellence. In thfs conection, I should mention that I entirely differ from my friend regarding his theories of allegories, philosophical and historical, in "Kalapurnodayamu". I am in very good company, as many eminent scholars of great erudiction in Sanskrit and Telugu are in agreement with me. By writing this very valuable work the author is rendering a great service to the Telugu literature, and Andhra Desa. He has written some other works and intends to write more books on literary subjects. It but behoves the Andhras to afford him full facilities for carrying on this meritorious work. May God bless, with success, his laudable endeavours.

*Rau Venkata Kumara Mahipathi Surya Rau, D. Litt*
MAHARAJAH OE PITHAPURAM.

A. D. 1941

(16)

శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రికృత
యతిరాజవిజయము.

శ్రీ రామానుజాచార్యుని పావనజీవితమును గద్యరహితపద్య కావ్యముగా శ్రీకృష్ణశాస్త్రిగారు మహారాజావారి యానతిని రచించిరి. ఈకృతిని వారికే కృతినిచ్చిరి. అందలికొన్నిపద్యములు:

ఉ॥ చెన్నపురంబునందునివసించి వినీతిగవిద్యనేర్చుచో
మన్ననవిభుంగనఁగ మక్కువయెక్కువనెక్కొనంగ, మా
యన్నయునేనుగూడిచని యచ్చటముచ్చటదీరనుండ, వి
ద్వన్నుతగోష్ఠిచేమెలఁగు పట్టుననన్ననియాతఁడిట్లనెన్.

కం॥ దేవులపల్లికులోద్భవ !
యో వేంకటకృష్ణకోవిదోత్తమ ! వింటే
మీవారలు హరిసేవా
పావనులుం బరమభాగవతశేఖరులున్

కం॥ ఇదిమామతంబు గొప్పది
యదివారిమతంబు కొద్దిదనుచుంగడుదూ
ఱదరదిరా ! పెఱమతముల
నెదలోఁ బరమార్థమార్గ మెఱుఁగనివారల్.

గీ॥ మీరలటుగాక సమబుద్ధిమీఱనరయ
స్మార్తులయ్యును వైష్ణవసంప్రదాయ
ములనెఱుంగుదురా బాల్యముగఁ ద్వదీయ
వంశభవులెల్ల శ్రీరామభక్తులగుట.

కం॥ కావున రామానుజగురు
భావుకచరితంబు నాంధ్రభాషాకృతిగాఁ
గావింపుమనమతర ప
ద్యావళి యతిరాజవిజయమని మెచ్చిపేరన్.

సీ॥ తొలియేఁటనే కృతార్థుండయ్యెఁ దప్పక
ప్రథమపరీక్షలోఁ బ్రతిభ మెఱయ
ననమవైఖరి నుపన్యాసంబులిడఁజాలె
నుభయభాషలలోన సూక్తులలరఁ
గృతులనద్భుతచమత్కృతుల నారసి తెల్పఁ
దొడఁగుసత్కవులు సంతోషమంద
సతతసత్యవ్రతాచరణదీక్షముఖ్య
ఘనగుణస్ఫురణ విఖ్యాతికెక్కె.

గీ॥ నహహా ! యొకకొంతచిన్న ప్రాయంబు తనకు
వదలునాఁటికె యిమ్మహీవరతనూజుఁ
డిట్టిసత్కళాశాలి కృతీశుఁడగుట
భూరితరపుణ్యపరిపాకముననుగాదె ! క్రీ. శ. 1941

(17)

పింగళి సూరనకృత కళాపూర్ణోదయమునకు పీఠిక.

శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి గారిచే పరిష్కృతమై ప్రచురింపబడిన కళాపూర్ణోదయ సంపాదకోక్తి.

'పద్యనవల' యనందగు నీకళాపూర్ణోదయమునకు బరిశుద్ధ మగు ప్రతిని ముద్రింపింపనెంచి సత్కావ్య వఠనప్రకటనాభిలాషులును, సలక్షణాంధ్రభాషాపోషణమనీషులును, అస్మత్ప్రభువరేణ్యులు నగు శ్రీశ్రీ పీఠికాపురమహారాజ రావు .వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు నన్నాదరముమీఱ సంబోధించి "కళాపూర్ణోదయమునిందలి సందిగ్ధపాఠముల ముద్రితాముద్రితప్రతుల సాహాయ్యమున సవరించుటయే కాక, క్లిష్టములగు ఘట్టములకు లఘువ్యాఖ్యను వ్రాసి, అకారాదిక్రమముగఁ గఠినపదముల కర్థముల సమకూర్చి యచ్చునకుసిద్ధముచేయుడు. వీనిలోఁ గళాపూర్ణోదయమును దిరుగముద్రింపనెంచితిమి" అని సెలవిచ్చిరి.

ఈ కవితిలకుని కవితాఘనతను గూర్చి వివేకనిధులగు శ్రీశ్రీ పీఠికాపురాధిపతులిందుఁ బొందుపఱచిన పీఠికవలన సూరనార్యుని రచనావైభవము చదువరులకు సాకల్యముగ విదితము కాఁగలదు. నిజముగ నాపింగళికుల నలినహేళి కవితాప్రతిభ నెన్న నీసూర్యరాయ నృపాలమౌళియే యన్నివిధముల నర్హులు. మఱియు నీప్రభుచంద్రునకు సూరనార్య కావ్యరచనలపై గౌరవాదరములు మెండు. కావుననే మొదట వావిళ్ళవారు 'రాఘవపాండవీయ' 'కళాపూర్ణోదయము' ల

ముద్రించునాడును, బిమ్మట పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి వ్యాఖ్యానముతో 'ప్రభావతీ ప్రద్యుమ్నమును' ప్రకటించు పట్టునను, పిదప శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు కళాపూర్ణోదయము నచ్చొత్తించు పదనునను, నేడీ సంపుటమును వెల్లడించు వేళను పలయుధనముల నొసంగుటయేగాక యీనూతనప్రతికి సూర్యనార్య కవితాఘనతను గూర్చిన చక్కని పీఠికగూడ వ్రాసియున్నారు.'

శ్రీ రాజావారి పీఠిక.

'శ్రీమదాంధ్రసారస్వత మమృతతుల్యము. ఈభాష విశేష శ్రవణీయమై సర్వాంగసుందరమై ప్రస్తుతికిఁ బాత్రమగుచుఁ బ్రకాశించుచుండును. సంస్కృతకవియైన సుధాకరుఁడాంధ్రభాషాసుధామాధుర్యము నిట్లుమిక్కిలి మెక్కువగఁ గొనియాడినాడు.

శ్లో॥ యోవేత్త్యాంధ్రమయీం వాణీం
శిరపసుమ పేశలామ్
కిం తస్య సుధయా కార్యం
మాధుర్యరసనిర్ణయేఁ

మన తెలుఁగు ప్రాగ్దేశభాషలందెల్ల నెక్కుడు శ్రావ్యమైనదని ప్రాక్పశ్చిమఖండవాసులచేఁ బొగడఁబడినది. ఐరోపాదేశీయుఁడైన 'బిషప్ కాల్డువెల్' దొర మన దక్షిణహిందూదేశమువకు వచ్చి యిచటి దేశభాషలనెల్ల మిగుల బాగుగనేర్చికొని భాషాతత్త్వవేత్తలలో నగ్రగణ్యుఁడుగ నెంచఁబడినవాఁడాంధ్రము దేశభాషలలో నెల్ల విశేషశ్రావ్యమైనదని శ్లాఘించెను. తెలుఁగుభాష సంగీతమునకెంతయుఁదగియున్నది. గాయకులాంధ్రులుకాని యనాంధ్రులుకాని యర్థము తెలిసినను, తెలియకున్నను, తెలుఁగుపాటలనేకములు పాడుదురు. ఇది యత్యధిక మాధుర్యగరిమగల మనయాంధ్రభాషయొక్క యానన్యత్వము.

ఇట్లు మహత్తరముగ భాసిల్లు మనభాషయందనేక సత్కావ్యములు వెలయుచున్నవి. వీనిలో నెల్ల నుత్తమోత్తములైన సుప్రశస్త ప్రబంధములు కొన్ని కలవు. వీనినిమించిన చెలువముగలరచనలు, ప్రపంచమునందెందును గోచరింపవు. ప్రభావతీ ప్రద్యుమ్న, కళాపూర్ణోదయ, ప్రబంధరాజములీ గ్రంథరాజిలోఁజేరి రాజిల్లునవియు, ఇట్లు పేర్కొనబడిన గ్రంథద్వయమునకుఁ గర్త సూరనార్యకవివరేణ్యుఁడు. ఇతఁడత్యుత్తమ కవివతంసులలోని వాఁడని మఱివేఱే వక్కాణింప నక్కఱలేదు.

సూరనరచన సురుచిరమైనది. సత్కావ్యములకు గావలసిన సకలసద్గుణమణి గణములు గలిగి యగ్రగణ్యమైనది. మృదుమధురపద గుంఫితము, సాధుజాతీయ దేశీయ పద తేజోవిరాజితము. అనర్గళ ధారాశుద్ధికలదై శోభిల్లుచుండును. సరససారస్వతాంశ ప్రశస్తితోఁ బ్రకాశించును. శబ్దార్థాలంకార సంకలితమై కలకలలాడుచుండును. వ్యర్థపద కళంకరహితమైనది. తేటతెనుఁగుమాటలతోఁ దేజరిల్లుచుండును. ఈ కవితల్లజుడు చిత్రవిచిత్రములైన పోకడలఁబోయె. అపూర్వానల్పకల్పనా జల్పితములఁజేసె. అత్యంత చమత్కారములైన రచనల చాతుర్యముఁ గనఁబఱచె. ఈమహనీయుని భావనాశక్తి మిక్కిలి సంభావితము. ఈతనికవితను విశేషవిస్మయావహములును సముదీర్ణములునైన సహజవర్ణనలు సంపూర్ణరసభరితములై భాసిల్లును. వర్ణనావైదగ్ధ్యమమితాశ్చర్యకరమై రాణించును. వర్ణితాంశము మనకనుల కట్టెదుటఁ బటముగట్టినట్లు కన్పట్టును... ఇక్కవి మానుషప్రకృతి కూలంకషముగఁ దెలిసికొనిన శేముషీవిభవాభిశోభితుఁడు. లోకజ్ఞానసంపన్నుఁడైన ప్రతిభాశాలి... ఈ కవితిలకుని చతురకవితావిలాసము గణనాతీతమై, సనోచితశయ్యతో నతిశయిల్లుచున్నది.ఎన్ని తడవులఁ దిలకించినను దనివితీఱదు. ఇట్టి సుప్రశస్త ప్రబంధములు

గల యాంధ్రభాష ధన్యాతిధన్యము. అంధ్రిలమైన మనముకృతార్థులము. ఈ సత్కావ్యముల రసాస్వాదనమొనర్చి బహులాభములం బొంది తరింతముగాక ! సూర్యనారాయణవిశ్వేశ్వరా ! గౌరవపురస్సరములును, ననేకములునైన నా నమోవాకములు కైకొనుము.

క్రీ.శ. 1943 రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు.

## (18)
## మహేంద్రవిజయము
### తొలిపలుకు.

శ్రీ మహేంద్రవిజయ దివ్యమహాప్రబంధకర్త, శ్రీ దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రిలవారు సుప్రశస్త కవితాశక్తిగల కవివతంసులు. ఉత్తమోత్తములగు నాంధ్రకవితిలకులలో నగ్రస్థానమలంకరించువారిలో నొకరు. మఱియు లోకములోగల సకలదేశములలోని కవిశ్రేష్ఠులలోనివారు. ఏదేశముననైన నిట్టి విశేషశేముషీవిభవాభిశోభితులగు కవిశిఖామణులల్పసంఖ్యాకులుగ నుందురు.

శ్రీ మహేంద్రవిజయ ప్రబంధరాజ మాంధ్రమునగల సుప్రశస్తమైన గ్రంథములలోనిది. వీరికవిత్వము సర్వాంగసుందరమైవిలసిల్లును. చదువచదువం జవులూరుచుండును. వీరిరచన రసికజనమనోరంజకమై రాజిల్లును. వీరికవితాలతయం దనవసరపదములు లేవు. కవితావాహిని యసాధారణ ధారాశుద్ధిగలది. వీరి కావ్యకన్యశబ్దార్థాలంకారములతో నలరారును. వర్ణనావైదగ్ధ్యము విశేషవిస్మయము గొలుపును. మహామనోహరములైన సహజవర్ణనములనేకములుగలవు. చమత్కారములగు జాతీయములతో తేజరిల్లుచు చుండును.

ఈ సుధీనిధులిరువురు పావనచరిత్రులగు నామిత్రరత్నములు. వీరిరువురును నాకు గురువర్యులు. వీరిరసవత్తరములగు రచనలకు

తొలిపలుకు లిఖింపగలుగు భాగ్యము లభించుటచే నేను కృతకృత్యురాల నైతిని. వీరిరువురును దివంగతులగుటవలన నేను నేడుఁగూడ మిగుల వగచుచున్నాను. దైవసంకల్పము దప్పింపనేరితరము!

నా గురువర్యులగు వీరిరువురకు గౌరవపురస్సరములగు నా నమోవాకములనేకము లర్పించుచున్నాను.

క్రీ.శ. 1949 రావు వేంకటకుమార మహీపతిసూర్యారావు.

(19)

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక-రజతోత్సవసంపుటము.

ఆంధ్రసారస్వత ప్రశస్తి.

(శ్రీ పిఠాపురము మహారాజావారు)

"ఆంధ్రసారస్వతము సుప్రశస్తములైన ప్రబంధములతోఁ బ్రకాశించుచున్నది. ఇందు సత్కావ్యములనేకములు గలవు. వీనిలో స్మరణీయములైన సత్కవివరేణ్యుల కృతులను గొన్నిటి నిటఁ బేర్కొనియెద. నన్నయభారతము; తిక్కనభారతము; నిర్వచనోత్తరరామాయణము; ఎఱ్ఱనార్యుని హరివంశము నృసింహపురాణము భారతము నందలి యారణ్యపర్వశేషము, పోతనామాత్యుని భాగవత భాగములు; నాచనసోముని ఉత్తరహరివంశము; పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్నము కళాపూర్ణోదయము; చింతలపూడి యెల్లనార్యవిరచితమైన విష్ణుమాయానాటకము రాధామాధవము; గౌరవ హరిశ్చంద్రోపాఖ్యానము : శ్రీనాథుని పల్నాటివీరచరిత్ర; కృష్ణదేవరాయల ఆముక్తమాల్యద; నన్నెచోడుని కుమారసంభవము; చేమకూర వేంకటకవి విజయవిలాసము; తాళ్ళపాక తిరువెంగళనాథుని పరమయోగివిలాసము; దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిలుగారి మహేంద్రవిజయము, వీరిసోదరులైన వేంకటకృష్ణశాస్త్రిలుగారి నయనోల్లాసము, యతిరాజవిజయము. వీనిలో నత్యుత్తమములైన పొత్తములు:

నాచనసోముని యుత్తరహరివంశము, భారతమునందలి తిక్కనకవి కృతములైన పదునైదుపర్వములు; పోతనామాత్యవిరచితములైదు భాగవతభాగములు; పింగళి సూరన్న కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నమును, ఇవి యసమాన లసమానలీలవెలయుచున్నవి. స్వభావ వర్ణనలావణ్యమున నతిశయిల్లుచు, రసవత్తరములై రమ్యతమములుగ రాజిల్లుచున్నవి. అనన్యసామాన్యభావనా విలసితములగుచుఁ జదువరుల నమందానంద కళితహృదయారవిందులుఁగ జేయుచుండును. ఇట్టి ప్రబంధరత్నముల రచించిన సోమన, తిక్కన, పోతన, సూరనలు, కవికులతిలకులు; అశేషశేముషీ విభవాభిశోభితులు; అప్రతిమాన ప్రతిభావిభవాసితులు; ప్రపంచకమునందలి సమస్తసారస్వతములలోను అగ్రగణ్యులుగఁ బ్రఖ్యాతివడసిన కవిశేఖరశిఖామణులతోఁ దులఁదూఁగువారనుటకు సందియమిసుమంతయును లేదు... మన సత్కావ్యములవశ్య పఠనీయములు. అవి యాంధ్రభాషాపోషకమూల్యములైన యలంకారములు...సద్ధర్మబోధకములై మనలను నీతిప్రవర్తకులుగఁజేయుశక్తి వీనికిఁగలదు. పరమపవిత్రములైన మన యుపనిషత్తులు మొదలుఁగాగల యుద్గ్రంథములయందలి వేదాంతవిద్యను విదితముచేసి మనలను విజ్ఞానవంతులుగఁ జేయసమర్థములు. భగవద్భక్తితత్త్వమును మనచిత్తముల నత్తునట్లు మనోహరరీతిని వర్ణించి మనకు మహోపకారము నొనర్చును. ఇవి యైహికాముష్మికముల కత్యంతావశ్యకమైన యంశములు. ఇట్లు బహుభంగముల ఘనమైన లాభముల నొసంగు భాషగల మనభాగ్యమే భాగ్యము. ఇట్టి సర్వోత్తములైన ప్రబంధములను మనకుఁబ్రసాదించిన కవివతంసులు సర్వదావందనీయులు. సర్వేశ్వరానుగ్రహమున మనసారస్వతము దినదినాభివృద్ధినొంది భాసిల్లుగాత! ఆంధ్రసాహిత్యపరిషత్తు తగినప్రోత్సాహమునొసంగి కృతకృత్యయగుఁగాత,

(20)

సర్వజ్ఞసింగభూపాలవిరచిత రత్నపాంచాలికా నాటకము ననువ దింపఁజేసి దానికి తొలిపలుకు శ్రీ రాజావారిట్లు వ్రాసియున్నారు. దీనిని శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు ఆంధ్రీకరించిరి:

"కొందఱు కిట్టనివారిట్టి విద్వద్వంద్యుఁడగు సింగభూమీశు నిపై దోషారోపణముఁజేసిరి. బమ్మెర పోతనామాత్య కృతమైనభాగ వతము సింగభూపతి తనకంకితమీయఁగోరెను. దానికిఁ బోతన సమ్మ తింపలేదు. అందుపై నాప్రభువు కోపోద్దీపితుఁడై యాంధ్రగ్రంథమును బాఁతిపెట్టించెను. అందువలనఁ గొన్నిభాగములు క్రిమిదష్టములై నశించెను. తరువాతఁ గొంతకాలమునకు నాపుస్తకము బైటఁబడినపు డితరులా శిథిలభాగములను బూరించిరను లేనిపోని యపవాదము మోపిరి. ఈనింద హేతురహితమైనది. పోతనామాత్యుఁడు భోగినీ దండకము రచించి సింగభూపతికిఁ గృతియిచ్చెనుగదా. ఇట్లు ప్రభుని యభిమతము ప్రకారము ప్రవర్తించిన యాతఁడు భాగవతమును సింగనృపతికిఁ గృతినీయకుండునా! అంతటి ధీశాలియు నఖండపండి తుఁడు నలంకార తత్త్వవేత్తయు భక్తశిఖామణియుఁ గవిశిరోమణియు నైన మహానుభావుఁడు బమ్మెర పోతనామాత్యవిరచితమై భక్తిరస పూరితమైయొప్పు భాతవతమును బాఁతిపెట్టించుట యను పాపపుఁ బనికి నొడిగట్టుకొనునా! పరోపకారఱముకొఱకే రద మిగులశ్రమగొని 'రసార్ణవసుధాకరము'; 'సంగీతసుధాకరము', రత్నపాంచాలిక' మొద లగు సద్గ్రంథముల రచించెను! అట్టి మహాకవికీపాట్లేల? కృతిభర్త యగుటకంటెఁ గృతికర్తయగుట ఘనముకదా. అదియటుండనిండు:

ఇంతకును నీభాగవతమునకు బ్రతియొక్కటేయుండునా:... మఱియు నీభాగవత భాగములను బూరించినశిష్యులు కొందఱుకలరు గదాః వీరీ విషయమెందేనిఁ బొందుపఱచిరా! దీనికి మూలమైని

వ్యాసరచిత సంస్కృతభాగవత ముండెనుగదా! కవివరుఁడగు పోతరా జుండెనుగదా! ఆయన తిరిగి వ్రాసికొనక లేకపోయెనా! సర్వజ్ఞుఁడు పోతన భాగవతమును బఠించి యానందించి కృతార్థులగు భాగ్యము ను లోకులకు లేకుండఁజేయునా?

ఎవరికిని లభింపకుండునటుల నీభాగవతమును దగులఁబెట్టించు నుగాని యెప్పుడో లేక మఱెప్పుడో యితరులకు దొరకునటులఁ బాతిఁపెట్టించునా! అఖండపండితుఁడై కవిశేఖరశిఖామణియైన యీ యశోవిశాలునకుఁ బోతన భాగవతె మంకితమీయ నంతమాత్రమున లోటువాటిల్లెనని యాతఁడెంచినట్లు మనము దలంచుట యుచితము గాదు. ఇంతకును సర్వజ్ఞుఁడును బోతనయు సమకాలికులే కారని యొక వాదముకలదు. అట్లగుచో నేబాధయు లేదు.

మఱియొకవాదమిందు వివరించెద. అదియేమియన: బోతనా మాత్యుఁడు భాగవతమునందలి రసవత్తరములైన భాగములను మాత్రమే విరచించి, శేషించినవానిని తనశిష్యులు వ్రాయుటకై పద లెను. అవి యాతీరున నిర్మితములయ్యె కావునఁ బ్రప్రథమమున నవన్నియు నేరీతిరచింపఁబడెనో యాతీరుననే సరిగ మనకులభించి నేఁడుకూడ మనకడ సంపూర్ణముగనున్నవి, అప్పుడు శిథిలమను మాటకిసుమంతయు నవకాశముండదు. ఈవాదము సహేతుకమై సం తృప్తికరముగనున్నది.

నారయ, సింగన, గంగనలను, ముప్పురుకవులలో నెవ్వరు నిటుల భాగవతములు శిథిలములైనవనుమాటయే యెత్తుకొనలేదు. పోతనామాత్యుని ప్రియశిష్యుఁడైన నారయయైనను దీనిని బేర్కొనలేదు. ఇది ముఖ్యమైనవిషయము. పోతనమహాకవి సమకాలికులైన కవు లొక్కరైనను దీనిని వాకొనలేదు. కవివరులైన పోతన పుత్రాదిబంధు వులెవ్వరునుగూడ నీవిషయము నెచ్చటను దెలుపరైరి. అటుపిమ్మటఁ

గూచిమంచి తిమ్మకవి కాలమువఱకు వెలసిన విద్వాంసుల గ్రంథము లలో నెందును నీపరివాదము కానరాదు.

శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు, గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు...నీయంశమును బాగుగఁ బరిశీలించి యీప్రవాద మసంజసమైనదని వ్రాసియుంచిరి.

అశేషశేముషీవిభవాభిశోభితుఁడైన సర్వజ్ఞసింగభూభుజుఁడు సర్వజ్ఞవరేణ్యుఁడై, కవిశిఖామణియై, యాలంకారికచక్రవర్తియై, విద్వ ద్వతంసుఁడై, వంద్యుఁడయ్యెను. వైయాకరణశిరోమణియై ప్రసిద్ధి గాంచెను. నాట్యకళాకోవిదుఁడై పొగడొందెను. సంగీతశాస్త్రపారం గతుఁడై భాసిల్లెను. ఆహా, ఈమహామహుని మహిమాతిశయము? ఇట్టివారు వేఱేకి? అతనికాతఁడే సాటి.

విద్వద్వంద్యులు, పరమపూజ్యులు, మహాప్రాజ్ఞులునైన సర్వజ్ఞ సింగకవిసార్వభౌమా? సద్భక్తిపూర్వకముగ నేను సమర్పించుసాష్టాంగ నమస్కారముల స్వీకరింపుడు।

సత్యాభిమాని,

రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు.

(21)

ఉత్తరహరివంశ లఘుటీక.

శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు ఉత్తరహరివంశమునకు రచించిన లఘుటీక ఆంధ్రసాహిత్యపరిషత్తు వ్రాతప్రతులలో గలదు. దాని సంఖ్య 174/20. ఇది వారి స్వహస్తముతో వ్రాసియుండిరి. ప్రథమాశ్వాసము, ద్వితీయాశ్వాసములోని కొంతభాగమునకు టీక వ్రాయఁబడియున్నది.

(22)

ఆంధ్రసారస్వత చరిత్రములో సూర్యరాయశకము

శ్రీ కూచి నరసింహముగారు వ్రాసిన వ్యాసము

## The Surya Row or the Modern Age.

(Encyclopaedia of the Madras Presidency and the Adjecent States)

During the last three decades, novels and dramas have been written for the first time in Telugu, and Mr. Viresalingam Pantulu was one of the pioneers in three fields also.

Mr. Panuganti Lakshminarasimha Rao Pantulu, a poet enjoying the patronage of the Rajah of Pithapuram rendered yeoman's services to the Telugu Dramatic, Literature by his valuable contributons to it. His Sakshi, which is written on the lines of Addisons' famous Spectator, is a critical prose work treating of social, religious and literary topics.

These are the halcyon days of Telugu Literature once again. The Sri Rajah, R. V. K. M. Surya Rao Batadur, is a patron of Telugu Literature, who is reminding the Andhra public of the days of the Emperor Krishnadevaraya and Bhoja. Under his auspices a Nighantu or Lexicon is being compiled, the history of Telugu poets is being edited and fresh commentaries of the Mahabbharatam are being written. His is also patronaing Telugu letters in several ways.

To unify the several efforts for the progress of the Telugu Literature, associations like Andhra Sahitya Parishad have been holding periodical literary conferences.

The appropriateness of the heading of this section "The Suryaraya Age" will become patent when the future student of literature will make critical statement about the present literature.

K. Narasimhan, H. M. R. Ch.
High School, Pithapuram.

1921,

(23)

శ్రీ పెద్దాడ రామస్వామిగారు ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు మహారాజావారికి 'డాక్టరేట్' పట్టప్రదాన సమయమున నిచ్చిన ఉపన్యాసము

Oration delivered by the University Orator Sri Peddada Ramaswami, M.A., Principal P. R. College at the presentation of the Honorary D. Litt Degree to the Maharajah Saheb of Pithapuram, C. B. E, Andhra University, date 1—10—1938.

Enriched in a noteworthy degree with the treasures of culture, both Eastern and Western, the Maharajah has from his youth proved himself an honoured representative of the intellectual aristocracy of the land, ever dedicating his God-granted resources to the services of his fellow-beings. Himself an ardent student and keensighted critic of Telugu Literature, he has signalised his administration with a liberal patronge of scholarship and culture in diverse directions. Many a classic work would not have seen the light of publication, many a talented soul would have lanugi shed in poverty and many a stout heart would have been borne down by adversity, had it not been for the rich beneficence of this Prince among men who holds wealth as a Trustee and employs rank as a servtnt appointed by God. The most remarkable achievement in this

direction was the foundation and endowment of the Andhra Sahitya Parishat which has been the one organised and stable institutiou for the collection, the preservation and, in due course, the publication of all that isprecious but lying obscure in the field of Telugu literary production and has already collected well nigh 5,000 manuscripts of unpublished Telugu works. His services to the cause of his mothertongue have reached a fitting culmination in the preparation, as a result of the steady and sustained labours of a Syndicate of able Scholars and Pandits of achnowledged intellectual eminence, of the first volume of Telugu Lexicon a standard Dictionary appropriately entitled the "Surya Raya Andhra Nighantuvu." These monumental services to Telugu Language and Literature have rightly earned for him the envible honour of being ranked with the Royal Patrons of Andhra Culture whose nameshavenow passed into History Raja Raja Narendra and Krishna Deva Raya, On this grateful estimate of his admiring countrymen the University has now commendably resolved on affixing the seal of academic recognition with the Honorary degree of Doctor of Letters.

(24)

## పం డి త పో ష ణ ము

మహారాజావారు సారస్వత పోషణమేగాక. వైదిక సంస్కృతికిని జేసిన సాయ మపారము. ఆంధ్రదేశమున సుప్రసిద్ధులగు పండితులు వీరి యాస్థానమున పండితులుగా నియమింపఁబడి మాసిక, వార్షికవేతనము లందుచుండిరి వారిలో వీరగ్రగణ్యులు.

1. శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రిగారు (తార్కికులు)
2. దెందుకూరి నరసింహశాస్త్రిగారు (వేదాంతవేత్తలు)

| | |
|---|---|
| 3. మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు | (వ్యాకరణ శాస్త్ర పండితులు) |
| 4. చిలుకూరి లక్ష్మినారాయణశాస్త్రిగారు | |
| 5. వేదుల సూర్యనారాయణశాస్త్రిగారు | |
| 6. గుడిమెళ్ల వేంకటరంగాచార్యులుగారు | (విశిష్టాద్వైతపండితులు) |
| 7. వడలి లక్ష్మినారాయణశాస్త్రిగారు | (ఆన్వీక్షికీ మూర్ధవాచస్పతి బిరుదాంకితులు) |
| 8. తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగారు | (సంగీతశాస్త్రజ్ఞులు) |

(25)

పిఠాపురమునందు జరిగిన ఆంధ్రసాహిత్యపరిషత్తు వార్షికోత్సవమున మహారాజావారిచ్చిన స్వాగతోపన్యాసమునందలి కొన్ని భాగములు:

మన యాంధ్రసారస్వతమునకు వేఱొకరీతిని గూడ నుపకారమొనర్పవచ్చును. అదియెట్లన? అముద్రితగ్రంథముల వెదకి సంపాదించి ప్రచురింపవలయును. ఉత్తమప్రాచీన గ్రంథము లెన్ని దాఁపఁబడియున్నవో యెవ్వరు చెప్పఁగలరు? కష్టపడి వెదకినచో వానిలోఁ గొన్నియైన వెలువడవచ్చును. పింగళి సూరనార్యుని గరుడపురాణము, ఎఱ్ఱాప్రెగడ రామాయణము, నాచనసోముని వసంతవిలాసము, బమ్మెర పోతరాజుచే రచింపఁబడి శిథిలమైనవని మనమనుకొనుచున్న భాగవత భాగములును బయటఁబడినచో మనయదృష్ట మింతింతయని చెప్పనలవియగునా? .....మా గోదావరీమండలము పెక్కువిధముల వన్నె కెక్కినది. వాగనుశాసన బిరుదాంకితుండగు నన్నయభట్టారక కవీంద్రుఁడీమండలములోనుండియే గదా భారతభాగమును రచించెను.

ఈకవిరాజును బోషించిన రాజరాజనరేంద్ర మహారాజుగూడ నీమండలములోనివాఁడె. కవితరాజ పోషణమున వర్ధిల్లుటకిది యే మొదలు... అనవద్యమగు గద్యరచన ప్రారంభమగుటయు నిచటనేగదా! గద్యతిక్కన యను వన్నె కెక్కిన కీర్తిశేషులైన శ్రీ కందుకూరి వీరేశలింగముగారి నివాసస్థానమిదియేగదా... నవలలో నత్యుత్తమములగునవి వ్రాయుటకు మొదటివారైన బ్ర॥ శ్రీ॥ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు మామండలమువారే!... ఉత్తములగు కవులలో, భాషాపోషకులైన ప్రభువులలో, వచనరచనా ధురంధురులలో, నవలారచయితలలో నాటకకర్తలలో, విమర్శనప్రవీణులలో నాద్యులైనవారికి మా గోదావరీమండలమే వాసస్థానమగుటచే నిది ధన్యమైనది. ఇట్టిమండలమున నుండు భాగ్యముగల్గిన మాపీఠపురము బహుపురాతనపట్టణము ఇట్టి పీఠికాపురమున మా సంస్థానముండుటచే మే మెంతయుధన్యులము మా యాస్థానమున సత్కవిసత్కారము చిరకాలమునుండి వంశపరంపరగా వచ్చుచున్నది. మాపూర్వులు భాషాభిమానధనులు. వాసవదత్తాపరిణయమును రచించి మాకంకితమొసంగిన నక్కలంక వీరభద్రకవి, బహుగ్రంథ రచనాధురంధురుఁడగు తిమ్మకవి, ఈయన తమ్ముఁడు జగ్గకవి అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి మొదలగు కవులిందుండెడివారు. మాతండ్రిగారి కాలములో మహాకవులగు దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిలుగారును, వేంకటకృష్ణశాస్త్రిలుగారు నను సోదరులు మాసంస్థానమునకు భూషణములైయుండెడి యదృష్టము మాకబ్బినది. దేవులపల్లిసోదరులు జీవించియున్నపుడే విద్వత్కవీంద్రులు మఱి యిరువుర మాయాస్థానము నలంకరింపుఁడని ప్రార్థింపనాగుననన్ననుగ్రహించి కృతకృత్యుని జేసిరి. వారికవిత్వ మత్యంతప్రౌఢమైనది. అఖండపాండితీప్రతిభాశాలురు. వీరు ఓలేటి వేంకటరామశాస్త్రిలవారును, వేదుల రామకృష్ణశాస్త్రిలవారును. వీరిలో రెండవకవి నన్నుఁ జంతాసముద్రమునఁ ద్రోసి యీశ్వరసాన్నిధ్యమును జేరిరి...

నేడు మనసభ కధ్యక్షులుగనుండు బ్ర॥ పానుగంటి లక్ష్మీనరసింహాముగూడ మాయాస్థానకవియే. విశేష శేముషీవిభవాభిశోభితుఁడు. బహుగ్రంథరచనా పటిష్ఠుఁడు ... వీరు సాక్షియను పేరిడి ప్రపంచమున జరుగు సంగతులను విచిత్రితతుల ననేకవ్యాసములు వ్రాసి క్రొత్తఫక్కిఁ ద్రొక్కిరి. ఈకవి నాటకరచనయం దతిసమర్థుఁడు......

కవులకుఁ బండితులకు, విమర్శకులకు, భాషాపోషకులకు, భాషాభిమానులకును మనఃపూర్వకస్వాగతము. భక్తిశ్రద్ధలతో మా శక్తివంచనములేక యతిథి సంస్కారము సేయుచున్నాము. మానవుల మగుటచే వీనిలో లోపములుండవచ్చును. కరుణతో క్షమింపుఁడని కరములు మోడ్చుచున్నాము.

క్రీ.శ. 19-2.

## (26)

## సాహిత్యసంస్థలకు సాహాయ్యము.

మహారాజావారి సాహిత్యపోషణము ఆంధ్రసారస్వతాభివృద్ధికి తోడ్పడు సంఘములకు సంస్థలకు, కవులకు సహితము లభించెను.

ఆంధ్రవాల్మీకి రామాయణ ప్రచురణమునకు శ్రీ వావిలికొలను సుబ్బారావుగారికి, ఆముక్తమాల్యద ఆంధ్రనైషధవ్యాఖ్యానములకు శ్రీ వేదము వెంకటరాయశాస్త్రిగారికి, పింగలి సూరనార్య గ్రంథప్రచురణములకు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి, ఆంధ్రపత్రిక స్థాపనమునకు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారికి, వేలకొ

లకు ధనసాహాయ్యము మహారాజావారొసర్చిరి. ఆంధ్రభాషాభివర్ధని సంఘము, విజ్ఞానచంద్రికాగ్రంథ మండలి, ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము మొదలగు ఆంధ్రగ్రంథప్రచురణ సంఘములకు వారిసాయ మపరిమితము.

గ్రంథకర్తలగు శ్రీ ఆదిపూడి సోమనాథరావుగారు, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు మహారాజవారిచే ధనసాహాయ్యము నొందిరి. శ్రీ లక్ష్మీనరసింహముగారికి [illegible] నెలకు రు 125 చొప్పున వేతనమొసంగి, వారు కోరిన ధనసహాయము మహారాజా వారొసర్చుచుండిరి. వారి యాస్థానకవులును నాటక గ్రంథకర్తలు నగు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు వ్రాసిన గ్రంథము లన్నియు మహారాజావారే యచ్చొత్తించి, వారికొసంగిరి. ఈవిషయము శ్రీ లక్ష్మీనరసింహరావుగారు తమగ్రంథపీఠికలలో తెలియ జేసిరి.

## రాణీ చిన్నమాంబ.

ఈమె మహారాజావారి దేవేరి. శ్రీ రాజా నాగయ్యప్పారావు (కపిలేశ్వరపురము జమిందారు)గారి కుమారికారత్నము. మహాసాధ్వి యని వాసికెక్కిన సీమంతిని. ఈమె కొండాళ్ళమ్మ యను నామాంతరమును గలదు.

ఈమె తన నాథునివలెనే, తానును కవయిత్రులను గౌరవించి విద్వద్గోష్ఠుల నెఱపుచుండెను. సమస్యలు పూరించుట, ఆశుకవిత్వము చెప్పించుట, కావ్యపఠనము గావించుట, సాహిత్య విమర్శనమును జేయుట యీమె విద్యావినోదములు. ఈమె రామాయణసంగ్రహము

మొదలగు గద్య గ్రంథములను, కొన్ని పద్యకావ్యములను రచించి యుండెను. పై విషయములు ఉభయభాషాప్రవీణ. ఊటుకూరి లక్ష్మీ కాంతమ్మగారు రచించిన ఆంధ్రకవయిత్రులను గ్రంథములో వ్రాయ బడెను. పై గ్రంథము లెవ్వియు నాటి వెలమకులకాంతలవలె నిలు వెడలలేదు.

## ఆంగ్లగ్రంథ ప్రచురణములు.

మహారాజు స్వభాషాభిమానముచే సాహిత్యపోషణముగావిం చుట వింతగాదు. వీరు ఆంగ్లగ్రంథ ప్రచురణములకు వేలకు వేలు వెచ్చించిరి. కొన్నిటిని జూపుచున్నాను.

(1) బ్రహ్మసమాజ మతప్రవిష్టులగు శ్రీ పండిత శివనాథ శాస్త్రి వ్రాసిన బ్రహ్మసమాజచరిత్రము.

(2) శ్రీ కేశవచంద్రసేనుని వ్యాసములు.

(3) శ్రీ రామమోహనరాయుని కొన్నిరచనలు.

(4) శ్రీ సీతానాథ తత్త్వభూషణుని వేదాంతగ్రంథములు.

(5) శ్రీ వెంకటరత్నమునాయుడు బ్రహ్మమతవ్యాసంగములు

(6) శ్రీ శ్రీనివాసాచార్యులు వ్రాసిన గూఢమతనిర్వచనము.

## ధర్మము — సప్తసంతానములు.

ప్రభువులెప్పుడును ధర్మపథమును దప్పక, పరిపాలనముగావిం చుటయు, నందేదేని దోషమావహిల్లినచో పాపపరిహారమునకు సప్త సంతానముల బోషించుటయు నీరెండును నిర్దిష్టమగు నియమములు. సప్తసంతానములలో కావ్యమె ఆచంద్రార్కము విరాజిల్లుచుండును. కావుననే జైమినిభారత కృతికర్త యిట్లు వకాణించియున్నారు.

ఉ. ఆదటనస్తసంతతుల యందును నొక్కొకకాలమందు వి
చ్ఛేదముగల్గునాఁటికిటికిం జెప్పఁగశక్యమె యేయుగంబునన్
లేదుకవిత్వసంతతికి."

మానవునకు తిన్నది పుష్టిగాదు. ఉన్నదియును గాదు. అట్టిపుష్టి యెప్పటికప్పుడు నష్టి. యశమె యాచంద్రతారకము.

మహారాజు 'నభూతో, నభవిష్యతి' యను శ్లోకోక్తికి ఆమ్రేడితము.

కుందూరి ఈశ్వరదత్తు.

## శ్రీ పిఠాపురముమహారాజావారు, రామకృష్ణకవులు.

"సమానశీలవ్యసనేషు సౌహృదమ్"

౧

ఆంధ్రులచరిత్రలో వన్నెకెక్కిన సర్వజ్ఞసింగభూపాలుఁడు శ్రీ పిఠాపురంమహారాజావారికి మూలపురుషుఁడు. ఈ సింగభూపాలునిగూర్చియే

'ఎటుల మెప్పింతువోగదా! యింకమీఁద
రావు సింగమహీపాలు ధీవిశాలు'

అని శ్రీనాథుఁడు మన్నించియుండెను. ప్రసిద్ధుఁడైన సింగభూపతి స్వయముగ సంగీత సాహిత్యాలంకార గ్రంథములను రచించెను. విశ్వేశ్వరాదికవిపండితుల నాదరించెను.

మహారాజావారి యాభిజాత్యమును దెలుపుట కింతమాత్రము చాలును. రసజ్ఞత రావువారివంశములోఁ బరాకాష్ఠనందినది. ఏనాఁటి కానాఁడే పిఠాపురప్రభువులకు కవిపండితాదరణము సహజాలంకరణమై విలసిల్లెను. శ్రీనాథు నాదరించిన సింగభూనాథుఁడు మొదలు, నేఁటి (యువ) రాజా గంగాధరరామారాయ ప్రభునివఱకుఁ గవుల మన్నింపని మన్నీలు రావువారిలోఁ గానరారు. వక్కలంక వీరభద్రకవి; అల్లంరాజు సుబ్రహ్మణ్యకవి; దేవులపల్లి సోదరకవిద్వంద్వము; రామకృష్ణకవియుగము; చిలకమర్తి; కందుకూరి; కూచి; పానుగంటి కవులు పిఠాపురరాజాశ్రయమునఁ గవిత నాలపించిన వారే.

రామకృష్ణకవులు గోదావరీమండలాంతరనివాసులైన ఆరామ ద్రావిడశాఖకుఁ జెందిన వైదికకుటుంబమువారు. ఇందు (వేంకట) రామకవి కాకినాడతాలూకా పల్లిపాలెము వాస్తవ్యులు. (రామ) కృష్ణకవి తణుకుతాలూకా కాకరపర్తి వాస్తవ్యులు. వీ రిరువురు మేనత్త మేనమామల బిడ్డలు. ఓలేటి వేంకటరామశాస్త్రిగారి పితృపితామహులలోఁ బెక్కురు సాహిత్యవ్యాసంగమున జీవితము నెఱపు

కొన్నవారే. వీరి ప్రపితామహులు చంద్రశేఖరశాస్త్రిగారు సాహిత్యవేత్తయని యనూచానముగ నాయింట్లలోఁ జెప్పుచుందురు. పితృవ్యులు దక్షిణామూర్తిశాస్త్రిగారు సాహిత్యపాఠములు చెప్పుచుఁ గనన మల్లుచుండెడివారు. వీరే వేంకటరాయశాస్త్రిగారి కావ్యప్రథమగురువులు.

ఇఁకఁ గాకరపర్తిలో నెల్లరుఁ బండితులే; కవులే. రామకృష్ణశాస్త్రిగారి యభిజనము కాకరపట్టు సోమనాథశాస్త్రిగారు, రామచంద్రశాస్త్రిగారు మొదలగు సాహిత్యవేత్తలు వేనాలవారే. రామకృష్ణశాస్త్రిగారి పితృపితామహులలో అధ్యాపన పూర్వులు బాగుగఁ జదువుకొన్నవారే గాని సాహిత్యైకజీవనులుగాఁ గానఁబడరు. కావున రామకృష్ణకవిగారి సాహిత్యాసక్తి, కవనశక్తి మేనమామలవైపు నుండియే వచ్చినట్లు కానఁబడును.

౨

పిఠాపురమహారాజు రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు రించుమించుగా పదునెన్మిది సంవత్సరముల ప్రాయమునఁ దమ రాజ్యభారమును స్వీకరించిరి. అంతకుముందు తమ(మైనారిటీ) బాల్యమున కోర్టు ఆఫ్ వార్డ్సువలనఁ బోషింపఁబడిరి. ఆంగ్లాది భాషలును, రాజనీతి, పరిపాలనావిధానశాస్త్రములును, ఆయా విషయములందు సిద్ధహస్తులునైన ఆంగ్లేయులవలన నభ్యసించిరి. సంస్కృతము, ఆంధ్రము, దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారి సముద్గను, మొక్కపాటి సుబ్బారాయుడుగారివలనను బఠించిరి. రసజ్ఞులయిన యీ గురువులు మహారాజావారికి 'ముక్తస్య ముక్తార్థః' వలెఁ జెప్పక రసతృష్ణయుఁ దద్రసాస్వాదనమును నలవఱించిరి. దీనితోపాటు ప్రాక్తనజన్మసంస్కారలభ్యమగు సహృదయత వీరిలో వెల్లివిరిసెను. దేవులపల్లి సోదరులు ప్రోదిచేసిన వీరిసాహిత్యశక్తియు, రసానురక్తియు నొకపాటి ప్రదర్శనమునకు నలరవుగదా!

ఇరువురిలో వేంకటరామశాస్త్రిగారు, రామకృష్ణశాస్త్రిగారి కంటె నాలుగేండ్లుపెద్ద. కావ్యములును కౌముదిలోఁ గొంతభాగమును స్వగ్రామమగు పల్లిపాలెములో పఠించినపిదప కాకరపర్తిలో మేనత్త గారింటనుండి చర్ల నారాయణశాస్త్రిగారియొద్ద నాటకాలంకారములు పఠించిరి. ఆకాలములోనే కవితచెప్పుట యారంభించి వ్యాసాభ్యుద యాదిగ్రంథముల నొనర్చిరి. మేనత్తకొమరున కీయన యాదర్శము య్యెను. తొలుదొల్త రామకవిగారే కృష్ణకవికి గణయతిప్రాసలక్షణ ములునేర్పి పద్యములల్లించిరి. ఈసంగతినే:

"పన్నుగ నాకు సత్కవనపద్ధతి నేర్పిన బావ శాస్త్రిసంపన్నుఁడు"

అని యొక యవధానములో కృష్ణకవి పేర్కొన్నారు. క్రమ ముగా కృష్ణకవి కవియై రామకవిగారికి జంటకవియైనారు.

రామకృష్ణకవులు ఇరువురును బాలకవులే. ఇరువది రెండు, పదు నెన్మిది వత్సరముల ప్రాయమున దేవగుప్తాపు భరద్వాజముగారివలనఁ బిఠాపుర (మైనరు) రాజావారి సాహిత్యోత్సుక్యమును విని, రాజసం దర్శనమున కువ్విళ్ళూరినారు. బహుగ్రంథావలోకనమున రాజులను, భోజులను మననముచేసికొన్నారు. కవులును, కాళిదాసులును దామే యనుకొన్నారు. పూర్వజన్మసంస్కారలబ్ధమైన పాండిత్యము, కవి త్వము, వానికిఁదగిన సాహసము వీరిలోఁ బొడచూపినవి. వెంటనే పద్య రూపమగు దరఖాస్తు నొకదానిని రచించిరి:

క. శ్రీరాజా వేంకటసూ
ర్యారాయ మహీపురందర కుమారబహ
ద్దూరు జమీందారు శ్రీ
గారిలసద్దివ్యసమ్ముఖమ్మున కెలమిన్.

అని పంపినారు, అందులో:

చ. నతజనపాల! తణుకునకు నాలుగుమైళులలోన సత్కవి
పత్రతతికి మన్కిపట్టయినగ్రామము కాకరపర్తినాఁగ నం
చితమగు; నందు నేను గడుచిన్నతనంబుననుండి విద్యనే
ర్చితి, నటుపిమ్మటన్గవిత చెప్పుచు గ్రంథములం బొనర్చితిన్
పితృభగినీసుతుం డిపుడు పేరిమి సాయముచేయ రాజరం
జితముల పట్టణంబులను జేరి వధానము లాచరింపఁగా
గుతుకము కల్గియుండె సమగూరుపుమయ్యది . . పద్యముల్
శత మొకగంటలో సలుపఁజాలుదు, నాసువ్రుఁ జూచి నాదు
పాండితి నెఱుగంగవచ్చు . .

అని వేంకటరామశాస్త్రిగారు చెప్పినారు. రామకృష్ణకవి "మూఁగను మ్రుట్టఁగా కవనముం గని యారసినార"మనియు 'మాకవిత్వమున్ మేలని పించుచున్ వడిని మేల (Mail) నిపింపఁ దలంపు భూవరా' అనియు ప్రతిజ్ఞలు సలిపినారు.

అంతకుముందే యానాములోను పల్లెపాలెములోను అష్టావధానములును, కొలఁదిమందికిమాత్రమే శతావధానమును జేసియుండినను ఆత్మవిశ్వాసబలమున :

చ. అమలవివేక! మీర లొకయష్టవధానము నిచ్చగింతురో
తమకు మనంబునన్ శతవధానముఁజూడఁగఁ గోర్కెకల్గునో
నిముసములో నొనర్చెదము.'

అని పల్కినారు. వారిదృష్టి యెల్లను:

"లోకవిఖ్యాతి గడింప వచ్చితిమిగాని ధనార్జనమాచరింప నిన్ జూత మటంచు రాము : అనియే. మఱియు :

ఉ. అక్షరలక్షలిచ్చునృపు లట్టికపిందురిలు గానరా రటం
చీక్షితివారలెల్ల వచియించెదు సుద్దుల నాలకింతె హా

ర్యక్షుసద్మక్షు! నీవును దిరంబుగ మేమును గక్షుకట్టి ప్ర
త్యక్షముచేయఁబూనుదమె తత్సముఁడన్ గవుల న్న రేందు్రిలన్.

అని బాలసూర్యప్రభువును ప్రోత్సహించినారు. ఇఁక తమవారి తోషికము మాట:

ఉ. భోజసమాను నర్థిసురభూజుని జూచితి రే పిఠాపురీ
రాజు, సతండు మిమ్ము కవిరాజుల నెట్లు బహూకరించె నం
చోజను, గోరువారికి సదుత్తరమిచ్చి, తదాననంబులన్
దేజరిలంగఁజేసెడుగతిన్ మము నీవును గారవించుమా.

అని గడుసుఁదనమున సూచించినారు.

ఆనాఁడు పిఠాపురము మహారాజావారికి శ్రీ మొక్కపాటి సుబ్బారాయుఁడుగారు ప్రయివేటుశక్రెటరీగా వ్యవహరించుచుండిరి. సుబ్బారాయుఁడుగారు పట్టభద్రులు, సాహిత్యప్రియులు. దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి, తమ్మన్నశాస్త్రిగారల పాండిత్యమును,కవితాపాటవమును దర్శించి అభినందించిన భాషాభిమానులు. బాలసూర్యప్రభువు న్యూయింగ్టన్ (ప్రభు) కళాశాలలో నున్నప్పటినుండియు గురువులై వారిమన్ననకుఁ బాత్రులైనవారు.

పిఠాపురమునకుఁ బోయినతోడనే రామకృష్ణకవులీయనయొద్దకుఁ బోయి తమకుతూహలమును దెలిపి తమ పద్యరూపమగు దరఖాస్తును వీరిచేత నంచినారు. సుబ్బారాయుఁడుగారీబాలకవిద్వితయమును గాంచి వారి కవితాసామర్థ్యమును గుర్తించి సూర్యాలోకనమున కనుమతి నొసంగిరి.

క్రొత్తగా రాజ్యసింహాసనమెక్కిన సూర్యారాయబాల ప్రభువునకుఁ గ్రొత్తగా కవనమారంభించి, అహమహమికతో రెపరెపలాడుచుఁ గవిత్వముచెప్పుచున్న రామకృష్ణులకుఁ దారామైత్రి యారంభమయ్యెను.

సుప్రసిద్ధులగు దేవులపల్లి సోదరులు గంగాధర రామా రాయల కాలమున శతావధానాష్టావధాన ఆశుకవిత్వ చిత్రకవిత్వాది వినోదములను జూపినారు. ఇప్పుడు శ్రీరామకృష్ణులు శతావధానాష్టావధాన శత విధానములను జూపుచున్నారు. ఇట్టి వీరి కవితాసామర్థ్యమును గుర్తించి మహారాజావారు వీరిని నెలజీతము లేర్పఱచి ఆస్థానకవులనుగా గ్రహించిరి. ఏదో యొక యవధానమును జూపి రాజాదరమును బొంది పోవ వచ్చు నని వచ్చిన రామకృష్ణుల కిది యతర్కితోపపన్నమైన ప్రాప్తకాల లాభమాయెను.

3

ఇది మొదలు పీఠనగరాధిపుల సాహిత్యాసక్తి యినుమడించెను. దేవులపల్లిసోదరుల మహేంద్రవిజయ, రామరాయవిలాస, నయనోల్లాసములను బ్రకటింపఁజేసిరి. ఆకాలమునఁ బీఠాపురమునఁ గవిపండితుల సమ్మర్దము ముమ్మరమాయెను. మద్రనగరమున స్థాపింపఁబడిన ఆంధ్రసాహిత్యపరిషత్తు గ్రాంథికాంధ్రభాషను గ్రామ్యవాదఘాతముల నుండి పరిరక్షించుటకు బయలుదేరెను. ఆనాఁడే సలక్షణాంధ్రభాషా నిఘంటువును నిర్మింపఁ బరిషత్తు పూనుకొన్నది. పరిషత్ప్రధానాకాంక్ష్యములలో, నిఘంటునిర్మాణము ప్రథమగణ్యమైనది. అందునకు వలయు ధనవ్యయమునంతను దామొక్కరే భరింతుమని మహారాజు సెలవిచ్చినారు. పేరుమోగిన పండితు లందఱును పరోక్షముగనో, ప్రత్యక్షముగనో పరిషదుద్దిష్టమైన యీ నిఘంటునిర్మాణమునకుఁ బనిచేసినవారే.

ఆంధ్రసూత్రభాష్యకర్తలగు పురాణపండ మల్లయ్యశాస్త్రిల వారు, పిఠాపురప్రభుని యాదరమున నుండి భద్రాపరిణయ వ్యాఖ్యానము, మొదలగు గ్రంథములను రచించిరి. సాహిత్యపరిషత్తు ప్రకటించుచుండిన అముద్రితప్రాచీనగ్రంథముల సంగ్రహమునకు ధనసాహాయ్య

మొనర్చుటయేగాక, వావిళ్ళవారిచే కళాపూర్ణోదయాది గ్రంథములను ముద్రింపించుటకుఁ గూడ శ్రీవారు తోడ్పడిరి. వేయేల, ఆనాఁడు విలసిల్లిన సాహిత్యాంకురములన్నియు నీ సూర్యాలోకనమున వర్ధిల్లినవే యనవచ్చును.

వ్యాకరణ తర్క వేదాంతాది శాస్త్రముల వ్యాప్తికై మహారాజుగారు చేసిన వితరణములును, పోషించిన శాస్త్రసంపన్నులను జేర్కొనుట ప్రకృతముగాని వదలుచున్నాను.

రామకృష్ణకవులకుఁ దిరుపతివేంకటకవులతోఁ దటస్థించిన సాహిత్యవివాదము విరోధికృత్సంవత్సరము మొదలు కాళయుక్తిలో కృష్ణకవి నిర్యాణమువఱకు నడచుచునేయున్నది. ఇవ్వివాదమునకుఁ గారణము గురుసంబంధములను దెలుపుపట్టున గల్గిన యభిప్రాయభేదమే. రామకృష్ణకవులలో వేంకటరామశాస్త్రిగారు కొంతకాలము వేంకటశాస్త్రిగారియొద్ద కౌముదిలోఁ గొంతభాగము పఠించిరి. అప్పటికప్పుడే వేంకటరామశాస్త్రిగారు ధారాళముగఁ బద్యరచన గావించుచుండుటచే వేంకటశాస్త్రిగా రాయనను 'కవి' అని పిలుచుచుండెడివారఁట. నానారాజసందర్శన ప్రవృత్తులగు వేంకటశాస్త్రిగారియొద్ద అధ్యయనము నిరంతరాయముగ సాగకుండుటచేఁ గాఁబోలు వేంకటరామశాస్త్రిగారు చెళ్ళపిళ్ళవారిని వదలి కాకరపర్తిలో చర్ల నారాయణశాస్త్రిగారియొద్ద రామకృష్ణశాస్త్రిగారితోపాటు వ్యాకరణాలంకారములను బఠించిరి. ఒక యవధానసందర్భములో పృచ్ఛకుఁడు గురుస్తుతి వర్ణ్యముగా నొసంగెను. అందు రామకృష్ణులు నారాయణశాస్త్రిగారుభయులకు గురువులను నుద్దేశ్యముతో వారిని గురువుగాఁ గొండాడిరి. అది విని వేంకటశాస్త్రిగారు తమ్ము గురువుగా నేల పేర్కొనరే దని రామకవిగారి నదలించిరి. మాటకు మాట పెరిగినది. చిలికిచిలికి గాలివానయైనది. అవి మొదలు కోకిలకాకములు, శృంగభంగములు,

శతఘ్నులు రామకృష్ణకవులవంకను; పాశుపతములు, గీరతములు, బిజ్జాలో పాఖ్యానములు, తిరుపతి వేంకటేశ్వరులవైపునను ప్రారంభమైనవి. పాకము ముదిరి వ్యక్తిగతనిందలుకూడ నారంభమైనవి.

ఈసందర్భములో మహారాజావారు కలుగఁజేసికొని వ్యర్థమైన యీ కలహము వలదని రామకృష్ణులను గొంత వారించిరి. మహారాజావారి కీకవుల వాక్కలహ మంతగా నిష్టము గాదు. అయినను తమ యాస్థానకవుల యోటమియు నవాంఛనీయమూ యెను. కావున మహారాజావా రీవిషయములోఁ దుదకు దటస్థులై యుండిరి.

వివాదగ్రంథములవలనను బరస్పరనిందలవలనను జయాపజయములు నిర్ణయింపఁబడవు. గీరతము సంపుటములుగాఁ బెరిగి లోకములో వ్యాప్తినొందెను. దానికి సమాధానముగా రామకృష్ణకవులు రామకృష్ణమహాభారతమును రచించిరి.

> భరతవంశ్యులచరితమ్ము ప్రస్తుతించి
> భారతమ్మయ్యెఁ దొల్లిటిభారతమ్ము
> భారతీవాదగాథలఁ బ్రకటపఱచి
> భారతమ్మయ్యె నీనాఁటిభారతమ్ము.

అని భారత నామసారస్యమును వివరించిరి.

పాండవాశ్వమేధనాటకములో నూఱుతప్పులను జూపుచు 'శతఘ్ని' యను విమర్శనను కవితపత్రికలోఁ బ్రకటించిరి. దానికి సమాధానముగ తి.వేం. కవులు "పాశుపతము" అను ఖండనము వ్రాసిరి. దానికి మరల రామకృష్ణులు "పరాస్తపాశుపతము" అను ఖండనము వ్రాసిరి. దానితరువాత రామకృష్ణకవుల శిష్యులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు "పాణిగృహీతాశ్రవణానందశృంఖల" యను విమర్శనమును తి.వేం. కవుల సుప్రసిద్ధ గ్రంథములపైఁ బ్రకటించిరి. దానికి వారు "శృంఖలాత్మనీకరణము" అను సమాధానమును వ్రాసిరి.

అదిగాక "ఖండనమండనములు" "ముండనముండనములు" చాల బయలుదేరినవి.

ఈవాదగ్రంథముల పరమార్థమేమన; ప్రజలలోఁగల సాహిత్యాసక్తి పెంపొంది సుశబ్దాపశబ్ద విచక్షణ జిజ్ఞాసువుల కలవడెను. ప్రయోగమూలమైన శబ్దములకును, శిష్టులు వ్యవహరించిన పదములకును అంగీకరించి తి. వేం. కవులు తమగ్రంథములబో ప్రయోగించిరి. వచనరచనలో శిష్టవ్యావహారికము చెళ్ళపిళ్ళవారి కంగీకార్యమే.

పిఠాపురముమహారాజావారును, రామకృష్ణకవులును, ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రిగారును, మొదలైనవారు లాక్షణికకవుల రచనలలో నంగీకరించినవఅకే ప్రయోగించిరి. సాంఘికముగా సంస్కారము నంగీకరించిన పిరేశలింగము పంతులుగారుకూడ భాషాసాహిత్యములయెడ నంగీకరింపలేదు.సులభశైలి గ్రాంథికమే వీరికంగీకార్యము.

రామకృష్ణకవులానాఁటివారిలోఁ గొంత భావములలో విప్లవాత్మకదృష్టిగలవారు. 'కౌరవగౌరవము' అను ఖండకావ్యములో:

"అకట, గోరంతలైనఁ గొండంతలగుచు
పాండవులయొప్పిదమ్ములు పరిణతికెక్కె
నట్లె గోరంతలైన కొండంతలగుచు
కౌరవులతప్పిదమ్ములు గణనకెక్కె."

అనియు,

పాండవపక్షపాతమునఁ బన్నిన భారతకావ్యకల్పనా
కాండము నమ్మి యెల్లరును కౌరవపక్షమునం దసూయగై
కొండురుగాని పాండవులగోటును, కౌరవపాళిలోటు నొ
క్కండును దుల్యబుద్ధి నిది యౌ నిది కాదని యెంచఁడేమొకో

అని యీరీతిగ నవ్యరీతి నవలంబించి కావ్యరచన నడిపినారు. తిరుపతి వేంకటేశ్వరులమీఁదను, తి. వేం. లమీఁదను నభేదాధ్యవసాయముగ

తిరుపతి వేంకటేశ్వరార్థశతకమును వ్రాసిరి. ఇది వ్యాజనిందాలంకారమునకు లక్ష్యమైయున్నను ఆనాటిప్రజలలో సలజడి గలిగించెను. ఇట్లే "ఆంధ్రకవుల యపరాధములు" అను ఖండకావ్యము కాళయుక్తి సంవత్సరాదిసంచికలో బ్రకటించిరి. మహాకవులనుగూర్చి పుక్కిటిపురాణములను సేకరించి యవియన్నియు వారియపరాధములని పల్కిరి.

ఆంధ్రలోకోపకారము నాచరింప
భారతమ్మును నన్నయభట్టు తెలుఁగు
చేయుచున్నాఁడు; సరియె బడాయిగాక
తొలుత సంస్కృతశ్లోక మెందులకుఁ జెప్పఁడీ.

ఇత్యాదిగఁ గొన్ని 'లోపములను' జూపిరి. దీనితో గాలికబుర్లగు శేగినది. ఆంధ్రకవులను బూసికొనివచ్చి వారిని ప్రాజసేయుచుఁ బెక్కు రచనము లారంభమైనవి. అంతట 'దేశభక్తి' యను వ్యాఖ్యానమును బ్రారంభించి ఆంధ్రకవుల యపరాధములను వ్రాయుటలో తమయుద్దేశ్యము వారినిగూర్చిన భక్తిని రేకెత్తించుటకే యనియు,

నన్నయాదులపట్ల మాకన్నఁగూర్మి
కలుగువారలు లేరు జగమ్మునందు,

అనియు,

పూర్వకవిరూపధేయముల్ పోల్చినార
మాకతాయలమై మేల మాడలేదు.

అనియుఁ బ్రకటించినారు.

ఇదిగాక, సారస్వతోపాసకులై పెక్కుగ్రంథములను వ్రాసిరి. మదాలస, ఉత్తరరామచరిత్ర, నాటకములు, విశ్వగుణాదర్శమునకు ఆంధ్రము, ఇందిరాదేవి యను నవల. దమయంతి యనుపేరున శృంగార నైషధమునకు వచనము వ్రాసిరి.

విశ్వగుణాదర్శమున కాంధ్రీకరణము మిగులఁ గష్టసాధ్యమైనది. శ్లేషయమకచక్రవర్తి యని బిరుదమునందిన వేంకటాధ్వరి సంస్కృతమున రచించిన యీగ్రంథము తెనుఁగున శ్లేషయమకములు వచ్చునట్లు రచించుట సామాన్యమైన పనిగాదు. సంస్కృతమున శబ్దముల యనేకార్థత్వము తెలుఁగున ననువదించుటలో క్లేశము కలదు. ఉదాహరణమునకు చూడుఁడు :

విధి శబ్దమునకును, విధు శబ్దమునకును (సతి) సప్తమ్యేకవచనము 'విధౌ' అని వేంకటాధ్వరి ప్రయోగించినాడు.

కుటిలవిధి (దురదృష్టము) నెత్తిమీనుండఁగా ధనమేది? కుటిల విధుఁడు (చంద్రరేఖ) శిరమున నుండగా శ్రీ (లక్ష్మి) యుండదు.

దీని కాంధ్రమున:

"కుటిల విధౌ మూర్ధని సంస్థితే కుతశ్శ్రీ యనఁగన్.

అని సంస్కృతమునే యాశ్రయించి శ్లేష నిలిపినారు. ఇట్టివి పెక్కులున్నవి.

తిరుపతి వేంకటకవులు వేశ్యనుగూర్చి 'పాణిగృహీత' యను గ్రంథమును రచించి రసికుల కానందముగూర్చినారు సిద్ధాంతకౌముది ననుసరించి :

"పాణిగృహీతీ భార్యాయాం పాణిగృహీతాఽన్యా" కావున సాధ్వియైన మధ్యతరగతి కుటుంబినిని వస్తువుగ గ్రహించి వేంకట రామకృష్ణ కవులు, "పాణిగృహీతి"యను రసవత్తరమైన ఖండకావ్యమును వ్రాసిరి.

ఇవిగాక, ప్రశంసాపద్యములు, చాటువులు పెక్కులున్నవి.

రామకృష్ణులకు స్వేచ్ఛాందునిరచన లన్న నత్యాదరము. పీఠికాపురమునకు రాకముందే ఔచిత్యవిచారచర్చ సువృత్తతిలకములను వెలిఁగించినారు. ఇం దవలంబించిన విధానము. నవ్యము. లక్షణవాక్య

మాలకును శ్లోకములకును తెలుఁగుపద్యములును, వచనములును రచించి (లక్ష్యములకు క్షేమేంద్రుఁడు సుప్రసిద్ధ సంస్కృత కావ్యముల నవలంబించియుండఁగ, వీరు) లక్ష్యములను సుప్రసిద్ధ పూర్వాంధ్ర ప్రబంధములనుండి సేకరించిరి.

అవధానముల విషయములోను ఆశుకవిత్వ చిత్రకవిత్వాదులలోను రామకృష్ణులు త్రొకట-నిపుణత లేదు. రాజానురంజనములో

(అర్జీ) చేయుటకొకట-గంటు, అదిచెప్పిన చొప్పున వ్రాసుకుండ గా,
వ్రాయుట కొకట-గంటు, సరివారలలో నవధానపాండితీ
స్థేయత కొకట-గంటు, యరుదెంచినపెద్దల గారవింపనొ
క్కో యరగంటయో వ్యవధి యుండనలా ధరణీపురందరా!

అని చెప్పియున్నారు, దాని నందుకొని రాజావారు,

గంటలో నూఱుపద్యములు చెప్పవలసి యనాజ్ఞాపింప, 1గంట5ని.లలో 100 పద్యములు చెప్పిరి. మఱియొకమాఱు 56 ని.లలో నూఱు పద్యములను జెప్పిరి. ఎనమండ్రు లేకరులు వ్రాయుటకుఁ గూర్చుండి పూర్తిగ వ్రాయలేకపోయిరి.

'శతప్రాసము' అనుపేర భారతకథ నాసన్నుగ రేఫప్రాసముతోఁ జెప్పిరి

సిరి మనరావుసూర్యనృపశేఖరునింట వసించుఁగాతసుస్థిరముగ;

అని ప్రారంభించి భారతకథయంతయు నూరుపాదములలోఁ జెప్పిరి. శిబికాబంధాదులు రచించిరి.

కాళయుక్తి సంవత్సర మార్గశిరశుద్ధ౩ నాఁడు రామకృష్ణశాస్త్రి గారు తమ 29వ యేట నకాలమరణమునకు గుఱియైరి. ఇది రసజ్ఞలోకమునకును మహారాజావారికిని సహకవియగు వేంకటరామశాస్త్రి గారికిని దీరనిలోప మాయెను.

ఆకాలపుఁ గవులలో రామకృష్ణశాస్త్రిగారికిఁదామేకవులమను సహమిక గలదని ప్రతీతి. అట్టి యభిప్రాయము వారు రచించి ప్రచు రించిన యీక్రింది పద్యములవంటివాని వలనఁ గలిగియుండును.

తికటన్న తనకుఁ బ్రియుఁడను
నొకటఁడుపోతన్న యన్న నొకటఁడు రాగం
బెకటఁడు వహించు పుచ్చిన
వకట యిడఁగలేము వారె వచ్చి యడిగినన్.

అకట శ్రీనాథకవి యిప్పుడైనయెడల
నతనిపాదములొత్తమే యనుకొనుదుము
లేరుబో నాఁడు మనయంత లేసివారు
వేయరే వానిచేతుల వెదురుగొడియ.

కలరు నేఁడును తాదృశుల్ కవులు పూర్వ
కవులకె హిరణ్యశృంగముల్ మొలిచి యిపటి
వేదులకు మొలవక పోవలేదు; లోకు
లెప్పటిప్రశస్తి నప్పు డూహింపలేరు.

౪

పిఠాపురం మహారాజావారు ఆంధ్రాంగ్లములను కూలంకష ముగ రసికులైన గురువులవలన నభ్యసించినవారు. నిశితమైన మేధ. నిశ్చితమైన ధారణాశక్తి ఎంత నూఱుమూల పద్యమైననుసరే, ఒక సారి విన్నచో నది మరల విన్నప్పుడు తమ కది శ్రుతపూర్వమనిచెప్పఁ గలిగెడివారు. కొన్నివేల పుస్తకములను సేకరించి తమకోటలో పెద్ద గ్రంథాలయము నేర్పాటుచేసికొనిరి.

మద్రాసు విశ్వవిద్యాలయమువారి ప్రాచ్యపరిశోధనా విభాగ మువారు ప్రకటించుచుండిన ప్రాచీనాంధ్రగ్రంథముల ముద్రణము నకు ధనసహాయము చేయుచుండిరి. నన్నిచోడుని కుమారసంభవము

ముద్రణము విషయములో వావిళ్ళవారిని బ్రోత్సహించిరి. అముద్రిత ములైన ఉత్తమగ్రంథములను ముద్రించుటలోఁ దాము స్వయముగఁ బూనుకొని చాలగ్రంథములను, విమర్శాదర్శక సమేతముగా వీరరాజు పంతులుగారి విద్వజ్జనమనోరంజని ముద్రాలయములో ముద్రింపించిరి. ఆంధ్రసూత్రభాష్యము నాలుగు సంపుటములును, విష్ణుమాయానాటకము, రాధామాధవము, ధర్మఖండము, యతిరాజవిజయము, మొదలగు నెన్నియో రసవత్తరగ్రంథములను ప్రకటించిరి. వీరి యభిమాన గ్రంథము కళాపూర్ణోదయము. అది యొంటిమారి ముద్రించినపుడును ధనసాహాయ్యమునఁ బ్రోత్సహించిరి. వావిళ్ళ వారు, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు మొదలగు నెల్లరును క్రొత్తపాఠములను వ్యాఖ్యానములును, జేర్చి ముద్రించుటలో మహారాజావారు తోడ్పడినారు.

గ్రాంథికాంధ్రము విషయములో మహారాజావారి యభినివేశము వర్ణింపఁదగినది. సాహిత్యపరిషత్తునకు శాశ్వతాధ్యక్షత వహించి జయంతి రామయ్యపంతులుగారు మొదలగువారి సహాయమున నిఘంటునిర్మాణము సాగింపఁజేసి,పండితుల జీతములు, యింప్లీయర్లైలు ఇతర ములైన ఖర్చులు సర్వమును దామే భరించి నిఘంటువును ముద్రింపించి యమ్ముకొనుటకు సాహిత్యపరిషత్తున కిచ్చివేయుచుండిరి. ఇందలి వ్యయమంతయు తమకోటలోని 'దినవెచ్చము'గాఁ బరిగణించుచు, దీనిపైఁ దమ మంత్రిసామంతాది ప్రకృతులకు అజమాయిషీ లేకుండఁ జూచిరి. ఒకవంక జయంతి రామయ్యపంతులుగారును, రెండవప్రక్క గిడుగు రామమూర్తిపంతులుగారును రామరావణులవలె నిలిచి గ్రాంథికవ్యావహారిక వాదములను సంకులముగఁ సాగించుచుండిరి. సుబ్బారాయకవి యంటివారు.

గిడుగురామమూర్తి నుడుగునిలువకపోయె
నోగి జయంతి రామయోక్తి నిలిచె.

నన్నారు.

చింతా దీక్షితులుగారు గ్రాంథికవాదము కృతక 'సరస్వతీ పూజ' యనియు, వ్యంగ్యముగా జయంతి రామయ్యపంతులు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవంటివారు పూజరులనియు ఆంధ్రసరస్వతీరూపము కృతకాలంకారములతో మఱుగుపఱచుచున్నారనియు నన్నారు.

మహారాజావారు చిన్నయసూరికిఁ బూర్వులను మాత్రమే లక్ష్యముల కర్తలనుగా గ్రహించువాదము నంగీకరించిరి. ఈ వాదమును గిడుగు సీతాపతిగారు కూడ నంగీకరించి మహారాజావారి యానతిననుసరించి సర్వజ్ఞసింగభూపాలుని * కువలయావళీనాటికను గ్రాంథికాంధ్రమున ననువదించి ముద్రింపించినారు. శ్రీ రామమూర్తి పంతులుగారి కుమారు నాదరించుటచే మహారాజావారు వ్యావహారిక వాదమువంక మ్రొగ్గుచున్నారని వ్యావహారికవాదులు సంతసించిరి. మహారాజావారు రామమూర్తిపంతులువారి కొమారునిచే గ్రాంథికాంధ్రమును వ్రాయించినారని గ్రాంథికవాదులు తలఁచిరి. ఇందలి నిర్ణయమునకు సహృదయలోకమే ప్రమాణము.

రామకృష్ణశాస్త్రిగారు స్వర్గస్థులైన వెనుక కొంతకాలము వేంకటరామశాస్త్రిగా రితికర్తవ్యతాశూన్యులై పిడుగుపాటునుబోలిన యీ వియోగాఘాతమునుండి తేఱుకొనలేకపోయిరి. తరువాత క్రమముగా భారతీ పత్రికకు పద్యములును, వ్యాసములును వ్రాయుచు, 'శ్రీదత్త' యను పేరున నొక ద్విపదకావ్యమును రచించిరి.

అవధారు, ధర్మరక్షాసమూఢయత్న
నవధారుణీనాథ నాయకరత్న.

అని యీరీతిగ యువరాజావారికి కృతియిచ్చు నుద్దేశ్యముతో అయిదాశ్వాసముల ద్విపదకావ్యమును వ్రాసిరి. పాఠ్యపన్యాసములవలె

* ఈ నాటిక నంతకుముందే మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారిచే నాంధ్రీకరింపఁజేసిరి. అయినను దనివిసనక మరల సీతాపతిగారిచే వ్రాయించిరి.

"పరశురామకవిగారి పద్యోపన్యాసము" లను ప్రారంభించి పద్యోపన్యాసమును, సభ్యుల 'రిమార్కు'లను నడుపుచు ఆ భూవిషయములను గూర్చి చిత్రమైన యుపన్యాసములను వ్రాసి భారతిపత్రికలోఁ బ్రకటించిరి.

గుణాఢ్యవిరచితమైన కథాసరిత్సాగరమును ఆంధ్రీకరించినచో శాశ్వతముగ నిల్చునొక గ్రంథమును రచియించినవార మగుదు మను తలఁపున ఆంధ్రకథాసరిత్సాగరము నుపక్రమించి ఆఱువలంబకములను తెనిఁగించిరి. ఇది యుభయకర్తృకముగఁ బ్రకటించిరి. అంతకాలము జంటకవులై, అవినాభావసంబంధముగ నున్న వీరికి ప్రత్యేకముగ తామే రచించినను తామొక్కరే రచించిరని చెప్పికొనుటకు వారి మనం బూరీకరింపలేదు. అవతారికలో, కథాసరిత్సాగరమును తెనిఁగింపఁబూనుట, అందునను పూర్వకవిత్వపద్ధతుల ననుసరింపఁబూనుట, ఆధునికకాలమునకుఁ దగునా అను సందియముతో :

బంధములెల్లవీడి బహుభావసమృద్ధులఁగూడి మత్తపు
ష్పంధయగీతినా విరియఁబాఱుచునున్నది తెల్గుకైత నా
గ్రంథము గాంచుకాల మిదిగా దటులైనను నేను బూర్వని
ర్బంధకవిత్వపద్ధతినె వ్రాయఁగఁబూనితి నమ్ము మంబరో.

ఇందలి యవతారికలో రామకృష్ణకవినిగూర్చి యీరీతిగ తమ నిర్వేదమును వెలువరించిరి.

గీ॥ అనుగుమేనత్తకొమరుఁడై యాశుకవిత
నాకుఁ జేదోడువాదోడునై వెలఁగిన
కృతిసమర్థుండు మారామకృష్ణశాస్త్రి
యున్న నీసాయ మర్థింతునోటు చేవి

అనియు :

ఉ॥ చనిమొఁగ నచ్చుసేయు పురజన్మవిలాసము మాకుఁ జూపవ
చ్చినగతి వచ్చి సత్ప్రతిక పే కవికోటికి వన్నెదెచ్చి; యింకనా
పోనరుచు నిక్కృతిక్రియకుఁ బోడిమి నాయకమౌనర్పుఁ దల్లికో.

అనియు వాగ్దేవత నుద్దేశించి వ్రాసిరి.

వేంకటరామశాస్త్రిగారు మహారాజావారికి అత్యంతాప్తులలో నొకరగుటచే వారి కుటుంబములో సదరులకు విశ్వాసపాత్రులుగ నుండిరి. అందువలన వారికి క్రమముగా సాహిత్యకవిత్వ వ్యాసంగములకు తెఱపి లేనంతగా మహారాజావారి అంతరంగిక వ్యవహారములలో నిమగ్నులు కావలసివచ్చెను. అందువలనను సహజముగ నతివిస్తారమై పదునెనిమిది లంబకముల గ్రంథము గావునను కథాసరిత్సాగరము పూర్తి కాలేదు.

విధివశమున 1939 సంవత్సరము డిశంబరు నెలలో వేంకటరామశాస్త్రిగారు పరమపదించిరి.

వేంకటరామకృష్ణ కవులతోఁ బూర్వపద్ధతులలో గవిత్వము చెప్పుచు, నవధానములు చేయుచు, గ్రాంథికాంధ్రముపై విశ్వాసము గలవారియుగ మంతరించినదని చెప్పవచ్చును. రాజాదరమున విలసిల్లెడు కవులును, ప్రభువులకొఱకుఁ జెప్పెడి కవిత్వములును, కృత్యాద్యవస్థలును, షష్ఠ్యంతములును, కృతికర్త, కృతిభర్త వంశాద్యభివర్ణనములును దుదముట్టినవి. నవ్యయుగ మారంభించినది.

౫

మహారాజావారి ప్రయివేటుశక్రిటరీ పులుగుర్త సుబ్బారావుగారు సెలవుపెట్టుటచే రెండుమూఁడు మాసములు నేను వారిసన్నిధానమునఁ బనిచేయవలసివచ్చినది. ఆసందర్భములో నేను మహారాజావారి సాన్నిధ్యవర్తినై వారి సాహిత్యాసక్తి సమర్థతలను మున్ను విన్నదానికన్న నెన్నిమడుంగులో మిన్నయని ప్రత్యక్షముగఁ జూడఁగల్గితిని.

ఆంగ్లమున వారి పాండిత్యము నిశితమైనది. King's English లో నంగీకరింపని రూపప్రయోగములను వారు చేయరు. పట్టభద్రులుకూడ వారియెదుట మాట్లాడునప్పుడు జాగ్రత్తగనుండవలయును. వారొక్క నాడైనను Infinitive ను (Split ) త్రెంచివేయరు. Preposition తో వాక్య మంతముచేయరు. ఏశబ్దమైనను తప్పుగా నుచ్చరింపరు.

ఒకప్పుడు నేను వంగదేశపు కఱవు (1942) ను గూర్చిన వార్తలను చదువుచు Draught అను పదమును 'డ్రాట్' అని చదువంగా వెంటనే 'డ్రాఫ్ట్' అనిరి. అది గ్రహించుకొని డ్రాఫ్ట్ అని దిద్దుకొని చదివి తరువాత Daniel Jones లో చూచితిని. అట్లే (Wool) వుల్ పొట్టిగా పలుకవలయుననియు వారివలననే నేర్చుకొన్నాను.

మఱియొకప్పుడు బెంగుళూరులో మహారాజావారికి హోటలులో బసయేర్పాటు చేయవలసివచ్చెను. Express Replypaid wire పంపుచు, ''Wire if accommodation available'' అని వ్రాసి వారికిఁ జూపితిని. శ్రీవారు అందులోని if ను Whether గా మార్చుమనియు, if అన్నను, Whether అన్నను వాక్యరచనలో నొకటియే యైనను, హోటలులోని గుమాస్తా if available wire, if not available need not అని యర్థము చేసికొనఁగలఁడనియుఁ జెప్పిరి. ఇది చాల చిన్నవిషయమే యైనను వారి సునిశితదృష్టి యిందులోఁ గానఁబడును.

సంస్కృతశబ్దములనుగూర్చి కూడ, చాల సునిశితముగ విమర్శించెడువారు, 'వినయ వినమితోత్తమాంగుడు' అను సమాసములో 'వినయ' పునరుక్తి, వినమిత చాలు నని ఒక పండితుఁడు వారితో ననెనఁట. ఆసంగతి నాతో ప్రసంగించుచు, చూడు, ఇది పునరుక్తి కాదు వినయమువలన వంచిన శిరముకలవాఁడు అనికదా. తలవంపు సిగ్గువలన అవమానమువలన, నిషిద్ధదృశ్యమునుండి పరిహరించుటవలన, దేనివ

అనమైన గావచ్చును 'వినయము కలవా'ని తెలియుట కిట్లు వాడినారు" అన్నారు.

'మేలు' అన్న పదమునకు 'ప్రేమ' యని యర్థమున్నదని వారు మల్లయ్యశాస్త్రిగారివలన విన్నారఁట. పారిజాతాపహరణములోని యామినికుఁడో నాఁదిరిగెన్ గొలంకుఁగరముకున్ మే లెంతహీనంబొకో. అన్నచోట ఆ భృంగరాజు ప్రేమపాశములఁ జిక్కి ఆపద్మముచుట్టును తెల్లవాఱువఱకుఁ దలారివానివలెఁ (నీచవృత్తి) దిరిగెను. ప్రేమ (మేలు) ఎంతహీనమైన పనినైనను జేయించునుగదా! అనిచెప్పుచు :

అలకాపరిఁ వేత్రిల మేలు కాఁడు అన్న ప్రయోగములో ప్రేమించు వాఁడని యర్థము అని చెప్పినారు.

నేనెఱిఁగినంతవఱకు మహారాజావారికిఁ దీఱని కోరికలు రెండున్నవి. వారి కడపటిదినములలోఁ గూడ వారి యారోగ్యమునుగూర్చి దర్శనముకొఱకు వెళ్ళినవారిని 'నిఘంటువు పూర్తియైనదా' యని ప్రశ్నించెడివారు. "ఇది నేను బ్రతికియుండఁగఁ బూర్తియైన బాగుండును" అనెడివారు. మూఁడులక్షల రూప్యములకుఁ బైగ వెచ్చించిరి; గాని నిఘంటువు పూర్తియైన దన్నమాట యాయన వినలేదు.

రెండవది, వారికి 'కవిజీవితములు' తాము స్వయముగ వ్రాయవలెనని యుండెడిది. "అందులకు వలయు ప్రణాళికయంతయు సిద్ధము చేసికొన్నా"నని నాతోఁ జెప్పినారు. వారి యభిమానకవులనుగూర్చి సారస్వతచరిత్రవంటిది యొకటి వ్రాయవలయునని యనుచుండెడివారు. "ప్రాచీనాంధ్ర కవీంద్రాభివందన" మను పేర వేంకటరామకృష్ణకవులు వ్రాసిన పద్యములను సేకరించి, ఆయాకవుల చరిత్రారంభములలో నాకవిని గూర్చిన పద్యమును వ్రాసి తరువాత వచనముగా కవిచరిత్ర వ్రాయవలయునని వారి సంకల్పము. కవిత్రయమును

గూర్చియు, సోమన, సూరన, తెనాలి రామకృష్ణకవి మొదలగువారిని గూర్చియు పద్యములు రామకృష్ణకవులవి గలవు. నేఁటికవులలో గొందఱినిగూర్చి వారే పద్యములు వ్రాయించినారు. వారికొఱకు రచియించిన పద్యములగుట వలన నేను వాని నింతవఱకెక్కడను గూడ ప్రచురింపలేదు. ఇప్పుడు పరలోకమున నున్నవారి యనుజ్ఞ యున్నదని యూహించుకొని వారియాత్మశాంతినిగోరి యాపద్యముల నీసంచికలో ప్రకటించుచున్నాను.

—

రాజకీయ, ఆర్థిక కారణములవలనను, ప్రపంచవ్యాప్తముగ జరుగుచున్న సాంఘికవిప్లవమువలనను జమీందారుల వ్యవస్థ యంతరించినది. ఉదారులగు భూదాతలయుగము చరిత్రలో నణఁగుపడినది. స్వయముగఁ బండితులై, రసజ్ఞులై, విద్యావినోదగోష్ఠులు నెఱపిన విజయనగరానందగజపతి, పోలవరప్రభువు కొచ్చెర్లకోట వేంకటకృష్ణ రాయభూపతి మొదలగువారింతకుముందే యస్తమించిరి.

ఆకోవకుఁ జెందిన, శ్రీ పిఠాపురము మహారాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారాయ బహద్దరువారు శోభకృద్వత్సరమున నస్తమించిరి.

వారియాత్మకు శాంతి కలుగుఁగాత !

విద్వాన్, వేదుల శ్రీరామచంద్రకీర్తి, ఎం. ఏ. (ఆనర్సు), బి. ఇడి.



# క వి ప్ర శం స

## ౧. నన్నెచోడుఁడు.

పోలఁగ కాళిదాసకవిపుంగవు వాక్కులఁ గాలముం గ్రుజా
శైలలి నిల్చు కావ్యసుధయంతయు శంకరపార్వతీమిథః
కేళులలోని నర్మకలికించితమై వెలయింపనేర్చు నా
చోళనృపాలు నన్నెకవిసూక్తుల కంజలి సంఘటించెదన్.

## ౨. కంకంటి పాపరాజు.

మానవజన్మమున్ గవనమార్గము ధన్యతనొంద జానకీ
జాని కథాప్రబంధము లసంఖ్యములున్నవటంచు వీడకే
వ్రాసితి పాపరాజకవిపుంగవ ! ఉత్తరరామగాథలో
తేనెలుఁజిమ్మ తెల్గునుడి తీరిచిదిద్దిన నిన్ను మ్రొక్కెదన్.

## ౩. చేమకూర వేంకటపతి.

అదటఁ బాపప్రాపజపరాలివిరాళియుఁ బాండ్యకన్యకా
మోదము దేవకీతనయమోహపువృత్తము లెన్నుచో వచః
శ్రీ దయివార శ్లేష లమరించి చమత్కృతిమత్కవిత్వమున్
ప్రోదియొనర్ప నేర్చితివి ప్రోడవు వేంకటరాజసత్కవీ.

## ౪. కదిరీపతి నాయకుఁడు.

కమ్మనేతులు చల్లకడవలోపల దాఁచి
    కొని మిండనికొసంగు గొల్లభామ
పసపుఁబూతలను గుబ్బలసౌరు చెట్టింపఁ
    గైసేయు జగజంత కాపుఁబడఁతి
నెఱికుఱుల్ చెదరి క్రొవ్విరిసరుల్ వసివాడ
    రేలెల్ల క్రీడించు రెడ్డిరాణి
వీధి నేఁగెడు ప్రౌఢవిటునకై యేలపా
    టలుపాడు భూదేవు కలువకంటి.

సుద్దులఁ గిరాటభామిని ప్రౌఢపుచ్చి
చదువరులగుండెదిట్టముల్ విఱ్రిచినావు
కదిరిపతి నీచమత్కారి కావ్యమునను
నేఁటికోసఁగరు ? భక్తితో నేటికొప్పు.

౫. ముద్దుపళని.

వెన్నెలరేలలో నిశను వెన్నుఁడు మంతెనమాడి సేసినన్
కొన్నెలతాలపాన్పునకుఁ గూర్చిన రీతియు మెన్ని రాధికా
సన్నుతగాత్రికిన్ బరవసంబొనరించిన నీకవిత్వపుం
దెన్నులుచూడ ముద్దుపళనీ మగవారిని మించిపోయెకేన్.

౬. పాలకుఱికి సోమనాథుడు

ద్విపద॥ నర్మపూరిత గహనాచార విరతిఁ
గర్మమార్గమ్ము దుర్గమమైన నాఁడు
జాత్యాదిభేదసంజనితమై పెద్ద
వాత్య సంఘకుజమ్ముఁ బడఁగొట్టునాఁడు
ఒప్పవు ద్విపదకావ్యోక్తు లటంచు
జెప్పి విప్రులు నిరసించెడునాఁడు
పద్యమయంబులై పరగు కబ్బములె
హృద్యంబు లంచు వాదించెడునాఁడు
బసవపురాణ ప్రబంధంబుఁ దొట్టి
ప్రసవకోమలపదబంధము ల్పెక్కు
వీరశైవము లోకవిఖ్యాతినంద
గా రచియించిన కవి పాలకుఱికి
సోమనాథుని దివ్యసూక్తుల నెన్న
గామితార్థములందఁ గల్గు టబ్బురమె.

౭. చింతలపూడి యెల్లన.

హృదయముజాలువారి ప్రవ
హించుగతిన్ విలసిల్లు శబ్దసం
పద, పదనైన భావములు
భక్తిరసంబున మోహనవృత్తముల్
మెదిపిన కావ్యవస్తువులు
మేళనముం బొనరించు నేర్పులో
నిదియొక యెల్లనాఁ బరగు
యెల్లన నీకవితావిశేషముల్.

౮. పానుగంటి లక్ష్మీనరసింహారావు.

ప్రాసక నాటకప్రకర
మున్ రచియించి పిఠాపురీ మహీ
జానికి నాంధ్రభోజునకు
సమ్మదముం బొనరించి నవ్యవి
జ్ఞానము హాస్యముం గలుపఁ
జాలుట కొక్కఁడఁ సాక్షివైన ల
క్ష్మీనరసింహరాయకవి
శేఖర; నిన్ గొనియాడఁజెల్లదే.

౯. ఓలేటి వేంకటరామశాస్త్రి.

శ్రీపీఠిపుటభేదనప్రభుని సు
శ్రీమించునాస్థానిలో
దీపించెన్ భవదీయ రమ్యకవితా
ధిష్ఠాన వాగ్గుంఫముల్

నీపాండిత్యము నన్నికెక్కినది యు
న్నించెన్ గురుశ్రేష్ఠులౌ
ద్యాపాలాగ్రణి రామసత్కవి గణిం
తు న్నిన్ను భక్త్యున్నతిన్.

౧౦. ద్వివేది రామకృష్ణశాస్త్రి.

అవధానంబున బాలసూర్యునకు న
ర్ఘ్యం బిచ్చి కావ్యక్రియా
వ్యవసాయంబున హృద్యపద్యఫలమా
ల్పండించి లోకంబునీ
వ్యవహారంబు నుతింప కృష్ణకవిన
ర్యా! కీర్తిశేషుండవై
యవతారం బనిపించినావు నతులీ
యం జెల్లదే నీకిలన్.

విద్వాన్ వేదుల శ్రీరామచంద్రమూర్తి, ఎం. ఏ, (ఆనర్సు), బి. ఇడి

# పిఠాపుర ప్రభు స్మృతి

సమ్మూర్ఛయన్ బంధుగణం వ్యథాకులం
సంతాపయన్ శీతలభారతావనిమ్
కుర్వ న్ననాథామివ రాజమందిరం
అస్తంగతో హంత ! పిఠాపురేశ్వరః.
శ్రుత్వా భవన్మరణ మద్య హహా దురంత
సంతాప మాప హృదయం మమ దుర్భరంసత్
కోప్యావయో రవిదితోస్తు ఋణానుబంధః
నోచే న్మదీయహృదయే కుత ఏష తాపః ?

సీ॥ అస్తమించెనుగదా అఖిలలోకాలోక
భాస్కరుం డగు రావుభాస్కరుండు
అంతరించెనుగదా అమితదానగుణైక
పావనుం డగులోకభావనుండు
నిష్క్రమించెనుగదా నిఖిలరాజాధిరా
ణ్ణికర సంతతకీర్తనీయయశుఁడు
నిర్గమించెనుగదా నిరతానవద్యవి
ద్యాకళాగోష్ఠి ప్రహాసదృశుఁడు
బ్రతికినన్నాళ్ళు లేమహాప్రభుఁడు గూడ

నిలుపలేనన్ని ధర్మసంస్థలను నిలిపి
ఆంధ్రభోజాఖ్య యన్వర్థ మగువిధమున
కడపె నీతఁడు బ్రతుకు బంగారముగను.
గ్రాంథికాంధ్రికి నీనిఘంటువు తీర్చిన
కుంకుమతిలకమై కుదురుకొనియె

సీ॥ భవ్యాంధ్రయువత నీపరిషత్తు రచనాల
పదకమై సొంపుసంపదలు నింపె
తెనుఁగుతల్లికి నీవు దిద్దినకృతులు స
ర్వాంగసుందర భూషణాళు లయ్యె
పావనాంధ్రికి నీదుపండితుల్ నన్నయ
తిక్కనలై మహాదీప్తి గనిరి

తెలుఁగులచరిత్రలో నీకు దీటువచ్చు
ఱేఁడె యీనాఁడు నేనాఁడు లేఁడు లేఁడు
నిజము; నీధర్మములకు వన్నెలను గూర్చి
నిలిపి పోషించుకొనుచె మా తెలుఁగుదనము.

చ॥ నిను నొకచక్రవర్తిగ మనీషిగ దాతగ దైవమూర్తిగా
కనదురుసద్దయామయునిగా కవిగాఁగ ననాథనాథుగా
వినయనయాత్ముగా ప్రథితవీరునిగా జగదేకబంధుగా
వినిచినగాథ లిద్ధరణి వేనకువేల్ గలవయ్య భూవరా !

కం॥ నీవంటిరాజవరాళికి
కావలసినయాత్మశాంతి గలిగింపని-చో
ఆవంత లెక్క సేయము
దేవుని దయ్యమును, వాసుదేవ నమస్తే !

రా జు లే ని కో ట.

సీ॥ చికిలికత్తుల లోపలికి పోఁతుటేఁగను
చొఱనీని పహారాలు చూడరావు
గులకరాల్ ముండ్లతుప్పల దోఁగి లోకోట
బాట లివ్వి యటంచుఁ బట్టుపడవు

శిల లెత్తినటు నిట్టనిలువులై కదిసి మూఁ
తలువడ్డతలుపులు తొలఁగఁబోవు
మంత్రిదివాను సామంతుల రాకపో
కలహటాటోపముల్ కనులఁబడవు.

కోన నడుగిడ గల్లుగల్లురని లక్ష్మి
తాండవం బాడు 'బ్యాంకు, లేదరిని లేవు
అశ్వములు గజమ్ములును పారాడు చోట్ల
గర్దభము లూరఁబందులు గంతు లిడెడు.
కోటముంగిటి శతఘ్నుల యందచందముల్
దులదులనై తుప్పుధూళిఁ గలసె
బూజులబుగ్గి మబ్బులచందమామ మై
భవనాలశోభ నిష్పచ్చరంబు
వందిమాగధు లయి వరుస ముప్వేళ న
గారాల మ్రోత ఆకాశసుమము
బంభరమ్ములతో గుబాళించు పూలతో
టలహొరంగులును మచ్చులకు లేవు.
పాములకు మూఁగిసల కాటపట్టు లగుచు
కోఁటగోడలు బురుజులుఁ గుతిలపడియె
మాయురే! మానికమ్మును మసి యొనర్చి
కాలమా! యెట్టియాటాడఁగలవు నీవు!
స్తంభంబె మిగిలి గ్రద్దలు వ్రాలి చెదవట్టి
కోటముందుపతాక కొమరు తఱిగె
పొగచూఱినటులు చొప్పులు దప్పి దీపధూ
పములు లేవయ్యె లోపలిహజార్లు

లోకోటగుమ్మమ్ములో వేదలలరావి
వేసారియో పుల్లవిఱిగిపోయె
కనుచూపుమేర నెక్కడ చూడు, కోటలో
కెక్కసకసవు క్రిక్కిఱిసి పొదలె.

గీ॥ పాకుడులుగట్టె నూతులు బావు లెల్ల
గజము లశ్వము లేకడఁ గానరావు
బంటురౌతుల యాబరాబరులు లేవు
పొగులుచుంటివటే పిఠాపురపుకోట ?

సీ॥ భవ్యాంధ్రసాహిత్యపరిషదధ్యక్షుల
భవనమా నీ కెట్టిపాటు గలిగె ?
ఘనసూర్యరాయ నిఘంటుపోషకుల ది
వాణమా నీ కెట్టిపాటు గలిగె ?
అయుతపండితకవీంద్రాధారభోజుని
యంతఃపురమ యెట్టియదటు గలిగె ?
సరసకళాలయస్థాపనపరు మహా
గారమా నీ కెట్టిగతి పొసంగె.

గీ॥ ఆంధ్రభోజుని సంఘసేవాభినిరతు
ధార్మికప్రభు లోకబాంధవుని నెలవ !
కాలకాలుని చిచ్చుటాకలికి, చిక్కి
మెఱుగ నైతివటే పిఠాపురపుకోట !

—విద్వాన్ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి

# వాడుక భాష

వీదుల నేగుపట్లు మనవీనుల కెక్కినపల్కు లన్నియున్
సాదు లటంచుఁ, బద్యకృతిసర్గ మనర్థమటంచు నొండెయ
త్యాదులనిల్పి కత్తిపనియంచుఁ గడున్ రగడల్ పొనర్చు దు
ర్వాదుల కొక్కదండ నిడి వారల నేరిమికై తపింపుమాః (1)

బడిఁగలపిల్లవాండ్రు పరభాషలపై గుఱినిల్పినట్లు క
న్నిడరు తెలుంగుపట్లు; నిదియే మనుడున్ మనబాసకై వెతల్
పడవలెనా యటందుర్; పలుభంగుల మ్రోసెడి తల్లిబాసలో
మడుఁగగుమాపు దేల్చుటనమాటలె? కుఱ్ఱతెలుంగ రింతయున్ (2)

వాడుకబల్కె "మీఁగలసివచ్చి" రటం చొకనాఁడు పల్కితిన్
బోరిడలు చెళ్ళప్పికవిభూపులు "గెల్వఁడు గల్చిరే" నటం
చాడిరి; నేర్చి నేర్చి యిటు లైతిమి మే; మిది దేశభాషలో
మూడునవస్థ; కానఁ గనుమూయక యుంట శుభమ్ము పొమ్మటన్ (3)

నాలుకకొక్కమైఁ దెలుఁగునాఁట నుడుల్ రవళించు జాలునున్
మూలము లేని యీ తెలుఁగుముక్కలు వాఙ్మయవీధి కెక్కనన్
మే లదియేమి? నద్దెసల మేరలు వెట్టిన కావ్యభాషపై
ఆలను రువ్వఁజెల్ల దిది రాచఱికం బగునోటు? తమ్ముఁడా! (4)

రాచఱికమ్మునందుఁ బ్రభురాజ్యము లేచు, నసిప్రభుత్వముల్
లేచును, గాఁపుపెత్తనము లేచును, బీదలపాలి యేల్బడుల్
లేచు, నొకొక్కవేళ; నిటులే కృతిమాపున మార్పువుట్టుచో
లో చెడిబోవుఁ గాని కడలుంబలె సాహితి పొంగనేర్చునే? (5)

నన్నయ తిక్కనాదికవినాథులు వాడుకబాసలోఁ గృతుల్
పన్నిన వాని నిప్డు పెఱబాసలకబ్బము లంట తప్పు; దా
తెన్నులు నేఁడు లేవు; పలుతీరుల మాఱెను; మాఱు నిల్లె రే
పు; న్నిజ మిచ్చటం బలుకుపూఁటలు చెక్కినశాసనచ్ఛటల్. (6)

నన్నయకైత లప్పటిజనమ్ము గ్రహించెన్, గవితిక్కనార్యుఁ డా
కొన్నది నాఁటి తెల్గుప్రజకున్ బలియైన కథ చదన్న నేఁడు నా
కున్నది యేమి చెప్పు? మదిఁ గొల్పు ఱరికించుట కల్పభాగ్యమా!
పున్నెము పండి పండి మనభూమి కవిత్రయమున్ గడించెరా! (7)

కావున బాసపట్లు నొకకట్టడ తప్పదు; పాఁతఁ బ్రాలినన్
దేవుఁడుగొట్టులా కథలఁ జెప్పెడిపత్రిక లెల్ల పోయినన్
బోవఁగవచ్చు; దీన మనపుట్టి మునుంగదు, కుఱ్ఱవాండ్రకున్
దీవరపాటు హెచ్చయినఁ జేటె మహాంతునిగాక సత్యమున్. (8)

ఇంతికి నందచందముల నింతకొఱంతయు లేదు, రత్నహా
గాంతులసొమ్ము లున్నవి, జగావలు చల్ గల, వైన నేమి ధీ
మంతులు మెచ్చుశీల మణుమాత్రము లే; దిఁక నాకె యేల? సి
ద్ధాంతము లుజ్జగించి కృతి యన్నది తా నృశంసగా వెలుంగుమా! (9)

వాడుకబాస కారకులు పట్టినవారలలోఁ దెలుంగు వా
ప్రోడతనమ్ము సొంపు నలపుల్ సయిరించినవిట్ల లెందఱో
చూడుము లెక్క; నక్క తనచూఱలు కందని ద్రాక్షపండ్లు నో
నాడినగాథ నీ వెఱుఁగవా? తగవా? యిటువంటి తమ్ముఁడా! (10)

పిలిచి బజారునన్ నిలువఁబెట్టి సవాలొనరించి "యేది మీ
తెలివి? యలంతిగద్యమును దిన్నని తెల్గున వ్రాయుఁ" డంచు జ
గ్గులు సెడఁ దెల్గునం గృతులు గూర్చువలంతుల సిగ్గుఁదీసినన్
వెలవెలఁబోని గుండెగల వీరులు నూటికి నల్గురుందురా? (11)

కట్టడలేని లేకినుడి గ్రామ్యము పెక్కురకర్థమై సెబా
చుట్టముగా రుచించు నని సుద్దులు వల్కెద రీప్రబుద్ధు; లీ
చట్టము నూఁది వేఁకిఁబడి జాతిని రోగికి నూనెగారెలం
బెట్టిన మెక్కఁడా? తినినపిమ్మట నక్కలగన్న కెక్కఁడా? (12)

వారికి నింగిలీసునుడి వచ్చిన వచ్చునుగాక ! దానఁ జే
టూరున తెల్గుపైఁ జనవు? కూడనిపెత్తనమేల? యాసకున్
మేరలు లేవె? బాస కిది మేలగునా? యగునేని "యాంగ్లపుం
దీరులు మార్పుఁ"డన్న వెనుదీసెద రేల బియేలు? తమ్ముఁడా! (13)

పెఱనుడి కింగిలీసునకుఁ బెట్టిన యూఱటచిన్న నైతముం
జెఱుపరు; తల్లి బాస నిటు చిందఱవందఱపాలు సేతఁకున్
వెఱపడ; రైనవారలకు విస్తరివేయుట, కానివారికిన్
గరగరమైన క్రొంబసిఁడికంచము వెట్టుట యెట్లు సైతురో? (14)

ఓపికయున్నవాఁడు తగునొజ్జలఁ గొల్చి సహస్రభాషలన్
నైపుణిఁ బొందనచ్చు నది నాగరకత్వమయౌను; గాని తా
రేపవలుం బ్రయాసము భరించి వరించి నిజోక్తిపైఁ గడుం
జూపిడి తద్విశిష్టతకుఁ జోటయినప్పుడ రాణకున్ దగున్. (15)

ఇంపున కింపు కంచుఁ జదివిచ్చె నటంచు మహాకవుల్ ప్రయో
గింపఁగవచ్చుఁ గక్కుఱితికిన్ బొరపాటునకున్ విధేయులై
కొంపలుగూల వింతనఁ దిగుల్పడ దాంధ్రి, "హాహా"కృతం చిసీ !
దుంపకు ముప్పుదెచ్చుపని దోసము పీసము లగ్గు లే దిటన్. (16)

తెనుఁగులెంక

తుమ్మల సీతారామమూర్తి.



# ప ం చ ర త్న ము లు

1

శ్రీ పీఠాపురసంస్థాన సూర్యారాయ మహాప్రభుః
ఆంధ్రసాహిత్య వృద్ధ్యర్థం చకారమహతీంకృషిం

2

కవిపండితసత్కార గ్రంథప్రచురణాదిభిః
"ఆంధ్రభోజ"ఇతిఖ్యాతిం ప్రాప్తవాన్ సాహితీప్రభుః

3

సూర్యచంద్రౌ ప్రకాశంతే లోకరక్షార్థమేవచ
సూర్యప్రభుః ధనందత్వా సాహితీలోకరక్షకః

4

కవిపండితసన్మాన సత్కార్యార్థం ముహుర్ముహుః
అనంతం స్వధనందత్వా భ్రాజతే త్యాగసంయుతః

5

లోకేఽస్మిన్ ఆంధ్రసాహిత్యం యావత్కాలం విరాజతే
తావత్ కాలం సూర్యప్రభుః రాజతేకీర్తిసంయుతః.

—జాస్తి వెంకటనరసయ్య.

# గ్రంథస్వీకారము - సమీక్ష

1 శబ్దోత్పత్తి శతకము (చతుర్థభాగము)
క్రౌను పుటలు 20— వెల 50 న.పై.

2 ఆంధ్రశాల రామాయణము
క్రౌను పుటలు 12— వెల 35 న.పై.

కర్త:- విద్వాన్ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు, రిటైర్డు తెలుగుపండితులు, పామఱ్ఱు, కృష్ణాజిల్లా.

ఇవి శ్రీ మల్లికార్జునరావుగారు పాఠశాలావిద్యార్థులయు నుపాధ్యాయులయు నుపయోగమునకుఁగాను వ్యాకరణ శాస్త్రాదిక విషయములఁగూర్చి కందపద్యరూపమునఁ గొంతకాలమునుండి రచించి ప్రకటించుచున్న శతకగణమునకుఁ జెందినవి. దీని 1.2,3 భాగము లిదివఱలో నీపత్రిక పూర్వసంచికలలో సమీక్ష గావింపఁబడినవి. వెనుకటిభాగములవలెనే యీచతుర్థభాగముగూడ నున్నతపాఠశాలా విద్యార్థులకు నుపాధ్యాయులకు మిగుల నుపకరింపఁగలదని చెప్పనవసరములేదు. హరిజనబంధువు శ్రీ తల్లాప్రగడ నారాయణమూర్తిగారి కివి యంకితము గావింపఁబడినవి. పలువురు పండితులొసంగిన యభిప్రాయములుగూడ నిందు ముద్రింపఁబడినవి. మచ్చునకు రెండు పద్యములు:

కం॥ గిరినింబుట్టినవానిని । గిరిజంబనిచెప్పినారు, కీర్తిధనాఢ్యుల్ ।
గిరికింబుట్టినకాంతను । గిరిజయనుచుఁబలుకుచుంద్రు,
కీర్తితసుకవుల్. (పద్యము 72)

కం॥ తొలిదగుటదెసలలోపల । తొలిదెసయనిచెప్పినారు
స్తుత్యమనీషుల్ ।
తొలిదగుపక్షంబునుమున్ । తొలిపక్షంబనినుడివిరి.
స్తుతమతులుబుధుల్. (ప॥100)

సంస్కృత రామాయణమునందలి ముఖ్యవిషయములు

శా. శ్రీమచ్చంద్రకలాకిరీటపదరాజీవద్వయీభావనా
సామర్థ్యోదితవాక్ప్రపంచఘటనాచాతుర్య విద్వజ్జన
స్తోమానందదశేముషీనిజవిలాసున్ వక్కలంకాన్వయున్
బ్రేమాత్యాస్పదు వీరభద్రుని ననుం బిల్పించి యుప్పొంగుచున్.

కం. తాతలతరముననుండియు
నీతనిజనకుండు మనకు హితుఁడు కవీంద్రుం
డీతనిచేతను గృతి వి
ఖ్యాతిగఁ గైకొందు ననుచు హర్షం బొదవన్. 24

గీ. సవినయమున సముచితాసనమునందు
నంతికంబునఁ గూర్చుండ నాజ్ఞ యొసఁగి
మందహాసాంచితముఖారవిందుఁ డగుచు
నతిదయాస్ఫూర్తి నిట్లని యాన తిచ్చె. 25

కం. శ్రీ వెలయ నుభయభాషల
నీవలెఁ గృతి సేయఁగలరె నేఁటికవీంద్రుల్
భూవిశ్రుతకవితావి
ర్భావయశస్సాంద్ర వీరభద్రకవీంద్రా. 26

సీ. మీతాత లోకవిఖ్యాతభాషాబల
శేషాహి యాచంద్రశేఖరుండు
మీతండ్రి చాటుగాథాతతచిత్రప్ర
బంధకల్పనశాలి భాస్కరుండు
మీతల్లితండ్రి పురాతనసత్కవి
నాథుల కెన విశ్వనాథసుకవి
మీమేనమామ సుత్రామవైభవుఁడు స
ద్యఃకృతిమతి వేంకటాద్రిసుకవి

గీ. చదువకే శ్రీసతీశప్రసాదగరిమ
బాల్యముననే కుమారసంభవముఁ దెనుఁగుఁ
జేసి కవులెంచఁ బ్రఖ్యాతిఁ జెంది తీవు
కలరె నీసము లాధునికులు కవీంద్ర. 27

ఉ. అత్యలఘుక్రియానిపుణుఁడై ధరణీతల మేలు విక్రమా
దిత్యసభాస్థలంబునఁ బ్రతిష్ఠితుఁడై ఘనధీసమగ్రతన్
సత్యవతీతనూభవునిజాడఁ బ్రసిద్ధికి నెక్కె నవ్యసా
హిత్యమునన్ సుబంధుసుకవీంద్రుఁడు ప్రస్తుతిఁ గన్న వాఁ డిలన్.

గీ. ఘనతరమనీష నమ్మహాకవివరుండు
ప్రతిపదశ్లేషగద్యప్రబంధ మత్యు
దారగతిఁ జెప్పె వాసవదత్త యనఁగ
నార్యు లాకథ కద్భుతా మనరె సభల. 29

మ. స్తవనీయం బగు తత్కథాక్రమము భాషాయోషిదంఘ్రిస్ఫుర
న్నవమంజీరనినాదమేదురనితాంతప్రౌఢవాగ్గుంభన
ద్భవదీయోక్తుల నాంధ్రకావ్యముగ నై దర్భిగారీతిఁ గూర్చ్య త
త్కవినవ్యోక్తులు నొప్పఁ జేయవలెఁ గైదండ గావింపఁగన్. 30

కం. పరమతి వాసవదత్తా
పరిణయ మనఁ జెప్పఁదగిన ప్రబంధము విద్వ
త్పరిగణ్యంబుగ మాకుం
దిరముగ నంకితముచేసి ధీరవరార్యా. 31

వ. అని సబహుమానంబుగా మణిమయభూషణకనకాంబరతాంబూలాదు లొసంగి నన్నాదరించె మత్కృతికన్యాలలామంబు నకు ననురూపం బగునాయకుం డెవ్వండొకో యని వితర్కించి యమ్మహామహునివంశక్రమం బిట్లభివర్ణించెద. 32

చ, హరిహయపద్మసంభవముఖామరకోటికిరీటకోటిభా
సురహరినీలభృంగపరిశోభిత మై సనకాదిమానసాం
తరపరివర్ధమాన మయి తాపసహంససమాశ్రయంబు నై
హరిపదనీరజాత మలరారు సమస్తజగత్ప్రసిద్ధమై. 33

గీ. అట్టిహరిపాదపంకేరుహంబువలన
సంభవించెను గాంభీర్య శౌర్య ధైర్య
కార్యచాతుర్యసౌందర్యధుర్యవిలస
దనుపమకులంబు పద్మనాయకకులంబు. 34

చ. రుచిరహరిద్విభూజనశిరోజవిరాజదురోజమండలీ
విచికలమంజరీఘుసృణవిభ్రమవిభ్రమకృద్విభావళీ
సుచిరయశఃప్రతాపపరిశోభిత మై ఘనదానవిక్రమ
ప్రచురతఁ బద్మనాయకకులం బలరారు జగత్ప్రసిద్ధిగన్. 35

వ. అందు, 36

కం. శ్రీభజనీయం బై ధర
సేభూషణ మగుచు సత్యనిభయాభిఖ్యా
శోభిత మై క్షీరాంబుధి
వైభవమున మెఱసి రావువంశం బలరున్. 37

ఉ. రావుకులాంబురాశికిఁ దరంగము లెంచివర్తితి నరజన్
నావశమే గణింపఁ గృతినాథుని సంతతసంతతిక్రమం
బే వివరింతు భాగ్యసముపేతమనోహరహారవల్లరీ
పావనరత్నపంక్తిఁ దగుభంగి గణించినఁజాల నియ్యెడన్. 38

చ. సారవిచారు లార్యజనసమ్మతు లాహవశూరు లర్థిమం
దారు లవార్యవిక్రము లుదార్థులు మానవతీమనోహరా
కారులు వర్ణనీయగుణగణ్యచరిత్రులు దుష్టశత్రుసం
హారులు రావుసత్కులమునం దుదయించినవార లందఱున్. 39

వ. వారిలోన, 40

మ. నలమారాకృతి కాకతీంద్రజయసంధానైకధౌరేయుఁ డు
జ్జ్వలతేజోబలభాసమానుఁడు జగత్ప్రఖ్యాతచర్యుం డనా
విలబేతాళకృపాత్తవైభవుఁడు నై బేతాళరాణ్మేదినీ
వలయాధీశ్వరశేఖరుం డలరుఁ దద్వంశాగ్రగణ్యస్థితిన్. 41

కం. అతనితనూభవుఁ డై సం
తతదానకలాకలాపదక్షుం డగుచున్
నుతగుణుఁ డగు పెదసింగ
క్షితిపతి వైభవము గాంచి చెలఁగుచు నుండెన్. 42

సీ. అయ్యెడ సూర్యవంశాంభోధిచంద్రుఁ డై
విక్రమక్రమలీల వెలయు నుదయ
పురపురాణావారి వర[redacted]ంబంబులో
నుండి వెల్వడి మహోద్దండశక్తి
పూసపాటికులోద్భవుం డైన మాధవ
వర్మ యన్ వసుమతీవల్లభుండు
విపులసైన్యముతోడ బెజవాడచెంత న
ప్పెద్దసింగక్షమావిభువరేణ్యు

గీ. సురపురీవరసౌఖ్యభాసురునిఁ జేసి
జైత్రయాత్రాభిలాషచే సరవి నాతఁ
డానిగొందిపురాదిగోత్రాధిపతులఁ
బటుతరభుజాబలానూనపటిమ గెలిచి. 43

కం. అజచంద్రపయోరాశి
ద్విజరాజుల హయాణశకము వెలసెడునెడఁ ద
ద్విజయస్తంభచయంబుల
నిజకీర్తు లెసంగ నచట నిలిపెం గడిమిన్. 44

కం. మరియు ననేకమహీశుల
దురమునఁ దునుమాడి విజయదుందుభు లెసఁగన్
వరరామేశ్వరనగరీ
పరిసరమున కేఁగి మఱలివచ్చెడునంతన్. 45

చ. వరయశుఁ డైనసింగవిభుపట్టపుభామిని యంతకంటె మున్
బరువడి మూలు దాల్చుటను ప్రాణవిభూత్తముతోడఁ బోక బం
ధురతరువారఘోరమృగదుర్గమకాననమండలంబులన్
సరగున నేఁగి యేఁగి యొకచారుతరం బగు నగ్రహారమున్. 46

గీ. భువనగిరిచెంతఁ గనుఁగొని భువనవిదిత
వేదవేదాంగవేది యా వింజమూరి
కులజుఁ డైనట్టి నరసన్నగురునివలన
బహుకృపాస్ఫూర్తిఁ గాపాడఁబడుచు నుండె. 47

క. ప్రకటపరాక్రమజితరిపు
నికరుం డగుమాధవాఖ్యనృపమాళి మహో
త్సుకవృత్తిం గర్ణాక
ర్ణికఁ దెలిసికొనెం దదీయవృత్తాంతంబున్. 48

చ. తెలిసి తదగ్రహారము నతిత్వరితంబుగఁ జేరి యాతఁడ
చ్చెలువ వధింపఁ బూనఁగ నృసింహబుధుండు మదీయపుత్రికా
తిలక మటంచు నిశ్చలమతిన్ శపథోక్తులు పల్కి నేమియున్
సలుపఁగలేక వెండియును జయ్యన నేఁగె స్వకీయపద్ధతిన్. 49

క. అంత నొకనాఁడు రిపుదు
ర్దాంతబలుం డైనపుత్రరత్నంబును ద
త్కాంతాజనతామణి య
త్యంతశుభాకరముహూర్తమందునఁ గనియెన్. 50

కం. అతనికి ననపోతమహీ
పతి యనునామంబు నుంచి భాసురవిద్యా
చతురునిఁ జేసె నృసింహ
క్షితిసురమణి గనికరంబు చెన్ను వహింపన్ 5

సీ. సంగీత సాహిత్య సకలవిద్యాప్రౌఢి
సురుచిరశస్త్రప్రయోగపటిమ
వాహనవారణారోహణైకనిరూఢిఁ
బటుబాహుబలశౌర్యపటిమ నలరి
వైరుల సాధింపఁ బగఁ బూని యుత్సాహ
లీల నయ్యెడ మహాయుద్ధ లనంగఁ
జెలఁగు నచ్ఛిద్రదకర్ణులసహాయత నొంది
చెండియు నురుధాటి విజయవాటిఁ

గీ. గరము భీకర మైనసంగర మొనర్చి
యరిమహీపాలవరు సస్సైన్యముగఁ దునిమి
విశ్వవిశ్వంభరాధీశవినుత మైన
విజయమును గాంచె ననపోతవిభువరుండు. 52

చం. మదగజసప్తసాప్తముఖరి ప్రతిపుమర్దనకృద్ధనవిక్రమక్రమా
స్పదకరవాలధైర్యరతుఁ డద్భుతగుణనిస్తులవైభవక్షమా
న్వితుఁడు రక్షితుండు దుష్టజనభీషణభాషణభూషణాంకుఁ డ
భ్యుదయమున్ గాంచి మించె ననపోతమహీశుఁడు మహిం బ్రసిద్ధుఁడై.

కం. వేలాధికనిజభటపటు
కోలాహల మొప్పఁగఁ దనసైన్యఘోటకసమాజిం
గ్రాలఁగ ననపోతప్ప
పాలకుఁడు రణంబు సలిపె భాసురలీలన్. 54

గీ. ఆమహారాజుతనయుఁ డై ఖ్యాతి గాంచి
నెగడె సర్వజ్ఞసింగమనీఁ డనూన
మానఘనదానసప్తసంతానమాన
నీయవైభవగుణవర్ణనీయుఁ డగుచు. 55

సీ. అరిపురభంజనస్ఫురణచే నలరారి
యసమాంబకాకృతి నతిశయిల్లి
ఘనసారలసదభిఖ్యాసముగ్రతఁ గాంచి
యతనువిభూతిసంగతిని మెఱసి
చంద్రఖండకిరీటశాశ్వతప్రభ మీఱి
తతబుధవాహినీధృతిఁ జెలంగి
పద్మబాంధవతనూభవదానధృతిఁ జెంది
యచలసద్ధర్మవిఖ్యాతి నలరి
గీ. యవనితలమున సర్వజ్ఞుఁ డనఁగ నెగడె
భాసురాచారశాంభవాగ్రేసరుండు
రావుకులవారిరాశికై రవహితుండు
ప్రధనజయశాలి సింగభూపాలమౌళి. 56

కం. ఆతనిసోదరుఁ డనవి
ఖ్యాతిం దనరారె సద్గుణాకరుఁ డు ధర్త్రీ
త్రీతలపతి మాధవనీఁ
డాతతపరవాహినీకృతాంతుం డగుచున్. 57

సీ. అనుదిన[illegible]
[illegible]
వివిధపుస్త[illegible] [illegible]
[illegible]

గోపకన్యాభుజంగుని జిత్తమున నుంచి
ధర్మగుణంబుపైఁ దలఁపు నిలిపి
సత్యవర్తనము విశ్వసనీయ మని పూని
శ్రితు లైనవారివాంఛితము లొసఁగి
గీ. యంత్యమున యోగమహిమ దేహంబు దొఱఁగి
రభసమున నంత శ్రీరంగవిభునిచెంత
నిలిచియున్నట్టి మాధవనీని నెన్న
నలవియే బ్రహ్మ కైన శేషాహి కైన. 58

చ. స్మరనిభమూర్తి రావుకులమాన్యుఁడు మాధవనీఁడు జంబుకే
శ్వరుగుడిదాఁకఁ బాశుపతసైన్యముఁ బాఱఁగఁదోలి రంగమం
దిరమున కంగణస్థల ముదీర్ణము చేసినపౌరుషంబు సు
స్థిరముగ నున్న దేకద తదీయశిలాక్షరశాసనాంక మై. 59

కం. ఘనమతు లానరవరునకుఁ
దనయులు పెక్కండ్రు పుట్టి తారును గులపా
వను లై పుత్రులఁ గాంచిరి
వినకలి మై వారు భువిని వెలసిరి కీర్తిన్. 60

కం. ఘోటీరథకుంజరభట
కోటీహితవిభవు లగుచు గుణమణిభూషా
పేటీసన్నిభు లై వెలు
గోటీపురనిలయు లైరి కొండఱు కడిమిన్. 61

వ. అందు, 62

శా. బంగా ళాంగ కళింగ వంగ శక నేపాళాది రాజ్యంబులన్
రంగత్కీర్తులు గాంచి శాత్రవులఁ బోరన్ సారవారాంగనా
సాంగత్యంబున మించి భూభరణదీక్షాదక్షదాక్షిణ్యుఁ డై
రంగారాయఁడు రావువంశభవుఁ డై రాణించె భాగ్యోన్నతిన్. 63

కం. చతురుఁడు రంగారాయ
క్షితిపతి యవనుల జయించి చిరకీర్తిసమం
చితుఁడై నిజభుజశక్తిన్
మెతుకున్ గైలాసకోట మేటిగఁ గొనియెన్. 64

గీ. ఎంచఁ దగు రంగరాయపృథ్వీశ్వరునకు
లలితసుగుణావలంబ యౌ లచ్చమాంబ
కును సముద్భవ మయ్యె వైకుంఠభక్తి
సహితుఁ డగు ధర్మరాయభూజనవిభుండు. 65

కం. ధర్మాత్మజతుల్యధైర్యుఁడు
నిర్మలతరకీర్తి వర్ణనీయమహీభృ
ద్ధర్మప్రవర్తనుం డగు
ధర్మారాయప్రభుండు దగు నుతియింపన్. 66

కం. శ్రీదయితావరకరుణో
త్పాదితఘనధాన్యధేనుభాగ్యోదయస
మ్మోదునకు ధర్మవిభునకు
మాదాంబకు లచ్చనృపతిమణి జనియించెన్. 67

గీ. ప్రచురతరపాండుకీర్తిసంపాదకుండు
నతులభీమబలుండు సత్యాదరుండు
ద్రుపదసంతానసత్కృతిధూర్వహుండు
ధర్మజుం డన లచ్చభూధవుఁడు దగఁడె. 68

సీ. తతనవరత్నమూత్నప్రభాశోభిత
తపనీయదండవిస్తారితంబు
శేఖరాలంకృతాంచితమణికుంభధీ
ధితివిభాసితచతుర్దిక్తటంబు

ప్రాంతలంబిదుకూలభంగానుకృతవియ
ద్గంగాతరంగశంకాపదంబు
శ్రీవిరాజితతాపహృన్నిర్మలాయత
చ్ఛాయావితాశ్రితజనపదంబు

గీ. నగుచుఁ దనయాతపత్రంబు జగతి మెఱయ
గజపతికిఁ బ్రాణసఖుఁ డయి ఖ్యాతిఁ గాంచెఁ
గవిజనాఖిలబాంధవకల్పశాఖి
జననుతుం డగు లచ్చిరాడ్జనవిభుండు. 69

చం. అతనికిఁ గొండమాంబ యనునంగనకుక్ జనియించి శౌర్య య
ప్రతిములు పుత్త్రరత్నము లరాతిభయంకరు లార్యలోకస
మ్మతుఁ డగు ధర్మభూభుజుఁడు మాధవరాయఁడు వేమధారుణీ
పతియుఁ ద్రిమూర్తులట్ల క్షితిభారము బూని మహోన్నతస్థితిన్.

శా. క్షీరాంభోనిధి కుందబృందసితరాజీనామ రాహారనీ
హారక్ష్మాధరహారహీరరజతాహార్యాభ్రకల్లోలినీ
సారక్ష్మారుహచందనైందవవిభాసారంబులం గేరు ధ
ర్మారాయప్రభుకీర్తిచంద్రిక లుదారస్వప్రకాశంబునన్. 71

ఉ. మాధవరాగ్రగణ్యుఁడు సుయోధనసన్నిభమానశాలి యా
యోధనసవ్యసాచి రిపుయాధవినాశనదక్షుఁ డార్యసం
బోధితసత్కళాశ్రయుఁడు భూధరధీరుఁడు సాధుశీలుఁ డ
మ్మాధవరాయసత్ప్రభుఁడు మాధవభూతిసమేతుఁ డెంతయున్. 73

కం. సోముఁడు విభూతిగరిమన్
సోముఁడు దాతృత్వమహిమ సుత్రాముఁడు భా
గ్యామితభోగనిరూఢిన్
వేమారాయప్రభుండు వినుతింపఁ దగున్. 73

వ. అందు, 4

ఉ. మాధవరాయచంద్రునకు మానవతీమణి గుర్వమాంబకున్
భూధరధీరులై తగు సుపుత్రులు నల్గురు గల్గి రెన్నఁగా
సాధువిధేయుఁ డా గురవశౌరిఘనుండు దెనుంగురాయఁడున్
శ్రీధరసన్నిభుండు నరసింహుఁడు ధన్యుఁడు రంగశాయియున్. 75

వ. అందగ్రజుండు, 76

శా. సర్వజ్ఞప్రతిమానుఁడై నిజభుజాస్తంభాగ్రభాగంబునం
దుర్వీచక్రము దాల్చి శత్రువరుల న్యుద్ధస్థలిం ద్రుంచి స
ద్గుర్వాజ్ఞావశవర్తియై విబుధసద్గోష్ఠీనుతోద్యోగుఁడై
గుర్వారాయఁడు ఖ్యాతిఁ గాంచె భువి లోకుల్మెచ్చఁ దేజంబునన్.

సీ. బాంధవచాతకప్రతతికిఁ దనఘనో
దయము సంతతఘనోదయము గాఁగ
విమతగర్వాంధకారమునకుఁ దనప్రతా
పంబు రవిప్రతాపంబు గాఁగ
వివిధయాచకభృంగవితతికిఁ దనదాన
ధార యూథపదానధార గాఁగ
రణధరాస్థిరసురరాజికిఁ దనసుధ
ర్మాప్తి సంతతసుధర్మాప్తి గాఁగ
గీ. ధాత్రితలంబునఁ బేరు ప్రఖ్యాతిఁ గాంచి
ఖడ్గనారాయణాంకసంగతిని దనరె
ఘనుఁడు మాధవరాయశేఖరునిసుతుఁడు
విప్రసులభుండు తెనుఁగురాయప్రభుండు. 78

సీ. తమకించుఁ దమకించుదన మెఱుంగనిమన్నె
రాజుల రాజులప్రతిభఁ జెరుపఁ
జెండాడుఁ జెండాడు చెలువు దోఁపఁగ దాసి
మత్తారిభూమిభృన్మస్తకములు

కల నైనఁ గల నైనఁ గదలవిమనీషల
బెదరించి పొదలలో నొదుగఁజేయుఁ
గడనుండు కడనుండుపడఁతులకునుబలె
భీతు లై చనుశత్రుజాతములకు

గీ. గోత్రభిత్కరశతకోటికోటిసార
సారసప్రియఖరకరోదారరీతి
సమరవిఖ్యాతిఁ గాంచె నా సమదరాతి
[illegible]తి తెనుంగుభూవరునిహేతి. 79

గీ. అర్థులకుఁ గామితార్థంబు లందఁజేసి
యవని బాలింపఁ దనయుల కాజ్ఞ యొసఁగి
యంతమున నీలగిరిని దేహంబు బాచెఁ
దెలుఁగురాయని వినుతింప నలవి యగునె. 80

చం. శతధృతియున్ ఫణీంద్రుఁడును సౌరగురుండును శైలకన్యకా
సుతుఁడును సాటివత్తు రనుచుక్ వినుతింతురుగాక రాజు లీ
క్షితి జత సేయ నర్హు లె విశేషతరస్ఫుటవాగ్విభూతిచే
శ్రితసురశాఖి రావు నరసింహనృపాలకచక్రవర్తికిన్. 81

కం. నీతియుఁ బౌరుషము మదా
రాతివిదారణము శిష్టరక్షణమును బ్ర
ఖ్యాతియు హరిపదభక్తియుఁ
జాతుర్యము రంగశాయిసహజగుణంబుల్. 82

కం. ఘనుఁ డగురంగమహీశున
కును గుణవతి కోనమాంబకును జననం బై
రనఘులు రామన్నయు స
జ్జనుఁ డగు నీలాద్రిరాయజనపాలుండున్. 83

వ. అందు, 84

కం. రామారామేయుం డై
రామాంఘ్రిసరోజభక్తిరతుఁ డై విబుధా
రామవసంతుం డై ధర
రామారాయప్రభుండు ప్రస్తుతి గాంచెన్. 85

సీ. శత్రు నుంచఁడుగదా క్షమలోన క్షమలోన
విడువనొల్లఁడుగదా వేల నైనఁ
బల్కి బొంకఁడుగదా కల నైనఁ గల నైనఁ
వెన్నుఁ జూపఁడుగదా యెన్నఁ డైన
మాయఁ జేయఁడుగదా మది నైన మది నైనఁ
గోప ముంచఁడుగదా కుమతు లరసి
కొలు తప్పఁడుగదా కర మెత్తి కర మెత్తి
యీగి మానఁడుగదా యెట్టియెడల
గీ. నీధరాపాలుఁ డని లోకు లెన్నుచుండ
బాల్యముననుండి కీర్తిచేఁ బ్రబలె నౌర
ఖ్యాతచరితుండు రంగభూకాంతుసుతుఁడు
భావజనిభుండు నీలాద్రిభూవిభుండు. 86

మ. అనఘప్రాభవుఁ డై తనర్చునరసింహక్షోణిభృన్మౌళికిన్
వినతారాతిజనాంగనావితతి యౌ వెంగాంబకుం బుత్రు లై
జనసం బందిరి చిన్నభూవిభుఁడు భాషాచాతురీధూతవా
క్పాణి నీలాద్రివిభుండు రామధరణీకాంతుండు నా ముఖ్యరున్. 87

వ. అందు, 88

ఉ. పున్నమనాఁటిచందురుని బోలుఁ బ్రశస్తకళాధురీణతన్
బన్నగరాజుఁ బోలుఁ బటుభాషణమంజులధీసమగ్రతన్

వెన్నుని బోలు సత్వగుణవిశ్రుతివైఖరి నెంచి చూచినం
జిన్నమరాపుతోడ జత సేయఁగ నన్యమహీశు లర్హులే. 89

కం. హాలాహలశిఖికీలా
భీలారిచమూహృదబ్జభీకరలీలా
ఖేలాంచితకరవాలుఁడు
నీలాద్రివిభుండు వర్ణనీయుం డెప్పుడున్. 90

సీ. విమలామృతోదయోద్యమనిరూఢిఁ జెలంగి
కువలయప్రియమహోత్సవముఁ గాంచి
కమలాభినవజన్మకారణంబున హెచ్చి
వరబాడబాప్తజీవనత నలరి
లావణ్యగణ్యలీలావిభూతిఁ జెలంగి
రత్నాకరోత్తమప్రభ వహించి
భూమిభృద్దక్షావిభూతిచే నలరారి
సుమనోమనోజ్ఞవిస్ఫూర్తి నలరి
గీ. కొమరగిరివరపురమునఁ గొమరు మిగులఁ
గడలి కెన యైన ఘనతటాకంబు నిలిపె
ఘనుఁడు నరసింహభూనాయకునిసుతుండు
రమ్యగుణశాలి నీలాద్రిరాయమౌళి. 91

కం. వరమతి యగు నీలాద్రికి
నరయఁగఁ గేసాంబకును నిజాత్మజులై రా
నరసన్నయు బుచ్చెన్నయు
సరసుఁడు వెంకన్న చిన్నజనపాలుండున్. 92

వ. అం దగ్రజుండు, 93

సీ. అసమాంబకుఁడు మానితైశ్వర్యమహిమచే
నసమాంబకుఁడు సురూపాప్తిచేత
ద్విజరాజు విమలకాంతిప్రకాశంబుచే
ద్విజరాజు నుతజనాధికతచేతఁ
బద్మాత్ముఁ డుద్యత్ప్రభామహత్వంబుచేఁ
బద్మాత్ముఁ డతిసత్వపరతచేత
జీమూతగురుఁడు రాజితదానగుణముచే
జీమూతగురుఁడు సుస్థిరతచేత
గీ. ననుచు సుకవీంద్రు లెల్లఁ ద న్వినుతి సేయఁ
బద్మనాయకవరులలోఁ బ్రతిభఁ గాంచె
శీవి గనుపట్టి నీలాద్రిరావుపట్టి
సుప్రభుం డౌర నారసింహప్రభుండు. 94

మ. ఘనుఁ డౌ రావు తెనుంగురాయనికి లోకస్తుత్య శ్యానాంబకు
న్దనయు ల్గలిరి మాధవప్రభుఁడు సన్మాన్యుండు వెంకన్న స
జ్జనుఁ డౌ చిన్నమరావు లోకనుతుఁ డౌ చంద్రదక్షమాభర్త జ
గ్గనృపశ్రేష్ఠుఁడు కృష్ణరాయఁడునుజోకన్ రంగశాయీంద్రుఁడున్.

కం. గురురాయమహీపాలున
కిరువురుసతు లలఘుదురు మహీరమణియు నా
సిరియునుబలెఁ గులపావన
లరయన్ భద్రాంబ లచ్చమాంబ యనంగన్. 96

కం. అతనికి భద్రాంబకు సుతు
లతులమతు ల్గలరు మాధవాఖ్యుఁడు లక్ష్మీ
పతి రామన్నయు రెండవ
సతికిన్ సీతన్న యనఁగ సరసగుణాఢ్యుల్. 97

వ. అం దగ్రజుండు, 98

సీ. అడుగఁ డెవ్వారిఁ జేరి యడిగెనా శాస్త్రార్థ
మవనీసురశ్రేణి నడుగుఁ గాని
కొలువఁ డెవ్వరినైనఁ గొలిచెనా మదిఁ బొంగి
గోపాలబాలునిఁ గొలుచుఁ గాని
మ్రొక్కఁ డెవ్వరినైన మ్రొక్కెనా బ్రాహ్మణ
ముఖ్యులకే సాగి మ్రొక్కుఁ గాని
కోరఁ డేకోరిక కోరెనా ధర్మంబు
కొనసాగవలె నని కోరుఁ గాని
గీ. యవనిలోపలఁ బద్మనాయకులలోనఁ
బొగడ నెగడె లసద్గుణభూషణుండు
వినయసహితుండు గుర్వరాయనిసుతుండు
మానధుర్యుండు గద రావు మాధవుండు. 99

గీ. సుప్రభుం డగు నమ్మాధవప్రభునకు
నంగనామణి యై తగు రంగమాంబ
కును సముద్భవు లైరి సద్గుణులు సుతులు
ధారుణీభారధౌరేయసారమతులు. 100

సీ. సర్వసర్వంసహాధూర్వహణక్రియా
ఖర్వదోర్విభవుండు గుర్వశౌరి
యాయోధనస్థలీస్వాయత్తవిజయగాం
గేయుండు తిరుపతిరాయవిభుఁడు
రంగేశపాదాబ్జభృంగాయమానాంత
రంగవిఖ్యాతుండు వెంగళన్న
సీమంతినీమనఃకామితాకారశే
ఖామనోజాతుండు రామనృపతి

గీ. ప్రభువరేణ్యుండు తిరుమలరాయవిభుఁడు
భాగ్యవంతుండు వేంకటపతిఘనుండు
భవ్యగుణశాలి తిమ్మభూపాలమౌళి
యనఁగఁ గులగిరులట్ల విఖ్యాతిఁ దోడ. 101

కం. చతురమతు లతిదయాపరు
లతులపరాక్రములు సజ్జనావనులు దయా
న్వితులు సురద్రుమసన్నిభ
వితరణులు తెనుంగురాయవిభునికుమారుల్. 102

వ. వారిలోన, 103

కం. బాధించెను శాత్రవులను
సాధించెను విద్య లెల్ల శశ్వద్గతి నా
రాధించెను లక్ష్మీశుని
మాధవరాయనికి సములు మహిలోఁ గలరే. 104

ఉ. శ్రీధరునాజ్ఞ దప్పినను వృత్రహువజ్రము దారి దప్పినన్
భూధరముల్ చలించినను భూమి వడంకిన మేర దప్పి యం
భోధులు ధాత్రిఁ బర్వినను భూపతిపూజ్యుఁడు రావుధన్యుఁ డౌ
మాధవరాయచంద్రుని సమంచితసత్యుని మాట దప్పునే. 105

చ. కుటిలమదారివర్గములఁ గూల్చెఁ గవీంద్రులఁ బ్రోచె నాగరీ
కటక కళింగ కేరళ శక ద్రవిడేశసభాంతరంబులం
బటుతరకీర్తిచంద్రికలు పర్వఁగఁ బ్రస్తుతిఁ గాంచె రావు వేం
కటపతిరాయచంద్రుఁడు జగన్నుతశాశ్వతకీర్తిశాలి యై. 106

కం. మన్నెధరాధ్యక్షులచే
మన్నన గైకొని సమగ్రమానరమాసం
పన్నుండై యలరారుం
జిన్నారాయప్రభుఁడు చిరతరకీర్తిన్. 107

ప్రకృతిరంజనముచే భరతఘుమేశుండు
మేశుండు లక్ష్మీసమృద్ధిచేతఁ
దతభూతిచే ధరాధరసుతాకాముండు
కాముండు సౌందర్యగరిమచేతఁ
గాంభీర్యగుణసమగ్రత రమాజనకుండు
జనకుండు సుజ్ఞానఘనతచేత
నుతసుధీవై భవోన్నతిని బన్నగరాజు
నగరాజు ధృతిలసన్మహిమచేత
గీ. నీఘనుం డని సుకవీంద్రు లేపు మీఱఁ
దనప్రభావంబు వర్ణింపఁ దనరె నౌర
యనఘచరితుండు తెనుఁగురాయనిసుతుండు
దర్పకనిభుండు రామచంద్రప్రభుండు. 108

సీ. వేమాఱు కచ్ఛపవిభునకు నిందిరా
సుదతికిఁ దనలోమ్మఁ జూపఁగలిగె
నరపదిమోములయ్యకు వేడ్కఁ రంజిల్ల
బంగారువిల్లు చేపట్టఁగలిగె
నలవేయికన్నులబలువజీరునకుఁ బే
రెలమిఁ జౌదంతిపై నెక్కఁగలిగెఁ
జెలువరాయనికి నిచ్చలు ప్రాణసఖతోడఁ
డల మెత్తి ముచ్చట దెలుపఁగలిగె
గీ. రావువంశోద్భవుం డైన రామచంద్ర
రాయదేవేంద్రుఁ డెలమిఁ దిరంబు గాఁగ
నిజభుజాస్తంభమున ధారుణీభరంబు
ఘనతరస్ఫూర్తిఁ దాల్చుటకతన నపుడు. 109

సీ. అతఁడు గోత్రవిపక్షుఁ డితఁడు గోత్రసపక్షుఁ
డతఁడు భోగంబుచే నితనిసరియె
యతఁ డరిశ్రీకరుం డితఁ డరిభీకరుం
డతఁడు తేజంబుచే నితనిసరియె
యతఁడు జిహ్మాగధారి యితఁడు జిహ్మాగవైరి
యతఁడు విభూతిచే నితనిసరియె
యతఁడు బాడబహ్మృతుం డితఁడు బాడబహితుం
డతఁడు గంభీరత నితనిసరియె

గీ. యనుచు విభవప్రతాపభూ త్యతిగభీర
గరిమ భావించి శక్రశంకరుహిమిత్ర
భవసముద్రుల నెంతు రౌ ప్రతిదినంబు
రామచంద్రుని వర్ణించుభూమిపతులు. 110

గీ. రావువంశాబ్ధిచంద్రుఁ డా రామచంద్రుఁ
డవని బాలింప దొరలు బాంధవులు సిరులు
గాంచి రన సంశయం బేల కరులు గిరులు
హరులును సుఖింప సుఖవృత్తి నరుల కరుదె. 111

కం. ఆరామచంద్రరాయ
క్ష్మారామావల్లభునకు సహధర్మిణి యై
శ్రీరమ్యాకృతి నలరె
ధీరస్తుతగుణకదంబ తిమ్మాంబ ధరన్. 112

సీ. అన్నదానోన్నతి నన్నపూర్ణాదేవి
భూరిక్షమాఖ్యాతి భూమిదేవి
యైశ్వర్యమహిమచే నాదిలక్ష్మీకాంత
చారువాక్ప్రౌఢిమ శారదాంబ

పతిపాదభక్తిసంగతిచే నరుంధతి
చిరభోగగరిమ శచీమృగాక్షి
సత్యపాలనలీలఁ జంద్రమతీదేవి
యతులరూపమున రత్యంబుజాక్షి
గీ. యీసతీరత్న మని లోక మెన్నుచుండఁ
బ్రబలె గజరావుతిమ్మనృపట్టి రావు
రామచంద్రప్రభూత్తమురాణి భూమి
దివిజనుతసద్గుణకదంబ తిమ్మమాంబ. 113

సీ. శ్రీమనోహరుఁడు కుంతీమాధవస్వామి
కులదైవ మేనృపకుంజరునకుఁ
బృథివి నెన్నిక యైన పీఠికాపురి రాజ
ధాని యేసంతతధార్మికునకు
బారుహమన్నెభూపాలకు లాజ్ఞలో
మెలఁగుదు రేమహీతలవిభునకు
రణరంగవిజయసంరంభజృంభణలీల
సహజ మేశాత్రవసంహరునకు
గీ. నతఁడు నుతి సేయఁ దగుఁ గోస లాంగ వంగ
మగధ కర్ణాట నృపసభామధ్యవర్ణ
నీయగుణమణిగణరమణీయమూర్తి
జగ్గరాయప్రభుండు భాస్వత్ప్రభుండు. 114

సీ. అల వేల్పుతోఁటపువ్వులు గాని చెలరేఁగి
మేలానికుంజాళి నీగి యీఁగి
యనిదిండితపసిరాయని కడ్డమై యూఁగి
తేటవేలుపుటోటినీటఁ దోఁగి

జేజేలతిండికిఁ జేరి పై పై మూఁగి
వెలిమావుపై నెక్కి విఱ్ఱవీఁగి
చాదంతికొమ్మలమీఁద నుయ్యాల లూఁగి
యంచబోదలను లాలించసాగి

గీ. కడఁకతోడుత సకలలోకములయందు
మించి విహరించి ప్రఖ్యాతి గాంచె నౌర
చంద్రికాస్ఫూర్తి శరదభ్రసదృశమూర్తి
రావు జగ్గక్షమాతలప్రభునికీర్తి. 115

గీ. ఆస గాంచియుఁ గృశియించి యుప్పు లిచ్చి
ధనదరాజఘనాఖ్యలఁ దనరువారు
సములె దాతృత్వమున రావు జగ్గరాయ
నృపతి కతులమహాదానవిపులమతికి. 116

సీ. తనవంశధర్మంబు దనవంశధర్మంబు
రీతి నుద్యద్గుణఖ్యాతి నలరఁ
దనపరాక్రమలీల తనపరాక్రమలీల
గతిఁ బరక్ష్మాభృదీడ్యత వహింపఁ
దనదానవిస్ఫూర్తి తనదానవిస్ఫూర్తి
కరణి దోషాకరగర్వ ముడుపఁ
దనసదయోద్వృత్తి తనసదయోద్వృత్తి
పగిదిని వాహినీప్రభుతఁ దెలుపఁ

గీ. దనరె ననితరదానవిద్యావివేక
శౌర్యగాంభీర్యసౌందర్యసాహసాంకుఁ
డార్యవినుతుండు తెనుఁగురాయనిసుతుండు
ఘనవిభాహేళి కృష్ణభూకాంతమౌళి. 117

గీ. ఎంచఁ జిత్రంబు కడు రావు కృష్ణరాయ
శౌరిదానంబు మిత్రులు శాత్రవులును
స్వస్థులై కనకాంకితసదను లైరి
సర్వసముఁ డనఁగా రాఁడె యుర్వి నతని. 118

సీ. తతకాంతివిభవనిర్జితనిశాకాంతుండు
వరసుకవివ్రాతవనవసంతుఁ
డతివైభవాధరీకృతమరుత్వంతుండు
లలితలావణ్యలీలాజయంతుఁ
డబ్జాక్షపాదపద్మాంకితస్వాంతుండు
లక్ష్మీనితాంతహేలాదృగంతుఁ
డతులప్రతాపనిర్జితభానుమంతుండు
రణరంగదుష్టశాత్రవకృతాంతుఁ

గీ. డలిదయావంతుఁ డఖిలదిగంతరాళ
సంతతాశ్రితగుణలతాజాతసితల
తాంతసన్నిభకీర్తినితాంతకాంతి
కాంతుఁ డై రంగశాయిభూకాంతుఁ డలరు. 119

కం. అం దగ్రజుఁ డై తనరెడు
మందరనగధీరుఁ డైన మాధవనృపసం
క్రందనునకు గుణధన్యున
కుం దరుణులు జానకియును గోనాంబ యునన్. 120

గీ. ఆవిభుం డల జానకీదేవియందుఁ
గాంచెను దెనుంగురాయశేఖరుని ఘనుని
గోనమాంబికయందు సద్గుణు జనార్ద
నక్ష్మాధీశుఁ గాంచె నా నరవరేణ్యు. 121

వ. అందు, 122

చ. హరిగురుపాదభక్తి సుజనావనబుద్ధి విపక్షజాలసం
హరణధురీణతామహిమ నాశ్రితబంధుజనావనంబు సు
స్థిరముగఁ గాంచె సజ్జనవిధేయుఁడు మాధవరాయభూమిభృ
ద్వరుని దెనుంగురాయనృపవర్యుఁ డవార్యపరాక్రమోన్నతిన్.

కం. దుర్దమశాత్రవజనతా
మర్దననిర్నిద్రజయరమావిభవోద్య
త్కర్దనుఁ డై సుతి గాంచె జ
నార్దనుఁ డిలఁ బద్మనాయకావళిలోనన్. 124

గీ. ప్రథితయశుఁ డాజనార్దనప్రభువరుండు
ధర్మమాంబికయందు నందనునిఁ గాంచె
విష్ణుపదభక్తివిభవవర్ధిష్ణు జిష్ణు
సుష్ణకరనిభు వేంకటకృష్ణవిభుని. 125

వ. తిరముగ రామచంద్రజగతీపతికిం దరుణీలలామ మై
పరమపతివ్రతామహిమభాసుర మై తగు తిమ్మమాంబకున్
బురుషవరేణ్యు లిర్వురు సుపుత్త్రులు గల్గిరి భూమిపాలశే
ఖరుఁ డగు మాధవప్రభుఁ డకల్మషుఁ డౌ నరసింహశౌరియున్.

గీ. రామచంద్రానుజుఁడు కృష్ణరాయవిభుఁడు
సాధుసుగుణావలంబ యౌ సర్వమాంబ
యందు వేంకటరాయని ననఘశీలుఁ
దెనుఁగురాయనిఁ గాంచె నౌ వినుతయశుని. 127

మ. చటులారాతితమఃపరంపరలు విచ్ఛిన్ దిక్కులం దేజ ము
త్కటలీలం గనుపట్ట యాచకమనఃకందాళి రంజిల్ల స
ద్భటచక్రంబులు సంతసింప జగతి న్భాస్వత్ప్రభన్ హెచ్చె వేం
కటరాయక్షితిపాలశేఖరుఁడు విఖ్యాతోదయారంభుఁ డై. 128

కం. మహితనయోక్తియు నిజకుల
విహితాచారంబు శత్రువిదళనము దయా
సహితవ్యాపారంబును
సహజంబులు తెనుఁగురాయజనపాలునకున్.

సీ. దానంబు మధుపసంతతికి నిచ్చి మతంగ
జత్వంబు గనియెఁ గుంజరవరములు
ఘనులజీవన మెల్లఁ గైకొని కుధరేశ్వ
రాఖ్య నెన్నిక యయ్యె నచలవితతి
గాలి యాహారంబుగా బలిసద్మంబు
నం దహీనత గాంచె నలఘణిపతి
సౌకర్య మేకలక్షణమె కైకొని తుంగ
పదవిని పేరుండ నొందుగు ఘృష్టి
గీ. యనుచుఁ గరులను గిరులను హరిని గిరిని
విడిచి ధరణీపురంధ్రి యీవిభునిఁ జేరె
నతఁడు నుతి గాంచు రామచంద్రావనీశ
సుతవరేణ్యుండు మాధవక్షితివరుండు.

సీ. తాతఁ బెండ్లాడిన తరుణి యౌ ననఁగదా
చెలఁగి భారతి కొప్పు చిక్కుపఱచె
మామ మామకు ముద్దుమఱఁది యౌ ననఁగదా
రోహిణీరమణుని రొమ్ము చఱచె
నల్లునిఖుల్లుఁడౌ ననఁగదా కలశాబ్ధిఁ
గని వారి పాలపాపని హసించె.
ముసలివాఁ డని చేరి వెన గడించియొగదా
బలరామదేవునివలువఁ జించె

గీ. భువనవిభ్రాజదకలంకభూరివైభ
వమున నిలిసిల్లి తనసాటివారి నెల్ల
వావిఁ గల్పించి భంగించె దేవతోడ
129 మాధవప్రభుమణికీర్తిమంజువాణి. 131

సీ. అరిభయంకరమహత్తరసమాఖ్య వహించి
సతతసన్మార్గసంగతిని దనరి
కువలయపాలనోత్సవవైభవము గాంచి
జైవాతృకత్వప్రశస్తి మెఱసి
యఖిలకళాకారణాకారము వహించి
సత్ప్రభాకరకరశక్తి నలరి
సర్వజ్ఞమకుటభూషణవిభూతిఁ జెలంగి
వాహినీప్రియజయావహతఁ గాంచి
గీ. రాజనైజక్రియాక్రమప్రచుర మగుచుఁ
దనప్రభావంబు నిలసిల్ల ధరణియందుఁ
బ్రస్తుతికి నెక్కె సత్సభాభ్యంతరములఁ
130 బ్రబలనయహారి మాధవరాయశౌరి. 132

సీ. సమదదంతావళీసముదయంబులమీఁదఁ
గుప్పించు సింగముకొదమభంగి
దారుణభుజగసంతతిసంతతులమీఁదఁ
గవియు విహంగపుంగవునికరణి
గగనజంఘాలఖగవ్రజంబులమీఁద
వడిఁ జూపు బలుసాళువంబుపగిది
జవవత్కురంగమసంఘాతములమీఁద
వాలు మల్లార్పుశార్దూలమట్ల

గీ. గురుకుభృత్పక్షములఁ జెండుగులిశ మనఁగ
నరిబలంబులఁ దెగటార్చు నాహవములఁ
బ్రబలధారాగ్రదళితశాత్రవపదాతి
రామచరిత్రునిమాధవప్రభుని హేతి. 133

సీ. పరభీకరం బైన వరదుర్గము ఘటించె
మేటిగాఁ జామర్లకోటవద్ద
యవనప్రభునిచేత జవనాశ్వము ల్గడి
యారంబు గజముల నందుకొనియె
బారుహామన్నభూపాలోత్తములు నిజా
జ్ఞావశు లై యుండ ఠీవి వెలసె
వృత్తులు గల్పించి విశ్రుతంబుగ విప్ర
సమితికి నగ్రహారముల నొసఁగె
గీ. శ్రీరమాధవకరుణావిశేషలబ్ధ
వైభవంబున ధారుణీవలయ మేలి
రావుకులవార్ధిసోముఁ డై ప్రతిభఁ గాంచెఁ
బ్రథితయశుఁ డెన్న మాధవప్రభువరుండు. 134

సీ. శ్రీరస్తు కరవాలభైరవఖడ్గనా
రాయణకాకతిరాయరాజ్య
సంస్థాపనాచార్య జగనొబ్బగండ గం
డరగండ రేచెర్లవరకులీన
ప్రతిగండభైరవ పంచపాండ్యవిభాళ
యరిరాయ రాయవేశ్యాభుజంగ
మండలీకరగండ గండగోపాళ యా
హవభీమ రాయ హత్తిమల్ల

గీ. గాయ గోవాళకేళాదిరాయబిరుద
యనుచుఁ గైవారము లొనర్తు రనుదినంబు
నతులవాక్ప్రౌఢితోడ నర్థార్థు లెల్లఁ
బ్రమదమున రావు మాధవప్రభునిసభను. 135

కం. జూపల్లి నారసింహా
ఖ్యాపతిసుత రమణమాంబికామణిని జయ
శ్రీపూర్ణమహిమ మాధవ
భూపతి వరియించె హర్షమున జను లెంచన్. 136

సీ. ఘనసర్వమంగళాకారలీలఁ జెలంగి
భూమిభృత్కన్య నాఁ బొదలు టరుదె
యతులక్షమాభిఖ్య నార్య లెన్నఁ దనర్చి
పసుమతివిఖ్యాతిఁ బొసఁగు టరుదె
చతురభాషావిశేషఖ్యాతిఁ దనరారి
చతురాస్యకాంత నాఁ జాలు టరుదె
మాధవప్రేయసీమణి యై సిరుల హెచ్చి
యాదిలక్ష్మీస్ఫూర్తి నలరు టరుదె
గీ. యనుచు జను లెల్ల వినుతి సేయంగఁ బ్రబలె
శైలజా ఖ్యాతి సరస్వతీ శ్రీలఁ బోలి
యనితవివిఖ్యాతినిఖిలశోంభవకదంబ
రమ్యసద్గుణనికురుంబ రమణమాంబ. 137

సీ. చంద్రధరస్ఫూర్తిఁ జంద్రధరస్ఫూర్తి
ఘనయశోధృతిభూరిగతులఁ గేరి
హరికుమారాభిఖ్య హరికుమారాభిఖ్య
శౌర్యసంధారూపసరణిఁ గాంచి

నరమిత్రవిఖ్యాతి నరమిత్రవిఖ్యాతి
బుద్ధితేజశ్శ్రీసమృద్ధిఁ జెంది
రాజరాజసమాఖ్య రాజరాజసమాఖ్యఁ
గాంతిభోగవితీర్ణగరిమ మీఱి
గీ. ప్రస్తుతికి నెక్కె దిక్కరిప్రాభవుండు
ధారుణీధారధౌరేయభూరిభుజుఁడు
రామచంద్రక్షితీశుఁగాఁ బుట్టి
రణవిజయకేళి నరసింహరాయమౌళి. 138

దట్టించు హారతారధరహారదరహీర
ఘనసారహిమపూరగగనఝరులఁ
ప్రహసించు శరదంతరఘనాంతహరిదంత
కరిదంతవిధుకాంతశరవరముల
నిరసించు హరిరాజసురభూజకతనూజ
ఫణిరాజభసమాజపారదముల
హసియించు హరికాండబిసఖండరుచిషండ
శశిమండలసితాండజవ్రజముల
గీ. నెదు రెఱుంగనికయ్యంబు మదిని బూని
సకలలోకంబులందు స్వేచ్ఛను జరింగు
రామచంద్రునినరసింహరాయధరణి
పాలకాగ్రేసరునిసమాఖ్యాలతాంగి. 139

కం. శ్రీకరముగ నరసింహ
క్ష్మాకాంతుఁడు పెండ్లియాడె జలజాక్షుఁడు ల
క్ష్మీకాంతామణివలె ల
క్ష్మీకాంత నభోగవిభవజితహరికాంతన్. 140

మ. పతిభక్తిం బటుశాంతిబంధురమతిన్ భాగ్యోన్నతి న్మన్నరుం
ధతి ధాత్రీసతి ధాతనాతి హరికాంతారత్నమున్ లోకసం
స్తుతి గైకొన్నవిధంబున న్నుతులు గాంచున్ శ్రీలఁ జెల్వొందె యా
శ్రితరక్షామతి యా నృసింహవిభులక్ష్మీకాంత ధాత్రీస్థలిన్. 141

కం. జననుత మై తనవంశము
ఘనముగ నాచంద్రతారకం బై వెలయున్
దినదినమును జిరసౌఖ్యం
బున మాధవరాయనృపతిముఖ్యుం డలరున్. 142

## షష్ఠ్యంతములు.

కం. ఏతాదృశసౌజన్యస
మేతగుణవ్రాత ముదితపృథ్వీజన తా
చేతఃపద్మనకును బ
దాత్మతరుణీలాస్యసురుచిమత్పద్మనకున్. 143

కం. హాలహాలగళచూళీతట
ఝుళఝుళదమరాపగోర్మిసహచరలీలో
జ్వలకలభాషారచనా
బలవిలసితబుద్ధిహసితపన్నగపతికిన్. 144

కం. ప్రఖ్యాతోభయభాషా
వ్యాఖ్యానశ్రవణవైభవస్ఫుటవివిధో
పాఖ్యానబోధబంధుర
తాఖ్యాముఖ్యునకు నినసమాభిఖ్యునకున్. 145

కం, ప్రణమదరిమకుటబలభి
న్మణిగణఘృణిమధుపనికరమానితతరుణా
రుణచరణసలిలభవునకు
గణనీయసురేంద్రసదృశఘనవిభవునకున్. 146

కం. ధీరునకు నర్థిజనమం
దారునకును విమతభూమిధవకులబలసం
హారునకు ధర్మమార్గవి
హారునకును వివిధబుధజనాధారునకున్. 147

కం. సుదతీజనమానసనవ
మదనాకారునకు నిఖిలమనుజేశ్వరసం
సదభిస్తుతసుగుణగణా
శ్రదవాక్సారునకు సద్ద్విజాధారునకున్. 148

కం. శ్రీరామచంద్రరాయకు
మారాగ్రణికి హితజీవమాయుతపణికిన్
ధీరస్తుతప్రతాప
ప్రారంభనిరాకృతాంబరాంతగమణికిన్. 149

కం. శతమన్యుసదృశభోగో
న్నతికి న్మహనీయమేరునగసమధృతికిన్
సతతాశ్రితరక్షాచణ
మతికిన్ శ్రీమాధవక్షమాతలపతికిన్. 150

వ. అభ్యుదయపరంపరాభివృద్ధి యగునట్లుగా నా రచియింపంబూనిన వాసవదత్తాపరిణయం బను మహాప్రబంధంబునకుం గథాప్రారంభం బెట్టి దనిన— 151

మ. స్మరసామ్రాజ్యరమాసమానరమణీచంచత్ప్రదానాస్త్రక
స్ఫురదుత్తుంగసువర్ణసౌధముకురీభూతాగతాపత్రపా
భరదత్తాంకసుధాంశుమండలము చెప్పం బాటలీపుత్ర మనం
బుర మొప్పు న్నికటస్థితాభ్రతటినీప్రాతాఖిలాశాంతమై. 152

సీ. గిరిసారవప్రభాస్వరతారచితగోర
హరివారచకితదిక్కరివరంబు
సలిలాంతరితరసాతలతాంతరుచికాంత
జలజాంతపరిఖాభివలయితంబు
సురసాలజయశీలసురసాలవనజాల
పరినీలసితవప్రపరిసరంబు
ఫలపీతకలమభూతలజాతరుచిజాత
కలధౌతమయధరావిలసనంబు
గీ. గోపురాగ్రవిరాజితగోపురాంత
దీపితానర్ఘ్యరత్నప్రదీపసంప
తాపభాసితవలయాద్రిభూపదంబు
భూపదంబుజనూపురం బీపురంబు. 154

సీ. కుంభసంభృతశాతకుంభచ్ఛవిచ్ఛన్న
చండభానుప్రభామండలములు
తపనప్రభాబద్ధధౌతార్ద్రచేలాంచ
జలధరాంకితవలభిలసితములు
మదనాహవోదయన్మణితాసుగుణరణ
త్కలరవాన్వితవిటంకవ్రజములు
శశికాంతమణిమయస్థలసమీక్షితయంత్ర
సలిలధారాపూరసులలితములు
గీ. నికటమణిసాలభంజికాప్రకటితోష్ఠ
బింబదంశనకుంఠితౌదుంబరాభ
తుండమండితపంజరస్థాండజములు
నందుఁ జెలువొందు భూభృన్మందిరములు. 155

మ. కలధౌతాంకితకేతనాంచితము లై గన్పట్టునా ప్రోలిమే
డలఁ గ్రీడించుచకోరలోచనలఁ జూడ న్వచ్చు నౌ చందనా
చలమందానిలముల్ దళత్కుముదకాసారాంతరప్రోల్లస
జ్జలజామోదము గాన్కగాఁ గొనుచుఁ దజ్జాలాంతమార్గంబులన్.

ఉ. సారసగంధు లందు మణిసౌధములం గయిసేయువేళ గ్రొ
క్కాఱుమెఱుంగుగన్నులను గజ్జలరేఖలు దిద్ది దిద్ది బ
ల్సోరణగంటిదారిఁ జనుసోముని గాటుకగోర మీటినన్
బేసరమందు నాతనికిఁ బేర్చెఁ గళంకము నాఁటనుండియున్.

సీ. పుణ్యజనద్రోహమునకు సైరింపక
క్షమ జనించినబృహస్పతు లనంగఁ
దారకద్వేషంబుఁ దర్కింపఁగా విశా
ఖతయుఁ గాంచనిశివాసుతు లనంగఁ
బంకజోదయతాకళంకం బెఱుంగక
చతురాస్యు లైనవాక్పతు లనంగ
జిహ్మగత్వము విసర్జించి రసాతల
వర్తులౌ ఫణిలోకవరు లనంగ

గీ. వేదవేదాంగవేదాంతవివిధముఖ్య
విద్యలకు జన్మభూము లై వెలసి శౌర
యాత్మదర్శనలబ్ధభాగ్యాతిశయులు
విప్రవరు లెన్న నవ్వీటివిప్రవరులు. 158

సీ. నరనాథుఁ డయ్యు వానరసహాయతఁ బోరు
రఘుకులేశునిపరాక్రమ మదెంత
కొండంతవిల్లు గై కొని ప్రసూనశరాస
నుని జయించినశూలిఘనత యెంత

విజయనామంబుచే విలసిల్లి షండుఁడై
పగవారి కోడిగినపార్థుఁ డెంత
కోదండవిద్యకు గురుఁ డయ్యును గుమారుఁ
డను పేరుఁ గనుగుహుం డనఁగ నెంత
గీ. యనుచుఁ బ్రస్తర లాడుదు రనుదినంబుఁ
గదనజయవిక్రమక్రమఖ్యాతి మెఱసి
సాహసోత్సాహవిద్యావిశాలమతులు
రాజసుతు లమ్మహానగరంబునందు. 159

ఉ. కట్టఁగ బట్ట లేక చలికాఁడు దిగంబరుఁ డైనఁ జూచియుం
బట్టు మటంచు నొక్క వెలిబట్టయు నియ్యక యీసగాంచుటం
బుట్టెఁ గుబేరభావ మని పుణ్యజనేశు గణింప రప్పురిం
బుట్టిన వైశ్యవర్యులు ప్రభూతనిదాననిధానదానతన్. 160

క. ద్విజకులపాదపరోరుహ
భజనానిస్తంద్రసుగుణభాసురు లై పా
దజు లుందు రందు వైభవ
విజితపురందరులు కృషివివేకధురీణుల్. 161

చ. అడిదము కేలఁ బట్టి యెదు రైనయరాతులఁ ద్రుంచివైచు టే
గడన యటంచు నాయుధముఁ గైకొనకే పెడచేత దంతులం
బోడ వడఁగించి సింగములపొంక మడంచి భయావహంబు లౌ
పిడుగులఁ బట్టి శౌర్యమునఁ బేర్తురు వీరవరేణ్యు లప్పురిన్. 162

సీ. దర్పకుం డను సూత్రధారునిపంపున
భూమి నాడెడుపైఁడిబొమ్మ లనఁగఁ
దారుణ్య మను ఘనోదయమునఁ జిరకాంతి
నొఱపుఁ జూపెడుతీఁగెమెఱుపు లనఁగ

లావణ్య మను వార్ధి నావిర్భవించిన
వెలలేని రతనంపు మొలక లనఁగ
విటమానసము లను విటపాంతరంబుల
నల్లుకొన్న ప్రసూనవల్లు లనఁగ
గీ. నమృతములు చిల్క నధరబింబములు ముద్దు
గులుకుపలుకులు యువశుకంబులకు విందు
సేయఁ జెలు వంది మిక్కిలిసోయగమునఁ
గళల నలరుదు రలవెలనెలఁత లందు. 163

చ. వెలవెలవారువార్ధిఁ బ్రభవించినవాహము పూర్వపశ్చిమా
బ్ధులఁ దలమాపు గ్రుంకు లిడుతోయజబంధురథాశ్వము ల్దదు
జ్జ్వలతురగోత్తమక్రమనివారితతీవ్రమనస్స్ఫురస్థిరాం
చలహాతభూపరాగములు సారెకుఁ బైపయిఁ గ్రమ్మినం జుమీ.

సీ. సిందూరరేకలచెలువంబు మిహిరారు
ణాంశుసంయోగసామ్యంబుఁ దెలుప
బంగారుగొలుసులసింగారపుంగల్మి
శంపాలతాచ్ఛాయఁ జౌక సేయఁ
ప్రకటితవర్ణవిభ్రమరాంకవాంకంబు
మణిధనుఃకాంతిసామగ్రిఁ బొదల
భీకరగంభీరబృంహితారావము
ల్గర్జారవములవైఖరులు మీఱ
గీ. సాంద్రతరదానధార లాసారలీలఁ
దనర వర్షావసరవారిధరము లనఁగ
వైభవము గాంచు నప్పురవరమునందు
బంధురాకృతితో గంధసింధురములు. 165

సీ. పల్లకాగ్రంబుపై మొల్లమొగ్గలఁ జేర్చి
పల్లవోష్ఠము దంతపంక్తిఁ జూచి
పంకేరుహముల నుత్పలములజత లుంచి
మొగమును గనుదోయిసొగసుఁ జూచి
కనకకోరకము చెంగట మల్లెవిరి యుంచి
నాసయుఁ దమ్ముఖషణంబుఁ జూచి
చిగురుటాకుల చెంత మొగలిరేకులు గూర్చి
కరతలంబులు నఖాగ్రములు చూచి
గీ. విరులు గొన వచ్చి యువజనుల్ మరుని బారిఁ
జనుటఁ గని జాణతనమునఁ గొనుఁడు పూల
బంతు లని కేలు వక్షముపై ఘటించి
విలువఁ దె మ్మంద్రు పుష్పలావికలు పురిని. 166

గీ. వరఫలావాప్తి మహిపాలవరులఁ జేరు
నాశుకవులకుఁ జె య్యెత్తి నాచయంబు
కరము పల్లవరుచికి డగ్గఱిన సాంక
వమునఁ దేల్తురు చేలలో వనిత లచట. 167

వ. ఇవ్విధంబున నొప్పునప్పురవరంబున కధీశ్వరుండు, 168

క. శాంతుఁడు భూనుతసుగుణని
శాంతుఁడు బుధబాంధవార్థిసత్కవిజనతా
చింతామణి యలరారున్
జింతామణినృపతి భువి నజేయుం డగుచున్. 169

సీ. కృతవసుదేవసంతతపూజనాధ్యుండు
సాధుబృందావనేచ్ఛారతుండు
సతతసౌకర్యసంభృతధరావలయుండు
మంజువాక్సత్యభామాప్రియుండు

గుహయశోదానందకరనిజచతురుండు
భోగిచూడామణిస్ఫుటపదుండు
ప్రహ్లాదవరదానభాసురాభ్యాసుండు
పుణ్యజనామోదపోషకుండు
గీ. ధరణిఁ బురుషోత్తమఖ్యాతిఁ దనరె నమిత
రాజకోటీరఘటితదిరత్నసూత్న
రత్నఘనశాణకషణనిర్మలపదాబ్జ
దీప్రనఖమణిసుప్రభుం డాప్రభుండు. 170

కం. నరసింహమూర్తి యగు నా
కరుణాభరణుఁడు హిరణ్యకశిపుక్షేత్రా
దరదానగరిమ సదయ
త్వరితప్రహ్లాదదృష్టతావిస్ఫూర్తిన్. 171

సీ. తనరణోద్భటశక్తి దనుజారిపదభక్తి
హరికుమారసమాఖ్య ననుకరింపఁ
దనదానవిస్ఫూర్తి యనుపమానసుకీర్తి
సాంద్రచంద్రప్రకాశంబు దెలుపఁ
ఘనసంతతవిభూతి ఘనశౌర్యవిఖ్యాతి
పంచాననస్ఫుటప్రతిభ నెఱపఁ
ఘనధీరతాబుద్ధి వినుతక్షమాసిద్ధి
తతధరాఖ్యాసమగ్రత వహింపఁ
గీ. ప్రాభవము గాంచె దిగ్వధూఫాలభాగ
మహితఘనసారతిలకాయమానకీర్తి
చంద్రికాస్ఫూర్తి సుమబాణసదృశమూర్తి
శత్రుసమవర్తి యారాజచక్రవర్తి. 172

గీ. వరుణునకు సాటి యాధరావరుఁడు దెలియ
సంతతాశాంతరక్షణోదాంతలీలఁ
గుంభజుని బోలు నాధరాజంభవైరి
దక్షిణాశాప్రసాదకోదయనిరూఢి. 173

కం. రామ నల నృగ భగీరథ
భూమీశులకరణిఁ బ్రజలఁ బోషింపుచు ధా
త్రీమండలమున నాచిం
తామణినృపమౌళి బుధనిధానం బయ్యెన్. 174

గీ. ఆమహారాజుసుతుఁడు విఖ్యాతి గాంచె
తొమ్మెతేంద్రుఁడు కందర్పకేతుఁ డనఁగఁ
దనకు జనకునకు విభేదంబు లేక
దీపమున సంభవించినదీప మనఁగ. 175

ఉ. భూనుతసత్కళాభరణభూషితుఁ డై యరిభీకరుండు నై
యానృపసూనుచంద్రుఁ డుదయం బయినం బ్రజ లెల్ల సత్వస
న్మానితలీల గోత్రహితమంజులజీవనవృద్ధిఁ గాంచి యం
భోనిధులో యనంగ మదిఁ బొంగిరి శ్రీరమణీప్రియాధ్వృతిన్. 176

సీ. ఫలజాతినిగ్రహములు వాదములయంద
ఖలయుక్తి కలమభూతలములంద
రాజవిరోధంబు రాజీవములయంద
యగ్నితులాశుద్ధి హైమమంద
వితతదుశ్శాసనోద్ధతి భారతమునంద
కంటకబుద్ధి యోగములయంద
నిరతపరీవాదసరణి వీణలయంద
ప్రచురనాస్తికత చార్వాకులంద

గీ. కాన నగుఁ గాని యిట్టియోగములు ప్రజల
యెడలఁ బొడచూప వయ్యె నల్లడల నీతి
శాస్త్రనిగదితకార్యవిచారసరణి
నమ్మహీజాని ధర యేలునవసరమున. 177

మ. సురనారీపరిరంభణోత్సుకభటస్తోమాద్భుతధ్వానభా
స్వర మై యస్త్రనదీశతాంకితము నై సంగ్రామరంగంబు సా
గరలీలం దనరార భిన్నగజరక్తవ్యాప్తిఁ గన్పట్టు న
త్కరవాలంబు జయేందిరాచరణలాక్షారాగయోగాకృతిన్. 178

వ. మఱియు నబ్భూమండలాఖండలుండు సముద్రుండునుంబోలె సమకరప్రచారుం డై, మేరునగంబుచందంబున విబుధాలయుం డై, పరమేశ్వరునివిధంబున మహాసేనానుగతుం డై, భానుమంతునిభాతి ఛాయాసంతాపహరుం డై, మనోభవునిలీల జనితానిరుద్ధవిభవుం డై, దిలీపునిరీతి సుదక్షిణాన్వితుం డై, దశరథునివైఖరి సుమిత్రోపేతుం డై, హిమవంతునిపగిది జనితశివుం డై, మందారచలంబు పగిది ననంతభోగపరివేష్టితుం డై, యామినీప్రియునిభంగి సన్మార్గనిరతుం డై, పురందరుని తెఱంగున బుధగురుకావ్యాదరుం డై, ఫణిసార్వభౌమునివిధంబున రసాతలాధీశ్వరుం డై, వసంతునిరీతి నానారామానందకరుం డై, పారిజాతంబుకైవడి నాశ్రితనందనుం డై, పుండరీకాక్షునికరణి క్రోడీకృతసుతనుం డై, కౌరవవ్యూహంబుహోర సుశర్మాధిష్ఠితుం డై, శరన్మేఘంబుపోలిక కేవలాలంబితవిష్ణుపదుం డై, వర్షాంబువాహంబులీల విమలతరవారిధారాత్రాసితరాజహంసమండలుం డై, సుబాహుం డయ్యును రామానుకూలుం డై, సమదృష్టి యయ్యును మహేశ్వరుం డై, ధృతరాష్ట్రుం డయ్యు గుణప్రియుం డై, విద్యాధరుం డయ్యు సుమనోవరుం డై, క్షమానుగతుం డయ్యు సుధర్మాశ్రయుం డై,

నాయకరత్నం బయ్యు నతరళస్వభావుం డై ధరాపరిపాలనంబు
సేయుచు నొక్కనాఁడు. 179

సీ. శశికాంతమణిగణస్థగితభూములతోడ
నీలపురాలతిన్నియలతోడ
నిలువుటద్దములు పన్నినకుడ్యములతోడఁ
బటికపుగుండ్రకంబములతోడ
వన్నె లీనెడు జాళువాదూలములతోడఁ
గలధౌతమయవిటంకములతోడఁ
దీరైన కెంపులచూరుమొగ్గలతోడ
మరకతంబుల గుజ్జుపరువుతోడఁ
గీ. దగడు మెఱుఁగులద్వారబంధములతోడఁ
బచ్చపగడపుఁదలుపుల బారుతోడఁ
గళ లలరు వ్రాఁతపనుల మేల్కట్లతోడఁ
జూడఁ దగు నంతరంబుల మేడలోన. 180

కం మలయానిలములు చెంగట
మలయన్ ధగధగ వెలుంగుమణిదీపము లు
జ్వలలీలఁ దనరఁ బలువె
న్నెలఁ జెలు వలరారు యామినీసమయమునన్. 181

ఉ. శిల్పిచమత్క్రియాబలవిశేషసమంచితపద్మరాగసం
కల్పితహైమమంచపరిగణ్యమరున్మృదుహంసతూలికా
తల్పమునందు మే నలరఁ దా నొకశేమశయానుఁడో యన
న్బొల్పలరారఁగా నిదురఁ బోవుచునుండె నృపాలుఁ డయ్యెడన్.

గీ. తూర్పు తెలు పెక్క మరునంపదొనలు చిక్కఁ
బద్మములు విక్క బంభరతటలి సొక్కఁ

గుముదములు ప్రసుక్క జాబిల్లి కొమరు దక్క
వేగ జా మిక్క గన నయ్యె వేగుఁజుక్క. 183

సీ. నీరధీశ్వరభామినీసఖీకరతల
చ్ఛాయాంకరాజతచ్ఛత్ర మనఁగఁ
బశ్చిమాశాధీశభామినీకర్ణాంత
రాంకితవజ్రతాటంక మనఁగఁ
బాశహస్తాంగనాభ్యాసహస్తాలోల
చంద్రకాంతోపలచషక మనఁగ
వరుణలీలావతీచరణపీఠీకృత
స్ఫటికశీతలశిలాశకల మనఁగ
గీ. యామినీయమునాతటోద్యత్సమగ్ర
ఫేనమో యనఁ జరమపాథోనిధాన
తీరసముపేతశంఖదీధితిఁ జెలంగి
కైరవాప్తుండు చూడ నొప్పారె నపుడు. 184

చ. జలజల రాలు శీతకరజాతహిమాంబువు మీఁదఁ గ్రమ్మినం
గలువలపుప్పొడుల్ బురదగాఁ బద నెక్కినఁ ద్రొక్కలేక పై
నిలిచి మరంద మాని నలినీవనవీథుల సంచరించు న
య్యళులరొదల్ ముదం బొసఁగె నయ్యెడ మేల్కనుమానవాళికిన్.
కం. పొలయలుకలతోఁ బతులం
గలయనిజ్యోత్స్నాభిసారికల నిద్దుర మే
ల్కొలిపి యుపరతులఁ గలిపెం
గలకలనాదముల శారికలు నిలయములన్. 186
సీ. కాంతలభంగి పోత్కలికాకృతులు గాంచి
దనుజులగతి నిశాంతముల మెఱసి

యుల్పలరీతి స్నేహం బంతయు హరించి
జరఠులుబలె దశాంతరము నొంది
యస్త్రాద్రు లనఁ బతంగాపతనముఁ జెంది
యార్యులదారిఁ బాత్రాప్తి గాంచి
కానములపోల్కి ఘన తేజమున హెచ్చి
యధములలీల దోషాఢ్యత గని

గీ. మొదల మ్రింగినచీకటు లుమ్మదిమిలోన
నొదిగి యుండక బయ లెక్కెనో యనంగ
ధూమరేఖలు పయిఁబయిఁ దొంగలింప
వెలవెలఁ బాఱె దీపము త్రైలిపి దొలఁగి. 187

). అలపులు దెలుపు వాలారుచూపులతోడ
విడవిడఁ బాఱు క్రొమ్ముడులతోడ
నీవులు జాఱు చెంగావిచీరెలతోడఁ
గరఁగినయంగ రాగములతోడఁ
బలుమొన ల్నాటి కన్పట్టుమోవులతోడఁ
గళలు ఛొక్కిననెమ్మొగములతోడఁ
గొనగోటిచెనకు లంటినకుచంబులతోడ
రహి గిరిగొన్నహారములతోడ

గీ. బొమలు దిగజాఱుకస్తూరిబొట్లతోడ
నడుగుఁదమ్ములు తడఁబడునడలతోడ
రమణు లొప్పారి ప్రియమందిరములు వెడలి
రట్టియెడఁ జూపరకుఁ బ్రియం బావహిల్ల. 188

ఏ తళుకుంజూపులు నీలపుంగురులు నిద్దం బైననెమ్మోము కెం
దలిరాకుంజిగిమోవి విప్పు లగుకన్దమ్ముల్ జొకాటంపుగు

బ్బలు బా గైనపిఱుఁదులుం గలిగి తేఁ బ్రాయంపుఁ బ్రో వైనయొ
క్కలతాంగిం గలఁ గాంచి లేచి యది నిక్కం బంచు రా జయ్యెడన్.

ఆ. వె. కలను గాననైన కామినీరత్నంబు
తనమనంబులోన దాఁగియున్న
నిదురఁ దెలిసి తెలియనేరనిచందాన
బయలు గౌఁగిలించుఁ బలవరించు. 190

కం. నలుగడలఁ జూచుఁ దెలియక
కలవరపడు నెచట నుంటి కలకంఠీ! కౌఁ
గిలి యీవె యీవె యనుచున్
బిలుచు న్మదిలోనఁ దలఁకు బెగ్గిలియుండున్. 191

కం. లలనా నీ వీగతితోఁ
గల నాడెస నిలిచి చేరికల నామెడ మా
యలనాట్యము సలిపిన గా
కల నానాఁటికిని దాళఁగల నా యనుచున్. 192

మ. పరిభూతోచితకార్యసత్క్రియుఁడు నప్రారంభితాహారుఁ డం
తరితోద్యోగుఁడు మారఘోరశరసంత్రస్తప్రభావుండుఁ ద
త్తరుణీవక్త్రపునర్విలోకనసముద్యద్వేగవంతుండు నై
ధరణీపాలకుఁ డోవరి న్మెలఁగె సంతాపంబు దీపింపఁగన్. 193

కం. కటకట యాభూపాలుఁడు
కటకజనాలక్షితప్రకాశుం డగుచున్
గటకములు జాఱ ఘనసం
కటకటితటఘటితపాణికమలుం డయ్యెన్. 194

ఆ. వె. మేను శయ్యఁ జేర్చి మానసవీథి నా
రణితనూపురమణి రమణి వెదకి

కనుఁగొనంగలేక కనుగొనల్ ముకుళించి
తలుపుఁ జేరఁ జేర్చెఁ దలఁపుగతిని. 195

గీ. అంతఁ గందర్పకేతుభూకాంతుఁ డిట్లు
విరహదశ నుండు టెఱుఁగక పరిజనంబు
లాక్రమం బెల్ల నెఱిఁగించి రాక్షణంబ
భూమిపతిహితు మకరందనాముఁ జూచి. 196

వ. అప్పుడు, 197

కం. మందరధీరుఁడు విభవపు
రందరుఁడు ముకుందమందిరాయితహృదయా
నందకళాపూర్ణుఁడు మక
రందుఁడు కందర్పకేతురాయనికడకున్. 198

చ. వడిఁ జనుదెంచి కాంచె నొకవంక వసించి యతండు శయ్యపై
విడవిడఁ బాఱుజాఱుసిక వీనులఁ జిక్కులుగొన్న ప్రోఁగులుం
దడఁబడుహారముల్ చెలువు దప్పి కనందగు మోముచందముం
ముడివడుభ్రూవికారములునుం గల రాజకుమారశేఖరున్. 199

కం. కాంచి దృగంచలసంచల
నాంచద్రుచి మించి రాక యాతేని కెఱిం
గించినఁ జంచత్కాంచన
మంచస్థలి నుంచె నతని మహిపతి యంతన్. 200

గీ. కమలములు బాలభానునిఁ గాంచినట్లు
కైరవంబులు జాబిల్లిఁ గన్నయట్లు
సఖునిఁ గనుఁగొన నృపునీక్షణము లలరె
మందమందస్మితంబు లందంద నిగుడ. 201

కం. అంత రతికాంతకుంతా
క్రాంతతచేఁ గొంత వింతగాఁ జింత నిజ
స్వాంతస్థితకాంతాగత
సంతాపముఁ దెలిపి యంత జనపతి వంతన్. 202

వ. ఊరకున్నం జూచి మకరందుం డి ట్లనియె. 203

చ. ఇది తగునే ధరాతలమహేంద్ర మనంబున వంత యేల నీ
పదములు గొల్చి భూవిభులు పల్మఱుఁ గప్పము లిచ్చుచున్ భవ
త్సదనమునందు దాస్యములు సల్పఁగ శాత్రవులెల్లఁ గానలన్
మదమఱి యుండ నీవు మహిమండల మేలుచు నుంకి యుండియున్.

సీ. కటక కర్ణాట బంగాళావనీశులు
ద్రవిడ కేరళ శక ధరణిపతులు
కరహాట వరహాట కాంభోజనృపతులు
కొంకణ టెంకణ క్షోణివిభులు
వంగ విదర్భ లాటాంగధాత్రీశులు
పాండ్య కుంతల మహీపాలవరులు
చోళ కరూశ నేపాళాధినాథులు
నాంధ్ర సౌరాష్ట్ర దేశాధిపతులు
గీ. తావకీనపదద్వంద్వదర్శనంబుఁ
గోరి యున్నారు వారల గారవించి
సెలవు దయచేయవలెఁ గాక యెలమిఁ దప్పి
యిట్లు చింతింప నగునె ధాత్రీశ నీకు. 205

వ. అని మఱియు నతనిచిత్తం బన్యాయత్తం బయ్యె నని నిశ్చయించి యోకందర్పకేతుభూకాంతా ! నీస్వాంతంబు చింతాసంతాపలేశా క్రాంతం బై, విషతరుప్రసవగంధానుభవంబుచందంబున క్షణ

క్షణాతిమోహవిధాయకం బై, మత్తమాతంగపరిభ్రమణంబు
వడువున స్వవశాలోలనిరీక్షణం బై, కాముకచరితంబునుంబోలె
నానానురక్తవిభ్రమం బై, యంధకారంబువై శిఖి దోషానుబంధ
చతురం బై బహువిధంబులం బ్రవర్తింపుచున్నయది. ఇది యసాధు
జనోచితరీతి భవాదృశులకుం దగదు గావున సన్మార్గం బవలంబించి
యాహ్నికవ్యవహారంబు సలుప నుద్యోగింతుగాక యనిన నతని
కతం డి ట్లనియె. 206

సీ. తరువులనీడ నెంతయుం బరాగము గ్రమ్మ
గంతులు వైచుచు బంతు లాడి
యక్షరాభ్యాసమాదిగా సకలశా
స్త్రము లొజ్జపజ్జం దత్పరతం జదివి
వెన్నెలనెలరాలతిన్నెలపై నుండి
నృత్తగీతాదులనేరు పెఱిఁగి
మన సెఱుంగంగరానిమర్మముల్ దలపోసి
యార్జితమంత్రంబు లూహ జేసి
గీ. కార్యదక్షుండ వగుచుం బ్రఖ్యాతి గాంచి
ప్రబలితివి ప్రాణసఖుండవు బాంధవుండవు
నామనంబున నున్నసంతాప మెల్లం
గినుక సేయక వినందగు ననఘచరిత. 207

ఉ. నిన్నటిరేయి నాయెదుర నిల్చెం గలం గలకంఠి యోర్తు యా
కన్నులం గల్కి-ం జూడం దెఱగంటిమిటారియొ, నాగకన్యయో
యెన్న మనుష్యభామినియొ, యెందుం గనుంగొన మట్టిరూపసం
పన్నవయౌవనోదయవిభాసురచంచలదృగ్విలాసముల్. 208

కం. కలకంఠి నాదుచెంగటం
గల నేటికి మాయచేరికల్ం దిరిగెం జి

ట్కులతే రిడఁగర బలుధా
కలపాలై నిర్వహించఁగలనా సఖుఁడా. 209

గీ. కలికికురులకు సామ్యంబు గాంతు ననుచుఁ
బోరి సరిరాక నీలముల్ పూఁటఁ గఱిచెఁ
గనకసౌభాగ్య మేమియుఁ గనక పోదలు
దూఱి వేఱొకజాతికిఁ జేరె నళులు. 210

కం. ఆననలావణ్యసుధాం
భోనిధిలో నీఁదులాటఁ బొల్పారెడు పా
ఠీనద్వంద్వం బనఁగా
మానినికనుదోయి మెఱసె మానితలీలన్. 211

చ. కలువల డీలుచేసియును గాముశరంబులఁ బోలి సోగలై
తెలివిఁ జెలంగుచోఁ దమగతిప్రసరంబుల నడ్డగించె శ్రీ
లలితవిభూతిఁ గర్ణయుగళం బని కిన్క జనించెనో యనం
గలికి మెఱుంగుఁబోఁడికడకన్నులఁ గెం పలరారు నింపుగన్. 212

గీ. కువలయప్రియసంతతోత్సవముఁ జెందెఁ
గళల నలరారెఁ దారకావిలసనంబు
గాంచి రాణించె నెన్ని వైఖరుల నైనఁ
బడఁతినెమ్మోము చంద్రబింబంబు నిజము. 213

క. తను సూనలతాపల్లవ
ఘన వదన నిశాకరోదయస్ఫుటసాయం
తనరాగ మనఁగ విద్రుమ
ఘనరుచి కెమ్మోవి దనరుఁ గాంతామణికిన్. 214

గీ. నయన లావణ్యజలధిబంధన మనంగ
దశన రత్నావళీతులాదండ మనఁగఁ

గనకకోరకసౌభాగ్యకలన లలన
కలరు నాశిక తిలపుష్ప మపహసించి. 215

చ. నవనవలీలతోడుతఁ గనందగు వీను లలంకరించి వై
భవమున హెచ్చు రత్నముల పౌజులకమ్మల మేలుడాలుపైఁ
దవిలి వెలుంగు నౌర ప్రమదామణిచెక్కులు పంకజాతబాం
ధవరుచిదిగ్ధహేమమయదర్పణదీప్రవిభాసమగ్రతన్. 216

కం. వనితకనుబొమలు శింగిణు
లనఁదగు దృగ్మదనశరసహాయము లగుటం
గనకాంగినాసలు లేనెల
కెన యగు మృగమదకళంక మేపారుటచేన్. 217

గీ. తరుణి శైశవ మను పగదళముఁ దఱుమఁ
జిత్తజుం డంతఁ గుచదుర్గసీమ హత్తి
దిట్టయై గెల్చి పూరింపఁ బట్టినట్టి
శంఖమో యన గళ మొప్పెఁ జంద్రముఖికి. 218

సీ. అసమానమానమానససమానసోద్భూత
కనకసారసకోరకంబు లనఁగఁ
గాకోదరప్రభాకల్పరోమావళీ
లతికాప్రభూతఫలంబు లనఁగ
[illegible]రవల్లీమృణాళాదనేచ్ఛాలోల
ఘూర్ణణాంచద్రథాంగంబు లనఁగ
శంబరాంతకరిరంసాస్థలాయితహేమ
లాలితక్రీడాచలంబు లనఁగ

గీ. జవ్వనం బను పన్నిటిచెలువుతోడఁ
గొమరుమిగిలిన బంగారుకుండ లనఁగఁ

గంతుపూఁదోఁటలో విరిబంతు లనఁగ
నలరె లలనకు వక్షోరుహములు భళిర. 219

మ. సరసీజాక్షభవుం డురోభవసిసృక్షావేళ ధీచాతురిన్
గిరిసారం బొనఁగూర్చి తద్గురుభరాక్షేపంబుఁ జింతింపుచున్
గిరిసారస్ఫుటకీలలం దుదల నిక్షేపించె నా నొప్పె వి
స్ఫురదగ్రప్రతిభామనోజ్ఞరుచి వక్షోజంబు లాయింతికిన్. 220

గీ. అతివభుజములు బిసలత లైనయపుడె
శయము లెంచంగఁ దత్కుశేశయము లయ్యె
నంగుళులయందు నూర్మిక లలరుచుండ
నాతిముంజేతులకుఁ గంకణంబు లరుదె. 221

చ. అతనుఁడు నాభికూపమున నంచితలీల మునింగి తద్వళి
త్రితయముపేరి మెట్ల నొకరీతిఁ గసందగు నారుదారిసం
గతిఁ జని తత్పయోధరశిఖాధరణీధరలింగమూర్తులం
బ్రతిదినమున్ భజించి సిరి పట్టె ననం దనరారె నెంతయున్. 222

ఆ. వె. అంబరం బనంగ నచ్చోట సంశయ
మేల యట్ల యగును బాలకౌను
ఘనపయోధరములు గనవచ్చె నామీఁద
సాంద్రచంద్రరుచులుఁ జౌక యయ్యె. 223

కం. హరిణాక్షినితంబస్థలి
ధరణీమండలి యనంగఁ దథ్యంబుగ సు
స్థిరతం దగుఁ బై రత్నా
కరమేఖలలీల సాక్షి గాదే తెలియన్; 24

గీ. తరుణిమోద్దండమత్తవేదండతుండ
కాండము లనంగ విజయసంఘటితపంచ

శరపురద్వారకదళికాస్తంభము లన
నూరువులు చంద్రముఖి కలరారు నౌర. 225

కం. తలిరాకుంగ్రైదువు గల
వలరాయఁడు గట్టువింటివానిం గడకేఁ
గెలిచి మొరయించు జయకా
హాళము లనన్ జంఘ లలరె నంబుజముఖికిన్. 226

గీ. కలికిపదనఖములపోల్కిఁ గంటి మనుచు
మించి తారలు మిన్నంది మెఱసె నౌర
కాంతమీఁగాళ్ళతో జత గానికతన
నహహ కూర్మకులాధీశుఁ డడుగు వట్టె. 227

గీ. అతివపదములు చివురాకు లైనయపుడు
తన్నఖంబులు సితలతాంతమ్ము లయ్యె
నాతియడుగులు పుష్కరఖ్యాతి గనిన
నానఖంబులె తారక లై యతిశయిల్లె. 228

సీ. వర్షాభ్రలక్ష్మియో వనిత సముల్లస
ద్ధారపయోధరోదయముఁ జెందెఁ
గురురాజుబుద్ధియో కోమలి కర్ణవి
శ్రాంతదృగంతవిభ్రాంతి నలరె
వింధ్యభూమూర్తియో వెలఁది తుంగశ్యామ
లకుచసౌభాగ్యలీలలఁ జెలంగె
వానరసేనయో మానిని సుగ్రీవ
నీలాంగదాప్తి రాణించి యుండె

గీ. గురుకటిద్వయలోహితాధరము వికచ
లోచనోత్పలములఁ జంద్రరోచమాన

హాసమును మందగతి భాస్వదంఘ్రియుగళి
సౌమ్యతయుఁ గాంచె గ్రహసమస్యయె లతాంగి. 229

సీ. గళకాంతి కోడి భగ్నం బయ్యెఁ గముకంబు
కంబు లింకేమి ప్రఖ్యాతి గాంచు
ముణుఁగు రేలను బద్మములు మోము సరిరాక
రాకచందురుఁ డెంతప్రభ వహించుఁ
గాఁకలఁ బడె మేనికళఁ జూచి బంగారు
గారుడం బాడసాగదు చపలకు
నధరంబుఁ జెనకఁ దా నల్లాడుఁ జిగురాకు
రాకునెన్న హతి కెంపురవలకెల్ల

గీ. నింత వర్ణింపఁగా నేల నింతిసొబగు
నాలుగై దాఱుమోముల వేలుపులును
వినుతి సేయంగ నోపరు వేయు నేల
వేయిమోములదొరకైన వింత సేయు. 230

ఉ. కన్నులఁగట్టినట్లుఁ బొడకట్టెడుఁ గన్నియచిన్నె లెల్ల నా
కన్నియ నేమనందగు హృదంతరతాపము దీఱఁ గూర్మితో
నన్నలినాయతాక్షిమధురాధరబింబసుధారసంబు నా
కెన్నటికైనఁ గల్గునొకో యీజననంబునకుఁ ఫలంబుగన్. 231

కం. దితియుంబలె మామకమతి
శతమన్యుసమాశలత విచారము గనె స
న్నుతచరిత నిన్నుఁ గాంచిన
కతమున నీపాటిశాంతి గలిగెం దెలియన్. 232

వ. అది గావునఁ దెలుపు కార్యాకార్యవిచారంబు నామనంబునం
జొరదు. మనోజాతకేలికీలాభీలజ్వాలావలీఢం బయ్యె హృదయంబు,

సంగంబున సంగారకణంబు లుద్భవిల్లెను. ధైర్యంబు ద్రొఅంగిన చందంబున నున్నయది. సమయోచితవిహారంబు సలుపవలయు. మదీయభేదమోదానుభవంబు నీకు నవశ్యకర్తవ్యంబు గదా! పద మని మకరందుండునుం దానును నమ్మహీతలేశ్వరుండు పరిజనాలక్షితుం డై దూరం బరిగె ననంతరకథాప్రసంగంబు, 233

మ. శరవిద్యాబలరామ రామపదకంజద్వంద్వసంభావనో
దరభాగ్యాంచితకామ కామజననీతారుణ్యలాస్యోల్లస
త్కరుణావీక్షితధామ ధామవిభవోద్దామారవిందాభవ
క్త్రరమానిర్జితసోమ సోమనిభరంగత్కీర్తికాంతామతా. 234

కం. గిరికిరికరిహరిభరహర
నిరతధరాభరణచరణనికటనటద్వి
ద్ధరణీవరమకుటాంతర
గురుతరమణికిరణ శత్రుకులసంహరణా. 235

మాలినీ.

పరిహృతరిపుజాలా పాలితస్వాశ్రితజాలా
సరసగుణనితాంతా సాధులీలాతిశాంతా
నరమతగుణకాంతా నానటత్కీర్తికాంతా
కరధృతహరిణాంకా ఖడ్గనారాయణాంకా. 236

గద్య. ఇది శ్రీ వక్కలంక చంద్రశేఖరమహాకవిపౌత్ర భాస్కర
సుకవిపుత్త్ర విద్వజ్జనవిధేయ వీరభద్రనామధేయ విరచితం
బైన వాసవదత్తాపరిణయం బను మహాప్రబంధంబు
నందుఁ బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు

# వాసవదత్తాపరిణయము

## ద్వితీయాశ్వాసము



మత్పీఠాపుర కం
తీమాధవదేవపాదనీరజసేవా
సామర్థ్యలబ్ధవిజయర
మాముఖ్యసహాయ రావు మాధవరాయా. 1

వ. అవధరింపు మట్లు చనిచని ఫురోభాగంబున, 2

చ. కనుఁగొనియెం బురస్ఫుర దగస్త్యమహాముని రాజవాక్యపా
లన మతిరుద్ధమేరుజయలక్షణలక్షితశృంగనానట
ద్వనచరబాలికావిధృతవంశసముద్భవమౌక్తికప్రభా
జనితవలక్షరూపతటజాతతమాలము వింధ్యశైలమున్. 3

సీ. సురసుందరీమనోహరపాదయావక
మండితయూధికామంటపంబు
సితగరుత్తరఝురీగతమరుద్వ్రాతదరీ
ఫణిఫణామణివిభాభాసురంబుఁ
జటుశిఖాముఖవృతస్ఫుటతరాగరుగంధ
బంధురదవమరుద్బాంధవంబు
హృద్యవిద్యాధరవాద్యవిద్యాళీక
ఘననాదనృత్యచ్ఛిఖావళంబుఁ
గీ. గుంజదళిపుంజమంజునికుంజసదన
మదనకదనామరాదృతమ[illegible]రమధుర

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

తాత్కాలిక అధ్యక్షులు

విమర్శకాగ్రేసర. ఐతిహాసిక సమ్రాట్టు

శ్రీ బండారు తమయ్య

ప్రధాన కార్యదర్శి, కోశాధికారి

శ్రీ దంటు భాస్కరరావు

సహాయ కార్యదర్శి

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి

కార్యనిర్వాహకవర్గ సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రి
2. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి (బాలవ్యాస)
3. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (వ్యాకరణ విద్యాప్రవీణ, భాషాప్రవీణ)
4. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర)
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తు
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ
7. డాక్టరు శ్రీ ఇనటూరి జోగారావు, (యం. బి. బి. యస్.,)
8. శ్రీ చిరువోలు కోటీశ్వరరావు
9. శ్రీ దామెర రాజగోపాలరావు, బి. ఏ.
10. శ్రీ వేదుల రామచంద్రకీర్తి, ఎమ్. ఏ. (ఆనర్సు)
11. శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రి (ఉభయభాషాప్రవీణ)
12. శ్రీ కావలి శ్రీరామమూర్తి, బి. ఎ. బి ఎల్.

పత్రికా సంపాదకుడు

శ్రీ కుందూరి ఈశ్వరదత్తు

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

వ్యవస్థాపకులు

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు

బహద్దరువారు సి. బి. ఇ., డి లిట్, పిఠాపురము

మహారాజా వారు



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

సంపుటము 53. ఆశ్వయుజ—కార్తీకములు సంచిక ?

సంపాదకుఁడు : కుందూరి ఈశ్వరదత్తు.

విషయసూచిక

సంపాదకీయము

# ఆంధ్రభాషాతత్త్వవేదులకు నివేదనము

"సరస సంస్కృతి పుష్ప గుచ్ఛప్రభాత
మగు తెనుంగను నెత్తావి కఖిలదిశలఁ
దరుణపవమానమగు కవిత్రయ విశేష!
చతురవాచా నిరూఢికంజలియొనర్తు"

మల్లన-రాజశేఖర చరిత్రము

పున్నెము పండిపండి మన భూమి కవిత్రయమున్ గడించెరా!

తుమ్మల సీతారామమూర్తి

కవిత్రయము వారి యాంధ్రభారత ప్రశస్తి భరతఖండము నందేగాక పాశ్చాత్యదేశములకును వ్యాపించిన సంగతి ఆంధ్రులు గర్వింపఁదగినది. మహారాష్ట్రదేశములోని పూనానగర భాండార్కర్ ప్రాచ్య పరిశోధకమండలివారు సంస్కృత భారతమునకు దేశదేశాంతరముల నుండి ముద్రితాముద్రితప్రతుల సేకరించి, ఒక్కొక పర్వ ప్రకటనమునకు సంస్కృతాంగ్లభాషలలో సర్వతోముఖ పండితులగు సంపాదకుల నియమించి, దాదాపు అర్థశతాబ్దము పరిశ్రమించి, పాఠభేదములతో సుపరిష్కృతమైన మహాభారతమును బ్రకటించి, భరతఖండము నందేగాక యావద్భూమండలమునందలి వివిధభాషావేత్తల కృతజ్ఞతకుఁ బాత్రులైరి. ఆయాప్రతుల సేకరణమునందు తంజావూరు లోని తెలుఁగు లిపియందు వ్రాయఁబడిన సంస్కృతభారతము సహితము పాఠభేదముల కొఱకు పరిశోధించిరి. దీనితో బాటు వారు భాషాంతరీకరణమైన కవిత్రయము రచించిన ఆంధ్రభారతమును బరిశోధించి, మూలములోని శ్లోకసంఖ్యా నిర్ణయము గావించి, యందును నన్నియభట్టు వ్రాసిన ఆదిపర్వములోని పర్వసంగ్రహమునందు ప్రతి పర్వమునందుఁ గల శ్లోక సంఖ్యా వివరణము ప్రాతిపదికగాఁ గొని మూలములోని శ్లోకసంఖ్యల లెక్కకుఁ గొనిరి. ఈ విషయమే వారి

దాక్షిణాత్య గ్రంథపరిష్కరణ ప్రతులకును, ఔత్తరాది గ్రంథ పరిష్కరణ ప్రతులకును విభేద, తారతమ్య, నిర్ణయమునకు మూలమైనది. వారేమి వ్రాసిరో యిందుదాహరించెదము.

"Nannaya's version is valuable for the light it throws on the Condition of Southern Recension-strictly speaking of the Telugu version in the eleventh century, especially in view of the fact that Nannaya has included in his poem an accurate rendering of the parva Sangraha giving number of slokas in each parva of his Maha Bharata. The figure for the stanzas of Adiparva is 9984 which shows that the text used by Nannaya must have been substantially the same size as that preserved in the extant Southern manuscripts" (Introduction to Adiparva-pages xxvi — xxvii)

అట్లే వారు భీష్మపర్వ పీఠికలో తిక్కన మూలములోని భాగమునకు భాషాంతరీకరణములో నట్టి విచ్ఛిత్తిని దెచ్చినాఁడో వ్రాసి యున్నారు.

(Introduction to Bhismaparvam — Poetical embellishments of Tikkana Page civ)

సంస్కృత మహాభారతము సుపరిష్కృతపాఠ భేదములతో భాండార్ కర్ ప్రాచ్యపరిశోధక మండలివారు ప్రకటించిన విధముననే, నేఁడు ఉస్మానియా విశ్వవిద్యాలయము వారు ఆచార్య లక్ష్మీరంజనము గారి సంపాదకత్వమున ఆంధ్ర భారతమును పరిష్కృతపాఠ భేదములతో ప్రకటింప నుద్యుక్తులైనారు. ఈ కార్యమొకనాఁడయ్యేడిది కాదు. సమగ్రముగా, సప్రమాణముగా వారు దీనిని ప్రకటింప నేత్తురని మా అభిప్రాయము. భాండర్ కర్ పండితమండలి వారు, ప్రతి పర్వమునకు ప్రధానసంపాదకుని గాక ప్రత్యేక సంపాదకుని సహితము నియమించి, వారి కార్యము నిర్వహించిరి. ఆయాపర్వములు

పీఠికలై వారి పాండిత్యమునకు పరిశ్రమమునకు నికషోపలములు. ఆ విధముననే ఆంధ్రభారత పరిష్కృత పాఠ ప్రచురణమున కాంధ్ర దేశములోఁ గల అంధ్రాంగ్ల సంస్కృత భాషా వేత్తలను నియమించి నిర్దుష్టమైన ప్రతిని బ్రకటింపఁ బ్రార్థనము. ఇట్టి కార్యములు కాల పరిమితికిఁ గాని, నిర్ణయమునకుఁ గాని కట్టువడి యుండనవసరము లేదు. సంస్కృత భారత ప్రచురణమునందొకొక్క పర్వము ప్రకటించుటకుఁ జాలకాలముపట్టినది. తెలుఁగున నట్టి కష్టమక్కఱలేదు. మన భాగ్యవశమున పరిష్కృత సంస్కృత భారతము లభించినందున కవిత్రయము వారవలంబించిన సంస్కృతమూలము సులభముగ గ్రహింపవచ్చును. అట్టియెడ మూలానుక్రమముమూలాతిక్రమము,పదనిర్ణయము, మొదలగు భాషావిషయముల నిర్ణయించు పట్ల కష్టము లేదు. ఆంధ్ర కవుల భాషాంతరీకరణములు మూలానుసరణములై యున్నవి. ఇఁక పద నిర్ణయమే ప్రధానము.

### నన్నియ్యభట్టు నందంపూడి శాసనము

ఈ శాసనమును మొదట పరిష్కరించి, నాల్గవ ఎపిగ్రాఫియా ఇండికా శాసన సంపుటములోఁ బ్రకటించిన వాఁడు జర్మను దేశ పండితుఁడైన కీల్‌హారన్ దొర, ఆఁగ్లమున నున్నది. దీనినే తెలుఁగు భాషలో మొట్టమొదట శ్రీ జయంతి రామయ్య పంతులుగారు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక ప్రథమ సంపుటము ప్రథమ సంచికలోఁ బ్రతిబింబ సహితముగా, స్థల నిర్దేశ అర్థ వివరణములతోఁ బ్రకటించిరి. తర్వాత రామయ్యగారి శాసన పాఠములను, అర్థ వివరణములను విమర్శించుచు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు 'చాళుక్య సంచిక' లోఁ దీవ్రముగ విమర్శించిరి. వారును దానిలోని కొన్ని పదముల కర్థము వ్రాయలేదు. ఈ శాసనము పరిష్కృత పాఠములతో అర్థ వ్యాకరణాది వ్యాఖ్యానముతోఁ బ్రకటింపవలసియున్నది. నన్నియ

భట్టు వ్రాసిన శాసనమునకే యిట్టి గతి సంభవించినదన్నచోఁ జెప్పెడిదేమి ? ఈ శాసనమును బ్రతిబింబ వ్యాఖ్యాన సహితముగా మరల ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలోఁ దవ్వరలో బ్రకటింపఁ గలవారము.

ఆంధ్రభాషావేత్తల యుపేక్ష

ఆంగ్లభాషలో నాంగ్లభాషా కవులను గూర్చి, వారి వారి జీవితములు, గ్రంథరచనములు, కవిత్వతత్త్వము మొదలగు సంగతులతోఁ బ్రత్యేకముగా నెన్నియో గ్రంథములు వెలువడియున్నవి. మన భాషలో నట్టి గ్రంథములు వ్రాయబడియుండలేదు. బహుశాఖా శోభితమై భాషయలరారు చున్నను,వి స్తృతియేగానివిజ్ఞానము లేకపోవుచున్నది. మూలస్కంధమునకు దోహదము లేదు. ప్రకటింపబడిన శ్రీనాథ కవుల కృతులు సరియైన పాఠములతోఁ బునర్ముద్రితములు గావలసియున్నవి. నేఁడాంధ్రభాషావేత్తలు పరిశోధింపవలసిన విషయములఁ గొన్నిఁటిని బేర్కొనుచున్నాము.

(1) కుమారసంభవము (నన్నెచోడుఁడు)
పరిష్కృత పాఠభేద సవ్యాఖ్యానము

(2) సోముని ఉత్తర హరివంశము ,,

(3) సింహాసన ద్వాత్రింశిక, శుకసప్తతి, హంస వింశతిక మూలకావ్యములు, హంస వింశతి సవ్యాఖ్యాన ప్రకటనము.

(4) కేతన విజ్ఞానేశ్వరము ,,

(5) సూరనార్యుని కళాపూర్ణోదయ కథకు మూలము

(6) పద్య బాలభాగవతము, ద్విపద బాల భాగవతములు, చారిత్రాత్మకమైన పీఠికలతో ముద్రణము.

ఆంధ్రసాహిత్య అకాడమీ వారి కృషి

ఇటీవల అకాడమీ వారు ఆంధ్ర కావ్యములలో ముఖ్యమైన గ్రంథములను సవ్యాఖ్యానముగాఁ బ్రకటించుటకు తీర్మానించినట్లు

పత్రికల వల్లఁ దెలియుచున్నది. వారే పైన సూచింపఁబడిన గ్రంథ ప్రకటనమునకుఁ బూనుకొనినచో నాంధ్రసాహిత్య అకాడమీ నామ మన్వర్థమగును. వీరిప్పుడు తలపెట్టిన మహాకార్యములో నెన్నఁదగి నది శాసనశబ్ద కోశ ప్రచురణము. సూర్యారాయాంధ్ర నిఘంటు కర్త లిదివఱకే యీ నిఘంటువునందు శాసనపదముల సేకరించి చేర్చియుం డిరి. అదియును సంపూర్ణముగఁ గావింపఁబడలేదు. సూర్యాయాంధ్ర నిఘంటు కారుల యాశయము సాహిత్య అకాడమీ వారు కొనసాగించి శాసన శబ్దముల సంకలనముగావించి ప్రత్యేక నిఘంటువుగా ప్రక టించు సంకల్పము ప్రశంసింపఁదగినది. ఆ నిఘంటు నిర్మాణమునకు శ్రీ నేలటూరి వెంకటరమణయ్య శ్రీ కోరాడ మహాదేవశాస్త్రి, ప్రస్తుతము ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికా సంపాదకునిగ నున్న నన్ను సంపాదకులుగా నియమించిరి ఆంధ్రసాహిత్య అకాడమీ వారి యీ సంకల్పము, ఆంధ్రసాహిత్య పరిషత్తువారు మున్నెన్నఁడో తల పెట్టియుండిరి. ఈ శాసనశబ్దకోశము ఆంధ్రుల రాజకీయ, ఆర్థిక, సాం ఘిక, భాషా చరిత్రమునకు సహకారి కాఁగలదు.

### సాహిత్య పత్రికా ప్రచురణము

ఆంధ్రదేశములో వివిధ ప్రాంతములలో నాంధ్రభాషావేత్త లెందఱో గలరు. ఆంధ్రసాహిత్య పత్రికను అట్టి భాషావేదుల సాహి త్యములే నిది ప్రకటించుట సాధ్యము కానేరదు. కావున మమ్ముల సహకరించుటకు వారినిఁ బదింబదిగఁ బ్రార్థించుచున్నాము.

# మా రచయితలు.

1. శ్రీ కత్తి సాంబమూర్తిశాస్త్రిగారు వీరు కొంతకాలము ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమున 'మానేజరు'గా నుండిరి. ఆంధ్రోపాధ్యాయులు. ఇప్పుడు నరసన్నపేటలో విశ్రాంతిని గైకొను చున్నారు శ్రీనాథకృతి శివరాత్రి మహాత్మ్యకావ్య పరిష్కర్తలు.

2. శ్రీ కామఋషి సత్యనారాయణవర్మగారు వీరు కాకినాడ వాస్తవ్యులు. కుటీరపరిశ్రమలను గ్రంథము వ్రాసి భారతప్రభుత్వము వారి బహుమానమును బడసిరి.

## ద్రవిడ శిశువెవరు ?

బండారు తమ్మయ్య

అనంతపురమందలి శ్రీశైల వీరశైవసంఘమువారి మధ్య శ్రీశంకర భగవత్పాదాచార్య ప్రణీతములయిన శివానందలహరీ, సౌందర్యలహరీ స్తోత్రములను శ్రీ విద్వాన్ తలమర్ల కళానిధిగారు రచించిన ఆంధ్రవచన వివరణముతోఁ జక్కఁగ ముద్రించి ప్రకటించియున్నారు. వీరశైవ సంఘాధ్యక్షులు శ్రీ బి. జూగప్ప M A. IA.S (రిటైర్డు కలెక్టరు)గారు ఆంగ్లాంధ్రభాషలలో రచించిన 30 పుటల పీఠికయు, శ్రీశైల జగద్గురు వాగీశ పండితారాధ్య మహాస్వాములవారు "ప్రార్థనము" అను పేరితో రచించిన 8పుటల ప్రస్తావనము నీ గ్రంథమున కమూల్యాలంకారముఁగనున్నవి. శ్రీశైల దేవాలయ మహాద్వారము యొక్క బహిరంతర దృశ్యములు, శ్రీభ్రమరాంబికా మల్లేశ్వరులు, శ్రీ శంకరభగవత్పాదులు, శ్రీజూగప్ప. శ్రీ వాగీశ పండితారాధ్య మహాస్వాములు, ఆంధ్రవివరణ కర్తయగు కళానిధిగారల చిత్రపటములు గూడ నిందుఁజేరినవి. గ్రంథము సర్వాంగ సుందరముగనున్నది

సౌందర్యలహరిలో శ్రీ శంకరాచార్యులవారు

" తవస్తన్యం మన్యేధరణిధరకన్యే హృదయతః।
పయః పారావారం పరివహతి సారస్వతమివ।
దయావత్యాదత్తం ద్రవిడ శిశు రాస్వాద్య తవయ।
త్కవీనాం ప్రౌఢానామజని కమనీయః కవయితా"

అను 75 వ శ్లోకములో నొక యైతిహ్యము నుగ్గడించియున్నారు. దేవీస్తన్యపానమున ధన్యుఁడయిన యా ద్రవిడశిశువెవరు? అనునది విచారణీయము- శ్రీజూగప్పగారు తమ పీఠికలో శంకరాచార్యులవారి బాల్యజీవితమును గొంత వివరించుచు నాతని తల్లిదండ్రులు ఆర్యాంబ, శివ గురువు అనువారు కేరళదేశమందలి కాలాడి యను పురమందలి శివునకు, భగవతికి భక్తులనియు, శివగురువు నిత్యము నొక కోరలో క్షీరములఁగొని దేవాలయమున కేఁగి భగవతికి నర్పించి

యింటికేతెంచి యాక్షీరములను జేపి ప్రసాదముగా దానుగ్రహించి భార్యకుఁగుమారునకుఁగూడనొసంగుచుండెడి వాఁడనియు నొకనాఁడు కార్యాంతరముపయి గ్రామాంతరమునకేఁగుచు నాతఁడీ నివేదన కార్యమును భార్యకప్పగించెననియు నొకనాఁడామెయు బహిష్ఠయగు టచేఁ గుమారుని సంపుకై నియోగింప నాతఁడా క్షీరపాత్రమును గొని దేవియెదుట నివేదింప నామె యాక్షీరముల ద్రాగకుండుటఁజూచి సహజముగ్ధత్వము కతన నాతఁడెంతయు సంతాపించి యతిదీనముగ విలపింప దేవియాతని దీనాలాపములకు హృదయము కరఁగి కోరలోని క్షీరముల సంపూర్ణముగఁ గ్రోలెననియుఁ దన కేమియు ప్రసాదముగ మిగల్చనందుకా బాలుండు మఱింత దుఃఖించి మరల సేడ్వఁదొడంగ నప్పుడామె తన స్తన్యము నాకోరలోనిడినొసంగెననియు దాని నాతఁడు హర్షముతోఁ గ్రోలెననియు లిఖించిరి. ఇది యించుమించుగ బసవపురాణము మూఁడవయాశ్వాసములోని గొడగూచి కథనుబోలి యున్నది. ఇందువలననే కాఁబోలు శ్రీజూగప్పగారు, కళానిధిగారు నిరువురుగూడ శ్రీ శంకరాచార్యస్వాములువారు తన నే ద్రవిడ శిశువుగాఁ జెప్పికొని తన బాల్యజీవిత వృత్తాంతమును బయి శ్లోకమున నుటంకించియుండునని తలంచిరి. శంకరాచార్యులవారు విద్యాసంపన్నులేగాక కాళిదాసునివలెఁ బరమ వినయసంపన్నులు.

"స్మృతౌ శాస్త్రే వైద్యే శకున కవితా గాన ఫణితౌ।
పురాణే మంత్రే వా స్తుతి నటన హాస్యేష్వచతురః
కథం రాజ్ఞాం ప్రీతిర్భవతి మయి కోఽహం పశుపతే।
పశుం మాంసర్వజ్ఞ ! ప్రథిత కృపయా పాలయవిభో"

(శివానందలహరి శ్లోకము 5)

అతస్త్వామారాధ్యాం హరిహర విరించాది భిరపి।
ప్రణంతుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి"

(సౌందర్యలహరి శ్లోకము 1)

అని యాత్మవిషయమైన వినయ సంపద వెల్లివిరియ వ్రాసికొనిన శంకరాచార్యులువారు పార్వతీస్తన్యపాన విషయకముగ సౌందర్యలహరిలోని 75 శ్లోకము నాత్మపరముగ వ్రాసియుండునని తలంచుట సమంజసముకాదని నాయభిప్రాయము. పయింగా నాతఁడు కేరళ భూమిలో జనించిన కేరళ శిశువుగాని ద్రావిడదేశీయుఁడయిన ద్రావిడ శిశువుకాఁడు.

ద్రవిడ శిశువు, తిరుజ్ఞానసంబంధ యను నామాంతరములు ద్రావిడదేశమందుద్భవిల్లి ప్రసిద్ధికెక్కిన శైవనాయనారులలో నొకఁడయిన పిళ్ళనాయనారునకుఁ జిరకాలమునుండి వ్యవహారమున మాఘనుయియున్నవి. అతఁడు శంకరాచార్యులకుఁ జాలఁ బూర్వుఁడు. శివభక్తులఁగూర్చి తమిళభాషలో రచితమయిన పెరియ పురాణములో వర్ణితులయిన మహాశైవులలోఁ జేరినవాఁడాతఁడు. ఈతని చరిత్రము గోపాలకుఁకి సోమనాథుని ద్విపద బసవపురాణము షష్ఠాశ్వాసములో వర్ణితమయినది.

ద్రావిడ దేశమందలి శ్రీ కాళియను పురమున శివబ్రాహ్మణుఁ డొకనికిఁ గుమారస్వామి యంశమున నీతఁడు జనించినవాఁడు. ఈతని బాల్యమున నొకనాఁడు తండ్రి పురమందలి సరోవరమున స్నానమాడుట కేఁగుచు నీతనిఁ జంకనిడుకొని యొడ్డున నాతని గూర్చుండఁబెట్టి తాను చెఱువులోనఘమర్షణ స్నాన మాచరించుచుండెను. అప్పుడు పార్వతీపరమేశ్వరులు ఆకాశవీథిని దివ్యవిమానారూఢులయి వాహ్యాళికేఁగుచు సరోవరతటమున నున్న బాలునిఁజూచి "అల్లబాలుండు మనకుమారునియట్లు" యనుచు నగ్గించి "కనుగవఁజూచుచుఁ జనుగవ సేఁప, నవనీతలంబునకరుదెంచి బాలుఁగవుఁగిటఁజేర్చి కూకటిపుడుకుచును దేవిదాశాంభవ దీక్షితుఁజేసి భావించి శివభక్తిపరునిఁగావించి, కడుపారఁజను బాలుగుడిపి పసిండి కోరలో వెండియుఁగొన్నివే

నిచ్చెఁ గాళిదాసీశ్వరు కడకేఁగినంత” అని సోమనాథుఁడు వర్ణిం చినాఁడు. స్నానము ముగించి తాఁడ్రితీరముఁ జేరి బాలుని పెదవులపైఁ గాఱుచున్న చనుబాలుచూచి ప్రశ్నింప నాతఁడు జరిగిన సంగతిచెప్పి యాకాశవీథిని జనుచున్న పార్వతీ పరమేశ్వరులఁజూప యాదు కొం తయు సంతసించి యాశివబ్రాహ్మణుఁడు. “కొడుకుఁదాని నెఱుకట నిడుకొని వచ్చె! మహనీయు దాను సమ్మోద లీలనుండ పార్వతీ స్తన పయఃపాన ప్రశక్తి, సర్వజ్ఞతయు వచస్సంసిద్ధిదనరి వేవిన గుడికేఁగి వేనవేల్విధుల భావించి పార్వతిఁ బ్రస్తుతించుచుఁను, అంబిక స్వర్ణ తాళంబు లొసంగఁ దుంబురు నారదాదులమీఱిపాడఁ గరము తోడ శ్రీకాళినాథుండు విరచితంబయి యొప్పు వెల్ల గొడుగులును! నవ య నిధియు ముత్యాల పందిరియు నిక్షితిఁ బ్రతివేని హేమాసనంబు ఖండేందు ధరుఁడప్డు గరుణింపఁ గనకఁ దండెయాందలమెక్కి తా వైభవమున భాతిగా ధారలు పరమత భూమి కేతువునాఁగఁ ప్రఖ్యా తమై మ్రోయ”.

పిల్లనాయనారు పిన్నవయస్సుననే చోళ పాండ్యాధి నాథుల శిష్యులఁ జేసికొని యద్భుత మహిమఁ జూపి బౌద్ధజైనుల వితం డవివాదముల జయించి ప్రసిద్ధి కెక్కెను. పిన్నవయస్సుననే యీ తఁడిట్లు మహామహిమాన్వితుఁడై తనున్మాదింప నోర్వఁజాలక బౌద్ధులు జైనులు నీర్ష చే సీతనిని ద్రావిడ శిశువుని యీసడింపనదియే తాను శానాతవి కొక బిరుదనామముగఁ బరిఢవిల్లెను. “జైనులు బౌద్ధులు ననుదెంచి యపుడు జ్ఞానసంబంధినా నొక్క శిశువు నాతత వేదబాహ్య సమయ ధూమకేతువు నాఁగొప్పి యేతెంచినాఁడు పురి వెడలింపుఁడు వరనాథ’యనిన’ అను సోమనాథుని వాక్యములనే తిలకింపనగును.

సోమనాథుని శిష్యప్రశిష్యుఁడు పిడుపర్తి బసవకవి యీపిల్ల నయినారుచరితమును ప్రత్యేకముగ ద్విపదకావ్యముగ రచించినట్లు

లీతని పుత్రుఁడు పిడుపర్తి సోమనాథుఁడు రచించిన పద్య బసవపురాణావతారికలోని పద్యమునుబట్టి గ్రహింపఁదగును. కాని యాగ్రంథము మనకు లభింపలేదు. శంకరాచార్యులవారు సౌందర్యలహరి 75 వ శ్లోకమున స్వోత్కర్ష నేమియుఁ జెప్పికొనలేదనియు నాతఁడుదాహరించిన ద్రవిడశిశువు, అంతకుమున్న తరతరములుగ ద్రావిడ శైవ నాయనారులలో సుప్రసిద్ధుఁడయిన పిల్లనాయినారే యనియు నిశ్చయించుట కభ్యంతరముండరాదు. 1929 సంవత్సరములో శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు ప్రకటించిన సోమనాథుని ద్విపద బసవ పురాణము పీఠికలో కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారుగూడ పిల్లనయనారునిఁగూర్చి వ్రాయుటలో ద్రవిడ శిశువు, తిరుజ్ఞాన సంబంధి యని కూడ నాతఁడు వ్యవహరింపఁబడుచుండినట్లు లిఖించియున్నారు.

# భీమఖండమునందు మూఁడు సవరణలు :

(కవి పాదరేణువు విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రి.)

శ్రీనాథకవి రచితములగు కృతులందు భీమేశ్వరపురాణము మిక్కిలి ప్రసిద్ధమయినది. దీనికి భీమఖండమను పర్యాయనామము గలదు. అతడు దీనిని ప్రౌఢనిర్భరవయః పరిపాకమున రచించినట్లు వాకొనినాఁడు. గ్రంథము తొలుత 1901 వ సంవత్సరమున నెల్లూరు న్యాయవాదులు మ॥ శ్రీ॥ ర॥ వేంకట సుబ్బయ ఎమ్.ఏ. గారు లేఖక ప్రమాదాది దోషములను బరిష్కరింపఁగా బ్ర॥ శ్రీ॥ కొత్తపల్లి పద్మనాభశాస్త్రులువారు జ్ఞానప్రసూనాంబికా గ్రంథమాలికయందు ద్వితీయ కుసుమముగాఁ బ్రకటించినారు. పరిష్కర్తలకు ప్రాచ్యపుస్తక భాండాగారమందు రెండును, శ్రీ సమర్థి రంగయ్యశ్రేష్ఠిగారివలన నొకటియు, శ్రీ పోతాప్రగడ బ్రహ్మానందరావుగారి వలన నొకటియు శ్రీ గురజాడ శ్రీరామమూర్తిగారి వలన నొకటియు ఐదు విభిన్నమాతృకలు లభించినవి. శ్రీ దగ్భా వెకయ్యగారి వలన సంస్కృత మూలము అచ్చుప్రతి లభించినది. ఈమాతృ ప్రతుల సాయమున నొక ప్రతి తయారుచేసి దానిని చెన్నపురి ఆనంద ముద్రాలయమున ముద్రింపించి ప్రకటించిరి. మాతృకలైదున్నను మూలగ్రంథము ననుసరించి ప్రకటింపఁబడిన దానిలో సైతము తప్పులు కుప్పలుగానుండి పాఠకుల కర్థము బోధపడని దుస్థితి యీగ్రంథమునకు దాఁపురించుట ఆంధ్రుల దురదృష్టమనక తీఱదుగదా!

ఇందలి ప్రథమాశ్వాసము ఆంధ్ర విశ్వవిద్యాలయము వారిచే భాషాప్రవీణ ప్రిలిమినరీ పరీక్షకు నిర్ణీతమగుటచే విద్యార్థులకు పాఠము చెప్పవలసివచ్చినా పడిన శ్రమ యింతంతకాదు. అడుగడుగున ననర్థకములే. అన్నింటిని సవరించుకొని యెట్లో పాఠమయినదని పించితిని.

ఇదికాఁగా నీనడుమ రైలుప్రయాణములో నొకమిత్రుని కడ నూతనముగా రాజమహేంద్రము అద్దేపల్లివారిచే ప్రకటింపఁబడిన పెద్ద

పుస్తకమొకటి కంటఁబడి నాకమందానంద మందించినది. తెల్లని వలెసరి కాగితములపైఁ బెద్దక్షరములతో పాఠాంతరములతో ముద్రింపఁబడినది. ఈప్రతిలో, తమశక్తి సామర్థ్యము లెల్ల శ్రీనాథ కృతుల సమీక్షయందును నాతని చరిత్రమునందును వినియోగించుచు దాక్షారామ భీమేశ్వరునకే తమ హృదయమంకితము గావించిన శ్రీవర్ధమాన చంద్రులగు శ్రీ చి॥ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారి విమర్శనము నూఱుపుటలకు మించినది.

మిత్రసమాగమము స్వల్పకాలికమగుటచే వ్యవధిచాలక ముఖ్యముగా మూఁడు సంశయస్థలములుచూచితిని. మూఁడుస్థలములు "ధాతా యథా పూర్వమకల్పయత్" గానే యున్నవి. అవి యు

మొదటిది:- దాక్షారామ పురీ వర్ణనము:-

సీ. తిలకంబు బలు తేనియలఁ బోఁకమోకల
పువ్వుబాళ లతాని పుక్కిలించి
కలమ గోపికలచిక్కని చన్నుగవలపై
వట పల్లవంబులు వాయదట్టి
సప్త గోదావర జలతరంగా రోహ
కేళీసుఖంబు లంగీకరించి
దేవగంధర్వ లీలావతీ హాటక
ప్రాసాద ముఖ గర్భములదూఱి

గీ. ప్రతిదినము దక్ష వాటీపురంబునందు
మలయు వేలావనీ మందమారుతంబు
గంధ సారలతాకుడుంగముల మెలఁగు
చిలువతేమలు సేవింప వెలితి పడుచు- ఆ ౧ ప ౯౭

ఈపద్యమున రెండవపాదమున కలమపాలికల యురములపైని వటపల్లవములున్నట్లు వర్ణితము.ఏయువతులకుఁగాని మరు కాఁకలందు

నళినీదళములు, చందనశీమాలాదిపల్లవములు నుఃములందుంచు నట్లు వర్ణించుట ప్రసిద్ధము. చందన చర్చాదికమును ప్రసిద్ధము కాని వటపల్లవములు స్తనావరణముగా నెందునెవరను వర్ణించినదిగాదు. వటచ్ఛాయకు శీతకాలమున నుష్ణత యుష్ణకాలమున శైత్యము ప్రసిద్ధము కాని వటపల్లవముల కాగుణములేదు. అయినప్పుడా యువతుల యురములపై వటపల్లవ ప్రసక్తి యెట్లుకలిగినది? అలంకారముగా ధరించి రను కొందమన్నను నదియు నభూతపూర్వమే. లోకవిరుద్ధమైన యీవర్ణనము ఒక్క అక్షర ప్రమాదమున సంభవించినదనినేనూహించుచున్నాను. కలమపాలికలు మరుకాంకలపాలుకా లేదు. అలంకారములుగా నేమంజరులను పల్లవములను ధరింపలేదు. వారు ధరించినవి సామాన్యమైన సన్న వలిపెముల జిలుగు పయ్యెదలు మాత్రమే. వానినే చిలిపిచేతల మలయానిలుఁడు తొలఁగించుచుండును. కాఁగా కవి ప్రయుక్తము పటపల్లవము లేఖనమున పవలక భేదము సిద్ధింపఁగా నపపాఠము సిద్ధించినదని నాస్వల్ప బుద్ధికిఁ దోచిన సవరణము మొదటిని.

రెండవది :-

క॥ పదునాల్గు మహాయుగముల
ముదుకగు భీమేశ్వరునకు మొగచాలై యుం
డదు సాని పెండ్లియెప్పుడు
నది దక్షారామ మహిమముగునో కాదో? ఆ ౧ పం౧౩

ఈపద్యము అద్దేపల్లివారి ప్రతిలోను నిట్లేయున్నది. "ఎనయంగల్గినకూర్మిభృంగిరిటిగా నీ, తండుగా నీనికుంభునిగా నీ,కయి దండపట్టుకొని సంభోగేచ్ఛ నంతఃపురాంగనలంగన్ను మొఱఁగి యప్పురము నంగన్నె ఱు కాదారి పొద్దున భీమేశుఁడు ధూర్తప్రకారమున సాని వాడకు వేంచేయు పట్టుననున్నదీ కందము.

పదునాల్గు మహాయుగముల ముదుకయైనను భీమేశునకు సాని పెండ్లి మొగచాటైయుండదఁట. మొగమునకు చాటు=మొగచాఁటు కంట కగపడక డాఁగుట. వృద్ధాతి వృద్ధుఁడగు భీమనాయకునకు నిత్యం బును సానిపెండ్లి కంటకగపడుచునే యుండునని కదా యిందలి భావము. ముదుకతనము పెండ్లి చూడకుండుటకుఁ గారణమగునా? వృద్ధులు సన్నిహితులై యుండి దీవింపని వివాహమే యుండదే. ఎవరికి పెండ్లి? సానిపెండ్లియని యున్నందున సానికే. ఎవరితో? ఇతరులతోనా? అయి నచో తనకు చాటుగాకుండుటకు గారణములేదే! తనతోనైనచో ప్రతిరాత్రి సానికి భీమేశ్వరునితో పెండ్లియగుననుట, తనపెండ్లి తనకు మొగచాటెట్లగును? పెండ్లిశబ్దమునకు సంభోగమని కవ్యుద్దిష్టార్థమయి యుండునా? అయినచో నీయప్రసిద్ధార్థపద మునయోగింపనేల? పూర్వపద్యమునను "సంభోగేచ్ఛ" ననికంఠోక్తిగా చెప్పనే చెప్పి నాఁడే. కావున నక్కడ పెండ్లిశబ్దమున కర్థములేదు.

ఇక్కడ కవి ప్రయుక్తము పెండ్లిపదముగాక పెంటిపదమైయుండు నని నాభావము. పెంటి=తిర్యక్కులలో స్త్రీ అని నిఘంటువులం దున్నది.ఏనిక పెంటి, లేఁటిపెంటి, పెంటియేనుఁగు పెంటిగుఱ్ఱము,ఇత్యాది ప్రయోగములుగలవు. తెనుఁగు మాటాడు ఆటవికజాతులు మనుష్యు లకును పెట్ట, పెంటి,పుంజు శబ్దములను స్త్రీ పురుషులకు వ్యవహరించుట కలదు. అదియుఁ గొంచెము పరిహాసము చేయుపట్టుననే పెట్టో పెట్ట; పుంజో పుంజు; అనివాడుట నేనెఱుఁగుదును. పెంటిశబ్దము స్త్రీల కుప యోగించుటయు వినియుంటిని. ఆపెంటిపదము నీసాని కంటగట్టినాఁడు బహుదేశ దృష్ట బహు భాషావేదియగు కవియని చెప్పనగును. యువ, తులు వృద్ధులను, యువలు జరఠలను బరిహరించుట లోకప్రసిద్ధము. కాని దక్షారామ మహిమవలన లేఁబ్రాయపు వెలవెలందులును ముదుక భీమేశుని పరిహరింపరు సరిగదా! కామాతురలై కవుఁగిలిం

తునని కవ్యభిప్రాయము. వెంటియనఁగా "హిరిక" యని యర్థమగును.

మూఁడవది:-

క॥ పరమాసించుచు భీమే
శ్వరుననుమతిఁ జేసి చోళవంశాభరణం
బరికాలుఁడు కరికాలుఁడు
ధరణీ ధరపత్ని మనసు దైన్యము ముంచెన్. ఆ ౧ ప౧౧౮.

ఈపద్యార్థము వింతగాను విపరీతముగాను నున్నది. భీమేశ్వరు ననుమతి పరలోక సుఖార్థియగు కరి కాళచోళుఁడు శివునకు కూఁతు నిచ్చిన హిమవంతునిభార్య మనసు దైన్యము ముంచెనఁట.

ఇందు మనసు, దైన్యము అనుశబ్దములు రెండును ప్రథమా రూపములుగానున్నవి ఒకానొకచో నొకవిభక్తికి నుఱియొకవిభక్తియు నగును. అను బాలవ్యాకరణ సూత్రానుగుణముగా వీనిలో నొక దానికి సప్తమ్యర్థమును నొకదానికి ద్వితీయార్థము చెప్పుకొనవల యును. అప్పుడు మనసునందు దైన్యమునో; దైన్యమునందు మనసునో ముంచెనని భావ మేర్పడును.

భీమేశ్వరుఁడు తనయత్తమనసున కుత్తలపాటు కలిగింప నాన తిచ్చుటయేల? అదీనాకరణము కరికాలునికిఁ బరలోక సాధనమగునా? ఇవి వింతభావములుకావా? ధరణీ ధరపత్ని కరికాలుని చేఁతలచే మన సున దైన్యమొందనేల? ఆపరమ మాహేశ్వరుఁ డీశ్వర సాక్షాత్కార మొంది యతని యాదేశమున భర్మహర్మ్య పురోపవన రత్నాంబరా మృతాహారాది దివ్యభోగములు భవునకర్పింపఁగానత్త చూపోపకమన స్సునుదైన్యములో ముంచుకొనుటా? దానికి కారణము. తమకుదరిదా పులందు వల్లకాటిలోను, కొండ బండలమీఁదనునివసించుచు ముసలి యెద్దు వాహనముగా, పులితోలేనుఁగుతోలు గప్పుకొనుచు, విసముతిని పునుకలో బిచ్చమెత్తు మగనితో నర్ధాంగీకారముగా కాఁపురము

సేయు ముద్దులకూఁతురు తనకు దూరమైపోయిన దనునదియే కదా? క్రొత్తగాఁ బెండ్లియయిన కూఁతురత్తింటికి వెడలునపుడు దూరమే కానిఁడు దగ్గఱనే కానిండు నూతనమయిన తనయావిశ్లేషము గృహస్థులకు దుస్సహమనుట జగత్ప్రసిద్ధమే. సంస్కృతభాషలో కాళిదాస మహాకవి శాకుంతల నాటకమందు శకుంతలా విప్రయోగార్తుఁడగు కణ్వముని ముఖముననే చెప్పించినాఁడు. ఆంధ్రకవులెందఱో తమకావ్యనుందీ విషయము నిరూపించినారు. ఆవిశ్లేషము ప్రథమమున మాత్రమే. ఇక్కడి ధరణీధరపత్నికి సుతావిప్రయోగమట్టిదికాదు అయినప్పుడామె కంతదైన్యమేల? పరమదైన్యవృత్తినున్న భర్తతో దుర్భరమైనకాఁపురముచేయుచున్న కూఁతునకుదివ్యభోగానుభవము సంభవింపఁగా సంతసించుటకు మాఱుగా దుఃఖించు తల్లియు నెందేనుండునా? దూరమందైననేమి దగ్గఱనైననేమి మనకూఁతురు ధనధాన్యములతో సుఖసంపదఁ బొందఁగోరుదురుగాని దుఃఖించునదిమాఱుటతల్లియేమో కాని కన్నతల్లి యెవ్వతెయు దుఃఖింపదు. కావున నీవర్ణనము కేవలము సర్వవిరుద్ధము. ఇది కవి ప్రయుక్త పాఠము గా నేరదు. లోకానుభవము చాలని ప్రతిలేఖకుని ప్రమాదమే. అయినచో దీనికి సాధు పాఠమేదందురా? "ధరణీధరపుత్రి మనసు దైన్యము మాన్పెన్" అన్నది సాధు పాఠమగును. తనభర్త పాములెమ్ములు తోలుదాల్చి, ముదసలి యెద్దునెక్కి పునుకలో బిచ్చమాడుచు కాటిలో కాపుండుట యేభార్యయు సహింపఁజాలదు. కుచేలుని భార్య వంటి పరమక్షమాశాలిని కూడ తనదైన్యము దుర్భరమని వాపోయినదికదా? కాఁబట్టి శివునినిస్స్వతవలన దైన్యమందినదాతని దేవియే కాని యతని వియోగమునమనసు దైన్యమున ముంచుకొన్నదత్తగారుకాదు. అత్తగారిమనసు దైన్యమున ముంచుటకు భీమేశ్వరుఁడాజ్ఞాపించుట కతని కత్తచేసిన అపకారమేమి? అది యేదియులేదు. ఇక్కడిపాఠమే తప్పై మనకు

దైన్యము గలిగించినది. పరమమాహేశ్వరుఁడగు కరికాళచక్రవర్తిశివుని దేవి దైన్యముమాన్పి దివ్యభోగములందించినట్లు ఈపద్యము తరువాతి పద్యము విస్పష్టముగా చెప్పుచున్నది.

సీ॥ గజచర్మ మెప్పుడో కాని నిచ్చలు గట్టు
పసిడి కమ్ముల పట్టు పచ్చడంబు
భసిత మెన్నఁడో కాని ప్రతిదినమ్మునలందు
మలయజంబు కురంగ మదముగూర్చి
నిడుదపాముల గాజు తొడవు లెన్నఁడో కాని
తారహారములు నిత్యముధరించు
నృకరండరుండ మాలిక లెన్నఁడో కాని
ధరియించు కల్హార దామ మెపుడు
గీ. కాటనడు చక్కె నెన్నఁడో కాని యుండు
దక్షవాటి సువర్ణ సౌధముల మీఁద
నెన్నఁడో పిశాచులనుగాని యిందుముఖుల
నెల్లకాలంబు వలచు భీమేశ్వరుండు ఆ ౧ ప ౧౧౯
సీ. ఒక వేళధరియించు యువనాశ్వుఁడిచ్చిన
కట్టాణి ముత్యాల కంఠమాల
మాంధాతృఁ డిచ్చిన మాణిక్య ఖచిత కే
యూరంబు ధరియించు నొక్కవేళ
నిషాకుఁడిచ్చిన హీరాంకురంబుల
యుంగరంబు ధరించు నొక్కవేళ
(ఘన) శిబిచక్రవర్తియిచ్చిన ప్రవాళంబుల
యొడ్డాణము ధరించు నొక్కవేళ
గీ. వేడ్కధరియించు నొక్కొక్కవేళయందు
భరత దుష్యంత రంతి నాభాగనహుష

నలభగీరథ నృగ మహీనాథ దత్త
హేమమణి భూషణములు భీమేశ్వరుండు  ఆ ౧ ప ౧౧౬

మొదటి సీసమునఁ గరికాలుఁడు శివుని యలంకారాసక్తిని భోగాసక్తిని మొలకరింపఁజేసినను, భవునకుఁ బ్రాఁత వాసన వదల లేదని తేలుచున్నది. రెండవదానిలోఁ బూర్వవాసన నిశ్శేషముగ నశించి యాతఁడలంకార ప్రియుఁడై విష్ణుండయ్యెనని స్పష్టపడుచున్నది.

కావ్యాలంకార సంగ్రహ (నరసభూపాలీయ) కర్త మూర్తి శ్రీనాథుని యీ మొదటి సీసమును అనుసరించియే కరికాలచోళుని శివారాధన వైశిష్ట్యముఁ గ్రహించుట కనుఁడు.

సీ. ఏ రాజు వివిధ పుష్పారాధనమున గం
గాధరుతల మీఁది కాపు మానె
ఏ రాజు దివ్యాన్న సారార్పణమ్మున
శితికంఠు మెడనున్న చేదు మానె
ఏ రాజు రత్నోపహారాను భవభూతి
రుద్రు నెమ్ముల దండ రోఁత మానె
ఏ రాజు కాంచనాగారారచన కేళి
భవునకు గిరులెక్కుపాటు మానె
గీ. జలధి దేవేరిఁ గావేరి జనులు సూడ
కుండ నాచ్ఛాదన మొనర్చు నొప్పు మెఱయ
నుభయతటములఁ దరుపంక్తు లునిచె నే నృ
పాలుఁ డతఁ డొప్పుఁ గరికాళ చోళవిభుఁడు. కా. సం. అ౧ ప౬౫

మూర్తి కవి కరికాళచోళుఁడు శివుని కేయూర నాలయాదులు నిర్మించెనో కంఠోక్తిగాఁ జెప్పకున్నను నతని పద్యము శ్రీనాథుని పద్యమునకుఁ బ్రతిబింబమగుటచే నాస్థల మీఁద తూరామమేయని తేటతెల్లమగుచునేయున్నది. ఏతావతా పర్యవసాన మేమనఁగా " ధరణీ

ధరపత్ని మనసు దైన్యము ముంచెన్" అనుపాఠ మసాధువనియు "ధరణీ ధరపుత్రి మనసు దైన్యము మాన్పెన్" అనునది సాధుపాఠ మనియుఁ దేలుచున్నది.

మఱియొక చిన్నవిషయము "ఒకవేళ ధరియించు"నను సీసపద్యము నాల్గవ పాదము,"

ఘన చక్రవర్తి యిచ్చిన ప్రాశంబుల యొడ్డాణము
ధరించునొక్కవేళ

అని కలదుగదా? ఎవరా ఘనచక్రవర్తి? షట్చక్రవర్తులలోఁగాని షోడశచక్రవర్తులలోఁగాని యీపేరు లేదు. ఘనపదము ప్రతిలేఖకునిచే ప్రాసయతికొఱకు నిర్మింపబడినదే కాని యదియొక వ్యక్తినామమై యుండదు. బహుశః అక్కడ అక్షరములు ఏకారణముననో లోపింపఁగా వ్రాయసకాఁడు తన కల్పనముతోఁ బూరించియుండును. అసలు కవిప్రయుక్తము శిబిచక్రవర్తి యను పదమే. శిబి, చక్రవర్తులలోఁ బ్రముఖుఁడు సుప్రసిద్ధుఁడు. ఆబాలగోపాలమున కెఱుకపడినవాఁడు. అట్టి మహాత్ముని విడి పేరే సరిగా తెలియని వానిని కవి పేర్కొనెననుటకు మనసొప్పకున్నది.

నేను పాఠముచెప్పిన ఒక్క యాశ్వాసమునఁగల యనేక ప్రమాదములలో ముఖ్యమయిన మూఁటిని మాత్రమిట్లు సవరించి సహృదయ పరిశీలనమునకై ప్రకటించితిని. పండితులు వీని నామోదించుట, ఎప్పుడైన ద్వితీయముద్రణ ప్రతిమరల జూడఁగల్గుట, సంభవించినచో గ్రంథమంతటను ప్రమాదములను సవరించి లఘుటిప్పణి రచించుట చేయవలయునను నుత్సాహమున్నది శ్రీ పాపయ్యశాస్త్రిగారే పనిలో పనిగా విమర్శనముతోపాటుగ టిప్పణికూడ రచించి ప్రకటించి యుండవలసినది. వారాపని సేయ కేకారణముననో యుపేక్షించిరి. శ్రీనాథుని గ్రంథము లన్నియు టిప్పణి లేకున్న సామాన్యులకు సుగ్రహములుగావు. ఆపని నాకగునేమోయని యాశించుచున్నాను.

---

## పిఠికాపుర సంస్థానము - కళాపోషణము.

(శ్రీ కాముఋషి సత్యనారాయణ వర్మ.)

రెండు శతాబ్దములకు పూర్వమునుండియు, కళాసాహిత్య పోషణమున లబ్ధప్రతిష్ఠులైన ఆంధ్ర జమీందారులలో పీఠికాపురసంస్థానాధిపతు లగ్రగణ్యులు వీరు శ్రీనాథమహాకవి పోషకునిగను, పోతనసమకాలికునిగను, రత్నపాంచాలికాది సంస్కృతనాటకకర్తగను విఖ్యాతినొందిన పద్మనాయకవంశ శిరోభూషణ మనఁదగు రావు సర్వజ్ఞసింగభూపాలుని వంశమునకు చెందినవారని చరిత్రమున తెలియ వచ్చుచున్నది. వంశ పారంపర్యముగా వచ్చుచున్న సాహిత్యాభిరుచికి, కళాసక్తికి తగిన కళాసాహిత్యపోషణము వీరికి వెన్నతోఁబెట్టిన విద్యయైనది. కీర్తిశేషులగు శ్రీ సూర్యరాట్ప్రభుని యాదరణమున వర్ధిల్లిన ఆంధ్రగీర్వాణసాహితీవైభవము, దీనజనపోషణము మొదలుగాఁగల వారిదాతృత్వగరిమ ఎంతటిదో చెప్పలేము. వీరి పితృపితామహుల కాలమునాఁటినుండియు జరుగుచున్న కళాపోషణ - వారి ఆదరణకు పాత్రులైన పలువురు కళాకారులయొక్క కళాప్రావీణ్యవిలసనములు సంస్మరించిన, ప్రభువుల కళాభిమాన మెంత విశిష్టమైనదో తెలియఁగలదు.

"తనయుఁడు చెఱువును గావ్యంబు నిధానముగుడివనంబు
భూదేవీస్థాపనమును నను నియ్యేమను జనుశాస్త్రములందు
సప్తసంతతులనఁగన్".

అప్పకవీయము

తనయునిఁ బడయుట - దేవాలయనిర్మాణము, చెఱువుద్రవ్వించుట, కావ్యముకృతినందుట-నిధిని భూస్థాపితముఁ జేయుట, వనములఁ బెంచుట, దేవతావిగ్రహము ప్రతిష్ఠచేయుట మొదలగు సప్తసంతానములు పుణ్యసాధనములని పెద్దలువచియింతురు. జమీందారులు ఇట్టి పుణ్యకార్యముల చేపట్టి తమఏలుబడిలోనున్న ప్రజలకు భుక్తి,ముక్తిసాధనముల

నందఁజేసెడివారు. దేవాలయప్రతిష్ఠ చేయుటలో తదనుబంధములైన యనేకోపకళలసముద్ధరణముకూడ జరుగుచుండెడిది. ఆయా దేవతాయతనములలో నిత్యధూపదీపారాధనలు, మాసోత్సవములు, ప్రతివర్షమునను కళ్యాణోత్సవములు జరిగెడివి, అచట జరుగు నిత్యార్చనలకు, పురాణపఠనములకు, వేదపఠనములకుఁ దగిన పండితులు, వివిధ శాస్త్రపారంగతులేగాక కళారాధనతత్పరులైన నట్టువరాండ్రు, చిత్రకళాకోవిదులు, శిల్పులు, మాలాకారులు, పుష్పోద్యానవనపాలకులు, వందిపాఠకులు, ఏకాంతసేవాకార్యాక్రమ నిర్వాహకులు, ఉదయ, సాయంసమయములలో జరుగు నిత్యసేవాకాలమున మంగళవాద్యముల వినిపించుటకుఁ దగిన సొన్నాయిపాటకులు, మార్దంగకులు, మొదలుగాగల యనేక వృత్తులకుఁ జెందినవారు, ఈదేవాలయములను వాని ధర్మకర్తలైన ప్రభువులను ఆశ్రయించుకొని తమ జీవితములను భగవదారాధనలో గడపుచుండెడివారు. ఇట్టివారికి గ్రాసవాసోదైన్యములు కలుగకుండ ఈ జమీందారులు ఈనాములనిచ్చి పోషించుట ఒకపవిత్ర కార్యముగా భావించెడివారు.

పీఠికాపురము కుంతీమాధవునకు, కుక్కుటేశ్వరునకు నిలయమై దక్షిణకాశియని ప్రఖ్యాతినొందినది. అష్టాదశమహాపీఠములలో నొకటియైన పురుహూతికా శక్తికి పీఠము. గయాసురపాదప్రదేశమున నెలసినదగుటచే నిది పాదగయయని ప్రఖ్యాతమైనది. పంచమాధవులలో నిది కుంతిమాధవునకు నిలయమై యలరారినది. రాజరాజనరేంద్రుని యాస్థానమున గణితవిద్వాంసునిగ గౌరవింపఁబడిన పావులూరి మల్లనగారికి దానముగ నీయఁబడిన నవఖండ్రవాడ అగ్రహారము ఈ సంస్థానములోనిదే. ఈ గ్రామమునుండి వచ్చిన ఆదాయము కుంతిమాధవునకు కుక్కుటేశ్వరునకు నిత్యదీపారాధనలకు, నైవేద్యాదిక్రియలకు వినియోగమగునట్లుగా కాలక్రమమున నొక రెడ్డిభూనా

ఘుడు దానశాసనము వ్రాయించి సమర్పించినాడు. కూచిమంచి తిమ్మ
కవివంటి ప్రముఖకవులెందఱో కుక్కుటేశ్వరునిపై శతకముల రచి
యించినారు. మద్దిరాల వేంకటరాయకృతమగు నేకాంతసేవ నేటికి
కుక్కుటేశ్వరుని ఆలయమున నిత్యసేవలలో పఠియింపఁబడుచున్నది.
"మహాకవినిలయమగుటచే రక్తికి, మహారాజాస్థానమగుటచే భుక్తికి,
మాధవమహాక్షేత్రమగుటచే ముక్తికి నిదానమైనపురము ఆంధ్రదేశ
మహిళామతల్లి కంఠమాలానాయకమణియై ప్రకాశించుచున్నదని"
వ్రాసిన పానుగంటివారి వర్ణనలో నతిశయోక్తి లేదు.

ప్రతిసంవత్సరము కుంతిమాధవునకు, కుక్కుటేశ్వరునకు కళ్యా
ణోత్సవము లతివైభవముగా జరుగుచుండెడివి. మాఘ శుద్ధ ఏకా
దశికి కుంతిమాధవునకు, బహుళ ఏకాదశికి (శివరాత్రిముందు) కుక్కు
టేశ్వరునకు కళ్యాణోత్సవములు జరుగును. ఈ నెలదినములు గ్రామ
మంతయు నిత్యకళ్యాణము పచ్చతోరణములతో కలకలలాడుచుండె
డిది. దేవుని కళ్యాణోత్సవములను నుండు తీర్థము సాగుచుండెడిది.
చుట్టుప్రక్కలఁగల గ్రామవాసులందఱు తిరునాళ్లలో పాల్గొందురు.
దేవాలయ పరిసరప్రాంతములన్నియును పందిళ్లతో పాకలతో నిండిఉండు
పలురకముల వస్తుసామగ్రులు, కంచు ఇత్తడిపాత్రలు- బాలుర
క్రీడాపరికరములు పుదుచ్చేరి, నక్కపల్లిబొమ్మలు- వివిధములైన
వస్త్రములు, తినుబండివస్తువులు, భద్రపఱచి వర్తకముసాగును. ధూప
దీపములద్రవ్యములు, హారతికర్పూరము, నారికేళములు, కదళీఫల
ములుతో శోభాయమానమైన యీ ప్రదేశమంతయు నెంతో నయ
నానందకరముగా నుండెడిది. ఒక్కొక్కరోజున ఒక్కొక్క విశిష్టమైన
వాహనములపై ఉత్సవమూర్తుల నలంకరించి గ్రామోత్సవములు
జరుగును. ఈశ్వరునకు నెమిలివాహనము, నందివాహనము, నాగవా
హనము మొదలగునవి, మాధవస్వామికి శేషవాహనము, గరుడ

వాహనము- పొన్న చెట్టు మొదలగునవి ఉపయోగింపఁబడెడివి. మాధవ స్వామివారి రాత్రి యూరేగింపులలో పొన్నవాహనము, కుక్కుటేశ్వరుని సప్తనారీ హంసవాహనము మిక్కిలి ఆకర్షణీయమై జనము తండోపతండములుగా పోగొందురు. ఏడుగురు స్త్రీలు- నాట్యభంగిమలో నుండునట్లు దారువుతో మలచిన హంసవాహనమే సప్తనారీ హంస. ఈ వాహనము స్థానికులైనదారు శిల్పులచే తయారుచేయఁబడినది. రెండు దేవాలయములకు రెండు ఉన్నతమైన రథములుండెడివి. ఈ రథయాత్రలు అతివైభవముగా జరిగెడివి. పొన్నాడమంద బయలనుచోట రథమునాపి స్వామియెదుట భామకలాపము, గొల్లకలాపము ప్రదర్శించెడివారు. పెండ్యాల సత్యభామయను విదుషీమణి తమకు ప్రభువులచే నొసంగఁబడిన ఈనాముల ననుభవించుచు నేటట స్వామిసేవ చేయుచుండెడిది. మండపేట నాస్తవ్యులైన దేవదాసీకులస్థులు కళ్యాణోత్సవదినములలో ప్రతిదినము సాయంసమయములందు స్వామియెదుట మువ్వగోపాలపదముల నభినయించి ప్రేక్షకుల నానందపఱచెడివారు. రథోత్సవానంతరము ఉదయమే స్వామిని ఉప్పాడయను గ్రామమునందలి సముద్రతీరమునకు గజవాహనముపైఁ గొనిపోయి అచట చక్రతీర్థమను ఉత్సవము జరిపించి సాయంకాలమునకు మరల పీఠికాపురమునకు చేరికొనెడివారు. కుక్కుటేశ్వరునకు స్వామివారి పాదగయలో త్రిశూలస్నానము చేయింతురు. మఱునాడు జరుగు శ్రీ పుష్పయాగమున గ్రామమందలి పురంధ్రీమణులందఱు పాల్గొని స్వామికి పవళింపుసేవల నతివైభవముగా జరిపి యానందించెడివారు. కుక్కుటేశ్వరస్వామివారి కళ్యాణోత్సవమునకు ముందుజరుగు ఎదురుసన్నాహమునందుపురమునందలి పండితప్రకాండులెల్లరు పాల్గొనెడివారు. కన్యాదాతలైన పర్వతరాజుపక్షము కొందఱును, వరుఁడైన పరమశివునిపక్షము కొందఱును సంధానకర్తలుగ

వ్యవహరించి గావించు ప్రసంగములు, గోష్ఠులు, విద్వజ్జనమనోరంజకముగా, పండితహృదయాహ్లాదకరముగా నుండెడివి. కుక్కుటేశ్వరుని ఉత్సవమూర్తులను వేదపఠనముతో నూరేగింపుగా రథయాత్రకుఁ గొనిపోవుట, అందు పురప్రముఖులెల్లరు పాల్గొనుట ఒక సంప్రదాయము. రేటు గంగాధర రామారావుగారుకూడ రథయాత్రలోపాల్గొని స్వామిరథమునకుఁ గట్టినగొలుసులనుపట్టుకొని కొంతవఱకులాగి ఉత్సవమును స్వయముగా నిర్వహించెడివారఁట. రథయాత్రకుఁ బోవుమార్గముననే కుంతీమాధవుని యాలయముగలదు. స్వామికి ఈశ్వరదృష్టి పడరాదని ఆలయద్వారము ఆ సమయమున మూసియుంచి దండపాణులైన భటులు కాపుంచెడివారు. అదిచూచి కుక్కుటపతిని రథయాత్రకు గొనిపోవుచున్న శైవభక్తులు చూర్ణికలను హెచ్చరికలను భక్త్యావేశముతోను ఉచ్చైస్స్వరముతోఁ బలికి అందు 'మాధవ సేవితాయని' ప్రస్తుతించి పరాకులు దెల్పుట ఒక విద్వద్వినోదముగా భావించెడివారు. ఈ కళ్యాణోత్సవములందలి వైభవములకంతకు నాఁటి ప్రభువులు ఆదరణముగాక మఱియేమున్నది. ఇది చిరస్మరణీయమైనది. ఉత్సవమునకు వివిధ వ్యాపారస్థులను ఆకర్షించుటకై మహారాజావారు ఒక విచిత్రమైన ఆచారమునవలంబించిరి. ఉత్సవదినములలో నలంకరింపఁబడిన ఏ కొట్టు మిక్కిలి అందముగా నుండునో దానిని శ్రీరాజావారే పూర్తిగా క్రయముచేసెడివారఁట. ఈయాకర్షణతో ననేకవణిజులు ఈయుత్సవములలో పాల్గొనెడివారు.

రథయాత్రలు వైభవోపేతముగా జరుగుటకు మఱొక విశిష్ట సంప్రదాయమును రేటు గంగాధర రామారాయ ప్రభువు లమలులో నుంచినారు.రథోత్సవ నిర్వహణమునకైనియుక్తులైన పురప్రముఖులు-గ్రామకరణము - మునసబు, పెత్తనదారులు - అర్చకప్రముఖులు మున్నగు వారితోపాటు పారంపర్యముగా ఎస్టేటువారి యీనాముల ననుభవించుచు దేవాలయములందు వర్ణలేపములకు- వాహననిర్మాణములకునియమితులైన చిత్రకార కుటుంబము వారికొక యపూర్వగౌర

వము గూడ ననుగ్రహించినారు. కళ్యాణమంటపమునకు అలంకరింపఁబడిన అరటిగెలలను- రథయాత్రకు ముందు రథముపై నలంకరించి, రథయాత్ర పరిసమాప్తమై స్వామిరథమునుండి దిగినపిదప రథమునకు కట్టిన అరటిగెలలను దైవప్రసాదముగా వీరు స్వీకరింపవలెను. రథముపై అలంకారముగా ఉంచిన ఉన్నతమైన గుజ్జములను తయారు చేసిన చిత్రకారునకు రథముపై సూతునివిగ్రహపార్శ్వమున రథసారథిగా నొక స్థానము నియమించినారు. ఆ గుజ్జములకు కళ్లెముకట్టి స్వామిరథయాత్ర ముగియఁగనే ఆ యరటిగెలను కోసికొనివెళ్లునట్లుగా ఒకయాచారము నేర్పఱచి వారిని గౌరవించుట, వారివలన ఉత్సవము జాగరూకతతో నిర్వహింపఁబడుటకు వారుగావించిన ఏర్పాటు ఎంతటి విశిష్టమైనదో తెలియఁగలదు. ఈ రథయాత్రలో సారథ్యమును వహించుట ఆ చిత్రకారవంశస్థులు పారంపర్యముగ తమకు గొంచ ప్రదమైన ఒక హక్కుగా భావించుచుందురు.

ఆర్యక్షత్రియులనఁబడు చిత్రకారవంశజులు రాజా రావుకుమార వేంకటమహీపతిరాయనింగారి పితామహులైన పెద మహీపతిరాయనింగారి నాఁటినుండియు వంశపారంపర్యముగాఁ బోషింపఁబడుచుండిరి. వారిలో సుమారు 1840 ప్రాంతమున కాముబుషి పాపయ లింగకవి యను నాతఁడు లేటు గంగాధర రామారాయనింగారి తండ్రిగారగు సూర్యారాయనింగారి నాఁటినుండియు ఆస్థాన వైద్యులుగానుండి వారిచే భిషగ్వరబిరుదము నొందినట్లుగాఁ దెలియుచున్నది. ఈ కవి తల్లజుఁడు మాక్తికాభ్యుదయము వైద్యనాథశతకము- గణేశశతకము- కుక్కుటలింగశతకము మొదలగు కృతులు రచియించెను ఇవి తాళపత్రములపై విభజింపఁబడి కాలక్రమమున కీటకదష్టములై పోయినను, మిగిలిన వానిలోఁగల చాటుధారలలో శ్రీసూర్యారాయనింగారికినంకితముగా విరచించిన నొక పద్యము నిట నుదాహరింతును.

అవనిం బెద్దమహీపతి ప్రభుముఖిత్పాత్మ ధీశ్వరానంత రో
ద్భవమై వేంకట నీలభూధరవరేంద్రాత్మ జముర్వీ సుర

స్తవనీయ ప్రభ వృద్ధినొందుచుఁ దమద్యద్వీరనాగేశ్వరు
న్వివిధ శ్రీయుతుఁ జేసెఁ జిత్రకభిషగ్విద్యావిశేషంబులన్.

ఈ భిషగ్వర పాపయలింగకవి తన ప్రభులగుఱించి యిట్లు వ్రాసెను.

శ్రీమర్త్యలోక విశిష్టశ గౌతమసున
ద్యేలానదీ సమాహితవసుంధ
రాధ్యక్షు పాదగయాక్షేత్రతట సము
ద్యత్పీఠనగర సింహాసనస్థుఁ
డతుల రేచర్లగోత్రాఢ్యుండు వేంకట
నీలాద్రిరాయ భూపాలవర్యుఁ
డను రావువంశ దుగ్ధాంబుధి ద్విజరాజు
రాజాధిరాజ తనూజులందు

నలరు వేంకటసూర్యరాయాధిరాట్కు-
మార వేంకటమహీపతిక్ష్మాతలేంద్రు
లనఁగ నిరువురు గుణసాంద్రు లధికభోగ
భాగ్య విభవానుభవులు మత్ప్రభువులరయ.

ఈ కవి సోదరుఁడైన మృత్యుంజయుఁడు ఆస్థాన చిత్రకారునిగా గౌరవింపఁబడెను. ఈయన కవిత్వజ్యోతిషంబులఁ గూడ ప్రవేశముగల వాఁడు. శ్రీ గంగాధర రామారావుగారు లోకమాతృకతనిఁ బిలిపించి వైకుంఠపటమును వ్రాసి తెమ్మనినారఁట. వాహనములను దారుఖండముతో నిర్మించుట- వర్ణలేపముగావించుటయేగాక- దర్బారులో ప్రభువులు కొలువుదీర్చినట్లుగా 'తస్వీరు లనఁబడుసూపచిత్రములను వ్రాయుట- ప్రభువుల భోజనముపైఁ బఱచునుల్లిపొరలవంటి కుందనపు రేకులను తయారుచేసి వారికి సమర్పించుట- ప్రభువుల వినోదములకై కళలుట్టిపడునట్లు దశావతారవిగ్రహములను తయారుచేయుట ఈచిత్రకారులప్రత్యేకవిశిష్టతఆయాసమయములలోప్రభువులుకోరినవిధముగా పురాణకథలచిత్రించియిచ్చి వారిఆదరమునకు గౌరవములకుపాత్రులగు

చుండెడివారు. ఆ విధముగా ప్రభువు ఆజ్ఞానుసారము కైలాసపట మును శాస్త్రోక్తముగా లిఖింప, ప్రభువు సంతసించి నూటపదియారు లిచ్చుటయేగాక చిత్రలేఖన కౌశలమునకు మెచ్చి పీఠికాపురమున నొకమాన్యము గూడ దయచేసినారు. ఈ సందర్భమున ఈ పాపయ లింగకవి ఈ క్రింది పద్యరూపమున తన కృతజ్ఞతను వెల్లడించుకొనెను.

ఉ. భూతిఘటింప మానవుల పుణ్యవశంబున ఫాలసీమల
న్నాతలిఖించెనా యొకరినాఁటి దదేమిటి రావువంశజుం
డై తగు రామరాయ వసుధాధిపు డెన్నరికై లిఖించు నా
వ్రాఁతఁ దదాత్మజాత్మజపరంపర లెల్ల ఫలించు నెప్పుడున్.

ఈ పటము చాలకాలము రాజమందిరమున నలంకరింపఁబడి యుండెడిది. ఈ పద్మనాయక ప్రభువుల కళాపోషణమునకు ఇది కేవల మొక చిన్న యుదాహరణము. నాఁటిప్రభువుల ఆదరణములో ఎందఱు కళాకారులు పోషింపఁబడిరో- ఆ ప్రభువుల అస్తమయముతో ఎన్ని కళాఖండములు రూపుమాసిపోయినవో చరిత్రలే చెప్పఁగలవు.

సూర్యరావుప్రభువు రాజ్యాధికారము స్వీకరించిన పిమ్మట బ్రహ్మ సమాజమువంటి మతసంస్కరణలకు ప్రోత్సాహముకలిగించినను గూడ ఈ దేవాలయవిధులు కార్యకలాపములు నిర్విఘ్నముగా కొనసాగించి నారు. వైకుంఠ ఏకాదశి మొదలగు పర్వదినములలో సంస్థానమునకు చెందిన గజరాజును, ఉత్తమజాతి శ్వేతాశ్వమును- ఇతర తురంగము లను సర్వాభరణములతో నలంకరించి గ్రామోత్సవములందు నూరే గించుట కన్నులపండువుగా నుండెడిది. కోటలోనికివచ్చిన దేవునకు కర్పూరహారతులిచ్చి ప్రభుకుటుంబము తీర్థప్రసాదముల స్వీకరించెడి వారు. ఇది సర్వమతరీతులయెడల వారికిగల సమానాదరణము వ్యక్తము చేయఁగలదు.

నాట్యకళాపోషణము.

ఆ కాలమున చేబ్రోలు వాస్తవ్యులైన కొల్లూరి వెంకయ్య గారు కుటుంబమేళములతో భామకలాప ప్రదర్శనము లిచ్చుచుండెడి వారు. వీరు ఆరామద్రావిడశాఖకు చెందినవారు. కూచిపూడి సంప్ర

దాయము ననుసరించి భామవేషముతో పాటు ప్రక్కవాంగులు తాళములు, మృదంగము, వంతపాట మొదలగు వాంగులన్నింటిని కుటుంబములోనివారే నిర్వహించుట ఒకయాచారము. ఆనాఁడు మృదంగ వాద్యములోను ప్రసిద్ధులైన వడలి చంద్రయ్యగారు ఈ కొల్లూరి వెంకయ్యగారికి గురువులు- రామచంద్రపురము తాలూకా ఆలమూరు వాస్తవ్యులు పుల్లాభంతుల చలమయ్యగారుకూడ ఆనాఁడు భామకలాప ప్రదర్శనములందును, భామవేషధారణమునందు మంచిప్రఖ్యాతిఁబడసి యుండిరి. వీరు పెదబ్రహ్మదేవము నివాసి పెండ్యాల సత్యభామయను నొక దేవదాసికన్యకు భాగవత కలాప ప్రదర్శనము నేర్పినారు. కొల్లూరి వెంకయ్యగారీమె ప్రదర్శనమును జూడ తటస్థపడినది. పీఠికాపురసంస్థానమున అంతఃపుర ప్రదర్శనములో భామవేషము వేయగల స్త్రీకొఱకన్వేషించుచు ఈ సత్యభామను పీఠికాపుర సంస్థానమునకుఁ జేర్చి దేవుని కళ్యాణోత్సవములలో భామకలాపప్రదర్శనముల నిచ్చుటకై ఈనాములనొసంగి ఆస్థానవిదుషీమణిగా నొనర్చిరి. గంగాధర రామారావుగారు ఈమెకలాపప్రదర్శనములఁ జూచి ప్రశంసించి యామెకు దినభత్యము నేర్పాటుగావించి భూమినిగూడ ననుగ్రహించినారు.

నాటక కళాపోషణము.

ఆంధ్రషేక్స్పియరు, అభినవ కాళిదాస బిరుదాంకితులైన పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, ఈ యాస్థానకవులుగా నుండెడివారు. పానుగంటివారు రచియించిన సుమారు నలువది నాటకములను మహారాజావారే ముద్రించి ప్రకటించియున్నారు. వారి నాటకములలో ప్రఖ్యాతములైన పాదుక, విప్రనారాయణ, కంఠాభరణము, కోకిల- రాధాకృష్ణ మొదలుగాగల నాటకములు ప్రసిద్ధులైన నటులచే కోటలో ప్రదర్శింపఁజేసి వారికి ఉచిత సత్కారములుగావించెడివారు. ఆనాటకములకు శ్రీ నరసింహారావుపంతులుగారే స్వయముగా నటులకు శిక్షణ నిచ్చెడివారు. రాణీగారగు చిన్నమాంబగారికిఁ గల నాటకకళాసక్తికి

నిదర్శనముగా నాటకాంలమున నటకులను అనేక మధురఫలములతో భక్ష్యములతో సంతృప్తి పఱచెడివారు. సంగీతకళలో వీరికి గల అభిమానము పైకళాభిమానమునకు తీసిపోవునదిగాదు. ప్రఖ్యాతవైణిక విద్వాంసులు నందిగాన వెంకయ్యగారు- టాగోరును ముగ్ధునిఁగావించి వారిచే మన్ననలనందిన వైణికసరస్వతి తుమురాడ సంగమేశ్వరశాస్త్రి గారు వీరి యాస్థాన విద్వాంసులు కాకినాడ గానసభలకు ప్రధానపోషకులైన పీఠికాపురప్రభువు ఆ సభలకు వచ్చిన విద్వాంసులనందఱను మరల కోటలో కచ్చేరీలు చేయించి సన్మానించి పంపుచుండెడివారు.

మల్ల విద్యావిశారదులైన వస్తాదులను పంజాబునుండి రప్పించి వారిని పోషించి వారిచే కుస్తీప్రదర్శనముల నేర్పాటుగావించి యుండిరి. ఆనాఁటి విద్యార్థులకు ఈ మల్లవిద్యాభ్యాస మొక ప్రత్యేకాకర్షణగా నుండెడిది. ఇదిగాక నవీనములగు కందుక క్రీడలు బేట్మింటన్, టెన్నీసు మొదలగు క్రీడలలో ప్రఖ్యాతులైన ఆటగాఁడ్రను రావించి ఆ క్రీడలను ప్రదర్శింపఁ జేయుచుండెడివారు. ఇట్లు బహుముఖములవర్ధిల్లిన వారి కళాపోషణము చరిత్రలో చిరస్మరణీయమైన కథలుగా మిగిలిపోయినవి. ఉద్యానవనములఁ బెంచుటలో వీరికిఁగల ఆసక్తి మిగుల ప్రశంసనీయమైనది. గులాబీలన్న అత్యంతప్రీతి- ఎన్నియోరకముల గులాబీలను కోటఆవరణములో అత్యంత సుందరముగా నభివృద్ధి గావించినారు- అనేక ప్రదర్శనములలో వీరి గులాబీలు బహుమతులందుకొన్నవి. మేలుజాతి శునకములఁ బెంచుటయందుఁగూడ వీరికి విశేషమగు మక్కువ యుండెడిది. ప్రభువుల విలాస, వినోదములు అనేకకళాకారులను బోషించుటకుఁగళలనుద్ధరించుటకు నుపకరించెడిది. బహుముఖమైన కళాసాహితీ పోషణలో ఒక విశిష్టస్థాన మాక్రమించి చిరయశోవిభూషితులైన పీఠికాపుర సంస్థానాధిపతులు చరిత్రలో ఒక ప్రత్యేకస్థానముగ నెంచికొన్నారు. ఇటువంటి మహనీయుల కళాసాహితీసేవలను సంస్మరించుట ఒక పవిత్రధర్మముగా నెంచవలసి యున్నది.

---

ఆదిమారామములోని అమరేశ్వరలింగము,

బౌద్ధస్తూపములోని ఆయకస్తంభముకాదు.

—చిలుకూరి పాపయ్యశాస్త్రి.

ఇంతకుముందు నేను త్రిలింగదేశములోని పంచారామములు పరమశివక్షేత్రములేగాని బౌద్ధసంఘారామములు కాఁజాలవని, శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణములో పంచారామములనుగూర్చి తెలిపిన వాక్యముల నాధారముగాఁ జేసికొని, వివిధమైనయుపపత్తులతోఁ దెలిపియున్నాను. భీమమండలములో గౌతమీనదికిరుప్రక్కలనుండెడి నాలుగారామములను బలుమాఱులు చూచి, ఆపరిసరములలో నెక్కడను బౌద్ధావశేషములు లేకుండుటను గుర్తించుటచేతను, దాక్షారామకుమారారామములలోని యీశ్వరలింగములు పొడవుగా నుండినను, క్షీరారామసోమారామములలోని లింగములు పొడవుగ లేకుండుటచేతను, ఆగమోక్తపద్ధతిని వైదికమంత్రతంత్రములతో నిర్మించెడి పరమశివాలయములో, వేదప్రామాణ్యము నంగీకరింపని బౌద్ధమతస్థుల చైత్యాదినిర్మాణములలో నుపయోగించిన శిలలను శల్యములని పరిహరించెదరేగాని, వానిని వైదికనిర్మాణముల కుపయోగించెదరనుట భారతీయసంప్రదాయవిరుద్ధ మగుటచేతను బౌద్ధసంఘారామములే పంచారామములుగ మాఱిన వనుటగాని, బౌద్ధచైత్యములకు సంబంధించిన ఆయకస్తంభములు శివలింగములుగా మాఱిన వనుటగాని సరిపడదని వాకొనియుంటిని.

ఈ నడిమికాలములో వింతయైన నిర్వచన మొకటి వినవచ్చుచున్నది. ఆరామ మనేశబ్దము బౌద్ధులపరిభాషలోనే యున్నదనీ, బౌద్ధసంఘారామములే శైవమతప్రాబల్యము వచ్చిననాఁడు పంచారామములుగా మాఱిపోయినవనీ, గతానుగతికముగ వ్రాఁతలు వ్రాయుచున్నారు. ఇట్టి యూహచేయుటకు మూలము-ఆదిమారామమైన అమరారామ మున్నచోట ధాన్యకటకములో, అమరేంద్రప్రతి

ష్ఠితుఁడైన అమరేశ్వరలింగ ముండుట,ఆధరణికోటకుఁ జేరియే బహువిధశిల్పసంభరితమై యావద్భారతమునందేగాక విదేశములందును ప్రసిద్ధమైన బౌద్ధచైత్యసంఘారామము లుండుట, ఆచైత్యనిర్మాణమున కుపయోగించిన తాళ్లు పాలతాళ్లగుట, అచటి యమరేశ్వరలింగపు శిలయుఁ దెల్లగా నుండుట యను వీనినిబట్టి, ఆచైత్యమునకు సంబంధించిన యొకపలకలతాతిని గుండ్రముగాఁ జెక్కించి శివలింగముగాఁ జేసినారని యూహించి, ఆయూహనే మిగిలినయారామములకుసైత మంటఁగట్టుట. ఇట్టియూహ యెంతవఱకు సరిపడునో కొంత పరికించి చూచెదముగాక.

ముందుగా నిట్లూహించుట కనువుగ వ్రాసిపెట్టినవారు, ఆంధ్రదేశములోని బౌద్ధావశేషములను ఖననపరిశోధనాదిక్రియలచే బయటఁబెట్టి, ఆయాతావులలోని బౌద్ధశిల్పములవిశిష్టతను గూర్చి చాటి చెప్పిన పాశ్చాత్యవిమర్శకులు, తదనుయాయులై చరిత్రపరిశోధకులైన మనవారును. భూమిలో నడుగునఁబడియున్న చారిత్రికసామగ్రిని బయటఁబెట్టి, దానిని వెలుఁగులోనికిఁ దెచ్చినదానికి, పాశ్చాత్యులకు భారతీయు లెప్పుడును కృతజ్ఞులై యుండకతప్పదు. కాని పాశ్చాత్యులు భారతీయధార్మికసంప్రదాయములను దలస్పర్శిగఁ దెలిసికొనెడి యవకాశములేక యేవియో కొన్నియూహలు చేసినను, మనసంప్రదాయమును కొంతవఱకైనను సమగ్రముగనో తెలిసికొనునవకాశముగలమనవారు, ఈనాఁడుకూడ నా విధముగనే వ్రాయుట వింతగానున్నది. అట్టి వ్రాఁతలు ప్రమాణసిద్ధములు కానేరవని నా మనవి.

1962 లో భారతీయవిద్యాభవనము-(బొంబాయి-వారు ప్రకటించిన 'ఆంధ్రదేశములోని దేవాలయములు-వాని వెనుకటి గాథలు' (Temples and Legends of Andhrapradesh) అనే గ్రంథములో 89వ పుటలో, యన్. రమేశన్ అనువారు, "అమరేశ్వరాల

యములోని మూలవిరాట్ దగ్గఱ, మిగిలినతావులందును బౌద్ధస్తూపమునకు సంబంధించిన ఆయక స్తంభమే యచటి లింగముగా మాఱించె నని తెలిపెద”రనియు వ్రాసియున్నారు.[1]

ఈ క్రోధి విజయదశమినాఁడు బయలుదేరి నేను ధాన్యకటకము నకుఁబోయి అచటి యమరేశ్వరాలయమును, ధనకటకదుర్గమును జేరి యున్న చైత్యశిథిలములను బరికించి వచ్చితిని. ఆ దేవాలయములో తూర్పుభాగమున శ్రీ వాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడుగారు, క్రీ. శ. 1880 ప్రాంతమున క్రొత్తగ నొకమంటపము గట్టించి, తమశిలాప్రతిమతోపాటు కొన్నివిగ్రహములు నెలకొల్పి దేవళమునకుఁ గొన్ని మరమ్మత్తులు చేయించిరి. అట్లు చేసినవానిలో మూలవిరాట్టుప్రక్కన మెట్లమీఁదుగా పైకెక్కి శివలింగమున కభిషేకము చేయుటకు దక్షిణోత్తరభాగములో జనులు నిలుచుండుటకై మిద్దె వంటిది తాళ్లతో నేర్పాటుచేయించిరి. ఆ మిద్దెకు తీర్చిన రాతిపలకలలో, అచటి చైత్యమునకు సంబంధించిన అశోకచక్రము, పరుగిడుచున్నగుఱ్ఱములు చెక్కినరాయి యున్నది. ఇటులనే ఉత్తరమున నుండిన మెట్లమార్గమునకు మీఁద, అర్ధపద్మాకారశిల్పముతోఁ గూడిన రాయియొకటి అడ్డముగను, మఱియొకరాయి నిలువుగను గూర్చుట జరిగినది. ఈ విధముగ అమరేశ్వరాలయములో ధనకటకచైత్యమునకు సంబంధించిన పాలరాళ్లు మూఁడు వచ్చిచేరిన వనుట తథ్యము. శ్రీ వెంకటాద్రి నాయుఁడుగారు, చింతపల్లినుండితమనివాసమును అమరేశ్వరాలయము దగ్గఱకు మార్చి, యచట భవనములు నిర్మించి, అంతకు ముందు పేటగా నుండిన దానిని పురముగాఁ జేసినారని, చరిత్రకారులును, అచటివారును జెప్పుచున్నారు. వారు తమ భవననిర్మాణమున ఈ

1. The mulavirat is a long vertical cylinder made of white marble stone which is so extensivly used in the Buddhist manuments.

చైత్యమునకు సంబంధించినపాలఱాళ్లను సున్నముగాఁ జేయుట కుప యోగించినట్లు, మెకంజీదొరగారి వ్రాఁతలలో నున్నది. అందుచే నమ రేశ్వరాలయములోని కామూఁడు పాలఱాళ్లు వారినాఁడే చేరిన వనుట తథ్యము.

ధనకటకచైత్యములో, ఇతరప్రాంతములకుఁ దరలించుకొని పోఁగా మిగిలి, ఆచైత్యముచుట్టును తరువాత పాతియున్న ఱాలు.అచటి పురావస్తుప్రదర్శనశాలలోఁ జేరి మిగిలియున్నవి, వివిధశిల్పములతోఁ గూడియున్నవి, కూడనివికూడఁ జాలఁ గలవు. అవి యన్నియు పాల ఱాళ్లేయగుట నిశ్చయము. కాని యవి యన్నియు కొంచెము బూడిద రంగుచఱచిన పాలఱాళ్లే. వానిలోఁ గొన్ని లేతగోధుమరంగు,కొన్ని లేతనీలిరంగు గలవిగానేయున్నవి. కేవలము తెలుపురంగే యొక్క ఱాతికిని లేదు. ఇక్కడనే కాదు. నాగార్జునకొండలో బయటఁబడి శిల్పములతోఁ గూడినపాలఱాతిపలకలు ఆయకస్తంభములు మొద లయినవన్నియు బూడిదరంగు చఱచిన పాలఱాలే యని, అచటి ఖనన పరిశోధనలో పాల్గొన్న శ్రీ టి. యన్. రామచంద్రన్‌గారు విజ్ఞానస ర్వస్వము. సంస్కృతిసంపుటము-నాగార్జునకొండ యను వ్యాసములోఁ దెలిపియున్నారు. ప్రత్యేకదృష్టితో ప్రత్యక్షముగఁ బోయిచూచిన వారుగాని ఈ విషయమును గుర్తింపఁజాలరు.

అమరేశ్వరదర్శనమునకుఁ బోయినపుడు అచటిపూజరులు నాతో నిట్లు తెలిపిరి. "శ్రీ రాయప్రోలు సుబ్రహ్మణ్యముగారు (పరిశోధ కోద్యోగ్యులు) పలుమాఱు లిక్కడకు వచ్చి, బౌద్ధావశేషములను పరిశోధించుచు, ఈ స్వామి కభిషేకము చేయించుచు," 'ఇది బౌద్ధ స్తూపమునకు సంబంధించిన ఆయకస్తంభమే లింగముగా మాఱినది. ఏమయితేనేమి? అభిషేకము చేయించండి' అని యనుచున్నారు. ఇం కను మఱికొందఱు చరిత్రజ్ఞులుకూడ ఆవిధముగనే యనుచున్నారు.

విగా రేమందురు?" అనినారు. నే నప్పుడు మూలవిరాట్టుప్రక్కనే మిద్దెకుఁ గూర్చిపెట్టిన తాతిని, మెట్లమీఁద పేర్చిన తాళ్లను చూపించి, ఈ మాఱు వచ్చి యీ మాట లనెడివారందఱికి, లింగపుశిలకుఁ గల రంగును, ఈ తాళ్లరంగును జూపించి 'ఈ రెండును ఒకేశిల యగునా?' అని యడుగుఁడని తెలిపినాను.

అమరేశ్వరలింగము పాలతాతిలింగమే. కాని యాశిలయంతట నల్లటిమచ్చ లున్నవి. నలుపుతోఁ గూడిన తెలుపు. దాక్షారామము లోను కుమారారామము (సామలకోట భీమవరము) లోను గల భీమేశ్వరలింగముల యెత్తు రంగుకూడ అమరేశ్వరలింగమునంకువలెనే యున్నవి. కనుక అమరేశ్వరలింగము ఆయక స్తంభము లింగముగా మాఱుట యనునది వట్టిభ్రాంతియే కాని మఱియొకటి కాదు. బౌద్ధావశేషములం దెక్కడనుండిన పాలతాతివిగ్రహములుగాని, శిల్పములతోఁ గూడిన తాతిపలకలుగాని, బూడిదరంగు చఱచియున్న తాళ్లేగాని, శుద్ధస్ఫటికవర్ణములు గలవి గావని, అమరేశ్వరుఁడే ఆయక స్తంభము కానినాఁడు, బౌద్ధావశేషములు చుట్టుపట్ల లేని మిగిలిననాలుగారామములలోని లింగములు సుతరాము కావని సహృదయులకు మనవి చేయుచున్నాను. ఈ నా మాటలు సరిగా లేవనుకొనువా రుండిన, వారు అమరారామమునకుఁబోయి, అచటి పరమేశ్వరమూర్తిని, అచటి కొకమైలులో ధరణికోటకుఁ జేరియున్న చైత్యముదగ్గఱ శిథిలమై పడి యున్న పాలతాళ్లను కన్నులారఁ జూచి, నిర్ణయించుకొందురుగాక యని మనవి.

## అమరేశ్వరుఁడును ధాన్యవాటికిఁజెందినవాఁడే.

అమరేశ్వరాలయములోని శిలలమీఁద పెక్కులు దానశాసనము లున్నవి. ఇవన్నియుఁ జాలవఱకు దక్షిణహిందూస్థానశాసనసంపుటము VI లో ముద్రితములైయున్నవి. వానిలో ధాన్యవాటీపురములో అమ

రేశ్వరుఁడు పూర్వప్రతిష్ఠితుఁడైనట్లుతే ఆ యా శాసనములలోని శ్లోకములు తెలుఁగు వాక్యములు తెలుపుచున్నవి. ఉన్నవానిలో కోటకేత రాజు ఆతనిపరివారము నిచ్చిన దానశాసనములు హెచ్చు. శకవర్షంబులు ౧౨౮౩ లో అనవేమారెడ్డి వేయించిన దానశాసనమునుబట్టి, అమరారామము పంచారామములలో ఆదిమారామమని, ఆతఁడాలింగమునకు పునఃప్రతిష్ఠ చేసెననియుఁ దెలియవచ్చుచున్నది. అచటివిషయ మిట్లున్నది.[2]

యో దేవస్సచరాచరాఖిలజగద్రక్షాప్రతిష్ఠావిధా
ప్రజ్ఞావానమరేశ్వరో విజయతే శ్రీధాన్యవాటీపురే.

శ్రీమతు వేమనంగారు శకవర్షంబులు ౧౨౮౩ అగు ప్లవసంవత్సర శ్రావణ బ ౫ గు. స్వస్తి సమస్తప్రశస్తిసహితులైన శ్రీమతు అనపోతయరెడ్డింగారికి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిన్ని ధనకనకవస్తువాహన సమృద్ధిన్ని పుత్రపౌత్రాభివృద్ధిన్ని అవునట్లుగాను పంచారామంబులకు ప్రథమారామంబైన అమరారామంబను ధాన్యవాటీపురంబున కధీశ్వరుండైన అమరేశ్వరశ్రీమన్మహాదేవరను ఆ చంద్రార్కముగాను పునః ప్రతిష్ఠ చేసిరి.

శక. ౧౧౦౪ న కోటకేతరాజు వేయించినదానశాసనములోను 'అస్తి స్వస్తిమతీ పురీ జననుతా శ్రీధాన్యవాటాహ్వయా' అనియు 'ప్రాదాదీశాయ దీపాన్గుణనిధిరమరారామగేహాయ సోఽయమ్'[3] అనియు ననుటచే ధాన్యవాటిలో నమరేశ్వరుఁడు గలఁడనియు, ధాన్యవాటియే అమరారామ మనియుఁ దెలియుచున్నది అమరేశ్వరాలయమునకు ఎదురుగ నుండినది క్రౌంచగిరి. ధాన్యకటకము అమరేశ్వరాలయము కూడ కృష్ణానదియొడ్డుననే యున్నవి. కృష్ణానదికిఁ మీఁద శ్రీశైలమల్లికార్జునాలయమును, ధాన్యవాటికి క్రింద విజయవాటికలో

2. S. i. i. Vol. VI No. 226.
3. S. i. i. Vol. VI No. 224.

నొక పురాతనమైన మల్లేశ్వరాలయమునుండి, నడుమలో శ్రీశైలమున కీశాన్యమున క్రౌంచపురమున బాలచాముండాసమేతుఁడైన అమరేశ్వరుఁ డున్నాఁడు.

కృష్ణవేణీనదీతీరస్థమై యమరేశ్వరున కావాసమైన ధాన్యవాటి పరమపుణ్యక్షేత్ర మగుటచేతనే శాతవాహనులు మొదలుగ చాల మంది ప్రభువులు ధరణికోటను రాజధానిగాఁ జేసికొని రాజ్యమును బాలించుచువచ్చిరి. శాతవాహనుల కాలమునందో అంతకుఁబూర్వమో తెలుపలేముగాని, బుద్ధధాతునిక్షేపముఁగల మహాచైత్య మొకటి యేర్పడి, అది శివభక్తులకేగాక బౌద్ధమతానుయాయులకుఁగూడఁ బరమారాధ్యమైన క్షేత్రమై వెలసినది. కోటకేతరాజును ఆతని మూఁడువారును వేయించిన దానశాసనములనుబట్టి, వెనుకటికాలములోనివారు, ధాన్యవాటిలోని అమరేశ్వరునితో సమానునిగ నచటి బుద్ధదేవుని భావించి గ్రామములు దీపదానములు చేయించినట్లు తెలియుచున్నది. అమరేశ్వరాలయప్రవేశద్వారముకడ నున్నయొక నల్లని జాతిస్తంభముమీఁద బుద్ధునివిగ్రహములు రెండిటికింద రెండు శాసనములు చెక్కఁబడియున్నది. ఆ శాసనభాగము నొకకొంతవివరించెదను.[4]

అస్తి శ్రీధాన్యకటకం పురం సురపురాద్వరమ్
యత్రామరేశ్వరశ్శంభు రమరేశ్వరపూజితః
బుద్ధో దేవస్సుసాన్నిధ్యో యత్ర ధాత్రా ప్రపూజితః
చైత్యమత్యున్నతం యత్ర నానాచిత్రసుచిత్రితమ్
అస్తి తత్ర స్థిరైశ్వర్యం రాజ్ఞామాజ్ఞావతాం కులమ్
అమరేశ్వరదేవేన రక్షితం రక్షకం నృణామ్
క్షోణీక్షేమంకరా భూపా యత్ర శత్రుభయంకరాః

4. Epi. Ind. Vol. vi. Two Pillar Inscriptions at Amaravati PP. 146 to 152.

శంకరాస్నాధువృత్తానాం శంకరస్య తు కింకరాః
తత్రామరేశసంకాశో భీమోనామ నృపోఽభవత్.

ఈతనిప్రశస్తి, తరువాత నీతనికుమారుఁడు కేతరాజు, ఆతనికొడుకు భీముఁడు, ఆతనికుమారుఁడు కేతరాజును బయలుదేరి రని చెప్పి వారి వారి ప్రశస్తిని వర్ణించి యున్నాఁడు. ఆ మనుమ కేతరాజు బుద్ధదేవరకుఁ జేసినదాన మిట్లున్నది.

శాకాబ్దే యుగఖేందురూపగణితే మాఘే దశమ్యాం తిథౌ
శుక్లాయాం గురువాసరే గుణనిధి స్సంప్రాప్తరాజ్యోన్నతిః
శ్రీమత్కేతనృపస్సమస్తగురవే గ్రామాన్వరేణ్యాన్బహూ
న్సంప్రాదాత్సుగతేశ్వరాయ విపులశ్రీధర్మసంవృద్ధయే.

స్వస్తి చతుస్సముద్రితనిఖిలవసుంధరాపరిపాలక శ్రీమత్త్రిణయనపల్లవ ప్రసాదాసాదితకృష్ణవేణ్ణానదీదక్షిణషట్సహస్రావనీవల్లభ భయలోభ దుర్లభ చోడచాళుక్యసామంతమదానేకపమృగేంద్ర విభవామరేంద్ర శ్రీమదమరేశ్వర దేవదివ్య శ్రీపాదపద్మారాధక పరబలసాధక శ్రీధాన్య కటకపురవరాధీశ్వర ప్రతాపలంకేశ్వర కలిగళమోగదకై వేడ్యరి గేవకై గండరగండ గండభేరుండ జగమెచ్చుగండ నన్నిమార్తాండ నామాదిప్రశస్తిసహితం శ్రీమన్మహామండలేశ్వరకోటకేతరాజులు శక వర్షములు ౧౧౦౮ గునేంటి మాఘ శుద్ధ ౧౦ గురువారమున శ్రీమ ద్బుద్ధదేవరకు సుంకసు(ము?) లోనుగా సర్వాయములతో నాచం ద్రార్కముగా నిచ్చిన ఊడ్లు-కండ్రవాడిలోని క్రింతేఋ కొండపడ మటిలోని మేడుకొండూరును, డొంకిపఱ్ఱును ఈ ధర్మము నడపనివారు పంచమహాపాతకములు సేసినవారు వారణాసి ప్రచ్చినవారు పెద్ద కొడుకు కపాలమునం గుడిచినవారు.

వేదా(౦) శేందుమితే శాకే మాఘే శుక్లే గురోర్దినే
దశమ్యాం కేతభూపాలో దీపౌ బుద్ధాయ దత్తవాన్

స్వస్తి సమస్తప్రశస్తిసహితం శ్రీమన్మహామండలేశ్వర కోటకేతరాజు శకవర్షంబులు ౧౧౦౪ గు నేఁటి వగాము శుద్ధ ౧౦ గురువారమునం దమకు ధర్మార్థముగా శ్రీమద్బుద్ధదేవరకు నఖండవర్తిదీపములు రెంటి కినై ఇచ్చిన ఇన్పఎడ్లు ౧౧౦.

...భోగస్త్రీలలో నంగసవి సూరమదేవులు దనకు ధర్మార్థముగా శ్రీమద్బుద్ధదేవరకు నఖండవర్తిదీపమున కిచ్చిన ఇన్పఎడ్లు ౫౫.

భండార్వ పోలిమదేవులు దనకు ధర్మార్థముగా శ్రీమన్మహా బుద్ధదేవరకు నఖండవర్తిదీపమున కిచ్చిన ఎన్పఎడ్లు ౫౫. దీనితరువాత కోటకేతరాజు తమతల్లి సబ్బరుదేవులకు ధర్మార్థముగా కొండనాతవాడిలోను కొండపడమటిసీమలోను, అన్నచోడరాజునకు తనకు ధర్మార్థముగా బ్రాహ్మణులకు ఇచ్చిన ఊళ్లు పేర్కొనఁబడినవి.

అదే స్తంభమునం దొకవైపున బయ్యలదేవి బుద్ధదేవరకు అఖండదీపదానము చేసిన శాసనముకూడఁ గలదు. ఆ శాసనభాగ మీ క్రిందివిధముగా నున్నది

శ్రీమన్మహామండలేశ్వర నాతవాడి రుద్రదేవమహారాజుల కూంతులు కోట బయ్యలమహాదేవి అమ్మంగారు దనకు ధర్మార్థముగా శ్రీమద్బుద్ధదేవరకు నాచంద్రార్క మఖండదీపమునకు ఇచ్చిన ఇనుపయెడ్లు ౫౫.

ఈ శాసనములలోని విషయములనుబట్టి తెలియవచ్చెడి యంశములు.

1. ధాన్యకటక మనేపట్టణము స్వర్గపురముకంటెను ఉత్తమమైనపట్టణము. దేవేంద్రపూజితుఁడైన అమరేంద్రుఁ డక్కడ నుండుట యందులకుఁ గారణము. ఆ పట్టణమునకున్న భాగ్యము మఱియొకటి, బ్రహ్మచేఁ బూజితుఁడైన బుద్ధదేవుఁ డచ్చట సత్సాన్నిధ్యము కలవాఁడై యుండుట, వివిధచిత్రములచేత బాగుగ చిత్రితమయిన

చాలపెద్దదగు చైత్య మచ్చట యుండుటయును- అని యీ రెండు శ్లోకముల భావము. దీనిబట్టి అమరేశ్వరుఁడు ధాన్యకటకమున ముందుగ ప్రతిష్ఠితుఁడనియు, తరువాత బుద్ధదేవుఁడు ధాన్యకటకమునకుఁ జేరెననియు, ధనకటకచైత్యము చాలయెత్తయినదనియు వివిధచిత్రసుచిత్రితమైన దనియు 12వ శతాబ్దినాఁటివారికిఁ దెలియుననియుఁ దెలియవచ్చుచున్నది.

2. దీనినిబట్టియే అచట నుండినబౌద్ధాయతనమునకు ధాన్యకటకచైత్యమనియేగాని అమరావతీస్తూప మనుపే రున్నట్లు తెలియవచ్చుటలేదు. అచటి ప్రాకృతశాసనములలో సైతము ధనకటకచైత్య మనియే పేరున్నదనువిషయము నీ శాసనము బలపఱుచుచున్నదనియు విదితమగుచున్నది.

3. ఆనాఁడు అమరేశ్వరపాదపద్మారాధకుఁడైన కోట కేతరాజు అమరేశ్వరునకు గ్రామములు దానముచేసినట్లే, బుద్ధునిగూడ తత్సమానముగ దేవునిగా భావించి, ధర్మసమృద్ధికై బుద్ధదేవరకు గ్రామదానములు అఖండదీపదానములు చేసి, ధర్మశాసనముల నమరేశ్వరాలయములో నే, బుద్ధుని విగ్రహములతోపాటు వెలయించుటచే, అచటిబుద్ధు నవతారమూర్తిగనే యప్పటివారు భావించిరని తెలియవచ్చుచున్నది.

4. ఈ కోటకేతరాజు పరమశివభక్తుఁడై యుండి 'అమరేశ్వరదేవదివ్య శ్రీపాదపద్మారాధక' అనుబిరుదము వహించియును బుద్ధదేవరకు ధాన్యవాటీపురవరాధ్యక్షుఁడై ధర్మార్థముగ గ్రామదీపదానములు చేసె ననుటచే నానాఁడు శైవమునకు బౌద్ధమునకు విరోధమిసుమంతయు లేదని విదితమగుచున్నది.

5. కోటవంశమునకుఁ జెంది ధాన్యకటకపురవరాధీశ్వరులైన కేతరాజు తండ్రితాతలుగూడ అమరేశ్వరదేవదివ్యశ్రీపాదపద్మారాధ

క్తులై యుండినట్లు వారివారిదానశాసనములవలన స్పష్టముగఁ దెలియ వచ్చుచునేయున్నది. వారు ధాన్యవాటిలో నంతకు ముందున్న బౌద్ధ మును ద్వేషించినట్లుగాని, ఇతరమతములతో విరోధము కలదనుకొను చున్న వీరశైవము నవలంబించినట్లుగాని తెలుపువిషయములు గాన రాకుండుటయేగాక, ఈ ఈశాసనస్థవిషయము వారికిసకలదేవతలయందు సమత్వబుద్ధి కలదనియే తెలుపుచున్నది. ఈ శాసనము బయలుదేరు టకు ౩౭ వత్సరములు ముందు దత్తెనామాత్యసోముఁడు బెజవాడలో వేయించిన శిలాశాసనములోనివిషయమును బట్టిచూచినను, ఆనాఁటి ధాన్యకటకములోని బుద్ధదేవర నితర దేవతలతో సమానముగ నారా ధించెడివారని తెలియవచ్చుచున్నది. శా. శ. ౧౦౬౭ క్రీ. శ. 1146 నాఁటిశాసన మిది.

భీమాపురము డాకరేమి వాల్కొలను [ద, దా]
చ్చారామపురి శ్రీమదమరడాలు
య[న]ను నంధ్రధరణి పంచారాముల మహా
దేవరలకు బుద్ధదేవరకుం
జేంబ్రోలి నమ్మహాసేనునకునుం బిక
పురము హుంకారశకరికిం గరము
రూఢికెక్కిన బెజవాడమల్లేశ్వర
దేవరకు నఖండదీపతతులు

బెట్టి గొంటూరం జెఱ్వులుం బెక్కుగుడ్లు
నిల్పి సప్తసంతతు లసంఖ్యముగం జేసె
దత్తెనామాత్యసోముండు ధర్మపరుం డు
దారభానుజుం డాచంద్రతారకముగ.[5]

5. S. i. i. Vol IV No. 742. శాసనపద్యమంజరి. ప్రథమభాగము. పుట ౨౩

పంచారామములు వరుసగా, 1. భీమవరము- (సామలకోట) 2. దాక్షారామము. 3. పాలకొల్లు. 4. గుడిప్రూండి (పశ్చిమ గోదావరి భీమవరము) 5. అమరారామము, అనునివి. వీనిలో నుండిన ఈశ్వరమూర్తులు క్రమముగా-కుమారభీమేశ్వరుఁడు, భీమేశ్వరుఁడు, శ్రీరామలింగేశ్వరుఁడు, సోమారామములో సోమేశ్వరుఁడు, అమారారామములోని అమరేశ్వరుఁడును. ఈ యమరారామముతరువాతనే బుద్ధదేవరకును దీపదానము చేసినట్లు చెప్పి, తరువాత చేఁబోలు నుండిన కుమారస్వామిని పేర్కొనుటచే నీ బుద్ధదేవరకూడ ధాన్యవాటీస్థితుఁడైన బుద్ధదేవుఁ డనుట స్పష్టము. ఇటులనే యీ పరిసరసమయములందే పశ్చిమచాళుక్య కుమారసోమేశ్వరుని మంత్రియొకఁడు కొలనుపాకలోను, కాకతీయరుద్రనిమంత్రి హనుమకొండలోను బుద్ధదేవప్రతిష్ఠలు చేసినట్లు తెలంగాణా శాసనములనుబట్టికూడఁ దెలియవచ్చుచున్నది.[6] ఈ శాసనస్థప్రమాణములను బట్టిచూచినచో ఆనాఁటివారికి శివునియందు విశిష్టమైనభక్తిభావ ముండినను బౌద్ధముతో విరోధము లేనట్లే తెలియుచున్నది.

శివభక్తితత్పరులకు ఆనాఁడు బౌద్ధమతస్థులతోను, జైనమతస్థులతోను విరోధముకలదని యూహించుట కవకాశమును గల్పించిన తెలుఁగుగ్రంథము పాల్కురికి సోమనాథ విరచితమైన పండితారాధ్యచరిత్రము, దానిలోని వాక్యములు. ఆ చరిత్రములోను, పల్నాటివీర చరిత్రములోనుకూడ కనినవానికంటె వినినవిషయము లే హెచ్చు. సమకాలికమైన శాసనాదులలోని యాధారములను బరిశీలించిన, వానిలోఁ దెలిపిన చరిత్రాంశములలో నిలుచునవి చాల తక్కువ. పాల్కురికిసోమనాథుఁడు రచించిన బసవపురాణాదిగ్రంథములకు ప్రచారము కన్నడదేశమునందేగాని, త్రిలింగదేశములో 16వ శతాబ్దివఱకు

6. చూ. తెలంగాణా శాసనసంపుటము. 1. గూడూరు శాసనము.

నుండినట్లు నిదర్శనమేదియు లేదు. అంతకుముందు త్రిలింగదేశములో వ్యాప్తిలోనుండినది పండితపవిత్రితశైవమే యనుటకు నిదర్శనములు కొన్ని గానవచ్చుచున్నవి. మల్లికార్జునపండితారాధ్యులు దాక్షారామమునుండి బయలుదేరి శ్రీశైలమునకుఁ బోఁదలపెట్టి ముందుగ కృష్ణానదీతీరమందున్న వెలనాటిచోళ రాజధానియగు చందవోలునకు వచ్చి అచట బౌద్ధగురువును వాదమున నోడించి, ఆతనిని దమశిష్యులు కడ తేర్చఁగా, నా నేరము తనమీఁద వేసికొని, దానికి శిక్షగా తనకన్ను లూడఁదీసికొని, మరల రప్పించుకొని చోళుని రాజ్యముధ్వంస మగునట్లు శపించి యచటనుండి అమరారామమునకుఁ బోయెనని, పండితారాధ్యచరిత్రము వాదప్రకరణముతుదిని మహిమప్రకరణము మొదటను, ఈ కథ సంతరింపఁబడియున్నది. ఆరాధ్యునిశిష్యులు బౌద్ధులను జైనులను సమయింపఁజేసినట్లు ఆ గ్రంథమునందు వ్రాఁతలున్నవి.

చందవోలునకు దగ్గఱ భట్టిప్రోలులో బౌద్ధచైత్యము ప్రాచీనమైనది. అది కృష్ణ కీవలియొడ్డున నుండినట్లు తెలియుచున్నది. బౌద్ధగురు వచటికి సమీపమునందున్న కృష్ణలంకలోని బౌద్ధదేవాలయమునకుఁ బోయినప్పు డాతని పండితశిష్యులు కడతేర్చినట్లున్నది. కాని క్రీ.శ. 7వ శతాబ్దినాఁటికే కృష్ణానదీతీరమున బౌద్ధమతానుయాయులు తరగిపోయినట్లు చీనాయాత్రికుఁడైన యువాన్‌చ్వాంగ్ వ్రాతలవలనఁ దెలియుచున్నది. అట్టిస్థితిలో 12వ శతాబ్దిలో చందవోలుపరిసరములలో బౌద్ధభిక్షువు లున్నారని తెలియఁజేయు నిదర్శనములు కానరావు. చందవోలు రాజధానిగాఁ బాలించిన వెలనాటిచోళుల నాఁటి దానశాసనములు నితరుల శాసనములందువలెనే శివకేశవాలయములకు దానములు చేసినట్లే కానవచ్చుచున్నవి గాని, బౌద్ధమతానుయాయులై యుండినట్లు తెలియవచ్చుట లేదు. పాల్కుఱికి సోమనాథుఁడు తాను వినినవిషయములనే పండితారాధ్యచరిత్రమునందు, మల్లి

కార్జున పండితారాధ్యుని మహత్త్వమును ప్రతిపాదించుటకుఁగాను గూర్చిపెట్టినాఁడని శ్రీ చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్య చరిత్రపీఠికలో వ్రాసియే యున్నారు.

పాల్కుఱికిసోమనాథుఁడు బసవేశ్వర శైవవ్యాప్తికై గ్రంథములు సంతరించినవాఁడు. ఆ మతమునకుఁ బుట్టుక వ్యాప్తి, దానికి జైన ముతో విరోధముకూడ కర్ణాటకదేశమునందే కాని త్రిలింగదేశములో నుండినట్లు నిదర్శనము లేవియుఁ గానరావు. త్రిలింగదేశములో క్రీస్తు పూర్వమునుండియుఁ బాలకులుగా నుండిన ప్రభువు లెవ్వరయినను సర్వ జాతిమతసమత్వదృష్టితో జైనబౌద్ధముల కాశ్రయమిచ్చి వారివారి యాధ్యాత్మికప్రవృత్తికి సహకరించినట్లే తెలియుచున్నదిగాని, జాతి మతవిరోధముల కాశ్రయ మిచ్చినట్లు తెలియవచ్చుట లేదు. ఫాహి యాన్ యువాన్‌చ్వాంగు అనే చీనాదేశమునుండివచ్చిన బౌద్ధయాత్రి కులు, భారతదేశములో వైదికసంప్రదాయానుసారముగ నారాధింపఁ బడుచున్న దేవతలను బ్రాహ్మణదేవతలనియు, ఇచటివారిమతమును బ్రాహ్మణమతమనియు వ్రాసియున్నారు. వారికి వైదికమతమనిన నేమో ? తెలియక వ్రాసినవ్రాఁతలవి. వానిని ఆంగ్లభాషలో నవత రింపఁజేసిన పాశ్చాత్యులవ్రాఁతలేని యగును. భారతదేశములో నే నాఁడును నాల్గుజాతులవారు పాటింపవలసిన విషయములే శ్రుతిస్మృతి పురాణములో నిరూపితములైనవి గాని, బ్రాహ్మణదేవతలని, బ్రాహ్మణ మతమని వేఱుగ నేదియు లేదు. బౌద్ధమునుగూర్చి, దానికి సంబంధించిన వికాసనాశములనుగూర్చి యిప్పటివారు వ్రాయుఁ వ్రాఁతలకుమూలము యువాన్‌చ్వాంగు వ్రాసినవ్రాఁతలకు సంబంధించిన యాంగ్లానువాద ములే. అతఁడు విన్నవానినిగూర్చి కనినట్లు వ్రాసినవ్రాఁతలే హెచ్చు. అందుచే పాల్కుఱికిసోమనాథుని వ్రాఁతలనుబట్టికాని, యువాన్ చ్వాంగ్ వ్రాసినవ్రాఁతలనుబట్టిగాని త్రిలింగదేశములో బౌద్ధము

వైదికమతానుయాయులచే ధ్వంసము చేయఁబడినట్లుగాని, బౌద్ధమతానుయాయులు శైవులచేతిలో మడిసినారనుటగాని నిరాధారమైన విషయమని మనవిచేయుచున్నాను. ఈ కోటకేతరాజు శాసనమే పండితారాధ్యునినాఁడు శైవులకు బౌద్ధులతో విరోధము లేదనుటకు నిదర్శనము కాఁగలదు

త్రిలింగదేశములోని భారతీయుల కేవి పవిత్రక్షేత్రములో ఆ తావులే బౌద్ధులుకూడ పవిత్రక్షేత్రములుగా భావించి యచట తమ యావాసముల నేర్పఱుచుకొనినట్లు, ఇచటి బౌద్ధావశేషములను బరిశీలించిచూచినఁ దెలియవచ్చుచున్నది. క్రీ. శ. 8వ శతాబ్దిలో రచింపఁబడినట్లు నిర్ణయింపఁబడిన ఆర్యమంజుశ్రీమూలకల్పము అను బౌద్ధతాంత్రిక గ్రంథములో నిట్లున్నది.

> ఉత్తరాం దిశమాశ్రిత్య పర్వతాః సరితశ్చ యే
> పుణ్యాదేశాశ్చ యే ప్రోక్తా యవగోధూమభోజినః
> సత్త్వా దయాలవో యత్ర సిద్ధిస్తేషు ధ్రువా భవేత్
> శ్రీపర్వతే మహాశైలే దక్షిణాపథసంజ్ఞికే
> శ్రీధాన్యకటకేచైవ జినధాతుధరే భువి
> సిధ్యన్తే తత్ర మన్త్రా వై క్షిప్రాః సర్వార్థకర్మసు.

ఉత్తరదిక్కునుబట్టి యున్న పర్వతములు నదులు, పుణ్యప్రదేశము లనఁబడునవి, యవలు గోధుమలు భుజించెడివారున్న ప్రదేశములు, దయాస్వభావముగల జంతువులున్న చోటులు తప్పక సిద్ధిప్రదములు. శ్రీపర్వతమనెడి మహాశైలమునందును, దక్షిణాపథమనేపేరు గలిగి భూమిలో బుద్ధధాతువును ధరించిన ధాన్యకటకమునందును సర్వార్థసాధకములైన కర్మలు గలమంత్రములు శీఘ్రముగ సిద్ధించునని పైశ్లోకముల భావము. మంత్రయానమునకుఁ జెందినగ్రంథములలోఁ బ్రామాణికమై పురాతనమైన బౌద్ధగ్రంథమగు మంజుశ్రీమూలకల్పములోని పైవచనము

లనుబట్టిచూచినను, శాలిహుండాము మొదలు చినగంజామువఱకు సముద్రతీరమునకు సమీపములోనుండిన ఆంధ్రదేశమునకు సంబంధించిన బౌద్ధావశేషములను బరికించినను, కృష్ణవేణీనదీతీరస్థములైన బౌద్ధచైత్యములలో ధనకటకచైత్యము, దానికి మీఁదనే కృష్ణానదీతీరమునంటి శ్రీశైలముతోఁ గూడియున్న శ్రీపర్వతము - అనఁగా నాగార్జునునికొండయును బౌద్ధులకు సిద్ధిక్షేత్రము లని అచటిని శాసనములనుబట్టి, అచట ఖననపరిశోధనలో బయటఁబడుచున్న వైదిక దేవతలనుబౌద్ధావశేషములనుబట్టియువిదితమగుచునేయున్నది. వానిలోఁ గూడ ధనకటకచైత్యమునకుఁ గలవిశిష్టతయేమనఁగాఁ నది బుద్ధధాతువును ధరించియుండుట యనినాఁడామంజుశ్రీకల్పములో నతఁడు మఱియాతనిమాటలనుబట్టిచూచిన భూమిలో బుద్ధధాతువును ధరించిన చైత్యమదియనినాఁడుకూడ. ఆ మాట సత్యమే కావలయును. కాకున్నచో అశోకుఁడు కాశీక్షేత్రమునకు సమీపమునందున్న మృగదావనమునఁ (సారనాథ్‌లో) గట్టించిన మహాచైత్యమునకు ధరణికోట చైత్యములోని బుద్ధధాతువును గొనిపోవలసినయక్కఱయుండదుగదా! ధనకటకటచైత్య మత్యున్నతము బహుచిత్రచిత్రితమని పైకేతరాజు శాసనవిషయము తార్కాణించుచునేయున్నది.

శాసనములందు బౌద్ధగ్రంథములందును ధనకటకచైత్యమని యుండఁగా, పాశ్చాత్యులు మనదేశమునకుఁ జేరునాటికి అమరావతీపురము పెరిగి ధనకటకచైత్యమువఱకు వ్యాపించుటచేఁగాఁబోలు, దానికి అమరావతీస్తూపమని నామకరణముచేసి, ముందుగవారు గ్రంథములు వ్రాయుటకు ఆంగ్లములో మొదలిడఁగా, మన తెలుగువారందఱు అమరావతీస్తూపమని స్తుతించి అమరేశ్వరలింగము నాస్తూపమునందున్న యొక యాయక స్తంభమునుగా నిరూపింపమొదలుపెట్టిరి. స్తూపమను శబ్దము సంస్కృతభాషలోనీవఱకు వాడఁబడినశబ్దముగాదు.

ఇది సింహళ దేశ భాషలో థూప్ అనియుండ, ఆశబ్దము భారతదేశములోనికివచ్చి స్తూపమైనది. సింహళదేశములోని అనూరాధపురములో థూపారామ మనెడిబౌద్ధసంఘారామ మొకటియున్నది. బౌద్ధమతమునకు సంబంధించిన వివిధసిద్ధాంతములు, బుద్ధునిబోధలు, వివిధావశేషములు భారతదేశమునుండియే సింహళమునకుఁ గొనిపోఁబడినను, ఈ స్తూపశబ్ద మొకటి, కొలఁదిరోజులక్రిందట నచటి వటవృక్షాంకురమును భారతదేశమునకుఁ గొనిరాఁబడినట్లు తెలియుచున్నది. కనుక ధనకటకచైత్యమును అమరావతీస్తూప మనుట భావ్యముకాదేమో? అని యనుకొందును. అమరావతీస్తూపములోని ఆయక స్తంభము అమరేశ్వరలింగముగా రూపొందిన దనుట, బొత్తుగా ప్రమాణసహము కాదని పాఠకులకు **నా** మనవి.

చారిత్రికవిమర్శకుల కింకొక మనవి. నాటివఱకు చరిత్రకారులు వ్రాసినవ్రాతల నాధారముచేసికొని, తమకుఁ దోఁచిన మఱికొన్ని విషయములను జతపఱచి, రచనలు సాగించుచున్నారు. వెనుకటి వారి చారిత్రకసిద్ధాంతములకు మూలాధారములు పాశ్చాత్యచరిత్రకారులు భారతీయావశేషములను గుఱించి యూహచేసినయూహలు. భాషాచరిత్రమునకుఁగాని, సారస్వతచరిత్రమునకుఁగాని, రాజకీయమతసాంఘికచరిత్రనిర్మాణములకుఁగాని, వారు చూపించిన మార్గములే మన కిపు డుపాదేయములు. ప్రతివిషయమునందును పాశ్చాత్యసిద్ధాంతానుసరణమే మన కాశ్రయణీయ మగుచువచ్చినది. ప్రతివిషయమునను వారు విశేషముగఁ బరిశ్రమించియే యాయాసిద్ధాంతములను జేసిపెట్టినా రనుటలో సంశయము లేదు. కాని ఆయాకాలములోని భారతీయసంప్రదాయము లెట్లుండినవో వానిని సమగ్రముగ, సప్రమాణముగఁ దెలిసికొని నిరూపించుటకు వారి కవకాశము లేదు. ఉదాహరణమునకు–ప్రాచీనకాలములో 'మతము' అనేపదము భారతదేశములో

Religion అనే పదమునకు సమానార్థముగ వాడుకలో లేదు. 'భారతీయధర్మము' అనియే వ్యవహారము సరిపడియుండ, హిందూదేశమని, హిందూమతమని పేరు పెట్టినది పాశ్చాత్యులే.

బుద్ధునిమార్గము ననుసరించి రచించినరచనలకు బౌద్ధదర్శనమనియే వ్యవహార మేర్పడియుండ నదియును బౌద్ధమతముగా రూపొందినది వారినిర్వచనమునుబట్టియే. ఇటులనే బ్రాహ్మణమత మనుశబ్దము నైతము వారిసృష్టియే యనవలెను. వైదికసంప్రదాయము లనునవి యావద్భారతమునందు కలియుగప్రారంభమునుండి నేటివఱకు నిచటి మానవులందఱిలోను అవిచ్ఛిన్నముగ వచ్చుచు నిలిచియేయున్నవి. కొన్ని పర్వదినములందు చేయుస్నానదానాదికములు, వివాహవిధులు, దాంపత్యభావము, శ్రాద్ధకర్మలు, భగవన్మూర్తులసమారాధనములు, గ్రహణాదులలోఁ జేయువిధులు, భారతీయులందఱిలోను తరతమభావములలో ఏకసూత్రసంబద్ధములై కానవచ్చుచునేయున్నవి. అట్టివన్నియు వైదికాచారములే. శ్రుతిస్మృతిపురాణములలో ఏకసూత్రసంబద్ధమైన వైదికధర్మమే ప్రతిపాదితమైన దనువిషయమును గుర్తింపఁజాలినప్పుడుగాని వైదికసంప్రదాయము లననేమో? తెలియుటకవకాశము లేదు. వేదాదిభారతీయవాఙ్మయమునకుఁ గాలనిర్ణయము తత్పురస్కృతముగఁ జేసిన ఆర్యద్రవిడవిభాగమును వేఱొకచోటఁ బెట్టి, ప్రాచీనభారతీయసాంప్రదాయములఁ దెలియఁగవలె నని గాఢమైన కృషి జరిగినప్పుడు భారతదేశచరిత్రము నూతనముగఁ దయారగును. అట్టి యత్నము జరిగిననాఁడుగాని నాయీవ్రాఁతలు చాలమందికి విరుద్ధముగను, కొంతమందికి ఛాందసముగను గానవచ్చును. గతానుగతికముగ పోవుటయే, ఛాందసశబ్దమున కర్థమైనచో, నావ్రాఁత చాదస్తము కాదని తెలుపుకొనుచు, నా మాటలలో నేపాటిదైన సత్యము సారము నుండిన నాదరించి, వెనుకటి దశాబ్దులలో ప్రసిద్ధులైనవారి

లకు విరుద్ధముగ వ్రాసితినని యాగ్రహింపకుందురుగాక యని
ములకు నా మనవి.

ఇంతకాలముక్రిందటివఱకు కృష్ణవేణీనదీతీరమున కిరుపార్శ్వము
లందు బౌద్ధనిర్మాణములయవశేషములు విశేషముగఁ గాన్పించుట,
వానికి పూజాపురస్కారములు లేక చతికిలఁబడుట చూచి, యొకప్పు
డీప్రాంతములో బౌద్ధము చాలవ్యాప్తిలోనుండి,తరువాతఁ గొందఱిచే
ధ్వంసము చేయఁబడినదని యూహించుట జరిగినది. ఈ విధ్వంసము
శైవమతము నవలంబించి విజయపురి రాజధానిగాఁ బాలించిన విష్ణు
కుండినులపాలనమునుండియు నారంభమైన దనియు నింతకుముం
దూహచేయుట జరిగినది. అంతకుముం దాప్రాంతమునకుఁ బాలకు
లుగా నుండిన ఇక్ష్వాకులసమయములో నాగార్జునకొండమీఁద బౌద్ధ
నిర్మాణములు జరిగినట్లు శాసనప్రమాణములబట్టి తెలియవచ్చుట
చేతను, అట్టినిర్మాణములకుఁ బూనుకొనక శివకేశవాదుల నారాధించి
నట్లు విష్ణుకుండినులశాసనములనుబట్టి తెలియవచ్చుటచేతను బౌద్ధ
నిర్మాణవిధ్వంసము వారితో నారంభమైన ట్లూహించుట జరిగినది.
కాని యీనడుమ నాగార్జునసాగరునిర్మాణమునకై విజయపురిని బైటఁ
బెట్టుసరికి, అచట బౌద్ధావశేషము లేగాక అశ్వమేధయాగచితులు,
శివకేశవాదిమూర్తులు కార్తికేయాదివిగ్రహములు ప్రాచీనదేవాలయ
ములు బయటఁబడుచున్నవి. వీనినిబట్టి, ఈశ్వరలింగములు ఆపరిసరము
లలో చిరకాలమునుండియు నుండి ఆరాధింపఁబడుచుండినట్లే తెలియ
వచ్చుచున్నదనుట స్పష్టము.

నాగార్జునునికొండమీఁదనుండి బయటఁబడిన బౌద్ధావశేషము
లనుబట్టి తెలియవచ్చెడి యంశములనుగూర్చి యూహించుటతో పాటు,
వైదికావశేషములనుబట్టికూడ ప్రాచీనవైదికసంప్రదాయానుసారముగ
నూహచేసినచో నచటి ఆయక స్తంభము లేవియు శివలింగములు కాలే

దని స్పష్టము కాకమానదు. ఏమన నచట ఆయక స్తంభములు వేఱు గను శివలింగములు వేఱుగను గనఁబడుచునే యున్నవిగనుక. అశ్వ మేధాశ్వమునకు సంబంధించిన యెముకలతోపాటు శివకేశవాదుల యాలయములుకూడ బయటఁబడుచున్నవాఁడుకూడ, బౌద్ధస్తూపము లోని ఆయక స్తంభములు శివలింగములుగా మాఱిన వనుటగాని, బౌద్ధసంఘారామములే త్రిలింగదేశములోని పంచారామములుగా మాఱినవనుటగాని, యుక్తిసహము ప్రమాణసిద్ధము కాదని నామనవి. భారతీయవైదికసంప్రదాయము లనఁగా నేమో? తెలియకుండఁగనే ఆ సంప్రదాయానుసారముగ నిర్మితమైన నిర్మాణములను గూర్చి, వేఱొకవిధముగ నూహించుట న్యాయము గాదనియు నా మనవి.

ధాన్యకటకము రాజధానిగాఁ బాలించినశాతవాహనులు, శ్రీ పర్వతముమీఁది విజయపురి రాజధానిగాఁ బాలించినయిక్ష్వాకులును, అశ్వమేధయాగములు చేసినట్లు వారివారినాఁటిశాసనములు తెలుపు చుండుటచే, వారు కేవలము వైదికధర్మపాలకులే యనుట స్పష్టము. వారివారిపాలనసమయములో బయలుదేరిన యచటిబౌద్ధనిర్మాణము ధకృడికోటల నానుకొనియుండుటచేతను, వారివారి భోగినులమూల మున పాలకులసాహాయ్యములో నిర్మింపఁబడిన వనుటయు సత్యము. ఆ కల్పమున దక్షిణాపథమున బౌద్ధమనతరించిననాఁటి జాతిమతసమ న్వయ మేనాఁడును ఏకరూపముగనే నిలచియుండుటచే, బ్రాహ్మణ మతవ్యాప్తి వచ్చిననాఁడు బౌద్ధమతము ధ్వంసమై బౌద్ధసంఘారామ ములు త్రిలింగదేశములోని పంచారామము లైనవనుటగాని, ఆయక స్తంభములు శివలింగములైన వనుటగాని యెట్లును సరిపడనియూహ యని నా మనవి.

—♦—

## గ్రంథస్వీకారము — సమీక్ష.

—(శ్రీ బండారు తమ్మయ్య)

(1) శివానందలహరి; సౌందర్యలహరి :– క్రౌను పుటలు 100-
వెల రు 2-8-0. ప్రకాశకులు : శ్రీశైల వీరశైవసంఘము.
అనంతపురము.

శ్రీ శంకర భగవత్పాదులు సంస్కృతములో రచించిన సుప్రసిద్ధ శివశక్తిస్తోత్రము లీ రెంటికి నిదివఱలో గీర్వాణభాషలో వ్యాఖ్యానములు, ఆంధ్రభాషలో పద్యానువాదములు పెక్కు వెలసియే యున్నవి. అనంతపురవాస్తవ్యులు విద్వాన్ శ్రీ తలమర్ల కళానిధిగారు రచించిన ఆంధ్రవచన వివరణములతో వీనిని నేఁడు నూత్నముగవయి శ్రీశైలవీరశైవసంఘము వారు ప్రకటించుట ముదావహము. కళానిధిగారి వివరణము సులభశైలిలో సరళముగ సాగినది. శ్రీశైలవీరశైవ సంఘాధ్యక్షులు శ్రీ బి. జూగప్ప M.A. I.A.S. (Retired Collector) ఆంగ్లాంధ్రములలో రచించిన 30 పుటల పీఠికయు, శ్రీశైలజగద్గురు వాగీశపండితారాధ్యస్వాములు వారు "ప్రార్థనము" అను పేరితో ప్రకటించిన 8 పుటల ప్రస్తావనయు నీగ్రంథమున కమూల్యాలంకారములుగనున్నవి. వానిని చదువరులు శ్రద్ధతో పఠింపఁదగును. శంకరాచార్యుల వారు మునుమున్ను కేవల మాయాద్వైతవాదమును (జగన్మిథ్య బ్రహ్మసత్యమ్) ప్రతిపాదించినను తాను రాను శక్తివిశిష్టాద్వైతము (వీరశైవము) నామోదించి వీరశైవపంచాచార్యులలో ప్రథముఁడయిన రేణుకాచార్యునివలన చంద్రమౌళీశ్వర లింగమును బడసి తమ శృంగేరీ పీఠమున స్థాపించి పూజించి తరించినట్లు లనుశ్రుతముగ శంకరాచార్య పీఠమువారే ప్రకటించిన గ్రంథములవలననే తెలియుచున్నది. నేఁటికి నా లింగమును తదాచార్య పరంపర వారు పూజించుచునేయున్నారు. శంకరుని మాయావాదము, జగన్మిథ్యావాదము, ఈశావాస్యోపనిషత్తు మున్నగు శ్రుతులు ప్రతిపాదించిన వేదాంత

సిద్ధాంతము ముందర నిలువఁజాలదని శ్రీ అరవిందయోగికూడఁ బ్రతిపాదించియున్నారు. ఈ స్తోత్రద్వయముకూడ శంకరుని విశిష్టాద్వైతావలంబనమునకు స్మారకము కాఁగలదు. శ్రీశైలదేవాలయద్వారబహిరంతరదృశ్యములు, శ్రీ అంబా మల్లేశ్వరులు, శ్రీ శంకరభగవత్పాదులు, శ్రీ జూగప్ప, వాగీశపండితారాధ్యులు, ఆంధ్రవివరణకర్త కళానిధి మున్నగువారి చిత్రపటములుగూడ నిందుఁ జేరినవి....గ్రంథము సర్వాంగ సుందరముగనున్నది.

(2) శ్రీ సూర్యరాయ శతకము—డెమ్మీ ౹౬ పుటలు 26 వెల రు 1-0-0 కర్త :- కీ. శే. శ్రీ గున్నేపల్లి మృత్యుంజయకవిగారు. ప్రకాశకులు తదనుజులు విద్వాన్ అక్షయలింగకవిగారు రిటైర్డు తెలుఁగు పండితులు. మెహర్ భవన్- జగన్నాధపురము, కాకినాడ.

శ్రీ మృత్యుంజయకవిగారీ శతకమును శ్రీ పిఠాపురము మహారాజావారిపయి వారి జీవితకాలమునందే యేబదియారేండ్ల క్రిందట రచించి యంకితమొనర్చియున్నారు. కాని యది యప్పుడు ముద్రితము కాలేదు. ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించిన శ్రీ మహారాజావారి స్మారకసంచికలోనిది ముద్రింపఁబడినది. దానిని శ్రీ అక్షయలింగకవిగారు ప్రత్యేకగ్రంథరూపమునఁ బ్రకటించిరి. మృత్యుంజయకవిగారియు, మహారాజావారియు చిత్రపటములిందుఁ జేర్పఁబడినవి. కృతికర్త ప్రౌఢకవిగాఁ బ్రసిద్ధికెక్కినవారు. చిరకాలము తూర్పుగోదావరీ మాడల ఉన్నతపాఠశాలలలో ఆంధ్రోపాధ్యాయులుగా విద్యార్థులకు విద్యాప్రదానము గావించినవారు. వీరి కవితాశైలి ధారాళమై ధారాశుద్ధికల్గి బంధురముగ నలరారుచుండును వసుచరిత్రశైలిలో శ్రీ పిఠాపురము రాజావారికే యంకితమొనర్చు తలంపుతో వీరు రచింపనుద్యమించిన సావిత్రీ చరిత్రమను ప్రబంధము దైవదుర్విపాకమున నసమగ్రముగ నిలిచిపోయినది. గర్భబంధకవిత్వములందును వీరు కడునిపుణులు. వీరి కా

పురసంస్థానమున నేగాక బొబ్బిలి, ఉయ్యూరు, గద్వాల, జయపురము మున్నగు పలు సంస్థానములలో సత్కరింపఁబడినవారు.

మచ్చునకుఁ గొన్ని పద్యములు.

దళదింద్రోపల నీలవేణి, త్రిజగత్కల్యాణి, కైవల్యని ।
శ్చలని శ్శ్రేణి, సరోజపాణి, మధుమానసస్వైర సంచార కో ।
కిలవాగ్వాణి, యుపేంద్రరాణి, చపలక్రీడారతిన్ బాసి, భా
సిలు నీగృహమ్ములో నిరతమున్ శ్రీ సూర్యరాయాగ్రణీ. (ప 6)
భాసిల్లెన్ భయదీయమూర్తి దిలకింపన్ బీతి కాపట్టునో ।
ర్వీసామ్రాజ్యరమార్చితాంసము యి, దోర్వీర్యప్రసాదైక నా ।
నాసామంతశిరోవతంసము యి, పుణ్యశ్రీమదాండాళు దే ।
వీసన్మానస రాజహంసమయి శీవిన్ సూర్యరాయాగ్రణీ. (ప 68)

కందగీత గర్భచంపకమాల

సురధరధీరసుస్థిర యశోధీర పూర్ణ వితీర్ణ కర్ణ భా
స్వరచరితాన్వితా! హరికృపారసపూర మహా గభీర భీ
కరపర జైత్ర! సంభృతవికస్వర తేజ! కవీంద్రభోజ! బం
ధురగుణధీమతీ! స్తుతవిధుస్మరరూప! సూర్యభూపతీ. (ప 101)

చక్రధ్వజబంధము

పురహార ధరవర దరశర
హారదలదంబురుహ సద్యశోంచితలీలా
మురవరహార పదజాలా
సురుచిరతరగుణవిశాల! సూర్యనృపాలా. (ప. 105)

(3) శ్రీ జోగినాథశతకము :- (పోకెట్ సైజు) పుటలు 130. వెల 0-4-0. కర్త :- ఎం. రంగకృష్ణమాచార్యులుగారు B.O.L. ప్రకాశకులు : శ్రీరంగనాథ సరస్వతీభవనము, ఆందోలు, మెదక్ జిల్లా.

తెలంగాణా మెదక్ జిల్లా జోగిపేటలో వెలసిన జోగినాథేశ్వరుని పయి చక్కని ఆటవెలఁది గీతములతో రచించిన కృతియిది. కృతికర్త శ్రీ వైష్ణవకులజులయ్యు నభేదబుద్ధితో దీనిని శివునిపయిఁ గూర్చుట ముదావహము. కవిబాల్యగురువులగు వీరశైవులు, శివశ్రీమఠము సిద్ధి వీరయ్యగారికి అంకిత మొనర్చిరి వారి గురుత్వమే కవిగారి సహజశివ భక్తికి బీజావాపమై యుండును. జోగినాథాలయచిత్రపటమిందుఁ జేరినది. పద్యములు చక్కనిధారాశుద్ధితో మంచిమంచి నీతులతో వేమనయోగి పద్యములఁ దలపించుచున్నవి. మచ్చునకు 4 పద్యములు.

కఠినచిత్తుఁడైనఁ గలహభోజనుఁడైన
పిసినిగొట్టయైన భీరుఁడైన
గాజులగలగలకుఁ గరఁగిపోదురుసుమ్మ
జోగిపేటనాథ. (ప. 14)

కవులఁబండితులను గౌరవింపనివారు
నాగరకులుగారు నరులుగారు
మణులఁ బారవేయు మనుజుఁడే దనుజుఁడౌ. (ప 17)
జోగిపేటనాథ...—

కుక్కచేష్టలుండి నక్కజిత్తులుగల్గి
పిల్లిమాటలాడు పెంకివాని
నమ్మరాదుధరణి నమ్మినఁ దెగఁజంపు
జోగిపేటనాథ. (ప 19)

తేనెకుండలోనఁ దేలిసియో తెలియకో
నీటిబొట్టువేయ నీరెయగును
శ్రేష్ఠుఁడైనఁదప్పు చేసినఁ జెడిపోవు
జోగిపేటనాథ (ప 50)

(4) మంజరీ (సంస్కృత ఖండకావ్యమ్) క్రౌను పుటలు 50. వెల రు 1-00.

(5) నవ్యగీతాలు- క్రౌనుపుటలు 64. వెల రు 1-30.

కృతికర్త :- ఉభయభాషాప్రవీణ, శ్రీ జాస్తి వేంకటనరసయ్య గారు. ప్రధానాంధ్రోపధ్యాయులు :- శ్రీ రాచమల్లువారి హైస్కూలు, చిలకలూరిపేట, గుంటూరుజిల్లా.

ప్రకాశకులు :- కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు, కార్యదర్శి, భారతీయసమితి :- పామర్రు, కృష్ణాజిల్లా.

మిత్రులు శ్రీ వేంకటనరసయ్యగారు జాతీయ మధురకవిగా పేరెన్నికగన్నవారు. అభినవతిక్కన, తెలుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారి భాగినేయులు- వీరు రచించిన కృతులు చాల వఱకీ పత్రిక పూర్వసంచికలలో సమీక్షచేయఁబడియేయున్నవి వీరి యాదర్శజీవితము ఆంధ్రమహాజనులందఱకు ననుష్ఠేయమని చెప్పనవసరము లేదు. అస్ఖలిత బ్రహ్మచర్యము ననుష్ఠించుచున్న మహనీయులు వీరు. చిలకలూరిపేట హైస్కూలులో విద్యార్థి వసతిగృహములో వీరుండుగది పూర్వ ఋషీశ్వరుల గురుకులములను స్మరింపఁజేయును. విద్యార్థులు పలువురు వీరినిచుట్టుముట్టియుత్తే జకములగు వీరియుద్బోధనములనంది కృతార్థులగుచుందురు. బ్రిటీషుప్రభుత్వయి హయాములో వీరు గాంధీమహాత్ముని జాతీయోద్యమమునఁ బాల్గొని పలువురు దేశనాయకులతోపాటు శ్రీకృష్ణజన్మస్థానము నలంకరించి పలు సంవత్సరములు ప్రభుత్వమువారి యాతిథ్యమునంది కృతార్థులయినారు. ఏదెసనున్నను మంచినిగ్రహించి ప్రశంసించుట వీరికి వెన్నతోఁ బెట్టినది. పయిరెండుకృతులు వీరు బహుముఖములుగఁ గావించిన యేతాదృశ ప్రశంసలకాదర్శకములయి వీరి యుభయభాషాప్రావీణ్యమును బ్రదర్శించుచున్నవి.

గేయరచనలని స్ఫురింపఁగలదు. కాని గేయములతోపాటు ఇందు పద్యరచనలుకలవు. ఇదిచాలవఱకు ఆంధ్రకృతియైనను నిందును మధ్య మధ్య సంస్కృతశ్లోకరచనములుకలవు. తెలుఁగుపద్యములు వీరి మధుర కవితకాదర్శములుగా నుండును. మచ్చునకుఁ గొన్ని.

గ్రంథాలయము.

ఆలయములందు ఘనమ్ । ఆలయము గ్రంథాలయమె ఆలసింపక
గ్రామగ్రామాలలో స్థాపింపుడీ ॥ఆల॥

వయోజనవిద్య.

చదువు చదివినపెద్దలారా, సదయులగునో సుజనులారా!
హృదయములపై చేయినుంచి చదువరుల దేశమునెంచి
తెలియుఁడు జ్ఞానపరము, నిలుపుఁడు మీరు పరువము (చదు)

ఆదికవి.

నన్నయభట్టు తెల్గుకవినాథులకందఱకాద్యుఁడై సుసం ।
పన్నత సంస్కృతాంధ్రముల పండిన భారతమాంధ్రజాతికిన్ ।
మెన్నిధిగానొసంగి సుమపేశలమైన కవిత్వచంద్రికన్
గ్రొన్నెలవోలె వెల్గెడిని కోర్కులుపండఁగ సాహితీదివిన్.
వైదికధర్మమేజగతిఁ బావనమైనదటంచు దెల్పిన ।
మోదము మానసంబునను మిక్కిలి నొందఁగ వ్రాసెనాతఁడా ।
సుందరసత్యమంగళ సుశోభిత భారతమాంధ్రశారదా ।
నందనకల్పవృక్షమగునాఁ యనిసన్నుతిఁ జేయఁగాబుధుల్.

ఈ రెండవపద్యములో మొదటిపాదము గుర్వక్షరపూర్వకమగు దకార ప్రాసముతో నారంభింపఁబడి యట్టిప్రాసమే రెండవపాదమునఁ బాటింపఁబడినది. మూఁడునాల్గుపాదములలో బిందుపూర్వక దప్రాసము వాడఁబడినది. ఇది సాధువేనాయనిమాసందియము. (ప్రాసాక్షరము కొన్నిపాదములలో బిందుపూర్వకము, మఱికొన్నిపాదములలో

సామాన్యగుర్వక్షర పూర్వకముగా నుండరాదనియే మా తలంపు. తత్రాపి ఆదికవి దృష్టిలోనివి నమ్మతమగునా? కవిగారి జనకులు పౌరాణికులు శ్రీ శాస్త్రి సుబ్బయ్యగారియు, గ్రంథరచనాప్రోత్సాహకులు శ్రీ మురికిపూడి సత్యనారాయణాచార్యులుగారియుఁ జిత్రపటము లిందుఁ జేరినవి.

ఈ రెండు గ్రంథములందును గూడ భారతీ సమితి కార్యదర్శి శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు వ్రాసిన పరిచయము, నరసయ్యగారి జీవితవిశేషము తెలియంగోరువారు తప్పక పఠింపఁదగును.

(6) ప్రవక్తలు :- క్రౌను పుటలు 34 వెల రు 1-00,

రచయితలు :- శ్రీ శాస్త్రి వేంకటనరసయ్యగారు, ఆంధ్రోపాధ్యాయులు, చిలకలూరిపేట.

(2) విద్వాన్ షేకు దావూదుకవిగారు :- ఆంధ్రపండితులు, ఉస్మానియా కళాశాల, కర్నూలు.

ఈ కవిద్వయ మాంధ్రలోకమునకు సుపరిచితులే. నరసయ్యగారినిగూర్చి 4, 5 గ్రంథముల సమీక్షలోఁ జెప్పియున్నాము. దావూదుగారు జన్మతః మహమ్మదీయులయ్యు సరసతరాంధ్రకవిగా వాసికెక్కినవారు. మధురమధురమగు వారి 'దాసీపన్నా'యను గ్రంథమీపత్రిక పూర్వసంచిక యొకదానిలో సమీక్షచేయఁబడినది. వారినిగూర్చిన పరిచయ మీ గ్రంథారంభమున తుమ్మల సీతారామమూర్తిగారు, మరుపూరు కోదండరామిరెడ్డిగారు, కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు గూడఁ గావించియున్నారు. ఆస్థానకవి శ్రీ కాశీకృష్ణాచార్యులగారియు, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారియు వాశీస్సులుగూడ మునుముందేయున్నవి. శ్రీతిరుపతి వేంకటేశ్వరస్వామియు గ్రంథ ప్రోత్సాహకులు శ్రీ మురికిపూడి సత్యనారాయణాచార్యులగారియుఁ జిత్రపటములు చేర్పఁబడినవి

ఇందుఁ జేర్పఁబడిన ప్రవక్తలు, శ్రీశంకరాచార్యులు, రామానుజాచార్యులు, రామకృష్ణపరమహంస, గౌతమబుద్ధుఁడు, దయానందసరస్వతి, గురునానక్, మహావీరస్వామి, (వర్ధమానుఁడు) కబీరుదాసు :- వీరలమతసిద్ధాంతములు, బోధనలు, జీవితవిశేషములు మున్నగు పలువిషయములింపు మృదుమధురమగు సరళవచనములో వర్ణింపఁబడుట ముదావహము. ఆంధ్రులెల్లరు దీనికి స్వాగత మొసంగి తత్ప్రచారమునకుఁ దోడ్పడెదరు గాక యని హెచ్చరించుచున్నాము. మచ్చునకుఁ గొన్నివచనముల నుల్లేఖింతుము.

రామకృష్ణ పరమహంస :- కామినీకనకములు దుర్గమపర్వతము లని వీరిభావము. కాని వీనివిషయమును వీరు ఇతరులవలె విషయవాసనాబలమున నెఱిఁగినవారు కారు. వీరిదృష్టిననుసరించి స్త్రీ, భోగవిలాసవస్తువు కాదు. పూజింపఁదగినవస్తువు. కామదేవునకు దాసుఁడై భోగవిలాసముల మగ్నుఁడైన నరుఁడు సిద్ధిలాభముల పొందఁజాలఁడు. కాని తనజీవితమున రూపమునకు దాసుఁడై యుండును.

ఇఁకధనమునుగూర్చియు వీరియభిప్రాయము ఇంతియ. నరుఁడు ధనమునకు దాసుఁడుకారాదు. ధనమును తనదాసిగఁ జేసికొనవలయును. ఎవరుగాని దానివిషయమై వృథాభిమానముంచరాదు.

స్వామి దయానందసరస్వతి :- జీవుఁడు:—దయానందులవారి సిద్ధాంతమున జీవాత్మనుగూర్చి విశేషభాగము ప్రకటింపఁబడినది. వీరు ఈశ్వరుని, జీవుని, ప్రకృతిని మూఁడింటి ననాదియని, యనంతమని యంగీకరింతురు. వీరియభిప్రాయమనుసరించి జీవుఁడు కర్మమాచరించుటకు స్వతంత్రుఁడు. కాని దానిఫలమునను భవించు విషయమున మాత్రము పరతంత్రుఁడు. జీవుఁడు ఏవిధమైన శుభాశుభకర్మలాచరించునో వానిఫలము నాతఁడు తప్పక యనుభవింపవలసివచ్చును. జీవుఁడు పరమాత్మునికంటె మిక్కిలి భిన్నుఁడు.

చ. కృతయుగమందు సంభవిలి యీ యుగమందున నేఁటికింపప్రో
రతుఁడయియుండు రాముని నిరంతరగాథ రచింపశక్యమే
మితిమెయినాడనౌనని సమీకృతముఖ్య కథావిశేష సం
యుతముగ సంతరించితిని యుక్తిని సక్రియరీతినీకృతిన్.

(మనవి నుండి)

అతిసద్దృష్ట కవిత్వతత్త్వవిదుఁడై, వ్యంగ్యోక్తినిష్ణాతుఁడై
నుతనానావిధవర్ణనప్రియుఁడై, నుత్తాన్యపీవాద సం
గతుఁడై, పండితుఁడై, యశస్సహితుఁడై, కావ్యాత్ముఁడై హాస్యవా
క్చతురాస్యుండగు రామలింగకవి నస్మద్దేశికుం గొల్చెదన్.

(అంజలి నుండి)

శా. పాపాత్మా! యని నన్నుఁ బొమ్మనుచు సంభాషించితీవారయే
పాపవ్యాప్తి కేని నిష్కృతిఁదలంపన్ వచ్చు భోక్తన్యనూ
నీపాపాప్తియటంచుఁజాటు స్మృతివింటేకంఠము న్విచ్చి సం
తాపం బేదుచుఁ దల్లిఁ జంపిన భవత్పాపంబు భావింపవో.

(అభ్యుదయకాండము ప 140)

చ. సురనుతభాష! భస్మరుచి సుందరభూష! విషాహిభూష! సం
సరణ మహాబ్ధిశోష! దివిషద్గణ భృంగశిరీష! పంయమీ
శ్వరకృతవేదఘోష! నుతజన్యజగీష! మహామనీష! యో
పరమశివా! భవా! శ్రితశుభంకర! శత్రుచమూభయంకరా. (ప165)

ఉ. పుట్టుకతోడనే చెవులఁబుట్టినకుండలమున్ తనూలతం
దొట్టినభర్మవర్మమును దోరిపుదీధితులీనఁగర్ణుఁడు
పుట్టిన బాలభాస్కరుని భాతిగఁదోఁచుటఁ జూచి మెచ్చి తా
నెట్టన రాముఁడానికి నేరుపనొప్పి నిజాస్త్రపాండితిన్.

(ఆశ్రమకాండము ప 95)

అర్థశక్తిమూలా యథా

శ్లో. దిగ్జైత్రయాత్రాసన్నద్ధే సూర్యరాయమహీపతౌ
సందావితా ద్విషద్భూపైః ర్మృగేంద్రాః కందరాంతరాత్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర శత్రవః పలాయ్య గుహాంతరేషు ప్రవిష్టా ఇత్యర్థశక్తిమూలా వ్యంజనా. న చాత్ర అనుమానేన తత్ప్రతీతిః. వ్యంగ్యవ్యంజనయో ర్నియతసాహచర్యాభావాత్. నాపిశబ్దశక్తిః ప్రకృతశబ్దేషు యస్య కస్యచిచ్ఛబ్దస్య విపక్షప్రవృత్తిపర్వతగుహాధికరణత్వాబోధకత్వాత్. అతోఽర్థశక్తిమూలావ్యంజనైవ. అర్థశక్తిమూలాముదాహరతి దిగితి. సూర్యరాయమహీపతౌ దిశాం జైత్రయాత్రాయాం సన్నద్ధే సతి మృగేంద్రా స్సింహాదయః కందరాంతరాత్ గుహాంతరాత్ ద్విషద్భూపైః స్సందావితా ద్రావితాః. అర్థశక్తిమూలత్వం వివృణోతి అత్రేతి. శబ్దనియమానపేక్షణా దర్థశక్తిమూలేత్యర్థః. మహిమభట్టమతం దూషయతి నచేత్యాదినా. విద్రావస్య బహుకారణత్వా ద్వ్యాప్త్యభావ ఇతి భావః. అభిధైవ ప్రతీయమానేఽపి ప్రవర్తత ఇతి మీమాంసకమత మపి నిరాకరోతి. నాపిశబ్దశక్తి రపీతి హేతుం దర్శయతి ప్రకృతేతి.

ఉభయశక్తిమూలా యథా

శ్లో. విష్వక్సేనోర్జితఖ్యాతి ర్విక్రమాక్రాంతభూతలః
దేవరాజానుజో భాతి శ్రియం పుష్య న్నిరంతరమ్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర ఉభయశక్తిమూలక స్సూర్యరాయమహీపాలత్రివిక్రమయో రభేదబోధ ఇత్యనుసంధేయమ్.

ఉభయశక్తిమూలా ముదాహరతి విష్వగితి. విష్వక్సరితో

వ్యాప్తయా సేనయా ఊర్జితా ఖ్యాతి ర్యస్య సః. అన్యత్ర విష్వక్సేనేన ఆర్జితా ఖ్యాతి ర్యస్య స ఇతి. విక్రమేణ పరాక్రమే ణాక్రాంత భూమండలః పాదన్యాసే నాక్రాంతభూమండల శ్చ దేవరాజస్య ఇంద్రః స్యానుజః శౌరిః. సాధ్యవసానలక్షణయా వేంకటసూర్యరాయ సార్వభౌమః అత్ర విష్వక్సేనోర్జితఖ్యాతి రిత్యత్ర అర్థశక్తిమూలత్వం విక్రమాక్రాంతభూతల ఇతి శబ్దశక్తిమూలత్వం శబ్దపరివృత్తిసహిష్ణుత్వా దితి భావః.

## కావ్యమ్

వ్యంగ్యస్య ప్రాధాన్యాప్రాధాన్యాభ్యా మస్ఫుటత్వేన చ త్రివిధం కావ్యం.

వ్యాఖ్యానమ్ :—

ప్రాధాన్యే ఉత్తమం ధ్వని రితి వ్యపదిశ్యతే. అప్రాధాన్యే మధ్యమం గుణీభూతవ్యంగ్య మితి కథ్యతే. అస్ఫుటత్వేఽధమం చిత్ర మితి కథ్యతే.

ఏవం వృత్తిత్రయీ ముదాహృత్య కావ్యభేదా నిరూప్యంతే వ్యంగ్యస్యేతి. ప్రాధాన్యాదివశా దుత్తమాదికావ్యానాం ధ్వన్యాది సంజ్ఞాప్రవృత్తి రిత్యాహ ప్రాధాన్య ఇత్యాదినా. యథా లోకే కస్య చిద్వస్తున స్సంజ్ఞానార్థం ప్రదీపాదా విప వ్యంగ్యార్థ మేవ వాచ్య వాచకవైచిత్ర్యాదౌ మహాకవిప్రవృత్తే ర్వ్యంగ్యస్య మధ్యే విశ్రాంతి విరహేణ స్వపర్యంతం సహృదయహృదయాకర్షణా చ్చ తస్య ప్రాధాన్య మిత్యనుసంధేయం. తద్విరుద్ధ మప్రాధాన్యం. తచ్చ వ్యంగ్యస్య చారుత్వాపకర్షోపాధికృతం న స్వాభావిక మితి గుణీభూతవ్యంగ్య మిత్యత్ర చ్విప్రత్యయేన సూచ్యతే. అధమస్య కావ్యస్య అస్ఫుటవ్యంగ్యత్వేన నీరసత్వా త్కేవలవాచ్యవాచకవైచిత్ర్యాశ్రయత్వేన ఆలేఖ్యప్రఖ్యత్వా చ్చిత్రశబ్దవాచ్యత్వం. తచ్చ శబ్దార్థాలంకా

రయో ర్వ్యాససమాసాభ్యాం నిబంధనే శబ్దచిత్ర మర్థచిత్ర ముభయ చిత్రం చేతి త్రేధా విభజ్యతే.

ధ్వని ర్యథా

శ్లో. చేతో న స్సమవేక్షితుం యది పునః కాంత! త్వయా దీయతామ్
సంప్రత్యేక మదర్శనాం జన మముం జానాసి మత్తం స్మరమ్
ఇత్థం స్వస్వనితంబినీజనవచాం స్యాకర్ణ్య జాతా నృపా
న్రమాస్యాః ఖలు సూర్యరాయవిభువీక్షోత్కా విదేశ్యాః పరమ్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర సూర్యరాయవిభో స్సర్వోన్నతత్వం సర్వాతిశాయి సౌందర్యం చ ధ్వన్యతే ధ్వని ముదాహరతి చేత ఇతి. హే కాంత! ప్రాణనాథ! నః అస్మా న్పునః సమవేక్షితుం తవేతి శేషః. చేతో యది చిత్త మస్తి చే త్సంప్రతి త్వయా ఏక మదర్శనాం జన మదృశ్యాం జనం దీయతాం. తతః కి మిత్యత ఆహ అము మితి. అముం స్మరం మదనం మత్తం క్రూరం జానాసి. మారోఽతిక్రూరోఽపి అదృష్టాః కింకరిష్యతీతి భావః. ఇత్థం స్వస్వనితంబినీనాం వచాం స్యాకర్ణ్య శ్రుత్వా విదేశ్యా నృపాః గంతు ముద్యుక్తా ఇతి భావః. సూర్యరాయవిభువీక్షోత్కా స్సంతః పర మత్యంతం న్రమా స్యా అధోముఖాః. కర్తవ్యబోధాభావా దితి భావః. జాతా బభూవుః ఖలు. సర్వోన్నతత్వాదే ర్వ్యంగ్యస్య అగూఢత్వా ద్యపకర్షనిమిత్తాభావా త్ప్రాధాన్యేన ఉత్తమకావ్యత్వ మేవే త్యాహ అత్రేతి.

గుణీభూతవ్యంగ్యం యథా

శ్లో. స్తుత్యా రతి స్సా రమణీషు యుక్తమ్
యస్యాం స్వయం స్నిహ్యతి చిత్త మస్య
ఇత్థం మిథోభీక్ష్ణ మలం వదంత్యః
పశ్యంతి యోషాః ఖలు సూర్య రాయమ్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర సూర్యరాయవిభుచంద్రం పశ్యంతీనాం సుందరీణాం ప్రసిద్ధస్మరసుందర్యా రతేశ్చ ప్రశంసనేన ధురి దృశ్యమానే తస్మిన్ రాజ్ఞి మన్మథాభేదప్రతీతి ర్జాయత ఇతి వస్తునో వ్యంగ్యస్య ద్రాక్ప్రతీతే రగూఢత్వా ద్గుణీభూతత్వమ్.

గుణీభూతవ్యంగ్య ముదాహరతి స్తుత్యేతి. అస్య వేంకటమహీపతిసూర్యరాయమహారాజస్య చిత్తం మనః స్వయం యస్యాం రమణ్యాం స్నిహ్యతి సా రమణీషు స్తుత్యా స్తోత్రార్హా రతిః యుక్తం స్థానే. ఇద్ధం యోషా రమణ్యాః "యోషి ద్యోషా చ జోషాచేతి" ద్విరూపకోశే అభీక్ష్ణం ముహుః "ముహుః పునఃపున శ్శశ్వ దభీక్ష్ణ మసకృ త్సనూ" ఇత్యమరః. మిథః పరస్పరం వదంత్య స్సత్యః సూర్యరాయం వేంకటమహీపతిసూర్యరాయసార్వభౌమ మలం పశ్యంతి. గుణీభూతత్వం వివినక్తి అత్రేత్యాదినా.

## చిత్రం యథా

చిత్రం త్రివిధం. శబ్దచిత్ర మర్థచిత్ర ముభయచిత్రం చేతి. చిత్రం విభజతే చిత్ర మితి.

## శబ్దచిత్రం యథా

శ్లో. ధైర్యశ్రీవిజితాహార్య శ్శౌర్యధుర్యోఽతివీర్యవాన్
సూర్యరాయవిభు ర్భాతి గాంభీర్యసరితాంపతిః.

వ్యాఖ్యానమ్ :—

అత్ర రూపకోపమయో ర్విద్యమానయో రపి వృత్త్యనుప్రాస ఏవ కవే రభినివేశా చ్ఛబ్దచిత్రస్యైవ ప్రాధాన్యే న శబ్దచిత్రత్వం.

శబ్దచిత్ర ముదాహరతి ధైర్యేతి. ధైర్యశ్రియా ధైర్యలక్ష్మ్యా విజితా ఆహార్యా శ్శైలా యస్య సః. గాంభీర్యేణ సరితాంపతి

స్సముద్రః. అత్ర శబ్దచిత్రత్వం విశదీకరోతి అత్రేతి. అత్ర ధైర్య శ్రీవిజితాహార్య ఇత్యత్ర ధైర్యసంపదా శైలసదృశ ఇత్యుపమాలం కారస్య గాంభీర్యేణ సరిత్పతి రితి రూపకస్య చ సతో౽పి కవే ర్వృత్త్యనుప్రాస ఏవాభినివేశా చ్ఛబ్దచిత్రస్యైవ ప్రాధాన్య మర్థ చిత్రస్య తు గుణభావ ఏవేతి నోభయచిత్రత్వ మస్యేతి తాత్పర్యం.

## అర్థచిత్రం యథా

శ్లో. సూర్యరాయసపత్నౌఘమద్గ్రభ్రమణదుర్గతిం

దృష్ట్వా ఝరాపదేశేన బాష్పా ణ్యుఝ్ఝంతి భూభృతః.

వ్యాఖ్యానమ్ .—

అత్ర అర్థసిద్ధ ఏవ అపహ్నవే కవే రభినివేశా దర్థచిత్రత్వం. అర్థచిత్ర ముదాహరతి సూర్యరాయేతి. భూభృతః పర్వతాః దుర్గ భ్రమణదుర్గతిం వనసంచారదుర్దశాం "గతిస్తు గమనే మార్గే దశా యాం బుద్ధ్యుపాయయోః" రితి రత్నమాలాయాం. దృష్ట్వా ఝరా పదేశేన జలప్రవాహవ్యాజేన బాష్పాణి నేత్రజలాని "బాష్పం నేత్ర జలోష్మణోః" రితి విశ్వప్రకాశః. ఉఝ్ఝంతి ముంచంతి. అర్థచిత్రత్వం వివినక్తి అత్రేతి. ఝరేషు బాష్పా ణ్యారోప్య తదపహ్నవేర్థసిద్ధఏవ. కవే రభినివేశా దస్యార్థచిత్రత్వం వృత్త్యనుప్రాసే తు గుణభావ ఏవేతి. నాత్రా ప్యుభయచిత్రత్వ మితి తాత్పర్యమ్.

## ఉభయచిత్రమ్

శ్లో. సామ్రాజ్యలక్ష్మీసహజానురాగ

ప్రాగ్భారధుర్యం సమరాత్తధైర్యమ్

శ్రీసూర్యరాయం శ్రితకల్పభూజమ్

భజంతి భూపా విధుతావలేపాః.

వ్యాఖ్యానమ్ :—

అత్రశబ్దార్థయో ర్ద్వయో రపి కవే రభినివేశా దుభయచిత్రత్వమ్. ఉభయచిత్ర ముదాహరతి సామ్రాజ్యేతి. భూపా రాజానః దేశాధీశసాకల్యద్యోతనా యేదం బహువచనం విధుత స్త్యక్తః. "విధుతౌ కంపితత్యక్తౌ" వితి రత్నమాలాయాం. అవలేపో గర్వః యై స్తే తథోక్తా స్సంతః సామ్రాజ్యలక్ష్మ్యా స్సహజో యోఽనురాగ స్తస్య ప్రాగ్భారోఽతిశయః "ప్రాగ్భారః పుంసి శైలాగ్రభాగాతిశయయోర్మత" ఇతి నిఘంటుసారే. తస్య ధురం వహతీతి తథోక్తం. సమరేషు అధికం ధైర్యం యస్య తం శ్రితానాం కల్పభూజం శ్రీసూర్యరాయం వేంకటమహీపతిసూర్యరాయమహారాజం భజంతి సేవంతే. అత్ర శబ్దాలంకారే వృత్త్యనుప్రాసే అర్థాలంకారే రూపకాదా చ కవే రభినివేశా దుభయచిత్రత్వ మితి బోధ్యం. ఏవ మేవ వివృణోతి అత్రేతి. అత్ర యద్యపి ప్రాచీనై రిద మనుదాహృతం తథాపి అన్యతరప్రాధాన్యే నేతరభేదద్వయువ దుభయప్రాధాన్యే నాస్యాపి సువచత్వా దవిరోధః. కించ పాదాంబుజం భవతు వో విజయాయ మంజుమంజీరశింజితమనోహరమంబికాయాః ఇత్యత్ర ఉపమానుప్రాసయో రన్యోన్యనిరపేక్షత్వేన సమప్రధానభావయో స్సంసృష్టి మంగీకుర్వాణైః పూర్వై రేవోభయచిత్ర మ ప్యంగీకృత మి త్యవగంతవ్యం. ననూదాహృతేషు యథా యోగం విభావాదికథనేన వీరశృంగారయోః. పర్యవసానా త్కథ మధమత్వ మితి చేత్సత్యం. శబ్దార్థాలంకారయో రేవ కవివివక్షావిషయత్వా ద్విద్యమానోపి రసో దివాచంద్రప్రకాశవ న్న ప్రతీయతే. తదుక్తం కావ్యలోకే "రసభావాదివిషయవివక్షా విరహే సతి అలంకారనిబంధో య స్సచిత్ర విషయో మత ఇతి.

## ధ్వనిహేతవః

శ్లో. వక్తా బోద్ధ్య శ్చ కాకు శ్చ దేశః కాలోఽ న్యసన్నిధిః
వాచ్యం ప్రకరణం చేష్టేత్యాద్యా స్స్యు ర్ధ్వనిహేతవః.

వ్యాఖ్యానమ్ :—

ధ్వనిహేతూ నాహ వక్తేతి. అత్ర యద్యపి వక్త్రాదివైశిష్ట్య జ్ఞానస్య అర్థవ్యంజకత్వం కైశ్చి దనుదాహృతం తథాపి కావ్యప్రకాశ కారాదిభి స్తదుపాదానా దుదాహృత మస్మాభి రపీత్యనుసంధేయమ్.

### వక్తృవైశిష్ట్యజ్ఞానస్య ధ్వనిహేతుత్వం యథా

శ్లో. చేతో న స్సమవేక్షితుం యది పునః కాంత! త్వయా దీయతామ్
సంప్ర త్యేక మదర్శనాంజన మముం జానాసి మత్తం స్మరమ్
ఇత్థం స్వస్వనితంబినీజనవచాం స్యాకర్ణ్య జాతా స్పృహా
నమ్రాస్యాః ఖలు సూర్యరాయవిభువీక్షోత్కా విదేశ్యాః పరమ్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర అదృశ్యాంజనమరత్వా ప్రయాసి చేత్త్వర్హి క్రూరో మార స్తత్క్షణ ఏవ అమూ ర్వ్యాపాదయే దితి వస్తువక్తృవిశేషా ద్ధ్వన్యతే. వక్తృవిశేషస్య ధ్వనిహేతుత్వ ముదాహరతి చేత ఇతి. వ్యాఖ్యాతోఽయం ప్రాక్ అర్థవ్యంజకత్వం వ్యాకరోతి అత్రేతి.

### బోద్ధవ్యవైశిష్ట్యజ్ఞానస్య ధ్వనిహేతుత్వం యథా

శ్లో. ఉత్కంఠితాయా మనుజేంద్రపుత్ర్యా
శ్రీసూర్యరాయేంద్రవిలోకనేన
కస్యాశ్చి దాళ్యః కథయంతి చిత్రమ్
శాకుంతలాదీ నితిహాసవాదాన్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర శకుంతలయేవ గంధర్వవివాహ స్త్వయాపి కార్య స్య

తస్యా ఇవ తవాపి సర్వజనసమాస్నోస్య భవేదితి బోద్ధవ్యవిశేషా ద్ధ్వన్యతే. బోద్ధవ్యవైశిష్ట్యజ్ఞానస్య ధ్వనిహేతుత్వముదాహరతి ఉత్కంఠి తాయాం ఇతి. నాయకాభిలాషిణీం కాంచి న్నాయికాం ప్రతి దూతీ వచన మేతత్. ధ్వనిహేతుత్వం వివృణోతి అత్రేతి. తాదృక్సఖీరూప బోద్ధవ్యవైశిష్ట్య జ్ఞానవతాం సఖ్యా మనోరథలాభో వ్యజ్యతే.

## కాకో ర్ధ్వనిహేతుత్వం యథా

శ్లో. రేరే సపత్నసచివా భవతాం వచాంసి
శ్రీసూర్యరాయచరణం శరణం ప్రవజేతి
శ్రుత్వాపి గాఢజడిమాజని య స్స యుష్మాన్
నింద త్యసౌ న దురహంకృతి మాత్మనీనామ్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర ప్రథమదుర్దశాయాం యుష్మాన్ నిందతి న స్వాహంకృతి మితి కాక్వా భవాన్ యుక్తార్థబోధకః న నింద్యః. కిం తు దురహం కృతి రేవేతి వస్తు వ్యజ్యతే. కాకో ర్ధ్వనిహేతుత్వ ముదాహరతి రేరే ఇతి. ధ్వనిహేతుత్వం వివృణోతి అత్రేతి.

## దేశవిశేషస్య ధ్వనిహేతుత్వం యథా

శ్లో. శక్తిం చ శాస్త్రాద్యవబోధనాది
వాక్కల్పనామూలనిబంధనాని
శ్రీసూర్యరాయేంద్రసభాం విశంతో
మనీషిణః కేఽపి న విశ్వసంతి.

వ్యాఖ్యానమ్ :-

అత్ర సూర్యరాయమహారాజసభారూపదేశవిశేషమహిమ్నా ప్రతిభాదిసామగ్రీం వినాపి సర్వేపి కవయో భవంతీతి వస్తు ధ్వన్యతే. తేన సూర్యరాయమహారాజే భోజరాజా దాధిక్యవిశేషోపి వ్యజ్యతే.

దేశవిశేషస్య ధ్వనిహేతుత్వ ముదాహరతి శక్తం చేతి. శక్తిః "స్మృతి ర్వ్యతీతవిషయా మతి రాగామిగోచరా, బుద్ధి స్తాత్కాలికీ జ్ఞేయా, ప్రజ్ఞా త్రైకాల్యగోచరా, ప్రజ్ఞాం నవనవోన్మేషశాలినీం ప్రతిభాం విదుః" రిత్యుక్తలక్షణా ప్రతిభావిశేషః. కించేతి చార్థః శాస్త్రాద్యవబోధనాదిపాణినీయాద్యవగతిః. వాక్యకల్పనామూలనిబంధనాని ఛందశ్శాస్త్రాణి చ ధ్వనిహేతుత్వం వివృణోతి అత్రేతి.

కాలవిశేషస్య ధ్వనిహేతుత్వం యథా

శ్లో. శ్రీసూర్యరాయేంద్రపదారవింద
సేవాత్వరాధీనపతే నమస్తే
నైవాతిభాషి ణ్యహ మేషపుష్ప
కాలోఽయ ముద్ధర్షమహో జనానామ్॥

వ్యాఖ్యానమ్ :—

అత్ర పుష్పకాల ఇతి కాలవిశేషనిర్దేశేన సూర్యరాయసార్వభౌమసేవనే సత్వరోపి భవా నద్య మా గమ దితి ప్రయాణనిషేధో ధ్వన్యతే. కాలవైశిష్ట్యజ్ఞానస్య ధ్వనిహేతుత్వ ముదాహరతి శ్రీసూర్యరాయేతి. వివృణోతి అత్రేతి. వసంతకాలస్య కామినీనాం కామోద్రేకత్వా న్నాద్య గంతవ్య మితి గమననిషేధో ద్యోత్యత ఇతి భావః.

అన్యసన్నిధే ర్ధ్వనిహేతుత్వం యథా

శ్లో. చిత్తే న కావా కలయేత వైరమ్
రోమాంచ మాలోక్య మత్రపతీకే
శ్రీసూర్యరాయేంద్రభుజప్రతాప
మపి స్మృతా హంత ! విభీషయంతీ.

వ్యాఖ్యానమ్ :—

అత్రవిభీషయంతీ త్యర్థసాన్నిధ్యబలా త్తజ్జనితోఽయం

రోమాంచ స్తతో న కస్యాపి కోపావకాశ ఇతి వస్తు ధ్వన్యతే. అన్య సన్నిధివైశిష్ట్యజ్ఞానస్య ధ్వనిహేతుత్వ ముదాహరతి చిత్ర ఇతి. ప్రతీకే అంగేషు జాతావేకవచనం "ప్రతీకోఽవయవే ఖ్యాత" ఇతి విశ్వః. వ్యాకరోతి అత్రేతి.

### వాచ్యస్య ధ్వనిహేతుత్వం యథా

శ్లో. శ్రీసూర్యరాయనృపకుంజరఖడ్గకాంతి
భంగీజుష స్తిమిరమండలతో దివాపి
నర్మాస్పదం తు లవతే పరిత స్సమీర
స్తాపింఛరాజికనకాఖ్యసుగంధచోరః.

వ్యాఖ్యానమ్ :—

అత్రైవ క్రీడార్థం ప్రవిశేతి వస్తు వ్యజ్యతే. వాచ్యస్య ధ్వని హేతుత్వ ముదాహరతి శ్రీసూర్యరాయేతి. శ్రీసూర్యరాయనృపకుంజరః శ్రీమద్వేంకటమహీపతి సూర్యరాయ రాజశ్రేష్ఠః "శార్దూల సింహనాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరా" ఇతి కోశః. తస్య ఖడ్గ కాంత్యాః భంగీజుషః తిమిరమండలతో నైల్యస్య ప్రదృష్టిప్రతి రోధకత్వా దితి భావః. నర్మాస్పదం లవతే. ఆహ్లోపి రంతు ముప యోగాయ భవతీతి భావః. తాపింఛా స్తమాలాః "కాలస్కంధ స్తమాల స్స్యా త్తాపింఛ" ఇత్యమరః. కనకాఖ్యాని చంపకాని "కనకం చంపకే స్వర్ణే కింశుకే నాగకేసర" ఇతి విశ్వః. అత్ర ధ్వనిం విశదయతి అత్రేతి. ఇదం పౌరాంగనా మభిసారికాం ప్రతి సఖీవచన మేత దితి బోధ్యం.

### ప్రకరణస్య ధ్వనిహేతుత్వం యథా

శ్లో. వినమ్రమదారిద్ర్యతమిస్రభాను
శ్రీసూర్యరాయేంద్రభటా వయం స్మః

కిం భ్రామ్యతో ర్వ్యాం విమతా నరేంద్రా
స్స్వరక్షణోపాయ ముపాశ్రయధ్వమ్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర భూభ్రమణేన న కిమపి ఫల మస్మా న్నేవ శరణం వ్రజ తేతి వస్తు వ్యజ్యతే. ప్రకరణస్య ధ్వనిహేతుత్వ ముదాహరతి విన మ్రేతి. విమతా మతిహీనా శ్శత్రవో వా ''విమతౌ మతిహీనారీ'' ఇతి విశ్వప్రకాశః. హే నరేంద్రాః! ధ్వనిం లగయతి అత్రేతి.

చేష్టాయా ధ్వనిహేతుత్వం యథా

శ్లో. ప్రస్తావనాయాం మనుజేంద్రకన్యా
శ్రీసూర్యరాయేంద్రగుణా న్వరాణాం
మాతు స్సమక్షం నితరాం నిశమ్య
ముహుః పదాగ్రేణ భువం లిఖంతి.

వ్యాఖ్యానమ్ .—

అత్ర పదాగ్రేణ భువం లిఖంతీతి చేష్టయా సూర్యరాయసార్వ భౌమ ఏవ తాసా మపేక్షేతి ధ్వన్యతే. చేష్టయా ధ్వనిహేతుత్వ మాహ ప్రస్తావనాయా మితి. మనుజేంద్రకన్యా రాజకన్యకాః వరాణాం ''జామాతరి వరః పుమా'' నితి రత్నమాలాయాం. ప్రస్తావనాయాం ప్రశంసాయాం శ్రీసూర్యరాయేంద్రగుణాన్ నిశమ్య పథికేభ్య ఇతి శేషః. వివృణోతి అత్రేతి. వరప్రస్తావనాయాం వేంకటమహీపతి సూర్య రాయ సార్వభౌమగుణశ్రవణసమయ ఏవ తాదృశచేష్టాకరణా త్తస్మి న్నేవ తాసా మపేక్షేతి ధ్వన్యతే.

ఆదిశబ్దేన నిర్వికారత్వస్యాపి ధ్వనిహేతుత్వం యథా

శ్లో. ఘూసేషు దష్టేషు విపక్షభూపై
శ్శ్రీసూర్యరాయాధిపసైనికానాం

న చాపకర్షో న చ శంఖనాదః.

వ్యాఖ్యానమ్ :—

అత్ర సైనికానాం నిర్వికారత్వవర్ణనా తృణచర్వణప్రదర్శిత దైన్యవృత్తిషు రిపుభూపాలేషు కోపోపశమో ధ్వన్యతే. వాచ్యం ప్రక రణం చేత్యాద్యా స్స్య రిత్యాదిశబ్దేన నిర్వికారత్వస్యాపి ధ్వనిహే తుత్వ మస్తీ త్యుదాహరతి ఘూసే ష్వితి. విపక్షభూపై ర్ఘాసేషు దష్టేషు సత్సు ధ్వనిం వివృణోతి అత్రేతి.

## ధ్వ ని వి శే షాః

శ్లో. ధ్వని స్స్యా ల్లక్షణామూల శ్శక్తిమూల ఇతి ద్విధా.

వ్యాఖ్యానమ్ :—

ఏతా వేవ అవివక్షితవాచ్యవివక్షితాన్యపరవాచ్యా వి త్యుచ్యేతే. తత్రాద్యః అర్థాంతరసంక్రమితవాచ్యాత్యంతతిరస్కృత వాచ్యతయా ద్వివిధః. ఆకాంక్షయోగ్యతయో ర్వాక్యార్థప్రతీతి హేతుత్వా త్ప్రయుక్తపదార్థస్య అనుపయోగేఽ నుపపత్తౌ వా తయో రభావాత్ న కావ్యార్థస్ఫూర్తి రిత్యర్థాంతరసంక్రమణాత్యంత తిరస్కృతయో రవతారః.

ఏవం త్రివిధ మపి కావ్యం సామాన్యతో నిరూప్య తత్రి ఉత్తమకావ్యం ప్రపంచయితుం ప్రతిజానీతే. ధ్వని రిత్యాదినా. నను శాస్త్రేషు వ్యంజకస్యైవానంగీకృతత్వా త్తదసంభవేన వ్యంగ్యాభావే కథం ధ్వని రితి చేన్న. ధ్వని రస్తీ త్యాలంకారికాః. నాస్తీతి నైయా యికాదయః. తతః పరస్పరవిరుద్ధయో ర్విధినిషేధయో రేకత్ర సమా వేశాయోగేన వ్యాఘాత్. ధ్వని ర్వాచ్యాతిశాయివ్యంగ్య మిత్యర్థః. లక్షణా మూలః. లక్షణా మూలం యస్య సః. శక్తిరభిధా మూలం

యస్య స ఇతి ప్రథమం ద్వేధా ద్విప్రకారః. పున స్తౌ విభజతే ఏతా వితి. ఏతా వుభౌ అవివక్షితం వాచ్యం యత్ర సోఽయ మవివక్షిత వాచ్యః లక్షణామూలః లక్షణాయా వాచ్యబాధపురస్కారప్రవృత్త తయా వాచ్యస్య అవివక్షితత్వా దితి భావః. వివక్షిత మన్యపరం వ్యంగ్యనిష్ఠం వాచ్యం యస్మిన్ స వివక్షితాన్యపరవాచ్యః. అభిధా మూలః తత్ర అభిధాయా వాచ్యార్థబాధాభావా దితి భావః. అవి వక్షితవాచ్యం విభజతే తత్రాద్య ఇతి. అర్థాంతరే సంక్రమితం వాచ్యం యస్య సః. అత్యంతతిరస్కృతం వాచ్యం యస్య సః. తయో ర్భావ స్తత్తా. తయా అర్థాంతరసంక్రమితవాచ్యోఽత్యంతతిరస్కృత వాచ్య ఇతి చ ద్వివిధ ఇత్యర్థః. తత్రాద్యే వాచ్యార్థ స్యానుపయోగేఽ ర్థాంతరసంక్రమణ మనుపపత్తౌ తు తిరస్కృతిః. అర్థాంతరసంక్రమిత వాచ్యే వాచ్య స్యానుపయుక్తత్వా దజహల్లక్షణామూలత్వ మత్యంత తిరస్కృతవాచ్యే తు వాచ్యస్య అనుపపన్నత్వా జ్జహల్లక్షణామూల త్వం చేతి వివేకః.

స ద్వివిధః. పదగతో వాక్యగత శ్చేతి. పున స్తం విభజతే స ఇతి. అర్థాంతరసంక్రమితవాచ్యోఽత్యంతతిరస్కృతవాచ్య శ్చ ద్వివిధ ఇత్యర్థః.

యోఽర్థ ఉపపద్యమానోపి తావతానుపయోగాత్ ప్రకృత సూత్రవ దుపయుక్తార్థాంతరసంవలనేన స్వయం న దృశ్యతే సోఽర్థాం తరసంక్రమితవాచ్యధ్వనిః. అర్థాంతరసంక్రమితవాచ్యత్వం వ్యా కరోతి య ఇతి,

## పదగతో యథా

శ్లో. భాస్వతో స్సార్వరాయేంద్ర
యశోరాశిప్రతాపయోః

ద్విజరాజ స్త్విషాం రాజో
వర్తేతే గగనాంగణే.

వ్యాఖ్యానమ్ :—

అత్ర వర్తేత ఇతి కేవలధాత్వర్థస్య వర్తనస్య అనుపయోగా న్నైఽఽర్థక్యేన వర్తనరూపార్థాంతరసంక్రమితతయా యశఃప్రతాపయో రేవ సకలజగత్తమోనివర్తనకమలకువలయోల్లసనాధిధారంధర్యం వ్యజ్యతే.

పదగత మర్థాంతరసంక్రమితవాచ్యధ్వని ముదాహరతి భాస్వతో రితి. ద్విజరాజ శ్చంద్రః. త్విషాంరాజ స్సూర్యః. "రాజాహస్సఖిభ్యష్ట" ఇతి అలుకి టచ్. లక్షణాబీజ మనుపయోగం తద్గుణ యోగం చ దర్శయ న్నర్థాంతరసంక్రమితవాచ్యస్య పదగత్వం విశదయతి. అత్రేత్యాదినా. ప్రకృతే వర్తనస్య అనుపయోగో వ్యాచ్యార్థ బాధః లక్ష్యవ్యంగ్యయో ర్వర్తననైరర్థ్యవ్యయో స్సమవాయ స్సంబంధః. ప్రతాపయశసో స్తిమిరనివర్తనకువలయోల్లసనధౌరంధర్యం ప్రయోజన మితి బోధ్యం. ఏవ మితరత్రాపి బాధాదయో యథాయోగ మనుసంధేయాః.

## అత్యంతతిరస్కృతివాచ్య ధ్వనిః.

"యః పున రనుపపద్యమాన ఏవ కస్యచి దుపపన్నార్థస్య ప్రతీతిం సమర్ప్య స్వయం నివర్తతే సోఽత్యంతతిరస్కృతవాచ్య ధ్వనిః.

అత్యంతతిరస్కృతవాచ్యధ్వనిం నిరూపయతి యః పున రితి.

యథా

శ్లో. శ్రీసూర్యరాయప్రభునా విలాసై
రుల్లాసితాయా న కదాపి తస్యాః

అపి స్వకాంతానుపదోపభుక్తమ్
స్వరూప మేవ స్ఫుటమ ప్యలీకమ్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర నిష్ప్రయోజనత్వలక్షకాలీకపదేన స్వార్థోఽత్యంత తిరస్కృతః. తేన చ వేంకటమహీపతిసూర్యరాయసార్వభౌమోపభోగ ఏవ సర్వాసాం సౌందర్యలావణ్యాసార్థక్యసంపాదక ఇతి వ్యజ్యతే.

పదగత మత్యంతతిరస్కృతవాచ్యధ్వని ముదాహరతి శ్రీసూర్య రాయేతి. శ్రీసూర్యరాయప్రభూణాం విలాసైర్లీలాదిభిః. "విలాసో భావలీలయో" రితి రత్నమాలాయాం. కథాపి జాత్వపి నోల్లాసితాయా అపి తస్యాః ప్రియాయాః స్వకాంతేన అనుపదోపభుక్తం స్వరూప మేవ స్ఫుటమ ప్యలీకం భవతీతి శేషః. అత్ర ధ్వనిం వ్యక్తీకరోతి అత్రేతి నిష్ఫలత్వరూపలక్షకేన అలీకపదేన.

పదగతా వేతా న్యరూపిషాతాం వాక్యగతౌ నిరూప్యేతే

అర్థాంతరసంక్రమితవాచ్యధ్వని రత్యంతతిరస్కృతవాచ్యధ్వని శ్చ ద్వావ ప్యేతౌ పదగతా వుదాహృతౌ.

వాక్యగతోఽర్థాంతరసంక్రమితవాచ్యధ్వని ర్యథా

శ్లో. పశ్య పశ్యైన మబ్జాక్షి! లక్ష్యతేఽసౌ త్వయా పురః
శ్రీరావుకులచంద్రాయ యస్మై స్పృహయతే మహీ.

వ్యాఖ్యానమ్ :—

అత్ర అసౌ లక్ష్యత ఇత్యనంతర మేనం పశ్యపశ్యేతి వాక్యేన ఉక్తార్థబోధనా దనుపయుక్తేన అనితరసాధారణ మేనం పశ్య పశ్యే త్యర్థాంతరసంక్రమణా దస్మిన్నేవ త్వయాఽనురాగః కర్తవ్య ఇతి ధ్వన్యతే. వాక్యగతార్థాంతరసంక్రమితవాచ్యధ్వని ముదాహరతి పశ్యపశ్యేతి. కాంచన నాయికాం ప్రతి సఖీవచన మేతత్ యోజయతి. అత్రేతి.

## వాక్యగతాత్యంతతిరస్కృతవాచ్యధ్వని ర్యథ

శ్లో. వినమ్రసౌమ్యాః కిల సూర్యరాయ
విభు ర్దురుక్తాని కథం సహేత
స సర్వథాపి ప్రతిమల్లభూపాః
ప్రయాంతు యూయం విపినస్థలాని.

వ్యాఖ్యానమ్ :—

అత్ర ప్రణామేన ఋజూపాయేన శాత్రవదురుక్తిసహనశీలే సూర్యరాయమహీపాలే సర్వప్రకారై రపి శాత్రవదురాలాపాసహన శీలత్వరూపార్థస్య అనుపపత్త్యా లక్షణయా సహత ఏవేత్యర్థో వాక్యేన లక్ష్యతే. తేన ఋజూపాయం విహాయ వస్థలీషు క్వాపి వా భవద్భి ర్నిస్థాతవ్య మితి వ్యజ్యతే.

వాక్యగతాత్యంతతిరస్కృతవాచ్యధ్వని ముదాహరతి. వినమ్రసౌమ్య ఇతి. వేంకటమహీపతిసూర్యరాయసార్వభౌమభయేన స్వస్వదేశా న్విహాయ విదేశజిగమిషూన్ స్వస్వవిభూ న్ప్రతి తత్తదమాత్యవచన మేతత్. యోజయతి అత్రేతి. లక్షణయా విపరీతలక్షణయా.

### అభిధా

శక్తి రపి ద్వివిధా. శబ్దగతా అర్థగతా చేతి. తత్రాద్యా పదవాక్యగతత్వేన ద్వివిధా. ప్రత్యేకం వస్త్వలంకారయో ర్ధ్వనౌ శబ్దశక్తిమూలా శ్చత్వారో భేదాః. అర్థశక్తి రపి స్వతఃప్రౌఢోక్తితశ్చ సిద్ధా. ప్రత్యేకం పదవాక్యగతత్వేన ద్వైవిధ్యే చతుర్విధా. వస్తునా వస్త్వలంకారయో రలంకారే ణాలంకారవస్తునో ర్ధ్వనౌ ఏకైకస్య చాతుర్విధ్యే అర్థశక్తిమూలా రసాదిధ్వనిభి ర్వాక్యపదపదైకదేశరచనావర్ణగతైః పంచభి స్సహైకపంచవింశతిః. ఉభయశక్తిమూల ఏక ఇతి.

శుద్ధా ధ్వనయ స్త్రింశత్. తత్ర వస్త్వలంకారధ్వని రసంలక్ష్యక్రమ వ్యంగ్యః. రసాదిధ్వని రసంలక్ష్య క్రమవ్యంగ్య ఇతి వివేకః.

శక్తిం విభజతే శక్తి రపీతి స్పష్టమ్.

పదగత శ్శబ్దశక్తి మూలో వస్తుధ్వని ర్యథా

శ్లో. ప్రాంచత్కాంచీం రుచిరవిలసత్కుంతలాం రమ్యచోళామ్
బాంహ్లీకేన ద్విగుణితరుచిం శోభితాం చాంగరాగైః
ప్రాప్తం సౌఖ్యం సమధిక మిలాపాలశార్దూలదత్తామ్
రమ్యాం శ్యామా మవతి వసుధాం సూర్యరాయక్షితీంద్రః.

వ్యాఖ్యానమ్ :—

అత్ర వసుధావనరూపవస్తుని ప్రస్తుతే విధివత్పరిణీతాయాః కస్యా శ్చిత్కాంతాయా రక్షణరూపం వస్తు వ్యజ్యతే.

పదగతం శబ్దశక్తిమూలం వస్తుధ్వని ముదాహరతి. ప్రాంచ దితి. ప్రాంచత్కాంచీం సమంచితకాంచీపురీం యద్వా సమంచిత రాజధానీం ప్రాంచితమేఖలాం చ "కాంచీపురీ రాజధానీ మేఖలాసు నిగద్యత" ఇతి ధనంజయః. రుచిరవిలసత్కుంతలాం సుందరవిలసత్కుంతలదేశాం సుందరవిలసచ్చికురాం చ రమ్యచోళాం సుందరచోళదేశాం మనోజ్ఞకూర్పాసకాం చ "చోళః కూర్పాసకో స్త్రియా" మిత్యమరః. బాంహ్లీకేన బాంహ్లీకదేశేన కుంకుమేన చ "బాంహ్లీకం కుంకుమే హింగౌ దేశభేదాశ్వయో రపీ"తి రత్నమాలాయాం. అంగరాగై రంగదేశీయరాగద్రవ్యవిశేషైః లాక్షాదిభి శ్చ శోభితాం. ఇలాపాలశార్దూలదత్తాం వసుధాపక్షే స్వపిత్రా వేంకటమహీపతిగంగాధర రామరాయసార్వభౌమదత్తాం స్త్రీపక్షే కేనచి ద్రాజశ్రేష్ఠేన చేతి బోధ్యం. శ్యామాం సర్వసస్యాఢ్యాం యౌవనమధ్యస్థాం చ యోజయతి. అత్రేతి.

శబ్దశక్తిమూలాలంకారధ్వనయో బహువిధాః,
శబ్దశక్తిమూలాలంకారధ్వనీనా మానంత్య మాహ శబ్దేతి.

తత్ర లౌకికవస్తునిరూపితాలంకారధ్వని ర్యథా

శ్లో. అనియతసహచరవృత్తి
ప్రథితవిరోధైకహేతవః కుభృతః
హృదయే ప్రకోపవహ్నిం
వక్తుం గమయంతి సూర్యరాయవిభోః.

వ్యాఖ్యానమ్ :—

అవిరుద్ధహేతోః పర్వతవ ద్వహ్నిసాధకత్వేన ప్రసిద్ధత్వేపి తం వినా వహ్న్యనుమితికథనా త్కారణసాకల్యాభావప్రయుక్తో విభావనాలంకారః. కుభృత ఇతి పదగతః ప్రభుపర్వతౌపమ్యధ్వనిః.

తత్ర లౌకికవస్తునిరూపితాలంకారధ్వని ముదాహరతి. అనియతేతి. అనియతయా సహచరవృత్త్యా సాహచర్యేణ ప్రథితో విరోధ ఏవ ఏకో ముఖ్యో హేతుః కారణం యేషాం తే. యద్వా తాదృగ్విరోధస్య ముఖ్యహేతవ ఇతి వా. కుభృతః రాజానః పర్వతా ఇతి చ. సూర్యరాయవిభోః హృదయే కోపవహ్నిం క్రోధాగ్నిం వ్యక్తుం గమయంతి. అనుమితికరణం ప్రపంచయన్ తద్విరోధేనా ప్యనుమితిం సిద్ధవత్కృత్య యోజయతి. అవిరుద్ధహేతో రితి విషయ మాహ కుభృత ఇతి.

మీమాంసకవస్తునిరూపితాలంకారధ్వని ర్యథా

శ్లో. శ్రీసూర్యరాయధరణీధరచక్రవర్తి
కీశం జలాధికరణే నృపవేదసత్వం
యత్త్వాపి భూప తవ వాఙ్నిచయేఽఖిలేఽపి
సంలక్ష్యతే చతురతా మహితా చ నైవ.

వ్యాఖ్యానమ్ :—

అత్ర లడయో రభేద ఇతి జలయో రేకత్ర ప్రతిపాదనాత్. హేజడ! అధికరణే మహతి సంగరే శ్రీసూర్యరాయ సార్వభౌమ స్త్వాం వానరం మన్యతే. అతిభీతం మన్యత ఇతి యావత్. యస్మా త్త్వ భాషితే ష్వపి చాతుర్యం న దృశ్యతే. భుజయోః కుత స్స్యా దితి తాత్పర్యం. అతో యుద్ధసన్నాహం సర్వథా మాకృథా ఇత్యాక్షే పాలంకారః. చతురతేతి పదగతః ప్రతీపవానరయో రౌపమ్యధ్వనిః. ప్రతీపభూపాలా న్ప్రతి భేదోపాయేన భయోత్పాదకసూర్యరాయసార్వ భౌమసచివైః ప్రేషితం వచన మేతత్. మీమాంసకవస్తునిరూపితా లంకారధ్వని ముదాహరతి శ్రీసూర్యరాయేతి. లడయో రభేద ఇతి మీమాంసకాః. కీశం మర్కటం "మర్కటో వానరః కీశ" ఇత్యమరః. వ్యాకరోతి. అత్రేతి.

జ్యోతిశ్శాస్త్రవస్తునిరూపితాలంకారధ్వని ర్యథా

శ్లో. కన్యోది తేయం లలితైః కటాక్షై
శ్చిత్రం విలాసా దధిరూఢకర్కమ్
ఉచ్చై ర్విధత్తే ధిషణం నిరీక్ష్య
శ్రీసూర్యరాయేంద్రముదం భవంతమ్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర కన్యోదితా కన్యాలగ్నజాతా స్వలగ్నైకాదశకర్కట కోల్లసదుచ్చం ధిషణస్య యత్నం వినాపి అచిరసమీహితఘటకత్వేన సాభిలాషితసూర్యరాయవిభుకరగ్రహణ మచిరే ణాయత్నేన మమ సిద్ధ్యే దిత్యాశయా పశ్యంతీత్యర్థః. ప్రహర్షణాలంకారో వ్యజ్యతే. కర్కమితి పదగతః శ్వేతవాహనకులీరయో రౌపమ్యధ్వనిః.

పదగతం జ్యోతిశ్శాస్త్రవస్తునిరూపితాలంకారధ్వని ముదాహ

రతి. కన్యేతి. ఉదితాఽసన్నా ఇయం కన్యా స్త్రీ కన్యాలగ్నజాతా చ విలాసాత్ అధిరూఢః కర్క స్సితాశ్వో యేన తం. స్వలగ్నైకా దశకర్కటకలగ్నం చ. "కర్కః కర్కటకే వహ్నౌ శుక్లాశ్వే దర్పణే ఘట" ఇతి విశ్వః. ఉచ్చై ర్మహాంతం, ఉచ్చసంజ్ఞికం. ధిషణా ప్రజ్ఞా స్యాస్తీతి ధిషణః. అర్శాదిత్వా దచ్ప్రత్యయః. యద్వా ధృష్ణు వతి ప్రగల్భత ఇతి ధిషణః, తం బృహస్పతిం చ న్యాకుర్వన్ యోజయతి. అత్రేతి. కుళీరః కర్కటః.

## యోగశాస్త్రీయవస్తునిరూపితస్య యథా

శ్లో. దత్వా స్వయోగం రిపుభూపసంఘే
శ్రీసూర్యరాయక్షితిపాలఖడ్గః
హృత్కోశతః ప్రాణసమీర మేషా
ముత్కంప మభ్యాసయతి క్షణేన.

వ్యాఖ్యానమ్ :—

అత్ర క్షణేన అభ్యాసయతీ త్యనేన ఖడ్గస్య అతిచతురమహా యోగిత్వం గమ్యతే. యోగ మితిపదగతం యోగశాస్త్రసంబంధోప మ్యధ్వనిః.

పదగతయోగశాస్త్రీయవస్తునిరూపితాలంకారధ్వని ముదాహ రతి. దత్వేతి. శ్రీసూర్యరాయక్షితిపాలఖడ్గః రిపుభూపసంఘే స్వయో గం స్వసంబంధం స్వస్మిన్ బ్రహ్మణి చిత్తవృత్తినిరోధం చ దత్వా ఏషాం రిపూణాం హృత్కోశతః హృదయకోశాత్ "పంచమ్యా స్తసిః" యోజయతి. అత్రేతి.

## గంధర్వనిరూపితస్య యథా

శ్లో. విసంవాదిస్వరారోహా
సంధాయీ సూర్యరాడ్విభోః

కౌక్షేయకః పూర్ణరాగ
ధృవాభోగ ప్రకల్పకః.

వ్యాఖ్యానమ్ :—

అత్ర విసంవాదినాం ప్రతివాదినాం స్వరారోహం స్వర్గారోహణం సంధాయీ. అస్యత్ర విసంవాదీనాం ప్రతికూలవాదినాం స్వరాణాం చారోహణం సంధాయీ చ పూర్ణరాగాణాం గాథానురాగిణాం ధృవాభోగో నిత్యపరిపూర్తిః తత్ప్రకల్పకః. అన్యత్ర పూర్ణరాగాణాంధృవా భోగాదీనాం చ ప్రకల్పకః. ఏవం చ ఖడ్గస్య గంధర్వాభేదో గమ్యత ఇతి రూపకాలంకారః.

గంధర్వవస్తునిరూపితాలంకారధ్వని ముదాహరతి. విసంవాదీతి వ్యాకరోతి. అత్రేతి." స్వరవ్యయం స్వర్గనాక" ఇత్యమరః. "రాగోఽనురాగే మాత్సర్యే లాక్షాదౌ రక్తిమత్యపోః, గాంధారాదౌ రంజనే" చేతిరత్నమాలాయాం. "ఆభోగఃపరిపూర్ణతే" త్యమరః. శిష్టం స్పష్టమ్.

శబ్దశక్తి మూలవస్తుధ్వని ర్యథా

శ్లో. శ్రీసూర్యరాయ ! నృపమౌళిమణే ! గుణాఢ్య !
స్వాయత్తసర్వజనతామహిమాశ్రయత్వం
యా శేషయత్నవిధృతాపి సుఖేన నాసీ
దేనాం శ్రియం చ సుచిరం నియతం వహస్వ.

వ్యాఖ్యానమ్ :—

అత్ర స్వాయత్తసర్వజనసమూహ మహిమాశ్రయత్వం చ యా అశేషయత్నవిధృతాపి సుఖేన నావర్తత. తాం శ్రియం చ నిశ్చలం వహస్వేతి ఆశంసారూపవస్తుని ప్రస్తుతే యా శేషయత్నవిధృతాః సుఖేన నాసీత్. తాం మహీం స్వాధీనసర్వజనస్త్వం విభృత మాశ్రయేతి మహీప్రాప్త్యాశంసారూపవస్తు ధ్వన్యతే.

శబ్దశక్తిమూలవస్తుధ్వనిం వాక్యే నోదాహరతి. శ్రీసూర్య రాయేతి. హే శ్రీసూర్యరాయ! హే నృపమౌళిమణే! రాజశిరో భూషణ! హే గుణాబ్ధే! ప్వాయత్తా స్స్వాధీనాః సర్వజనా స్తేషాం సమూహః "గ్రామజనబంధుసహాయేభ్య స్తల్" తస్యా మహిమ్నః ఐశ్వర్యస్య ఆశ్రయః ముఖ్యకారణం తస్య సంబుద్ధిః. శేషం యోజ యతి. అత్రేతి. అశేషయత్నైః రామాద్యనేకావతారకృతప్రయత్నైః శేషేణానంతేన యత్నేన అతిప్రయాసేన విధృతాపి.

## వాక్యగతశబ్దశక్తిమూలో உలంకారధ్వని ర్యథా

శ్లో. సూర్యరాయమహీజానే
రౌదార్యం కల్పపాదపః
శృణ్వ న్నభోగకుతుకం
విధత్తే చలతాన్వితః.

వ్యాఖ్యానమ్ :—

అత్ర విధత్తే చలతాన్విత ఇత్యనేన చలతాన్వితః లతాన్విత ఇతి చ ప్రతీయతే. నభోగకుతుకం విధత్త ఇత్యత్ర భోగకుతుకం న విధత్తే. నభోగకుతుకం విధత్త ఇతి చ ప్రతీయ్యతే. ఏవం చ చలతా న్వితో உపి తథావిధో భోగకుతుకం న విధత్త ఇతి ఉత్ప్రేక్షా గమ్యతే. తదేవం శబ్దశక్తిమూలం వస్త్వలంకారద్వైవిధ్యం. తదుక్తం "అలం కారోదవస్త్వేవ శబ్దా ద్యత్రావభాసతే, ప్రధానత్వేన స జ్ఞేయ శబ్ద శక్త్యుద్భవో ద్వి"ధేతి.

వాక్యగతం శబ్దశక్తిమూలాలంకారధ్వని ముదాహరతి. సూర్య రాయమహీజానే రితి. కల్పపాదపః కల్పతరుః కర్తా. సూర్యరాయ మహీజానే రౌదార్యం దాతృత్వం "ఉదారో దాతృమహతో" రిత్య మరః. శృణ్వన్ శబ్దశక్తిమూలత్వం విశదయన్ ధ్వనిం యోజయతి.

అత్రేతి. చలతయా చాంచల్యేన అన్వితః. లతాభి శ్శాఖాభి రన్విత శ్చ భోగకుతుకం భోజనేచ్ఛాం "భోగస్తుభోజనే విత్తే నిర్వేశే పాలనే సుఖే" ఇతి రత్నమాలయాం. నభోగేషు నభోగతేషు కుతుకం తదేవం శబ్దశక్తిమూలస్య ద్వైవిధ్యం సిద్ధవత్కృత్య తత్ర వృద్ధసంమతిం దర్శ యతి అలంకార ఇతి.

స్వతస్సిద్ధార్థశక్తిమూలా శ్చత్వారః.

పదగత స్స్వతస్సిద్ధార్థశక్తిమూలకవస్తుధ్వని ర్యథా.

శ్లో. శ్రీసూర్యరాయవిభునా విధృతై స్స్వరాష్ట్రి
త్రాంతై స్సమం త్రిచతురాణి పదాని గత్వా
కాంతాః కియత్పదమితాం పదవీం విలంఘ్య
నాథేతి నమ్రవదనా నను యుంజతే తాన్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర కియత్పదేతి. పదేన కదాచిదపి ఘటికార్థగమనపరిమిత పదవీపర్యటనపరిచయమహాభాగ్యం వస్తు వ్యజ్యతే. పదగతం స్వత స్సిద్ధార్థశక్తిమూలకవస్తుధ్వని ముదాహరతి. శ్రీసూర్యరాయవిభు నేతి యోజయతి అత్రేతి.

వాక్యగత స్స యథా

శ్లో. కర్ణావతంసమణిపాళిమరీచిపాళి
నీరాజితాని నవకందళితస్మితాని
విస్రంసినీవిసహనాని చ కామినీనామ్
శ్రీసూర్యరాయవిభువక్త్రవిలోకితాని.

వ్యాఖ్యానమ్ .—

అత్రచేష్టారూపవస్తునా వేంకటమహీపతిసూర్యరాయసార్వ భౌమసౌందర్యాతిశయరూపం వస్తు వ్యజ్యతే.

వాక్యగతం స్వతస్సిద్ధార్థశక్తిమూలకవస్తుధ్వని ముదాహరతి. కర్ణేతి. శ్రీసూర్యరాయవిభో ర్వక్త్రే విలోకితాని విలోకనాని "నపుం సకే భావేక్తః" కర్ణావతంసా కర్ణాలంకారభూషితా మణిపాళిః మణి మయచిహ్నం "పాళిః పంజ్త్యంకభేదయోః అస్రే చ కర్ణతాళాగ్రే స్యాత్ప్రిస్థయూకయోః సంజాత శ్మశ్రుయోషాయా"మితి ప్రతాపః. తస్యా మరీచయః కాంతయః తాసాం పాళ్యా పజ్త్యాసీరాజితాని నవకం దళితాని స్మితాని యేషు తాని. అత్ర ఉత్తమవిషయత్వాత్ స్మితానీ త్యుక్తం. తదుక్తం స్మిత మిహ వికాసనయనం కించిల్లక్ష్య ద్విజం హసితం మధురస్వరం విహసితం సాంసశిరఃకంప ముద్ధసితం అపహ సితం సాస్రాక్షంవిక్షిప్తాంగభవత్యతిహసితం ద్వే ద్వే హసితే చైషాం జ్యేష్ఠే మధ్యేఽధమే క్రమశ ఇతి విస్రంసినీ విసహానాని నీవీస్రంసనం చ కామినీవిలాసే "ఆలింగనావలోకాభ్యాం మనోభీష్టస్య కామినః కామినీనాం మనోనీవీద్వయం నిర్గళతి స్వయ"మితి. "ఆలింగనాద్రఘు పతే రవనీసుతాయా హారేషు భూరికుచమండల మాశ్రితేషు ఉత్స్రా త్రతా ముపగతేషు భయేన నూనం క్షీణం వలగ్న మనుచ త్స్వత ఏవ నీవీ, శృంగారిణ స్స్మరవిలాసవత శ్చ యూన శ్శౌరేః కటాక్షశర జాలఘనాభిఘాతాత్ గోపాంగనావిగళితాంతరనీవిబంధాముహ్యంతి చాత్మనిభృతాత్మజబాహ్యచేష్టా ఇతి మహాకవిప్రయోగశ్చ యో జయతి అత్రేతి.

పదగత స్స్వతస్సిద్ధార్థశక్తిమూలకవస్తునాలంకారధ్వని ర్యథా

శ్లో. భూపాలై ర్బహుభి ర్ద్విదృక్షుభి రహో! శ్రీసూర్యయాధిపమ్
సంఘీభూయ పురాంతికే సహ సమాయాతా న్మదేభవ్రజాన్
దృష్ట్వా ధాతురసాభిరసాంజితతనూ న్నృత్యంతి నిత్యం వనే
ప్రాంచన్మేచకసంకులాః ఫణిభుజః కేకాభి నీతాంతరాః.

సానుభవసానుభవసుగంధానుముదిత
శబరబింబాధరాళి యా శైలమాళి. 4

వ. వెండియుం బ్రచండ వేదండశుండాదండ విఖండితశాఖామండల
శ్రీఖండద్రవపిచండిల సానుచర సానుచరకిన్నరీమధుర గానాకర్ణన
దశాపరవశచమరీగణగ్రహణ లీలాశీలనిషాదయోషాభూషితోపత్య
కాతలంబును, శరభసాకుంతకంఠీరవ నఖముఖవిదారితాదంభకుంభి
కుంభసంభూత నూతనముక్తాఫలజాత సంజాతాసమయతారాగణ
శంకాసంకులాధిత్యకాప్రదేశంబును, శాఖామృగ ప్రకంపితోత్తాల
తాళరసాలగళిత లలితఫలరసప్రసర ప్రలంబమాన నిర్ఝరప్రాంత
సంక్రాంత క్రౌంచసంచారాంచితపరిసరంబును, నదభ్రాభ్రవిభ్ర
మాభ్రంకషాగ్ర సమగ్రధాతుసంఘాతసముజ్జాతానవరతసంధ్యా
దర్శన విరహావిధుర చక్రవాకద్వయీసంతాపహరణ చణ స్ఫాటిక
శిలాతలాంతర్బింబిత పద్మరాగశృంగప్రతిబింబాళీక నాళీకప్రియో
దయంబును నై విరాజిల్లి మధుసూదనాకారంబునుంబోలె విచిత్ర
వనమాలాలంకృతం బై, నీలకంఠకంఠంబునుంబోలె నాగనిశ్వాస
సముత్క్షిప్తభూతిభాసురం బై, చతుర్ముఖస్వరూపంబునుంబోలె
హిరణ్యగర్భతానిర్భరం బై, సుగ్రీవప్రభుత్వంబునుంబోలెఁ గేసరి
శరభగవయాదిసేవితపాదపం బై, మీమాంసాన్యాయంబునుం
బోలెఁ బిహితదిగంబరదర్శనం బై, ఛందోవిశతియునుంబోలె దర్శిత
మత్తమయూరాదివృత్తవిలాసం బై, శ్రీనగంబునుంబోలె మల్లి
కార్జునాధిష్ఠితం బై, భీష్మయుద్ధంబునుంబోలె శిఖండివిముక్తార్ధ
చంద్రసమాలీఢం బై, కాముకచిత్తవృత్తియుంబోలెఁ గాంతారో
పరసానుగతం బై, యతిభీమరూపం బయ్యుఁ గీచకాక్రాంతం బై,
కుజనాశ్రకరం బయ్యు సద్వంశభూషణం బై, సుప్రశస్థం బయ్యు నపరి
మాణం బై యొప్పు నప్పర్వతంబు చెంగట- 5

కం. జనపతి కనియెం గృతిమ
జ్జనజనతాఘూతవృజినజాతవిరావన్
వనచరతనుఘుర్మస్తం
భనసుమహితశిశిరప్రభావన్ రేవన్. 6

సీ. కవిరాజు లిరువంకఁ గైవారములు సేయ
సన్నిధి రాజహంసములు నిలువ
ధీవరుల్ వేవేలు తేవతోఁ గొలువంగ
ననితరపుణ్యజీవనత మెఱయఁ
బద్మాభిరామసౌభాగ్యంబు రంజిల్లఁ
బ్రమదాళిగానవైభవము చెలఁగఁ
గంకణసూర్మికాలంకృతుల్ విలసిల్లఁ
గువలయానందకృద్గుణము లలరఁ

గీ. బ్రభుతఁ గనుపట్టుఁ బులినవిభ్రాజమాన
తటనటద్వాయుడింభసంఘటితవింధ్య
కటకసురదారుకేసరస్ఫుటతరంగ
హతిపరిప్లుతవనదంతి యాప్రవంతి. 7

చ. అనిశము గ్రీష్మవాసరములందు దినాంతములం బుళిందభా
మినులు జలావగాహన సమీహితలీలలఁ దేలఁ దద్ఘన
స్తనఘనసారసంకుమదసౌరభసంగ్రహణేచ్ఛచేఁ బ్రభం
జనుఁడు చరించు మందగతి సంధిలఁ దత్తటినీతటంబునన్. 8

సీ. సతతభూభృత్సేవ సలుపు నర్థాపేక్ష
గలుగు హేలావతీగతిఁ దనర్చి
తతకబంధస్ఫూర్తి దనరారు రామసం
గ్రామభీమస్థలికరణి నలరి

వేళాభివృద్ధి గావించువాసరముఖ
లక్ష్మీవిలాసలీలలఁ జెలంగి
ముఖభంగవిభ్రమంబులు గాంచు నతిశిర
కృత్స్నవృష్టాంగనకీర్తి మెఱసి

గీ. విమలకమలాంతర భ్రమద్భ్రమరమధుర
ఝంక్రియాగీతతానసంజనన మెంతు
భూతతటరుహకీచకోద్భూతశీత
పవనగతిఁ బొల్చు నాసరిత్ప్రభునఘాటి. 9

గీ. అంబుజానన మీనాక్షి యాస్రవంతి
సలలితతరంగహస్తము ల్సాచి కంక
ణములు మెఱయంగ నుపగూహనం బొనర్చు
వింధ్యనగరాజుఁ గామినీవిధము దోఁప. 10

స్రగ్ధర. భూవిఖ్యాతప్రభావస్ఫుటసలిలఝరీ
పూరతత్పుణ్యరేవా
సేవాహేవాకభావాంచితగతి నృపతి
శ్రేష్ఠుఁ డవ్వేళ వింధ్య
గ్రావప్రాంతప్రధావద్ఘనమృగనికరా
క్రాంతకాంతారభూమిన్
ద్రోవన్ రాఁ జూచి ధీరస్తుతుఁ డగుమకరం
దుండు దా నిట్లు పల్కెన్. 11

కం. జనవర చూచితివే యీ
వనము ఫలప్రదమహీజవైభవజితనం
దనము సమస్తమృగావన
మనవరతసమందపవన మనఁదగుఁ దెలియున్. 12

కం. ఓన్నలు సంపెంగలు సుర
పొన్నలు మామిళ్లు పొగడపొదలును మావుల్
ఉసన్నకపుకంపులనఁటులుఁ
గన్నులపండువులు సేయుఁ గనుఁగొను మిచటన్. 13

చ. నృపవర చూడు మల్లదె దరీకుహరాంతరదంతదంతుర
ద్విపనిపతన్ మృగేంద్ర మతిదీర్ఘభయంకరవాలము న్నట
త్స్ఫుటలసటాభిరామతనుదీధితిభవ్యము దీనిరూపు ని
శ్చపలత వ్రాసి చూడఁగ నశక్యము చిత్రపటాంతరంబునన్. 14

మ. అదిగో వేఱొకసింహశాబకము దంష్ట్రాభీలలీలన్ సటల్
కదలించెన్ జతురశ్రదృష్టభయదాకారంబుతోఁ దిన్ననై
పదనఖల్ మీఁదికి నెత్తి నాద మెసఁగన్ భద్రేభరాజంబుపైఁ
బొడతెం గ్రౌర్యముతోడ దీనివిధమున్ భూమీశ కన్గొంటివే. 15

శా. భల్లూకంబులఁ జూచితే తిమిరసంపల్లాలితాంగప్రభో
ద్యల్లీలన్ ఘననీలనీలఘనసఖ్యం బెప్పుడుం జేయఁగా
వల్లీవేల్లితవామలూరువుల క్రేవం గొంటుజుంటీఁగ లం
దెల్లం గయ్యెడఁ దేనియ ల్గొనెడు భూమీశా విచిత్రంబుగన్. 16

కం. కనుఁగొన బిడాలములు సా
దనె బిలముల నాఖువులమదం బడఁచు క్రియన్
వనగవుల గవుల దవులం
బోసివి విజృంభించుపులులఁ జూడు నరేశా. 17

కం. అనుచుఁ గనుఁగొనుచుఁ గానన
మునఁ గనుఁగొనఁదగు వినోదములు మకరందుం
డనుమోదించుచుఁ దెలుపఁగఁ
జని చని కందర్పకేతుజనవిభుఁ డంతన్. 18

మహా. స్రగ్ధర. అటఁ గాంచెన్ మానసాబ్జం బలర సురనగ
ప్రాంతసంక్రాంతజంబూ
కటదాయాదప్రభావాంకురితకిసలయా
కుంచితాత్మీయశాఖా
పటలచ్ఛాదనాకులాయప్రకటితసరసీ
శాంభవాయాతకీర
స్ఫుటనాజ్యాఘ్ర్యఘ్యర్ఘ్యాద్భుత మగు నోకజం
బూధరిత్రీరుహంబున్. 19

సీ. ఛాయామనోహరసౌభాగ్యమున హెచ్చి
భాస్వదాకృతిచేతఁ బ్రబలు టరుదె
లాలితానేకపల్లవవిలాసముఁ గాంచె
విటపశేఖరయూథి వెలయు టరుదె
ఘనపత్రవైభవఖ్యాతిఁ జెన్నలరారె
రాజమానోన్నతిఁ గ్రాలు టరుదె
లక్ష్మీసమగ్రలీలల నొప్పె నలవిష్ణు
పదసేవ నేర్పొద్దుఁ బొదలు టరుదె

గీ. యని వినుతి సేయఁదగు లతాంతానురక్త
పసలదాయాదనిజవిభాభాసమాన
ఫలరసాస్వాదసంతోషభరితభూరి
శారికాకీరవార మాభూరుహంబు. 20

గీ. ఎన్నఁదగుచున్న యాచిన్నగున్ననీడ
విపులవిపులాతలంబున విశదభంగి
నధ్వజశ్రమ వేషమానాంగుఁ డగుచు
మేదనీవల్లభుఁడు విశ్రమించె నంత. 21

తపనుఁడు పశ్చిమాంబునిధి డాఁగెఁ బ్రతీచికి రాగ మబ్బె నీ
లపురుచితోఁ దమంబు దెసలం దనరారె నుడు ల్వెలంగెఁ దూ
రుపు తెలు పెక్కెఁ బంకజవిరోధి శుభోదయ మొందె నైందవా
తపములు గాయఁజొచ్చెఁ గుముదద్యుతి గన్గొనన య్యె నయ్యెడన్.

అలమకరందముఁ దచ్చటివనాంతమునం గలకందమూలముల్
ఫలములుఁ దేనియల్ విమలపద్మదళాంతరవారిపూరముల్
చెలఁగుచుఁ దెచ్చినన్ మది రుచించినలాగున నారగించి భూ
తలపతి పల్లవప్రకరతల్పమునన్ మొయిఁ జేర్చె నంతటన్. 23

కం. మకరందుండును నిద్రా
ముకుళితదృశుఁ డగుచు నృపునిముందటఁ దా వే
ఱొకచిగురుటాకుసెజ్జన్
బ్రకటాకృతిఁ బవ్వళించె శ్రాంతుం డగుచున్. 24

వ. అంత. 25

గీ. మారనారాచదోదూయమానుఁ డగుచుఁ
బ్రభుశిఖామణి మానసఫలకమునను
వరుస సంకల్పతూలిక వ్రాయుచుండెఁ
గలికిరూపంబు చిత్రవైఖరులతోడ. 26

ఉ. అన్నిశఁ దుర్యయామసమయంబున నచ్చటి చిన్నగున్నపైఁ
జెన్నలరారునీడజవిశేషములం దొకశారి చిల్కపైఁ
గన్నిడఁ జేసి పల్కె నలుకన్ శుకశేఖరసఖ్య మెల్ల నేఁ
డెన్నిక కెక్కె నీ విటకు నిన్నిదినంబులు రాకయుంటచేన్. 27

కం. శారికలుఁ గీరములు నీ
భూరుహమున లేవె సఖ్యమునకుం దలఁపన్
సారెకు నీతోఁ జేరిక
గోరుటకుం గారణంబు గుణి వని కాదే? 28

చ. శ్రుతిహితవాక్ప్రభావములఁ జొక్కియు నీహరిభక్తివైఖరుల్
మతిని దలంచియున్ ద్విజసమాఖ్యఁ గాంచియు నాగమాంతసం
తతభజనంబు లెంచియును దావకసఖ్యము గోరుచుంటి నో
పతగవతంస సత్ఫలవిభావన తథ్య మొనర్పుటం జుమీ. 29

మ. తనయింట న్భజియింపుచుం గలిగినం దానిచ్చుచు న్వాక్యముల్
మనసుం గల్పి హితంబుఁ దెల్పుచును సన్మార్గంబునం దుండు చే
ఘనమౌ సఖ్యముజాడ గాక నిజహృద్గర్వాంధతన్ వర్తిలం
జనునే మైత్రి యొనర్ప నేటికి శుకేశగ్రామణీ ధీమణీ. 30

కం. ఎచ్చటి కేఁగితి విన్నా
ళ్లెచ్చో వసియింపఁగంటి వీప్రౌఢుకడన్
విచ్చేయం గత మెయ్యది
యిచ్చటికిం దెలుపవలయు నిఁక విశదముగన్. 31

మ. అనినం గీరము సంతసంబునఁ దదీయాలాపము ల్మెచ్చి యి
ట్లను నోశారిక యేను పుణ్యతరులం దండండ వర్తించి స
జ్జనగోష్ఠీగతి నొక్కవార్త విని పేరాబుద్ధి నచ్చోటికిన్
ఘనవీథిం జని కాంచి యిచ్చటికి రాఁగంటిం జుమీ యిట్లనన్.

కం. శారిక కీరముతో నను
గోరిక మదిఁ బొడమె దెసలకుం జని యిపు డీ
వేరికథ వింటి కంటివి
చేరిక నెఱిఁగించు కీరశేఖర యనినన్. 33

కం. కామాకులుఁ డాభూవరుఁ
డామాటలు వినుటఁ గోరి యట నిద్రాళుం
డౌనుకరందుని లె మ్మని
యీముచ్చట లాలకించు మిపు డని కడఁకన్. 34

గీ. వార లాముచ్చటలు చెవి చేరఁజేర్చి
వినుచు నున్నంత శారిక యనుచుఁ బిలిచి
విని కనుంగొనివచ్చినవింత దెలియఁ
బలికె నిట్లని శుకము సంభ్రమముతోడ. 35

. అసదృశచంద్రకాంతమణిహారిశిరోగృహభాగభోగభా
గసమశరప్రభూతకదనాంతనిషేవితచందనాగలా
లసమరుదంకురక్రమచలజ్జలజాకరఖేయగేయమై
కుసుమపురంబు చెప్పఁగఁ దగున్ ధరణీతరుణీలలామమై. 36

. గణుతింప మందరాగముచయు ల్గాఁబోలుఁ
గాకున్న నవసుధాకలన గలదె
జతసేయ బలినివాసంబులు గాఁబోలుఁ
గావేని సుతలవిఖ్యాతి గలదె
చర్చింప సుగ్రీవసైన్యము ల్గాఁబోలుఁ
గానివైన గవాక్షగరిమ గలదె
యూహింప జలదసందోహము ల్గాఁబోలుఁ
గావన్న నిటువంటిఘనత గలదె
గీ. పోలిక యొనర్ప నిధులు గాఁబోలుఁ గాక
యున్న ధనదాశ్రయంబులై యుండఁగలవె
యనుచుఁ జూపరు లద్భుతం బందియుండఁ
జూడఁగాఁదగు బంగారుమేడ లచట. 37

చ. కనఁదగు నందు నిందు మణికల్పితకుట్టిమరమ్యహర్మ్యసీ
మను మనుమానినీమణిసమాజము తేజము పోయగంబుఁ గాం
చిన ఫలియించుఁ గోర్కు లని చిత్తమునందుఁ దలంచుటం జుమీ
యనిమిషభావ మందుట సుధాశను లెల్ల త్రివిష్టపంబునన్. 38

కం. సంతానములకు నభినవ
సంతానము లనఁగఁ దనరి సన్నుతరుచి నా
సంతానదృగ్గ్లసదళి
సంతానము లైనవను లసంఖ్యము లచటన్. 39

సీ. ఉల్లసత్కల్లోలహల్లీసములు వాశ్చ
రత్సారసాంగవిభ్రమముఁ బెనుపఁ
జామీకరాంబుజచ్ఛాయ నుద్యత్పుణ్య
వనితాననములకు వన్నె యొసఁగ
లహరీఝళంఝళన్మహితారవము తటాం
తోత్రోత్కశదుత్రోత్కశకోహ నెఱప
ఫేనత్ప్రభానిభ ఫేనంబు తీరక
ల్పద్రుమప్రసవసంపత్తి నేల
గీ. నచటఁ దులకించు వినువాఁకవిచికలప్ర
కాశకాశఫణీశనీకాశరుచులఁ
దాళశతకసముత్తాలతాలగేయ
ఖేయమై సురపథికపాథేయ మగుచు. 40

సీ. అలపాలకడలిలోపలిదీవిలోపలఁ
జెలువొందు వేలుపుఁజెట్లతోడ
నీడును జోడునై చూడ నొప్పగుచున్న
కడుములనీడఁ జొక్కపుఁదలంపు
రాలఁ బన్నిన నిబ్బరం బైనగద్దెపై
మూఁడుకన్నులసామితోడఁ గూడి
జేజేలనెలఁతలు చేరి కొల్వఁగ నిండు
సంతోషమున నుందుచాను జగము

గీ. తల్లి చండిక యనుపేరుఁ దాల్చి కడఁకె
నమ్మహానగరంబున ననుదినంబుఁ
గాపురం బుండుఁ దనుఁ జూడఁగడఁగువారి
పాలి వేలుపుగిడ్డి నాఁ బరగుచుండి. 41

వ. ఇట్లఖిలనగరీనాయకరత్నం బై యొప్పు నప్పురవరంబున కధీశ్వ
రుండు. 42

సీ. శ్రీసతీశ్వరపాదసేవాభిహితసుధీ
భాసురుం డవితమహీసురుండు
దశదిశాముఖమహోదంచత్ప్రతాపవి
భ్రాజితుం డవనీశపూజితుండు
నిఖిలప్రజామనోనీరజనవ్యప్ర
భాకరుండు లసద్గుణాకరుండు
కమనీయభోగభాగ్యప్రధానిర్జితా
ఖండలుండు జితారిమండలుండు

గీ. వినుతి సేయంగఁదగు జగద్వినుతకీర్తి
చంద్రికాధాళధళ్యనిస్తంద్రవిభవ
హసితకైలాసనగవృషాధ్యక్షచంద్ర
శేఖరుం డైన శృంగారశేఖరుండు. 43

సీ. సర్వజ్ఞమౌళి యీజగతీతలేశ్వరుం
డతులరాజసమాఖ్య నలరు టరుదె
కరమున శతకోటి గలమేటి యీఱేఁడు
ఘనసుధర్మాఢ్యతఁ గాంచు టరుదె
బలభద్రసహితుఁ డీపావనస్వాంతుండు
పురుషోత్తమఖ్యాతిఁ బొందు టరుదె
శ్రీసర్వమంగళాంచితదేహుఁ డీధన్యుఁ
[illegible]సూక్తిఁ బొసఁగు టరుదె

గీ. యనుచు జను లెంచఁదగు నిషధావనీశ
రాజ్యలక్ష్మీకచాంతర గ్రథితకుసుమ
దామసౌరభకలితహస్తప్రశస్తుఁ
డార్యవినుత ప్రభావుఁ డయ్యలఘుయశుఁడు. 44

కం. ఆరూఢరూపవిభ్రమ
తారుణ్యదయాపతివ్రతాధర్మసదా
చారాన్విత యతనికి సుద
తీరత్న మనంగవతి నుతింపఁదగు ధరన్. 45

కం. క్షితిఁ జంద్రమతి నరుంధతి
రతి భారతి హైమవతిని బ్రకటించు నెపం
బ్రతి సెప్ప నొప్పు నమ్మద
వతి పాతివ్రత్యవైభవంబున నెంచన్. 46

సీ. అఖిలరాజన్యకన్యామాళిరత్ననీ
రాజితాంఘ్రిద్వయప్రాభవంబు
దివిజనాయకపురంధ్రీమణీగణనీయ
భూరివైభవధుర్యభోగమహిమ
రంభోర్వశీరతిప్రముఖదివ్యాంగనా
విజయాఢ్యసౌందర్యవిభ్రమంబు
త్రైస్వరమాసదృశేక్షమాఘనైశ్వర్యవి
భ్రాజితప్రబలసౌభాగ్యగరిమ

గీ. మొదలుగాఁ గలసద్గుణంబులఁ బొసంగి
ప్రాణవిభునకుఁ బట్టపురాణి యగుచు
వన్నెఁ గాంచియు నమ్ముగ్ధేందువదన దలఁకె
పల్లవాంగి సంతాన మొఱఁగ విచింతఁ దగిలి. 47

కం. పతియనుమతగతి నమ్రద
వతి చతురత వంధ్యతాపవాదము మాన్పన్
మతిఁ బూని వృద్ధకాంతో
దితమహితాచారసరణి దినదిన మెలమిన్. 48

సీ. ప్రొద్దుప్రొద్దున లేచి పుణ్యప్రవాదంబుల
పాళితో జలకంబు లాడి యాడి
ముత్తైదువులఁ బ్రియంబునఁ బూజ గావించి
నవనవఫలవాయనము లొసంగి
క్షితిసురోత్తములకుఁ బ్రతిదినంబు నపూప
ఘృతపాయసాదులఁ దృప్తి సలిపి
గృహదైవతముల మిక్కిలిభక్తిఁ బ్రార్థించి
నానావిధాభ్యర్చనము లొసంగి
గీ. వ్రతము లొనరించి శకునసంగతులు దెలిసి
సిద్ధమునిబృందములను వీక్షించి మ్రొక్కి
సతులు గావించుయత్నముల్ సలుపుచుండె
నమ్మృగేక్షణ సంతాన మాత్మఁ గోరి. 49

ఉ. అంతట నొక్కనాఁడు కమలాక్షి నిజేశునితోడఁ గూడి యే
కాంతమునన్ వసింప రతికాంతరణాంతనితాంతతాంతనే
త్రాంతములందు నిద్ర గలయం బవళించిన నొక్కవిప్రుఁ డ
య్యింతికిఁ గేతకీకుసుమ మిచ్చెఁ గలం గలకంఠి వేడుకన్. 50

చ. అలరుచు మేలుకాంచి హృదయప్రభుతో నను నాథ! యీమెడం
గల నొకబ్రాహ్మణుండు నవకైతకసూన మొసంగె నౌననం
దెలిసె నృపాలుఁ డంత సుదతీ విను మాతఁడు వాసవుండు మా
కులగురుఁ డొక్కకన్య గలుగుం బ్రసవంబు నొసంగెఁగావునన్.

కం. కల యిది నిక్కల కన్నియ
గలుగుం గలకంఠి నమ్మఁగాఁదగు సీనో
ములఫలము చేరె నన విని
యలరె ననంగవతి నిక్క మగునని కడఁకన్. 52

గీ. వ్రతఫలములు పచేళిమప్రభ నెలుంగు
నట్లు శుభములు ప్రత్యక్ష మైనయట్లు
నంతలోఁ గొన్నినాళ్ల కయ్యబ్జముఖికి
సన్నసన్నఁగ వేకటిచిన్నె లమరె. 53

సీ. చకచకద్యుతులచే ముకురంబు లన మించు
చెక్కుల వెలిచాయ వెక్క లమరెఁ
గనకసారసకోరకముల పై నెలకొన్న
భ్రమరంబు లనఁ గుచాగ్రములు మెఱసె
నంబరస్ఫూర్తి విడంబించు నరిపేద
కౌ నంతకంతకుఁ గాననయ్యెఁ
దతజఘనద్వయోన్నతజాతరభరంబు
మందయానమునకు నంద మొసఁగె

గీ. నసమశరతంత్రములమీఁద విసుగు దోఁచె
సఖులతో ముచ్చ టాడంగ సైఁచ దయ్యెఁ
బుల్లపుల్లనిరుచులపై బుద్ధి పొడమెఁ
బ్రథమగర్భోదయమున నప్పద్మముఖికి. 54

కం. క్షితి గంధవతి నిజం బని
మతిఁ దలఁచి తదీయగంధమానితరుచిచే
నతులలక్ష్మాఖ్యా యాసతి
ధృతిచతురతఁ గొను మృదార్ద్రితాహారంబుల్. 55

గీ. ఉవిద బలుతొడవులు దాల్ప నోపలేక
విరులు గోసినపూఁదీవకరణిఁ దనరె
నలినలోచనజఠర మున్నతి వహించె
ముద్దరాలికి నీళ్లాటప్రొద్దు లయ్యె. 56

చ. శుభదివసంబునందుఁ బరిశుద్ధముగా గ్రహరాజు లుచ్చలం
దభిమతలీల నుండఁ దరళాయతలోచన గూఁతుఁ గాంచె నం
దిభనిభయాన లైనధవళేక్షణ లందఱు సంతతంబుతో
రభసగతిం దదీయగృహరక్ష యొనర్చి రహార్యధైర్యలై. 57

వ. అప్పుడు. 58

సీ. మణిగణద్యుతికి మార్త్మలయుదీప్తుల రేయుఁ
బగలును వెలుఁగుదీపములగములు
నిరుచక్కియల దారి కెలమిఁ గాఁపుగ నుల్లి
పొట్లు గప్పినయగ్గిపొగలతెగలు
ద్వారమూలముల నందముగ నుంచినదీర్ఘ
శాకోటకుటసమిత్సముదయములు
నిది సందుదిన మిందు రొద సేయఁదగ దని
పలుకువృద్ధాంగనాపరిజనములుఁ
గీ. గలిగి తత్తత్ప్రదేశసంఘటితపూర్ణ
కుంభరంభాతరుస్తంభజృంభమాణ
సితవితానపతాకాభినుతవిభూతి
గాంచి యుప్పారెఁ దత్సూతికాగృహంబు. 59

సీ. తారహారములతోఁ బోరాడు వెల్లుల్లి
పూసపేరులు కంఠమునఁ జెలంగఁ
బద్మరాగంబులపగిదిఁ జొక్కపుఁబీడి
యములతో నెనవి దళితములు మెఱయ

ధగధగ వెలుఁగు నిద్దపుఁ జెక్కుటద్దము
పొంతఁ గాటుక యుక్కుబొట్టు వెలుఁగ
ముఖచంద్రముని మీఁద మొనసిన కార్మబ్బు
గతి నీలివాసెనకట్టు మెఱయ
గీ. నంత నయ్యింతి పచ్చిబాలింతసొబగు
భువనమోహన మగు వేషమునఁ బొసంగెఁ
దరుణు లెల్లను వృద్ధోదితప్రకార
మునఁ బురిటివైభవము సేయ వెనుకవెనుక. 60

కం. వాసవువరమునఁ గలిగిన
యాసుదతీరత్నమునకు నవనీశుఁడు దా
వ్రాసెను నామం బీసతి
వాసవదత్త యని బుధులు వర్ణన సేయన్. 61

మ. ప్రతిపచ్చంద్రకళావిశేషరుచిఁ దద్బాహ్యాలలామంబు తాఁ
బ్రతిభన్ బ్రత్యహమున్ వివృద్ధగతిచే రంజిల్లెఁ దద్భావముల్
మతి భావింప వచింప నెంచుకొనఁగా మాబోంట్లకున్ శక్యమే
రతిరంభాదిసురాంగనావితతి మీఱంజాలుఁ దద్వైఖరుల్. 62

కం. మనసిజునిమంత్రదేవత
యనఁగను దనరారె శైశవానంతరయౌ
వనలాభవిభవమున న
వ్వనితామణి దినదినప్రవర్ధితరుచులన్. 63

ఉ. కొప్పు ఘనంబు మూఁడ నలక్రొమ్ముడికన్న సమున్నతస్థితిభూ
విప్రాగుఁ గనున్నదో యిక చవిభ్రమలోచనరోచి కెక్కెఁ దై
ఁ తొయ్యలుపైఁ జనున్న లావన్నతి సముజ్జ్వలకైశికదృక్కచోత్రపీభల్
మృత్తుమత్కృతవైభవముఁ గాంచి కటస్థలి శ్రేణు లెంచఁగన్. 64

సీ. మరునినీలపుటురుల్ మానినీమణికురుల్
గనకభవ్యవిలాస కలికినాస
శశివిభోల్లసనంబు జలజాక్షిహసనంబు
పద్మంబులోగోము పడఁతిమోము
వజ్రరుక్కాంతముల్ వనజాస్యదంతము
లమృతంపుబావి తన్వంగిమోవి
యసితోరగముఁ గేరు నలివేణినూగారు
విన్ను గెల్వఁగఁ బూను వెలఁదికౌను
గీ. తరళతరవీచికావళు లరుణివళులు
భూమిచక్రజయార్భటి భామినికటి
సరసిజశ్రీపదములు సుందరిపదములు
తారకలజోళ్ళు నవలతాతన్విగోళ్లు. 65

వ. ఇవ్విధంబున నొప్పునవ్వనితారత్నంబు రత్నసానుసానుగత ప్రభయుంబోలె సుజాతరూపవిభ్రమయై, శరత్కాలదినాంతలక్ష్మియుంబోలె సముల్లసత్తాలకాలంకృతయై, సత్సభాస్థలియుంబోలె సంస్తూయమానద్విజపంక్తివైభవయై, లావణ్యరసాయనసిద్ధియో యన, శృంగారోదయస్థానమో యన, మదనజయపతాకయో యన, సంసారభిత్తిరచితచిత్రచిత్రరేఖయో యనఁ, త్రైలోక్యసౌభాగ్యలక్ష్మీనృత్తరంగస్థలియో యన, ననన్యసామాన్యవిలాసలీలచే నలరుచు మదనమంజరియు, వసంతసేనయుఁ, దరంగవతియుఁ, జిత్రరేఖయు, విలాసవతియు, మదనమాలినియు, రాగలేఖినియుఁ, గాంతిమతియు, యూథికయు, ననంగరేఖయు ననంగ బదుండ్రు చెలికత్తియ లమందానందకందళితహృదయారవిందలై, యాటలంబాటల వినోదకథాప్రసంగంబులం బ్రొద్దుపుచ్చుచు నుండ నంత నొక్కనాఁడు వన్యావిహారంబుఁ గోరి యక్కన్య చందన [illegible]

సిందువార కందరాళ మాకంద పిచుమంద పూగ పున్నాగ నాగ వకుళ చాంపేయ పాటల భూర్జ సర్జ ఖర్జూ రార్జున మాతులుంగ లుంగ లవంగ నారంగ నింబ జంబూ దుంబర శింశు పాశ్వత్థ శిరీష పనస పిప్పల వట కుటజాది నానావిధతరుచ్ఛాయాలవాలంబును, వాచాల శుక పిక శారికానికర కలకలధ్వాన బధిరితరోదోంతరంబును, బల్లవోల్లసిత మల్లీవల్లీ వేల్లిత మంజునికుంజగుంజ న్మధువ్రత ఝుంక్రియాగానమనోహరంబును నగు నుద్యానవనంబుఁ జేరంజను చున్నయవసరంబున- 66

శా. కాంతంబై సుమనోమనోజ్ఞనవమాకంద్రదుకాంతారసం
క్రాంతానంతమనోజసైనికపటాగారావళీభూతకుం
జాంతస్స్యంతతపల్లవోదయదిదృక్షానందితస్వైరిణీ
స్వాంతంబై తనరె న్వసంతము లతాంతాలంకృతానంతమై. 67

సీ. ప్రబలకుంజవ్రజపటమందిరము లొప్ప
సుమనోరజోదితానములు మెఱయ
మలయసమీరడింభకు లూడిగము సేయ
నవ్యకాంచనభూషణములు వెలుఁగఁ
బరభృతమాధవప్రతతులు గొనియాడ
లతికాంగనలనాట్యగతులు చెలఁగఁ
దతభృంగగాయకప్రతతి గానము సేయ
శుకశారికాదిసైనికులు గొలువ
గీ. వనధరాస్థానమున మాధవప్రభుండు
నిగ్రహానుగ్రహక్రియానిపుణుఁ డగుచు
మధుపమాలిన్యజాతులమద మణంచి
రోధితేతరులకుఁ బచ్చడా లప్పుడు గప్పె.

సీ. ధీరద్విరేఫఝుంకారప్రసవగుచ్ఛ
భారద్రుమవాటీవిహారములను
మారలీలోన్మత్తకేరళీకుచగంధ
సారసంయోగసత్కారములను
సారవన్మలయశైలారబ్ధచందన
శ్రీరమ్యపాదసంచారములను
సారసోదారగంభీరవాఃపూరకా
సారసేవాసదాచారములను
గీ. దృప్తుఁడై తృప్తుఁడై దీప్తి వ్యాప్తిఁ బొదలి
యలసి మెల్లన నచ్చోటి కరుగుదెంచె
నతనుకేళీరతాతనుసుతను సుతను
ఘర్మశీకరహారుఁ డైన గంధవహుఁడు. 77

సీ. శ్రీఖండతరుషండశేఖరాలంకృత
కిసలయకంపనాంకితరయములు
సరసలవంగకేసరజాలసంపాద
నాయత్తచతురవిద్యాస్పదములు
సలిలకేళీరతశమనకాంతాతనూ
సౌరభస్ఫూర్తివిస్తారితములు
తతరతశ్రాంతకాంతాకుచాంతరమాక్తి
కస్ఫుటఘర్మశీకరహరములు
గీ. మలయమారుదంకురమ్ము లనూనవతుల
సతతవన్యావిహారజశ్రమము వాయ
నల్లనల్లనఁ జనుదెంచె నుల్ల మలర
ముమ్మరమ్ముగఁ బూఁదావి గ్రమ్ముకొనఁగ. 78

చ. వదనముఁ జూపఁ జంపకము, వావిలి మూర్కొనఁ, గ్రోవికౌఁగిటం
బొదవఁగఁ, బాడఁ బ్రేంకణము, పొన్న హసింపఁగ,నయ్యశోకముం
బదమునఁ దన్నఁ, గేసరముపై నుమియం, బలుకంగ గోఁగుఁ, జే
గదలుప మావి, చూడఁ దిలకంబును గ్రొన్నన లిచ్చు వారికిన్.

వ. అట్టియెడ. 80

కం. ఒక రోకరిఁ జీరి కేరుచు
ముకుళంబులు విరులఁ జూచి ముదమందుచుఁ జే
రిక నున్న చెలులఁ గని య
మ్ముకురానన మధురవాక్యముల నిటుపలికెన్. 81

రగడ.

మదనమంజరి కంటివే యీమదనమంజరి సొగసుపెంపులు
పొదల రొద లొనరింపుచును మదిఁ బొదలుచున్నవి తేఁటిగుంపులు
కదలికలు లేకున్న వెంచఁగఁ గదలికలమొత్తమ్ము లిచ్చటఁ
బదరజమ్ములు గ్రమ్మఁ దిరుగుచుఁ బదరనేటికి నాలి యచ్చట
నాగమల్లెలు గలిగె నల మదనాగరాజ సమానయానకుఁ
బూగములపైఁ బ్రాఁకుతీఁగెలపూగములు సాధించు మానకుఁ
జిన్న లల్లవె యెన్నఁ జెన్నగుఁ జిన్నప్రాయపుతీవి నలరెముఁ
గన్నెరలకై యరుగ నేటికి గన్నె రహితో నిందుఁ గొఁజలెదు
వేయునేటికి విరులపై నీ వేయుపాయము సేయఁగావలె
రా యనంటులనీడలకు వలరాయనికిఁ దెరు వియ్యఁగావలె
రంగరంగశుకంబు లవె సారంగలోచన మరుబలంబులు
రంగదాకృతి నొప్పె నవె నారంగభూజములను ఫలంబులు
రాకు రాకు పరాకు కెందలిరాకు చిదుమఁగ రామ పదరకు

కాకు గాకు ఫలంబుగను దన కాకురంగట నిల్పు బెదరకు
పొలఁతిరో ములయూనిలము లోకపాలఁతి పుప్పొడి దుమ్ము రేఁచను
వెలఁది యుయ్యేలఁ బన్ను పూఁదీవెలఁ దిరంబుగ మంచు దోఁచెను
డంబుగాఁ జిగురాకుగమి పగడంబుఛాయలు గాంచి మించెను
గంబుకంఠిరో మెఱసి యాకనకంబు వలపులు గుమ్మరించెను
రాఁగతనమున నొరులవిరులకు రాఁ గడంగిన నేనె రాఁగల
రేఁగఁదోలకు రేఁగులను జెలరేఁగ మూఁగిన తేనెయీఁగలఁ
గండకున్నది సిరులతో మాకందబృందము కుసుమపుంజము
మందయానరొ చూడఁదగు సుషమం దనర్చె లతానికుంజము.

కం. అనుచుం జెలు లిచ్చుననల్
గొనుచున్ వనవీథిఁ గుసుమకోమలి దరియం
జనుచున్ వలరాయనికృపఁ
గనుచుండఁగ నంతఁ జైత్రుగర్వము సడలెన్. 83

వ. అన విని శారిక శుకంబు నవలోకించి ప్రశంసించి యనంతర వృత్తాంతం బెఱింగించు మనుటయు. 84

మ. పృథివీభృద్వరధీర ధీరజనతాభిస్తుత్యవాక్సత్య స
త్పృథసాంతత్యవిహార హారధరణీధ్రప్రాభవోద్యద్యశః
ప్రథమాలంకృతసార సారసముఖీప్రత్యగ్రసంభూత మ
న్మథసన్మార్గ్యవతార తారకనిధానధ్యానచిత్తాంబుజా. 85

కం. సింధురస్సైంధవవైభవ
బంధుర శ్రీవైష్ణవప్రబంధాంకిత చి
ద్గ్రంథరసాదరనీతియు
గంధరవిభమిత్రివర్య కల్పితకార్యా. 86

పృథ్వీవృత్తము.

ధరాచరణనూపురస్థగితరత్నరుక్ప్రోతికా
పురీవరణవై భవస్ఫుటనికేతనా కేతన
స్ఫురన్నిజచమూపరక్షుభితభూసురోద్యద్ధరా
పరాగపిహితా ౖశుసంభరితశౖతుకాంతాననా. 87

గద్యము.

ఇది శ్రీవక్కలంక చంద్రశేఖరమహాకవి పౌత్ర భాస్కరసుకవిపుత్ర
విద్వజ్జనవిధేయ వీరభద్రనామధేయ విరచితం
బైన వాసవదత్తాపరిణయం
బను మహాప్రబంధంబు నందు
ద్వితీయాశ్వాసము.



శ్రీ రస్తు

# వాసవదత్తాపరిణయము



## తృతీయాశ్వాసము





యుతవైభవ హిందూ
రాయసురత్రాణబిరుద రామానవరా
మేయనిభ పూర్ణిమాసో
మాయితరుచిగేయ రావు మాధవరాయా ! 1

వ. అవధరింపు మనంతరకథావిధానంబు శుకంబు శారికతో నిట్లనియె.

కం. వన్యావిహారమున న
క్కన్యామణు లలసి వేడుకన్ జలకేళీ
మాన్యమతి నుండఁగాఁ బద
విన్యాస మొనర్చె భువిని వేసవి యంతన్. 3

శా. ప్రచ్ఛాయస్థలపల్లవాస్తరణనిద్రాయోగ్యముల్ పాటలీ
గుచ్ఛాకల్పమరున్మనోజ్ఞతరముల్ కూలంకషాభ్యంతర
స్వచ్ఛాంభఃపరివేషణార్హములు పశ్చాద్భాగసౌభాగ్యముల్
స్వచ్ఛందస్థితి గ్రీష్మవాసరము లెంచం దెల్వి గాంచెన్ ధరన్. 4

సీ. వనముల దావపావకభూతి గనిపించెఁ
బాటలముకుళవైభవము మించెఁ
బడమటిసుడిగాలి వడివడి నడ తెంచె
మదనుతూపులమేపు కొదవగాంచె

# ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణములు



## శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | |
|---|---|
| 5వ సంపుటము | రు 15—00 |
| 6వ సంపుటము | 15—00 |
| 7వ సంపుటము | 15—00 |

1–4 సంపుటములు పునర్ముద్రణములు గావింపఁబడుచున్నవి

ప్రతియొక్కటికి వెల రు 15 లు

## కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము

పెక్కుపాఠభేదములతోఁ గూడిన నెనకటి విషయసూచికయు గలిగి తిరిగి తృతీయముద్రణ పీఠికతో ముద్రితమైనది వెల రు 1—00

## మాధ్యమిక కారికలు

బౌద్ధాచార్య నాగార్జున ప్రణీతము కొల్లూరు సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యాసహితము మూల్యము రు 2—00

ఆంధ్రసాహిత్యపరిషత్తు,

కాకినాడ

# శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక


క్రోధి
మార్గశిర -
ఫాల్గుణములు





సంపుటము ౫3
సంచికలు ౪-౬





Journal of the Telugu Academy
KAKINADA

Vol. 53 Part 4-6

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు :

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు



# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

సంపుటము 53. క్రోధి మార్గశిర-ఫాల్గుణములు సంచిక 4-6.

సంపాదకుఁడు : శ్రీ కుందూరి ఈశ్వరదత్తు.

## విషయసూచిక.

# మా నూతన రచయితలు.

శ్రీ ముదిగొండ వీరభద్రశాస్త్రి : వీరు M A. Phd పట్టభద్రులు. హైదరాబాదు నగరములోని వివేకవర్ధనీ కళాశాలలో నాంధ్రశాఖాధ్యక్షులు. పానుగంటివారి రచనలనుగూర్చి పరిశోధన గావించి, Phd. పట్టముగొనిరి.

శ్రీమతి వేమల మీనాక్షీదేవి :- ఈ విదుషి శ్రీ వేమల రామచంద్రకీర్తిగారి గృహిణి. ఉభయ పండితవంశకులకాంత.

శ్రీ జటావల్లభుల పురుషోత్తము :- వీరు M.A పట్టభద్రులు. వీరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠమున కధ్యక్షులుగా నుండిరి. ప్రాచీన హైందవమత, ధర్మ, విజ్ఞానవిషయములఁగూర్చి కూలంకషముగా పరిశోధనను గావించినవారు 'హైందవమతము', 'భగవద్గీతాసారము', 'భారతీయవైభవము' మొదలగు గ్రంథములను రచించిరి. ఇప్పుడు పిఠాపుర కళాశాలలో సాంస్కృతభాషోపన్యాసకులుగా నున్నారు.

శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రి :- వీరు B. A. సాహిత్యప్రవీణ, ఉభయభాషాప్రవీణ పట్టభద్రులు. స్థానిక రత్నోదయ సెకండరీ ట్రెయినింగు పాఠశాలలో ఆంధ్రోపాధ్యాయులు. మా కార్యవర్గ సభ్యులు.

శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి :- వీరు సూర్యారాయాంధ్రనిఘంటు నిర్మాణ పండితవర్గములో నొకరు. 'శంకరవిజయా'ది గ్రంథకర్తలు. సూరన ప్రభావతీప్రద్యుమ్న కావ్యమునకు వ్యాఖ్యానము రచించి వెలయించిన ఆంధ్రభాషావేత్త. ఇప్పుడు మోడేకుర్రు సంస్కృతపాఠశాలలో నధ్యాపకులుగా నున్నారు.

ఆంధ్రత్వ మాంధ్రభాషా చ

ప్రాభాకర పరిశ్రమః

తత్రాపి యాజుషీ శాఖా

నాల్పస్య తపః ఫలమ్.

అప్పయ్యదీక్షితులు.

సంపాదకీయము

## స్మృతులు—స్తుతులు

క్రోధి సంవత్సర మాంధ్రసాహిత్యపరిషత్తు చరిత్రలో నొక చరితార్థ వత్సరము ఆంధ్రసాహిత్య పరిషద్వార్షిక సభాధ్యక్షులును, దివంగతులు, నైన యిరువురకు ప్రభుత్వము వారి సహాయమున శత జయంత్యుత్సవములు జరుపఁబడినవి. ఆంధ్రసాహిత్య పరిషద్వార్షిక సభాధ్యక్షులును,సంస్కృత సాహిత్యసముద్ర సాంయాత్రికులును, ఆంధ్ర ప్రదేశాస్థాన కవులు నైన యొక పండితసింహునకు ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు 'కళాప్రపూర్ణ' బిరుదమునొసఁగిరి.

(శ్రీ) ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారు

(శ్రీ) ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారు క్రీ॥ శ. 1924 నందు తణుకు గ్రామములో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్త్రి యోదశ వార్షిక సభకధ్యక్షులు వీరి శతజయంత్యుత్సవము 19-10-64 దినమున, ప్రభుత్వమువారి యాధ్వర్యవమున నిర్వహింపఁబడినది. వీరు రక్తాక్షినామ సంవత్సరాశ్వియుజబహుళ పంచమీ బుధవారమునఁగా క్రీ. శ. 19-10-1864 దినమున జన్మించిరి. వీరార్వేల నియోగిశాఖా బ్రాహ్మణులు. ఆపస్తంబ సూత్రులు. సాంఖ్యాయన గోత్రులు నరసమాంబా బాపిరాజుల తనూజులు. విశాఖమండలమున పార్వతీ పురము వీరి కాణాచి.

వీరు బాల్యమునుండియు నఖండప్రతిభా సంపన్నులై, సంస్కృతాంధ్రాంగ్ల భాషలలోఁ బాండిత్యమును స్వయంకృషిచే సంపాదించి, కవిత్వమును జెప్పనారంభించిరి. శతఘంటకవనమును జెప్పనేర్చిన వారిలో వీరొకరు.

### పద్యకావ్యగ్రంథరచన

వీరు 'సుధానిధి' యను పద్యకావ్యమును రచించిరి.

'ఆంధ్రపద్యావళి' యను పేర తమ ఖండరచనలనొక సంపుట

ముగా ప్రచురించిరి. ఈఖండకావ్యసంపుటియే నేఁటి నవ్యకవిత్వయుగ ప్రారంభ మహోత్సవమునకు వైజయంతి

నాటకరచన—నాటక కళోద్ధరణము

వీరు విక్రమోర్వశీయము, ఉత్తరరామచరిత్రము (వచనము) ఆంధ్రీకరించిరి. పార్థపరాజయమను స్వతంత్రనాటకమును వ్రాసిరి. మనోరమయను సాంఘికనాటకమును వ్రాసి దానిని ప్రదర్శింపఁజేసిరి. వీరు క్రీ॥ శ. 1929 సంవత్సరములోఁ దెనాలియందు జరిపిన ప్రథమాంధ్రనాటకకళా పరిషత్తున కధ్యక్షులై యమూల్యమైన యుపన్యాసమును గావించిరి. వీరు రచించిన 'నాటకసర్వస్వము' నాటకరచనను గూర్చిన యుద్గ్రంథము. అముద్రితము.

పత్రికాసంపాదకత్వము

వీరు పదునేడేండ్ల ప్రాయముననే క్రీ॥ శ. (1881 సం॥లో) సుజనప్రమోదిని' యను మాసపత్రికకు సంపాదకులై రెండేండ్లు నడిపిరి. తర్వాత క్రీ॥ శ. 1903 లో కల్పలత యను విజ్ఞాన విషయిక మాసపత్రిక నెలకొల్పి మఱిరెండేండ్లునడిపిరి. ఆ పత్రికనే మరల క్రీ॥ శ. 1919 లో పునరుద్ధరించి, కొంతకాలము కొనసాగించిరి. ఈ పత్రికయంతయుఁ బంతులుగారి స్వీయరచనలలో నొప్పారెడి.

విజ్ఞానవేత్త

వీరు పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రములగు పదార్థ విజ్ఞాన రసాయన శాస్త్రములు, భూవృక్ష ఖనిజ కీటక తత్త్వములు, ప్రాచీనాధునాతన హైందవరాజ్యాంగ విశేషములు పఠించి తమ పత్రికాముఖమున వెల్వరించిన మహనీయులు. వీరు రచించిన 'రహస్యదర్పణము" వీరి వైజ్ఞానిక పాండితికి దర్పణము.

సభాధ్యక్షత—మహోపధ్యాయ బిరుదాంకితము

వీరు క్రీ॥ శ. 1923 లో గుంటూరు మండలము సందలి సం

డూరు గ్రామమున జరిగిన యాఱవ యాంధ్రసారస్వత మహాసభ కధ్యక్షులు. ఈ సభయందే వీరికి మహోపధ్యాయ బిరుదము సంగఁబడెను. క్రీ॥ శ. 1924 లో తణుకు గ్రామములో సమావేశమైన ఆంధ్రసాహిత్యపరిషత్త్రయోదశ వార్షిక మహాసభకు వీరు సభాపతులు. క్రీ॥ శ. 1924. లోఁ దెనాలియందు జరిగిన ప్రథమాంధ్రనాటక కళాపరిషత్సభ కాధిపత్యము వహించిరి. నిడుదవోలులో జరిగిన నియోగి మహాజన సభాధ్యక్షత వెలయించిరి. విజయనగర కవిమండలి పంచమ వార్షికోత్సవమునకు సభాపతులైరి.

## మహావక్త

సమయస్ఫురణము, సరసము, సభారంజకత్వము, సంప్రదాయ విజ్ఞానము మేళవించి, మహోపన్యాసములు గావించిన మహావక్తలలో శర్మగారొకరు. వీరిది పండితపామరజనైక రఁజకమును, హాస్యరస భరితమునైన వక్తృత్వము.

ఈ మహనీయుఁడు క్రీ॥ శ. 3-8-1933. దినమున దివంగతులైరి

## శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు

శ్రీ నరసింహరావుగారు రక్తాక్షినామ సంవత్సర మాఘ బహుళ పాడ్యమి శనివారము మధ్యాహ్నము పండ్రెండు గంటలకు రాజమహేంద్రవరము తాలూకా సీతానగర గ్రామము నందు జన్మించిరి. తండ్రి రమణయ్యపంతులు; తల్లి రత్నమాంబ వీరి జన్మకాలమున జాతకకుండలి యిట్లుండెను. జ్యోతిషశాస్త్ర విదులకును కవి జీవితకారులకు నుపయోగము కాఁగలదని, రాశి, అంశ చక్రము లిందు చూపఁబడినవి.

| | | | |
|---|---|---|---|
| శు | ల కే | కు | |
| ర | రాశి | | |
| బు | | | చం |
| గు | | శ రా | |

| | | | |
|---|---|---|---|
| బు | | చం గు | కు |
| శ | అంశ | | కే |
| రా | | | |
| | శు | ర | |

మఖానక్షత్రము—ద్వితీయపాదము. కేతు మహాదశాశేషము—మూఁడు సంవత్సరములు. ఈ జాతకమునందలి కొన్ని యోగములు గమనింపనగును.

(1) పంచమస్థానములోఁ బూర్ణచంద్రుఁడుండి, గురుదృష్టి కలుగుట చేతను, అంశలో నుచ్ఛస్థితినొంది గురుసంబంధము కలిగి, శుక్రదృష్టి యుండుటవలన మహామేధావియై, సంతానబాహుళ్యము కలిగియుండెను. వీరి కైదుగురు కుమారులు ఇద్దఱు కుమార్తెలు.

2. చతుర్థ స్థానాధిపతియైన చంద్రుఁడు పంచమందుండుట చేత, చతుర్థస్థానమును-శని, బుధులు చూచుట వలన నాంధ్ర సంస్కృత భాషలలోఁ బండితుఁడై, ఆంగ్లభాషలోఁ బట్టభద్రుఁడౌటయు సంభవించెను.

3. రాజ్యలాభాధిపతియై యుచ్ఛస్థితి నొందిన శనితో రాహువు కలిసి యుండుటచేత, రాహు మహాదశలో నఖండయోగము ప్రాప్తమయ్యెను. అనఁగా వీరి జీవితములో క్రీ॥ శ. 1911 మొదలు క్రీ॥ శ. 1930 వఱకు నిరువది యేండ్లు ప్రబల యోగకాలము.

4. భాగ్య వ్యయాధిపతియైన గురుఁడు భాగ్యస్థానమునందు రాశిలో స్వస్థానమునందుండినను భావములో సప్తమమునందె యుండుట చేతను, గురుమహాదశలోఁ గ్రమక్రమముగా యోగము క్షీణించి ధనసప్తమాధిపతి, ఉభయమారక స్థానాధిపతి, యైన శుక్రునకు

వ్యయస్థితి కలుగుటచే, గురుమహాదశ శుక్రాంతరములోనే మారకము సంభవించెను. కష్టనష్టములకుఁ బాలయ్యెను.

5. శుభులకు పాపసంబంధము, పాపులకు శుభసంబంధము లేక, రవికిరుపక్కల శుభులుండి, ఉభయచరీ యోగము పట్టుట చేతను, రాజ్యమందు బుధుఁడుండుట చేతను, కీర్తి సాందు్రఁడాయెను.

6. లగ్న ధనసప్తమములలోఁ బాపులుండి ధనాధిపతికి వ్యయస్థితి, కలుగుట చేత నిర్ధనుఁడు.

శ్లో। గజ భుజంగ విహంగమ బంధనం
శశి దివాకర యోర్గ్రహ పీడనం
మతిమతాం చ విలోక్య దరిద్రతాం
విధిరహో! బలవా నితి మే మతిః

అనుసూక్తికి లక్ష్మీనరసింహారావు గారొక దృష్టాంతము. మహదాశ్రయము లభించినను, మనోవాక్కాయకర్మల కనుగుణముగు జీవితమును గడిపి, ఆత్మవంచన యెఱుఁగక, ఆత్మ గౌరవమే ప్రధానముగ నెంచి, దృష్టాంతయోగ్యమగు నడవడియే యొకవడిగాఁ గడిపిన ధన్యజీవి శ్రీ లక్ష్మీనరసింహారావుగారు.

## శ్రీ లక్ష్మీనరసింహారావుగారు వ్రాసిన నాటకములు

(1) నర్మదాపురుకుత్సీయము (2) సారంగధర (3) ప్రచండ చాణక్యము (4) రాధాకృష్ణ (5) పట్టభంగరాఘవము (6) కోకిల (7) విజయరాఘవము (8) వనవాసరాఘవము (9) విప్రనారాయణ (10) బుద్ధబోధసుధ (11) వృద్ధవివాహము (12) కళ్యాణ రాఘవము (13) కంఠాభరణము (14) ముద్రిక (15) పూర్ణిమ (16) సరస్వతి (17) వీరమతి (18) చూడామణి (19) పద్మిని (20) మాలతీమాల (21) గుణపతి (22) మణిమాల (23) సహో

జిని (24) కాత్యాయని (25) జాతిస్తంభము (26) విచిత్రవివాహము. (27) రామరాజు (28) పరప్రేమ (29) చిన్న నాటకము. (30) మనోమహిమము.

## పంతులుగారి వచన గ్రంథములు

శ్రీ లక్ష్మీనరసింహారావుగారు బహునాటక గ్రంథకర్తలని యే ఆంధ్రలోక మెఱుఁగును. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ప్రచురించిన ఆంధ్రవాఙ్మయ సూచిక యను గ్రంథమునందలి 297 పుటలో లక్ష్మీనరసింహారావుగారు రచించిన కొన్ని వచన గ్రంథములు పేర్కొనఁబడి ముద్రితమైన వత్సరము లొసఁగబడినవి. వానినిందుదాహరించుచున్నాము.

(1) పతకము (1913)
(2) మంజువాణి 1913)
(3) జగన్నాథమూర్తి (1915)
(4) మోసము (1913)
(5) జలజ (1913)
(6) దొంగతెలిగ్రాము (1913)
(7) దుష్టప్రధాని (1914)
(8) ఆనందసాధు (1913)
(9) దుర్న్యాయాధికారి
(10) తురాపాలెము (1913)
(11) విచిత్రసమావేశము (1913)
(12) విచిత్రమరణము
(13) బుడబుడక్కలవాడు (1913)
(14) క్రొత్తరాణి (1913)

ఆంధ్రసారస్వత పరిశోధకులీ గ్రంథములను సేకరించి, కవిగారి వచనరచనా పరిణామమును గూర్చి కృషిసలుపవలసియున్నది. నేటి వఱకు లక్ష్మీనరసింహారావుగారి రచనల గూర్చి వ్రాసిన వ్యాసకర్తలు వారి నాటక రచనా విధానమును గూర్చియే పరిశ్రమించినట్లు తోఁచుచున్నది. ఈ గ్రంథములు మద్రాసునందలి లిఖితపుస్తక స్థానాధికారి (Registrar of Books) నివేశనమునందు లభ్యము కాఁగలవు. ఈ విషయము పరిశీలనార్హము. చిరకాలము క్రిందట ముద్రింపఁబడిన గ్రంథము లౌటచే సులభముగ లభ్యములు కావు. అట్టి గ్రంథ

ములు సేకరించి, వాని వివరములు ప్రకటించినఁ గాని కవి గ్రంథనిబంధన వృత్తాంతము పూర్తి కాదు. ఇప్పటికే కాలాతీతమైనది. పై గ్రంథములె కాక అముద్రితములు సహితము లభింపవచ్చును. పిఠాపుర వాసులు పై విషయములందు శ్రద్ధవహించి, కవిగారి జీవిత చరిత్రము నందు నూతనాధ్యాయమును గూర్పవలసియున్నది.

### కళాప్రపూర్ణ బిరుదాంకితులు

### శ్రీ కాశీకృష్ణమాచార్యులుగారు

ఈ సంవత్సరమున జరిగిన ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారి పట్టప్రదాన వార్షికోత్సవమున, శ్రీముఖ సంవత్సరమున అమలాపురములో జరిగిన ఆంధ్రసాహిత్యపరిషద్వార్షిక సభాధ్యక్షులును, అవధాని శిరోమణియు నిప్పటి ఆంధ్రప్రదేశాస్థాన కవులు నైన శ్రీ కాశీ కృష్ణమాచార్యులుగారికి, విశ్వకళాపరిషత్తువారు 'కళాప్రపూర్ణ' బిరుదము నొసఁగిరి. వారికి మా యభినందనములు.

### శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

కవిసామ్రాట్టు బిరుదాంకితులును, ఆంధ్ర మహాకవులు, శతాధిక గ్రంథకర్తలు నైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారికి విశ్వకళాపరిషత్తువారు 'కళాప్రపూర్ణ' బిరుదమా సమయముననే యొసంగిరి. వారికిని మా ధన్యవాదములు.

### భారత ప్రభుత్వము వారి వార్షిక దవ్య ప్రదానము

### శ్రీ గుఱ్ఱము జాషువా కవి

ప్రతి సంవత్సరము భారతదేశ భాషలలో నొక్కొక్క భాషలో రచింపఁబడిన యుత్తమగ్రంథ రచన కొసంగఁబడు అయిదువేల రూపాయిల బహుమానము, ఈ సంవత్సరము ప్రఖ్యాతాంధ్రకవులగు శ్రీ గుఱ్ఱము జాషువా కవిగారు, వ్రాసిన 'క్రైస్తవ జీవిత' గ్రంథ

ము త్తమముగా గణించి యీ బహుమానము వారికొసంగఁబడినది. వారికి మా శ్లాఘ్య సందేశములు.

## కృతజ్ఞత

శ్రీ లక్ష్మీనరసింహారావుగారి సంగ్రహ జీవితము, ప్రతికృతి నిచ్చిన వారి కుమారులలో నొకరగు శ్రీ రమణారావుగారికి మా కృతజ్ఞత.

## పత్రికా ప్రచురణము - విలంబనము

క్రోధి సంవత్సర మార్గశిర, పుష్య; మాఘ, ఫాల్గుణ; సంచి కల రెంటిని కలిపి, శ్రీ పానుగంటి వారిని గూర్చి స్మారక సంచికగ ప్రకటించుటకుఁ బరిషత్తువారు తీర్మానించుట చేత, వ్యాసములు సేకరించుట యందును, పత్రికా ముద్రణమునందు ననివార్యమైన ఆలస్యమైనది. విశ్వావసు సంవత్సర చైత్ర వైశాఖమాస జ్యేష్ఠాషాఢ సంచికలు త్వరలో వెలువడనున్నవి ముద్రిత పత్రము లామూలాగ్ర ముగఁ బరిశీలించుట కొంత శ్రమించినను, దోషములటనట దొరలక మానలేదు. పాఠకుల క్షమకయి వేడికోలు.

— • —

## ఆంధ్రసాహిత్య పరిషద్భవనమున జరిగిన
## కీ. శే. పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారి
## శతవార్షిక జయంతి మహోత్సవము.

— :: —

ఆంధ్రసాహిత్య పరిషత్కార్యనిర్వాహక వర్గమువారు 11-2-65 వ తేదీని సమావేశమై, ఆంధ్రసాహిత్యపరిషదభ్యుదయమున కమూల్యమైన సేవ నొనర్చిన శ్రీ పంతులుగారి శతవార్షిక జయంతిని ప్రభల సుందరరామభవనము – ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమున జరుపుటకు నిశ్చయముచేసికొని, కాకినాడపురమునందున్న భాషాభిమానులను, పీఠికాపుర వాస్తవ్యులై శ్రీ పానుగంటివారితోఁ బరిచయముగల పెద్దలను, సమకాలికులను, పంతులుగారి కుమారుని, కూఁతురు కోడలు మనుమలు మనుమరాండ్రు మున్నగు వారిబంధువుల నందఱను ఆహ్వానించి, 16-2-65 వ తేదీని; అనఁగా క్రోధి మాఘ బహుళ ప్రతిపత్తిథి మంగళవారము సాయంకాలము 5 గంటలకు పరిషద్భవనములో శ్రీ పంతులుగారి శతవార్షిక జయంతిమహోత్సవము జరిగించినారు.

శ్రీ జటావల్లభుల పురుషోత్తము ఎమ్. ఏ. గారు అధ్యక్షపీఠము నందుండి సభను జయప్రదముగ నిర్వహించినారు. వారు తమ యుపన్యాసములో శ్రీ పంతులుగారి వాఙ్మయసేవ నిట్లుగ్గడించినారు. తెలుఁగు సాహిత్యమునకుఁ గల రెండు లోపములను పంతులుగారు తీర్చినారు. తెలుఁగులో నుత్తమమయిన గద్యరచన లేదను నపవాదమును వీరు పటిష్ఠమైన గద్యరచనచేఁ బాఱఁద్రోలినారు. మఱియు నాంధ్రసాహిత్యములో నల్పాల్పముగానుండిన హాస్యరస నిర్వహణమునకు వా రుచితమైన యభివృద్ధిని సాధించినారు. వా రాంగ్ల సాహిత్యకోవిదులైనందులకు, గద్యలో నారితేరిన యాంగ్లరచయితల పోకడల ననుకరణదోషము పట్టకుండునట్లుగనే తమ ప్రతిభావిశేషముచే నాంధ్రసాహిత్యములో వెలయఁజేసిరి. ప్రాచీన నవీన సంప్రదాయముల

విమర్శనములో వారు గావించిన పరిశోధనము సమన్వయము చాల విశిష్టములయినవి. పంతులుగారు కవిత్రయశ్రేణికిఁ జెందిన యాధునిక రచయితల కెవ్వరికిని వాసికి తీసిపోవువారు కారు. అట్టివారికి శతవార్షిక జయంత్యుత్సవము జరుపుట సారస్వతుల కెల్లరకు మోదావహము.

గ్రాంథిక కాంధ్రభాషాసముద్ధారమునకై నెలకొల్పఁబడిన యీ పరిషత్తునందున జరుగఁబడు నీ శతవార్షిక జయంతి సభలలో, శ్రీ పంతులుగారితో పాటు పిఠాపుర వాస్తవ్యులై వారితో విశేష పరిచయము గలవారు, వారి కుటుంబమునకుఁ జెందినవారు నిచటి యువ న్యాసములలోఁ బ్రాజ్ఞులు వారికీ శోభాపలక్షణము భావ్యమని పరిషత్కార్యనిర్వాహకవర్గము వారు భావింపఁగా నటులనే క్రిందివారు ప్రధాన వక్తలుగా పంతులుగారి విశిష్టతను గూర్చి ప్రసంగించి యున్నారు.

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయము పిఠాపురములో నిఘంటు కార్యమును సాగించునపుడు ఆ కార్యనిర్మాణమునఁ బ్రాజ్ఞులు శ్రీ పంతులుగారితో విశేషపరిచితిగల బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు పంతులుగారి సర్వతోముఖ పాండిత్యమునుగూర్చి ముచ్చటించుచు, విస్తారమైన యుదాహరణములతో వారి సాక్ష్యపన్యాసతత్త్వమును, అందలి ప్రయోజనములను, ఆ కాలపు సాంఘిక దౌర్బల్యమును, దానిని సంస్కరింపఁబూనిన విధానమునుగూర్చి వివరించుచు సభ్యులనందఱ నానందపరవశులను జేసినారు. మఱియుఁ బంతులుగారు సాక్షి జంఘాలశాస్త్రి కాలాచార్యులు మున్నగు పాత్రల ద్వారమున నేతీరుగ విమర్శించిరో యా విషయమును వివరించిరి. ఆంధ్రభాషాపఠనావశ్యకత దేశీయ సంప్రదాయ పరిరక్షణము మున్నగు విషయములను వా రుద్ఘాటించిన విధమును వారి మాటలతో వివరించినారు. పంతులుగారి గ్రంథములన్నియు

పురలమరలఁ జనుప్రటియే వారియెడల మనము చూపించెడి గౌరవము కాఁదగుననినారు. పానుగంటివారి సాక్ష్యుపన్యాసములలో నేదేని నొకఁడుపన్యాసము పాశ్చాత్యగ్రంథములలోఁ దప్పకయుండునట్లు చూచుట యుక్తమని తెలిపిరి.

శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారు కూచి నరసింహము పానుగంటి లక్ష్మీనరసింహారావుల స్నేహమును గూర్చియు సాక్ష్యుపన్యాసములలోని హాస్యఘట్టములలోఁ గొన్ని యేయే సమయములలో నెవ్వరి నుద్దేశించి కూర్పఁబడినవో తెలిపిరి. దురాచారములను హాస్యరసావలంబనమున ఖండించుటలో పంతులుగారు నిర్భయముగా నెట్టివారినైన నెగతాళి చేసినారనిరి. ఆంగ్లభాషలోనుండిన అంతఃపురోపన్యాసములు (curtain lectures) ఆంధ్రభాషలో ముందుగఁ బ్రవేశపెట్టినవారు పంతులుగారే యనియు పానుగంటివారు జీవించియున్నరోజులలో వారిస్థాయికి సరిపడినట్లు గుర్తించుట జరుగలేదనియు వారు గతించిన పాతికయేండ్లకయిన నాంధ్రలోకము కన్నులు తెఱచుట ముదావహమనియు వివరించిరి.

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి కుమారుఁడు శ్రీ వెంకటరమణారావుగారు ప్రసంగించుచు తమ తండ్రిగారు మూఁడు సంస్థానములలో-ఉర్లాము ఆనెగొంది లక్ష్మీనరసాపురములలో- దివానుగాఁ బనిచేసి అటు ప్రభువులనుండి యిటు ప్రజలనుండి గౌరవాభిమానములు చూఱఁగొన్నను స్వార్థరహితస్వభావముచేఁ దమ కుటుంబము వారి యార్థికోన్నతి కెప్పుడును బ్రయత్నింపలేదనిరి. వారు రామభక్తాగ్రేసరులనియు దీనికి వారు రచించిన రామాయణనాటకములే సాక్షులనిరి. రామభక్తులెవ్వరికి నైహికసంపదలు సమకూడలేదనియు రామదాసువలెనే పంతులుగారును జరఠావస్థలో నార్థికమైన యిబ్బందులకు లోనయినవారనియుఁ దెలిపిరి. పంతులుగారికిఁ దాము

తనయులై జన్మించినను వారి పాండిత్య మబ్బలేదనుచునే, వారి శైలి లోనే కొంతవఱకుఁ దన యుపన్యాసమును సాగించిరి.

శ్రీ వేమల రామచంద్రకీర్తిగారు వారి సతీమణి మీనాక్షమ్మగారు వీరిరువురును పానుగంటివారితోఁ బరిచయముగలవారే. కీర్తిగారు పంతులుగారి శిక్షణపొంది, వారు రచించిన నాటకములలోఁ బాత్రధారణము గావించినవారు. వీరు పంతులుగారు పాశ్చాత్య విజ్ఞానశాస్త్రములందలి విషయములను తమ యుపన్యాసములం దెట్లు నిబిడము చేసిరో తెలుపుచు, వారికిఁగల యాంగ్లభాషాపాండిత్యమును గూర్చి వివరించినారు. శ్రీమతి మీనాక్షీదేవిగారును, వారురచించిన నాటకములలోని పాత్రలనుధరించి, వారిని దర్శించి యున్నవారు: ఈమె పంతులుగారి రచనలలో, Grate victorians లోని ప్రధాన లక్షణములైన సర్వజ్ఞత సమర్థత భాషాపాటవము మొదలగు నుత్తమ లక్షణములు గలవని సోదాహరణముగ వివరించియున్నారు. మఱియు షేక్స్పియర్ నాటకములనువలె, పానుగంటివారి నాటకములన్నిటిని నొకటి సంపుటములో లభించునట్లు చేయుటకై, సాహిత్య ఎకాడమీ వంటి సంస్థలు పూనుకొనుట భావ్యమని తెలిపినారు.

పంతులుగారి కుమార్తె బారు రమణమ్మగారు,తమతండ్రిగారి సాక్ష్యుపన్యాసములలోని వైవిధ్యమునుగూర్చియు, సంఘసంస్కరణాభిలాషమును గూర్చియు, వారి రామభక్తిని గూర్చియుఁ బంతులు గారిని దలఁచిచెడిశైలిలో నుపన్యసించి, గ్రాంథికభాషోద్ధారకుని శత జయంత్యుత్సవమును,గ్రాంథికభాషాసంస్థయయిన పరిషత్తునందు సుప్రసిద్ధపండితుల సమక్షమున జరుపుచున్నందులకు పంతులుగారి కుటుంబములోని వారందఱపక్షమునను దమ కృతజ్ఞతను నెల్లడించిరి.

శ్రీ కామర్ది సత్యనారాయణవర్మగారు పీఠాపురమభిజనముగా నుండి పంతులుగారితో విశేష పరిచయముగలవారు, పంతులుగారి

నాటకములలోని సుప్రసిద్ధఘట్టములను జదివి వినిపించి, యందలి ప్రత్యేకతను నిరూపించిరి. కపిలవాయి రామనాథశాస్త్రిగారు గ్రామ్ ఫోను రికార్డులిచ్చిన 'స్థిరమైన నడువడి జనుల కందఱకువలయు' నిత్యాది పద్యములు, పంతులుగారు రచించినవియే యనియు. వారి పాదుకాపట్టాభిషేకము రాధాకృష్ణ కంఠాభరణము ఆంధ్రప్రదేశ మంతటను బ్రదర్శింపఁబడినవనియుఁ దెలిపిరి.

మఱియు శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావు గారి ఛాయా చిత్రమును ఆంధ్ర సాహిత్యపరిషద్భవనమున నలంకరింపఁదగుననియు, అందులకు వలయు ధనము సేకరించుటకు పిఠాపుర వాస్తవ్యులయిన శ్రీ వెలమకన్ని సుబ్బరాయశాస్త్రి ప్రభృతులు సిద్ధమైయుండిరని తెలుపఁగా, సభ్యులందఱు హర్షధ్వానములతో నావిషయ మామోదింపఁ బడినది. మఱియు లభించినంతవఱకు నాంధ్రభాషాసేవకమహారథుల వర్ణచిత్రములన్నియుఁ బరిషద్భవనమున నుండఁదగుననియుఁ వారు సూచించిరి.

శ్రీచిలుకూరి పాపయ్యశాస్త్రిగారు, పానుగంటి వారి రచనలు వారు కావించిన గ్రామ్యభాషావాద నిరసనమును, ఆంధ్రసాహిత్య పరిషత్తున కమూల్యమైన సేవయనియు, కీ. శే. జయంతి రామయ్యగారు మున్నగువారు గ్రాంధిక, భాషోద్ధరణమునకై చేసిన నియమావళి నిర్మాణముకంటెను, గ్రాంధిక భాషలో సాహిత్య విషయములనన్నిటిని, శాస్త్రీయ విషయము లేవియయినను, సులభవిషయమైనను కఠినాతి కఠిన విషయమైనను, వలయునట్లు నిరూపింపవచ్చునని, తమ రచనచేఁ గ్రియాత్మకముగ నిరూపించి, ఆంధ్రసాహిత్య పరిషత్తునకు మూల స్తంభమైన వారు పంతులుగారని తెలిపిరి.

పంతులుగారి సాఘ్యోపన్యాసముల రచనా ప్రయోజనము లన్నియు వారి వాక్యములందే చూపట్టుననీ, ఈజరుగఁబోవు చిత్రి

షటావిష్కరణవిషయముకూడ వారి మాటలలో వినవచ్చుననియుఁ దెలిపి కొన్నిపట్టులను సదస్యులకుఁ జదివి వినిపించినారు. పంతులుగారి సమయములో వారి వ్రాఁతలచేతను పరిషత్తు వారి వ్రేఁతలచేతను వ్యావహారిక భాషావాదము పరాస్తమైనదనియు శిష్టవాదము పాను గంటివారి గ్రంథములు భాషలో నిలిచియున్నంతవఱకు, ఆంధ్ర సాహిత్యపరిషత్తు నిలిచియున్నంతవఱకుమరలఁదలయెత్తుట సంభావ్యము కాదనిరి. మఱియు నాంధ్రసాహిత్యపరిషత్పక్షమున నీశతవార్షిక జయంత్యుత్సవమును జయప్రదముగ నిర్వహించుటకు సహకరించిన యధ్యక్షులకు ఉపన్యాసకులకు సభ్యులకు ఆంధ్రసాహిత్యపరిషత్పక్షమున శాస్త్రిగారు వందన సమర్పణముచేసిరి.

పరిషదధ్యక్షులయినట్టి శ్రీ బండారు తమ్మయ్యగారి కృతజ్ఞతా సమర్పణములో సభ విజయమును సాధించినది.

# గ్రాంథిక భాషాసముద్ధారమునకు
# పానుగంటివారుచేసిన సేవ

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

ఆంధ్రసాహిత్యపరిషత్ స్థాపనకు ప్రధానప్రయోజనము గ్రాంథిక భాషాసముద్ధారము. ఈ పరిషత్తును స్థాపించునాఁటి కాంధ్రదేశములో వ్యావహారికభాషావాదము చెలరేఁగినది. జనులవ్యవహారమం దున్న భాషలోనే గ్రంథములను వ్రాసి, వానినే పాఠశాలలందును, కళాశాలలందును బోధ్యములుగాఁ జేసిన తెలుఁగుభాష యందఱకు సుబోధమై వ్యాప్తి చెందు నని వ్యావహారికవాదుల యభిప్రాయము. ఈయభిప్రాయమును బలపఱుచుటకై యప్పటివఱకు గ్రంథరచన యం దుపయోగించుభాష కృతకమనియు, వ్యాకరణానియమనిబద్ధమైనదిగాన నట్టిభాష మృతభాష యనియు, కాలానుసారముగా స్వేచ్ఛగ ముందునకు సాగిపోవుచు జనులవ్యవహారమం దున్న భాషయే సజీవభాష యనియు వ్యావహారికవాదులు వాదింపఁజొచ్చిరి. ఈతరుణమునందే గ్రాంథికభాషాసముద్ధారమునకై కీ. శే. జయంతి రామయ్యగారు నాఁడు ఆంధ్రదేశములో భాషోద్ధారకప్రభువులుగా నుండిన పిఠాపురము బొబ్బిలి వెంకటగిరి మున్నగుసంస్థానాధీశ్వరుల సహాకారముతో మదరాసులో 'ఆంధ్రసాహిత్యపరిషత్తు' అనుపేర నీసంస్థను స్థాపించి, తూర్పునాఁటినుండి బయలుదేరిన యీ వ్యావహారిక భాషావాదమును ప్రతిఘటించినారు.

ఆనాఁడు పానుగంటిలక్ష్మీనరసింహారావుపంతులుగారు శ్రీ పీఠపురాధీశ్వరులయాస్థానిలో కవులుగను నాటకరచయితలుగను,ఆప్రభువున కాంతరంగికమిత్త్రులుగ నుండి, గ్రాంథికభాషలో హాస్యరసప్రధానమైన రచన సాగించుచు, సాక్షిసంఘోపన్యాసము అనుపేర సాంఘిక దురాచారముల నున్మూలించుచు, అక్షరాస్యులైన యాంధ్రులందఱకు

నమితానందదాయకమైన రచన సాగించుచుండెడివారు. ఆనాటి వారిరచనలను వినిగాని చదివిగాని యానందింపనివారు, ఆనాఁడుగాని నేఁడుగాని మాతృభాషాభిమానముగలవారిలో నేయొక్కరు నుండి యుండరనుట నిర్వివాదమయిన సత్యము. శ్రీపంతులుగారిరచనలన్నియు వ్యావహారికవాదుల దృష్టిలో మృతభాష కృతకభాష యనఁబడెడి గ్రాంథికాంధ్రభాషలోనే సాగినది. వారు రచించిన నాటకములన్నియు గ్రాంథికాంధ్రభాషలోనే యున్నవి. వానిని ప్రదర్శించువారుగాని, ప్రేక్షకులుగాని, యందఱు నాభాషను మృతభాష యనిగాని, కృతకభాష యనిగాని యనుకొనువారా నాఁడును నేఁడునుగూడ లేరు. తమరచనలచే గ్రాంథికభాషయే సజీవభాషయనియు, లక్షణవిరుద్ధమైన గ్రామ్యభాష గ్రంథస్థముచేయుట సరికాదనియు వేనోళ్లఁ జాటిచెప్పి, గ్రాంథికభాషాసముద్ధారమునకు మూలస్తంభమై నిలచినవారు శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు; వారిరచనలును.

గ్రాంథికాంధ్రభాష మృతభాషయనుటకు మూలము. ఆంగ్లేయులు మన దేశమునకు వచ్చి, యిచటగీర్వాణభాష అమరభాషయై సర్వతోముఖముగ వెల్లవిరియుచుండఁగా, దానిని మృతభాషయని వాకొనినారు. వ్యాకరణనియమనిబద్ధమై ప్రాకృతజన వ్యవహారములో నప్పటికది లేకపోవుటచే నది Dead Language యని వారి యభిప్రాయము. ఆంగ్లభాషచదువుకొని గీర్వాణభాషలో సముచిత ప్రవేశములేని మనవారు కొందఱు సంస్కృతపదభూయిష్ఠమై ఛందోవ్యాకరణాదినియమనిబద్ధమై యసంస్కృతులైనవారి కందరానిదై, యుండిన ప్రాచీనగ్రాంథికాంధ్రభాషను గూడ, వారిమాటలలో మాట కలిపి Dead Languaae అని యనుటకు సాహసించినారు. సంస్కృతభాష నట్లనుటయే యనుచితము. ఆమాట పరిశీలించిన నిలుచునది గాదు. ఏభాషయైన నేకాలముననైన మృతమైనచో నిఁక నాభాషలో

నుత్తమగ్రంథములు బయలుదేరుట కల్ల. అమర భాషయైన సంస్కృత వాణి, పాశ్చాత్యుల లెక్కప్రకారము ఇప్పటికి రెండువేలయేండ్ల క్రిందటికి, అనఁగా పాళీభాషలో రచన లారంభమైనప్పటికి మృతస్థితి నందినది. అట్లయిన నట్టిభాషలో భాస కాళిదాస భవభూత్యాదిమహాకవుల కావ్యము లెట్లు బయలుదేరి గీర్వాణవాణికి సకలభాషాసామ్రాజ్యమూర్ధాభిషేకము చేయఁగలిగినవి? సుబంధు దండి బాణభట్టాది మహాకవులరచన లీనాఁటికి నమరములై యుండెడిస్థితి వచ్చెడిదా? ఆంధ్రభాషను మృతభాష యనుటయు నట్టిదియే. సంస్కృత భాషలోనియందము లన్నియు సంతరించుకొని సకలసౌభాగ్యములతో విరాజిల్లుచు, అమరవాణితోఁ దుల్యప్రతిపత్తిని సంతరించుకొన్న గ్రాంథికభాషను మృతభాష యనుట యెట్లు? ఈవిషయమును పానుగంటివా రెట్లు ప్రతిపాదించినారో పరికింతము.

'గ్రామ్యవాదుల భాషాపవాదము' అనుశీర్షకముతో ఆంధ్ర సాహిత్యపరిషత్తులో ప్రకటించిన వ్యాసములోనివాక్యము లీక్రిందివి. “హరిహరీ! మనగ్రాంధికాంధ్రభాష మరణించినదా? ఎప్పుడు? ఎవ్వరును వినలేదే? ఈయాకస్మికోపద్రవ మేల కలిగినది? ఈమధ్య భాష కస్వస్థత యనికూడ వినలేదే. ఆరోగ్యముగనే యున్నదని యందఱుఁ జెప్పుకొనుచుండిరిగాదా? అందులో నలువది యేఁబది సంవత్సరముల నుండి మఱింత నీరోగస్థితిచే విరాజిల్లుచున్నదే! దేహదార్ఢ్యము కలిగి హృదయోల్లాసము కలిగి చకచకలాడుచు నెక్కడఁ జూచినఁ దానయై ప్రకాశించుచున్నదికదా! మునుపటి తట్టరాగిడులతో బుట్టకొప్పులతో వెఱ్ఱిగ సింగారించుకొనుట మాని నూతననాగరకత కర్హములైన యొకటి రెండు భూషణములుమాత్రమే ధరించి మునిమాసినగవుల మిసమిసలతో బుగ్గగులాబుల బుగబుగలతోఁ గన్నులపండువ సేయుచున్నదే. ప్రస్తుతకాలానుసారముగఁ బ్రస్తుత జనచిత్తరంజకముగఁ

ప్రాచీనబడబడాయమానశబ్దాడంబరములు, సందిగ్ధభాషణములు వివిధాభిప్రాయప్రకాశకవచోవైఖరులు నాంతరంగకాఠిన్యము వదలుకొని పువ్వులవలె నవ్వులవలె మృదులములైన లలితములైన, ముద్దుపలుకులతో స్పష్టములై స్వచ్ఛములై దాపరికము లేని విడివిడిపలుకులనో నేకాభిప్రాయబోధకములగు టక్కుటక్కుమను సూటిపలుకులతో ననఁటిపం డొలిచి చేతఁబెట్టినట్లు కులుకుచుఁగులుకుచుఁ బలుకుచున్నదిగదా! కొందఱను దనచుట్టు కూర్చుండఁబెట్టుకొని పరభాషాకథలను సరసముగ సమంజసముగ సందర్భముగఁ జెప్పి హృదయరంజన మొనర్చుచున్నదే? మునుపటిటెక్కు మునుపటిబిగింపు మునుపటి 'నన్నుముట్టుకొనకుఁదనము' విడిచి, యాంగ్లేయభాషలోనున్న ప్రకృత్యాదిశాస్త్రములలోని విలువగలపదార్థముల నొడిలో వైచికొని తెచ్చి మనకుఁ గాసంతకాసంతగ గోరుముద్దలక్రిందఁ బెట్టి నోరూరఁ జేయుచున్నదే! ఎక్కడఁ జూచినఁ దానయై సభాముఖముల నీతినిగూర్చి రాజభక్తినిగూర్చి తనసేవనుగూర్చి సింహఘోషమున నుపన్యసించుచున్నదే! లోకవార్తాబోధమున జనులకు లౌకికజ్ఞానసంపద నీయఁదలఁచి యిటు బ్రహ్మపురము మొదలుకొని యటు బొంబాయివఱకు నొక్కటేమ్రోఁతగ బ్రతిధ్వను లిచ్చునట్లుగఁ బలుకుచున్నదిగదా! తననివాసమునకుఁ బట్టణమనక పల్లెయనక యవకాశమున్నంతవఱకుఁ గొన్ని స్థలములందు మందిరములను గట్టినదే. కొన్నిచోటులఁ గట్టుచున్నదే. మఱికొన్నిచోటుల శంకుస్థాపనమునకు యత్నించుచున్నదే. బ్రదుకఁదలఁచి-శాశ్వతముగ బ్రదుకఁదలఁచి, బ్రదుకనఁగ నింతపామరత్వమునఁ బ్రాకులాడుభాష మరణించినదని గ్రామ్యవాదులు కఠోరముగఁ బలికిరా! పాపము శాంతించుఁగాక !!"

పంతులుగా రీవాక్యములలోఁ బ్రతిపాదించిన విషయములు చాలవఱకు వారిరచనలలో సమన్వితమగును. వారిరచనలో వాడు

సాంఘిక రాజకీయ నైతిక భాషావిషయకసమస్యలను గూర్చినపరిష్కారములను లలితమృదుతరగంభీరశైలులలో వివరించి ఆంధ్రపాఠకలోకమునకు గ్రాంధికాంధ్రభాషా రసాయనమును గోరుముద్దలవలె నందిచ్చినారు. ఆంగ్లభాషలో నుండినినూతనాంశముల నెన్నిటినో సుబోధముగఁ దెలిపియున్నారు. పాఠకహృదయములకు హత్తునట్లు సమంజసముగ వెలార్చియున్నారు. ఆనాఁటివిజ్ఞానచంద్రికాగ్రంథమండలివారు భౌతికరాసాయనికాదిశాస్త్ర విషయములను గ్రంథములుగా ప్రకటించి ఆంధ్రభాషకుఁ జేసినసేవను, ఆంధ్రసాహిత్యపరిషత్తు గ్రాంధికాంధ్రభాషాసేవకుఁజేసిన చేయుచున్న కృషిని బంతులుగారీవాక్యములలో నుద్ఘాటించినారు.

మఱియు నేఁబదియేండ్లనుండి మనభాష వెనుకటి మోటుఁదనమును వదలిన దని నిరూపించినారు. ఈమాట సర్వథా సత్యము. 18, 19 శతాబ్దులలో బయలుదేరిన వచనవాఙ్మయము ప్రబంధశైలిలో విశేషాడంబరముతోను మోటుదనముతోనువెలసినదనుటయుసత్యమే. ఆనాఁటిపద్యగద్యకావ్యరచనలలో వ్యత్యాస మంతగ లేదు. కాని 19వ శతాబ్దియుత్తరార్ధములో పరవస్తు చిన్నయ్యసూరి, పాఠశాల విద్యార్థుల యుపయోగార్థమై నీతిచంద్రిక నొకసలక్షణమయిన శైలిలో విలక్షణముగ రచించి యాంధ్రపాఠకలోకమున కందిచ్చినదాదిగ ఆంధ్రవచనరచనకు మోటుఁదనము వదలి నూతననాగరకత యలవడినది. సంస్కృతాంధ్రపదముల సమ్మేళనముతో శ్రుతిమధురమై యుదాత్తమైన శైలి తెలుఁగువచనరచన కేర్పడినది. తెలుఁగు వచనరచనపరిణామమునుగూర్చి నిష్పాక్షికముగ విచారణమొనర్చు వారుండిన దీనిని గాదనఁజాలరు.

ఆంధ్రభాష నిర్జీవమైనదని పాశ్చాత్యనిర్వచనసంస్కార సంస్కృతచిత్తు లనుకొనుటకును చిన్నయసూరి రచించిన బాలవ్యా

కరణమే మూలము. సంస్కృతపండితులు బాలవ్యాకరణము చదివి, తాము రచియించురచనల నన్నిటిని ఆవ్యాకరణనియమములకు లోఁబడు నట్లు చేసి, భాషను ముందునకుఁ బెరుగనీయకుండుటయే తెలుఁగు భాషకు మరణావస్థ యని వ్యావహారికవాదుల వాదవిషయము. ఇది వట్టిభ్రాంతి. వ్యాకరణ మనునది భాషకుఁ గలిగెడిపెరుగుదల నరికట్టు నది గాదు. లోకవ్యవహారమునందును కవిప్రయోగములందును గాన వచ్చెడి శబ్దజాలము నందలి సాధుత్వాసాధుత్వములను నిర్ణయించి, భాషాప్రవాహము కట్టలు తెంచుకొని ప్రవహింపకుండ, సీనులలోని మర్యాదకు లోఁబడి లోకాభ్యుదయమునకు సాధకమగువిధానమును బోధించును. అంతియగాని భాషాభివృద్ధికి నిరోధక మెన్నఁడును గాఁజాలదు. నదులలోనినీటిని విచ్చలవిడిగాఁ బ్రవహింపనిచ్చిన నది యేపనికిఁ గొఱగాకుండఁబోవుచు నుప్పఁబడును. ఆప్రవాహమున కానకట్టలుగట్టి, ప్రక్కనుండి కాల్వలు త్రవ్వి, వానిగుండ నీటిని బ్రవహింపఁజేసిన తోఁటలు పైరులు పెరిగి, దేశాభ్యుదయమునకు సాధక మగుట సర్వానుభవ సిద్ధము. భాషావిషయముకూడ నట్టిదియే.

అదియగాక చిన్నయ్యసూరి తెలుఁగుభాష పెరుగుకుండ బాల వ్యాకరణనిర్మాణముచే వారధిని గట్టివేసినాఁడని వ్యావహారికభాషా వాదులయూహ. ఇదియు వట్టిభ్రాంతియే. చిన్నయ్యసూరికిఁ బూర్వము తెలుఁగుభాషకు వ్యాకరణములేనేలేదా? అంతకుముందువారు ఛందో వ్యాకరణాది నియమముల నెఱుఁగకుండఁగనే భాష యున్నంతకాల ముండఁదగిన రచనలనునిర్మింపఁగలిగిరా! చిన్నయ్యసూరి భాషకుఁ జేసిన యపచార మేమున్నది? నన్నయ్యభట్టారకుఁడు మొదలుకొని, తన నాఁటివఱకు నుండెడి తెలుఁగుభాషకు సంబంధించిన లక్షణగ్రంథము లన్నిటిని జూచి తెలిసికొని, మఱియు నన్నయ్య మొదలుగఁ దననాఁటి వఱకుఁ గలయాయాకవుల రచనలలోని ప్రామాణిక ప్రయోగముల

నన్నిటిని గుర్తించి, యనుగతమైన శబ్దజాలమును గూర్చుకొని, సూత్ర వృత్తులను రెండింటిని, పాణినిసూత్రములకు భట్టోజీదీక్షితునివృత్తికి నీడయిన శైలిలో నన్న్యానానతిరిక్తముగ నీవ్యాకరణగ్రంథమును సంతరించిపెట్టినాఁడు. సూరి పాణినీయవ్యాకరణమును బాగుగఁ జదివి యవగతముచేసికొనినపండితుఁడుగావుననే యట్టి క్రమములోసి తెలుఁగు వాక్యరణమును గూర్చఁగలిగినాఁడు. పాఠకులాగ్రహింపకున్న నొక్క మాట యనుకొనవచ్చును. తెలుఁగు భాషలో బయలు దేరిన వ్యాకరణ గ్రంథములన్నిటికంటెను విచారసహమైనవ్యాకరణ రచన యీతనిదే యనవచ్చును.

అదేవిధముగ నన్నయ్య మొదలు తననాఁటివఱకు నుండెడి కవులరచనలలో నుండెడి మేలిరకపురచనఖండముల నెన్నుకొని, వానిని పంచతంత్రకథలను గూర్చుటలో సంతరించి తనప్రతిభచే ముద్దులుమూటఁగట్టుశైలిలో నీతిచంద్రికను రచించి బాలుర కందిచ్చినాఁ డలనాఁ డాసూరి. తదనుకరణము నాఁటికి నేఁటికి నెవ్వరికి సాధ్యమగుట లేదుగదా! సంస్కృతవ్యాకరణ పరిపాటి తెలియనివారికి బాలవ్యాకరణమును, సంస్కృతసాహిత్యమార్గ రహస్యముల నెఱుఁగని వారికి నీతిచంద్రికయును, మొఱటుగఁ దోఁచునేగాని, విజ్ఞులయినవారి కవి యట్టివి గావు. అనుగతమైన శబ్దములుండి, ఒక్కలక్షణవాక్యముచే బహులలక్ష్యసిద్ధి సంభవించినచోట, లక్షణవిస్మృతికి నిరోధమునకై యెవ్వరును జేయఁజాలరు. పాణినివిరచితసూత్రములకు సాధ్యములు కాని లక్ష్యములను వార్త్తికారభాష్యకారులు సాధింపలేదా? కనుకఁ జిన్నయ్యసూరి వ్యాకరణమును రచించి భాషాప్రవాహమున నరికట్టి వైచినాఁ డనుట వట్టిభ్రాంతి.

ఇంకొక్కమాట. ఆనాఁడుగాని యీనాఁడుగాని లోకవ్యవహారముం దుండెడిభాషకును, గ్రంథస్థమై శాశ్వతత్వము నందనలసిన భాష

కును విషయగౌరవమునుబట్టి వ్యత్యాస ముండకతప్పదు. లోకవ్యవహారముకంటె వేఱయి బుద్ధిపరిశ్రమకు సాధ్యమైన విషయముండి నప్పుడే రచన యని యనుకొందురు. అట్టివిషయము లేని రచన సారస్వతమునందు స్థానమునే యార్జింపదు. అందును లోకములో నాలుగు కాలములపాటు నిలుచునట్టిరచన సలక్షణమై యుండవలయు ననుట సారస్వతులందఱకు ననుభవసిద్ధమైనవిషయమే. లోకవ్యవహారమందుండెడి భాషనే గ్రంథములయందు నుపయోగింపవలయు నని వాదించెడి వా రయినను, వారు మాటాడుభాషలో గ్రంథముల నెన్నఁడును వ్రాయరు. అనుకొనకుండఁగనే కొన్నియలంకారములు కొంతవ్యంగ్యము, కొన్ని వ్యాకరణశుద్ధమైన పదములు, ఉదాత్తానుదాత్తమధ్యస్థితులం దుండెడిశైలి, కల్పనచమత్కారము మొదలయిన లక్షణములు పట్టకమానవు. ఇఁక వ్యావహారికవాదులు చేయుమార్పు విభక్తిప్రత్యయములలోను, క్రియలమీఁదవచ్చు ప్రత్యయములలోను లక్షణానుగతమైన రూపముల నుపయోగింపక లక్షణవిరుద్ధరూపములను బాటించుటలో సంధినియమములను సడలించుటయును.

అనుగతమైన లక్షణములను బాటింపకున్నను భావము బోధపడునని వారిభావము. ప్రాచీనకవు లుపయోగించిన శబ్దములను, తత్తదర్థావబోధకములుగ సలక్షణమైన శబ్దముల నుపయోగించిన, నాభాష పండితులకేగాని పామరులకు దుర్బోధముగ నుండునని వారివాదము. సులక్షణమైనభాషలో పండితపామరామోదకరముగ రచన సాగించుట సుసాధ్యము సులభసాధ్యము అనువిషయమునకుఁ బంతులుగారి రచనయే ప్రబలమైన తార్కాణము.

గ్రాంధికభాష కఠినమని, అది పండితులకేకాని పామరులకు బోధపడునది కాదని, దానిలో కృత్రిమత్వము హెచ్చని, ఆడంబరమధికమని వ్యావహారికవాదులు చేయుప్రవాదమునకు పంతులుగారి

సర్వగుణసంపన్నమై సర్వతోముఖమయిన రచన మపవాదము. శ్రద్ధతో శ్రమకోర్చి ప్రాచీనప్రబంధములలోని సాహితీపథముల చమత్కారముల నవగతముచేసికొనఁగలిగినవారికి గ్రాంథికభాష కఠోరముగాక కర్ణరసాయనమే యగును. అది వట్టికృతకభాషకాక ప్రతిభాసముద్భాసకమయిన సహజభాష యనునదనుటకును పంతులు గారి పై వాక్యములు, వాని నన్నిటిని తమరచనలలోఁ బ్రతిఫలింపఁ జేయు ప్రతిభావిశేషములే నిదర్శనములు. సలక్షణమైన గ్రాంథిక భాష రచయితకుఁ గలభావమును సూటిగాఁ దెలుపుటకు వలనుపడ దనుట కేవల మజ్ఞతాలక్షణము కాని యన్యముగాదు. వచనరచనలో వ్యావహారిక ముండవలయునని యుపన్యాసవేదికలమీఁద సింహగర్జన ములు చేయువారే పద్యములను సలక్షణముగ వ్రాయఁదలపెట్టి నప్పుడు గ్రాంథికభాషనేగాక గ్రామ్యభాష నుపయోగించు వారెవ్వ రును ప్రముఖులలోఁ గానరారు. ఇటు గ్రాంథిక మననేమో, యటు వ్యావహారిక మననేమో తెలియక మంచిరచయితల మనిపించుకొన యత్నించువారే విలక్షణముగ వ్రాయువారుగఁ గానవచ్చుచున్నారు. కావునఁ బంతులుగారు గ్రాంథికభాషయే సజీవభాష యని తెలు పుట నాఁడునేఁడును సమన్వితమైనవిషయమే,

గ్రాంథికమే తెలుఁగురచయితల కాశ్రయణీయము. గ్రామ్య మెన్నఁడును రచనార్హము కాదని తెలుపుటకు పంతులుగారు విమ ర్శాదర్శవిమర్శాదర్శము, అనుగ్రంథమునురచించిప్రకటించియున్నారు. 'క్రిషా'యను నాంగ్లేయవిమర్శకులు రచియించిన గ్రంథములు రెండిం టిలోని విషయములను వ్యావహారికవాదమున కనుకూలముగ మలఁచు కొని కీ. శే. బుర్రా శేష గిరిరావుపంతులుగారు 'విమర్శాదర్శ' అను గ్రంథమును రచింపగా దానికి ఖండనరూపముగ విమర్శాదర్శవిమ ర్శాదర్శము అనుగ్రంథమునువ్రాసియున్నారు. దానిలో పంతులుగారు

గ్రాంథికభాషాప్రశస్తిని బహుముఖముల నిరూపించుచు, వ్యాహారిక భాషావాద మెట్లు నిలువదో సహేతుకముగ క్షోదక్షమముగఁ దెలిపి యున్నారు. ఈవిమర్శనమును వ్యావహారికవాదులు సౌహార్దముతో నవగతముచేసికొనిన నిశ్చయముగ వారావాదము వదలుకొని గ్రాంథికము నాశ్రయింపకతీరదు. పానుగంటివారిరచన లనిన వ్యావహారిక వాదులకు ద్వేషములేదు. హాస్యరసోజ్జీవకములయిన వారిసాక్ష్యుపన్యాసములను జదివి యానందింపనివారు వారెవ్వరును గారు. వానిని మెచ్చుకొననివారు వారిలో నేయొక్కరు నుండ రనునది పరమ సత్యము. పంతుగారు రచించినరచనలన్నియు గ్రాంథికభాషలో నుండినవియేగాని వ్యాహారికభాషలో నేయొక్కటియును లేనేలేదు. ఏవిషయము నెత్తుకొనినను ప్రతిపక్షమువారికి గుక్కతిరుగకుండ యుక్తులను నిరూపించి స్థిరీకరించుటలోఁ బంతులుగారిప్రతిభ యసాధారణమైనది. దానిని కాదనఁగలిగినవా రానాఁడును నేఁడును నెవ్వరు లేరనుటయు నిర్వివాదమైనసత్యము.

వ్యావహారికవాదు లాంగ్లేయుల యడుగుజాడలలో మెలఁగువారై, ఆభాషలోఁ బ్రసిద్ధికెక్కిన రచయితల తదనుయాయులను ననుకరించువారు గానున్నారు. పాశ్చాత్యులభావములను మనభాషలోని కవతరింపఁ జేయుటయే మాతృభాషాసేవ యని భావించెడి తత్త్వము గలవారగుటచేఁ గొంతకాలమువఱకు మనప్రాచీన కవుల రచలను, వాని నవగతముచేసికొనఁజాలిన తెలుఁగు పండితులను దూయఁబట్టుచుండెడివారు. వీరిలో నూటికి 99 వంతునకుఁ బైఁబడిన వారు సాంఘికసంస్కారాపేక్షులై, ప్రాచీన సంప్రదాయములను బాటింప నక్కఱలేదని భావించుటచేతను భాషావిషయమును గూడ నట్టిసంస్కారము రావలెనని యపేక్షించువారు కాఁజొచ్చిరి. గ్రాంథికవాదులలో నూటికి 90 వంతుమంది ఆస్తికులే యగుటచే వీరు ఆంగ్ల

భాష నెఱిఁగియున్నను ప్రాచీనసంప్రదాయమును త్రెంచివేయుట కిచ్ఛగింపక, గ్రాంథికాంధ్రమునే సమాశ్రయించుచువచ్చిరి. ఆవిధముగ నెంచిచూచినప్పుడు గ్రాంథికాంధ్రభాషా సముద్ధారమునకు మూల స్తంభభూతులైన పానుగంటివారు జయంతిరామయ్యగారును అంఖడ రామభక్తులై యుండుటయే యిందులకు నిదర్శనము. ప్రాచీనకాలము నందలి తెలుగుఁగవులందఱుఁ భగవద్భక్తు లనుమాటలో విప్రతిపత్తి లేనేలేదు. వారివలె రచన సాగింపలేకున్నను, వారియెడల సద్భావము గలిగి వారియడుగుజాడలలో మెలఁగుచు రచన సాగింపవలె నన్న కవులు రచయితలు నందఱును భగవద్భక్తిసమన్వితులైన యాస్తికులేగాని, నాస్తికులుగా నుండినవారు సాధారణముగఁ గానరారు.

శ్రీజయంతిరామయ్యపంతులుగా రొకప్పుడు నాతో నిట్లనినారు. వారు వేదపండితులందఱకు వార్షికముగా ఘనపాఠులకు రెండేసి రూపాయిలు, క్రమపాఠుల కొక్కొక్క రూపాయి యాదినములలో నిచ్చుచుండెడివారు. మనప్రాచీనవాఙ్మయమైన సంస్కృతభాష భారతీయవిజ్ఞానము వేదములమీఁదనే నిర్భరమైయున్నది. అవి భారతీయవాఙ్మయమునకు బీజభూతములు. బీజము సంరక్షింపఁబడిన సమయమువచ్చినపుడు మరల సస్యము నుత్పత్తిచేసికొనవచ్చును. ఆబీజములను రక్షించువా రీవేదపండితులుగాన, సంస్కృతభాషాపరిరక్షణమునకై యీవేదపండితులను రక్షింపవలయును. ఇటులనే గ్రాంథిక భాషాబీజములు రక్షింపఁబడిన మనప్రాచీనాంధ్రసారస్వతము నిలిచి యుండఁ గలదు. లేకున్న నది నశించుపోవును. భాషాబీజసంరక్షణము నపేక్షించియే ఆంధ్రసాహిత్యపరిత్సంస్థ స్థాపింపఁబడినది. దీనియుద్దేశ్యములను ఫలింపఁజేయుట మనప్రాచీనాంధ్ర సారస్వత బీజములు నశింపకుండ నిలువఁబెట్టుటకే యని వారనినారు.

ఇట్టియభిప్రాయములను వేనోళ్లఁ జాటిచెప్పినవారు పానుగంటి వారు. మాతృభాషను పరదేవతనుగా భావించి, తదుపాస్తికై తన ప్రతిభనంతను వినియోగించినవారు పానుగంటివారు. వారికి మాతృభాష, అందును మనపూర్వకవులచే గ్రంథములం దుపయోగింపఁబడిన తెలుఁగుభాష నారాధించుటయే పరమధ్యేయముగా వెలసినది. ప్రకీర్ణోపన్యాసములు అనుపేర వారు ప్రకటించిన వ్యాససంపుటిలో వారు మాతృభాషాసమారాధన మైహికాముష్మిక సుఖసంపాదకమనువిషయమును బహుముఖముల వివరించియున్నారు. 'పురాణపఠనము' అనువిషయమును, తదావశ్యకతనుగూర్చి తెలుపుచు, భారతీయుఁ డైనవాఁడు రామాయణభారతభాగవతములను వినియో చదివియో సుఖశాంతులను బడయుట భావ్యమని తెలిపినారు. ఈ క్రమ మింతకుముందుండినది. మనమన స్తత్త్వమునకు సరిపడిన;దింతకు ముందుండి యిప్పుడు పాశ్చాత్య భాషాసంస్కారముచే రూపుమాసి పోవుట, దేశసౌభాగ్యమున కెంతయేని లోప మని నిరూపించి యున్నారు.

పంతులుగారి రచనలన్నియునించుమించుగఁ బ్రతివిషయము ఆస్తికమ్యువైపునకే ములుచూపుచుండును. మానవజీవితమును చాత్తముగావించుకొనుటకై యక్కఱకువచ్చు భక్తిజ్ఞానవైరాగ్యాదివిషయములతో వారిరచన లుపనిబద్ధము లగుచుండును. అట్టివిషయములన్నియు నేకాలమునకైన సరిపడియుండును. ఈపురాణపఠనమును గూర్చిన నిరూపణములోని కొన్నివాక్యముల నుదాహరించెదను.

"ఉదయము మొదలు సాయంకాలమువఱకుఁ బ్రతిజనమునకేదో కాంక్ష. ఏదో దేవులాట. చిక్కేకద. ఒక్కగడియసేపైన నిశ్చలముగ నీశ్వరధ్యానము చేసికొనుట కవకాశము లేదుగద. కుండలో బియ్యము నిండుకున్నవనియో, నగలులేక భార్యమూతిముడుచుకొని

పండుకొన్నదనియో, పరిపాలకుఁడగు ప్రభువు మొగమెత్తఁబడిన
దనియో, కన్నపుత్రుని యొడలు వెచ్చఁబడినదనియో, పరశురామ
కటాక్ష మింటిపైకి వచ్చినదనియో, విడిఖైదుకై యప్పులవారు తన
పైకి వారంటు దెచ్చిరనియో, యెందులకో మఱెందులకో" జాగ్రద
వస్థలో నందఱు పాదుషా మొదలు ఫకీరువఱకు—లోలోపలనో, కూను
రాగముతోనో బారుమని పైస్థాయిలోనో, యేడువవలసిన వారేకద.
వారిని గొట్టియో వీరిని దిట్టియో, హస్తలాఘవముచేతనో కనుకట్టు
చేతనో దౌర్జన్యముచేతనో దైన్యముతోనో యేలాగునో యొకలాగునఁ
బగలెల్లఁ గాలక్షేపమగుచున్నది. బ్రదుకునకై ప్రాకులాడు టిట్లంద
ఱకు సహజముగా నున్నదేకద.

ప్రాణయాత్రకొఱకై పడుచున్న యీపాటులతోఁ బగలు
వ్యర్థమైనట్లే రాత్రికూడ వ్యర్థమైనయెడల బ్రతుకంతయు వ్యర్థమగు
నని యెంచి మనపూర్వులు పవిత్రమైన యీపురాణ పఠనమర్యాదను
స్థాపించిరి. అసంతుష్టమగు మనస్సునకు-కష్టపరంపరలందు గడగడలాడు
మనస్సునకు పుణ్యకార్యములందు దీక్షలేనిమనస్సునకు—దుర్నీతిపైఁ
గప్పదాఁటులు వేయు మనస్సునకు— ఒక గడియసేపైన పురాణకాల
క్షేపము జరుగు రవ్వంతసేపైన- సంతుష్టి శాంతి ధైర్యము సత్కా
ర్యాచరణాభిలాష దుష్కార్యచింతాదూరత కలుగుటకై యిట్టిసదా
చారము పూర్వులచే నియమింపఁబడి యుండవచ్చును. పురాణపఠన
శ్రవణములవలన స్త్రీపురుషుల కందఱకు చిత్తశాంతి కలుగునని తెలు
పుచు, ఇదిగాక రాజనీతులు సేవకనీతులు- వ్యవహారనీతులు- పతివ్ర
తాధర్మములు. వైరాగ్యపద్ధతులు మత సంప్రదాయములు కర్మ
భక్తి జ్ఞానరహస్యములు మోక్షమార్గములు నెన్నో వారిహృదయ
ములఁ బ్రవేశించునుగదా!" ఈవిధమయిన పానుగంటివారి మాటలను
మననముచేసికొని, పురాణపఠణముచేసిన భారతీయులభాగ్య మెంతగ

ఫలించియుండెడిదో? మనప్రాచీన స్సంప్రదాయములను దెలియనందులకుఁ దెలిసియున్నను నాంగ్లభాషా పఠనసంజనిత సంస్కారముచే వానిని విడనాడుచున్నందులకు పంతులుగారెంతయు వంతజెంది సాక్ష్యోపన్యాసములలో తమయార్తిని బహుముఖముల వెల్లడించుచునే వచ్చినారు. పాశ్చాత్యసంప్రదాయము లేవిషయమునను మన కనుకార్యములు కావని హాస్యరసభరితమైన శైలిలో నిశితముగ విమర్శించియున్నారు. సాంఘికదోషముల నెత్తిచూపించి మొత్తిపొడుచుటలో పంతులుగారికి వారే సాటి.

పురాణపఠనముగావించెడి మఱ్ఱిచెట్టుక్రింది రచ్చపట్టులే రాత్రిపాఠశాల లని నిరూపించుచు- ఏ. బీ. సీలే చెప్పవలె నన్నమాటయేమి? అవి చెప్పిననే కాని విద్యకాదా? మనదేశస్థితి కనువైన విద్యను మనవారు బోధించిరి. మనతత్త్వముల కెక్కవలసిన విద్యను మనకు బోధించిరి. మనజాతీయవీరుల చరిత్రములు మనకు బోధించిరి. మనజాతీయ మహాపతివ్రతలకథలను మనకుబోధించిరి. ఇంతకంటె నేమి యుపదేశింపవలెను. సంతుష్టికంటె సౌఖ్యము లేదనిచెప్పిరి. ధర్మమే జయించునని యుపదేశించిరి. సత్యవ్రతముకంటె వ్రతము లేదని యుద్ఘాటించిరి. వ్యసనసప్తకము విసర్జింపుమని చెప్పిరి. అంతరశత్రువులనుదర్శింపుమని శాసించిరి. ప్రపంచము మిథ్యయనిసూచించిరి. ఇంద్రియనిగ్రహమునకు సాధనముల నుపన్యసించిరి. భక్తివలనఁగాని జ్ఞానమువలనఁగాని మోక్షము ప్రాప్తించునని యానతిచ్చిరి. ఇంతకంటె గావలసినబోధ మేమున్నది? ప్రపంచమున సద్గుణగరిష్ఠుఁడై యుండవలసిన వారికిఁగాని ప్రపంచమును వద యోగనిష్ఠుఁడై యుండవలసిన వానికిఁగాని యింతకంటె బోధన మేమికావలసియున్నది? ఇఁక నాంగ్లేయభాష రానిలోప మేమున్నది?... రుక్మాంగదుని వంటి మహాపురుషుఁ డుద్భవించుటకు మనయార్యావర్తదేశమే

తగునుగాదా? అట్టిదేశమునఁ బుట్టిన మనము- అట్టిజాతిలోఁ బుట్టిన మనము ఇప్పు డేమి చేయుచున్నాము. పురాణపురుషులు వట్టి Fools అనుచున్నాము. తత్పవిత్రచరిత్రములు తలతోఁకలేని తప్పుడు కథ లనుచున్నాము. పురాణములు కట్టఁగట్టి మూలఁబాఱవైచినాము. వానిని జదువఁదగదు. విశ్వసింపఁదగదు. స్పృశింపఁదగదు. ఇంతలో స్వదేశాభిమానము స్వభాషాభిమానము స్వజాత్యభిమానము సంపూర్ణదశకు వచ్చినవి."

గ్రాంథిక భాషయనిన వెగటుపుట్టుటకు మూలము ఆస్తిక్యము దూరమై, మనపురాణములను పఠించుటగాని, అందలి విషయములను దెలిసికొనుటగాని, పౌరాణికధర్మములను బాటించుటగాని లేకపోవుటయే. వ్యావహారికభాషావాదము రాజకీయశాసనానుసారముగ విజయమును సాధింపలేకపోయినను, ఈనాఁటికి రచయితలుగా రూపొందుచున్న వారిలో నూటికి 90 వంతుల జనులు గ్రామ్యభాషలోనే రచనసాగించుచున్నారు. తెలుగుభాష తెలియునని చెప్పువారిలో నిప్పటితరమువారిలో నూటికి 90 వంతువారు మన తెలుఁగులో పురాణములు చదువవలె ననువారుగాని, చదివి అర్థముచేసికొనఁగలుగువారుగాని లేరు. కావ్యగత చమత్కారభరితములైన ప్రబంధములను జదివి, అందలి యర్థము నవగతముచేసికొనెడివారు చాల పలుచనైపోయినారు. గంటలోనో అరగంటలోనో చదివి యాపల విస్మరించుట కనువైన నవలలు నాటికలు కథానికలు (పంతులుగారి పరిభాషలో కుక్కగొడుగులవలె) బయలుదేరి, బుద్ధికేపాటియు పరిశ్రమము నీయనక్కఱలేకుండ బోధపఱచుకొనుటకు వీలయినవి బయలుదేరి, అక్షరాస్యులయిన స్త్రీపురుషులందఱు వానికై మొగఁబడుచుండుట వ్యావహారికవాద ప్రభావమే. గ్రాంథికభాషలోనే సలక్షణముగ రచనలు సాగుచుండిన, కవిత్రయము వారిభారతభాగములు, రామా

యణ భాగవతములు పఠనపాఠనములలో నుండిన, మనప్రాచీనసంప్రదాయములు, వెనుకటి యాచారములు, ధార్మికదృష్టి చెడకుండ నుండిన, నింతటి విపరీతస్థితి యేర్పడి యుండెడిది కాదనిపించుచున్నది. ఈనాఁడు పంతులుగారు తెలిపినట్టులు ఆంధ్రులలో చాలమందికి స్వదేశభాషాజాత్యభిమానములు పూర్ణానుస్వారము లైనవి.

పంతులుగారి యీక్రిందివాక్యములు పరికింపుఁడు.

"ఆంగ్లేయ భాషాసారస్వతములోఁ బాండిత్యము సంపాదించుకొనఁగూడదని నాయభిప్రాయముగాదు. సంపాదించుకొనవలసినదే. శక్తివంచనము లేకుండ సంపాదించుకొనవలసినదే. ఎప్పుడు ? మనజాతీయ మహాపురుషుల చరిత్రములు మనము దెలిసికొనిన పిమ్మట. మనజాతీయమహాకాంతామణులమహోత్కృష్టచారిత్రములనుమనము దెలిసికొనినపిమ్మట. ఐహికాముష్మిక సౌఖ్యప్రదములైన మన యితిహాసములలోని పురాణములలోని కావ్యములలోని జ్ఞానామృతమును గ్రోలినతరువాత.అంతేకాని అరుంధతినిమనమెఱుఁగకపోయినతరువాత 'హెన్రీది యైత్'కెందఱుభార్యలో దెలిసికొననేల? చిత్రకూట పర్వతమున జాబాలి చేసినబోధమునకు శ్రీరామచంద్రమూర్తి యెట్లు ప్రత్యుత్తరమిచ్చినాఁడో మనకుఁ దెలియకపోయినపుడు Platos Dialogues తలక్రిందుగ నప్పఁజెప్పిన నేమి విని యోగము? శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రసభలో రాయభారపుఁబలుకు నెంతసందర్భముగా నెంత సమీచీనముగా నెంతమధురముగా నెంత యుక్తియుక్తముగాఁ బలికెనో యెఱుఁగని మనకు పార్లమెంటులో Gladstone గారి Budget Speach వచోవిధేయమైయున్న మనకేమి? మనపూర్వదేశస్థితిని గూర్చిన గ్రంథములు మనకు మొదటఁ గావలయును. మనపూర్వనాగరకస్థితిని గూర్చినగ్రంథములు మనకు మొదటఁ గావలయును. మనజాతీయతత్త్వములోఁ జేరినగ్రంథములు మనకు మొదటఁ గావల

యును. సహనము సౌభ్రాత్రము సత్యము శాంతి శమము మొదలగు నవి బోధించు మనజాతీయ సారస్వతమును వదలినపిమ్మట జాతిలో నైకమత్యముండుట కవకాశముండునా? ఆత్మగౌరవము తగ్గినపుడు పరగౌరవము తగ్గుట యాశ్చర్యమేమి ? జాత్యైక్యమునకు జాత్యభివృద్ధికి దేశాభిమానమునకు పురోభివృద్ధికిఁ గావలసినది పురాణపఠనము''

పంతులుగారు తెలిపిన యీవిషయములు సర్వథా తథ్యములు. ఈనాఁడు పురాణపఠనము క్రమముగా సడలిపోయిన కారణముననే మానవచిత్తవృత్తికి దార్ఢ్యము నిచ్చెడి సారస్వతముగాని శాంతిసౌఖ్యముల నిచ్చెడిసదుపదేశముగాని దుర్లభమైపోయినది. కాలప్రవాహములబట్టి అనుక్షణము మాఱిపోయెడి ఆదర్శాభాసములను బోధించెడి వాఙ్మయము దేశభాషలన్నిటిలోను,ప్రధానముగ మన తెలుఁగు భాషలో బయలుదేరి స్వదేశాభిమానము స్వభాషాభిమానము నాఁటికినాఁడు సన్నగిల్లిపోవుచున్నది. పంతులుగారి రచన విశుద్ధమైన గ్రాంథిక భాషలో బయలుదేరి యిప్పటికి ఏఁబదిసంవత్సరములయినది. వారిభాష కఠినమైన దనికాని, దుర్బోధ మని కాని, పాక్షిక మని కాని, యనుకొనువా రెవ్వరును లేరు. ఈపురాణపఠనావశ్యకతను గూర్చి వారివాక్యములు పండితులకుఁ బామరులకు నమితానందదాయకములే. ఇట్టిశైలి నలవఱచుకొని గ్రాంథికమునకు సరిపడునట్లు రచనసాగించునాఁ డెవ్వరికి విరోధముండఁబోవదే. ఈవిషయమును వ్యావహారికవాదు లేల స్వీకరింపరో ? వారిరచనల నన్నిటిని జదివి యానందించి తన్మయత్వము చెంది, పంతులుగారి ప్రతిభనుగూర్చి వేనోళ్లతో మెచ్చుకొను వ్యావహారికవాదులను నేను చూచినాను; చూచుచున్నాను. ఆంధ్రసాహిత్యపరిషత్తును స్థాపించి గ్రాంథికాంధ్రభాషయందే రచన సాగింపవలెనని, గద్యపద్యముల రచన సలక్షణముగ సాగవలెనని లోకమునకుఁ దెలుపుటకై తమరక్తమాంసములు

ధారవోసిన రామయ్యపంతులుగారి మీఁదనే వ్యావహారిక వాదులు ధ్వజమెత్తినారుగాని, గ్రాంథికాంధ్రభాషలో నేవిషయమునైన నెట్టి శైలిలోనయిన రచన సాగింపవచ్చు ననువిషయమును బహుముఖముల సాక్ష్యోపన్యాసములలో, బహిరంగసభలలోను, ఇతరగ్రంథములలోను, నాటక రచన ప్రదర్శనముల మూలమునను ఘంటారావముతోఁ జాటిచెప్పిన పానుగంటివారిని పల్లెత్తుమాట యనువా రీనాఁటికి నెవ్వరును గానరారే. దీనికిఁ గారణము లేకపోలేదు. సాధారణముగా వ్యావహారికవాదులకుఁ దదనుయాయులకు ఆంగ్లేయభాషలో నాయా విమర్శకులు వ్రాసిన సిద్ధాంతములను తమయూహముల కనుగుణముగ మలచిపెట్టుట యొక ప్రధానవిషయము. పాశ్చాత్యవిమర్శక సిద్ధాంతములను క్షుణ్ణముగాఁ దెలిసి, మన సారస్వతమునందలి విశిష్టతను దలస్పర్శిగా నెఱిఁగి రచనసాగించినవారు పానుగంటివారు. అట్టి స్థితిలో సంస్కృతము చదివినపండితులకు నవ్యదృష్టి యుండదని, ఏవిధమయిన క్రొత్తసంస్కారమును వా రంగీకరింపరని యెత్తిపొడుచుటయే వ్యావహారికవాద మని భావించువీరు, సంస్కృతాంగ్లాంధ్ర సాహిత్యపథములను క్షోదక్షమముగ నెఱిఁగి, పదునైన కత్తితో శస్త్రచికిత్స చేయు పానుగంటివారి మాటలకు బదులుచెప్పుట గాని, వారన్న విషయమును గాదనుటగాని యెవ్వరికి నేనాఁడును సాధ్యము కాలేదు. కాదనియు ననవచ్చును. గ్రామ్యవాదుల భాషాపవాదము అనువ్యాసములో పంతులుగారి మాటల యుపపత్తి యెట్టిదో పరికింతము.

ఆంధ్రభాషారచనకు మాటాడుభాష నే యుపయోగింపవలయు నని వాదించువారు సెట్టి లక్ష్మీనరసింహంగారు గ్రాంథికభాష Living language యనఁగా, గిడుగు రామమూర్తిపంతులుగారు Dead language అనినారు ఈ విషయమును కాదను ప్రకరణములో

“అన్యోన్యవిరుద్ధములఁగఁ బల్కు-నీగ్రామ్య వాదులలో మనకు సూత్రి కారులెవ్వరు?” గ్రీకుమిత్రుఁ, బొప్పుడుపా’ చేత్యాద్య లౌకిక గ్రంథ సంధానధురంధరులగు లక్ష్మీనరసింహంగారా? వారికంటె వయోవృద్ధులు ప్రపంచిక జ్ఞానవృద్ధులు నగు రామమూర్తి పంతులుగారా? వారిమాటలు నమ్మి భాష కుత్తరక్రియలారంభింపవలసినదా? వారి మాటలు నమ్మి యుపచారక్రియ లారంభింపవలయునా? గ్రాంథిక భాష మృతభాష కాదని మాయభిప్రాయము. ఏలయన గ్రాంథిక భాషాపదములనే కొన్ని కొన్ని మనమాటలం దుపయోగించు కొను చున్నాము, మాటలలోని యీమార్పులనునవి వ్యాకరణజ్ఞానశూన్యత్వముచేతను, బలుకుబడిలోని లొందరచేతను, నిజమైన యుచ్చారణము తెలియకపోవుటచేతను మఱికొన్ని యితరకారణములచేతను గలుగుచున్నవి. శబ్దములలోని యీదోషములు మనదోషములవలననే గలిగినవి. ఇట్టిదోషము లుత్తమనచనగ్రంథములలో వర్జింపవలసిన దని యూనివర్సిటీవారు ద్రావిడభాషాసందర్భమున నిట్లు తీర్మానించిరి. That slang and other similar irregular forms of expression which are either the result of violation of accepted rules of grammar or are produced by means of Contractions or other Modifications due to hurry, indifference and ignorance be declared to be unacceptable in dignified prose Composition. ఇట్టి దుష్టరూపములు పదములకుఁ బూర్వోత్తరోదాహృత కారణములవలన వచ్చియున్నంత మాత్రముచేత నీశబ్దములు పూర్వశబ్దములకంటె భిన్నము లని చెప్పఁదగదు. అట్లు చెప్పుట మిక్కిలి యప్రాజ్ఞత. పంతులుగారి యీమాటలను ప్రాజ్ఞు లెవ్వరు కాదనఁజాలరు.

“కావున సంభాషణములోని శబ్దములన్నియు గ్రాంథికశబ్దములే యని యొప్పుకొనకతీరదు. కాని యవి కొందఱ మనుజుల

దంతముల క్రిందఁబడి నలఁగినవి; తెగినవి; సాగినవి; చప్పఁబడినవి. కానిండు; ఎటులైన గ్రాంధికశబ్దము లే. ఇట్టి దుర్దశనందినట్టి గ్రాంథిక భాషనే మనము సంభాషణములో నుపయోగించుచున్నాము. ఏదీ ఒక్క తెలుఁగుపదము గ్రాంథికభాషలో లేనిది, గ్రామ్యభాషలో నున్నది, మీరు చెప్పఁగలరేమో యోజించుకొనుఁడు. అట్లుండుటకు సాధ్యమెట్లున్నది? కావున సంభాషణములో నుపయోగించుకొను చున్న భాష గ్రాంథికభాష. చెడిన గ్రాంథికభాష—దురవస్థనందిన గ్రాంథిక భాషయైయున్నది.

గ్రాంథికభాషలోని పదములే మాటే వ్యవహారములోనికి వచ్చిన వనుటకు భారత భాగవత రామాయణములనుండి పద్యముల నుదహరించుచు, వారికిందివాక్యములను సైతే ముదాహరించి యున్నారు.

"బొబ్బిలిపాట బజారులో విని మాయింటి పక్కనుండి వారి యిండ్లకుఁ బోవుచు నిద్దఱిట్లనుకొనుచుండిరి. 'ఇజానగరం రాజు నూ మోసం చేసాడ్రి. బూసీతో యేకమై పండంటి బొబ్బిలోరిని పాడుచేసాడ్రి' యని యొక్కడనఁగ 'బొబ్బిలోరు -బొబ్బిలోరంటే నాకు బోదపల్లే దెవర్రి? యని యింకొకఁడనెను. అంత మొదటి వాడు 'రామేణమంతా యిని రావుఁడికి చీత యేంవొచ్చిన్నట్టుందిరా? బొబ్బిలోరనగ మఱిగల్తే మనవో రెలమోరేరా? శెన్నపట్టమాయన్ని మనపెద్దరాజుగారు దత్తుచేసుకొన్నట్టే బొబ్బిలిరాజుగారు మనరాజు గారి తాతగారిని గబోలాగ్రి" దత్తుచేసికొన్నారు. ఇది తాతల్నాటి కత' యని పలికెను. ఈసంభాషణములోని పదములు గ్రాంథిక పదములు కావా? పరమమూఢులు సహితము గ్రాంథికభాషాపదములనే యుప యోగపఱచుకొనుచున్నారు. తప్పుగ నుపయోగపఱచుటకు వారి మౌఢ్యమే కారణము. తప్పుగనో యొప్పుగనో పండితులు పామరులు

నందఱు కూడ గ్రాంథిక భాషా పదములనే యుపయోగించుకొనక తప్పదు."

పంతులుగారు గ్రాంథికభాషలోనే రచన సాగింపవలయునని తెలుపుటకు మఱికొన్ని వాక్యములు పలికినారు. అవి పరికింపదగినవి. "మనసులోని గంభీరాభిప్రాయములను వెల్లడింపవలయు ననిన గ్రాంథికభాషకంటె మఱియొకదారిలేదు. మాటాడుకొనుభాషలో ననఁగ గ్రామ్యభాషలో నేమంత పదజాల మున్నది? ఆహారనిద్రాసంగమ విషయకాభిప్రాయముల వెల్లడించుటకుఁ దగినకొన్నిమాటలే కాని యంతకంటె నెక్కువమాట లెక్కడివి? రాజసేవార్హములైన మాటలేవి? సభాసమర్హములైనమాట లేవి? దేవప్రార్థనాదికార్యార్హములైన మాటలేవి? మతవిషయకము లగు మాటలేవి? నీతి ప్రతిపాదకము లగుమాటలేవి? బహిఃప్రపంచిక బోధకము లగుమాట లేవి? అంతరప్రపంచక జ్ఞానబోధకము లగుమాటలేవి? కూటిగుడ్డ మాటలతోనే గుడుగుడుగుంచము లాడఁదగిన గ్రామ్యభాషలో వేల కొలఁది గ్రాంధికభాషాపదములను వాడుకొనుచు, గ్రాంథికభాష వాడుకలో లేదనుట వింతగనున్నది-" ఇది సర్వథా తథ్యమే. సభ్యమైన యుదాత్తమైన విషయమును వ్యక్తముచేయుటకు, గ్రాంథిక భాష నుపయోగింపకతప్పదు. ఆధ్యాత్మికవిషయములను ప్రబోధింపవలయుననిన దానికి సరిపడినపదజాలము లోకులు మాటాడుకొను భాషలో లభించుటెట్లు? కేవలము ఆహారనిద్రాభయసంగమములకు మాత్రమే సంబంధించిన విషయములను మించి, యితరవిషయములకు సంబంధించిన చమత్కారజనకమైన రచన సాగింపవలయునన్నను, వైజ్ఞానిక విషయములను నిరూపింపవలయునని నను గ్రాంథికభాషా పదజాలము నాశ్రయింపకతప్పదు.

Natural laws వలనఁ గలిగిన శాస్త్రీయ స్వరూపములు

లోకవ్యవహారములోని పదములు అని గ్రాహ్యవాదులు చెప్పునవేమో యది యజ్ఞతాది దోషములవలనఁ గలిగినతప్పులని మేము చెప్పుదుము. "Natural laws" అను పదము మిక్కిలిస్థూలమైనది. అవి రెండు విధములు. బాహ్య ప్రపంచములోఁ జేరినవి అంతర ప్రపంచములోఁ జేరినవి. గ్రహాదుల యాకర్షణశక్తి మొదలగునవి బాహ్యప్రపంచ ములోఁ జేరినవి. సర్వరక్షణశక్తి మొదలగునవి యాంతర ప్రపంచ ములోఁ జేరినవి. మొదటివానినిగూర్చి విచారణము మనకిప్పు డక్కఱ లేదు. ఆంతర ప్రపంచతత్త్వమును బాగుగఁ బరిశీలించినయెడలఁ గేవల మన్యోన్యవిరోధముగల రెండువిధములగు శక్తులు దానిలోఁ గనఁబడుచున్నవి. 'Emotion' (హృదయానుభవము) సంబంధమగు శక్తి యొకటి; Intallact (జ్ఞాన) సంబంధమగు శక్తి యొకటి. మొదటి దానికి సంబంధించిన Natural laws (స్వాభావిక శాసన ములు) కొన్ని యున్నవి. రెండవదాని కిసంబంధించినవి కొన్నియున్నవి. Emotion తో సంబంధించిన శాసనములు మనుజుని యాముష్మిక సుఖమున కెగలాగుచుండును. రూపవతి యగుకాంతను జూచినపుడు మనుజునకు దానిపై నపేక్ష పుట్టించునది. Emotionతో సంబంధించిన శాసనమై యున్నది. పరస్త్రీవాంఛ పాపమనియు నింద్రియనిరోధ మొనర్చినఁగాని యాత్మ కుత్తమగతి గలుగదనియు బోధించి, మన మనసున కైహికవైరాగ్య మిచ్చునది Intellect తోఁజేరిన శాసనమై యున్నది. మొదటిది మనపూర్వతత్వమగు పశుత్వమునకై పడలాగు చుండఁగ, రెండవది మనపరతత్త్వమగు దైవత్వమున కెగఁదోయు చుండును. రెండును స్వాభావిక శాసనములే. Natural laws మను జుఁడు వేశ్యాదాసాధముఁడగుటయు వేదాంత శిఖామణి యగుటయు Natural laws ప్రకారమే. న్యాయాధిపతియగుటయు Natural laws ప్రకారమే; వానిచే మరణదండనము నొందు మనుజఘాతకుఁ డగుటయు

atural laws ప్రకారమే తస్కరాధముఁడగుటయు Natural
ws ప్రకారమే. పరబ్రహ్మమగుటయు Natural laws ప్రకారమే.
రహంతయగుటయు Natural laws ప్రకారమే. కాని వేశ్యా
సుని జనులు తిట్టుచున్నారు. వేదాంతిని స్తుతించుచున్నారు.
్యాగిని గౌరవించుచున్నారు. తస్కరుని శిక్షించుచున్నారు. న్యాయ
ర్తను మన్నించుచున్నారు. నరహంతను బూతులు తిట్టుచున్నారు.
టులనే Natural laws వలనఁ గలిగిన శబ్దములలో నుత్తమములగు
నిని గ్రంథార్హములని గ్రంథకర్తలు గ్రహించుచున్నారు. కొన్ని
ని నిందార్హములని పరిత్యజించుచున్నారు. కావున Natural laws
లనఁ గలిగిన వనుకారణముచే నన్నిశబ్దములు శాస్త్రీయములని దోష
హితములని గ్రాంధికభాషాపరిగ్రహణ యోగ్యములని వాదించు
్రిమ్యవాదులవాదము హాస్యాస్పదము.

ఈ తీరుగ పానుగంటివారు 'గ్రామ్యవాదుల భాషావాదము'
ను వ్యాసములో వ్యావహారికవాదులు తెలిపెడియుక్తులను ఉపపత్తు
ను సహేతుకముగ విమర్శించియున్నారు. గ్రాంధికభాషకు వికృతి
పములే వ్యావహారికపదములను విషయము పాతంజల మహా
ష్యమునందలి యీ క్రింది వాక్యములనుబట్టి కూడ సమన్వితా
గును. వ్యాకరణాధ్యయమునకు ప్రయోజనములు నిరూపించునపుడు
ందిశ్రుతివాక్య ముదాహృతమైనది.

> యస్తు ప్రయుఙ్క్తే కుశలో విశేషే
> శబ్దాన్యథావద్వ్యవహారకాలే,
> సోఽనన్తమాప్నోతి జయం పరత్ర
> వాగ్యోగవిద్దుష్యతి చాపశబ్దైః.

ఈ వాక్యములను కర్థమును పతంజలి మహర్షి యిట్లు వివ
చియున్నాఁడు. "యోహి శబ్దాన్ జానాత్యపశబ్దానప్యసౌ జానాతి.

యస్త్వేవహి శబ్దజ్ఞానే ధర్మః, ఏవమపశబ్దజ్ఞానేఽప్యధర్మః. అథవా భూయానధర్మః ప్రాప్నోతి. భూయాంసోఽపశబ్దాః అల్పీయాంసః శబ్దా ఇతి. ఏకైకస్యహి శబ్దస్య బహవోఽపభ్రంశాః.తద్యథా గౌరి త్యస్య శబ్దస్య గావీ గోణీ గోతా గోపోతలికేత్యాదయో బహవోఽపభ్రంశాః. అథయోఽవాగ్యోగవిత్,అజ్ఞానం తస్య శరణమ్".

ఎవ్వనికి సాధుశబ్దములు తెలియునో, వాని కపశబ్దములును తెలియును. సాధుశబ్దజ్ఞానమువలన ధర్మము లభించినట్లే, అపశబ్దజ్ఞానము వలన నధర్మమును లభించును. లేదా, అధర్మమే యెక్కువ ప్రాప్తించు ననవలెను. లోకవ్యవహారములో నపశబ్దములే హెచ్చుగను, సాధు శబ్దములు తక్కువగను నుండును. ఒక్కొక్క సాధుశబ్దమునకు అప భ్రంశరూపము లనేకము లుండును. 'గౌః' అను సాధుశబ్దమునకు గావీ,గోణీ గోతా,గోపోతలికా మొదలుగు నెన్ని యోయీశబ్దమునకుఁ గల యపభ్రంశ శబ్దములు. వ్యాకరణశాస్త్రపరిజ్ఞానము లేక, ప్రకృతి ప్రత్యయ విభాగజ్ఞాన పూర్వకమయిన యర్థవిశేషపరత్వము నెఱుఁ గని వానికజ్ఞానమే శరణము ఈ విషయమున హరి యిట్లనియున్నాఁడు:

అర్థప్రవృత్తి తత్త్వానాం శబ్దా ఏవ నిబన్ధనమ్,
తత్త్వావబోధశ్శబ్దానాం నాస్తి వ్యాకరణాదృతే.

శబ్దమునుండి అర్థము తెలియవచ్చుటకు హేతుభూతములయిన జాత్యాదితత్త్వములకు శబ్దములే యాలంబనములు. వ్యాకరణజ్ఞానము లేనిదే శబ్దములతత్త్వము తెలియదు అని యీకారికభావము. అర్థావ బోధ పురస్కృతమైన సాధుశబ్దజ్ఞానమునకు వ్యాకరణశాస్త్రాధ్యయన మత్యావశ్యకమని యీ వాక్యముల తాత్పర్యము.

నేఁటి కేఁబదిసంవత్సరముల క్రిందటివఱకు ధర్మాధర్మపరిజ్ఞా నము, ధర్మాచరణతత్పరత భారతదేశీయులలోఁ జాలమంది కుండె డిది. మనోవాక్కాయకర్మలచే ధర్మాచరణముగావింపవలె నని

అధర్మము నాచరింపరాదని నిశ్చయజ్ఞాన ముండెడిది. అది నడల నంతవఱకు విద్యాబుద్ధులు నేర్చువారందఱు ప్రాచీనార్ష సంప్రదాయ పరిక్షుణ్ణమైన మార్గమునే యవలంబించెడివారు. ధార్మికకృత్యములలో వ్యాకరణశుద్ధములైన సాధుశబ్దములనేగాని, సంస్కృతశబ్దముల కప భ్రంశరూపములయిన ప్రాకృతాదిలోక వ్యవహారోపయోగిపదముల నుపయోగించు పరిపాటి లేదు. దేవతాప్రార్థనాదికమునకై వేదోక్త మంత్రములనే యుపయోగించుచుండెడివారు.

పురాణోక్తవిషయములు వేదతుల్యములేగావున, వానిని, వానితో సమకక్ష్యమైన వానిని దేవతారాధనాదికార్యములం దుపయో గించెడివారు. ప్రాచీనకాలమందలి ఋషులు తమతపశ్శక్తిచే యోగ మును సాధించి, తన్మూలమున వివిధవిజ్ఞానములను సముపార్జించి వివిధ శాస్త్రసిద్ధాంతములను ధర్మానుగతముగసుసంస్కృతమై వైదికశబ్దసమ కక్ష్యమైన శబ్దములతో నిరూపించియున్నారు. పురాణానువాదముతో ఆంధ్రభాషాస్వరూపమును దీర్చిదిద్దుటకుఁ దలపెట్టిన నన్నయభట్టార కుఁడు, సంస్కృతవ్యాకరణానుసారియైన ప్రాకృతాపభ్రంశ భాషానియ మములకు సరిపడునట్టి పద్ధతిలో ధర్మానుగతముగనే భారతానువాద మును సాగించినాఁడు. అట్టి ధర్మానుసంధానయోగ్యమైన భాషానిబం ధనములను దెలియవలయు ననిన, ప్రాచీనులై ఋషితుల్యులైన నన్న యాదుల ధార్మికదృష్టి నవగతము చేసికొన వలయునుగదా! అది లేకుండ నేది సాధుశబ్దమో, యేది యసాధుశబ్దమో తెలియుటయే కష్టము. ఋషితుల్యులయిన నన్నయాదులు గ్రంథములం దుపయోగించిన శబ్దములు సాధుశబ్దములనుట నెవ్వరును గాదనఁజాలరు. ఆ శబ్దముల నట్టులే యుచ్చరింపలేనివారు, ఆయాశబ్దములకే యనేకములయిన యపభ్రంశరూపములను గల్పించి వ్యవహారములో నుపయోగింతురు.

ఇట్టి యపభ్రంశరూపములు సాధుశబ్దములు కాఁజాలవు గనుక,

వానిని గ్రంథములం దుపయోగింపరా దనుట, పతంజలి భాష్యోపదిష్ట మార్గమున నధర్మము నాచరించుటయే యగును. అందువలననే సంస్కృతభాషా సంప్రదాయములను బాగుగ నెఱిగినవా రెవ్వరును, సంస్కృతభాషావ్యాకరణ విరుద్ధము లయిన పదములనుగాని, ఆంధ్ర భాషావ్యాకరణవిరుద్ధ మయినపదములనుగాని యుపయోగించుటకు బుద్ధిపూర్వకముగఁ బాల్పడరు. ఏ భాషలోనయిన లక్షణము నుల్లం ఘించుట అధర్మసంపాదక మని, వారినిశ్చయము. భ్రమప్రమాద ములచేత నే చోటనయిన లక్షణవిరుద్ధములయిన పదప్రయోగములు దొరలిన నవి బుద్ధిపూర్వకములు గావు. లక్షణవిరుద్ధముగ రచనము సాగించుట నైహికముగను నాముష్మికముగను ననర్థదాయక మని యాస్తికులనిశ్చయము.

మీఁదఁ దెలిపినపతంజలి మహర్షి వాక్యములను బర్యాలోచ నము చేసిన, లోక వేదప్రయుక్తమయిన సాధుశబ్దముల కపభ్రంశరూ పము లనేకములు పుట్టినట్టులు, సంస్కృతాపభ్రంశరూపములై దేశ్య శబ్దముల నేకములు పుట్టినపుడు, ప్రాచీనకవులు లక్షణయుక్తముగ గ్రంథములం దుపయోగించినసాధుశబ్దములను రచనలయం దుపయో గించుట భావ్యమగును గాని, గ్రాంథికశబ్దముల కపభ్రంశరూపములై అననుగతమైన వ్యావహారికశబ్దములను రచనలం దుపయోగించుట సంభావ్యము కాదని తెలియవచ్చుచున్నది. పంతులుగా రీవిషయ మును గ్రామ్యభాషాపవాదము అనువ్యాసమున ప్రతిపక్షులు చేయు శంకలను సైతము ద్భావించి సమాధానములను విపులముగ నిచ్చి యున్నారు. గ్రంథవిస్తర భీతిచే విరమించుచున్నాను. పాశ్చాత్త్యులు భారతదేశపాలకులుగా వచ్చి, మనదేశభాషలను గొంతగ నభ్యసించి, వారి భాషాప్రభావము, వారి సంస్కారములు భారతీయులలోఁ బ్రవే శించుటకు, వారి చెప్పుచేతలలో మన ముండుటకు ఆర్యద్రావిడ

విభాగమును ముందుగఁ బ్రవేశపెట్టి, యా వెనుక భాషావిషయమునఁ గూడ నా విభేదమును బ్రవేశపెట్టి, వారి నిర్ణయముల నుత్తమములని మనము భావించునట్లు చేసినారు. రాజకీయవ్యవహారములందుపయోగించిన భేదోపాయమే భాషావిషయములందును బ్రవేశించినది. మనప్రాచీనార్ష సంప్రదాయానుగతమైననిర్ణయమునుబట్టి చూచిన దేశభాషలన్నియు సంస్కృత ప్రాకృతాపభ్రంశరూపములే. ఆయా భాషావిపరిణామములనుగూర్చి మనవారు తెలిపిన సిద్ధాంతములను సమన్వయింపవలెనను దృష్టి దూరముచేయుటయే. వారిరచనలన్నిటికి ప్రధానలక్ష్యము. మతవిషయమునను చారిత్రక విషయములందును, భాషావిషయములందును వారేర్పఱిచిన సిద్ధాంతములకు మనము గట్టుబడియుండునట్లును, వారినిర్ణయము లుత్తమములని మనము భావించునట్లు ప్రతివిషయమును వారు మలచిపెట్టినారు. తత్ఫలితమే మన కీనాఁడు ప్రతివిషయమునను మనప్రాచీనులు చేసిన నిర్ణయములు పసిగాలే వనుకొనుట; వాని నేవగించుకొనుటయును. మన ప్రాచీన సంప్రదాయములను ముందుగ క్షుణ్ణముగాఁ దెలిసికొని, పాశ్చాత్యులు ప్రవేశపెట్టిన విమర్శనమార్గమును మలచుకొని, క్రొత్తవిషయములను మనవారి కందఁజేయుట భావ్యమని పానుగంటివారడుగడుగునఁ దెలుపుచునే వచ్చినారు. మనప్రాచీనవ్యాకరణకర్తలందఱు తెలుఁగు భాష సంస్కృత ప్రాకృతజన్య మని చెప్పుచుండఁగా, వారిమాటలెంతవఱకు సరిపడునో చూడకయే, కాల్డ్వెలు దొరగారు తెలిపిన క్రమమున తెలుఁగు ద్రావిడభాషాజన్యమని మన మేల యంగీకరింపవలయును? కాల్డ్వెలుగారి సిద్ధాంతము నొక ప్రక్కకుఁ బెట్టి సంస్కృత ప్రాకృత వ్యాకరణములను క్షుణ్ణముగాఁ దెలిసికొని, యీనాఁడు ప్రాచీనమార్గానుసారముగ భాషాచరిత్రమును వ్రాయఁ బూనినవారేరి? నన్నయాది వ్యాకర్తల సిద్ధాంతములు నమ్మువారు మూఢనమ్మకముగలవారనుకొనునప్పుడు, కాల్డ్వెలు దొరగారి సిద్ధాంతములు నమ్మువారు నట్టివారే యగుదురు. ఆధునిక సంప్రదాయములు ప్రాచీనులకుఁ దెలియ వనుకొనిన, ప్రాచీన సంప్రదా

యము లాధునికులకు నట్లే తెలియవు. రెండింటిని దెలియఁ గలిగినవారుండిన వారు తెలిసికొనుటకు యత్నించుట లేదు. ఆస్తిక్యము దూరమై, యార్థికమైన యారాట మెక్కువగుట కూడ నిట్టి సద్విమర్శనము సాగకుండుటకు మూలముగఁ దోఁచుచున్నది. పంతులుగారి కాలములో నర్థార్జనమున కింతటి యారాటము లేదు గావున నిట్టి భాషావాదములు సాగినవి. ఆనాఁటి వారు కొంతయైన శ్రమించి విషయమెఱిఁగి విమర్శనములు సాగించినారు. ఈనాఁటివా రేపాటియు పరిశ్రమము సాగింపకుండఁగనే, ప్రతివిషయమునను నియమపరిత్యాగమునకుఁ బాల్పడువారైనారు. అట్టివారు పంతులుగారి రచనల నన్నిటిని సౌహార్దముతోఁ జదివిన గ్రాంథికమార్గము నే యవలంబింపఁ గల రని చెప్పవచ్చును. చదివియు నట్లు చేయనివా రుండిన నది వారి యదృష్టము.

ఆంధ్రసాహిత్యపరిషదేకాదశ వార్షికోత్సవసభ కధ్యక్షులుగా నుండి పంతులు గారు గావించిన యుపన్యాసము ఆంధ్రసరస్వతీ సమారాధన రూపమైనది. వారి రచనలన్నిటిలో నది యమూల్యమైనది. ఆంధ్రభాషాసముద్ధారమున కత్యావశ్యకములయిన మార్గములనన్నిటిని వారందు నిర్దేశించియున్నారు. మాతృభాషాభిమానము గల యాంధ్రుల కందఱకు సర్వదామననముచేసి యాచరణమునం దుంచుకొనఁదగినవందలి వాక్యములు తదుపదిష్టమార్గములన్నియు ఆంధ్రభాషాభివృద్ధి నాకాంక్షించు వారి హృదయములలోఁ బదిలపఱుపఁదగిన యమూల్య భావరత్నములందుఁ బ్రతిఫలించును. ఈ యుపన్యాసములోఁ నెన్నియో సాంకేతిక విషయములు సైత మున్నవి. ఆహ్వానించువారెట్టి వారెట్టివారు ఆంధ్రభాషాపోషకులు, నాంధ్రభాషాకోవిదులు, నాంధ్రభోజ బిరుదార్హులు నగు నీ మహారాజుగారు ఆహ్వానింపఁబడినదేది ? అన్ని దేశభాషలలో నమృతాధిక మాధురీధురీణ యని యేభాష యాచంద్రార్కఖ్యాతిగాంచినదో, యేభాషామతల్లిని సేవించుటచే రాజరాజనరేంద్రుఁడు మనయందఱయిండ్లలో దేవతార్చన వేదికలపై దివ్యమూర్తులతోపాటు పూజనందుచున్నాఁడో, యే

భాషాయోష నభ్యర్చించుటచేఁ గృష్ణదేవరాయల యశస్సింహాసన మష్టదిగ్గజములు వహించుచున్నవో యట్టి యాంధ్రభాషాదేవిని సేవించుట కేర్పాటుకాఁబడిన సాహిత్యపరిషత్తు." ఇత్యాదికమైన ప్రారంభ వాక్యములందే పీఠికాపురాధీశ్వరుల భాషాసేవానిరతిని ఆంధ్రసాహిత్య పరిషత్తు కావించు భాషోద్ధార విషయమును ప్రతిపాదించినారు. పీఠాపురప్రశస్తిని గూర్చి తెలుపుచు. దగ్గఱగనుండిన కందరాడలో పావులూరి మల్లన చంద్రం పాలెములో కూచిమంచి తిమ్మనయుండుటయే పీఠికాపురము పాదగయాక్షేత్రమై శివకేశవ సన్నిధానమునఁ బవిత్రమైనది. అష్టాదశమహాపీఠములలో నిదియొకటి. మహాకవి నిలయమగుటచే రక్తికి, మహారాజాస్థానమగుటచే భుక్తికి, మాధవ మహాక్షేత్రమగుటచే ముక్తికి నిదానమైన యీపుర మాంధ్రదేశ మహిళామతల్లి కంఠమాలానాయకమణియై ప్రకాశించుచున్నదని నిరూపించి యున్నారు.

మహారాజమందిరమును గూర్చి వివరించుచు-"సంగీత సాహిత్య సుప్రసిద్ధుఁడగు కవివర్యుని యనేకచిత్ర విచిత్రార్థ ప్రతిపాదనయుక్తమయిన వసుచరిత్ర సంగీత పురాణపఠనము జరిగినదీ సభయందే. సర్వకామదకుఁ బరిణయమొందుకోయి యని రామభక్తుఁడైన లక్ష్మణుఁడు కృష్ణమూర్తిని బరిహసించినదీ సభయందే." యనినారు. శిష్టు కృష్ణమూర్తి కవిగారు వసుచరిత్రలోని పద్యములు వీణమీఁదఁ బలికించి పురాణపఠనము చేయుట, శిష్టు కృష్ణమూర్తి పిండిప్రోలు లక్ష్మణ కవుల వివాదము జరుగుట యందు సూచితములయినవి. ఈ పనులు జరిగినది గంగాధర రామారావుగారి యాస్థానిలో బులుసు వారింటఁ బుట్టిన విద్యారణ్యుఁడు (వేదార్థప్రతిపాదకులయిన బులుసు పాపయ్యశాస్త్రిగారు) ముప్పది రెండు పుట్ల రత్నగర్భను రామార్పణముగ గ్రహించిన దీసభయందే నవీన గౌతములు నర్వాచీన పాణినులు నూతన బాదరాయణులు విజయదశమినాఁడు మామహారాజేంద్రుని పై వారిపుత్ర పౌత్రికాసంతతిపై నాశీః ప్రవృష్టిఁ గురియించుచున్నదీ సభయందే. పిఠాపురాస్థానమున తర్క-వ్యాకరణ వేదాంతశాస్త్రముల

కేఁగుటను. బరిశోర్థులు వచ్చుట, విజయదశమినాఁడు. వారిని సత్కరించి యాశీర్వదించుట యిచట సూచితము.

ఆస్థాన వైణికాగ్రగణ్య(శ్రీయుత రాడ సంగమేశ్వరశాస్త్రిగారి) వీణారవామృతాస్వాదనావశములైన చిలుకలు కూడ స్తంభోపరి విటంకంబులనుండి సహవైఖరిని 'రానూ' యని యనఁబోయి, సంగీత వైఖరిని 'రీమూ' యని యనుచున్నదీ సభయందే. సంగమేశ్వరశాస్త్రి గారి వీణావాదన పాభవమట్టిదియేయని యానాఁటి వారి నిశ్చయము.

ఆంధ్రశారదాదేవి దర్శనము నీ క్రింది విధముగఁ జేయించి యున్నారు. అనేక సహస్ర చంద్రమండల సన్నిభమైన యాస్యమండపము వీణాదండమువంక రవంత యొఱగియున్నది. ... ఆహా! అదిగో గుడివైపున రాజరాజనరేంద్రుఁడు, నెడమవైపునఁ గృష్ణదేవరాయలు వింజామరములు చేతఁబుచ్చుకొని యెట్లు వీచోపులిడుచున్నారో! అదిగో! ఆ పీఠము మొదటఁ బీతాంబరము నడికట్టుతో నిలువఁబడి దేవికిఁ బారిజాతపుష్పములతోఁ బూజలొనర్చుచున్న యా పారోహిత్య బ్రాహ్మణుఁడెవరో యెఱుఁగుదురా? నన్నయ భట్టారకుఁడు అదిగో! ఒక్క చింతాకంత వాసి-క్రిందుగ నిలువఁబడిన యాకుండలాలంకృతసోమయాజి కప్పురపుటారతి పళ్లెరము చేతఁ బుచ్చుకొని మహావాక్ః నీరజాసననీరజపత్రాక్షికి నివాళులిచ్చుచున్నాఁడే. (తిక్కన సోమయాజి) మఱియొక బెత్తెడు క్రింద పురోహితుని యంత పొట్టియుఁ గాక, సోమయాజియంత సొగయుఁగాక మట్టసపు మాదిరిగ నున్న మంత్రిశిఖామణి మహాలక్ష్మీదేవి కోడలని మందాకినీ సలిపపు గిండి దోసిటఁ బట్టుకొని సేవించుచున్నాఁడే! ఆర్యులారా! చూచుచున్నారా? (ఎఱ్ఱాప్రెగడ.) ఈవిధముగ నాంధ్రసరస్వతీ సమారాధనముగావించిన ధన్యమూర్తులు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.



# పానుగంటివారి నర్మదా పురుకుత్సీయము

శ్రీ బండారు తమ్మయ్య.

సుప్రసిద్ధ నాటకకర్తలగు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు ఆంధ్రమున రచించిన నాటకములు ముద్రితాముద్రితములు రమారమి ముప్పదికిఁ బైగనున్నవని తెలియుచున్నది. వీనిలో వీరు ప్రప్రథమమున 1900 సంవత్సరములోఁ దమ ముప్పదియైదవ యేట రచించినది నర్మదాపురుకుత్సీయము. శ్రీనాథకవి సార్వభౌముఁడు "సంతరించితి నిండుజవ్వనంబునయందుఁ హర్షనైషధ కావ్యమాంధ్రభాష" యని చెప్పినట్లు వీరు దీనిని నిండు జవ్వనముననే రచించిరి. 1900 సంవత్సరము ఏప్రియలు 27 తేదిని ప్రారంభించి మెయి 26 తేదికి దీనిని ముగించితిమని వీరు పీఠికలో వ్రాసికొనిరి. "నాటకాంతం కవిత్వమ్" అని మన పెద్దలయాభాణకము కాని తమ యప్రతిమప్రతిభావ్యుత్పత్తులచేఁ బంతులుగారు "నాటకారంభం కవిత్వమ్"అనునట్లు మునుముందేయీప్రౌఢనాటకరచనమునకుఁబూనుకొనియతిసమర్థముగ నిర్వహించిరి. ఇది శృంగారరసప్రధానమయిన నాటకము. దీనికిముందు వీరురచించినగద్యపద్యకృతులేమయిననున్నవో లేదో తెలియదు. పంతులుగారి రచనలో సాధారణముగ నప్రయత్నముగ ననుస్యూతముగ హాస్యరసముగూడ సరసముగ వెల్లివిరియుట సహజము. కాఁగా నీప్రాథమిక నాటకమునందుఁ బ్రధానరసమయిన శృంగారమునకుఁ దోడుగా హాస్యాద్భుతకరుణారసములుగూడ నంగములుగఁ జేరినవి. పురుకుత్సుఁడు భరతఖండమును బరిపాలించిన పూర్వ చక్రవర్తులలో నొకఁడు. అతఁడు సుమతియను పట్టమహిషివలన సంతానమును బడయక సంతానార్థమై నర్మదయను నురగకన్యను వివాహమగుట యందలి యితివృత్తము. ఆంధ్రభాగవతములో పురుకుత్సచక్రవర్తినిగూర్చి రెండువంక్తులకంటె నెక్కువగ వ్రాయఁబడియుండకపోవుటచేఁ గొంతకథ కల్పింపవలసివచ్చినదని పంతులుగారీ

నాటకముయొక్క పీఠికలోఁ దెలిపియున్నారు. భాగవతము నవమస్కంధములో ఇక్ష్వాకువంశానుక్రమములో మాంధాతృ చరిత్రమునందం తర్గతముగ ... "మాంధాత రెండవకొడుకు పురుకుత్సుఁడు. అతని నర్మదా లోకమునకుఁ గొనిపోయి భుజంగకుమారులు తమ చెల్లెలగు నర్మదయను కన్యకను వివాహము చేసిరి. పురుకుత్సుఁడును నక్కడ ననేక గంధర్వనాయకులవధించి తన నాగలోకసంచరణంబు దలంచువారికి నురగభయంబు లేకుండ వరంబువడసి తిరిగివచ్చెను" అను వాక్యములు నాకుఁ గానవచ్చినవి. పంతులుగారుదాహరించిన యీ స్వల్ప చరిత్రమిదియేయని తలంతును. పదిమెుల్గున్నయు అయిదు అంకములలో రచితమైన యీ నాటకముదలి కథ చాలవఱకుఁ బంతులుగారు స్వయముగఁ గల్పించినదనియే మనము తలంపనగును.

పాత్రసంభాషణములను చాకచక్యముతోఁ గూడిన వాక్యోప వాక్యరచనములతో సముచితముగఁ గూర్చి సాగించుటలో వీరు చాల నిపుణులు. షేక్స్పియరు ప్రతిభ నీవిషయమున వీరు చాలవఱకుఁ బడికిపుచ్చుకొన్నట్లు గోచరించును. ఆంగ్లమున నాటకరచనమునకు ముఖ్యముగా Blank verse అనుకూలముగ నుండునని తలంచి షేక్స్పియరు మహాకవి దానినే యెక్కువగఁ దననాటకములలోఁ గయికొనినాఁడు. అట్లే యాంధ్రభాషలో తేటగీతి,ఆటవెలఁది,సీసము, కందమునను జాతిచ్ఛందము లే నాటకరచనమునం దుపయోగకరము లనియెంచి యీప్రథమ నాటకమునందే పంతులుగారాధక్కి నామోదించి యాలంబించినారు. "ఉపమా కాళిదాసస్య" అనుసూక్తి గీర్వాణ వాఙ్మయమున సుప్రసిద్ధము. ఉపమాలంకారము కాళిదాసునకువలెనే శ్రీ లక్ష్మీనరసింహరావు పంతులుగారికిని గడంగడుఁ బ్రియమయినది. అందుచే నీప్రాథమిక నాటకమునందే వారు నూటికిఁ దొంబదిపద్యములలో దానిని గీతపద్యములందలి మొదటి రెండు

పాదములందుఁ జేర్పఁబడిన విషయములకు దృష్టాంతపూర్వకముగఁ దక్కిన మూఁడువ్రాఁగు పాదములలోఁ జక్కఁగ సరిపడునట్టి యుపమలను బ్రయోగించియున్నారు. పైనిఁజెప్పినకారణములచే వీరియీ మొదటినాటకమే పండితమండలి హృదయముల బాగుగ నాకర్షించి వీరికి "ఆంధ్రషేక్స్పియరు" "అభినవకాళిదాస" అనుబిరుదములను ఘటింపఁజేసినది. కాళిదాసు అభిజ్ఞానశాకుంతల నాటకమందలి ఛాయలు కొన్ని స్థూలముగ నీనాటకమందును గోచరింపఁగలవు. జర్మనుదేశ తాత్త్విక కవిశిరోమణి గెటి (Goethe) మహాశయుఁడు శాకుంతలము నాంగ్లానువాదముననే చదివిన యంతమాత్రముననే హర్షోద్రేకమున నాట్యమొనర్చుచు నీక్రింది గీతమును వెలార్చెనని చెప్పుదురు.

"Art thou the young years' blossoms and the fruits
of its decline
Art thou the charm by which the soul is
enraptured, feasted and fed,
Art thou the earth and heaven in one sole name
combine,
I name thee O! Sakuntala! and all at once is said"

శాకుంతలములోఁ బ్రథమాంకముననే దుష్యంతుఁడు కణ్వమహర్షి యాశ్రమపరిసరారణ్యమున వేఁటాడుట కేఁగినసందర్భముననే యాతనికిఁ గథానాయిక శకుంతలతోడి సమాగమము. అతఁడు వెడలిన యనంతర మాతనిగూర్చిన ధ్యానములోఁ బరవశయైయున్నతఱి దూర్వాస మహర్షి శాపమున శామెలోను కాఁగా, పంతులుగారి నాటకములో పురుకుత్సుఁడు విశ్వామిత్రమహర్షి యాశ్రమ సమీపారణ్యములో వేఁటకువచ్చి యచ్చట నొక యశోకవృక్షచ్ఛాయ నధివసిం

చిన యామునీశ్వరుని దుష్టుని చిఱుతపులియని భ్రమించి బాణమునఁ గూల్పఁగా విశ్వామిత్రుఁడు కోపోద్దీపితుఁడయి యధోలోకగతి నొందుమని యాతని శపించినట్లున్నది. శకుంతల వృత్తాంతములో స్వర్గభూలోకములకలయిక యామె జననకారణముననే ఘటిల్లినది. విశ్వామిత్రుని తపోభంగమునకయి మహేంద్రుఁడు స్వర్గమునుండి మేనకాప్సరసను బంపఁగా నామె వలలోఁజిక్కి విశ్వామిత్రుఁడామెకు వశుఁడయి యామెతోఁ గొంతకాలము కాఁపురము చేసి శకుంతలను బడయుట సుప్రసిద్ధమే. గాంధర్వ వివాహానంతరము దుష్యంతుఁడు దూర్వాస శాపకారణమున శకుంతలా వృత్తాంతము విస్మరించి యెప్పటికి నామెను రాజధానికిఁ దీసికొనిపోవుటకు రానందున కణ్వుఁడే శిష్యుల వెంట నామెను దుష్యంతునొద్దకుఁ బంపఁగా నాతఁడామెను దిరస్కరించుట. ఆమె యనాథయై విలపించుతఱి స్వర్గమునుండి యామె జనని మేనక యేతెంచి గగనమార్గమున నామెను గొనిపోయి స్వర్గపరిసరములనున్న మరీచాశ్రమమునఁ జేర్చుట, యచ్చటనే యామె భరతుని ప్రసవించుట, దూర్వాస శాపఫలము తీఱిన తరువాతఁ దాను వివాహసమయమున శకుంతలకొసంగిన యంగుళీయకము జాలరులకుఁ జిక్కినమత్స్యముయొక్క గర్భమున దొరకినప్పుడు దానిని జూడఁగనే కలిగిన యభిజ్ఞానమువలన దుష్యంతుఁడు గతవృత్తాంతమునకెంతయు వగచి శకుంతలకయి విరహవేదన నొందుట, స్వర్గమున మహేంద్రుని సేవించి తిరిగివచ్చునపుడాతనికి శకుంతలాభరతుల సమాగమము లభించుట శాకుంతల నాటకమందలి యద్భుతసన్నివేశములు. నర్మదాపురుకుత్సీయమున విశ్వామిత్ర శాపానంతరము శాపముయొక్క సద్యఃఫలముగనో యనునట్లు ఉరగలోకమునుండి వచ్చిన యంశుమంతునిచే మోహనవిద్యాప్రభావమున వెనువెంటనే

యురగలోకమునకుఁ గొనిపోఁబడి నర్మదోద్యానమున నొక చంద్ర కాంత శిలావేదికపయి శయనింపఁ జేయఁబడుట; అప్పుడు నాయికతో నాతనికి సమాగమము కలిగిన తరువాతఁ గొలఁదికాలమునకే మరల నంశుమంతుఁ డాతనిని భూలోకమునఁ జేర్చుట; పురుకుత్సునిఁ దన చెంతఁగానక నర్మద విరహ భరమునోర్వక చెలియగు నవమాలికతో భూలోకమున కేతెంచి పురుకుత్సుని యుద్యానమున విదూషక సహితుఁడయియున్న యాతనినిగనుంగొని మరల నానందించుచుండఁగా నింద్రునిచే నంపఁబడిన చిత్రకేతుఁడను గంధర్వుఁ డామెను స్వర్గము నకుఁగొనిపోవుట; అనంతరము ఇంద్రుడు పురుకుత్సుని గూడఁదన లోకమునకు నారదమునీంద్రునిఁ బంపి తీసికొనిపోయి; నర్మదా పురుకుత్సుల పరస్పరానురాగము పరీక్షింప విచిత్ర నాటకమాడించుట; ఆపిమ్మట భూలోకమునకు శచీపురందరు లరుదెంచి; నర్మదను వెదకికొనుచువచ్చి పురుకుత్సునితో సమరమునకుఁ దలపడిన యామె తండ్రి మందారుని సమాధానపఱిచి నర్మదాపురుకుత్సుల వివాహము నెఱవేర్చుటయుఁ గలవు. శాకుంతలమున స్వర్గభూలోకముల రెండింటి కలయికయే ఘటిల్లఁగా నర్మదా పురుకుత్సీయమునఁ బంతులుగారు పయివిధముగా స్వర్గమర్త్యపాతాళముల మూఁడింటికలయికను ఘటిల్లఁ జేసిరి. ఇఁక నీ యుపోద్ఘాతము నింతటితోఁ జాలించి నాటకములోని ప్రతియంకమునందలి కథను సంగ్రహముగ వివరించి సమీక్షించి పంతులుగారి రచనా విశేషములఁ గూర్చికొంత ముచ్చటించెదను.

<u>ప్రథమాంకము</u> :— ఉరగలోక పాలకుఁడు మందారుఁడువెండ్లియాడునకువచ్చిన తన కుమారి; సౌందర్యవతియగు నర్మద కనుకూలుఁడగు వరునిఁ గూర్చి పరిణయ మొనరింప నారాటమొందు చుండెను. ఈ సంగతి నెఱింగిన యాతని ప్రధాని అంశుమంతుఁడు తన ప్రభువుతోఁజెప్పక యేనర్మదావరాన్వేషణముకొఱకురగలోకము

నుండియుఁ మహేంద్రుని కొలువుకూటమునకుఁ జెందిన చిత్రకేతుఁడను గంధర్వుఁడు మర్త్యలోక వార్తలను మహేంద్రునకుఁ దెలిపెడికార్యము మీఁద స్వర్గలోకమునుండియు నించుమించుగా నేకకాలముననే భూలోకమున విశ్వామిత్రాశ్రమ పరిసరారణ్య భూమియం దవతరించిరి అడవి యుసిరికాయ యంబుధిలవణములకు వలె నిట్లు వీరిరువుర కాకస్మిక సమావేశము సంఘటిల్లెను. పరస్పర సంభాషణమున "సంబంధమాభాషణ పూర్వమాహుః" అను కాళిదాసు చెప్పినట్లు స్నేహబాంధవ మేర్పడి వారు తాము వచ్చిన ప్రయోజనముల నన్యోన్యమెఱుకపఱచికొనిరి. చిత్రకేతుఁడు తానంతకుమున్నే నర్మదా సౌందర్యమును గుఱించి విని యానందించుచుంటినని యామెకు మర్త్యలోక చక్రవర్తి పురుకుత్సుఁడు తగినవరుఁడు కానగునని యాంశుమంతునికి వచించెను. "నేనెప్పుడాతనిని జూచియుండలేదు. మీరెన్నఁడైనఁ జూచితిరా"? యని యంశుమంతుఁడు ప్రశ్నించును. ఆతఁడొకనాఁడు వేఁటకువచ్చి కరిసంఘముల భంగపఱచినప్పుడు స్వయముగాఁ జూచితినని చిత్రకేతుఁడనును. ఇంతలోఁ దెరలోఁ బెద్ద కలకలము వినవచ్చెను. పురుకుత్స చక్రవర్తియే యీయరణ్యమున వేఁటాడుటకు మరల వచ్చుచున్నట్లు తెలియనయ్యెను. ఆకస్మికముగ నాచక్రవర్తిని గాంచుభాగ్యము కలుగనున్నందుకు అంశుమఁ డానందించెను. తిరస్కరిణీవిద్యాప్రభావమున నొరులకుఁగనరాకుండఁగ నచ్చటివిశేషములను గనుచు వినుచుండుటకు వారిరువురు తలంచిరి. విదూషక సహితుఁడయి పురుకుత్సుఁడచ్చటి విశ్వామిత్రాశ్రమ పరిసరముల వేఁటకేతెంచెను. అచ్చట అశోక వృక్షచ్ఛాయ నధివసించియున్న దుష్పిని గాంచి చిఱుతపులియని భ్రమించి దానిని గూల్ప ధనుస్సున బాణము సంధించెను. ఎందుచేతనో మనస్సు కలతనొందుచున్న దనియుఁ గన్పించునది చిఱుతపులి కాదేమోయనియుఁ బురుకుత్సుఁడు శంకించి వెను

కాఁడఁగా విదూషకుఁడు సంధించిన బాణమును వెనుకకులాగుట ఇక్ష్వాకువంశరాజుల లక్షణముగాదని రాజును హెచ్చరింపఁగా నాతఁడు తొట్రుపాటుతోనే బాణమును విడిచెను. ఆశ్రమ మృగము నెవ్వఁడో కూల్చెనని విని కోపముచే మండిపడుచు విశ్వామిత్రుఁడు "గాధినందను పృథుతపఃకలితశక్తి! కన్నుగానక మదమున నెన్న కెవఁడు కుసుమసుకుమారయగుదీనిపసయడంచెనతఁడధోలోకగతుఁడగునగునుగాక" యనియొసంగిన శాపము తెరలోనే వినవచ్చెను. మృగమును గూల్చినది తనకిష్టసఖుఁడయిన మాంధాత చక్రవర్తి పుత్రుఁడయిన పురుకుత్సచక్రవర్తియే యని తెలిసి విశ్వామిత్రుఁడును మిగులఁ బరితపించును. పురుకుత్సుని యనునయ వాక్యములకు మనసు కరఁగి విశ్వామిత్రుఁడు "వదలిన బాణమును నీవు వెనుకకు నాకర్షింప లేనియట్లు నేనును నాశాపమును మరలిరిప లేను. కాన నధోలోకగతి స్వల్పమయినను దప్పదు ... అధోలోకగతి స్వల్పకాలమయినను దప్పదు. తరువాత నూర్ధ్వలోకమునకుఁ బోయియచ్చట నింద్రాది దేవతలను దర్శించి భూలోకమునకువచ్చి ప్రాణాధికమగు దేవివలన సూర్యసమానుఁడగు పుత్రునిఁగాంచి సుఖింతువు" అని యాశీర్వదించి విశ్వామిత్రుఁడు తరలిపోయెను. మునివరుని తిట్టు దీవెనగాఁ బరిణమించి పురుకుత్సుని నరగలోకమునఁ జేర్చి నర్మదాసమాగమము గలిగించుట కనువు నేర్పఱిచెనని సంతసించి యశుమంతుఁడు మిత్రుఁడగు చిత్రకేతునితో "నేనిపుడే యీరాజును గొనిపోయి నర్మదోద్యాన వనమునఁ జలువఱాతి తిన్నెపయిఁ బరుండఁబెట్టెదను. నర్మదా పురుకుత్సు లన్యోన్య వీక్షణమున మోహావిష్టులయి దంపతు లగుదురుగాక" అని వచించును "తథాస్తు అట్టులైన విశ్వామిత్రుని శాపమిప్పుడే ఫలింపనున్నది కాఁబోలును. మోహనవిద్య నీవు నేర్చిన యెడల తత్ప్రభావమున నీ రాజునకు విదూషకునకు నిద్రగావించి

రాజునుమాత్రము తీసికొనిపొమ్ము" అని చిత్రకేతుఁ డందుకనుమతించెను అంశుమంతుఁడు మోహనవిద్యఁ బ్రయోగించి పురుకుత్సుని విదూషకుని సమ్మోహితులఁజేసి రాజునెత్తికొనుచుండఁగా "భూభరంబు మోయు పురుకుత్సు నీతని! నొకటచేత నెత్తి యుంటివీవు! భూమి మోయు శేషుఁ బోలుపారఁగరకంక! ణముగఁజేయు భూతనాథు కరణి" ఇప్పుడు నీ బాహుబంధమునఁ జిక్కిన యామహారాజునర్మదా బాహుబంధములయందుముందుసుస్థిరముగఁజిక్కుఁగాక! "స్నేహబంధమునకు నే నీవు వేర్వేఱు! తుదలమైతి మీవు పొదలుబర్వు! తోడఁ గ్రిందికేఁగ తోడనేపైఁబోదు! నేచి నీరుతోడు నేతమువలె" అని చిత్రకేతుఁడు వచించుచు "విప్రవర్య లెమ్ములెమ్ము" అని విదూషకుఁదట్టి అంశుమంతుఁడు చిత్రకేతుఁడు నిరువురు తమలోకములకు నిష్క్రమింతురు. నిద్రనుండిలేచిన విదూషకుఁడు తనతోడనే నిద్రించిన చక్రవర్తిని నచ్చటఁగాంచక పరిపరివిధములఁబరితపించుచుఁ బురమునకు మరలిపోవును.

ద్వితీయాంకము :- ఉరగలోకమున నుద్యానవనమున నర్మదయు నామెచెలి నవమాలికయు విహరించుటకువచ్చిరి. వారిపరస్పర సంభాషణములలో నర్మద వివాహ ప్రశంసయువచ్చెను. ఏలోకమువానినైనను దానుమణినే యపేక్షింతునని నర్మద వచించెను. భూలోకముననుండు రాజేంద్రు నెవనినైన వరితువాయని నవమాలికయనఁ జూచి చెప్పవలసినదిగాయనినర్మదయనెను. భగవంతుఁ డనుగ్రహించినశీఘ్రముగాఁ జూతువేమోయని నవమాలిక బదులుచెప్పి, వైరావతముపయి నంబారివలె సమీపమందలి చలువఱాతి తిన్నెపయినేదియో కనవచ్చుచున్నది చూడుమనెను. అదేదియో చూచిరమ్మని నర్మదయన నిరువురముఁ బోవుదము రమ్మని నవమాలిక యనెను. ఎడమతొడ మిక్కిలి యదురుటచే నడువఁ గొంకుచుంటిని. నీవే

బొమ్మని నర్మద నవమాలికతో నన నామె యాశ్చర్యముతో నటఁజని చూచుచుండెను. ఇంతలో నర్మద తనలో "మహాసుందర పురుషుఁడును, అమూల్యమణిగణఖచితభూషణుండును, మహారాజలక్షణలక్షితుండునగు నొకమహానుభావుఁడు నిన్నరాత్రి నాకు స్వప్నమునసాక్షాత్కరించి నడఁకెడు నాకరమున నుంగరమును బెట్టి, ఈ మణికొఱకుసుమా! యీలోకమునకు వచ్చితినని చెప్ప, తంబురతీఁగ నొకకొన మీటు ధ్వనియుఁ గంపమును తీఁగయంతయు వ్యాపించునటు లొడలాపాదమస్తకము ఝల్లుఝల్లుమనఁ గన్నులువిచ్చితిని. శుభస్వప్నమయిన వెంటనే రానియ్యఁగూడని నిదురతనయంతఁదా నెమాయమయ్యెను. హృదయమా! అట్టిమహానుభావు నెన్నఁడైనఁజూచి—"అని వితర్కించుచుండెను. నవమాలిక సంభ్రమముతో వచ్చి "ఎండదగిలిన మృగరాజము చెట్టునీడనున్న పాలఱాతిపలకపైఁబడి నిదురపోవునట్లెవరో కిరీటాంగభూషణుండగు నొక మహాతేజశ్శాలి యాచంద్రకాంత శిలావేదికపయిఁ బరుండి నిదురించుచున్నాఁడు". అని చెప్పెను. ఇరువురును బోయి యాతనిని విలోకించుచుండిరి. అంతలో అంశుమంతుఁడటఁ బ్రవేశించి "మహారాజుపైఁ బ్రవేశపెట్టిన మోహనవిద్య నుపసంహరించుట మఱచియే వెళ్లితిని. ఈసరికి నర్మద యాతనిని జూచినదో లేదో కదా!" అని యటనట పరిశీలించి "ఆహా! మంచిసమయమునకే వచ్చితిని. తిరస్కరిణిచే ప్రచ్ఛన్నుఁడనై యీచిత్రమును జూచెదనుగాక" యని నిలిచియుండెను. నిద్రావస్థలోనున్న రాజునుజూచి నర్మదయు నవమాలికయుఁ బరిపరివిధముల నాలోచించుచుండిరి. తాను స్వప్నమునఁగాంచిన మహాపురుషుఁడచ్చముగ నీతఁడేకానగునని నర్మద వితర్కించి "సఖీ! వీనిమోము చిన్నవోయినట్లున్నదిసుమా" యని నవమాలికతో ననెను. "నిన్నుఁజూచువఱకాలాగే యుండు" నని నవమాలికయనెను. అంశుమంతుఁడు "ఆహా! శాపముచేఁగల హృద

యుఖేదము నిదురఁబోవుచున్న పీనిమోమునందామె యెటులుకనిపెట్టి నదో! ఆహా! మోహాముయొక్క సామర్థ్య మంతింతయని యనలేము గదా" యని తర్కించును. నర్మద నవమాలిక పురుకుత్సుని పాదముల దరిఁగూర్చుండిరి. నవమాలిక నర్మదచిత్రపటమువ్రాసి రాజు వక్షము పైనుంచెను. దానిని దీసివైచు నెపముతో నర్మద రాజును బాగుగా స్పృశించి చిత్రపటము నచ్చటనే పాఱవేయును. అంశుమంతుఁడు రాజుపైఁ బ్రవేశపెట్టిన మోహనవిద్య నుపసంహరించును. రాజు మేల్కొనుటగాంచి నర్మదా నవమాలికలు తటాలునఁ బూలచెట్ల మాటునడాఁగికొనిరి. అంతఁ బురుకుత్సుఁడు కన్నులు నులుముకొను చుఁ జెంత విదూషకునిఁ గాంచక పలువిధములఁ దలపోయుచు విశ్వామిత్రాశ్రమ ప్రదేశముగాఁ దోఁపని యీ క్రొత్తప్రదేశమునకుఁ దా నెట్లు వచ్చితినోయని చింతించుచుండెను. భూర్జరసపత్రమేమోయని చిత్రఫలకమునుగాంచి యది చిత్రపటమేయని నిశ్చయించి యందలి విగ్రహమునుగాంచి "కన్నులుండినఫలమునుగాంచినాఁడనోరునొవ్వఁగ స్తుతిసేయ నోచినాఁడపులకలెత్తఁగఁ గౌఁగిటఁ బొడువువాఁడ! ప్రతిమ నాచింతఁ బాపఁగవచ్చినావు" అని పదేపదే దానినిజూచిసమ్మోహితుఁ డుకాఁజొచ్చెను. క్రమముగా నాతనిమరులు హెచ్చెను. అది యేలో కమో! చిత్రఫలకమందలి కాంత యెవతయో నిశ్చయింపలేక

"చిఱుతపులిని బెట్టిచేయి జాఱఁగనిచ్చి
దుప్పిఁజేసికూలఁ ద్రోచినావు
వనముమార్చి స్త్రీలనునిచి నోరునుజాఱ
నిచ్చియేమి చేయనెంచినావు"

అని విశ్వామిత్రునిగూర్చి విచారించుచుండును. "ఇంకను నుపేక్షించిన నాజీవనాపేక్షనీకు లేదు. ఆమహారాజు నిచ్చటికెట్లు తెచ్చెదవో" యని నర్మదనిజసఖిని హెచ్చరించును. అవశ్యమిప్పుడే తోడ్కొనివత్తునని

నవమాలిక రాజునొద్దకేఁగి యాతని భ్రమలనెల్ల నివారించి వాస్తవ సంగతుల నివేదించి నర్మదాసాన్నిధ్యమున కాతనిఁ గొంపోయి యిరువుర నొకచంద్రకాంత శిలావేదికపయి నధివసింపఁజేయును. తరువాత మన్మథుఁడు తరువాతి పనుల నెఱవేర్చును. ఇరువురుఁ బరస్పర సమ్మోహితులయిరి. పురుకుత్సుఁడు సమీపముననున్న యొకప్రాఁబొదరింటి శోభను గొనియాడుచు నందుఁజేరి నర్మదతోఁ గలియు నాకాంక్ష సూచింప నర్మద యాతని గడ్డముపట్టుకొని తొందరపడకుము. తండ్రిచాటుదానను. అతఁడు నాకు శీఘ్రముగ వివాహముచేయఁదలఁచి యున్నవాఁడు. నీవును నేనును రేపు కలిసి యాతని దర్శించి అక్కడ సుముహూర్తమున వివాహమాడుదము అని నివారించెను. ఒండొరులు తమ మణియుంగరముల నొకరొకరంగుళుల పయిధరించిరి. తన యభీష్టానుసారము వారుపరస్పర మోహావిష్టులయినందు కెంతయు సంతసించి యంశుమంతుఁడు తనరాజు నెఱుకలేక కావించిన పనివినిన నాతనివలన నేమిముప్పు వచ్చునోయని శంకించి పురుకుత్సుని మరల నరలోకమునఁ జేర్చువాఁడయి మోహన విద్యనునర్మదాపురుకుత్సుల పయిఁబ్రయోగించెనునిద్రవచ్చుచున్నదని వారిరువురునొకరితొడలపయి నొకరొరగినిద్రించుచుండఁగానంశుమంతుఁడురాజు నెత్తికొని "నర్మదా! లెమ్మ లెమ్మ" అని చెప్పుచుఁ బైకినిష్క్రమించును. నిద్రనుండి మేల్కాంచి నర్మద పురుకుత్సునిఁ గాంచనేరక పరిపరివిధములవిరహ సంతప్తయై విశ్వామిత్రుని మాయచే నురగలోకమునకు వచ్చిన యా రాజేంద్రుఁడు మరల నామునిమాయవలననే భూలోకమునకుఁ జేరి యుండునని నిశ్చయించికొని యాతనినిఁజేర్పకున్నఁ బ్రాణములనిలుపఁ జాలనని సఖి నవమాలిక నతిదీనముగఁ బతిమాలెను. "ఆ మహారాజు నిన్ను బుద్ధిపూర్వకముగ విడిచియుండఁడు కామగమనమున నిరువురము భూలోకమునకేఁగి యాతనిని గలిసి కొనెదము లే" యని నవమాలిక

పూమెను సమాధానపఱచి “ఈ యుద్యానమందలి మందమారుతము, చిలుకలు, కోకిలలు నిన్నిచ్చట మఱింత బాధింపఁ గలవు. భూలోకమునకిపుడే పోవుదము రమ్ము” నెను.

తృతీయాంకము :—భూలోకమున పురుకుత్సుని రాజమందిర సమీపోద్యానవనమున నాతఁడు, నాతని సఖుఁడు, విదూషకుఁడు సమావేశమయి ముచ్చటించుచుందురు. నిద్రలోనుండఁగాఁ దన్నెవ్వరో విశ్వామిత్రాశ్రమారణ్యమునుండి యురగలోకమునకుఁ గొనిపోయి రనియు నచ్చట నురగరాజకన్యక నర్మదతో సమాగమము గలిగె ననియు నిరువురుమణియుంగరముల నొకరికొకరి కిచ్చుకొంటిమనియు నామెతో నానందించుచుండఁగా మరల నెవ్వరో తన్ను భూలోకమునకుఁ జేర్చి రనియు పురుకుత్సుఁ డాడిన మాటలకు, నిద్రాపిశాచమునకుఁ దోడు మోహపిశాచముగూడ నాతని నావహించినదనియు నదియెల్ల భ్రమ యేయనియు విదూషకుఁ డాతనిని గేలిసేయును. తానేమియు భ్రమితుఁడు కాలేదని చెప్పుచు

“ఈ మణికి నా మణికి భేదమొంత కలదో
యింతులకుఁ గూడనబ్లియా యింతి మొదటి
దన్నెలఁ తలందుదాని దూపెన్న నేల
మిన్ను చేనంటు నరుహౌడ వెన్న నేల”

యనిపలికి నర్మద నుద్దేశించియే కాబోలు “ఓ యురగలోకవాస్తవ్యా” అని సంబోధించునంతలో అంశుమంతుఁ డచ్చటఁ బ్రవేశించి తన్నచ్చటికివచ్చి కలిసికొందునని చెప్పిన మిత్రుఁడు చిత్రకేతుఁ డింకను రాలేదేమని విచారించుచుండెను. విదూషకుఁడు పురుకుత్సుఁడు దీర్ఘ విచారముతో వాగ్వివాదము లొనర్చుకొనిరి. తనగౌరవము రక్షించుకొనఁ దలఁచినవాఁడు కాంతల వలలోఁ బడరాదని హెచ్చరించి విదూషకుఁ డెన్నియో నిష్ఠురోక్తులాడ, పురుకుత్సుఁడు “చెవు లొర్చుకొని పోయి

కొంచెము హోరుకలిగి శ్రవణశక్తి తగ్గుచున్నది. నీవు విశేషించి మాటలాడిన ప్రయోజన మేమియు లేదు. ఓ యురగలోకవాసినీ! నర్మదా! నాకనులకు దృష్టిశక్తిగూడ మందముగాకముందే యొక్కసారి యిటువచ్చి నన్నుఁ గౌఁగిలించికొనుము" అని వాపోవును. అప్పుడు భూలోకమునకయి ప్రయాణమై వచ్చిన నర్మదయు నవమాలికయు నచ్చటఁ బ్రవేశింతురు. అంశుమంతుఁడు నర్మదను గాంచి "ఆహా! నర్మదా! వచ్చితివా? ఎంతసాహసముగలదానవు. (తలపంకించి)

"పిల్లి బావురు మన నుల్కు వెలఁదులైన
మోహ మావేశమైన నంబుధులు దాఁటఁ
గలరు లోకముల్ గానిలోకములనైనఁ
బడయుదురు గాలివడి గాలిపడగఁ బోలి."

"ఓ చిత్రకేతుఁడా! పురుకుత్సునే చూచితివికాని నర్మదను జూచియుండవుకదా! ఆహా! యింతయపూర్వదర్శనముగూడ నీకు శీఘ్రముగాఁ గలుగుఁగాక" అనునంతలో చిత్రకేతుఁడు నచ్చటఁ బ్రవేశించును. ఆతనినిజూచి యంశుమంతుఁడు "పూజ్యుఁడైన చిత్రకేతుఁడా! నమస్కారము. మంచిసమయమునకు వచ్చితివి. అదుగో మహారాజు విరహభారవశుఁడై విచారించుచున్నాఁడు. వెనుకనుండు జలయంత్రమున కానుకొని సఖీసమేతయై నర్మద ప్రకాశించుచున్నది. తిరస్కరిణిచేఁ బ్రచ్ఛన్నుఁడవు కమ్ము" అని హెచ్చరించును. "అట్లే మిత్రమా! నమస్కారము. ఆలస్యముగ వచ్చినందుకు క్షమింపుము" అని చిత్రకేతుఁడు పలుకును. విరహవేదనతోఁ బురుకుత్సుఁడు

"చేటి దెప్పలకును జెక్కు లెఱ్ఱనఁ జేసె
నన్నుఁ జూచి చిన్న నవ్వు నవ్వె
దానిమోము గ్రాలుఁ దరళిత చంద్రికా
ప్రతిఫలమునఁ దామ్రపర్ణి వోలె."

అని పలుకఁగా నర్మద యామహాదృష్టవంతు రాలెవరో గదా యని పలుకును. "నీవే నిన్న దెప్పినదానను నేనే" అని నవమాలిక ప్రత్యుత్తర మొసంగును. చిత్రకేతుఁడు అంశుమంతునిఁ జూచి "వీరిద్దఱను బాగుగ సంఘటించుటయందు నీవు తుంటవిల్లులేని మన్మథుఁడ వైతివి గదా! ఆహా! నర్మదయొక్క సౌందర్య మత్యాశ్చర్యకరముగ నున్నది. ఇంద్రలోకముననైన నిట్టిసౌందర్యవతు లొకరిద్ద ఱుందురేమో! ఈదినమున నింద్రునియాజ్ఞచే నొకచిత్రము జరుగవలసి యున్నది" యని చెప్పెను. ఆ దేది? నేను వినఁదగిన దేనా యని యంశుమంతుఁ డన "వినఁదగుదువు. చూడఁదగుదువు. అందుకు నాకు సాహాయ్యముగూడఁ జేయఁదగుదువు" అని చిత్రకేతుఁ డనెను. ఇంతలో నర్మదావిరహాభరమున డీలువోయి పురుకుత్సుఁడు

"మెడను తల నిల్వకున్న దీమెడను నాకు
చెవులు గడియలువడియెను జెంతఁ జేర
రమ్ము నర్మద! నర్మదా! రమ్ము రమ్ము
నర్మదా! శోష మొందుఁ బ్రాణములు నాకు."

అని మూర్ఛిల్లును. అంత నర్మద "నాథా! నాథా! ఇదిగో వచ్చితిని" అని యాతనిఁ గవుఁగిలించి "అయ్యో! ప్రాణవల్లభుని కెటులుండునో గదా" యని వాపోవును. విదూషకుఁ డాశ్చర్యపడుచు, "అయ్యో! రాజు మూర్ఛాగతుఁ డయ్యెను. ఎంతయిక్కట్టు తటస్థించినది. ఈమె నర్మదయే కాఁబోలును!" అని విచారించును. నర్మదయు నామెసఖి నవమాలికయు రాజున కుపచారములు చేయుచుందురు.

ఈలోపున అంశుమంతుఁడు ఇంద్రునియానతిచే జరుగవలసిన రహస్య మేదియో చెప్పుమని చిత్రకేతు నడుగఁగా నాతఁడు, "నిన్న నీవును నేనును సమావేశమైనయప్పుడు జరిగినసంగతు లన్నియుఁ బురందరునితో విన్నవించితిని, అతఁడు మిక్కిలి సంతసించి మాంధాత

తనకుఁ బుత్రసమానుఁ డనియు, అతనికుమారుఁడు పురుకుత్సుఁడు తనకు మనుమఁ డగుననియు, తనకు మనుమరాలు కాఁబోవు నర్మదను దాను జూడకయే వారివివాహమున కంగీకరింపననియు, నాగలోకము నకుఁ బోయి నర్మదను దనలోకమునకు దీసికొనిరావలసినదని సెల విచ్చెను నర్మద నాగలోకమునఁ గనరాక యిటకు వచ్చితిని. రాజును నర్మదయు సమావేశ మయినవెంటనే నర్మద నింద్రలోకమునకుఁ గొనిపోదును" అని చెప్పెను. పురుకుత్సుఁడు మూర్ఛాగతుఁడయినపు డాతనిఁ గవుఁగిలించి నర్మద నిజసఖితో నాతని కుపచారములు చేయు చుండ, దాంపత్యభంగకృత్యముగా వారి నెట్లువిడఁదీయుదునని చిత్రకేతుఁడు విచారించుచు,

"వజ్రియాజ్ఞ దీర్ప వచ్చును పాపంబు
దీర్పకున్న గొంతు దెగుట నిజము
ముందు, వెనుకఁగూడఁ బోవుచున్నది మది
రెండుతలలపాము రీతిగాను."

అని వచింప నంశుమంతుఁడు

"దంపతులు వీరు సుఖియించుచుదారి యట్టి
వజ్రికంటెను దెలియంగ వశమె నీకు ?
పూవులను మల్లె లోలయించు మాధవుండు
తోఁటఁ గాచెడికాపరిపాటి గాఁడె ?"

అని యనునయించును. ఇంతలో పురుకుత్సుఁ డించుక లేచి కన్నులు మూసికొని "ఓహో! నర్మదా !

"ఉడుకు నామోము చల్లగ నొత్తి యురము
రమ్ము చేరిచి విపులసౌఖ్యమ్ము నిచ్చి
కౌఁగిలించితి వని కలఁ గాంచినాఁడఁ
గద యభాగ్యునకుఁ గలల కలిమిగాదె ?"

అని వాపోవుచుండ విదూషకుఁడు

"రాజా ! మహాభాగ్యవంతుఁడవు ! ప్రత్యక్షమైన నర్మదనే చూతువు. కనులు విప్పుము" అని యుద్బోధించును. పురుకుత్సుఁడు కనులు తెఱచి తొందరగ నర్మదను కౌఁగిలింప నామె "నాథా ! నీ కిప్పుడు దేహమున సుఖముగ నున్నదా" యని ప్రశ్నించును.

"నాసుఖంబున కేమిలే నాతి ! నీవు
సత్యమగు నర్మదవొ లేక స్వప్నదృష్ట
నర్మదవొ ముందు చెప్పుము నాదు శిరము
నిలిచినట్లైన సర్వంబు నిలుచుఁగాదె ?"

యని పురుకుత్సుఁడు మాఱువలుక నామె "యథార్థముగా నర్మదనే. నీమణియుంగరమును జూడుము" అని యుంగరమును జూపింప దానిని జూచుచు నానందపారవశ్యమునఁ గన్నులు మూసి కొనిపోవుచున్న వని యాతఁ డనెను.

ఇదియేసమయ మని యెంచి—

చిత్రకేతుఁడు అంశుమంతునిదెస నవలోకించి "వయస్యా ! తిరస్కరిణి నుపసంహరించి యప్రచ్ఛన్నరూపముతో నీమెను బైకిఁ దీసికొనిపోదును. నీమోహనవిద్యాప్రభావము నొక్కతెప్పపాటులో నాసమయమునఁ గనబఱుపవలెను. ఈమె నాకు సహోదరిసుమా ! నాకు సెలవిమ్మ" అని వెనుకనుండి వచ్చి గబాలున నర్మదను బై కెత్తుకొనిపోవును. పైకిఁ బోవుచు నర్మద "నాథా ! పురుకుత్సా ! శివశివా! నాథా! రక్షింపుము" అని యంగలార్చును. ఇట్లు నర్మద యాకస్మికముగ నదృశ్యయై యూర్ధ్వమార్గమున నెవనిచేతనో కొని పోఁబడుటకు రాజు, విదూషకుఁడు, నవమాలిక, సంభ్రమాశ్చర్యము లచే నెంతయు సంతాపించిరి. పురుకుత్సుఁడు ధనుస్సున బాణము సంధించి చేయునదిలేక బాణమును దనపయినే వేసికొనయత్నింపఁగా

విదూషకుడు వారించి దానిని దనపైఁ బ్రయోగింపుమని హెచ్చరించును. బ్రహ్మహత్య నొనర్పుమందువా? యని రాజు చెప్ప నాత్మహత్య యంతకన్న మహాదోషమని యెఱుఁగవా? యని విదూషకుఁడు బదులుపలుకును. పురుకుత్సుఁడు నర్మదసఖి నవమాలిక నూఱడించి నాగలోకమునకు నామెను బంపివేయును. అంత ఏదియోపనియున్నది తొందరగా రమ్మని దేవిగారి ముదలయయినది రమ్మని పట్టమహిషి సుమతిచెలికత్తె కల్యాణివచ్చి నివేదించెను. రాచకార్యము నేదియో సఖుఁడును దానును బరిశీలించుచుండిరని చెప్పుమని రాజామెను బంపివేయును.

అసలు పెండ్లమునుయొక్క వార్త యిటువంటి పైదుఃఖములకన్నిటికి నుచ్చాటనమంత్రము సుమా! వయస్యా, అన్నివిధముల దేవిగారు నిన్ను సుఖపెట్టుచుండ నీ వన్యకాంత నపేక్షించుట యుచితమా?" అని విదూషకుఁడు రాజును మందలించును.

"సుమతితో నిరువదిసంవత్సరములనుండి సంసారము చేయుచున్నను నొక పుత్రుఁడయినను లభింపలేదు. సంతానకాంక్షచే నన్యకాంతాసక్తుఁడ నైతిని గాని వేఱొండు కాదు. ఇట్టిచో అత్యంత సౌందర్యవతి యగునర్మద నా కాసఁగొలిపి తుద కిట్లుచేసిపోయినది. ఆమెను గాంచునాశ నాకులేదు. సంతానాపేక్ష మొదలేలేదు. ఏమి చేయుటకుఁదోఁచకున్నది" అని పురుకుత్సుఁడు సమాధాన మొసంగెను.

"ఆశలన్నియు నడుగంటినప్పుడు హరినామస్మరణముకంటెఁ జేయునది లేదు" అని విదూషకుఁడు హరినారాయణ, హరినారాయణ అని పాడును. తెరలో నట్టిధ్వనియే వినవచ్చెను. వీణ వాయించుచు నారదమహాముని వారి యెదుటఁ బ్రత్యక్షమయి "ఇంద్రలోకమున నింద్రునిసన్నిధి నొకభూలోకరాజన్యునిచరిత్ర మొకచిత్రనాటకముగ నాడఁబడుచున్నది. దానిని జూడ మనుముఁడవగు నిన్నుఁ దీసి

కొనిరమ్మని మహేంద్రుఁడు నన్నుఁ బంపియున్నాఁడు. త్వరగ బయలు దేఱుము” అని యాదేశించును. పురుకుత్సుఁడా మునీంద్రుని గారవించి తనచరిత్రమే యొకనాటకముగ నున్నదని తనగోడునెల్ల నేకరువుపెట్టి

“ముద్దుటుంగరములు మురిపెంపుఁగౌఁగిళ్ళు
మములు మార్చుకొంటి మదియు నేను
త్రాడుగట్టినట్టి యాలోటు లేకుండ
గొంతుత్రాడు పోసి యింతి పోయె.”

అని మనవిచేయును. ఇంద్రునియాజ్ఞ నెఱవేర్చుటచే నాతఁడు సంతసించును. ఆతనియానతిమేరకు నిన్నుఁ గొనిపోవుటచే హరి నామస్మరణపరాయణుఁడగు నేను సంతసింతును. ఇందుచే నీమనోరథ సిద్ధియగును లెమ్మ” అని త్వరపెట్టి నారదుఁడాకాశగమనమున నాతనిఁ గొనిపోవును. ఈసంగతుల నంతఃపురమునఁ దెలియఁజేయు మని విదూషకునికి రాజు ముదల యొసఁగును.

## చతుర్థాంకము.

ఇంద్రుఁడు నర్మదాపురుకుత్సుల నాకలోకమునకు రప్పించు టకుఁగల ముఖ్యకారణము: చిత్రకేతునివలన వారి పరస్పరానురాగ వార్త వినినతరువాత శచీపురందరులకు నర్మదాపురుకుత్సుల యన్యో న్యానురాగములలో నెవరిది బలీయ మనువిషయమున వివాదము ఘటి ల్లెను. నర్మదయనురాగము నిర్వ్యాజము నిర్భరము నని, పరమగంభీర మైన ప్రేమ యెప్పుడును మాటలచే వెల్లడింపఁబడునది కాదని శచీ దేవివాదము. పురుకుత్సునిప్రేమయే బలిష్ఠమని మహేంద్రుని వాదము. దీనిని ప్రత్యక్షముగఁ బరీక్షించుటకే యీయంకమందలి విచిత్రనాటకము కల్పితమయినది. ప్రేక్షకులయెదుట దేవాలయ ములో నుండునట్లు త్రిపురసుందరీప్రతిమ నిలిపి సూత్రధారునిచే నియ మితుఁడైన చిత్రవర్ణుఁడను సేవకునిచే దేవీస్తుతి నొనరింపఁజేయుట

కన్న మతొండుని శేషము లిందుఁ గానరావు నర్మదయే త్రిపురసుం దరిగఁ బ్రదర్శితమయినది. అచ్చముగఁ ద్రిపురసుందరివలెనే మిక్కిలి సంయమనముతో ఆపాత్రము నభినయింపనిచోఁ దీవ్రముగ శిక్షింతు నని యింద్రుఁడు నర్మదకు ముదల యొసఁగి సూత్రధారునిచేఁగూడఁ జెప్పించును. ఇంద్రుఁడు, శచీదేవి, సూర్యుఁడు, చంద్రుఁడు, బృహస్పతి, నారదుఁడు, పురుకుత్సుఁడు నాటకమందలి ప్రేక్షకులుగ నాసీను లగుదురు.

అహల్యావృత్తాంతము మనమున నిడికొని శచీదేవి పురందరుని, తారాగమనసంగతి నుద్దేశించి బృహస్పతి చంద్రుని వ్యంగ్యముగ దెప్పిపొడుచుటలుఁగూడ నిందు మనోహరముగఁ జిత్రింపఁబడినవి. సూత్రధారుఁడు నాటకము నారంభించుటకు మునుముందు ఇంద్రుని యాజ్ఞ నభ్యర్థించును. అది యిదివఱకే యియ్యఁబడినదని యింద్రుఁ డనునంతలో నారదుఁడు తుమ్మును. ఇంద్రుఁ డాతనిఁగని "ఋషి సత్తమా ! తాము తుమ్మితిరే. నాటకప్రయోగము బాగుగ నుండక పోవునో లేక మనము నాటకమును సాంతముగఁ జూచుట సంభవింప దేమో" యని వచించును.

"ఎవ్వఁడు నిర్గుణుం డగు నహీనశుభోన్నతసద్గుణాఢ్యుఁడై<br>
యెవ్వఁడు దృశ్యమూర్తి యగు సృష్టిచరాచరవస్తువాసియై<br>
యెవ్వఁ డధోక్షజుండునగు నెవ్వఁడు ఓమ్మునఁ గాంతఁగట్టినాఁ<br>
డవ్విభుఁ డార్తిశార్తిపరిహర్త యొసంగెడుమీకు మోక్షముల్.

అని నాందిపద్యముఁ జదివి సూత్రధారుఁడు నాటక ముపక్రమించును.

త్రిపురసుందరీప్రార్థనము మునుముందు గావించుట యావశ్యకమని నటీసూత్రధారులు

"దుర్గ ! సంరక్షితాశ్రితవర్గ ! విష్ణు
నామసంకీర్తనవిసర్గ ! నవవిలాస
చాకచక్యచలితభర్గ ! చరణసేవ
కులము వందనములను గైకొనుము తల్లి !"

అని పాడుచుఁ దెరయెత్తఁగ నాలయములో నర్మద ప్రతిమవలె నధిష్ఠితయై కానవచ్చును. అంతఁ బురుకుత్సుఁడు (తనలో) ఏమిది, ఏమిది, ఏమిది ! నాప్రాణవల్లభయైన నర్మదాయేమి ? హా ! నర్మద వలెనే కాన్పించుచున్నది. (లేచి తొట్రుపాటుతో) అయ్యయో నర్మదయే కాఁబోలును ! ఆహా యిచట కెట్లువచ్చెనోకదా ! ఛీ ! నర్మద కాదేమో ?

"మృత్యువాతను బడినట్లి యెగిరిపోవు
నర్మదను నేను తిరిగి కాంచంగఁగలనె ?
అగ్నిదేవుఁడు గ్రహియించు నాహుతితతి
తిరిగి గ్రహియింపలేనట్టితీరు గాఁగ."

అని కడుంగడుతొట్రుపాటు నొందును. సూత్రధారుఁడు మరల

"మాతా ! శీతాద్రిసుసం
జాతా ! స్మితాంబకజలజాతా ! పూత
ఖ్యాతసుగుణసంఘాతా !
నాతాపముదీర్పుము భృతనతజనజాతా !"

అని దేవీస్తుతి గావించును. ప్రతిమకేసి చూచుచున్నకొలఁదిఁ బురుకుత్సునిసందియములు, ఆరాటములు ప్రవృద్ధములు కాఁజొచ్చెను. అంత నాతఁడు "ఈమె నాకు సుఖప్రదాయిని గనుక నా కిప్పింపుమని యింద్రు నడిగిన దైన్య మగునుగాని యీమె యెవ్వరని యడిగిన బాధ లేదనుకొనెదను" అని విహ్వలత నొందసాగెను. అతని సంభ్రమమును గాంచి యింద్రుఁడు "పురుకుత్సా ! గాలిచేఁ గొట్టు

కొను కేతనమువలె నేల యిట్లు సంభ్రమించుచుంటివి ?" అని ప్రశ్నించును. (చేతులు జోడించుకొని) "అయ్యా ! ఈ త్రిపురసుందరీవేష మభినయించెడువార లెవరో నేనడిగిన మన్నింతురుగాక" యని పురుకుత్సుఁ డనెను. ఇంద్రుఁడు నవ్వుచు "సూత్రధారు నడుగవలసిన మాట నన్నడిగెదవేమి?" అని ముదలకించును. "దేవా! క్షమింపుము. సూత్రధారు నడుగవచ్చునా ?" యని పురుకుత్సుఁ డన "ఎందులకు నీ కంతతొందర" యని యింద్రుఁడు చెప్పి (అపవారించి) "దేవీ ! చూచితివా పురుకుత్సునివికారము" అని శచీదేవితో ననును.

అంత నారదుఁడు (తనలో) "ఆహా ! అంతతొందర యెందుల కని సహస్రాక్షుఁ డాక్షేపించుచున్నాఁడే ! రెండుయామముల రాత్రి యుండఁగనే వడివడిగఁ బోయి మునికొంపదీసినప్పు డీశాంత మితని కెక్కడకుఁబోయెనో" అని గొణిగికొనును.

పురుకుత్సుఁడు తాలిమి లేక సూత్రధారునికడ కేఁగి యందఱు నవ్వుచుండ "ఓయీ ! నర్మదావేష మభినయించువా రెవరు ?" అని ప్రశ్నించును. "రాజేంద్రా ! ఇచట నర్మదావేషము లేదే" అని సూత్రధారుఁ డన నాతనిచేతులను బట్టుకొని "నర్మదావేషము గాక యథార్థనర్మదయే కద!" అని తొట్రుపాటుతోఁ బురుకుత్సుఁ డనును.

"రాజా! మీయభిప్రాయము నాకు తెలియకున్న" దని సూత్రధారుఁ డనును. అంత పురుకుత్సుఁడు (తనలో) "ఒడలు తెలియక నాయభిప్రాయమే నే నెఱుఁగనప్పుడు నాయభిప్రాయము వీనికిఁ దెలియకపోవుట వింతకాదు." (ప్రకాశముగా) "అయ్యా ! త్రిపురసుందరీవేష మభినయించువా రెవరు?" అని యడుగును. "అయ్యా! క్షమించుఁడు. అట్లు చెప్పుట సామాజికశాసనమునకు విరుద్ధము. అయినను తాము రాజేంద్రు లాజ్ఞాపించితిరి. కాన..." అని సూత్రధారుఁ డను నంతలో నింద్రుఁడు "ఏమీ సూత్రధారా ! విశ్వకర్మచే నిర్మింపఁ

బడిన బంగరుబొమ్మ కాదా !" అని యందివ్వఁగా, సూత్రధారుఁడు "చిత్తము, ఆసంగతియే మనవిచేసికొనఁబోవుచున్నాను" అని వచించును. పురుకుత్సుఁడు "విశ్వకర్మచే నిర్మింపఁబడిన బంగరుబొమ్మయా యిది ? (తనలో) నాదియు బంగారుబొమ్మయే కదా ! అయిన నది విశ్వకర్మచేఁగాక విశ్వకర్తచే నిర్మింపఁబడినది. ఓహో విశ్వకర్మా ! సృష్టికర్తసామర్థ్యముకన్న నీసామర్థ్యమే యెక్కు-వగనున్నది."

"అన్నివిధముల సారూప్య మందునట్టి
ఘటములను జేయఁజాలఁ డాకంజభవుఁడు
నాతి నర్మద ప్రతిబింబమై తనర్చు
ప్రతిమ నిర్మించు నీ కివే వందనములు."

అని కొనియాడును. "అయ్యో! నర్మద యని యెంతగా భ్రమసితిని; చిట్టచివరకు బొమ్మను జూచి నర్మదయని సంతసింపవలసివచ్చెను. నిజమైననర్మదను గాంచి సుఖించుమహాభాగ్యము నా కీజన్మమందు లేదుకదా ?

"బొమ్మ నీక్షించి నాముద్దుగుమ్మ యంచు
నెంచి చివరకుఁ బండ్లిగిలించినాఁడ
నెండమావుల నీరంచు నెంచి యలికి
చతికిలంబడు దాహపీడితునికరణి."

ఆహా ! ఆప్రతిమ యెంతదివ్యదర్శనమిచ్చుచున్నది. సృష్టించిన విశ్వకర్మయైనను నిది ప్రతిమగాక యప్రతిమకళాకలితయైన కాంత యని భ్రమపడవలసినట్లున్నది" అని పరిపరివిధముల భ్రమితుఁడగుచున్ననాతనియవస్థను గని, బృహస్పతి "రాజేంద్రా ! మఱచిపోయినవిద్యను తిరిగి యాకర్షించుహానివలె సంతయుస్మితముగ నుఁటివేమి?"యని ప్రశ్నించును. "తరలిపోయిన భార్యను దిరిగి తెచ్చుకొన్న నీకన్నులకల్లేయుండును" అని చంద్రుఁడు తనలో గొణిగి

కొనెను. “మఱచిపోలేదు ; మఱచిపోవుట కవకాశము లేదు. తిరిగి తెచ్చుకొనుట కిసలే లేదు” అని పురుకుత్సుఁడు వచింపఁగా ఇంద్రుఁడు నవ్వుచు “రాజేంద్రా! ఏదైనా కథ పొడుచుచుంటివా ?” అని పరిహసించును. “నేను కథ పొడుచుటలేదు గాని యీప్రతిమ నా కనులను పొడుచుచున్నదని చెప్పిన మీకందఱకుఁ గథగ నుండును గద ! మహేంద్రా ! ఇది యథార్థమయిన ప్రతిమయేనా ?” అని పురుకుత్సుఁ డడుగును “నీ వాలోచించుకొనరాదా ! మాటలుగాని యభినయముగాని దేనియొక్క ప్రయోజనము నవసరములేని పాత్రము గనఁబఱుచుటకు ప్రతిమ చాలదా ? యథార్థమేనా యని యిన్ని మాఱు లడిగెదవేమి ?” యని యింద్రుఁడు సమాధానమీయ—

“మహేంద్రా ! నే నింద్రజాలమునఁ బడియుంటినిగదా ! ఇఁక సిగ్గువిడిచి చెప్పెదను. ఉరగలోకమందు వరించి, భూలోకమునఁ బరిరంభసౌఖ్య మనుభవించుచుండఁగఁ గోలుపోయిన నాకాంతాశిరోరత్న మగునర్మదయే యని భ్రమియింపఁజేయుచున్న యీబంగరు బొమ్మను సమీపించి కనులారఁ జూచుటకు సెల వొసంగుఁడు” అని పురుకుత్సుఁడు ప్రార్థించెను.

“అంగీకరింపవచ్చునా” యని యింద్రుఁడు శచితోఁ బలుకఁ “గానిమ్ము” అని యామె పలుకఁ బురుకుత్సుఁడు తొట్రుపాటుతోఁ బ్రతిమను సమీపించును.

“దేవీకటాక్షమును గోరి త్రిపురసుందరి నే నిచ్చటఁ బ్రార్థించుచుండ మీ రేలవచ్చితిరి ?” అని సూత్రధారుఁ డన “నేనును దేవీకటాక్షమును బ్రార్థింపవచ్చితిని” అని పురుకుత్సుఁ డనెను.

“నాటకరంగస్థలమున కితరులు రాఁగూడదు. రాజేంద్రా ! మానాటకమున కభ్యంతర మేలకలిగించెదరు” అని సూత్రధారుఁడు వారింపఁబోవ, “అభ్యంతర మేమియు లేదు. ఈత్రిపురసుందరి కాదు

ఈత్రిలోకసుందరిని ప్రార్థించుటకు వచ్చిన నన్ను మీనాటకములోని మఱియొకవేషధారిగా భావింపుము" అని పురుకుత్సుఁడు వచించును.

శచీదేవి (నవ్వుచు) "మహేంద్రా! కాంతలను స్వాధీనపఱచుకొనుటకుఁ బురుషు లెన్నియసందర్భవేషములనైన వేయుదురు సుమా!" యని పలుక నింద్రుఁడు తలపంకించి యుస్సురనుచు (తనలో) "ఆహా! శచి యహల్యావృత్తాంతమునే తిరిగి యుద్ఘాటించుచున్నది" అని విచారించును.

"శచిచుఱుకుమాటచే నొచ్చి జంభవైరి
కనులఁగొలుకులఁ గెంపులు గ్రమ్మె గ్రాలు
ఖరకరోజ్జ్వలకిరణవికాసమృదుల
తరుణశోణసహస్రపత్త్రములకరణి."

అని బృహస్పతి తనలో భావించును.

కార్యము శ్రుతిమీఱుచున్నదని విసుగుచెంది యింద్రుఁడు "నాటక మారంభింపకుండనే ప్రయత్నమునకు విఘ్నము కలిగినది. కావున సూత్రధారా! మీరు పొండు" అని యాజ్ఞాపించును. పురుకుత్సుఁడు "అయ్యో! వద్దు, వద్దు. ఈబంగరుబొమ్మకూడ నీనాటకపాత్రలలో నొకటిగనుక దీనిని వారు తీసుకొనిపోవుదురేమో! కటాక్షింపుము" అని ప్రార్థించును.

"ఇది యిక్కడనే యుండును. మీరు పొండు" అని యింద్రుఁడు పలుక నటీసూత్రధారులు వెడలిపోదురు.

పలువిధములఁ బ్రతిమను జూచి తబ్బిబ్బులుపడుచున్న పురుకుత్సు నుద్దేశించి మహేంద్రుఁ డంత "పురుకుత్సా! అనవసరముగ నాటకమునకు విఘ్న మొనరించుటయేగాక మాకుఁగూడ సంతాపము కలుగఁజేయుచుంటివి. ఇటు రమ్ము. చాలు. ఆహా! విచిత్రచరిత్రుఁడవు" అని వచింపఁగా పురుకుత్సుఁడు "మహేంద్రా! క్షమింపుము. నేను విచిత్రచరిత్రుఁడనే.

"ఎట్టులో సర్వలోకమున కేఁగి వెలందుక నెట్లొ చూచి నే
నెట్టులొ ధాత్రి కేఁగి మఱి యెట్టులొ దానినిఁ గౌఁగిలింపఁ దా
నెట్టులొ పోయె నెచ్చటకొ యెట్టులు బొమ్మను జూడనయ్యెనో
ఎట్టులు ముందు గాఁగలదొ యిన్నిటికంటె విచిత్ర మేమగుఁ."

అని తిరిగి ప్రతిమచుట్టు రెండుమూఁడుసారులు తిరిగి, "ఆహా! ఏమిది ?"

"ఎదుట నున్ననైన నిటు ప్రక్క నటు ప్రక్క
నున్న నన్నె చూచుచున్నయట్లు
కానుపించుచుంట నే నిది ప్రతిమ గా
దంచు నెంచెదను యథార్థముగను."

అని కొంచెము సమీపించి

"ఆ ముఖంబునుండి యంభోజవాసన
వచ్చుచుంట నద్ది ప్రతిమ గాదు
చేతఁ జేయఁబడిన చూతఫలంబున
కెటులు సౌరభంబు ఘటనపడును ?"

అని నిశ్చయించును. ఇంద్రుఁ డిది కనిపెట్టి (తనలో) "ఆహా! యితఁడు ప్రతిమ కాదని నిశ్చయించుకొనుచున్నాఁడుగదా !" అని తలంచి (ప్రకాశముగా) "పురుకుత్సా ! వెనుకవదలినభ్రమను తిరిగి గ్రహించుచుంటివా ! శిరోజములందలి కమలములయొక్క గంధమును ఆస్యాంభోజగంధమని భ్రమపడుచుంటివా ?" అని ముదలకించెను. పురుకుత్సుఁడు మరల

"తొంగలించెడు ఱెప్పలతుదలయందు
బాష్పకణములు నిలిచెను ప్రతిమ గాదు
మించుతామర రేకుల మీఁదఁ దేనె
మంచుకణములు భాసించుమాడ్కి గాఁగ."

అని వచింప "పురుహూతా! ఎంత వెఱ్ఱివాఁడవు. దానికనులు ప్రశస్తమైన మణులచే నిర్మింపఁబడినవి. అమూల్యమణులు నీరు గ్రమ్ముట సహజమే. అదిగాక సమీపమందు చంద్రుఁ డుండుటచేఁ జంద్రకాంతమణులచేఁ జేయఁబడిన తెల్లగ్రుడ్లు స్రవించుచున్నవి. చంద్రా! యీ రాజచంద్రుని భ్రమకు నీవు కారణమైతివి గనుక నీపాటికి నీలోకమున కేఁగి సుఖింపుము" అని యింద్రుఁ డాదేశించును. అంత రాజు నాశీర్వదించి చంద్రుఁడు, నట్లే సూర్యుఁడు, బృహస్పతి వెడలి పోదురు. ఎప్పటికిఁ దన భ్రమలు తీఱకున్నందునఁ బురుకుత్సుఁడు తుదకు "ప్రతిమ యగునో కాదో యను సంశయమును బాపుకొనుటకును, సుఖమాటకును నా కొకయుపాయము తోఁచుచున్నది.

"దానిచరణాంబుజంబులపైని శిరము
భళ్లు మని కొట్టుకొన్నచోఁ బ్రతిమ యైన
తల పగులును, బాధలు తీఱు లలి సుఖింతుఁ
బ్రతిమ గాకున్న సుఖము చెప్పంగవశమె?"

అని తన కిరీటము దీసి చేతఁ బట్టుకొని "హా! నర్మదా!

"రతిని గలిగినబడలిక ప్రాలి నీదు
చనులఁ దలఁ గ్రుచ్చి నిద్రించి సౌఖ్యమొందఁ
దగిననేను నీప్రతిమపాదముల నాదు
తలనుగల రక్తమున నయ్యో! తడుపవలసె."

హరహరా! యని తలఁ గొట్టుకొనఁ బ్రయత్నించునంతలో ఇంద్రుఁ డాతనిచేతిని బట్టుకొని నారదునిఁ జూచి "మునీంద్రా! తాము నాయం దనుగ్రహించి యీతని వెంటనే భూలోకమునకుఁ దీసికొనిపొం" డని ప్రార్థించును. నారదుఁడు రాజుచేతిని బట్టుకొని తీసికొనిపోవుచుండ "మునీశ్వరా! ప్రతిమ నింకొకసారి చూడనిమ్ము శివ శివా!" అని క్రిందికిఁ బోవును. అంతఁ దటాలున దేవళమునుండి బయ

టికి వచ్చి నర్మద మహేంద్రునిపాదములపయిం బడి, కొండంతయా శలు పెట్టుకొన్నం దన్నుంగూడం దననాథునితో భూలోకమునకుం బంపకపోతిరే'' అని యంగలార్చెను. ఇంద్రుండు ''నర్మదా! అధైర్య పడకు. నీకుం బురుకుత్సునియెడలం గలప్రేమ యెంతయో యిదివఱ కెఱుంగుదుముగాని పురుకుత్సునికి నీయందుం గలప్రేమ యెంతయో మాకుం దెలియకపోవుటచే నీచిత్రచరిత్రను నడిపింపవలసివచ్చినది. నీ వదృష్టవంతురాలవు. తగుసమయ మాలోచించి నిన్ను భూలోక మునకుం బంపెదను. విచారపడవలదు. యథార్థముగ నీవు సుఖపడం గలవు. ప్రొద్దుపోయినది. శ్రమపడితివి. లోనికి పొమ్ము'' అని చెప్పెను.

''నర్మదా! జడువకుము. నీమనోభీష్టము నెఱవేఱును'' అని శచీదేవి మఱింతధైర్యము చెప్పెను.

''నేను నిశ్చయముగ ధైర్యమున నుండవచ్చునా'' యని నర్మద పలుక ''అవశ్య ముండుము'' అని శచీపురందరు లుభయు లొసంగ నర్మద సెలవు తీసికొని నిష్క్రమించును.

ఇంద్రుండు శచీదేవిని జూచి ''దేవీ! పురుకుత్సునిప్రేమ యెట్టిదో కనిపెట్టితివా? నర్మదప్రేమయే యెక్కువ యని నాతోం బంతమువైచితివికదా! ఇంకను నీపంతమే నెగ్గినదని వాదింతువేమో! కానిమ్ము నీపంతము నెగ్గుటయే నాకును బరమసంతోషము. మిక్కిలి ప్రొద్దుపోయినది. లోని కేంగి శయనింతము'' అని యామెను గౌంగి లించికొని

''నీదుసౌందర్యవిభవంబు నిశ్చలముగం
గాంచం గనులు సహస్రంబు కలిగినటులు
గాఢపరిరంభసౌఖ్యంబు గాంచుటకును
బాహువులుంగూడ వేయి కావలసె నాకు.''

అని చెప్పెను. "అదియెంతపని! మీరు తలంచుకొనినయెడల మఱియొక యేమునినైనను గటాక్షింపఁగలఁడు" అని శచి మాట వలుక నిద్దఱు నిష్క్రమింతురు.

## పంచమాంకము

నారదుఁడు భూలోకమున డించి పోయినతరువాతఁ బురుకుత్సుని పరిస్థితి మఱింత పాడయ్యెను. అతఁడు తాపజ్వరమునకు లోనయి మంచముపట్టెను. ఎవ రెన్నిచికిత్సలు చేసినను నుపకరింపవయ్యెను. తన కౌషధమే యక్కఱలేదని యాతఁడు మందులఁ గొన నిరాకరించెను. రాజుగారి యనారోగ్యస్థితికి వాస్తవకారణ మెఱుంగనేరక పట్టమహిషి సుమతి తనసఖి కల్యాణిద్వారా రాజుగారిప్రియసఖుఁడు విదూషకుని నుండి కొంతసమాచారమును వెలికిఁ దీయఁ బ్రయత్నించెను. రాజు గారిభయముచే నాతఁడు రహస్యమును బయటఁబెట్టుట కిష్టపడఁ డయ్యెను. పురుకుత్సుని రాజమందిరమునందే విదూషకుఁడు రాజు గారిని విడిచి దూరముగా నున్నప్పుడు కల్యాణి ప్రయత్నించియు సంగతుల నెఱుంగఁజాలక రాణియొద్ద కేఁగి అమ్మా! "నర్మదా, మణియుంగరము" అను రెండుమాటలు తప్ప మఱేమియు నాతనినోటి నుండి బయటికి రాలేదు. చిట్టుతట్టను ముందుపెట్టి మలపగేదెను పాలు పితుకువిధమునఁ దినుట కేమైన నీతనిముందుఁ బడవైచినయెడల నీ రహస్యము మనము గ్రహింపవచ్చు ననుకొనెదరు. నేను పోయి ఫల ములను తెచ్చెదను" అని వెడలిపోయెను.

అంత సుమతియే విదూషకునితో స్వయముగ సంభాషింప మొదలిడి "చంద్రశేఖరా! నీ వెప్పుడైనఁ గాశికిఁ బోయియుంటివా? ఆకాశగంగ యెచ్చటఁ బుట్టి, యెచ్చటకు వచ్చి, యెక్కడకుఁ బోయెనో యెఱుఁగుదువా?" అని ప్రశ్నించెను. ఇంతలోఁ గల్యాణి వచ్చి "అయ్యా! ఈఫలములను తీసికొనుఁడు" అని యాతనియెదుటఁ

బెట్టెను. ఆతఁడును "కల్యాణీ! నామనస్సువంటిఫలములనే యిచ్చితివి" అని ప్రశంసించుచు రాణితో "అమ్మా! ఆకాశగంగ స్వర్గమునఁ బుట్టి రాజశేఖరునిచేఁ దలపైఁ బెట్టుకొనఁబడి యంతట భూలోకమునకు వచ్చి, తరువాతఁ బాతాళలోకమునకుఁ బోయెను" అని వాక్రుచ్చెను.

"నర్మదయో ?" అని సుమతి మరలఁ బ్రశ్నించెను.

విదూషకుఁడు (తల వంచుకొని పరధ్యానముగా) ఉరగలోకమునఁ బుట్టి, భూలోకమునకు వచ్చి మనరాజశేఖరునిచేఁ గౌఁగిలించుకొనఁబడి తరువాత రాక్షసునిచే నూర్ధ్వలోకమున కెత్తుకొనిపోఁబడెను" అని చెప్పి, వ్రేలు కఱచుకొని తనయజాగ్రత్తవలన నీరహస్యము బయటఁబడినందుకుఁ బరితపించి, యక్కడ నుండఁగూడదని (ప్రకాశముగా) అమ్మా! నేను రాజుగారియొద్దకుఁ బోవలెను. సెలవిమ్మ" అని వేఁడికొనెను.

"రాజుగా రిప్పుడే పథ్యము పుచ్చుకొన్నా" రని యామె చెప్పునంతలో కల్యాణి వచ్చి "అమ్మా! భోజనముకూడ నైనది. నేను చూచివచ్చినాను" అని చెప్పెను.

"నీవు పోయి యాయనను జాగ్రత్తగఁ బట్టుకొని తీసికొనిరమ్ము" అని సుమతి యామెను బంపి విదూషకునితో "విప్రవర్యా! తన యిష్టమున్నకాంతతోఁ దాననుభవింపక యనవసరముగ నీమనఃఖేదమును, నీదేహవ్యాధియును రాజుగా రెందుకుపెట్టుకోవలెను ?" అని పలికెను.

అంత నాతఁడు "అమ్మా! ఇఁక దాపఱిక మెందుకు? అతని లోపెంతమాత్రము లేదు. ఆకాంత యీభూలోకములోనే లేదు. మఱి యెచ్చటఁగూడ నున్నట్లులేదు. ఆమాదిరిప్రతిమ యొక్కటి యింద్రునికచ్చేరిలో నున్నదని రాజుగారు నాతో నీమధ్యనే చెప్పి

నారు. ఆప్రతిమను జూచుకోరికయే, ప్రాణరక్షణమందు విరక్తి గలిగించుచున్నది. రాజుగారు కల్యాణి నానుకొని వచ్చుచున్నారు. ఆహా! ఏనుఁ గెత్తఁబడినది కదా!" అనెను.

పురుకుత్సుఁడు వచ్చినంతనే సుమతి "నాథా! నమస్కారము. మీకు భోజన మేమయిన హితవుగ నున్నదా?" అని ప్రశ్నించెను.

"దుష్టజనులకు నీతివాగ్ధోరణివలె
కఠినమానసున కనూనగానమువలె
విరసజనులకుఁ గవితానివేదనంబుఁ
బోలె జ్వరితున కగుఁగాదె భోజనంబు."

అని పురుకుత్సుఁడు వచింప, విదూషకుఁడు "అమ్మా! పరస్త్రీని వలచి దానికొఱకుఁ దపించువానికి భార్యయొక్క మందలింపుమాటల వలెనే తాపజ్వరపీడితుఁ డయిన మహారాజుకు భోజన మహితముగానే యుండునుగదా!" యని పలికెను.

సుమతి రాజును జూచి "నాథా! మనకిద్దఱ దొక్కశరీరమే కదా! ఒకేదేహ మయినచో మనస్సు నొక్కటిగనే యుండవలెను గదా!" ఇత్యాదిగా సంభాషింప మొదలిడ "దేవీ! న న్ననుమానించుచుంటి వేమి? మన సొకటియుండుటచేతనే దేహములు రెండైన నొక్కటియే యనిపించుకొనుచున్నది" అని రాజు బదులుచెప్పెను.

విదూషకుఁడు "దేవీ! మహారాజుగారి వ్రేలి యుంగరమును జూడుము. బంగారమును మణియును గలిగియున్నను నుంగర మొక్కటియే యని యనిపించుకొనుట లేదా?" అని చప్పున వ్రేలు కఱచుకొనెను.

రాజు తత్తరముతో ఉంగరమును దాఁచఁబోయి "ఛీ, బ్రాహ్మణుఁడా! అనవసరమైనమాటలు నీకేల? దేవీ! దేవీ! అతనితో నేమి?" అని మూఱడించెను.

నర్మద యొసంగిన మణియుంగర మదియే యని కల్యాణియు, సుమతియు నిశ్చయించుకొనిరి. సుమతి (అపవారించి) "విప్రవర్యా! నా కాంతుని వ్రేల నుండవలసిన యాతనియుంగరము కనఁబడుటలేదేమి? అది నర్మద కీమహానుభావుఁ డిచ్చెనా?" యని వచించెను. "చెట్టు కదిపినమాత్రముననే నేరెడుపండ్లు ఝల్లున క్రిందకు రాలునట్లు లేశమాత్రముకదిపినను, పట్టులేని నామనస్సునుండి రహస్యము లన్నియు జాఱిపోవునుగాన" అని విదూషకుఁ డనునంతలో, రాజు "ఛీ మూర్ఖా! రహస్యము అని ప్రేలుచుంటివి. రహస్య మేమున్నది" అని మండిపడును. "నాథా! రహస్య మేమియును లేదుకద! రహస్య మేమో యని సంకోచించుచుంటిని సుమా!" అని బలాత్కారముగ రాజు నొద్దనున్న యుంగరము లాగికొనెను.

"నాదు పరభామినీవాంఛ నాతి కిపుడె
బయటఁబడియె నిదర్శనప్రకట మగుచు
నాదుతప్పిఁక నొప్పుకొనంగవలెను
దొంగిలినసొత్తుతోఁ జిక్కు దొంగవలెను."

అని తనలోఁ బురుకుత్సుఁడు పరితపించును.

సుమతి: "నాథా! ఎంతప్రశస్తమైనమణిని సంపాదించితిరి!" అని
దెప్పిపొడుచును.

రాజు: "నూరుకొని త్రాగుటకుఁదప్ప నా కిఁక దీనితోఁ బ్రయోజన
మేమున్నది? ఆహా! చిత్తమా! ఎన్ని బాధలకు లోనయితివి.

"నర్మదాక్షోభ మొకవైపు నాతి చూరు
నేమొ యనుచింత యొకవైపు నీజ్వరార్తి
యొక్కదిశ నుండ నుడికెద నుష్ణకాల
మందు త్రేతాగ్నిమధ్యస్థయాజివలెను."

అని తనలో మఱింత కుమిలిపోవును. విదూషకుఁ డపవారించి

యీమణి యింద్రుఁడిచ్చెనని బొంకుమని రాజున కుద్బోధించెను.

పురుకుత్సుఁ డపవారించి, "ఇంద్రుఁ డీమణిని నాకిచ్చె నని బొంకుమనెదవా? నే నింద్రలోకమునకుఁ బోకమునుపే "నర్మద నీ కిచ్చినమణియుంగర మిచ్చెదవేమో సుమా!" అని కల్యాణి విను నట్లు నీ వానాఁడు నాకు చేసినహితబోధనచేతకదా యింత మునిఁగి నది! అయినను

"ఎప్పుడైనను నర్మద నేను గలియు
నాశ నాకున్న బొంకంగ నగును జీవి
తాశయే లేని ప్రబలరోగార్తునకును
మందుమాకులతోఁ బని యెందుఁ గలదు?"

అని విదూషకునితో ననెను. అంత సుమతి "నాథా! ఈయుంగర మును స్పృశింప నే నర్హురాలను గాను. నీవే తీసికొనుము. (ఇచ్చుచు) నే నొక్కమాట చెప్పుచున్నాను వినుము. తాము స్వతంత్రులు. తమ కెవ్వరిపైనయిన మక్కువ యున్నచో నాకాంతను మీరు స్వేచ్ఛగా ననుభవింపవచ్చునుగాని, నే నేమందునో యనుభయము లేశముగాని మీ కవసరము లేదు. అటు లభ్యంతరము పెట్టుదానను గాను. నామాట విని చింత పెట్టుకొనక, వ్యాధిని వృద్ధిపఱుచుకొనక నీమనోభీష్టమును దీర్చుకొనుము" అని స్పష్టముగాఁ జెప్పివైచెను.

దానికి రాజు "దేవీ! నీ వెంతమాత్రము సంకోచింపఁ బనిలేదు. నీసవతి భూదేవియేతప్ప మఱెవ్వరులేరు. కావున నీవు పరితపింపవలసిన పనిలేదు" అని చెప్పి (ఉస్సు రనుచు,) జ్వరముతగిలెడువేళ యైనది కాఁబోలు. ముక్కు, చెవులు, నోరు, ఒడలంతయుఁగూడ నార్చుకొని పోవుచున్నవి. ఆహాహా! తాప మధిక మగుచున్నది" అని విలపింప సుమతి, కల్యాణియు నాతని కుపచారములు చేయఁబోడంగిరి.

సుమతి విదూషకునితో "నీవు పోయి వైద్యునిఁ బిలువుము"

అని చెప్పఁ బురుకుత్సుఁడు వలదని చేయి యూపుచు.

విదూషకుఁ డాతనినాడి చూచి "అమ్మా! యీదినము జ్వరము నిన్నటికంటె మఱింత హెచ్చుగా వచ్చినది" అని చెప్ప,

"ఏమిచేయుదును. ఔషధము సేవింపుమన్న వలదనును. ఈ సమయమున నేమహానుభావుఁడయిన వచ్చి నాకాంతుని జ్వరబాధ నివర్తింపఁజేసిన నేను సుఖింతునుగదా!" అని సుమతి చింతించెను.

ఇట్లుండ స్వర్గమున బృహస్పతి దివ్యదృష్టివలనఁ బురుకుత్సుని పరిస్థితి చాల ప్రమాదకరముగ నున్నదని తెలిసికొని యింద్రుని హెచ్చరింప నాతఁడు నర్మదను బిలిచి అమృతహస్తనామకుఁ డగు దేవవైద్యుఁడ నని పురుషవేషమున భూలోకమున కేఁగి పురుకుత్సునకు వైద్యముచేయు నెపమున నుపచరింపుము. ఆతఁడు నిన్ను గుర్తుపట్టువఱకు, నీ పతినిమనస్సున కేమాత్ర మనుమానము కలుగునట్లు నడిచినను శిక్షింతు" నని కట్టడిచేసి, మందుమాకు లేమియు నొసంగకయే యామెను బంపివైచెను.

ఆమెయుఁ బరిపరివిధముల విచారించి యీదుర్భరకార్యమును ధైర్యముతో నెట్లునిర్వహింపఁగలుగుదు ననెడి సంకోచము దోఁప పురుషరూపిణియై రాజమందిరముహజారమువద్ద నిలిచి "ఇంద్రుని యొద్దనుండి దేవవైద్యుఁడు వచ్చెనని మీరాజుగారితోఁ జెప్పు"మని సేవకునిచే లోనికిఁ గబురుచేసెను.

సుమతి రాజున కుపచారములు చేయుసమయమున నాపురుషుఁడు లోని కేఁగి తనవచ్చిన ప్రయోజనము నివేదించును.

"నే నెవరివద్ద నౌషధము పుచ్చుకొనఁదలఁచుకొన లేదు. మీరింద్రునియాజ్ఞచే వచ్చితిరి గాన నాలోచింత" మని పురుకుత్సుఁ డనెను.

సుమతి యమాత్రముతో వైద్యునిఁ జూచి "సోదరా! నామంగళ

సూత్రమునకు భద్రము కలుగఁజేసెదరుకద! అట్లయిన నీ కేదికావ లయుననిన నది యియ్యఁగలదానను. నామంగళసూత్రముతోఁ బ్రమా ణము చేయుచున్నాను" అని వచించెను.

విదూషకుఁడు "అమ్మా! తొందరపడకుము. ఈవైద్యుని నమ్మవలసినపనిలేదు. వీనివలన ముప్పు కలుగును. వయసుతక్కువ వైద్యుని, వయసుమీఱిన వారకాంతను నూరినుండి వెడలఁగొట్టవలె నని పెద్దలు చెప్పెదరు. ఈవైద్యుఁడు వయస్సునఁ జిన్నవాఁడుగ, బక్కపలచనితనువుగలిగిన పేడిమొగమువానిగ నున్నాఁడు. ఇట్టివార లను నమ్మఁగూడదు." ఇత్యాదిగా నెన్నెన్నియో ఫుల్లవిఱుపుమాట లను రాజు, రాణియు నెదుటఁ జెప్పెను. ఈతఁడు తన్ను గుర్తించె నేమో! వీనివలన నేమిమూఁడనున్నదో యని నర్మద యనుమానము చెందును.

"అక్కా! ఔషధ మారంభింపవచ్చునా?" అని నర్మద సుమతివైపు చూచి యడుగును.

"అవశ్యము. నాథా! ఈమహానుభావుఁడు మీ కారోగ్యమును గలిగించుటకు భగవంతునివలె వచ్చినాఁడు. కావున నాతనివైద్య మున కంగీకరింపుము" అని సుమతి రాజును బతిమాలును.

"ఈతఁడు నావ్యాధి కుదుర్చఁగలఁడనియే తోఁచుచున్నది. ఈతనియొద్ద నౌషధము పుచ్చుకొనెదను. నీవు ధైర్యముగ నుండుము. లోనికేఁగి భోజనముచేయుము" అని రాజు హెచ్చరింప సుమతియుఁ గల్యాణియు లోనికిం జనిరి.

వారు వెళ్లుచుండ "అక్కా! వాగ్దాన మెట్లు చెల్లించు కొందువో!" అని సుమతినిగూర్చి నర్మద పలికెను.

అనంతరము విదూషకునకు వైద్యునకు నీక్రిందిసంభాషణము జరిగెను.

విదూ:- అయ్యా! తమ పేరేమి?

వైద్యుఁడు:- అమృతహస్తుఁడు.

(తనలో) "తెలివితేట లెటులున్నవో కాని పేరుమాత్రము విన్న కడుపు చెక్క లగుచున్నది" (ప్రకాశముగా) "అయ్యా! తా మెప్పుడయిన పెరుగుతోఁటకూరపులుసు పుచ్చుకున్నారా?"

"ఇప్పుడు దానిప్రశంస యెందుకు?"

"వైద్యులు గాన యడిగితిని. పెరుగతోఁటకూరలోని పెరుగు ఆవుపెరుగా, గేదెపెరుగా! దాని గుణ మేమి? ఈరెండుసంగతులు తెలియవలెను."

"వెఱ్ఱివాఁడా! పెరుగుతోఁటకూర యని పేరున్నమాత్రముననే యందులో పెరుగు గలదని యెంచితివా?"

"ఆలాగుననా! అయ్యా! తమ యమృతహస్తనామము నట్టిదే కాదుకద!"

(తనలో) "వీఁడు నన్ను వంచింప మొదలుపెట్టినాఁడు. నాకార్య మెట్లునిర్వహింపఁగలనో?"

అంత రాజు "అమృతహస్తా! ఆహావమాకునితో నీకు సంభాషణ మెందుకు? ఇట్లు వచ్చి నాయొద్దఁ గూర్చుండుము" అని చెప్ప వైద్యవేషముననున్న నర్మద యాతనియొద్దఁ గూర్చుండెను.

మరల విదూషకుఁడు కొంత కొంత వక్రభాషణము గావించి "రోగములు పుట్టురోగములు, పెట్టురోగములు నని రెండురకములు. ఈరెంటిలో నీరాజుగారి రోగమేదియో బాగుగఁ బరిశీలించుట కర్తవ్యము" అని వచించెను.

పురుకుత్సుఁడు "వయస్యా! బాగుగఁ జెప్పితివి. అమృతహస్తా! మ్మాటలాడుటకు శక్తి లేదు. నాప్రారబ్ధ మేమని చెప్పఁగలను.

వైద్యులు మీయొద్ద దాఁచిన వినియోగము లేదు. (ఉస్సురనుచు) అయ్యో ! నర్మదా !" అని పలవించును.

అతనిస్థితి కెంతయు వగచి నర్మద (ప్రకాశముగా) "రాజేంద్రా! ఏమో చెప్పఁబోయి యూరకుంటివి గదా !" అనెను.

రాజు మరల (ఉస్సు రనుచు) "ఏమున్నది! నర్మద యీరీతిగా నాగొంతు కోసినది" అనెను.

ఇట్టు లేవేవియో కొన్నివాక్యోపవాక్యములు జరిగినతర్వాతఁ బురుకుత్సుఁడు "వైద్యశిఖామణీ ! ఇంద్రసభామంటపమున నుండు నర్మదారూపము గు బంగారపుబొమ్మ యిప్పుడుగూడ వచ్చటనే యున్నదిగదా !" యని యడిగెను.

అందుకు నర్మద (తనలో) "ఒడలు జలదరించుచున్నదే! యేమని చెప్పుదును" అని యనుకొని (ప్రకాశముగా) "నీయెదుట నా ప్రతిమ యేలాగున నుండెనో ఇప్పుడుగూడ నాలాగుననే యున్నదను కొనుము" అనెను.

అంత నామెముఖమును బరిశీలించుటకు దూరముననున్న దీపమును దనదగ్గఱకుఁ దెమ్మని విదూషకుఁడు దానిని రాజుసమీపమున నుంచును. రాజు పరిశీలించి .

"మోము వైఖరి యల్లదే ముదితవ్రేళ్ల
తీరు నయ్యదె మాటలసౌరు నదియె
మగతనము వచ్చి యన్నింటి నగడుచేసె
మంచు పడి మోటుదేరు పద్మములమాడ్కి."

అని పురుకుత్సుఁడు తలపోసి "నీవు నర్మదకు సోదరుఁడవు కావుగద" అని వైద్యునిఁ బ్రశ్నించెను.

"నర్మద యెవరో దానిసోదరుఁ డెవరో అది యెచటనున్నదో కూడ నే నెఱుఁగకున్నవాఁడను. కానిమ్ము. ఈయనవసరసంభాషణ

ములతోఁ బనియేమి ? నీచేతి నిట్లు తెమ్ము" అని వైద్యుఁ డనెను. చేతి నిచ్చుచు రాజు

"నాదుదక్షిణహస్తంబు నర్మదాను
భాంగి కొసఁగంగఁబడియె నోయమరవైద్య !
నీవు నర్మదరూపున నివ్విటిలుట
నీకు నిచ్చెద నొకసారి నెమ్మి నిదిగొ."

అనియెను. అమృతప్రాయమగు నాయమృతహస్తుని హస్తస్పర్శమున రాజునకుఁ గొంతతాపజ్వరము తగ్గెను. కొంతసేపటి కావైద్యుఁడు "రాజేంద్రా ! నీయిష్టసఖుఁడు చెప్పినట్లు లిది పెట్టురోగమే. దీని కౌషధములు లేవు. మంత్రమువల్లనే యీవ్యాధి సాధింపవలసియున్నది. నేను నీతొడపైఁ గూర్చుండి నీమెడపైఁ జేయివైచి యొకపావుగడియసేపు జపము చేయవలసియున్నది. అది నీ కంగీకారమేనా?" అని యడిగెను.

(పెద్దనవ్వునవ్వుచు) "ఎంతవెఱ్ఱివాఁడవు. అందుకు నే నంగీకరింపకపోదునా! ఏదీ, ఇట్లు శీఘ్రముగ రమ్ము" అని యాతనిని దొడపైఁ గూర్చుండఁబెట్టుకొనెను. వైద్యుఁడు జపముసేయ నభినయించెను.

రాజు (తనలో)

"ఉరగలోకమందు నువిద నాతొడపైని
నెనసియున్నయప్పు డిట్టిసుఖము
పొందినాఁడఁ గాన పురుషుఁ డీతఁడు గాఁడు
కోర్కు లిచ్చు నాదుకొమ్మ యేమొ !"

అని తలంచెను.

మఱికొంతసేపటికి వైద్యుఁడు లేచి "రాజేంద్ర ! నా జపమైనది. నీ కెట్టులున్నది ?" అని యడిగెను.

"నా కేమియు జబ్బు లేదు. అత్యంతసుఖవంతుఁడనై

యున్నాను" అని యూతఁడు బదులుపలికెను.

"నీకు సుఖముగ నున్నదికావున నే నిఁకఁ బోయెదను" అని వైద్యుఁ డనెను.

రా జాతనిరెండుచేతులు పట్టుకొని "అయ్యో! అయ్యో! నన్ను విడిచి పోయెదవా?

"నర్మదను గాంచుభాగ్యంబు నాకు లేదు
నాదుపాలిటి కీవైతి నర్మదగను
రాష్ట్ర మిఁక నీదె నీవె నారాజవైతి
వుండు మిచ్చట నిన్గొల్చుచుండు నేను."

అని హెచ్చరించెను.

విదూషకుఁడు "అయ్యో! ఎవఁడో మంత్రగానికి పూర్వార్జితమైన రాజ్య మిచ్చెదవా? ఎంతమతిమాలినవాఁడవయితివి. రాజ్యమును ధారవోయుటకు నీ వెవఁడవు? నీ కేమియధికార మున్నది? మే మెవరము సమ్మతింపము. మోహపీడితుఁడవు. తత్కారణమున జ్ఞానశూన్యుఁడవు. అందుపైని జ్వరార్తుఁడవు. మీఁదుమిక్కిలి యీతని మంత్రములు నీతల కెక్కినవి. ఇట్టిసమయమునఁ జేసినవాగ్దానము వాగ్దానము గాదు. ఇచ్చునది యీవి కాదు. జాగ్రత్త! జాగ్రత్త!" అని వారించెను.

ఇట్లు రాజునకు విదూషకునకు వాదోపవాదములు జరుగుచుండ వైద్యుఁడు "నాకు నీరాజ్యముతోఁ బనియేమి? నీతోఁ బనియుండియే వచ్చితిని. నీవే సర్వమును పాలించుకొనుము" అని వచించెను.

"అట్లుకాదు. నారాజ్యమును నీవు స్వీకరింపకతప్పదు. నీకు నేను సేవకుఁడ నగుదును" అని చెప్పుచు రాజు, వైద్యునితలపైనున్న పాగఁ దీసి తనకిరీటమును బెట్టఁబోవును. "ఆహా! ఏమిది! ఏమి

నర్మదా ! హా నర్మద !

"మున్ను మూర్ధము ముద్దిడ నన్ను నీవె
ముద్దుఁగొనినట్లు కనఁబడె ముదిత ! యేమి
యనిన మాజాతివారికి మణి శిరంబు
నందు వెలుఁగొందు నని చెప్పి తప్పుడు నీవు."

"అదిగొ మణి నేను ముద్దుగొన్నదియె యిచట
పాపటకుఁ జట్టచివరను బ్రతిభ గాంచు
గాఢమోహంబునను దారి గాంచి యొక్క-
దరిని జేరిన నాదుచిత్తంబుకరణి."

అని యామెను గాఢముగఁ గౌఁగిలించుకొని మున్ను తానొసంగిన మణియుంగరమును నామెచేతిపైఁ గాంచి యామెయొసంగిన యుంగరమును తనచేతిపైని జూపి యిరువుర చిటికెనవ్రేళ్ళను నొక్కటిగఁ దగ్గఱఁ జేర్చి బలవంతముగ నర్మదపై నంగీ దీసివైచెను. సిగ్గుపడి యామె యట్లే నిలిచిపోయెను. తనకు భయము వైచుచున్నదని చెప్పెను. "తిరిగి యెవ్వఁడైన గ్రహించుకొనిపోవునని భయపడెదవా!" అని రాజనెను. "మున్ను ని న్నాకాశమునఁ దీసికొనిపోయినయాతఁ డెవఁ"డని విదూషకుఁడు ప్రశ్నించెను. "ఇంద్రునియాజ్ఞచేఁ జిత్రకేతుఁడను నాసోదరసమానుఁడు" అని యామె యుత్తరమిచ్చెను. ఆకస్మికముగ సంఘటిల్లిన యాపునస్సమాగమమున రాజు నిర్భరానందమగ్నుఁడై యుండ విదూషకుఁడు "రాజా ! నాసంతోషమును బట్టఁజాలకున్నాను. ఓరాజా ! ఓదేవా ! ఓదేవా !" అని గంతులు వైచుచు నవ్వఁజొచ్చెను.

అంత సుమతి లోననుండి తొట్రుపాటుతో వచ్చి రాజును గౌఁగిలించికొని "ఎందుల కెందులకు రాజా ! యెటులుంటివి" అని ప్రశ్నించెను. రాజును విదూషకుఁడు సంభ్రమమును జెందిరి. నర్మద

సుమతిని జూచి "అక్కా! పురుకుత్సుని కారోగ్యమును గలుగఁ జేసినయెడల నేనుకోరినదంతియు నిచ్చెదనని మంగళసూత్రముతో వాగ్దానము చేసితివి. నీకాంతునకు సంపూర్ణమైన యారోగ్య మిచ్చితిని. నేను కోరునదేమనఁగా, నీకాంతుని నాకీయుము" అనెను.

"దేవీ! బక్కపలచనివానికి పైకి నొక్క మోస్తరు లోపల నొక మోస్తరు నని నేఁ జెప్పినమాట వినకపోతివి" అని విదూషకుఁడు వాక్రుచ్చెను.

"సుమతి (నర్మదవంక నెట్టబారఁ జూచి) ఛీ! అవతలకిఁ బొమ్ము. నీ వెవతెవు? అమృతహస్తున కిచ్చెదఁ గాని నీ కిచ్చెదనంటినా?" అని ముదలకించెను. అంత రాజు

"అమృతహస్తుఁ డిదియె యమృతాధరయు నిదె
నేను వలచినట్లు నీకు నిలేఁడు
చెప్పవోలఁతి యిదియె యిప్పు డీవిచ్చిన
నియ్యకున్న దీనికే నిజంబు."

అని వెల్లడించెను. "నీకు నిశ్చయముగ నారోగ్యముగ నున్నదా" అని సుమతి రాజును మరలఁ బ్రశ్నించెను.

"నే నబద్ధ మెట్లాడఁగలను? ఇంతయారోగ్యస్థితి నాజన్మములోనే యెఱుఁగ" నని యాతఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

అంత సుమతి "రాజా! నిన్ను నే నిచ్చుటకు నా కేమియధికారమున్నది: నర్మదా! ఈ రాజు నాచేత నొకరి కీయఁబడునంత యస్వాతంత్ర్యము గలవాఁడనని యాతఁడు చెప్పినచో నీ వతనిని దీసికొనవచ్చును" అనెను.

పురుకుత్సుఁడు తల వంచుకొని నవ్వుచు మాటలాడ కూరకుండును. "ఏమి దీర్ఘాలోచనము చేయుచున్నావు. మాటాడవేమి" అని నర్మద పలుక సుమతి "మహాచక్రవర్తివి. సర్వస్వతంత్రుఁడవు.

ఆలోచించి మఱి మాట్లాడుము" అనెను.

"ఏకకాంత యుండ నేనస్వతంత్రుండ
నిద్ద ఱుండ వేఱ యెన్న నేల ?
నొక్కచిలుక ప్రాల నొగి జోగు జొన్నవె
న్నునను జోడు ప్రాలు నవువు గాంగ"

అని ప్రకటించెను.

"ఇంతయస్వతంత్రుఁడ వైననీ మొగము చూడరాదు. ఈమెను బురుషవేషమున నీవే తీసికొనివచ్చి నన్ను వంచించితివి" అని సుమతి కోపముతో వెడలనుంకించెను. పురుకుత్సుఁ డామెచేతులు పట్టుకొని "అయ్యో ! నే నేకర్మ మెఱుఁగను. దేవీ ! నన్ను కటాక్షింపుము" అని బతిమాలెను.

నర్మద "నాథా ! నీభార్య నిన్ను నాకిచ్చినది. ఇఁక నీ వటు పోవలదు. ఇటు రమ్ము" అని యాతనిచేయి పట్టుకొని లాగును. రా జామె గడ్డము పట్టుకొని "నర్మదా ! ఒక్కనిమిషము క్షమింపుము. సుమతీ ! నేను నిర్దోషిని. నన్ను కటాక్షింపుము" అని ప్రార్థించెను.

ఆతనిగతి యిరువురపెండ్లములమగఁ డీఱుకునఁబడె నన్నట్టు లయ్యెను.

విదూషకుఁ డిది చూచి (తనలో) "జాగిలపునోటిమధ్య నడవి పంది చిక్కినట్లున్నదికదా" యనిచింతించి, (ప్రకాశముగా) "సుమతీ! ధర్మశాస్త్రనిపుణుఁడ నయిన నే నొకసంగతి చెప్పఁబోవుచున్నాను విను. అజ్ఞతచేఁ జేయఁబడినవాగ్దానము నెఱవేర్పఁదగినది కాదు. ఈవైద్యుని నర్మదగా నెఱుంగక నీవు చేసిన ఖరారు చెల్లఁదగినది కాదు. ఈవ్యవహారము న్యాయసభ కెక్కవలసినదై యున్నది. కాని న్యాయాధిపతియైన రాజు ప్రతివాదికి పాక్షికుఁడు. ఈతగవు నా యొద్దకు మార్చినయెడల..."

అనునంతలో "ఛీ! ఊరకొమ్ము" అని రాజు ముదలకించెను. తుద కాతఁడు సుమతీనర్మదల నిరువురనుగూడ క్షమించి కటాక్షింపుఁడని బతిమాలి

"ఇంతి! నీసొత్తు కేవల మేను గాను
సుమతి! కేవలమును నీదు సొమ్ము గాను
వరుస మీరిద్దఱును నన్నుఁ బంచుకొనుఁడు
లలిని బ్రాక్ప్రతీచ్యమూర్ధగోళములు వరుస
తరణికాంతిని గ్రహియించుకరణి గాఁగ."

సుమతీ! నీ కిష్టమేనా? ఓ యురగలోకవాస్తవ్యా! ఇటు రమ్ము. ఇటు రమ్ము. నీకును సమ్మతమే కదా?" అని వచించెను.

ఇంతలో నర్మదతండ్రి యురగలోకాధిపతి మందారుఁ డామె కొఱకయి వెదకివెదకి తిరుగుచున్నవాఁడు రంగమునఁ బ్రవేశించును.

"ఒక్కగానొక్కకూఁతురు ముక్కపచ్చ
యైన నారనికన్యక నేను కనుల
కఱువుదీఱఁగఁ గాంచి సుఖంబుఁ బడయ
మాయమైపోయె నేమందు మాయవిధిని."

"ఉరగలోక మెల్లఁ బొరిపొరి గాలించి
దానిఁ జూడలేక ధరణిఁ జేరి
యుంటి నిటను లేకయున్న స్వర్గమె నాకు
దిక్కు గాని యేమి దిక్కు గలదు?"

కాని యొక్కగాలికబురు నాచెవిఁబడె
చక్రవర్తియింటఁ జాన కలద
టంచు వానిభార్య యగుటకు వచ్చెనో
కాకయున్న నేమికారణంబు?"

"పండువంటికులము భస్మమై పోవఁగ
సిగ్గు విడిచి మగనిఁ జెందఁగోరి
యూరనూరఁ గాక యొగి లోకములనెల్లఁ
దిమ్మరిల్లుచుండె బమ్మ్రవాఁత."

ఇత్యాదిగాఁ బరిపరివిధములఁ బరితపించుచు రోషావేశముతో నాతఁడు వచ్చెను.

"అతఁడు నేను సములమైన నాతనియింటి
కేను పిలువకుండ నేఁగుచుంటి
పిల్లకొఱకుఁ గాదె వెతలిన్ని పడనయ్యెఁ
గడుపువంటితీపి కలదె యొకటి ?"

అని వాపోవుచు రాజమందిరద్వారముకడ నిలిచి "మీరాజును జూడ మఱియొకరాజు వచ్చె" నని ద్వారరక్షకునితోఁ జెప్పెను. ఆతఁడు లోనికిఁ బోయి చెప్పఁ బురుకుత్సుఁ డాతఁ డెవరయియుండు నని యాలోచించి లోనికి రండని కబురుచేయును. మందారుఁడు లోని కేఁగఁగనే నర్మద పరుగెత్తుకొనివచ్చి కాళ్లపైఁ బడి "తండ్రీ! క్షమింపుము, కటాక్షింపుము" అని వేఁడికొనును.

"ఛీ ! దుర్మార్గురాలా !

"తండ్రి చచ్చె ననుచుఁ దలఁచితివే నీవు
భయము లేక సిగ్గుఁ బాఱఁదోలి
మగనికొఱకు నీవె మహియెల్లఁ దిరిగెదు
కాలుగాలుపిల్లికరణిఁ గాఁగ."

ఛీ! దుష్టవర్తనురాలా ! నావెంట రమ్మ" అని బలాత్కారముగ నర్మదను చేయిపట్టుకొని తీసికొనిపోవ నాయత్తమయ్యెను.

పురుకుత్సుఁ డదరిపడి కత్తి చేతఁబూని "ఓహో ! ఇతఁడు నా మామ కాఁబోలు; నయిన నేమి ? ప్రాణము పోయినను శూరుఁడు

మానము దక్కించుకొను ననుచు, ఛీ! మూర్ఖుఁడా!

"కత్తి వ్రేటు దినెదో కాంతను విడిచెదో
మామ వగుట రెండుమార్గములను
జూపినాఁడఁ గాని చూపుతో నాకత్తి
యెట్టిబాఱవలయు నిట్టికటిని."

అని విజృంభించెను.

"ఛీ చోరుఁడా! మాంత్రికుఁడా! మాయమంత్రములను నా బిడ్డను నరగలోకమునుండి లాగి తెచ్చితివిరా? మించుకన్నెల సిగ్గు హరించుటకేనా బ్రహ్మ యీభూలోకరాజ్యమును నీపాలు చేసినది? నాకూఁతును నీవు హరింప నామెను నేను గొనిపోవుట తప్పుగాఁ దోఁచెనా? దొరను మించినయధికారి దొంగఁ జేసి యిట్టులే గ్రుడ్డిగా రాజ్య మేలుచుంటివా" అని నిష్ఠురోక్తు లాడి మందారుఁడు "నాకూఁతును నేను విడువను. చేతనైనయెడల యుద్ధమునకు రమ్ము" అని పురుకుత్సునికి బదులుచెప్పెను. అవశ్య మిదిగో వచ్చెద నని వయస్యునితో ధనుర్బాణముల సిద్ధపఱుపుమని పురుకుత్సుఁ డనెను.

"ఇదిగో నేనును సిద్ధమగుచున్నాను. అవశ్యము తగుస్థలము చూచి యిప్పుడే యుద్ధ మారంభించెదము" అని మందారుఁడు పలికెను.

ఇటు తండ్రి, అటు తానువలచిన నాథుఁడు తనకయి యొకరి నొకరు సంహరించుకొననుద్యమించుట చూచి నర్మద వలవల ఏడ్చుచు వారిని వారింప నెంతయో యత్నించెను. కాని తండ్రిచీవాట్లుతప్ప ఫల మేమియు లేదయ్యెను. దూరమున కేఁగి యిప్పట్టున నామె కరుణరసము కురియుచుఁ దనలోఁ గావించికొనిన ప్రలాపములు వర్ణనాతీతములు. అప్పు డామె శచీపురందరులు తను వంచించిరని వారు మృషావాదులనికూడ నిందించెను. తుద కామె యాత్మహత్య చేసికొన

నెంచి "గ్రుక్కెఁడుప్రాణ మదెంతసేపు పోవలెను. నానాథుని కరస్పర్శచేఁ బరమపూజ్యమయిన పైఁటకొంగును గొంతున కురిపోసికొనెదను. అయ్యో, నాకు గళసూత్రమే కాని మంగళసూత్రయోగము లేదయ్యెనా ?" అని కొంగును కన్నుల కద్దికొని "తండ్రీ ! నమస్కారము. నాథా ! నమస్కారపూర్వకముగా దూరముననుండి కన్నుల చేతనే కౌఁగిలించుకొనుచున్నాను. హా ! ఇంద్రా ! మాయకాఁడా ! నీవలనఁ జెడితిని" అని గొంతున కురి పోసికొని హరహరా ! యని నేలపై వ్రాలును.

అంత నాకాశయానమున శచీపురందరు లవతరించిరి.

"నర్మదా ! నర్మదా ! ఆఁగు మాఁగుము. ఇంద్రుఁడు మృషావాది కాఁడు. లెమ్ము. లెమ్ము" అని యామెను లేవనెత్తెను. అదరిపడి లేచి నర్మద "మహేంద్రా ! నమస్కారము. నా పెనిమిటిని నాకు దయచేయుము" అని ప్రార్థించెను.

"అందుకొఱకే గద వచ్చితిని" అని ఇంద్రుఁడు నవ్వుచుఁ బలికెను.

శచియు నవ్వుచు "నర్మదా ! ఇల్లాలిమాట యసత్యము కాలేదుగదా" అని ముదలకించెను.

నర్మద యామెకు నమస్కరించి "తల్లీ ! క్షమింపు" మనెను.

ఇంద్రుఁడు పురుకుత్సునిదెసఁ జూచి "పురుకుత్సా ! ఏమి యీవింత ? అతనికూఁతురు నీప్రక్కను, నీకత్తి యతనిప్రక్కనా ! చాలు, చాలు. మామగారిని శిక్షించునంతటి మహాగుణ మీశ్వర భక్తివలనఁ గలిగినది కాఁబోలు నేమి ? చాలు; ఊరకుండుము" అని మందలించెను.

ఇంద్రునకు నమస్కరించి "తమయిష్టానుసారమే నడుచువాఁడను" అని పురుకుత్సుఁ డనెను.

అంత మందారుఁడు నమస్కరింపఁ బురందరుఁడు "కల్యాణ మస్తు. మందారా! నీవు నాకు స్నేహితుఁడవు. నేను చెప్పినట్లు విను వాఁడవేకద" అని వచించెను.

"తులసీదళమువలెఁ దమయానతిని శిరసా వహింతు" నని మందారుఁ డనెను.

ఇంద్రుఁ డాతనిఁ జూచి "అట్లైన వినుము. నాకు పుత్రసముఁ డగు మాంధాత పరలోకగతుఁ డగుటచే ఆతనికుమారుఁడైన పురుకుత్సునకు నేనే తండ్రివంటివాఁడను. నర్మదకుఁ దగినవరుఁడు పురుకుత్సుఁడే. వారిదాంపత్యమునకయి మనమిద్దఱము వియ్య మందవలసి యున్నది. వీరిద్దఱను సంఘటనసేయుటయందు నీప్రధానియగు నంసుమంతుఁడు, నాసఖుఁడగు చిత్రకేతుఁడు, నేనునుగూడ మిక్కిలి శ్రమ చేసితిమి. అంసుమంతుఁ డాకస్మికముగ మరణించుటచేఁ బాప మీ సంగతి నీకుఁ దెలియనందుకు విచారించుచున్నాను" అని వచించెను.

"మహానుభావా! తమయిష్టప్రకారమే నడువవలసినవాఁడను. సెలవైనయెడల నురగలోకమున వివాహ మొనరింతును" అని మందారుఁ డనెను.

ఇంద్రుఁడు (నవ్వుచు) "మిత్రమా! నేనిచ్చట నుండ నిదియే యింద్రలోకము. నీ వెచ్చటనుండ నదియే యురగలోకము. ఈపురుకుత్సునిది భూలోకమేకద! మూఁడులోకము లిచ్చట సమావేశమైనవి. వివాహమున కింతకన్నఁ దగినస్థల మేది?" అని బదులుపలికెను.

"ఆలస్య మెందుకు? నేను బ్రహ్మనై వివాహము చేయించెదను" అని పురుకుత్సునివయస్యుఁడు విదూషకుఁడు ముందుకు వచ్చెను.

అంత విశ్వామిత్రమహర్షి ప్రవేశించి "ఆఁగుమాఁగుము. పురుకుత్సుఁడు చెప్పినట్లు వ్యతిరేకబ్రహ్మనైన నేను వచ్చుచుంటిని.

పురుకుత్సా ! ఇప్పుడు నా శాపమునకు విమోచనము కలిగినది.

"బ్రహ్మ సృష్టించు నిక్ష్వాకువంశజులకు
సురలలోకమె గతి యింతవఱకు నీవు
భళిర ! తద్వ్యతిరేకపుబ్రహ్మ వగుట
నాకిఁ ధోలోకగతి యిచ్చినావు కాదె ?"

అని నన్నధిక్షేపించితివి జ్ఞాపక మున్నదా ?" అని హెచ్చరించెను.

ఆతనికి నమస్కరించి "అయ్యా ! క్షమింపుము" అని పురుకుత్సుఁ డనెను. పురందరిమాంధాతు లిరువురుఁ గూడ నామహర్షికి నమస్కరింపఁ గల్యాణమస్తు అని వారి నాశీర్వదించి "వివాహముహూర్తము సమీపించుచున్నది. సూర్యోదయ మైనవెంటనే సుముహూర్తము. అదిగో భాస్కరుఁ డుదయించుచున్నాఁడు.

సీ. అల్లుఁడో నీదు పాదాబ్జంబు లీతఁడు
కడుగఁ దెచ్చినరత్నకలశ మనఁగ
కన్యాప్రదానసత్కారమునకు నీకుఁ
గట్టెడు మేల్చాపికం బనంగ
వియ్యాలు లోకరిపై వేఁక నొక్కరు జల్లఁ
బట్టిన బగ్గుండఁపల్లె మనఁగ
(నర్మదవంకఁ దిరిగి)
ప్రాకృతి నీదుసౌభాగ్యవృద్ధి కొసంగు
బంగారుకుంకుమబరిణి యనఁగ
(పురుకుత్సునివంకఁ జూచి)
గీ. పరిఢవిల్లుచు భవదీయవంశనాథుఁ
డైన రవి పెండ్లిపెద్దయై యలరుకతన
వచ్చెఁ జూడఁగ నన నిదే ప్రాగ్ధరమునఁ
బ్రోలుచు నత్యుత్తమప్రభాపూర్ణుఁ డగుచు."

అని యుద్బోధించెను.

అంత విశ్వామిత్రమునీంద్రుని యాధ్వర్యమున నర్మదాపురుకు త్సులవివాహము మంగళప్రదముగ నెఱవేఱెను. మందారుఁడు పురంధరుఁడు నిరువురుదంపతుల నాశీర్వదించి వరము లొసంగిరి "గాధ నందనా! తాముగూడ పీతనికి వర మొసంగెదరా" యని యింద్రుఁడన నాతఁడు (నవ్వుచు) "నాయాశ్రమమున దుష్టుని జంపినప్పుడే యీతనికి వరం బిచ్చితి. వినను నర్మదా!

"ము న్నురగలోకమందున, భువిని పిదప
దివిని తరువాత నటమీఁద భువిని దిరిగి
యిటనె యైదవపరి పతి నెనయు నీకు
నైదువతనంబు శాశ్వతం బగునుగాక!"

అని యాశీర్వదించెను. పురుకుత్సుఁడు "అయ్యా, ఋషిసత్తమా! ఇంద్రాదిదేవతల దర్శించియు తిరిగి భూలోకమునకు వచ్చి సూర్య సమానుఁడగు పుత్రుని గాంచి సుఖింతు వని తాము నాకు సెలవొసంగిరి. అంతయు నెఱవేఱెను కాని..." అనునంతలో విశ్వామిత్రుఁడు (నవ్వుచు) "నీతాత యువనాశ్వుఁడు సంతానముకొఱ కింద్రయాగ మును జేసి నీతండ్రియగు మాంధాతను గాంచెను. అతని కింద్రయాగ మునఁగాని ప్రత్యక్షముకాని దేవేంద్రుఁడు నీమహాదృష్టవశమున నిప్పుడే శచీసహితుఁడై ప్రత్యక్ష మయ్యెను. నీచేత నిప్పు డింద్రయాగమును చేయించుకొఱకే వచ్చియుంటిని. యాగదీక్షితుఁడవు గమ్ము. నీకు సంతానము కలిగినదనే భావింపుము" అని చెప్పెను.

పురుకుత్సుఁడు "మహేంద్రా! తమసెలవుగూడ దయచేయఁ బడునుగాక" అని విన్నవించెను.

"అవశ్యము చేయుము. ఇఁక నిక్కడ నవశిష్ట మేమియున్నది" అని యింద్రుఁ డనెను. విదూషకుఁడు ముందుకు వచ్చి "ఒకయువ

శిష్టము ఉన్న" దనెను. "ఏదన, హోమముకూడ జరుగవలెను. సప్త గ్రహశాంతికై యది యావశ్యక" మని హెచ్చరించెను.

"ధరణి యీతిబాధలు లేక తనరుఁగాక
ప్రజల యన్యోన్యవైరముల్ పాయుఁగాక
కవిత రాజపోషణమునఁ గ్రాలుఁగాక
నీతిపాలనమున రాజు నెగడుఁగాక!"

అను భరతవాక్యముతో నాటకము ముగియును. ఈభరత వాక్యపద్యముతోడనే పంతులుగారి యితరనాటకములును ముగియు చుండును. పురుకుత్సునికుమారునిపే రీనాటకమునఁ జెప్పఁబడలేదు. కాని భాగవతమునుబట్టి యాతనికి త్రసదస్యుఁ డనుపుత్రుఁడు కలిగినట్లు తెలియనగును.

1900 సంవత్సరములో రచింపఁబడిన యీనాటకము 1900–1909 సంవత్సరములమధ్య మూఁడుముద్రణముల నందినది. తరువాత మరల ముద్రింపఁబడినది లేనిది తెలియదు. ప్రతు లిప్పుడు దొరకు నట్లు లేదు. కథయు నంతప్రచారమున లేదు. కాన సంగ్రహింపఁ దలఁచియుఁ గథను గొంత విస్తరించితి నేమో యని చింతిలుచున్నాను. పంతులుగారి రచనావిశేషములను గొంతవఱకుఁ బూర్వోదాహృత భాగములవలననే గ్రహింపవచ్చును. అయినను వానినిగుఱించి మఱియుఁ గొంత వివరింతును. పాత్రములసంభాషణములలో నెదుటి వారి చరితములందలి లోపములను దోషములను వ్యంగ్యముగనో ప్రకటముగనో హాస్యరూపకముగనో దెప్పిపొడిపించుట వీరిరచనలందలి యొక విశిష్టవిశేషము.

ఇందుకుఁ గొన్ని యుదాహరణములు:—

ప్రథమాంకమున విశ్వామిత్రుఁడు పురుకుత్సు నధోగతుఁడవు కమ్మని శపించినప్పుడు పురుకుత్సుఁడు నగుచు

"ఓటమితప్పని యని దుస్సిని బెండినాఁడ
మునిమృగం బయ్యె నది;..."

అనుపద్యమున "మునిమృగం బయ్యె" నంనుటిస్వారస్యమును గుర్తించి చిత్రకేతుఁడు "అహా! యీమాటలు యాదృచ్ఛికముగఁ బలుకఁబడినవయినను, చక్రవర్తి యెడల నిర్దాక్షిణ్యమును గనఁబఱిచిన యామునియెడల యథార్థ మగుచున్నవిగదా!" యని సూచించును. మఱియు విశ్వామిత్రుఁడు తనశాపమును పాటింపఁబోవను గాన యథోలోకగతి స్వల్పకాలమయినను దప్పదని చెప్పినప్పుడు హరిశ్చంద్రుఁడు "తప్పదా! మునిసార్వభౌమా! బ్రహ్మ యిట్టివారికంతవారలకు సురలోకగతి యింతవఱకు విధించియుంటేఁ దప్పనిలేదు. బ్రహ్మ వగుట నీవు నా కథోలోకగతి నిర్ణయించితివిగదా!" యని యాక్షేపించెను. ఇది విని అంశుమంతుఁడు "రాజా! బాగుగా నెత్తిపొడిచితివి" అనెను. చిత్రకేతుఁడు "నెత్తి పొడిచిన బాగుగనే యుండును" అనెను. ప్రమత్తసంశ్లేషముచే "నెత్తిపొడుచు" శబ్దము అంశుమంతునినోట "నెత్తిపొడుచు" కాఁగా చిత్రకేతుఁడు దానినే "నెత్తిపొడిచిన" అనఁగా విశ్వామిత్రునిశిరస్సునే పగులఁగొట్టిన అనునర్థములో నుపయోగించుటలోని శబ్దచిత్రములు గమనింపఁదగినవి. "శాపమునను గడువైనను సెలవిండు" అని పురుకుత్సునిసఖుఁడు విమోషకుఁడు విశ్వామిత్రునిఁ బ్రార్థింపఁగాఁ బురుకుత్సుఁడు "మిత్రమా! గడువుతోఁ బనియేమి?

"ద్యుమణికులజుఁడ నగు నా కథోగతి యొక
ఘటిక గానేమి వేయేండ్లు గాఁగ నేమి?
యతి వ్యభిచరించువాఁడైన నాతఁ డెంత
కాల మెందఱితో ననుగడువు లేల?"

అని వచించును.

ఈ పద్యమున రెండుమూఁడుపాదములు కపాల మంటునట్లు మేనకాసాంగత్యము నుద్దేశించి పురుకుత్సుఁడు తన్నెత్తిపొడుచుటకే ప్రయోగించె నని గుర్తించి విశ్వామిత్రుఁడు "ఈమాటలు నాశాపము కంటెను తీక్ష్ణతరములై మేనకాసంగమమును నాకు జ్ఞాపకముచేయుచు మర్మముల నాట పొడుచుచున్నవిగదా" యని లోలోన వాపోవును.

ఇట్టిచమత్కారములను పాత్రములసంభాషణములలో యాదృచ్ఛికముగనే దొరలినట్లు పాఠకులకు స్ఫురింపఁజేయుటలోఁ బంతులు గారు చాల నిపుణులు.

ద్వితీయాంకమందు నిద్రలోనున్న పురుకుత్సునిఁ జంద్రకాంత శిలావేదికపైఁ జూచినసందర్భమున నర్మదసఖి నవమాలిక యామె చిత్రపటము వ్రాసి రాజుప్రక్క ను బెట్టును. అంత నర్మద "నాపటము నారాజుప్రక్క నెందుల కుంచితివి?" అని నవమాలికను గద్దించును.

"నీరాజు కనుకనే యుంచితిని. ప్రక్క నెందుల కుంచితి వని యాక్షేపించుచుంటివా? పోనిమ్ము భావిసంభావసూచనగాఁ బైనే పెట్టెదనులెమ్ము" అని యాచిత్రపటము తీసి యాతనివక్షముపైఁ బెట్టును.

"ఛీ! యేమిచేసితివి" అని తటాలునఁ బోయి నర్మద యాపట మును రాజునురముపైనుండి తీసి మరలఁ బ్రక్కనే పాఱవేయును. "నాపటమున్+ఆరాజు"ఇచ్చటఁగూడ గుణసంశ్లేషముచే"నారాజు" కాఁగా, "నీరాజు" గనుకనే యని నవమాలిక యెత్తిపొడుచుటలోని చిత్రము గమనింపఁదగినది.

పాత్రములసంభాషణములలో పూమొగ్గలువోలెఁ దామే విడు శబ్దశ్లేషలు చేమకూరవేంకటకవి విజయవిలాసమునవలెఁ దఱచుగ వీరి రచనములోఁ గనవచ్చును.

నిద్రనుండి లేచి కనులు నులుముకొనుచుఁ బురుకుత్సుఁడు మునుముందు "ఓహో! గాధినందనా!" అని స్మరించి,

"వెనుక నిద్ర లేచు వెంటనే శివశివా!
యంచుఁ దలఁతు నిప్పు డందు "గాధి
నందన" యని చిత్తమందు ముందుగ నుండుఁ
బెట్టువానికంటెఁ దిట్టువాఁడు."

అంత నంశుమంతుఁడు,

"పరమభాగ్యకలితపురుషుల కిలలోనఁ
దిట్టు దీవ నగుట వట్టిమాట
కాదు; చేతఁ బరుసవేది కల్గినవాని
కవని మట్టి బంగ రైనరీతి."

అని ప్రశంసించును.

ఇందు "పెట్టువానికంటెఁ దిట్టువాఁడు; తిట్టు దీవ నగుట వట్టిమాట కాదు; మట్టి బంగ రగును" అనుమాటలందలి జాతీయత, చమత్కృతి గమనింపఁదగును. నర్మద పురుకుత్సునిఁ గని సిగ్గుచేఁ దల వంచఁగా, నాతఁడు "ముఖము వంచినయెడల నీముఖచంద్రకాంతిచేఁ గుచచక్రవాకములు పరితపించును సుమా" అని పరిహసించును.

"సఖీ! ఇనుఁ డెదుట వెల్గుచుండ నట్టిలోపము తటస్థింపదని నీవు చెప్పరాదా" అని నర్మద నవమాలికతో నని మోమెత్తి రాజును గనులారఁ గాంచును.

ఇందలి కవిసమయసంకేతములు, ఇనశబ్దగతశ్లేషలు తిలకింప నగును.

పరస్పరసంభాషణములలో నర్మద పురుకుత్సుని "మీ కెందఱు భార్యలు" అని ప్రశ్నించును.

"ఇదివఱ కొకభార్యయే సుమతి యనునది యున్న" దని యాతఁడు చెప్పును.

"ఆమె మీకర్ధాంగలక్ష్మియేకదా" యని నర్మద పలుకును.

"ఆమె యర్ధాంగలక్ష్మియే యైన నిన్ను
వెలఁది ! నా నెత్తిమీఁదను బెట్టుకొందు
నర్ధనారీశ్వరుండైన యతఁడు పరమ
దయను తలమీఁద గంగను దాల్చుకరణి !"

అని రా జుత్తర మిచ్చెను.

"యథార్థమేనా ?" యని నర్మద మరల ననును.

"ఉరగకాంతకువలె రెండునాలుక లుండునా ?" అని రా జెగ తాళి చేయును.

"మీరు దానికిఁ బ్రభులే యయితిరే. అయినను నాచేతి యందు నీచేతిని బెట్టుము" అని ప్రగల్భముగ బదులుచెప్పును.

పురుకుత్సుఁ డామెచేతిని బట్టుకొని "యిదియే పాణిగ్రహ ణముసుమా !" యని నర్మదను కౌఁగిలించికొనును. ఇందలి చమ త్కృతులుగూడఁ బరిగణింపఁదగినవి.

తృతీయాంకమున పురుకుత్సుఁడు నర్మదగుఱించి విరహవేద నచే డీలువడి విచారించునపుడు విదూషకునకు నతనికి జరిగినసంభాష ణములలో నొకపరి పురుకుత్సుఁడు "మిత్రమా ! దీర్ఘాలోచనము సేయువానివలె మాటలాడకుంటివేమి" యని ప్రశ్నించును.

"అవశుఁడ నయ్యును యథార్థమును గనిపెట్టితివి. సృష్టిసం బంధమయిన యొకరహస్యము నాలోచించుచుంటిని. సముద్రమునకు క్షారోదకము కలుగుటకుఁ గారణముగుఱించి" అని విదూషకుఁ డనును.

"ఎట్లాలోచించితి" వని పురుకుత్సుఁ డడుగ,

"మోహవశ లయినస్త్రీలు స్త్రీలకొఱకుఁ బరస్పరము నేడ్చుట

చేత'' అని విదూషకుఁడు చెప్పెను.

"సృష్టిరహస్యములోఁ గూడ మదనరహస్యము వేఱొకటియా ? స్త్రీలు స్త్రీలకొఱ కేడ్చుటయేమి ?'' యని పురుకుత్సుఁడు ప్రశ్నింప,

"కంటఁ దడిపెట్టకుండుటయేకదా పురుషలక్షణములలో నగ్రగణ్యమైనది" అని "యట్లు స్త్రీయగు నర్మదకయి యేడ్చునాతఁడు స్త్రీయే యగు'' నని వ్యంగ్యముగ గేలిసేయును.

"ఆకాంతారత్నమును నీవు చూచియుండకపోవుటచేతను, మన్మథనారాచతీక్ష్ణత్వ మెఱుఁగకపోవుటచేతను నీ వట్లనుచుంటివి'' అని విదూషకుని పురుకుత్సుఁ డాక్షేపించును.

"ఆహా ! మదనసాయకవ్యథ నే నెఱుఁగననుచుంటివా ? పూర్వము నే నొకపిల్లిని వలచి ధైర్యమును గోలుపోయి...'' అను నంతలో

"ఛీ ! తిర్యగ్జంతువునుగూడ వలచితివా'' అని పురుకుత్సుఁడు గేలిసేయును.

"కీటకమును (పురుగయిన పాము) వలచుటకంటె గౌరవ హానియుఁ బ్రాణహానియుఁ గాదుకదా !'' యని విదూషకుఁ డనును.

"నా నర్మద కేవల సర్పరూపమున నున్నదని భ్రమించుచుంటివా ?''

"పాముఱూపంబు వేణినే పరగు నాశ్రి
యమును పెనవైచు తత్స్వభావము మదీయ
గాఢపరిరంభణమునందె కానిపించు
మానినులకెల్ల నది తలమానికంబు.''

"నేను గూర్చుండ నాతొడపైని శిరముఁ
బెట్టి తెగబారెఁ డగుజడ వెనుకఁ గ్రాల

సుంత వంకగ శయనించె కంతుఁ దలసి
తనతొడను జేర్చెను నసజ్యధనువుభంగి.”

అని పురుకుత్సుఁడు సమాధాన మొసంగును.

“రాజేంద్రా ! నీ వధోలోకమునకుఁ బోయితి నని చెప్పితివి కదా ! రాజకార్యముల మఱచి కేవలము రాగపరవశులై కాలముఁ బుచ్చువారి నెవరినైన నాలోకమునఁ గాంచితివా ?” అని విదూషకుఁడు ప్రశ్నింప,

“ఏమి నన్నే చూచితి” నని పురుకుత్సుఁ డనును.

“ఓహో ! ఏలినవా రుండఁదగినంతయధోలోకమే లేదుగదా” అని విదూషకుఁడు పరిహసింప “నెందుచేత” అని పురుకుత్సుఁ డనును. “భూలోకమునుండి కేవలకాంతాపరాయణు లైనవారికొఱకే యధోలోకము బ్రహ్మచే సృష్టింపఁబడినది. ఆయధోలోకమునకుఁ బోయి యచ్చటఁగూడఁ గాంతాలోలు రైనవా రుందురను ముందు దృష్టి లేక వారికిఁ దగినలోకమును సృజింపకపోవుటచే బ్రహ్మ యజ్ఞుఁడు నప్రాజ్ఞుఁ డయ్యెనుజుమా !” అని విదూషకుఁడు మఱింత తీవ్రముగ నాక్షేపింప,

“మరునిబాణములకంటెను నీమాటలవాడి యెక్కువగనున్న” దని పురుకుత్సుఁ డనును.

“రాజా ! గౌరవమును రక్షించుకొనఁదలఁచినవాఁడు కాంతల వలలలో నెప్పుడును బడఁగూడదు. మోహము గౌరవలతకు వేరు పురుగు సుమా ! మర్మభేదకరమగు మాటలచే మానుషమును బ్రజ్వలింపఁజేసిన దాని విరోధియగు మోహము శీఘ్రముగా బలహీన మగునుగదా ! ముల్లు నూడఁదీయ సూది కావలెనని యెఱుఁగవా ?” అని విదూషకుఁడు మాఱుపలుకును,

ఇట్టి సరసతరసంభాషణము లీనాటకరచనమం దెక్కువగఁ గాన నగును.

చతుర్థాంకము వక్రసంభాషణలకుఁ బాత్రము లొకరొకరి యెడఁ గావించు దెప్పిపొడుపులకు నిలయమని మున్నే చెప్పియుంటిని. వాని నీక్రిందఁ గొంత యుదాహరింతును. నారదునివెంటవచ్చు పురుకుత్సుని దూరమునఁ గాంచి సూర్యుఁడు,

"అదుగో నారదమునివర్యు నెదమప్రక్క-
తనుమహోతనుదీధితుల్ దనరుచుండఁ
గ్రాలుపురుకుత్సుఁ డురుశరత్కాలమేఘ
సన్నిధిని జెంది వెలిఁగెడు నన్నుఁ బోలి."

అని ప్రశంసింప బృహస్పతి,

"ఉన్నతోదారకులభవుఁ డొక్కఁ డెవఁడొ
దుష్కళంకి యొకఁడొ కాని సన్మార్గ లగుదు
రందఱును, నారికేళాగమంబు నేది
యో యొదవినట్టి దయ్యపుకాయరీతి."

అని చంద్రు నుద్దేశించి పలుకును.

చంద్రుఁడు (తనలో) "దుష్కళంకి నని యీముసలిముని న న్నాక్షేపించుచున్నాఁడు. ప్రత్యుత్తరమున కిది సమయము గాదు" అని కుములును.

ఇంద్రుఁడు (తనలో) "ఈమహానుభావుని హృదయఫలకమం దీతారాపతి చేసిన యక్రమము శిలాశాసనమైనదికదా! ఆదిత్యా! పురుకుత్సుఁ డింక నెంతదూరమున నున్నాఁడో చూడుము" అనఁగా,

"దేహమంతయును కన్నులుగల మీరు చూడక యూరనిఁ జూచు ఘనొద రేమి?" అని శచి పలుకును.

ఇంద్రుఁడు (తనలో) ఆహా! ఈమె నాపూర్వకృత్యమును దెప్పిపొడుచుచున్నది,'' అని వగచును.

బృహస్పతి పురుకుత్సునిం గాంచి నిజవంశకర్తయగు ప్రభాకరుని నమస్కరింపుమని యుద్బోధించును. అతఁ డట్లు ప్రణమిల్ల సూర్యుఁడు (లేచి కౌఁగిలించికొని) "వత్సా! చిరాయురస్తు!"

''పెద్దవాఁడవు వయసునఁ బెద్దవాఁడఁ
దేజమున నస్మదాభసందీప్తి నిన్ను
నాకులంబునఁ గాంచి యనాకులతను
గంటి నది స్వభావమె కులకర్తలకును.''

అని యభినందించును.

నారదుఁడు (తనలో) "వయసునఁ బెద్దవాఁడ ననుచున్నాఁడు. ఆదిత్యు లందఱును ద్రిదశులే కదా! దంతము లూడుటచేఁ గాదు, ఊడఁగొట్టఁబడుటచేఁగాఁబోలును పెద్దవాఁడ నని చెప్పుచున్నాఁడు" అని దక్షయజ్ఞమున సూర్యునకు వీరభద్రునివలనఁ గలిగిన భంగపాటు నుద్దేశించి పరిహసించును. పైని గీతగీచిన "తనుమహోతనుదీధితుల్, నాకులంబునఁ గాంచి యనాకులతను" అను వాక్యములందలి శబ్దచిత్రములు గమనార్హములు.

అనంతర మింద్రుఁడు "నీవలెనే కువలయపాలకుఁ డయిన యీ చంద్రునకు నమస్కరింపు" మని పురుకుత్సుని హెచ్చరించును. అతని దర్శనమునఁ దననర్మదావిరహము వృద్ధి యగు ననుశంకతోఁ గాఁబోలు పురుకుత్సుఁడు భయపడి వెనుకకుఁ బోవును.

ఇది గాంచి బృహస్పతి (తనలో) "భళీ! రాజా: చండాలునిఁ జూచి దూరమునకుఁ దొలఁగినట్లు తొలఁగుచుంటివి" అని సంతసించును. పురుకుత్సుఁడు చంద్రునిఁ జేరి (తనలో) "ఓ రాజా! నీవు విచిత్రచరిత్రుఁడవు

"సతియుఁ బతియుఁ గూడినఁ జాల సౌఖ్య మొసఁగి
విప్రలంభమునను బీల్చి పిప్పిఁ జేయు
దెలమి పరిరంభసౌఖ్యంబు నిచ్చి విరహ
మునను వేధించు హేమంతు ననుకరించి."

"మింట నినుఁగాంచుమాత్రనే మంట లొదవె
మన్మనోగాత్రములయందు మనుట యెటులు ?
నేను నీవరిఁ జేరితి నిపుడు సింహ
గహ్వరముఁ జేరు హస్తీంద్రుకరణి గాఁగ."

అని భావించి (ప్రకాశముగ) "ఓ కువలయబాంధవా! నమస్కారము" అని నమస్కరించును. "ఇష్టార్థసిద్ధిరస్తు" అని చంద్రుఁడు దీవించును. నర్మదాప్రతిమను దేవళమునఁ గాంచి పురుకుత్సుఁడొందు సంభ్రమవిలోకనసందర్భమున, ఇంద్రుఁడు "సుఖదుఃఖముల యొక్క యైకకాలికసమావేశము పురుకుత్సునియం దెంతవింతగ శోభించుచున్నది!" అని భావించి,

"కనులు వర్షించు మోము వికాస మొందు
నొడలు స్తంభించు గాత్రమం దొదవుఁ జెమట
అక్షిగతనీరవాహిని యైనయంత్ర
జనితరత్నప్రతిమ కట్లు సముచితముగ."

యని యతనియందుఁగూడఁ బ్రతిమసామ్యము నాపాదించును.

అంతఁ బురుకుత్సుఁడు "మహేంద్రా! జీవనవంతుఁడనైన నన్ను బొమ్మగఁ జెప్పుచుంటివి. నాజీవనమునకు జీవనమైన నర్మదను గూడ నీవే బొమ్మగఁ జేసితివా ?

"అంత కింతయ్యె ననుచు దైన్యంబు కొంత
దుఃఖశాంతికి నేవియో దొరకె ననుచు

ధైర్య మొకకొంత గ్రమ్మఁగాఁ దనరుఁ జిత్త
మర్ధసంగ్రస్తచంద్రగ్రహణముభంగి."

అని వచించును.

ఇది చూచి బృహస్పతి (తనలో) "అమూర్ఘునే తిరిగి తలంచు చుంటివా" అని విసిగికొనును.

పంచమాంకమున పురుకుత్సుఁడు పురుషరూపిణియై తనకు వైద్య మొసఁగిన నర్మదవలన సంపూర్ణారోగ్య మొంది యామెను నర్మదగా గ్రహించి యన్యోన్యాంగుళీయకధారణసమయమునఁ దన చిటికెనవ్రేలితో నామెచిటికెనవ్రేలిని జేర్చినపుడు,

"కరము కరమునఁ జేర్ప నుంగరము లిచటఁ
దనరు కర్కటలగ్నజాతకుఁడ నైన
నాకు గురుశుక్రు లిద్ద ఱనారతంబు
భాగ్యకోణంబునను జేరుభంగి గాఁగ."

అని వచించును. అంత విదూషకుఁడు "గురుఁడు షష్ఠాధిపతి. గనుకఁ గొంచెముకలహము కలుగునని తలంచెదను" అని చెప్పును. ఇది త్వరలోనే మామ మంధాతునితోఁ బురుకుత్సునకుఁ గలుగుకలహమును సూచించును. వీనిలోఁ బంతులుగారి జ్యోతిషశాస్త్రవిజ్ఞానముఁ గూడఁ గొంత గోచరింపఁగలదు.

ఇంద్రుఁడు పురుకుత్సమంధాతులసమరమును వారించు సందర్భములోఁ బురుకుత్సునిఁ జూచి "మామగారిని శిక్షించునంతటి మహాగుణ మీశ్వరభక్తివలనఁ గలిగినదికాఁబోలు" నని దక్షయజ్ఞ ధ్వంససందర్భమున వీరభద్రునిచే మహేశ్వరుఁడు దక్షునకుఁ గలిగించిన శిక్ష నుద్దేశించియే యాక్షేపించును.

ఇట్లు సవిమర్శముగఁ బరిశీలించిన నెన్నెన్నియో గుణవిశేష

ములు పంతులుగారి యీతొలుదొలుతటి దృశ్యకావ్యమునందు దృష్టములు కాఁగలవు.

విమర్శకులకు గుణదోషముల రెంటింటివిమర్శనముగూడ విశిష్టధర్మము. ప్రప్రథమరచన మగుటచేతఁగాఁబోలుఁ బంతులుగారి యీనాటకమున నాదృష్టికిఁ గొన్నిలోపములుగూడఁ దోఁచుచున్నవి. వానినిగూర్చి యించుక ముచ్చటించెద.

తృతీయాంకమున రాజమందిరసమీపోద్యానమునఁ బురుకుత్సుఁడు నర్మదావిరహాభరముగూర్చి విదూషకునెదుట నంగలార్చుచున్నప్పు డురగలోకమునుండి నర్మదయు నవమాలికయు వచ్చి పూలచెట్లచాటున డాఁగియుండుట, అనంతరము అంశుమంతుఁడు గూడ వచ్చి నర్మద వచ్చుటఁ జూచుట, అచ్చటికి వచ్చెదనన్న తన మిత్రుఁడు చిత్రకేతుఁ డింకను రాఁడయ్యెనే యని యంశుమంతుఁడు విచారించుచుండుట చదువరులకు విదితములే కదా!''

ఇంతలోఁ జిత్రకేతుఁడు రాఁగా అంశుమంతుఁ డాతనితో ''మిత్రమా! మంచిసమయమునకు వచ్చితివి. ఇంతకుముందు పురుకుత్సుని చూచితివి గాని నర్మదను జూచియుండవుగదా! అదుగో మహారాజు విరహబాధవశుఁ డయి విచారించుచున్నాఁడు. వెనుకనుండు జలయంత్రమున కానుకొని సఖీసమేతయై నర్మద ప్రకాశించుచున్నది. తిరస్కరిణిచేఁ బ్రచ్ఛన్నుఁడవు కమ్ము'' అని యుద్బోధించును. తరువాతఁ జిత్రకేతునకు నంశుమంతునకు జరిగిన సంభాషణములలో ''నిన్న నీవును నేను సమావేశమయినపుడు జరిగినసమాచారములన్నియుఁ బురందరునితో విన్నవించితిని. ఆతఁడు నర్మదను తాను చూడకయే పురుకుత్సున కామెను సతిగాఁ గూర్చుట కంగీకరింప''నని చెప్పి నర్మదను దీసికొనిరమ్మని తన్ను నియోగించె ననియు, అందుచేఁ దా నురగలోకమునకుఁ బోయి వెదుకఁగా నర్మద కనిపింపనందున

నిచ్చుటకు వచ్చితి ననియు నందుచేతనే తాను వచ్చుట కాలస్య మయినదని చిత్రకేతుఁ డనును.

అంశుమంత చిత్రకేతుల ప్రథమసమాగమము విశ్వామిత్రాశ్రమపరిసరారణ్యమునఁ బ్రథమాంకముననే జరిగినది. పురుకుత్సుని పయి మోహనవిద్యను బ్రయోగించి యంశుమంతుఁ డాతని నురగలోకమునకుఁ గొనిపోయినప్పుడే చిత్రకేతుఁడు స్వర్గమునకు నిష్క్రమించును.

తరువాతి వీరిరువురకుఁ గలిగినసమావేశము పైనిఁబేర్కొనినట్లు తృతీయాంకమునందలిదే గాని వేఱొండు గనరాదు. ద్వితీయాంకమున నెచ్చటను జిత్రకేతుని ప్రవేశమే కనరాదు. నర్మద నాతఁడు మొదటిసారి చూచినది తృతీయాంకమునఁ జెట్లచాటున నామె చెలితో దాఁగియుండఁగా నంశుమంతుఁడు చూపినప్పుడే గదా! ఇట్టిసందర్భములలోఁ జిత్రకేతుఁడు అంశుమంతునితో "నిన్న నీవు నేను సమావేశ మయినప్పుడు జరిగినసమాచారముల నింద్రునికి విన్నవించితి" ననుట నా కంతసంగతముగాఁ దోఁచుటలేదు. ఈయంకమున నంశుమంతునెదుట నతఁడు కనిపించుటయే వారిరువురకుఁ గలిగిన రెండవ సమావేశము. నర్మద నాతఁడు చూచినదియు నప్పుడే. ఈయంకము నందలి కథ పాత్రములయెదుట జరుగుచుండఁగనే పరోక్షముగ నాతఁ డెవరికిఁ దెలియకుండ నాకస్మికముగ స్వర్గమునకుఁ బోయి యింద్రునితో మాట్లాడి మరల వెనువెంటనే వచ్చె నని సమర్థింపఁదగునా?

నర్మద నాతఁడు మొట్టమొదటఁ జూచినది యిచ్చటనే యైనప్పుడు ఉరగలోకమున నామెను వెదకి యచటఁ గానక యిటు వచ్చె ననుట సంగత మగునా? నర్మదాపురుకుత్సులను సంఘటించుట యందు "నీవు తుంటవిల్లులేని మన్మథుఁడ" వయితి వని యీద్వితీయ సమావేశముననే చిత్రకేతుఁ డంశుమంతుని నభినందించినాఁడు.

నర్మదాపురుకుత్సుల పరిణయమహోత్సవసమయమున నానందించు టకు అంశుమంత చిత్రకేతుల నిరువురను లేకుండఁజేయుట నాటక మండలి యొక్క లోపమనియే నేను తలంతును. పురందరుఁడు మందా రునితో భాషించునపుడు "అంశుమంతుఁ డాకస్మికముగ మరణించు టచేఁ బాప మీసంగతి నీకుఁ దెలియనందుకు విచారించుచున్నాను." అని యాకస్మికముగఁ జెప్పవలెను మందారునకే గాక లోకమునకుఁ గూడ నంశుమంతుని మరణవార్త తెలియనే తెలియదు. ఆతఁ డీసభ సమయమునం దుండిననే నాటకము మఱింత మోదాంతముగ నుండె డిది. పంతులుగా రెందు కిట్లొనర్చిరో తెలియఁజాలకున్నాను.



# పానుగంటి వారి నాటక రచనా శిల్పము.

శ్రీ డా॥ ముదిగొండ వీరభద్రశాస్త్రి

కీ. శే. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు రచనలు చేసిన కాలము ఒకదృష్టితో చూచిన యెడల తెలుగుసాహిత్య చరిత్రమున నాటకయుగమని అనవచ్చును. ఈ కాలమున అనేక నాటక కర్తలు బయలుదేరిరి. వారిలో పెక్కునాటకములు వ్రాసినవారును ఉన్నారు. తెలుగునాటకరచనము రంగస్థలాభ్యుదయము ననుసరించి సాగినది.

తెలుగులోని బహుసంఖ్యాక నాటకములు నాటి ప్రేక్షక జనుల యభిరుచినిబట్టి సాగినవి ప్రఖ్యాతులైన నాటక కర్తలుకూడ సామాజికుల అభిరుచులకు కట్టుపడియుండక తప్పలేదు. ప్రజలకు పాటలపై మక్కువయుండిన పాటల నాటకము లేవ్రాసిరి. పద్యము లేనిదే నాటకములు ప్రదర్శనసమయమున రక్తికట్టి ప్రజల నలరింప లేవనుకొనినచో, పద్య బహుళముగా వ్రాసిరి. అంతియేగాని ప్రేక్షకుల యభిరుచిని సంస్కరించి, క్రొత్త పద్ధతులలో నాటకము వ్రాయుటకు సాహసించిన వారిసంఖ్య స్వల్పము. అట్టికాలమున పానుగంటివారు స్వతంత్ర వృత్త్యనుసారము నాటకములు వ్రాయుటకు పూనుకొనిరి.

నాటకములు ప్రదర్శ నానుకూలములుకానిచో వాని ప్రయోజనమేమి యని వాదించవచ్చును. నాటకముల ప్రయోజనము రంగస్థలముపై ప్రదర్శన ప్రాచుర్యము పొందుటమాత్రమే యను నూహయున్నవారితో వాదింపలేము. శిష్టసాహిత్యాంగము కాని నాటకములకు ఉత్తమత్వమెన్నటికిని సిద్ధింపదు. సాహిత్యచరిత్రకారుల కట్టి నాటకములతో ఎక్కువ పనికలుగ నేరదుగదా!

ప్రేక్షక జన చిత్తాకర్షణము నిమిత్తము తెలుగునాటక కర్తలు పడినపాట్లు చూచినచో నవ్వువచ్చును. ధర్మవరము కృష్ణమాచార్యుల వంటివారు సైతము ఆంగ్లాంధ్రసమ్మిశ్రితమగుభాషను, హిందూస్థానీ పదబహుళమగు భాషనుమాటాడు పాత్రలను పౌరాణిక నాటకముల

యందు ప్రవేశపెట్టినారు. తెలుగునాటకము లనేకములలో గన్పట్టు మఱియొక లోపము కవికాలము నాఁటి సమస్యలెన్నో బలవంతముగా వానిలో నిఱికింపబడియుండుట. మఱికొన్ని నాటకములు దోషములు లేకపోయినను, చూచుటకు చదువుటకు నొకమాదిరిగా నున్నవని పించునవి. ఉపక్రమ నిర్వాహనైపుణ్యముగాని భావభరితత్వముగాని, కథాంశమునకు రసమునకు పోషణంబు కలిగించు పాత్రప్రవేశ సంభాషణాదికములుగాని సుందరమగు పాత్ర స్వభావోన్మీలనముగాని లేకుండునట్టివి. ఇవి సంభాషణ రూపముననున్న కథలనఁ జెల్లును.

ఇట్టిదినములలో పానుగంటివారు నాటకరచనమునకు దొరకొని నూతన శిల్పపద్ధతులు వెలయించుచు విశిష్టరూపక సృష్టిచేసిరనిన వారి ప్రతిభ వెల్లడి యగుచుండుట లేదా? వారిట్లు ప్రశంసార్హము లగు నాటకములు వ్రాసిరన్నచో వానికి వారి ప్రతిభ, శక్తియు మాత్రమే కారణములుకావు, పంతులుగారికి తాముకృషిచేయుచున్న కళారంగముపై గౌరవము ఎక్కువ. అదిగౌరవము మాత్రమే కాదు. అహంకారము కాని ఆత్మవిశ్వాసముతో, ప్రదర్శనానుకూల్యము చెడకుండ, సామాజికుల దుష్టాభిరుచుల ప్రాబల్యమునకు లొంగి పోకుండ, షేక్స్పియర్ మున్నగు రచయితల నాటకములవలె శిష్టసాహిత్యాంగములై పఠనపాఠనయోగ్యతా యుక్తములై తమకు తెలుగు సాహిత్యచరిత్రమున నొకయున్నత స్థానమును సమకూర్చు నాటకములను వ్రాయవలెనని వారినిశ్చయము. సత్ప్రయత్నముచేసి వారు కృతకృత్యులైనారు.

ప్రబంధయుగము తుదిదశలో ఎల్లకవుల రచనాపాటవము నొక వృత్తపు వెల్లలు దాటకుండ లోలోపల ఎట్లిమిడిపోయినదో, అట్లే ఈనాటకయుగమున గూడ కవుల శక్తియుక్తులు పరిమిత స్వాతంత్ర్యముతో సంకుచిత పరిధులనడుమ నిఱుకొని పోయినవి.

పానుగంటివారీవలయమున చిక్కుకొనలేదు. పాశ్చాత్యసాహిత్యము చేత ప్రభావితమైన మనస్సుతో, ఆర్షసంప్రదాయ విజ్ఞానయుక్తమైన సంస్కారముతో, స్వదేశభాషాభిమాన సంపూర్ణమైన హృదయముతో వారు సాహిత్యసృష్టి చేసినారు. కనుక వారి రచనలయందు పరభాషాసాహిత్య ప్రభావమే కాని అనుకరణము కనరాదు. అనుకరణముసహింపని వారి తత్త్వము ఎప్పటికప్పుడు క్రొంగ్రొత్త దారుల వెంట వారిని నడిపించి? వారిసృష్టిని చైతన్యశోభతో నింపినది.

కథాకథనరీతిని ~~పాటించుచు~~ ఉండిన తెలుగునాటకమందు పానుగంటి వారు పాత్రస్వభావోన్మీలనము ప్రధానమగు, బుద్ధిగమ్యమగు సంవాద పద్ధతితో గూడిన శైలిని ప్రవేశపెట్టినారు. నాటక కథలో దృశ్య, సూచ్యకథా విభాగములను నేర్పుతో చేసికొని, ఆద్యంతములను దృష్టి యందిడుకొని రూపకవస్తువును చక్కని ప్రణాళికపై నడిపి, ఉత్కంఠను పోషించుచు వారు తమనాటకములను రచించినారు.

పానుగంటివారి నాటకములలో సుప్రసిద్ధములైన కథగలవి రామాయణ నాటకములు నాలుగు,సారంగధర విప్రనారాయణనాటకములుమాత్రమే. తక్కిన వానిలో నర్మదా పురుకుత్సీయము, రాధా కృష్ణ, బుద్ధబోధసుధ, ప్రచండచాణక్యములలో కొన్ని పాత్రలు ప్రసిద్ధములే యైనను కథాంశములను విపులీకరించుకొనుట వారే చేసికొనిరి. వారి నాటకములలో కల్పితేతివృత్తములే ఎక్కువ ప్రసిద్ధ కథానాటకములందు సైతము వీరు కొన్నికల్పిత పాత్రముల మూలమున నూత్నాంకములను చేర్చియున్నారు. అవి సామాజికుల నాకర్షించి క్రొత్త ఛవ్రులూరించుచుండును. ఇక కల్పిత వృత్తములు గల రూపకములలో వారు సామాజికుల నాకట్టుకొనుటలో అబ్బుర మేమున్నది ?

లక్ష్మీనరసింహారావుగారి నాటక కృతులయందు వైవిధ్య మెక్కువ. పౌరాణిక, చారిత్రికాది వృత్తవిభాగము ననుసరించి, శృంగార, వీరాదిరస భేదముననుసరించి, సుఖాంత, దుఃఖాంతములనను సరించియే కాక ఇంకను వారుకొన్ని ప్రయోగములు చేసి తమ నాటకములయందు వైవిధ్యమును ప్రకాశింపఁజేసిరి. పాత్రలసంఖ్యా విష యమున, నాటకదైర్ఘ్యమునందు వారు రకరకములుగా వ్రాసి చూపిరి. పంతులుగారు బహునాటక కర్తలగుటయేకాక తెలుగున బహుముఖ నాటకశిల్పపాటవమునకు రాజపథములు తీర్చిరి.

పానుగంటివారి నాటకములందలి ప్రధానలక్షణములను చెప్ప వలసివచ్చినచో, వారు మనస్తత్వ నిరూపణమునకు ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చిరనియు, కథాగమనముకన్న లోకవృత్తనిరూపణ మునకు, తాత్త్వికచింతనమునకు ప్రాధాన్యమిచ్చిరనియు, పూర్తిగా సంప్రదాయ నిరసనము చేయకుండఁగనే తమనాటకములలో వారు నవ్యత చొనిపియున్నారనియు మునుముందు పేర్కొనవలెను.

భవభూతి నాటకమునుగూర్చి సాక్షిలో వ్యాసము వ్రాయునెడ నరసింహారావుగారు భావికథాసూచనమును గూర్చి ఎక్కువగా ప్రశం సించియున్నారు. వారును ఉపశ్రుతిమూలకమైన భావికథార్థసూచ నముపట్ల ఎంతయు మక్కువ చూపించియున్నారు.

పంతులుగారి నాటకకృతులయందు ఆకర్షకమగు మఱియొక యంశము వారిసంభాషణ నిర్వహణకౌశలము. పాత్రనిర్మాణవ్యవస్థ, సంభాషణములు- ఇవి నాటకేతివృత్తమును నడుపుచున్నట్లు అగపడు విధముగా వ్రాయుట నాటకరచన యందత్యంతము కష్టమగు పద్ధతి. దానియందు వారు సిద్ధహస్తులు.

పానుగంటివారి నాటకరచనా పాటవమును విపులీకరించుటకు ఈకొద్దియవకాశము చాలదు. అయినను ఇంతవఱకు వివరింపఁబడిన వారి

పద్ధతులను కొన్నింటినైన స్పష్టము చేయజాలిన ఉదాహృతులను పరిశీలింతము.

రాధాకృష్ణ నాటకమునందలి ద్వితీయాంకము మిక్కిలి హృంద్యమైనది. రాధసందేశమునుగొని శారదుడు మధురానగరమునకరిగెను. కృష్ణుని అతడు కలియుటకుముందు సత్యభామకనులంబడెను. ఆమె నిగ్గదీసి రాధనుగూర్చి ప్రశ్నముల వర్షముకురిపించెను. నిలువెల్ల రాధపై నీర్ష్యముగా ఉన్న సత్యభామ ఎట్టికటు సంభాషణమునకు నెమదీయ లేదు. నోటికివచ్చినట్లెల్ల మాటాడు అలవాటున్నవాడును, పరిహాసప్రియుడును అగు శారదుడు సత్యభామ రాధనుగూర్చి పలుక కటు వాక్యములను వినఁజాలకపోయెను కాని సత్యభామ నేమనుటకు వీలు లేదు మాటకుమాట పెంచుటకు ఇష్టములేక, ఎక్కడి కక్కడ తుంచివేయుటకు ప్రయత్నించి, ఆమెసాగనీయకపోగా తప్పనిసరియై పైకి చిఱునవ్వులు నవ్వుచు చమత్కారముగా మాటాడును. కాని అతని అంతరంగమందలి గాఢమైన అసంతృప్తిని గూఢముగా అతని మాటలలో గోచరించును చిట్టచివరకు సత్యభామ ప్రశ్నలకు విసిగిపోయి "అమ్మా! నీవొకసారి బృందావనమువచ్చి రాధను చూడరాదా?" అనెను ఆమాటయే అనంతర కథాసంవిధానమునకు దారితీసినది. ఈసన్నివేశమునందలి పాత్రోచితఘటనము పాత్రచిత్రణములే కథాగమనమును నిర్దేశించినవి. 'తూచిమాట్లాడఁదగిన మహారాజు కుమారి సత్యభామ నోటికివచ్చినట్లెల్ల ప్రసంగించుట, మామూలుగా నోటికివచ్చినట్లెల్ల మాటాడు శారదుఁడు తూచి మాటాడుట- ఇట్లే అంకమునందు తాఱుమాఱైనది. ఈవైషమ్యము చమత్కారహేతువై ఈసన్నివేశమును రక్తికట్టించినవి ఇట్టి శిల్పమే ఈనాటకమునందితర స్థలముల కాననగును.

రాధాకృష్ణ నాటకమున రాధకు లలిత, మధురయను సఖు

లను పంతులుగారు ప్రవేశపెట్టినారు. అయిదంకముల యీనాటక ములో మొదటియంకమున రాధప్రక్కన లలితయున్నది. మూడవ యంకమున లలిత మధుర యిద్దఱును; చతుర్థాంకమున మధుర యొక్కతె, రాధ భక్తి మొదట లలితమై, పిమ్మట లలితమధురమై తుదకు మాధుర్యమయ మయ్యెనని పంతులుగారెంత చక్కగా నిర్దే శించినారో ?

నాటకములయందు ముఖ్యముగా నుండవలసినది నాటకీయత నాటకీయములగు సన్నివేశములను సృష్టించుకొనుటలో, తీర్చుటలో పంతులుగారు అందెవేసినచేయి.

దశరథునకు చిరకాలమునకు కుమారుడుకలిగెను. దశరథుని ఆనందమునకు మితిలేదు. ఈసన్నివేశమును పానుగంటివారు తమ కల్యాణరాఘవమున తీర్చినారు. పురిటిశిశువు, నెత్తికొనివచ్చి దశరథ మహారాజు తనగురూత్తముడగు వసిష్ఠునికి చూపించి, తన ఆనందము, తనకౌతుకము ప్రకటించును. ఆరగమూసినప్పుడె యింతలేసికన్నులు- నిండుగా తెఱచినప్పుడెంతయుండునో, పుట్టినప్పుడే యింతయున్నాడు, ఎదిగినప్పుడు ఎంతస్ఫురదూపియగునో! ఇది దశరథుని మనోభావ ప్రవాహము. వసిష్ఠుడెట్టివాడు ? అంతకుముందే వ్రాసిన పాదుకా పట్టాభిషేకమున పంతులుగారా పాత్రముచే ననిపించియున్నారు. "అనేకహాయినముల" నుండి తలంచి, మననముచేసి, భక్తి ప్రేరించి, పూజించి, బహువిధముల సేవజేయుచు నితని సచ్చిదమల స్వరూప చరణ సందర్శన రూఢమతిని గర్వ్యానుగు పురోహితతనుగాంచి రఘు కులమును గనిపెట్టుకొని" యున్నవాడు అంత ఎదురుచూచినసమయ మిదే ఆసన్నమైనది. ఆసచ్చిదమల స్వరూపమిప్పుడు అవతరించినది. దశరథుడు చూపించిన కన్ను ముక్కు చెవి ఆయనకు కనిపించునా? అన్నాడు ?

ఇది కన్ను; ఇదిముక్కు; ఇది చెవి యని నాకేమియు విస్పష్టముగఁ గానఁబడుట లేదు.

కనులు మిఱుమిట్లుగొల్పి పులకల నొసంగి
మోద బాష్పములను వెల్చు పూర్ణ విమల
శాంత గంభీర తేజంబు స్వల్పపూర్వ
పరిచయముగల యదియె చూపట్టెనాకు"

ఒకే సన్నివేశము- ఇరు తెఱగుల పాత్రములు; ఒకేరంగము- రెండువిధముల చిత్తవృత్తులు; ఒకే ఆలంబనము- రెండు పద్ధతుల అనుభావములు- రెండు రసప్రవాహములు వీని పరస్పరసంఘర్షణము ఇంతకన్న నాటకీయత ఎల్లెండును?

ఇదే నాటకమున పేర్కొనదగిన మఱియొక చక్కని ఘట్టము తృతీయాంకము. తాటకను చంపుటకు శ్రీరాముని తీసికొని పోవలెనని విశ్వామిత్రమహర్షి వచ్చి దశరథుని కలిసికొనెను. రాముని పంపుమని ఆయన, పంపజాలనని దశరథుడు వాదించుకొనుటకంటె నిందు కథ లేదుగదా; కాని పానుగంటివారి దశరథుడు పరమ సౌమ్యుఁడు చమత్కారి, ఘర్షణపడ లేదు "మీరేదశరథుఁడనుకొనుఁడు. నేనే విశ్వామిత్రుడను, నేనే మీరాముని నడిగితిని. ఎఱుగక యిచ్చెదనని మీరుపలికితిరి ఇట్టిస్థితిలో మీరిట్లు మనసులో గుబ్బెటలు పడుదురా లేదా?" అని ప్రశ్నించి తన మనసులోనున్న సందేహముల నన్నిటిని వెడలబోసెను, విశ్వామిత్రుఁడునుతానే ఆస్థితిలో దశరథుఁడైయుండిన ఎట్లు తలఁచునో చెప్పుచు ఆసందేహములన్నింటికి నొక్కసారి సమాధానము చెప్పెను. ఇది నాటకీయతకు పరమావధిగ తీర్చిన ఘట్టము.

పాత్రచిత్రణము విషయమున పంతులుగారి కౌశలము సుప్రసిద్ధము కాని వారిసృష్టిలో తీవ్రప్రకృతిగల పాత్ర ఎక్కువ రక్తికట్టును సుఖదుఃఖములకు ఊఁగిపోయి తెగిపడి బయటపడు విద్యున్మద్వేగము

గలపాత్రలు, సుఖదుఃఖములచే అనభిభూతమైన స్వభావముగల పాత్రలు,- ఈ రెండును ఒకవిధముగా తీవ్రప్రకృతులే. పంతులుగారి నాటకములలో సుమారు మున్నూట యేబది పాత్రములున్నవి. ఇవి యన్నియు వైవిధ్యము, వ్యక్తిత్వముగల పాత్రలే. ఎవనికున్న కష్ట సుఖములు వానికుండును; ఆకష్టసుఖములనుభవించుటయందు అందఱకు నొక్కచే మనస్సు కాదు. వారివారి అనుభవములనుబట్టి వారికెవో స్థిరాభిప్రాయములు; వానిని బట్టి యొక్కొక్కరి కొక్కొక్కమార్గము ఈ పాత్రములు కేవలమానవ విగ్రహములుకావు.

నాటకకర్త మానవకృత్యములను నిర్వర్తించు బొమ్మలను సృష్టించుటకాదు. ఆకృత్యములను చేయుచు మనస్సును జీవమును గూడ ప్రసాదింపవలసియుండును ఆజీవప్రదాన మహత్కార్యమే పాత్ర సృష్టిని, పాత్రచిత్రణముకన్న విశిష్టము చేయును. వాస్తవిక వ్యక్తులకు నాటకపాత్రములకు నడుమ నొకసన్నని పొరవంటి అంతరమైన లేకుండునట్లుచేయుట గొప్పకళ. అది పానుగంటివారికి కరతలామలకము.

పాత్రసృష్టిచేయుటలో పంతులుగారికొక ఆవేశమున్నట్లు తోచును. అందుమూలకముగా అతి చైతన్యవంతములయిన పాత్రలు అవతరించినవి. భయాశ్చర్యకోపతాపాదులను వరుసక్రమములో అభినయించునవికాక జీవితములో వలెనే సమగ్రమును, అసమగ్రముపై వివిధభావ సంఘర్షణము కలిగిన మనస్సుగల పాత్రములను ఏకీభూతసప్తవర్ణమైన సూర్యరశ్మివలె ప్రకాశమానమైన స్వభావముగ, పాత్రలను పంతులుగారు సృష్టించినారు. తుదకు, అప్రధానపాత్రలని యెంచబడు నిష్కంఛ పాత్రములను సైతము వారు ఇంత విస్పష్ట మనోహరముగ పోషించినారు.

పంతులుగారి పాత్రలను తేలికగా రెండు వర్గములుచేయ వచ్చును. శాంతగంభీరోదాత్తమై, సాత్త్వికతానిబిడమైన నొకవర్గము, ఔజ్జ్వల్య ప్రధానమై, పరిహాస ప్రియమై, తర్కనిపుణమై తుళ్లిపడు నది మరియొకవర్గము వారి సంశ్లిష్ట మనస్తత్త్వము రెండంచుల నీరసి వచ్చిన వర్గములివి.

పర్యవసానముగా, పంతులుగారు తెలుగునాటక సరస్వతి కిచ్చినన్ని మణిమయోజ్జ్వల భూషలు మరెవ్వరును ఇచ్చియుండలేదని స్థిరముగా చెప్పవచ్చును.



## శ్రీపానుగంటివారి పరిచయచారుత్వము

శ్రీ వేములు రామచంద్రశేఖర్ B.A (Hons) B. Ed.

కవికి వలయు సమగ్రలక్షణములలో లోకజ్ఞత, పరిచయ చారుత్వము ననునవి ముఖ్యతమములని క్షేమేంద్రుని యను శాసనము. తర్క, వ్యాకరణ, భరత, చాణక్య, వాత్స్యాయన, భారత, రామాయణ, భాగవతాత్మజ్ఞాన, వైద్యక, జ్యోతిష, గజ, తురగ, పురుష లక్షణ, ద్యూత్య ప్రకీర్ణములయందు పరిచయము కవి సామ్రాజ్య సూచకమని క్షేమేంద్రుని కవి కంఠాభరణమున జెప్పబడినది. బహు గ్రంథ పరిచయమువలన అనేక శాస్త్రములయందలి మూలమూలల మూలిక విషయములను కవిబ్రహ్మ శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహ రావుగారు తమ రచనములను పొందుపరచి యున్నారు. ఇందు సంస్కృతాంధ్రముల నెఱుంగదగు శాస్త్రవిషయములేగాక ఆంగ్ల భాషామహోదధిం దఱచిన లభ్యమగు సూక్తిరత్నములుకూడ మెఱయుచుండును. దిఙ్మాత్రముగా నా యా విషయముల నుదహరించుటయే ప్రకృత వ్యాసమున నుద్దిష్టము.

గురుకుల క్లేశమున లభ్యమగు భౌతిక, రాసాయనిక శాస్త్ర సంబంధములగు యుపమలే గాక, భాషా వాఙ్మయ శాస్త్రముల యందు నిబిడీకృతములైన సంగతులుకూడ వీరి కావ్యగానమున వినబడుచుండును.

జ్యోతిష పరిచయమునకు నర్మదాపురుకుత్సీయమున నాయికా నాయకుల పాణిగ్రహణ సందర్భమున యీ క్రింది పద్యములను దిలకింపుడు. (117 పే)

గీ. "కరము కరమున జేర్ప నుంగరములిచటఁ
దనరు కర్కటలగ్న జాతకుఁడనైన
నాకు గురు శుక్రులిద్ద రనారతంబు
భాగ్య కోణంబునను చేసు భంగిగాగ."

ఇట్లే, ప్రచండ చాణక్యనాటకము జాతకచక్ర పరిశీలము తోనే ప్రారంభమైనది. (1వ. అం.)

గీ. "రాజ్య భాగ్యాధిపతులు పరస్పరంబు
కలియ కరులైన యోగంబు కలుగుటెటుల?"

పంచాంగ పరిచయమునకు ప్రచండచాణక్యమునందే వేశ్యమాత తన వయస్సునుగూర్చి క్రిందటి శివరాత్రికి యింతటి వయస్సని చెప్పుచుండగా "గోవింద ద్వాదశి కనరాదా? అని కొన్ని సంవత్సరముల కొకమారు వచ్చు తిథిని సూచించును (126 పే)

వైద్యక పరిచయమునకు వనవాస రాఘవమున

గీ. "విషము సంజీవి చేయదే భేషజుండు"

అని శుద్ధిపరుపబడిన రసవిష గంధకాదుల ప్రయోగము నుదహరించును. (5వ. అం.)

అట్లే రాధాకృష్ణ నాటకమునందు సత్యభామా గర్వభంజనమును గూర్చి పలుకుచు గర్వప్రాయశ్చిత్తము ఆ గర్వమునకు లేత దశలో జరుగకూడదను దాని కుదాహరణముగ శారదునిచే

"అంతరకుసుమము క్రమముగా నెదిగి, కననికారంధ్రమంతయు వ్యాపించి, దృష్టిని సంపూర్ణముగఁ బాడుచేసినగాని దానికి శస్త్ర చికిత్స చేయకూడదు." అను Cataract operation గూర్చిన సిద్ధాంతము నలవోకగా బలికించును. (5వ. అం)

ఔషధ పరిచయమునకును, లోకజ్ఞతకును బుద్ధబోధసుధలో కొన్ని వస్తువులు క్రొత్తవి శ్రేష్ఠములనియు, మఱికొన్ని ప్రాతవి గ్రహింపవలసినవనియు జెప్పుచు,

"పుచ్చుకొలఁది రేవల్చిన్ని పొలుపుగాంచు నన్నారు. (1వ.అం)

శిక్షా పరిచయమునకు (phonetics) రాధాకృష్ణ అయిదవ యంకమున సగుణ నిర్గుణోపాసనల తారతమ్యమును వివరించునట్లు నీక్రింది గీతముం జెప్పినారు.

గీ. "కోటి, నెఱసున్న వర్ణ సంపుటితమైన గాని
నోటను బలుకఁగా రానియట్టుల నిర్గుణము కేవలము
మనో నియతితోఁడ దలప నెవ్వరికైన సాధ్యంబుకాదు"

ఇందు గహనమైన సగుణోపాసన యావశ్యకతను స్థాపించుట యేగాక, నెఱసున్న యుచ్చారణను గూర్చిన శిక్షాసూత్రముకూడ తెలుపబడినది.

ఇట్లే ఉపనిషద్ధేయమగు పూర్ణమగు పరిమనస్సు లగ్నమై క్రొత్త సంగతులను జెప్పుచున్నది. వస్తువున కుచితస్థానము శోభస్కరమనియు, స్థానభ్రష్టత శోభావిహీనతకు గారణమనియు నిరూపించుచు వనవాస రాఘవమున (5వ. ఆం.)

"అంకెలందునబడి వట్టిదయ్యె సున్న
అక్షరంబయ్యె నద్ది వర్ణాళిబడుచు"

అనినారు.

వ్యాకరణ పరిచయమునకు వనవాస రాఘవమున నైదవ యంకమున హనుమంతుడు "చూడబడినది. చూడబడినది" యని గావుకేకలు వైచినాడట. అనగా దానిపై శరభునిచే నిట్లనిపించుచున్నారు.

"చూడఁబడిన దేది ? తన మొగమా ? నా మొగమా ? అనాథ రాష్ట్రపాలనమువలె కర్తలోపించిన క్రియయా ? శక్తిహీనువలెఁ గర్మణి ప్రయోగము జేసెనుగదా. ఎవనిచేతనో చెప్పనక్కఱ లేదా ? 'సీత నాచేత చూడబడినది' అని చెప్పగూడదా ? నవ వ్యాకరణవేత్తవలె వెన్న వెనురాకు పసయేనా ?" అనుచు కర్మణి ప్రయోగములోని ప్రయోక్తృ దౌర్బల్యములోని చెప్పివేయుచుటయే గాక హనుమంతుని నవ వ్యాకరణవేతృత్వమును గూడ స్మరించినారు.

ఇవిగాక, మృగయా, చిత్రలేఖన, గాన, నృత్యాదికళల పరిచ

యమును వెలువరించు నసంఖ్యాకముల నుదాహరణము లను గ్రంథ విస్తరభీతిచే వదలినాడను.

శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు ఆంగ్లమున పట్టభద్రులేగాక సునిశితమైన విజ్ఞానశీలురగుట వలన ఆంగ్ల సాంప్రదాయములను కొన్నిటిని తమ రచనలయం దప్రయత్నముగ దొరలించినారు. ఇట్టివానిలో జాతీయత (Idion) పరిచయమునకు కల్యాణ రాఘవమున మూడవయంకమున రాజాశ్రితుల నడవడిని దిద్దుచు ఈ క్రింది పద్యమున జెప్పినారు.

గీ. "ఎదుట బడనిచ్చె జాలు నింకేమి యనుచు
దుడుకు దుడుకున నెల్ల వస్తువులను ముక్కు-దూర్చి
విభుకర్ణమున మూతిజేర్చి మిగుల
దడబడలు సేయ నసులకోకడమె తుదకు

'Do not poke your nose in everything' అను ఆంగ్ల జాతీయత కిది తెనుగుసేత. వేరొకచో బుద్ధబోధసుధలో ద్వితీయాంకమున

"కుమిలి చెడదిట్టు 'పుస్తకక్రిమి' యటంచు"

అని 'Bookworm' నకు తెనుగు కావించినారు.

నర్మదా పురుకుత్సీయమున నైదవ యంకమువ 'Lull' before the storm' అనుదానికి 'తుపాను రాబోవుటకు ముందు ప్రశాంతత' అనినారు.

రాధాకృష్ణ మూడవయంకమునందు 'Like poles repel అను నయస్కాంతశక్తికి నుదాహరణముగ రాధామధుర లిరువురు స్త్రీలే యగుటవలన నొకరినొకరు ఆకర్షించలేకపోయిరని చెప్పుచు

"విద్యుదుద్ధత వస్తువు వెలయ నొక స
జాతిశక్తిద్వము, దాని సరస జేర్ప

జడిసి నరి దూరమాభంగి వనిత మధుర
విడిచి తొలగె, నదృష్టవంతుడను నేను.

అనినారు.

వీరి ప్రకీర్ణ వ్యాసములలో నొక సందర్భమున "'సైనేతీటా', 'కాస్ తీటా' యనుచు గణితశాస్త్రజ్ఞులు కొట్టుకొనిపోవుచుండుట లేదా? బార్బారా, సిలారెంట్ అని తర్కశాస్త్రజ్ఞులు కాలక్షేపము చేయడం లేదా?" యనుచు పాశ్చాత్య గణితశాస్త్రమునకును ఆరిస్టాటిల్ ఏర్ప రచిన తార్కిక శుద్ధరూపములనుగూర్చి ప్రసంగించి తమ విజ్ఞతను ప్రకటించినారు.

ఇవి గాక, లోక పరిచయమును, వస్తులక్షణ వివేచనకును నొక యుదాహరణము నిచ్చుచున్నాను.

ప్రపంచచాణక్యమున ద్వితీయాంకమున:

చతురిక— స్త్రీల యంతఃకరణము జల్లెడవంటిదనుచూ.

సునంద— రహస్యము లోపల నిలవబడదనియా? అల్పమైనవి జారి
పోవునుగాని గొప్పవి నిలుచునని చెప్పలేకపోతివా?

చతురిక— "నిలిచినవేవో యవి పరిత్యజింపదగినవే" యని యూతడనెను.

శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు సూక్ష్మదృష్టితో పరిశీలించి వర్ణించిన విజ్ఞానము సర్వతోముఖమైనది. రాచనగళ్లలో ఎవ్వరెట్లు ప్రవర్తింతురో, ప్రత్యేకముగా రాజానువర్తులై వారి యాంతరంగిక భావములను దాస దాసీజనులెట్లు ప్రకటించుచుందురో ప్రత్యేకముగా ననుభవించినట్లు వ్రాసినారు. వీరమతి నాటకమున "బొమ్మిడాయ పులుసులో గలిపిన దమ్మిడీ వత్సనాభి యూర్గురు మహారాజులను చంపుటకు సరిపోవునే" యని విషప్రయోగ విషయము మును గూడ వక్కాణించి యున్నారు. 'అప్రయోజకుడగు కవివలె ప్రధానపాత్రను జంపెదవా యేమి' యని కథాకథన కౌశలమునకు

సంబంధించిన మూలసూత్రము పల్కినారు. వీరైనప్పుడెల్ల కుకవుల యప్రయోజకతను, అసమర్థతను లెక్కించుచునే యున్నారు. రాజుల స్త్రీలోలత్వము, చాపల్యము మొదలగు గుణములను నెక్కరించినారు.

వనవాసరాఘవమున, "ఉన్నదున్నట్లుచెప్పిన నది కవిత్వమెట్లగును, అది చరిత్రయగును" అని కవిత్వమునకును, చరిత్రకును గల ప్రధానభేదమును వివరించినారు.

ఇట్టివెన్నియోని యుదాహరణములను విపులీకరింపవచ్చును. అందలి సారస్యమును వివరింపబూనినచో నది పెద్దగ్రంథమే కాగలదు. ఆధునిక వర్ధమాన కవులకు నవశ్యాభ్యసనీయ శక్తులలో నీ పరిచయ చాపత్వ మొక్కటి.

— ♦ —

# పానుగంటివారి ప్రతిభా వ్యుత్పత్తులు

శ్రీమతి వేముల మీనాక్షీ దేవి.

బ్రహ్మశ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారిని గురించి నేడిక్కడ జరుగుచున్న శత జయంత్యుత్సవ సందర్భమున నీ పరిషత్సభలో ప్రసంగించు అవకాశము నాకు లభించుట నాఅదృష్టము. 1929-వ సంవత్సర ప్రాంతమున కాంబోలు పంతులుగారు తమ కుమార్తెయైన శారు రమణమ్మగారిని విశాఖపట్టణములోని క్వీన్ మేరీస్ హైస్కూలులో చేర్పించుటకు స్వయముగావచ్చినపుడు వారి దర్శనభాగ్యము నాకుఁగలిగినది. అంతకుముందే హాస్యరసప్రధానమైన కంఠాభరణ నాటకమును జదివి యున్నాము. ఆ సంవత్సరమే పాఠశాల సంవత్సరోత్సవ సందర్భమున వీరి రాధాకృష్ణనాటకము ప్రదర్శించినాము. ఈ రెండునాటకములకు కర్తఅయిన శ్రీ పంతులు గారిని చూచినప్పుడు మా కెంతో సంతోషము కలిగినది. క్రమ క్రమముగా వీరు రచించిన సాక్షి ఉపన్యాసములను, నాటకములను కూడ చదివినాను.

ఆ కాలపుఁ గవిపండితులలోవలెనే శ్రీ పంతులుగారిలోకూడ సర్వజ్ఞత్వము వెల్లి విరియుచుండెను. గ్రేట్‌విక్టోరియన్స్ అని పేరు పొందిన ఆంగ్లేయకవులలోఁ గల ప్రధానలక్షణములన్నియు ఈ యిరు పదవ శతాబ్దపు ప్రథమభాగమున వెలసిన పండిత ప్రకాండులలో నుండెడివి. సింహత్రయమని పేరుపొందిన పానుగంటి నరసింహారావు గారు, కూచి నరసింహంగారు, మా తాతగారైన చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు; కందుకూరి వీరేశలింగంపంతులుగారు వేఱుకోవకుఁ జెందినప్పటికి గిడుగు రామమూర్తిపంతులుగారు, గురజాడ అప్పారావు గారు మొదలైనవారిట్టి ఉద్దండులలో చేరినవారే.

సర్వ సమర్థులైన ఆ కాలమునాఁటి నాటకకర్తలలోఁగల కొన్ని ముఖ్యలక్షణములను వర్ణించి ఆ యా లక్షణములు శ్రీ పాను

గంటివారిలో సంపూర్ణముగఁ గలవని నిరూపించుటయే నా ప్రసంగములోని ముఖ్యోద్దేశము. అట్టి లక్షణములలో మొదటిది : సమగ్రమైన పాండిత్యము. శ్రీ పంతులుగారు ఆంగ్లములో పట్టభద్రులు. ఆంధ్రభాషలో పారంగతులు. సంస్కృతభాషలో వ్యవహారదక్షత కలవారు. ఈ విషయము వారి రచనలయందంతటను గనఁబడుచునే యుండును.

పాత్రచిత్రణములోనేమి, కథాకల్పనలోనేమి, సంభాషణలలోనేమి, సన్నివేశములలోనేమి, వీరు షేక్స్పియరు మహాకవిని దలఁపించుచుందురు. కంఠాభరణములోని తబ్బిబ్బులు మిడ్‌సమ్మర్ నైట్స్ లోని తబ్బిబ్బులను గుర్తుచేయును. సరస్వతి నాటకములోని తిక్కమకలు ట్వెల్త్‌నైట్‌లోని, అన్నాచెల్లెళ్ళ మాఱువేషములను జ్ఞాపకముచేయును. రాతిస్తంభము, పూర్ణిమ మొదలగు నాటకములలోని యితివృత్తములు షేక్స్పియరుమహాకవి విషాదాంతనాటకములను బోలియుండును. అయినను వీనిలో నేవియు దేనికిని భాషాంతరీకరణము కాదు. షేక్స్పియర్ మహాకవివలెనే నరసింహరావుగారు కూడ సామ్రాజ్యాధిపతులు మొదలుకొని శ్మశానపాలకులవఱకును, అసూర్యంపశ్యల మొదలు అంటరాని అన్నల మిన్నలవఱకును అన్నిపాత్రములను వారివారి పరిస్థితులకు, చిత్తప్రవృత్తులకు అనుగుణముగా చిత్రించినారు.

ఈ పండితుల రెండవలక్షణము భాషాదక్షత. ఉపమాన పరంపరలలో, దృష్టాంత సమూహములలో, వివిధశబ్ద విన్యాసములలో, ఎక్కడనో మాఱుమూలనున్న వేదాంతపరిభాష మొదలుకొని వీథి భాగవతముల ముక్తాయింపులవఱకు శ్రీ పానుగంటివారు వాడని పదములేదు. పాణినీయ వ్యాకరణములోని 'రోరి' వంటి మాఱుమూలనున్న సూత్రముల మొదలుకొని శాస్త్రిగారి భాషాచరిత్ర

వఱకుఁగల అన్ని సాంకేతిక పదములను ఆ యా సందర్భములకు తగి నట్లుగా ప్రయోగించినారు. సమాసకల్పనలలో అప్పటికప్పుడు వేర్వేఱు పదములను అతికి చిన్నపిల్లలు మెకానోసెట్టుతో వేఱువేఱు రూపములు కల్పించినట్లుగా కల్పించినారు. ఉదాహరణకు

"నిరాఘాట కవనధారా పారీణుఁడు."

"దినమణి సిందూర తిలక లలితాలిక ఫలక."

దీపావళి సామానువలె 'అర్థనాశక 'శబ్దాడంబరము.'

'నిత్యమందాగ్ని బాధా సమాలబ్ధశిథిల స్వప్నపరిపాటీ విచిత్రుఁడు' మొదలగునవి.

శ్రీపానుగంటివారి అపరిమితమైన ప్రపంచ జ్ఞానమునకును, శాస్త్రపారంగత్వమునకును సాక్షి ఉపన్యాసములలోని లెక్క-కు మిక్కిలియైన విషయములే సాక్షి. ఈ ఉపన్యాసము లాంధ్రలోకము నట్టూఁత లూఁగించినవి.

వంశపారంపర్యముగా జీవులకు లక్షణములు సంక్రమించునా? లేక పరిసరముల ప్రభావమా? అను విషయముపై సమగ్రమైన చర్చలిందున్నవి. పరిణామవాదము (ఇవల్యూషన్) దశావతార తత్త్వమును సమన్వయించి ఉన్మత్తుని ఉపన్యాసములోఁ జెప్పినారు. మన స్తత్త్వశాస్త్రవిగూఢ విషయములను, భాషాపరిణామ శాస్త్రములలోని గహన విషయములను జర్చించినారు.

లక్ష్మీనరసింహరావుగారిలో వేఱొక లక్షణము వారి శబ్దవిన్యాసములో నున్నది. శబ్దగతమైన హాస్యము సర్వసామాన్యము. ఒక్కొక్క-చోట వ్యంగ్యముకూడ హాస్యమునఁ గనఁబడుచుండుట కలదు. కొన్ని చోట్ల నివి వ్యక్తులను సంబంధించినట్లు కనఁబడినను నాను సంఘము లోని యాయా గుణములకు ప్రతినిధులే గాని, ప్రత్యేక వ్యక్తులు కారు.

అది వారి నియమము. ఈ నియమము సాక్షిసంఘ నిబంధనావళి యందు మనకుఁ గనఁబడును.

శ్రీ పిఠాపురము మహారాజావారి ఆస్థాన నాటక కర్తగా శ్రీ పానుగంటివారు వ్యవహరించెడివారు. వారి రచనలను వారిముఖమున వినుట మహారాజావారికి మిగుల నిష్టము. నరసింహారావుగారు తమ రచనలను వినుపించుచుండఁగా వారియుభయుల నవ్వులతో నా రాజమందిరము మ్రోగిపోవుచుండెడివి.

అటు ఆస్థానపండితులు వేంకట రామకృష్ణకవుల యష్టావధాన, శతావధానములతో రాజభవనము అపరవాగ్దేవీమందిరమువలె, కవితోద్యానమువలె కలకలలాడుచు, గమగమలాడుచు శోభాయమానమై యుండెడిది.

మహదానందకరమైన ఆదినములంతరించినవి. అపరభోజుడు, ఆశ్రితజనపోషకుఁడు, కవి వల్లభుఁడు ఆమహారాజు లేడు. ఆ మహాకవులును లేరు. ఆసారస్వత రసాస్వాదనచేసి ఆనందించిన ఆ ప్రజలలోని వారందఱు లేరైరి. అక్కడక్కడ అరుదుగ మిగిలినారు.

శ్రీ పానుగంటివారు నలుబది రసవత్తరములగు నాటకములను వ్రాసినారు. వీరికి "ఆంధ్రషేక్స్పియరు" అను బిరుదుకలదు. రాధాకృష్ణ, పట్టభంగరాఘవము, నర్మదాపురుకుత్సీయము మొదలగునవి పౌరాణికములు. ప్రచండచాణక్యము, చూడామణి మొదలగునవి చారిత్రికములు. ఇవిగాక మాలతీమాల, జాతిస్తంభము, కంఠాభరణము మొదలగునవి కల్పితములు.

రాధాకృష్ణ, పట్టభంగరాఘవము, (పాదుక), కంఠాభరణము ప్రసిద్ధిగాంచినవి.

రాధాకృష్ణ భక్తిరసప్రధానమగు నాటకము. కవిగారి గాఢమగు దైవభక్తిని ఈనాటకమున మనము చూడగలము. మత సాంప్రదాయములకై అభిమానముగల వ్యక్తియీకవి.

కంఠాభరణము మొదటినుండి చివరివఱకు హాస్యరసమే. వివిధ ప్రవృత్తులుగల వ్యక్తులు. అన్నియు నన్నియేకదా! పరమఛాందసుఁడు, మూర్ఖుఁడు, వివేకశూన్యుఁడు నగు సోమావధాని ప్రముఖమైన పాత్ర. అన్నియు నసందర్భపుమాటలే! తప్పుల తడకలేకదా! పిచ్చి రామశాస్త్రి పాత్ర యొక విశేషము. రామశాస్త్రి విద్యావంతుఁడు, గుణవంతుఁడు. కిట్టనివారెవరో చేఁతబడిచేయుటచే అతనిమతి చలించినట్లాతని మాటలవలనఁ దెలియుచున్నది. ఆతఁడు వీధులవెంటఁ దిరుగుచు రకరకములగు విజ్ఞానవిషయముల నేకరువుపెట్టును. దురాచారములను దుమ్మెత్తిపోయును. దుష్టులను వెన్నాడుచుండును.

"కవులూరివారి కవిత్వము, మాకవిత్వము ఒకటాకీ. వారికి యతిలేదు. మాకు మతిలేదు. వారికి ప్రాసములేదు. మాకు ధ్యాసము లేదు. వారికి గుణములేదు. మాకు గణములేదు. వారికి అర్థములేదు. మాకు నర్థములేదు" వెట్టి రామశాస్త్రిమాటలివి.

సుబ్బలక్ష్మి రామశాస్త్రిచెవిని పట్టుకొనినప్పుడు ఆతఁడు మొత్తుకొనుచు "మాభారతమునకు కర్ణపర్వమే ఆరంభము. ఇవి శల్యపర్వమువఱకును బోధుచుచున్నవి. ఈ స్త్రీపర్వమే బెడిసికొట్టిన యెడల మాకు స్వర్గారోహణపర్వమే" అని అనెను.

ఇట్టిమాట లెవరికి నవ్వు పుట్టింపకుండును?

"వీణకువలె చెవులు మెలిపెట్టినకొలఁది శ్రుతి హెచ్చుచున్నది" అని రాధాకృష్ణనాటకమున శారదునిచెవి పట్టుకొనిన లలిత చమత్కరించెను.

హాస్యరసమే శ్రీ పానుగంటివారి రచనలన్నిట నెక్కుడుగా కానఁబడుచుండును. 'నదీనాం సాగరోగతిః' అనునట్లు వీరి రచనలలోని వివిధ హాస్యరసలక్షణములు కంఠాభరణమునఁ గూడినవి.

సంఘమునందలి దురాచారములను, వ్యక్తుల దుష్టత్వములను,

దురన్యాయములను రూపుమాపుటకు పూనుకొని గొప్పకృషిని జరిపి రనుటకు ప్రత్యక్షసాక్షి వీరిసాక్షి. వారి సాక్ష్యుపన్యాసములు సరసములై, హాస్యరసమిళితములై, రసవత్తరములై, చక్కని శబ్దవై చిత్రిని గలిగి పాఠకులకుఁ జదివినకొలఁది కుతూహలమును గల్గించును. వీరిరచనలు ఏకాలమునను చదువఁదగినవి. త్రికాలాబాధ్యములైన విషయములిందు పొందుపఱుపఁబడినవి.

సాక్ష్యుపన్యాసములలో పానుగంటివారు తామవలంబించిన నిబంధనలను సాక్షిసంఘనిబంధనావళిగా రూపొందించినారు. ఆనాఁడు భారతదేశము పర పరిపాలనలోనున్నది. అందువలన వారి నిబంధనావళియందు కనుకూలముగ రచింపఁబడినది.

నిబంధనలు:

1. సభారంభమున చక్రవర్తిగారికిని, వారి కుటుంబమునకును ఆయురారోగ్యములకై దైవమును ప్రార్థించుట.

2. రాజకీయవిషయములు మాట్లాడుట, వ్రాయుట పనికిరాదు

3. చెడ్డను విమర్శించినప్పుడు వ్యక్తులపేర్ల నుదహరింపరాదు. ఒకవేళ అట్లు చేయవలసిన అవసరముకలిగినచో కల్పితనామములను వాడవలెను.

4. సభ్యులలో ఏదైనవివాదము సంభవించినచో తిట్లలోనికిని కొట్లాటలలోనికిఁ దిగరాదు. ఒకవేళ కర్మవశమున నట్టివి సంభవించినచో కోర్టులవఱకు పోరాదు.

సాక్షిసంఘ నిబంధనావళి యిది: ఐదుగురు సభ్యులతో ఈసాక్షి సంఘము స్థాపింపఁబడినది. సాక్షి- ప్రధానపాత్ర. ఇతని పేరిటనే సంఘము స్థాపింపఁబడినది. ఈయనగొప్పతనము ఆ గ్రంథాంతము మనకు కనబడును. ప్రజలను సమావేశపరచి సభలు జరిపించుట, పత్రికాప్రకటనలు చేయుట మొదలగునవి వీరి ముఖ్యమైనపనులు.

అందఱకూ సలహాదారు. జంఘాలశాస్త్రి– ఈతడు, నీతని యుపన్యాసములు ఆంధ్రులకు పరిచితములే. గొప్ప వాగ్ధాటిగలవాడు. గంటల తరబడి గుక్కెడునీళ్లైన త్రాగకుండ ఉపన్యసించగల సమర్థుడు.

కాలాచార్యులు: ఇతడు సత్యాన్వేషి. ఆ అన్వేషణలో ఆతడు స్త్రీపురుషవివక్షతనుగూడ పరిగణించక కనబడినవారి నెల్లనర్థము చేయిచాచుచుండును. ఎడమచెయ్యి నిత్యము చాచియేయుండు ననుటలో నతిశయోక్తి లేదు. నిర్ధనుడు చందాయీయలేడు. వెట్టి సభ్యుడు.

వాణీదాసు:– కవి సోమరి ఆదికవి నన్నయ మొదలు నవ్యకవి నానాసాహేబువరకును దూషించువాడు. శ్లేషకవిత్వమనిన నీతడు ప్రాణమిచ్చును. నువ్వుగింజమీద నూరుపద్యము లల్లగలడు.

బొఱ్ఱయ్యసెట్టి: సాక్షి సంఘాధ్యక్షుడు. ఆరితేరిన వ్యాపారి.

శ్రీ పానుగంటివారు హృదయంగమముగా పద్యము లల్లగలరు. గీతముల నెక్కువగావాడుట వీరి యలవాటు. వీరి పద్యములు ఉపమానభూయిష్ఠములు.

"ద్రోహియగు ప్రతిభావంతు ద్రోహమాప
గంటికడనె యుంపగవలెగాక స్వేచ్ఛ
నిడిన నందరకునుహాని వడిగజేయు
బోనునుండి విడువబడు పులినిబోలి"

(ప్రచండ చాణక్యము)

"రాధయను సుధామధురాక్షరములు చెవిని
బడినవెంటనె మనసంత ప్రభనుజెందె
నొకటిమాటుగ దటుక్కన జుక్కరాల
రప్పునను వెల్గు నమవసరాత్రి వోలె."

(రాధాకృష్ణ)

హాస్యముగా, హేళనపద్యములను అవలీలగా, చమత్కారముగా వ్రాయుటలో పానగంటివారు దిట్ట, కంఠాభరణమున సుబ్బిసెట్టిని పొగడుచూ భట్రాజసోదరు లిరువురు చెప్పినపద్యము:

"బచ్చుండవు నెరదాతల
మచ్చుండవు శత్రువులకు మహితజ్వాలా
చిచ్చుండవు కవివర్యుల
మెచ్చుండవు మేటిగుణ పుట్టీ! సెట్టీ!"
"కాటేశ్వరకోన బ్రాహ్మణు
లిట్రికవి చెప్పగలరె యిలలొ సరవిన్
భట్రాజు నూంన కవితకు
యెట్రి వపుచాయ కవిత యీడొచ్చిలలోన్"

ఆ సోదరులకు సావులాయియ్యని (మొదట బేడయియ్యబోవ వారు పద్యములలో మెడాపెడా తిట్టుటవలన) సుబ్బిసెట్టి వొక టప్పయ్యతో చెప్పినాడు. ఆ సోదరులలో నగరాజను "రెండు హాస్య ముతైన దయసేయు'మని కోరినాడు. ఆతనితమ్మునికి కోపము వచ్చినది.

"అన్నా! రెండనిపల్కితేల యిలలోనన్నా! కవిత్వోపు పె
ద్దన్నా! ధారుణి బుద్ధిజాతికిని హైద్రాబాదు అక్కన్న మా
దన్నా! సద్గుణగున్న కీర్తిభరచెన్నా! అన్న! భట్రాజురా
మన్నా! మాటలుమిన్న! కోపమున సున్నా! యన్న!
యెన్నాళకున్

అని మందలించినాడు. ఇట్టిపద్యములు వ్రాయుటకూడ కష్టమే!...

వీరి స్వప్నకావ్యమున తిక్కన, నన్నయగారలను ప్రత్యక్షము గావించుకొనినారు. భాషావిషయికములగు, మతవిషయికములగ నెన్నో సంగతులను వారితో చెప్పించినారు. ఉదాహరణకు ఒకటి

రెండు యీక్రింద వివరించుచున్నాను. వారు 'నేను' అని ఆ సంభాష ణమున పేర్కొనినారు. నేను నట్లే వ్రాయుచున్నాను.

"నేను- పూర్వము నియోగి, వైదికవైరములు రాజకార్యములందేగాని యిప్పుడు సారస్వతకార్యములందుగూడ బ్రాకినది. ఈ మునక మీవలన గలిగినది.

నన్నయ- అయ్యయ్యో! నూకట్టి భేదము లేదే!

నేను- మీకు లేనిది మీతరువాత వారికుండగూడదా? మీకించుగాగమయతి యున్నదా? తీసిక, కొట్టికయని ప్రయోగించి యెఱుగుదురా? రేఫశకటరేఫములకు మైత్రి మీరంతగా నంగీకరించితిరా? ఇప్పటివారవి పాటించుచున్నారా? లేదా? అట్లే మతములోగూడ మీకు లేనిభేదము లిప్పుడు కలిగినవి. వైదికుడైన నన్నయగారిని, నియోగియని పిలుచుటకు నియోగులు దేవులాడుచున్నారు. ఇట్లుచేయుట మీయందు భక్తిచేతనే యగును ... నియోగులలో నిరక్షరకుక్షులైనను వైదికుడైన నన్నయభట్టుగారిని సామాన్యకవియని తూలనాడుచున్నారు ... నాయభిప్రాయము మీకు స్పష్టమైనదా? లేదా?

తిక్కన- తెలిసినది. వైదికుడొనర్చిన గ్రంథమును నియోగి రచించినదనియు, నియోగిచేసిన గ్రంథమును వైదికుడొనర్చెననియు, నికముందు చెప్పుదురేమోయని.

నన్న- అదెట్లు సాధ్యమగును?

తిక్క- తాళపత్రగ్రంథములలో గ్రంథకర్తృ వంశావతార వర్ణఘట్టమును లాగివేయుట యీ యింద్రజాలమునకు ప్రథమావస్థ.

నేను- వీరువారనవలదు. అందఱిలోను వైరములు ప్రబలముగానున్నవి. దినదిన ప్రవర్ధమానములై యున్నవి. కుమ్ములాట, గ్రుద్దులాటతప్ప వేఱుపనిలేదు.

తిక్కన- ఇది మిగుల శోచనీయముకదా ? మాధ్వులేమి ? నియోగులేమి ? వైష్ణవులేమి ? వైదికులేమి ? అందఱుకూడ వైదిక మతావలంబులేకదా ? ... నాకాలమున నిట్లే యుండెనా ?

నేను- నవ్యకవిత్వమని సరిక్రొత్తకవిత్వము బయలు దేరినది.

నన్న- అది యెక్కడనుండి వచ్చినది ?

నేను- అది తూర్పుగాలితో వచ్చిన తుపాను. (గురజాడ గిడుగు రామమూర్తి పంతులుగారు) ఏమిచెప్పుదును తాతగారూ ! యతులు లేవు. ప్రాసలులేవు. సంధులు లేవు. ఛందస్సులేదు. శబ్దశుద్ధి లేదు- చిట్టిచిట్టి పాటలు- పొట్టిపొట్టి పల్లవులు- పోనీ, గానమర్యాదను జూతమన్న తాళముధ్వస్తము, రాగము సంకరము.

ఉదా:- చెంబుపై చుక్కఅప్పున జారిపడగ

చిలుక కులుకుచు దిశలతో నేకమయ్యె.

తిక్క- ఏలాగు ? ఏలాగు ? దీనికర్థమున్నదా ?

నేను- ఇందులోనున్న సొగసే అది. చెంబు- అనగా ఘటము. ఘటమనగా నీశరీరము. చుక్కయనునప్పుడు తేజస్వంతమైన పరమాత్మ. చెంబుపై చుక్క రప్పున జారిపడగ ననగా మనుజునకు భగవత్కటాక్షము కలిగినప్పుడనియర్థము. చిలుక కులుకుచు దిశలతో నేకమయ్యెననగా భక్తిచే నార్ద్రమై జీవాత్మ పరమాత్మతో నైక్యమయ్యెనని భావము."

ఈవిధముగ నేదియో కలగాని, జాబు వచ్చినదనిగాని సాకుగా తీసుకొని సారస్వతములోని మంచిచెడ్డలు; సాంఘిక దురాచార, దురన్యాయములు; వివిధమతముల విషయములు; ఒకటేమిటి ? వారు తీసుకొనని సమస్యలేదు. వారు నిర్వచించని నీతిలేదు. వైద్యుడు "దుష్టాంగంబు ఖండించి" నట్లు అన్నిటగల కుళ్లును ఖండించి, శోధనము చేసినారు.

ఒకప్పుడు పిఠాపురము మహారాజావారి ఆస్థానమున అస్థాన వైణికవిద్వాంసులైన సంగమేశ్వరశాస్త్రిగారి వీణాగానము జరిగి నప్పుడు శ్రీ నరసింహారావుగారు విని మహారాజావారి నుద్దేశించి ఒక సీసపద్యమును వ్రాసినారట.

సీ॥ స్వజనుల నేరీతి బరిపాలన మొనర్తు
వాశ్రితు నెవ్వాని నాచరింతు,
వాదాయమున నెంత యర్థాళికిచ్చెద
వెదెటుచేసిన భృత్యు నెదగణింతు
వవని పాలన నేది యార్జించినాడవు
కవిత, గానంబు నేబగిది విందు,
వెట్లుగా పృథుసౌఖ్య మీక్షింపగానుంటి
వాత్మ సంస్తుల కేసుంకువయ్య,
తే॥ గీ॥ "సరిగ, ధని, సగమ, సనిని సరిగ, గరిమ,
మరిమరిగ, పాపనినిగని, సరిసరి" యను
వీణ కాని, 'మా' వెన్క నీ వీణవరుస
మీదా? 'నీ' వెన్క 'మా', సూర్య మేదినీశ!

చమత్కారమై, అత్యద్భుతమై, ప్రాచీనకవిత్వపు పద్ధతియందు నిగ్గువంటిపద్యము! పై నాలుగుపాదములలోగల నెనిమిది ప్రశ్నలకు క్రమాలంకారమున సరిగమపదనిస లలో చెప్పినారు. వీణకు 'మా' తరువాత 'నీ' (ఆరోహణలో) వచ్చును. కాని మహారాజావారి విష యమువమాత్రము 'నీ' (మహారాజవారి) వెన్క 'మా' (లక్ష్మీదేవి) అనుసరించి యుండునట!

మహారాజావారిపట్లవీరికిగల అనన్యసామాన్యమైనభక్తి, గౌరవ ములకు నింతకన్న వేరుదాహరణ మక్కరలేదు.

శ్రీ పానుగంటివారి రచనలనుగురించి యీవిధముగ చెప్ప

బూనినచో మరల వారి రచనలను వ్రాయుటయే కాగలదు. సముద్రమున కెదురీదుటయే కాగలదు.

ఒక హాస్యమా? చమత్కారమా? శైలియా? వేదాంతమా? రసమా? కవిత్వమా? సమయస్ఫూర్తియా? సర్వజ్ఞత్వమా ? రచనా విశేషమా ? విమర్శనాత్మకదృష్టియా ? ఉపమానములా ? సమాసములా ? పాత్రచిత్రణమా ? సంభాషణమా ? సన్నివేశములా ? పాండిత్యమా ? ప్రకృతి పరిశీలనమా ? స్వయంప్రతిభయా? ... ఎన్నని చెప్పుదుము? ఇంతకన్న వీటియన్నిటి రూపకల్పనమే శ్రీ పానుగంటివారు అనుట మంచిది ! తగినది !

శ్రీ పానుగంటివారి నాటకములకు చాలవరకు శ్రీ కూచి నరసింహముగారే 'నాందీప్రస్తావనము'ను వ్రాసినారు. ఇందు స్వోత్కర్ష కొంత యుండునుగనుక వీరిపద్ధతి నవలంబించియుండుట గమనార్హము

ఇంతటి మహనీయుని కృషిని ప్రభుత్వము గుర్తించినది. ఈనాడు శతజయంత్యుత్సవములు దేశమందంతటను (తెలుగువారున్న ప్రాంతములయందు) జరుపబడినవి. ఇది మిక్కిలి సంతోషింపదగినది. ఈకారణముగనైన ఆంధ్ర లోకమారు వారి రచనలను చూచు భాగ్యము కలిగినందుల కత్యంతానందముగ నున్నది.

షేక్స్పియరుమహాకవి నాటకములన్నియు ఒకే సంపుటమున లభించుచున్నవి. అట్లే శ్రీ పానుగంటివారి నాటకములను ఒకేసంపుటముగా ప్రచురించిన పాఠకుల కందుబాటులో నుండును. శ్రీయుతులు వీరేశలింగము, చిలకమర్తి, తిరుపతివేంకటకవుల కిట్టి సంపుటములు షష్టిపూర్తి సందర్భమున వెలసినవి. వీరు కొంతకాలము ఉపాధ్యాయులుగా నుండుటవలన వారి శిష్యగణము ఈ మహత్కార్యమును నిర్వర్తించినది. పానుగంటివారు నాటకకర్తయేగాని, చెప్పుకోదగినంత

కాల ముపాధ్యాయవృత్తిలో లేదు. అందువలన యీ భారమువహించు శిష్యులు లేరు. ఇట్టి పరిస్థితులలో ప్రజాసంస్థయనదగిన సాహిత్య అకాడమీవారు యీ భారమును వహించవలసి యున్నది.

శ్రీ పానుగంటివారు చేసిన భాషాసేవకు, తద్వారా చేసిన సాంఘిక సేవకు అశేషాంధ్రులు ఋణపడియున్నారు. ఆమహనీయునికి ఆమహాకవికి యీసందర్భమున మాభక్త్యంజలుల నివే సమర్పించు కొనుచున్నాము.



# పానుగంటివారి పాదుకా పట్టాభిషేకనాటకము.

శ్రీ కాముఋషి సత్యనారాయణశర్మ.

నాటకరచనలో సిద్ధహస్తులైన శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు వాల్మీకి రామాయణము ననుసరించి అందలి కథను నాలుగుభాగములుగా విభజించి నాటకములుగా రచియించినారు. శ్రీరామజననము, గాధేయుని సవన పరిరక్షణము, తాటకాసుర సంహారము, సీతాకళ్యాణము వఱకుగల కథను కళ్యాణరాఘవమను పేరున ఒకనాటకమును, అయోధ్యకాండయందలి కథను పట్టభంగరాఘవమను, పాదుకాపట్టాభిషేకముగా రెండవ నాటకమును, అరణ్య కిష్కింధ, సుందరకాండములందలి కథాంశములను వనవాసరాఘవమని మూడవనాటకముగాను, యుద్ధకాండ మందలి కథాంశమును విజయరాఘవమని నాలుగవనాటకముగాను రచించిరి. ఇందు పాదుకా పట్టాభిషేకము ఆంధ్రదేశమందలి పలుతావులలో ప్రదర్శింపఁబడి విశేష ప్రచారము, ప్రఖ్యాతిపొందినది. ఇది ఏడంకములనాటకము. ఇందు మొత్తము ఇరువది పాత్రలుగలవు. అందు అయిదు స్త్రీపాత్రలు వీరియభిప్రాయముల ననుసరించి నాటకములందు తేటగీతమును, సీసమును మాత్రమే వాడియున్నారు. వృత్తములు నాటకములలో ప్రయోగార్హమైనవి కావని నిరూపించియున్నారు. సంభాషణలు ఒక్కొక్కపట్టు సుదీర్ఘముగా నుండును. సాధారణముగా రంగస్థలమున కనుగుణముగా ఏ కవి రచియించిన నాటకమునైనను సంస్కరించుటపరిపాటి. వీరిరచనలలో స్వగతములు- అపవారించిన సంభాషణలు కూడఁగలవు. అవి నటకుని చాతుర్యమునుబట్టి రంజింపఁజేయ వలసియుండును. ఇవిగాక వీరినాటకములలో విష్కంభముల కొక ప్రత్యేకతగలదు. అవి పాత్రలగుణదోష వివరణమునకు- ముందురాబోవు అంశములను సూచించుటకు ప్రేక్షకులకు కథాసందర్భము సుబోధక మొనర్చుటకు చాల నుపయోగకారిగా నుండును. అద్దంకి

శ్రీరామమూర్తిగారి దశరథ పాత్రకు వన్నెదెచ్చినది పంతులుగారి లేఖినియనుటలో సందేహము లేదు.

ప్రథమాంకమున దశరథుడు- వశిష్ఠ, సుమంత్రులతో రామ పట్టాభిషేకమును త్వరితగతిని జరుపవలసిన యావశ్యకతను గుఱించి సమాలోచన జరుపును. దశరథునకు పుత్రశోకార్తిచే మృతిఁబొంద నున్నశాపము, కైకను వివాహము చేసికొన్నప్పుడు, ఆమెకు కలిగిన సంతానమునకు రాజ్యమిచ్చెదనని చేసిన వాగ్దానము, మిక్కిలి మనో వైకల్యమును గలిగించినవి. ఈ మనోవేదనను వెలిబుచ్చుటకై కుల గురువగు వశిష్ఠునితో తనజాతకచర్యను ముచ్చటించుచు వివరించును. ఇది పంతులుగారి రచనలోని ప్రత్యేకత.

గీ॥ మూఁడవగ్రహంబు మారకంబునకుఁ దగిన
దందులో మొండియైన ఛాయాగ్రహంబు
నంతరము వచ్చె; దీని సాహాయ్యమునను
నిశ్చయముగ మారకమది నెఱపుగాదె.

దశరథ మహారాజునకు జాతకమున వ్యయస్థానమందున్న కుజుని మహాదశలో కేత్వంతరమువచ్చినది. ఇదిమారకయోగము మూఁడవ గ్రహము ఆయన మూఁడవభార్యకైక. కఠినహృదయయగు మంథరయే మొండియైన ఛాయాగ్రహము. దీనిసాహాయ్యమునఁదనకు మారకముకలుగునున్నదని శ్లేష. ఇవిగాక భయంకర స్వప్నములు, దుశ్శకునములు ఆయనను నిరంతరము కలతపెట్టుచున్నవి.

గీ॥ పుత్రశోకంబుచే మృతి బొంద శాప
మున్న దెప్పుడేమి కానున్నదో యెఱుంగ
తలబరువుఁజేర్చి రాముని, దండకాఖ్య
వన నివాసము నిశ్చయ పఱచుకొంటి.

తలబరువు రాముని జేర్చి, తాను వానప్రస్థుఁడగుట యాతని

వాంఛితము కాని "రాముని దండకాఖ్యవననివాసము నిశ్చయమగుట చుకొంటినని ధ్వని కల్పించి భవిష్యత్తును సూచించుట కవి ప్రతి భను సూచించును.

అనంతర మొకవిష్కంభము- ఇందు విజయశర్మ, సోమనాథుఁ డను ఇరువురు విప్రులు రేపుజరుగబోవు రామపట్టాభిషేకమహోత్సవ విశేషములుగూర్చి ముచ్చటించుకొనుచుందురు. ఇదిచాల సహజ ముగానను సంధింపఁబడినది.

సాధారణముగా జమీందారీ ప్రాంతములలో పట్టణముం దున్న వారిలో చాలమంది ప్రభు పోషణమునొందుచు వారిచర్యలను స్తుతించుచుందురు. కాని రాజాశ్రయములఁ బొందఁజాలనివారు,వారి చర్యలలోని దోషములను నెన్నుచుండుట పలుతావులందుఁజూచుచుం దుము- ఇట్లే సోమనాథుఁడు విజయశర్మ చెవిలోనిట్లనును.

"దశరథుడు దుర్మార్గుఁడు- ఇతనిరాజ్యము గోస్తనీ నదీప్రవా హమువలె నెంతదీర్ఘమో యంత వక్రమైనది, ఇతని పాలనమున్న జను లకు విసువుగానున్నది. ( 60 వేలేండ్ల పాలన) అసలే వెలితిపాట- అందుపైఁ వెల్లవాఱినదాఁక నొక్కటేపాటయగుచో వినువారికెటులుం డునో జనులకా తీరుననున్నదని ప్రజాభిప్రాయమును గుసగుస లాడు కొందురు. సుముహూర్తమవ్యవధిగా నంచినందులకొక శంకచేయును.

దేశదేశములనుండి బ్రాహ్మణులు రాజన్యులువచ్చిన యెడల వారివిషయమై విశేషధనవ్యయమగునని,ఎవ్వరు రాకుండ నింతనిరవకాశ ముగా ముహూర్త మేర్పఱిచినారని లగ్నమును శని చూచుచుండుట వలన ముహూర్తమేమియు బాగుగా లేదని మఱియొక శంకచూపును.

విజ:—అట్టిబలహీనమైన ముహూర్తమును వశిష్ఠుడేల నిర్ణ యించెను?

సోమ:—అతఁడేమి చేయఁగలఁడు భూపతుల ముహూర్తములు

దుష్టసతులఁ గోరికలవలెఁ దలచుకొన్నపుడే సమకూర్పవలసినవి గదా ! అనును ఇందలి స్వభావోక్తిగమనింపఁ దగినది

ఇఁక రెండవయంకమున మంథర ప్రవేశముకానున్నది. అందును సూచనగా మంథర నిట్లు వర్ణించును.

ఆది కూర్మముపై మందరాద్రి నిలచె
మున్ను, కాలము వ్యత్యయంబుగ వెలంగ
నిపుడు మందరోపరి కూర్మ పృష్టమొక్క
నగదదె వక్రబుద్ధి లాంఛనమగును.

వాల్మీకిరామాయణమందు గూడ మంథరపాత్రయే చిత్రముగా వర్ణింపబడియుండుట పఠితులకు సువిదితమేగదా !

రెండవ యంకమున తెఱయెత్తగానే కైకేయి యంతఃపుర ప్రాంగణమున మంథర ప్రవేశించును - అది రాత్రిసమయము రామ పట్టాభిషేకమునకై చేయబడిన నగరాలంకారములను వాద్యఘోష లను ఆమె వినును ఆమె మనస్సున కొఱకొఱ లుత్పన్నమగును.

" ఈయఱుకులేమి? ఈపఱుగులేమి ?- ఈ గుఱ్ఱపుబండ్ల కిరకిరలేమి ? ఆయేనుగుల ఘుణఘుణలేమి ఆదృశ్యమును తన వింత ధోరణిలో వికటముగవర్ణించును. పరిచారికల నడిగి రామపట్టాభిషేక వార్తను చెవులబడినకొలది ఆమె అసూయాగ్నిప్రజ్వరిల్లును రామ పట్టాభిషేకవార్తను విన్నపురంధ్రిమణులు దీపముల వెలిగించుచుం దురు. అవిచూచిమంథర- "ఏమిది కొంపలుగాలి నట్లా వెలుతురేమి? నేనెగూడ నొకవింతయగ్ని నిక్కడ ముట్టించెదను. వీరు ముట్టించిన యగ్ని తెల్లవాఱు సరికారునుగాని నేనంటించిన చిచ్చు రేయుంబవళ్లు విచ్ఛిన్నముగ సంవత్సరములకొలఁది మండును. వీరి వహ్నివత్తులను చమురునే గాల్చునుగాని నావహ్నిపురమును, పురజనులనూ, భూపాలుని, సర్వాంగకముగా సర్వాత్మకముగా దహింపఁజేయును.

అని కైక మందిరమునకు బోవును. ఈవాక్యములు పంతులుగారి లేఖినికిగల వాడిని స్పష్టపరచును. కైకను మంథరచేయు దుర్బోధ చేయుటలో నీయంకమందలి సంభాషణాచాతుర్యము మిక్కిలి రసవంతముగా నడచినది. అందు సవతిమత్సరము, భర్తపై అకారణ నిందారోపణలు పలువిధములుగా నుద్బోధించి కైకను సిద్ధపరచి వరములడుగుటకు దగిన మనోనిబ్బరమును కలిగించి క్రోధగృహమున బ్రవేశింపచేయుటలో మంథరపాత్రము అద్వితీయముగా బోషింపఁబడినది.

తృతీయాంకమున దశరథుడు ఆనాటిరాత్రి కైకేయిమందిరమున కరిగి ఆమెను ప్రసన్నురాలిని గావించుకొనుటలో విఫల మనోరథుఁడై పట్టభంగమునకు ఒడబడవలసినవాఁడగుటలో కరుణరసము కట్టలు త్రెంచుకొని ప్రవహించినట్లు చిత్రింపబడినది. కైకేయి శయన గృహము నిర్మానుష్యముగానున్నది. దశరథుఁడా మందిరము నిట్లు వర్ణించును.

గీ॥ విద్యలేని ముఖములాగు, విదయమైన
మనసటులు, లజ్జలేని సంభాషణంబు
వలెను, సుభగతలేని యవ్వనముఁబోలె,
చెలువలేని, యిచ్చోటు నిశ్రీకమయ్యె.

గీ॥ కమ్రి మధుకోశమున కీగకాటు, స్వర్ణ
కేతకికి ముండ్లపోటు, సంస్మిత చంద
నలతకుఁ బురుగురాటు, పొందదగిన
బోట సతక్రూపకుఁ జుఱుకుమాటవ్రేటు.

ఈ ఉపమానములు 'అభినవ కాళిదాస బి ర్థక పరచుచున్నవిగదా! అనంతర మా రాజచూడామణి కోపగృహ ప్రాంగణమునకువచ్చి బలాత్కారముగ నూడబెఱికి నేలపాలు గావించిన పసివములగాంచి

గీ॥ నెలఁత లలితమ్ముగాలే లాఁమిమ్ము నేలఁగొట్టెఁ
జెలికి కోపము నామీఁద, శిక్ష మీఁకు
గలిగె, నింద్రియలోలు రకారణముగ
నిటుల పరమపూజ్యులను బాధింతురిగాదె.

ఇత్యాదిగా మవసునందనుకొని, గూనిదాసి తనప్రియురాలితో నేమితంత్రము పెట్టినదో యని భయపడుచు

గీ॥ నవరసామోదమైన యీ నాతికొఱకు
గూనుదానిని గూడను గూఁకట్టు
కొనగవలసె; నుద్గ్రంథంబు కొఱకు చంకఁ
బెట్టబడిన కత్తెరకాళ్ళ పీటబోలె.

(కత్తెరకాళ్ళపీట=వ్యాసపీఠము) ఇందలి ఉపమానశోభ గమనార్హము.

గీ॥ తన్మవధూ భర్తలఖిలాధికారులన్న
మాటయేకాని, లోలోని పోటులన్ని
యెవరికెఱుఁగంగవచ్చు? వారెపుడు నగరు
నందుగల దాసులకు దాసులగుటనిజము.

ఇందలి స్వభావోక్తి ఎంత సమంజసమో గ్రహింతురుగాక ?

తుదకామె కోపగృహమున బ్రవేశించి పామువలె బుసలు కొట్టుచున్న, నాముద్దులభార్య కోపశాంతికై దోహదక్రియలను అనునయవాక్యముల నారంభించును. ఆమె అందులకు ప్రత్యుత్తరముగా నెత్తిపొడుపుమాటలు, దెప్పిపొడుపులతో ఇచ్చెదనన్నమాట తిరిగినట్లు నిందారోపణమున కుపక్రమించును. కొంతసంభాషణజరిగిన పిమ్మట–

సీ॥ చిదిమునబాల్గారు చెక్కుటద్దములపై
జలిబిలి చిరునవ్వు లొలయువాఁడు
కాళ్ళగజ్జెలు గల్లుగల్లు మనంగ నం
దరికను ల్చల్లగాఁ దిరుగువాఁడు

బుడిబుడినడుపుల పూర్వభూపాల గా
ధల నేనుగుడుచుచో బలుకువాఁడు
రాఘవా ! ముద్దియరా ! యన్న నెగిరి గం
తిడుచు హాయిగఁ గౌగలించువాఁడు

నట్టి పదునాలుగేఁడుల బొట్టునెట్టు
లసురభీకర వనసీమ కంపువాఁడ
ననుచు నేడ్చితి నెప్పుడో యపుడు, మఱల
నిపుడు నీమూలమున నట్టు లేడ్చుచుంటి.

పంతులుగారి పద్యరచనలోఁగల లాలిత్యమునకు చక్కని యుదాహరణముగా బేర్కొనదగిన పద్యమిది. తెలుగునాట మిక్కిలి ప్రచారముగల పద్యముగూడ నిదియే. పదునాలుగేఁడుల (బొట్టె)- అసురభీకరవనసీమ కంపుట- ఇవి గాధేయుని సవన రక్షణము నాటి మాటలైనను- రాబోవు పదునాలుగేఁడుల వనవాసమునకు సూచకములు- తుదకు రామునిపై నొట్టుబెట్టుకొని కోరినవరముల నీయఁ గలనని వాగ్దానముచేయుట- వరములడుగుట- రాజు మూర్ఛితుఁడగుట- విలపించుట- తుదకా రామునకు కబురంపి దశరథుని మనోరథముగా కైక తానుకోరిన వరములసంగతి రామునకు జెప్పుట- రాముఁ డామోదించుటతో తెరపడును.

చతుర్థాంకమున ధనుర్ధరుడైన రాముడు- ఖడ్గహస్తుడైన క్రోధమూర్తి లక్ష్మణుడును ప్రవేశింతురు. లక్ష్మణుని క్రోధోద్రేకమును శ్రీరాముఁడు తన శాంతవచనములతో నుపశమింపఁజేయును. ఎన్నివిధముల వారించినను విడువక తనతోవచ్చెదమని పట్టుబట్టిన సీతాలక్ష్మణులను తనతో వనవాసమునకు రా నంగీకరించును. శ్రీరామునకు లోకాపవాదనిందయన దుస్సహమైనది

గీ॥ వెడ్జిరాముఁడు యువసతి విడలేక
భీకరపలాశ సాంద్రాటవీ ప్రదేశ
మునకు నామెను గొనిపోయె వెనుక నేమి
ముప్పువచ్చునోయని జనులు మ్రచ్చటింతురు.

ఇందు భవిష్యత్తులో రానున్న సీతాపహరణసంఘటన మీా సూచన గావింపబడినది. పంచమాంకమున కౌశల్యాదశరథులు సీతా రామలక్ష్మణులను వనవాసమునకంపుట మిక్కిలి కరుణరసాత్మక ముగా చిత్రించినారు. తనతో నరణ్యమునకు దీసికొనిపొమ్మని కోరిన తల్లితో శ్రీరాముఁడు పతిసేవకై నీవిచ్చట నుండకతప్పదని తల్లి నోడఁబరచును. దుష్టశిక్షణమునకు, శిష్టరక్షణమునకు శ్రీరాముని మనము విడువకతప్పదని వశిష్ఠుఁ డామె నోదార్చును. దశరథుఁడు శ్రీరాముని కౌగలించుకొని

గీ॥ అమిత వనితలోలుఁడనైన నాకు
నేకపత్నీవ్రతుఁడ వుద్భవించి తౌర
భవమహాపాశ పరిబద్ధ భావుఁడైన
నాకు భవదూరుఁడవు పుట్టినావు తండ్రి.

గీ॥ ఇట్టి విజ్ఞాని చేత దరింపలేక
యాదుదానికై నిను విడనాడుకొంటి
గర్మకలనకు నమితాధికతను జూపి
భక్తిఁ బోషించుకొనని యపాజ్ఞవలెను.

ఇందు కర్మమార్గముకంటె భక్తిమార్గ ముత్కృష్టమైనదని చెప్పుటలో నిచ్చిన యుపమానము నిరుపమాన మైనదిగదా !

వశిష్ఠుఁడు సుమిత్రిత్యాగము నిట్లు ప్రశంసించును.

గీ॥ కనిన సుతునికై సవతిబిడ్డను వనమున
కనిపెకైక; సవతిబిడ్డకై కనిన సు

తుని వనికనిపెను సుమిత్రి తుల్యా హీన
చరితనీ సతి గొనియాడ సాధ్యమగునె.

కడసారిగా శ్రీరాముఁడు నమస్కరింప దశరథుఁడిట్లు దీవించును.

సీ॥ సర్వ మంగళగుణ సంపూర్ణుఁడగు నిన్ను
నరుఁడు దేవునిగాఁగ నరయుగాత!
రామనామము భవ స్తోమభంజన దివ్య
తారకనామమై తనరుగాత!
పనికొంపలును లేని పల్లెనైనను రామ
భజనమందిర మొండు వరలుగాత!
కవులెల్ల నీదివ్య కథ నెన్నోరీతుల
గొనియాడి ముక్తిగై కొందురుగాత!

గీ॥ ఎట్టివారైనయు శ్రీరామ చుట్టబడక
వ్రాయబడకుండు గావుత! రామ వాక్య
మనిన దిరుగనిదనియర్థ మగునుగాత!
రామ! రామ! రామ! రామ! రామ! రామ!

ఈ పద్యమందలి భావనాశైశద్యమెంత యుదాత్తమో, ఎంత
వన శ్లోకికి యనుకూలమగు భావనమో, పఠితులు గ్రహింతురుగాక.
షష్ఠాంకమున భరతుఁడు కైకేయిని దర్శించుట- తండ్రి మరణవార్త-
రాముని అరణ్యగమనమును, కైక కడునేర్పుగా కుమారున కెరిం
గించెను. తా నెన్నఁడునుకోరని ఈరాజ్యప్రాప్తికై, రాజవంశమున
ంతకూ నిట్టి ఇక్కట్టు తెచ్చిపెట్టిన తనతల్లి చర్యను మహోగ్రుఁడై
నిరసించినాఁడు. ఈ రాజ్యసంపాదనతంత్రమున తాను నిర్దోషినని
కౌశల్యావశిష్ఠుల కాతఁడెన్నియో యొట్టులబెట్టుకొని చెప్పుకొనును.
తండ్రిగారి ఉత్తరక్రియల యనంతరము చతురంగబలసమేతుఁడై
తల్లులతో, వశిష్ఠాదులతో వనముల కేగి శ్రీరాముని మరలనయోధ్యకు

రక్షింపదలచుకొన్న తన యభీష్టమును వశిష్ఠాదుల కెఱుకపరచును సప్తమాంకమున భరతుడు చిత్రకూటపర్వతప్రాంతమున శ్రీరాముని దర్శించును. చతురంగసేనాసమేతుడైన భరతునిరాకను దూరమున నుండి చూచినలక్ష్మణుడు తన సహజస్వభావమునుబట్టి భరతుడు తమపై దండయాత్రకు వచ్చుచున్నాడని శ్రీరామునకు నివేదించును. అందులకు శ్రీరాము డాతని నివారించి-

గీ॥ భరతునినిందించినను, రాజ్యపదవిగోరు మ్మ
టంచు నా కొకసారి నీ వాడునెడల
భరతుతో జెప్పి యీ రాజ్య పదమునీను
నతనిచే గట్టబెట్టింతునయ్య నిజము

అని శ్రీరాముఁడనగ నే'మీ దాస్యముకంటె నాకు రాజ్యమెక్కువది కాదని చెప్పి తన యజ్ఞానప్రసంగమునకు క్షమార్పణకోరును. శ్రీరామ భారతసమాగమము ప్రేక్షకులమనములు కరగించును. శ్రీరాముడు పితృవియోగదుఃఖమును తల్లులతో, సోదరులతోఁ దలపించుకొని తృప్తిజెందును. రాజ్యభారము వహింపుమని భరతుడు శ్రీరాముడు పరిపరివిధముల బ్రార్థించును. అందులకు శ్రీరాముడిట్లు బదులుచెప్పును.

సీ॥ స్థిరమైన నడవడి నరులకందరకును
వలయును, రాజ్యచాపల్యముననను
నే దండ్రిమాటను నిరసింప లోకులు
పరిహసింపరె ? రామువంటికొడుకు
భరత సౌమిత్రులవంటి తమ్ములు, సీత
వంటిభార్యయు, లేరు వసుధనంచు
ముందుయుగములఁ బురుషులు తలలూప
వలదె? యీరీతివారు నడచు

కొనవలదె? కష్టసుఖములు నను శాశ్వ
తములె? పదునాలుగేడులు దాట దిరిగి
రానె? ధరను బాలింపనె? దాని నంత
వఱకు దయనీవు పాలింపవలదె? తండ్రి!

అని ప్రబోధించి భరతుని అభ్యర్థనముపై తన పాదుకలను చిహ్నముగా నీయ నంగీకరించును. పదునాలుగేండ్లు గడచిన యుత్తర క్షణమున రానిచో తా నగ్నిప్రవేశము చేయగలనన్న తన నిశ్చయమును భరతుడు శ్రీరాముని కెఱిగించును.

సీ॥ ధరణి యీతిబాధలు లేక తనరుగాక
ప్రజల యన్యోన్యవైరము ల్మాయుగాక
కవిత రాజపోషణమున గ్రాలుగాక
రాజ్యపాలనమున రాజు నెగడుగాక.

ఇది శ్రీ పంతులుగారు ప్రతి నాటకాంతమునను స్వస్తివాక్యముగా వ్రాయు పద్యము-

రసవత్తరమైన రామాయణకథను ఇంతటి ఉదాత్తముగా భావపోషణము గావించి పాత్రలను పోషించిన పంతులుగారి నాటకరచనా ప్రతిభ అనన్యసామాన్యము. వాల్మీకి యుపమానశోభను గ్రహించి కాళిదాసు మహాకవి కాగలిగె నని పెద్దల యభిప్రాయము. అట్లు కాళిదాసుని ఛాయలలో ఉపమానములను లెక్కకు మిక్కిలిగా పంతులుగారు వ్రాసినను, అవి స్వతంత్రమై, సుబోధకమై, సరసమై కథాంశమునకు, ప్రకృతకాలమునకు అనుగుణ్యమై పఠితను పరవశమొనర్చుననుట నిస్సంశయము- ఇంత మహోన్నత కవితల రచించిన కవి అమరుఁడు- ఆయన తన కావ్యశరీమున చిరంజీవి- ఆయన రచనలను సంస్మరించుకొనుటవలన మనము ధన్యులము. ఆయన శతజయంతిని జరుపుకొని కవిఋణము తీర్చుకొనుటచే ఆంధ్రలోకము ధన్యమైనది.

# శ్రీ పానుగంటివారి గద్య వాఙ్మయము.

శ్రీ జటావల్లభుల పురుషోత్తము.

పాఠకులను పద్యముచే మెప్పించుటకంటె గద్యముచే మెప్పించుట కష్టము. పద్యములో గణయతిప్రాస సహాయ్యమున నడకసొగసు సహజముగనే యేర్పడును; దానివలన పాఠకహృదయావర్జనము సులభముగసిద్ధించును. గద్యములో నీగుణములు పూర్తిగా రచయితృ నైపుణ్యైకసాధ్యములు, అందుచేతను నొకటి-సారి చదివిన పాఠకుని హృదయమున హత్తుకొనిపోవు శ్రీపానుగంటివారి గద్యమువంటి గద్యము లోకోత్తర ప్రతిభాశాలికిఁగాని సాధ్యముగాదు- పద్యముల నడకనుబట్టి యవి కంఠస్థములగుట సర్వభాషాసిద్ధము. అట్టిభాగ్యము గద్యరచనమునకరుదు. శ్రీలక్ష్మీనరసింహారావు పంతులుగారి గద్యములోనుండి పదులకొలదియు నూరులకొలదియుఁ బంక్తులనొప్పఁజెప్పఁగలవారి నెందరినో నేను జూచియున్నాను. ఇట్లు కంఠస్థీకరణయోగ్యతగల గద్యవిశేషము నాంధ్రభాషలో మరెచ్చటను గాంచము. గద్యనికషముపై దమవన్నెను బానుగంటివారు సర్వోత్కృష్టముగా నావిష్కరించుకొనిరి.

ఆధునికయుగము వ్యవహారయుగము, ఇందులకు గద్యమెంతయో యనుకూలమైనది. చిన్నకథలు, నవలలు, జీవితచరిత్రములు, విమర్శనములు, చారిత్రిక భూగోళికాది వ్యాసములు, రాజకీయ వివాదములు—మున్నగువానితో బంధురమైన యాధునిక సారస్వత జీవన విధానమంతయు నీపాటికి మనదేశములో నెంతయో యుత్కృష్టమైన, హృద్యమైన గద్యమును వెలయింపఁజేసి యుండవలసినది. కాని నేఁటి మనగద్యవాఙ్మయ స్థితియత్యంతము శోచనీయముగనున్నది. అనేక విషయములలో నాంగ్లేయుల ననుకరించువారు గూడ వారి గద్యలోని పాటవమాధుర్యోదారతలను మనభాషలోనికి తీసికొనివచ్చుటకు యత్నింపలేదు; యత్నించినను సఫలులు కాలేదు. సఫలతనొందిన యిద్దరిముగ్గురిలో శ్రీ పంతులుగారగ్రగణ్యులు.

కార్లైయి, రసికిన్; అడిసన్, స్టీలుమున్నగువారి గద్యరచనము నకుఁ బ్రక్కను నిలఁబడఁగల యగ్రతగల తెలుఁగు గద్యమువీరి దే కాని యితరులది కాదు.

ఈవిషయమునఁ దెలుగు వాఙ్మయమున శ్రీపంతులుగారి స్థాన మద్వితీయము. బి. ఏ. తరగతిలోఁగాని భాషాప్రవీణ కక్ష్యలలోఁగాని పాఠ్యములుగానుండఁదగిన గద్యరచనములు తెలుఁగులో నున్నవాయని వెదకుచోనవి సాక్షిగ్రవాఙ్మయములోనే కన్పట్టును.

లక్ష్మీనరసింహరావుగారు సాధించిన మరొక యసాధారణ కార్యము. ఆదోషమును, పరిశ్వతమయిన గ్రాంధిక భాషను సర్వజన సులభముగా బ్రయోగించి,సామాన్య జనోపయోగ్యమగుటకై భాష గ్రాంథికతను గోల్పోవలయునను నపోహయమును పటాపంచలు చేసి నారు, ఈయుగములో విజ్ఞానము సర్వజనవ్యాప్తి నొందించుటకై భాషను నీచస్థితికి దింపనక్కఱలేదని పంతులుగారు క్రియారూపమున నిరూపించినారు.

దండిమున్నగు నలంకారికులు చెప్పినకావ్య ప్రయోజనములలో ముఖ్యములయిన వ్యవహారజ్ఞానము, నిర్వృతి, యుపదేశము పంతులు గారి గద్యవాఙ్మయములో మిక్కుటముగా సాధింపఁబడినవి. లోకము లోని వివిధరీతుల మానవప్రకృతులను వారు విపులముగా చిత్రించి సమాజములోని లోపములను క్షాళించి మాథ్యూ ఆర్నాల్డ్ నిర్వచిం ంచిన "జీవితవిమర్శనమే సాహిత్యమను(Literatuae is the criticism of life) ప్రమాణముచే మాన్యతనొందఁగల యుత్తమ సాహి త్యమును బుష్కలముగా వెలయింపఁజేసినారు.

— • —

## అభినవ కాళిదాస—పానుగంటి లక్ష్మీనరసింహరావు

శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రి

మహాకవులెందఱో తమ రచనలచేత శాశ్వతకీర్తి నార్జించియుండఁగా "ద్విత్రా ఏవ కవయః" అను వాక్యమున్మత్త ప్రలాపము వలె నర్థరహితము కాకతప్పదు. కాని యావాక్యమే యుద్దేశముతోఁ బ్రయుక్తమైనదో దానిని గమనించు వారికది సార్థకమయితీఱును. "నానృషిఃకురుతే కావ్యమ్" అనియు, "కవిః క్రాంతదర్శి" యనియు నేవేవో చెప్పుటవలన సత్యప్రదర్శనమే పరమగమ్యమయిన సృష్టి తత్త్వాన్వేషికుఁడు కవియనుట తగియుండును అట్టిసల్లక్ష్యము నాధారముగాఁగొని మహోద్దేశములను సాధించు వ్యక్తులు కొలదిగానే యుందురనుట నగ్నసత్యము. సంస్కృత భాషవిషయములోఁ గాళిదాసునకుఁ బూర్వమెందఱో మహాకవులు వెలసినను కాళిదాసు వ్యాస వాల్మీకులనే కవులుగా పరిగణించినట్లుతోఁచును. "మందః కవియశః ప్రార్థీగమిష్యామ్యుపహాస్యతామ్" అనుచోట రామాయణరచనము చేత వాల్మీకి కెట్టి మనస్సు సంభవించినదో అట్టి మనస్సు తనకు రఘువంశ రచనముచేత కావలయునను కోరికయున్నట్లు ప్రకటించు కొనినాఁడు సంస్కృతవాఙ్మయ ప్రపంచమున గౌరీశంకర శిఖరమనఁదగు వాల్మీకిని దలంచునపుడు కాళిదాసుని కలము వెనుకాడకతప్పదు కవిత్వమనఁగ నెంతభాధ్యతతో నిర్వహింపవలసిన మహోద్యోగమో కాళిదాసునకుఁ దెలిసినంతగా ఇతరులకుఁ దెలియుట కవకాశము తక్కువ. కావ్యరచనకార్యము నూచముట్టుగఁ దరచిన కొలది నగాధమయిన మహాసముద్రమువలె గుర్తించియుండును. అది కవియగు వాల్మీకితోఁ దులఁదూగ నిచ్ఛ కలుగుటలోఁ దప్పులేదుగాని యాశిఖరమునందు కొనఁగలిగెనా లేదా యనునది సత్యప్రదర్శనమే. పరమ గమ్యమయి కావ్యతత్త్వాన్వేషకుఁడయిన విమర్శకుఁడు దేల్చవలసి

ముండును. " పురాకవీనాంగగనా ప్రసంగే—"యను శ్లోకము కాళి దాసునకు వ్యాసవాల్మీకుల తరువాత సంస్కృత వాఙ్మయములో నెట్టిస్థానమున్నదో నిరూపింపసమర్థమయియున్నది. శ్రవ్యకావ్యప్రపంచములో వ్యాసవాల్మీకులు సాధించిన యద్భుతసిద్ధుల నందుకొనుట యేగాక దృశ్యకావ్య శిల్పనిర్మాణములో నున్నత స్థాయినందుకొనె నని యానాటి పండితలోకము తలంచెనని చెప్పసందేహముండదు" నాటకరచనమున కాళిదాసునికలము అధికోత్సాహములో ముందంజ వేసినది" అని విమర్శకుల నిర్ణయము. సరస్వతి యపరావతారుఁ డుగా గణింపబడు కాళిదాసునందున్న ఘనత నెందరెన్నివిధములుగాఁ బ్రకటించినను అసమగ్రముగనే ప్రకటితమగును. "కవితా కళకు శిఖ రము నాటకరచనము. అపురూపమైన ఎన్నోశక్తులు మేళగించిననే గాని ఇది అసాధ్యమయిన నిర్మాణనావైదగ్ధ్యము, పాత్రీకరణకౌశ లము రసపోషణ సామర్థ్యము సంభాషణ కల్పనాచాతుర్యము, పద్య రచనా పాటవము మున్నగుదీనివివిధాంగములలో నొక్కొక్కదానిలో సిద్ధహస్తుడు కావలయును. కాఁగా వ్యవసాయాత్మికమగు బుద్ధితో సాధనచేయుటవలన సహజప్రతిభాశాలికి నేవేళయందైన నుత్తమ సిద్ధిలభించినప్పుడే గణనకల్గును ప్రపంచమునందలి నాటకరచయిత లలో నుత్తమశ్రేణికిఁజెందినవాడు కాళిదాసు. అతనిలోని యనన్య సామాన్య లక్షణముల నన్నిటిని వివరించుటకొక పండితమండలి యెం తోకాలము కృషిసల్పినను సమగ్రముగ వివరింపసమర్థము కాజాలదు.

శ్రవ్యదృశ్యకావ్యములలో దారతమ్య పరీక్షచేయుచో దృశ్య కావ్యనిర్మాణము కష్టసాధ్యమనక తప్పదు. అట్టిదృశ్యకావ్యములలోఁ గాళిదాసుచూపిన శేముషీవిశేషమును మాత్రమే యాధారముగా జేసికొని " అభినవ కాళిదాసు బిరుదమునందిన పానుగంటిని గుఱించి యొకటి రెండు విషయములుమాత్రమే వ్రాయఁజూచు సాహసమును,

నాకవియందుండు నవ్యాజభక్తిగా గుర్తింపవేడికోలు. సమగ్రమయిన వివరణములతో నొకమహాగ్రంథమును రచియింపఁజేసి యానత్ప్రపంచమున నిట్టికవికిఁదగుస్మృతి చిహ్నము నేర్పఱుపఁజూచిన మనకృతజ్ఞతను వెల్లడించుకొనినట్లగును. అట్టిదే నాటికేని తటస్థించుచో నాంధ్రులు ధన్యులు. ఆంధ్రభాష ధన్య. ఆంధ్రకవి అమరుఁడు. వాల్మీకి వరవడి కాళిదాసునికున్నట్లు కాళిదాసుని కలిమి పానుగంటి కబ్బినదని చెప్పఁజూచుటయు—(అది కూడ నాటకరచనను బట్టియే) అందులో నాలంకారికుల నియమములను అనుకరించుటయు, నలంకారముల నెంత స్వభావసిద్ధముగ నెట్టిపట్టుల వాడఁజూచునో వివరించుటయుఁ బ్రధానమయ్యెను, ఎన్నియో నాటకములు రచించిన కవియొక్కయే ఒక్క-నాటకముఁ దీసికొనినను గ్రంథము వ్యాసము పెరుగునను భీతితో నొక ఉపమాలంకారమును మాత్రమే తీసికొని "ఉపమా కాళిదాసస్య" యను సూక్తియీయభినవ కాళిదాసునిపట్ల నెట్లు సరిపడినదో సంగ్రహముగ వివరించుటయే యీకృషి "ఉపమా కాళిదాసస్య" అని ఏనాడు పల్కిరోగాని నిక్కముగ నుపమాలంకారముచే నాతడు సాధించు ప్రయోజనములగణ్యములు. ఉపమాలంకారముచేతఁ బద్యములపూర్వమయిన సౌందర్యము ఉజ్జ్వలకాంతి చే కూర్చవచ్చును మితభాషావిరచనమునకు సౌందర్య ప్రతిసాధనమునకు నెంతయో తోడ్పడును. వాచ్యముగ వర్ణించిచెప్పనక్కర లేకుండగ నెన్నియో భావములు ధ్వనితములగునట్లుగా నీయలంకారమును నిపుణముగా వాడిన ఘట్టములనేకములున్నవి. ఇందుమతీ స్వయంవరార్థమరుగుదెంచిన రాజపుత్రులను జెలికత్తె చూపుచు వారి వారి ప్రత్యేకతలు వర్ణించు సందర్భమున నుపమాలంకారముల నెన్నియో తీరుల వివరించుట ప్రత్యేకముగ గమనింపఁ దగియున్నది అందును "తాం సైన వేత్రిగ్రహణేనియుక్తా రాజాంతరం రాజసుతానినాయ సమీరణో

ష్టేవ తరంగ రేఖా పద్మాంతరం మానసరోజహంసీమ్'' అను శ్లోకములో పూర్ణోపమ నిత్యాంగమునకు నపూర్వపౌందర్యము నాపాదించుట గమనార్హము. సమీరణోత్థా తరంగ రేఖా మానస రాజ హంసీం పద్మాంతరమిన, వేత్రిగ్రహణేనియుక్తా రాజసుతా తాం రాజాంతరం నినాయ" యనుటలో నెన్ని భావములున్నవో యూహింపవలయునే గాని వివరింప నసాధ్యములు. ఇంతయేల? " వాగర్థా వివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే జగతః పితరే వందే పార్వతీ పరమేశ్వరౌ ''అను రఘువంశ ప్రథమశ్లోకములో ఉపమాలంకారమును దీసివేయుచో నీపద్యమునకు శిరస్సు లేకపోవును. అధోలోకమునఁ బడిపోవు తక్కిన భాగమునొక్కసారిగా నాకసమున కెత్తుచుండునది యుపమాలంకారమే. కేవల శివభక్తుడని తలంచుటకే పద్యమునుగూడ పలువురుదాహరించుచున్నారు. అది యెంతవరకు సత్యమో విచారింపవలసియున్నది. కాని యీశ్లోకములో " పార్వతీపరమేశ్వరౌ''అనుస్థలమున "పార్వతీ,పరమేశ్వరౌ"యనునటుల నే పార్వతీప,రమేశ్వరౌ''అని విడఁదీసి శివకేశవులను స్తుతించినాడాయని తలంచుటవకాశము లేకపోలేదు. ఇట్టివెన్నో యుపమాలంకారము లీతని దృశ్యకావ్యములనుండి కూడ నుదాహరింపవచ్చును కాని ప్రకృతము పానుగంటికవిని గుఱించి కొంత ముచ్చటించుట యవసరమని దానిని వివరింప దలంచ లేదు.

పానుగంటికవి నర్మదాపురుకుత్సీయము, సారంగధర చరిత్ర ప్రచండ చాణక్యము, పాదుకాపట్టాభిషేకము మున్నగు నాటకములు లెక్కకుమిక్కిలిరచించి కవిలోకములలో గణతకెక్కినరనుటవివాదాంశముకాదు. అభినవకాళిదాస యనునది కవి కుత్తమస్థానమును బ్రసాదించి పైకెత్తుచున్నదా. లేకతగ్గించుచున్నదాయనిశంకించువారుందురని యెఱిఁగియు నుపమాలంకారమును మాత్రమే దీనికొని యీ కవియొక్కస్థానమును వెల్లడించుట యన్యాయమే యగును ఐనను

రాధాకృష్ణనాటకమును మాత్రమే దీసికొనియుదాహరణము లిచ్చుట చేతనింక నితరనాటకములలో నెట్టి యుపమాలంకారము లున్నవో పరికింపవలయునను కుతూహలము కలుగుచో నప్పుడా సంశయని వృత్తి కాఁగలదని తలంతును. తెలిసినదానినుండి తెలియనిదానినిగుర్తించుట కెన్నియో యుపమానములు నిత్యకృత్యములో మనమువాడునట్లుగా సహజముగా నెన్నియో యుపమాలంకారములీ కవివాడుట ప్రత్యేకముగమనము గమనింపవచ్చును. పాఠకలోకమునకు వివరణమును జేయ లేదనియాగ్రహము కల్గుటకంటెనుగ్రహమేకలుగునను భావములో నీక్రింద నుదాహరింతును తినఁబోవువారికిఁగూడ రుచి తెల్పవలయునా?

" కృష్ణుఁడు:–గీ॥ ధవ్యధూమలతికఁ గూడు జ్వాలవలెను,
జ్వాలికను వెంబడించెడి వాయువువలె,
వాయులహరిని వెన్నాడు పరిమళంబు
గతిని కృష్ణుండు రాధసంగతిని నేగు"

"శారదుఁడు:—రాధకు మధుర కృష్ణునివలెఁ గానుపించుటకొక కారణమునున్నది—వెనుకనున్న తైలమును ముందున్న దీపిక పీల్చుకొను నటులు పురోభాగముననున్న మధుర పశ్చాద్భాగమున నున్న నీకృష్ణత్వము నాకర్షించుకొనుచున్నది."

"శారదుఁడు:—నామిత్రునికి యాయవారపు బ్రాహ్మణునికి వలె నెక్కుడప, దిగుగడప, దీపప్రభనుగాంచిన నల్లివలె రాధ బాధపడలేక యాతఁడిచ్చుటకుఁ గాలుకొలఁది దాటినాడు"

"తరళ—అమ్మా! తొందరపడకుము. మగవారి ప్రేమము నీటిపై నురుగు వంటిది. పట్టిచూడకున్నంత వఱకే పై బండారము"

కృష్ణుఁ—సత్యభామ కోపోపశాంతిని గోరుచున్నది.

"శార—(అపవారించి) సత్యభామ గేదెదూడ జాతిలోనిది.

పాలెక్కువ వదలి దూడను జెఱుపగోపాలునివలె ననురాగమమి
తముగ గనఁబఱచి యీకాంతను బాధచేయుచున్నావు."

"కృష్ణుఁడు:-(తనలో) తరుణి కోపంబునకు వడి తగ్గువఱకు
నస్మదీయోపశాంతి వాక్యాః వ్యర్థమె
పూర్ణవేగాధికాపగా పూర్వమునకుఁ
బెట్టసాహసించిన యానకట్టవోలె."

"కృష్ణుఁడు:- (నవ్వుచు) నీమెడలోని సూత్రమువంక నెవరుచూచు
చున్నారు.

సూత్రమునకైన సందీక స్థూలమగుచు
క్రిక్కిఱియు నీదుచన్గవ యొక్కయంత
రమున నెట్టులో నాచూపులిమిడి యహహా
క్రిమ్మరఁగ లేవు తాతిలోఁ గప్పలటుల."

"కృష్ణుఁడు:- కోపము విచిత్రరూపము కోపమునకుఁ
గనులుఁ గర్ణము లు దయాకలన లేవు
సర్వమును గబళింపంగ జాలు నోరొ
కండె యజగరమునకు వలెఁ గలదుగాదె'

"పొగమొకటిఁ గోటియూకువలె," నత్తగుల్లవలె నతిమంద స్థితిని గలిగియున్నది "కన్నులతో ముందు వైపునకుఁ జూచుచుఁ, గాళ్లతో వెనుకకు నడచు పీతవలె బయలుదేఱును, "నీయెదుటి రాధ యర సరసానాథుని పాలి కవితాకన్యవలెనే యయ్యోనో?" ఇదిసాలె పురుగు వలె స్త్రీపురుషస్వభావములు గూడ కలిగినది కాదుగద? "అదేమి" గాడిదవలెఁ గాళ్లకుఁజెకుముకియా యేమీ?, "నిన్నిక్కడ విడువక యమ్మవారి ఘటమును వలె నెత్తిపై నెక్కించుకొని యూరంతయు నీనాథుని గంతులు వేయుమందువా?" తొండ ముదిరి యూసరవెల్లి యగునటులు పత్న్యనురాగము ముదిరి భక్తి

యగుచున్నదా? "అలిచిప్పలవలె నేత్రములున్నయామె," పతిబాధఁ బడలేని పడఁతివలె భక్తశిఖామణి నీటిలో నేలదుమికెను? భర్తయుపదేశము బ్రాహ్మణవ్యవసాయమువలె నిష్ఫలము" వంటిసహజోపమలతోఁ దమకుగలఁ లోకానుభవమును శాస్త్రానుభవమును వివరించుటలో నీమహాశయుఁడొక కాళిదాసునే గాక ఇంకను మహాకవుల ననుకరించి, యనుసరించి, యనుభవించి, రసికలోకమున కమితోత్సాహము కల్గించుట చేత నీకవి యాంధ్రవాఙ్మయముపై నొక చెఱగని ముద్రవైచి ధన్యుఁడైనాఁడు ఆకవినిబోలు వారే యొకరిద్దరున్నారన జాలును. "అబలకనురాగము ఆవునకాముదపాకు కంటె నధికోన్నాదకరము, చెవిలోనిహోరును జెవివిని యాధ్వనికిఁగారణము మఱియొక వస్తువని భ్రమింపదా"వఁటి రచన సామాన్యకవి కలమునుండి రానేరనుగదా?" లుబ్ధునితో స్నేహము సొమ్ముపెట్టెవఱకే, వైష్ణవునితో స్నేహము వంటయింటివరకే,; "అన్ననుగ్రహించి దేహము నవలి వేయుటలో దక్షిణను మొలను ముడిచి తాంబూలమును ద్యజించెడు వైదికునివలెనే చేసితివి" మొదలగు నవి సుప్రతిష్ఠలు సంతర్పణమైనతరువాత వెళ్ళిన బ్రాహ్మణున కెంతసన్మానమో నీకునంత జరుగఁ దలచియున్నది. "లలితా నీవును నేనును గుడ్లగూబల వలె నీయాఱు మాసములును దొఱ్ఱలలో నుండనలసినదేకద" వంటివెన్నిచూపిన నుతృప్తి కలుగునా? ఆకవి గ్రంథములన్నియు నందఱి కందుఁబాటులో నుండునట్లుచేయుచో నదియే చాలును.

—♦—

# శ్రీ పానుగంటివారి ప్రతిభ

శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారిని షోడశ కళా పరిపూర్ణునిగా సారస్వత గగనవీధిని శాశ్వతముగా నెలకొల్పినది యనన్యదుర్లభమగు నాయన ప్రతిభయే, యని యందఱు నంగీకరింతురు. అంగీకరింపవలసినదే. ప్రతిభ యనఁగా నేమియో తెలిసికొన్నచో- ఆప్రతిభచే పానుగంటివారి సారస్వతమున కబ్బిన వైశిష్ట్యము తెలియుట కొకదారి దొరుకును.

అంతఃకరణ చతుష్టయమునందు సంకల్ప వికల్పాత్మకము 'మనస్సు' అనియుఁ నిశ్చయాత్మిక 'బుద్ధి' యనియుఁ ఇట్లే చిత్తమునకును, అహంకారమునకును శాస్త్రజ్ఞులు వేర్వేఱు లక్షణముల నేర్పఱచి, అందు బుద్ధిని గూర్చి ప్రత్యేకముగా విభాగించి చెప్పినారు. ఏ పదార్థమునందైనను, లోఁతుపాఁతులు బాగుగాఁదెలిసికొని, మంచిచెడ్డలను నిశ్చయించునది బుద్ధియనియు, ఆబుద్ధిగూడ వినినదిగాని, చూచినదిగాని ధరించునది అనఁగా:- మఱువనిది 'మేధ' యనియు, అట్టి ధారణ గలిగి నవనవోన్మేషము అనఁగా:- ఎప్పటికప్పుడు నూతనవికాసము గల యాబుద్ధినే 'ప్రతిభ' యనియు, జెప్పినారు. అట్టి ప్రతిభ కలుగుటకు జన్మాంతర సుకృతవిశేషమే కారణముగాని నేఁడేదో యత్నము లొనర్చి సాధించు సాధనాంతరము లీసృష్టిలో లే" వని ఖండితముగా నాపెద్దలు చెప్పివైచిరి.

పరమాణువు మొదలు పరబ్రహ్మము దాఁకఁగల పదార్థకోటి నంతయుఁ బరీక్షించి, యందలి పరమరహస్యములను గ్రహించి, వానిలోని గుణమును గుణముగా, దోషమును దోషముగా నద్దమునందువలెఁ జూపింపఁగల యీ ప్రతిభకు, వాతావరణముగాని, వాసస్థానముగాని హేతువులనుట పొసఁగని మాట. ఎన్నియో విధములఁ బరీక్షించియే ప్రతిభకు హేతువు జన్మాంతరీయ పుణ్యవిశేషమొక్కటే

యని యొకయనిర్వచనీయత నంగీకరింపక తప్పినది కాదన్నమాట. లోకోత్తరమగు నాప్రతిభ కగ్రస్థాన మొసంగు టెందులకు? అదియెప్పుడు నగ్రస్థానమందలిదై యున్నదేమో కవితాలత బీజమఁట.

సరే! అట్టిలోకోత్తరమగు ప్రతిభ యుండవచ్చును. ఆప్రతిభచే నూహించిన విశేషములను వెల్లడించుటకు వాక్కుగూడ నుండవలదా? వాక్కుగలిగినను, విరసమైనచో దానినెవరు విందురు ? విని యెవరు గౌరవింతురు ? కావున నావాక్కు సరసమును నిపుణమును గావలెను. రసజ్ఞతయు నైపుణ్యమును గలిగినదే యనుకొందము. లోకమెట్లు న్నదో తెలిసికొని యట్టిరసవంతము, నిపుణము నగు వాక్కును వెలువ రింపవలెనే కాని తోఁచినయట్లు మాటాడిన వ్యర్థాయగుటయే కాదు. చీ చీ లుతప్పవు. కాన లోకజ్ఞతతో పాటు నిర్మలమైన అనఁగా:- అవకతవక, అసందర్భము కానట్టి- తప్పుత్రోవను బట్టనట్టి, శాస్త్ర జ్ఞానము మఱియు నావశ్యకము ఇంతపరికరము గలప్రతిభ యెవరికి లభించునో వాఁడే నిజమైన కవియఁట. ఈ మాటనే రాజశేఖరుఁడు తనకావ్యమీమాంసయందు "ప్రతిభా వ్యుత్పత్తి మాంశ్చకవిః" అని సూత్రించెను. సరే! యివి లభించినవే యనుకొందము. అట్టివాఁ డింటనే కూర్చుండి మూగనోము పట్టిన నేమగును? నిరంతరాభ్యాసము లేకున్నచోఁ గవిత్వమునకు మూలకారణమగు ప్రతిభ తుప్పుపట్టి యెందులకునుగాకుండఁబోవును. ఆకవితాబీజము నిరులేని మడియందు నాటిన వి త్తనమగును. ఆనిరంతరాభ్యాసమున కెంతటి యవకాశము కలుగవలెను ? సంసారచింతలులేక యోగివలె నిశ్చలమనస్కుఁడు కావలెనఁట ! ఇంతటి సకలావకాశము లెంతటివానికి లభింపవలెను? అట్టివాఁడెవ్వఁడైన నుండునా ? అనుసందేహము కలుగవచ్చునుగదా! కాని యట్టివాఁడెప్పుడో, యెక్కడనో కాని పుట్టకున్నచో శాస్త్రజ్ఞు

లట్టిలక్షణము నేల సూత్రింతురు? నేఁడును పుట్టవచ్చును. పుట్టినను బ్రదికి బట్టకట్టవలెఁగదా!

కాని నూటేండ్లనాఁడు— సీతానగరమున నొకపుణ్యమూర్తి, అట్టినిర్మలమగు శాస్త్రరహస్యవేత్తృతతో, నిశ్చలదీక్షతో, నిరుపమానమగు నిపుణతతో, నిష్కళంకచరిత్రముతో, వినాదైన్యజీవనముతో, నాంధ్రమాతకు ముద్దుబిడ్డయై పుట్టి, దోసతోటనంటికుటుంబము, నిఖిలజగమందు నిత్యానందసింధువున నోలలాడించు వాఙ్మయసృష్టితో నజరామరమూర్తియై నాఁడు.'' ఆతఁడే మనపానుగంటి పంతులు. ఆమహనీయుని కలమునకు, ఆతనివాక్కునకు, నడ్డులేదు గదా? ఎంతవిజ్ఞానము! ఎంతధారణాశక్తి! ఎంతసూక్ష్మగ్రాహిత్వము! ఎంతవాఙ్నైపుణ్యము! ఎంతమార్దవము! ఎంతతీవ్రత! ఎంతధర్మప్రబోధము! ఎంతహాస్యరససమ్మేళనము! ఎన్నివిధములరచనలు? ఎంతటి సారస్వతసృష్టి! ఆయనమాటలలోనే చెప్పవలసినయెడల ఎంతపెంకితనము! ఎంతనిర్లక్ష్యభావము! గుణమును, దోషమును వెల్లడించుటలో నెంతనిర్భయము! అహా! యనిపించునే ఎవరికి? కనులున్నవారికి, చెవులున్నవారికి, మతియున్నవారికి.

ఆయన నూరక పొగడుచున్నా ననుకొందురేమో! ఈశతవార్షికోత్సవ మాయనను పొగడుటకా? లేక తెగడుటకా? ఆయన యాంధ్రవాఙ్మయమునకుఁ జేసిన బహుముఖసేవను వెల్లడించుటకా? గ్రాంథికాంధ్రభాషారక్షణమునకై ప్రతిపక్షులను మొగమోటక తూర్పారఁబట్టుటలోఁ జూపిన కటుత్వమును, కాదు. క్రౌర్యము నే కప్పిపుచ్చుటకా? తనవాఙ్మయామృతకిరణములచేఁ బండితపామర విభేదము లేక యావదాంధ్రుల హృదయతాపములను బోఁగొట్టి షోడశకళాపరిపూర్ణమై తారాపథమున దివ్యజ్యోతియై వెలుఁగు నామహితుని శాశ్వతకీర్తిమూర్తిని ధ్యానించుటకా? ఇరువదేండ్ల

క్రితము సన్నముగాఁ బొడుగుగాఁ, జప్పిగాఁ జెంపలతో తెల్లని మీసాలతో, నలిపిపోయిన జుట్టుతో, ముదిసి, యస్తమించిన యాయన ప్రాపంచ భౌతిక దేహమును దలచుకొనుటకా? ఒక్కమాట. మన నిందాస్తుతుల కాయన యతీతుఁడు. ఆయనవాఙ్మయమున నిన్నితప్పులున్నవని జమాఖర్చులతో చిట్టావర్జాల బేరీజు వేసి చూపిన ప్రతిపక్షులను ఎంత భ్రాంతిపడినారని యొక్కచిఱునవ్వు నవ్వనేకాని తనకలనాఁపైనా? తనయభీష్టగ్రాంధిక శయ్యనుండివిగెనా ? ఆయన రచనకుఁ దప్పా ?–

కావున నాసారస్వతమూర్తిని దలంచుకొని, యొడలు పులకరింపఁ, జిత్తము ద్రవింప, నెచ్చనినో, చల్లనినో, యశ్రువులతో నాయనకుఁ దర్పణమొనర్చి, భక్తిపూర్వకముగా రెండుచేతులు శిరసునజోడించి మోడ్చి యొక్కమ్రొక్కు మ్రొక్కుదము. అంతే, అంతే! మనముకాదుగదా ? మనకు మీఁదటితరము లెన్నియైనను, నేవిధముననైనను, నామహాత్ముని ఋణమును దీర్చుకోఁగలదా? లేదు. ఆంధ్రులందఱాయన కధమర్ణులే !

ఇంతగాఁ జెప్పి యాయనముద్దుబిడ్డయై, ధ్రువతారయైన యాయన సారస్వతమును గూర్చి నాలుగుమాటలు ముచ్చటించుకొనకున్న నాంధ్రసరస్వతి కెంత యపచారముచేసిన వార మగుదుము? ఆయనసారస్వతము నాటకప్రపంచమున కొక రత్నదీపము. ఆయన సారస్వతము గద్యప్రపంచమునకుఁ జిమ్మచిమ్ములాను పచ్చకప్పురపుఁ గాటుకరేఖ. అన్నిదేశములను, అన్నికాలములను, అన్నిమనస్తత్వములను జూపఁగల యైంద్రజాలిక పింఛము. పండితుఁడు పామరుఁడను నంతరము లేకుండ, నాయన రచనలందలి సుకుమార, సుకుమారతర, సుకుమారతమహాస్యమునకో, కఠిన, కఠినతర, కఠినతమ హాస్యమునకో, లొంగితీఱవలనదే, పొంగితీఱవలసినదే, జోహారు లొనర్పవలసినదే! కారణము ? ఆహాస్యము గాలికిఁ బోవునదికాకునుక, ఆహాస్య

మునం దెంతటి విజ్ఞానము ! ఎంతటిలోఁ తగువిషయ విమర్శనము ! ఎన్నెన్ని శాస్త్రీయ సంప్రదాయములు ! ఎంతటి లోకజ్ఞత ! ఎంత వ్యంగ్యము ! -

నర్మదాపురుత్సీయమున :- రాజు నర్మదకై విరహార్తుఁడై యుండు ఘట్టమున- విరహమని యితరులకుఁ దెలియదు. వ్యాధి యనుకొని వైద్యులు చికిత్సకై యత్నించుచుండు సందర్భమున నర్మదయే వైద్యునివేషముతోఁ బ్రవేశించును, మగవేషముతో వైద్యుఁడుగా వచ్చిన నర్మదను జూచి విదూషకుఁడు "అయ్యా ! మీ పేరేమి" యనును, ఆమె "అమృతహస్తుఁడు" అనును. "మీరు వైద్యులు కాన నడిగెదను. పెరుఁగుతోటకూరలోని పెరుఁగు, ఆవుపెరుఁగా ?" గేదె పెరుఁగా?" అని ప్రశ్నింప- నామె నవ్వుచు పెరుఁగుతోటకూర యన్నంతమాత్రమున అందు పెరుఁగుండునా ? అని పలుక- విదూషకుఁడు "మీ అమృతహస్త నామము కూడ నట్టిది కాదుగదా!" అనును కొంటెతనమున కడిగినట్లు పైకిఁ గనఁబడునే కాని యందెంతవిమర్శన మున్నదో ! పెరుగుతోటకూరయందుఁ బెరుఁగు లేదు. ఎన్నిమాఱులు పైభాగములు కోయుచున్నను పెరుఁగుచుండు మొక్కయే కాని (యాతోటకూర) తఱిఁగి పోవునది కాదు. అను నిజమైనయర్థమును వ్యంగ్యమొనర్చుట యొకటి. వైద్యుఁ డగువానికి నెల్ల యోషధుల గుణదోషములు కరతలామలకములై యుండవలెనను వ్యంగ్యమొకటి. మఱియు వైద్యులు, కవులు, ఇతరవిద్యావంతులు పెట్టుకొను బిరుద నామములు బూటకములు కాని సార్థకములు కావను వ్యంగ్య మొకటి. ఆహా ! సంభాషణమున ఇన్నివ్యంగ్యములును విద్యుత్తులవలె సూక్ష్మ దృష్టికిఁ దళుకు తళుకుమని కనఁబడుచుండునుగదా ?

వైద్యుఁడుగా నర్మదరాజునొద్దకు వెళ్ళి "నీవ్యాధితప్పక కుదిర్చెద" ననఁగా. రాజు "నీవు కుదిర్చినచో నారాష్ట్రమిచ్చివైచె

దను" అనును. తోడనే విదూషకుఁడు "నీవొక్క రాష్ట్రమునే యిచ్చి దవు. కాని నేను రెండురాష్ట్రము లిచ్చెదను" అనును. రాజు నవ్వుచు 'నీకు రాష్ట్రము లెక్కడవని' అనఁగా విదూషకుఁడు "లేకేమి. దుంప రాష్ట్రము, కళింగరాష్ట్రము" అనును. పరిశీలింప నీహాస్యము నం దెంత యౌచిత్యముకలదో! నిజముగా రాష్ట్రమే వైద్యునకిచ్చిన యెడ నీవలె నాతఁడు పాలింపఁజాలఁడని యొకధ్వని. అతనికి మం దులలోనిదిఁ గావలసినది. దుంపరాష్ట్రము, కళింగరాష్ట్రముగాని నీ రాష్ట్రమూతని కేమిలకు? అది వైద్యసంబంధమగుధ్వని యొకటి. నీ విచ్చెదనన్నది బూటకమే. ఈయఁబోవు సమయమున కిప్పటి యీ మాట లుండవని మఱొకధ్వని. ఈరీతినే విహాస్యవాక్యము పరిశీలించి నను పంతులుగారి రచనలలో వ్యంగ్యము హెచ్చుగాగోచరించుచునే యుండును.

రాధాకృష్ణనాటకమున- ప్రాతఃకాలముననే వచ్చిన యొక మధ్యమపాత్రను విదూషకుఁడు "ఏమిరా! శేషవర్జ్యమువలెఁ బొద్దుటనే సిద్ధమైతివి" అనును. ఏమి యుపమానము. శేషవర్జ్యము పొద్దుటనే కాని తరువాత రాదుగదా! వెనుకటిరాత్రితుదిగడియలందుఁ బ్రారంభమై, మఱునాఁటిపొద్దుటికే నొకటి రెండు గడియలదాఁకనో, విఘడియలదాఁకనో శేషించి యుండును. కావున నది పొద్దుట రావలసినదేకదా! అట్లే వాఁడును వచ్చెను. అంతమాత్రమేకాదు. వర్జింపఁదగినది వర్జ్యము. అవి విషఘటికలు కావున నాల్గు ఘటికల కాలము విసర్జింపఁదగినది, అని జ్యోతిష సంప్రదాయము. అట్లే నీవును కృష్ణదర్శనార్థము వచ్చినను, నీవు విసర్జింపఁదగినవాఁడవుగాని గ్రాహ్యుఁడవు కావు సుమా! అను వ్యంగ్యము కలదు. ఇట్టి శాస్త్రీయ మార్గమున హాస్యరసముసఁ బొదిగి జ్యోతిశ్శాస్త్రసంప్రదాయ మెంతగాఁబోషింపఁబడినదో! ఈరీతిగా నెన్నియని పానుగంటివారి నాటక

ప్రపంచమునుండి యుద్ధరించి చూపఁగలము? ఆ యుపమానములే వేఱు. ఆరచనయేవేఱు. శేషవర్ణ్యమువంటి యుపమానము కాళిదాసునకైనను స్ఫురించునా? అనిపించునే! ఏమిప్రతిభ! ఆ నాటకములందు నుపమాలంకారములు లేనిపద్యమొక్కటియు నుండదుగదా! ఆయుపమ లన్నియు నిరుపమములు. అభూతములును.

నాటకముల విషయమున మచ్చున కీరెండు విషయము లనుకొనినట్లే, వచనరచనా విషయములను సాక్ష్యుపన్యాసములనుండి రెండే రెండు విషయము లనుకొందము. అవి యుపన్యాసములా? వ్యాసములా? అని పెద్దప్రశ్న. పరిశీలింప నా యాక్షేప సంపుటములును వ్యాసములేకాని యుపన్యాసములు కావు. ఆ వ్యాసములైనను గాగితముపైఁ గాపీయుఁగు పెన్సిలుతోఁ దుడుపు అనునది లేకుండ ధారావాహికగాఁ జిన్నచిన్న యక్షరములతో వ్రాసి, చిత్తుఅని, సాఫుఅని లేకుండ వెనువెంటనే ముద్రణమున కంపఁబడినవే. ఒక్కచిత్రము. ఆరంభముననే "జంఘాలశాస్త్రి యిట్లుపన్యసించెను." అనువాక్యము కంటఁబడఁగానే అదియంతయు నుపన్యాసమే యనిపించును. ఆవ్యాసమునందు ఉపన్యాసత్వము స్ఫురించునట్లు జంఘాలశాస్త్రిని ఏసభ్యుఁడో ప్రశ్నించినట్లు, అతఁడుచితమగు సమాధానము చెప్పినట్లు, కొందఱాతని మాటలకు భేష్ భేష్ అని, మెచ్చుకొనినట్లు, కొందఱు ఛీ ఛీ యనినట్లు, చప్పట్లు కొట్టినట్లు నుండుటచేఁ బాఠకుల కదియంతయు జంఘాలశాస్త్రి సభావేదికపై నిలిచి యుపన్యసించుచున్నాఁడనియే యనిపించును. కాని, 'సాక్షి' యాయుపన్యాసమునంతయువిని యథతథాముగా వ్రాసినట్లుగాని, యిదియంతయు పానుగంటివారి బంగారుపిచ్చుకగూఁటి యల్లికయని కాని స్ఫురింపనే స్ఫురింపదుగదా స్ఫురించుట యెందులకు? పంతులుగారేవచ్చి యివియన్నియు నేను వ్రాసినవే యని చెప్పినను సరే! "నీవెవఁడవయ్యా! జంఘాలశాస్త్రి

యుపన్యసింప వానిని సంగ్రహించి నీపేరు పెట్టుకొందువా? అని తిరస్కరించి, పాగనంపు చదువరులుగూడ నుండకపోవరని నమ్మెదు. అది ఆయన ప్రతిభావిశేషము అని ఆయన చేసిన మెస్మరిజము.

సాక్షిసంపుటమునందలి యుపన్యాసమో, వ్యాసమో యేది యేదో యొకటి కానిండు. అందింకొక విచిత్రమగు స్వాతంత్ర్యము కలదు. కాదు ప్రత్యేకతయందురా? అదియే కానిండు. సామాన్యముగా వ్యాసములకైనను, ఉపన్యాసములకైనను, ఉపోద్ఘాతోపసంహారముల కైక్యము ముఖ్యముగదా! సాక్ష్యుపన్యాసములలోఁ జెక్కుటయుండు ఉపోద్ఘాత మొకటి. నడిమివిషయ మొకటి. ఉపసంహారము మఱొకటి యుండును. కాని యీ శాఖాచంక్రమణమే పఠితకును స్ఫురింపకుండునట్లు సందర్భము కలియు సన్నివేశములతో విషయాంతరమునకుఁ దెచ్చి, మచ్చుమందు చల్లి వేయును. ఆహా యనిపించును.

పాచకమహాసభ:- అనఁగా వంటలవారిసభ. అగ్రాసనాధిపతి యొక 'రంధనకళాకంధి.' అతఁడు పాకశాస్త్రముయొక్క ప్రశస్తిలోఁ నారంభించి, రసశబ్దమునకు రుచియనియు, శృంగారాది రసమనియు నర్థములుండుటచే, తమవిషదర్శనము లేయనియు, కవికి తొమ్మిది రసములు కావలసి వచ్చెననియు, నారంభించి, కవిత్వవిమర్శనమునకు దిగి, వీరరసప్రధానమగు వేణీసంహారనాటకమునందలి రెండవ యంకములోని భానుమతీదుర్యోధనుల శృంగారమును ప్రారంభించుచు నొక విచిత్ర విమర్శనము చేయును.

వంట చతుష్షష్టికళలలోనిదని పచనకళాప్రశంస చేయుచు లలితకళగా ఖ్యాతికెక్కిన చిత్రకళను, అందు తాజ్మహాలు శిల్పమును విమర్శించును. తుట్టతుదిని వంటవారు కొన్నితీర్మానములు చేయుదురు. వారి దుర్వర్తనము లందులో సూచించుట యొక్కటే కాదు. నేఁడు సామాన్యముగా జరుగుసభలలోఁ దుట్టతుదను నిరుపయోగములును,

నిష్ఫలములు నగు తీర్మానములుచేయు నాచారము నపహసించుటయు ధ్వనించును. తుదకు సభ్యురాండ్రలో నొకతె మెడలోని యాభరణము నెవ్వఁడో త్రెంపుకొనఁగా సభయంతయు గల్లంతై చెదరి పోఁగా సభ ముగియును. అంతటి శాఖాచంక్రమణ మున్నను సైవ్యక్యము చెదరిపోవనట్లే యతి నిపుణముగా నాయనప్రతిభ యతికివేయఁ గలదు.

ఏ విషయము నెత్తికొన్నను నామహాత్ముని ప్రతిభ పాతాళమునుండి బ్రహ్మలోకము మీఁది యంతస్తునకుఁ బోవలసినదే. ఎట్టి రహస్యాదిరహస్యము నైనను గ్రద్దచూపుకంటె సునిశితమగు చూపుతోఁ జూచి బుద్ధికందీయవలసినదే. అందిచ్చినదానికి హాస్యరసముతోఁ జిన్నెలువన్నెలు కల్పించి వ్రాసి చూపినట్లు కనులున్నవారికిని, శంఖమూఁదినట్లు చెవులున్నవారికిని విశదపఱుపవలసినదే.

అనంత ప్రతిభాసంపన్నుఁడగు పానుగంటివారి సాక్షి 'సర్వలోకబంధువు' అనుకొని యానందింపవలెనే కాని యావాఙ్మయసముద్రమున కేతామెత్తి కృతార్థులగు బుద్ధిమంతు లెందరైన నెవరైన నుందురేమో కాని నావంటివారి కసాధ్యమని యున్నదన్నట్లు మనవి చేసికొనుచున్నాను.

ఇఁక నొక్క విషయము చెప్పవలసినదున్నది. అది యాయన రచనలలోని భాషను గూర్చినది. ఆయన వీరగ్రాంథికవాది. గ్రామ్యభాషావాదముపై నాయన చేసిన దాడులు సాక్ష్యుపన్యాసములందు స్వల్పమే కాని విమర్శాదర్శవిమర్శాదర్శమునందును, బ్రతికీర్ణోపన్యాసములందును జూడఁ దగినది. సంస్కృతసమాసరచన- తెనుఁగు పలుకులపొందిన దేసికది పరిశీలించినచో- ఆ రెండుభాషలయందాయన లేఖినికిఁ గలస్వాతంత్ర్యము వ్యక్తమగును. పదౌచిత్యము పానుగంటివారి సొమ్ముగదా ? ఔచిత్యమున సహస్రాక్షుఁడే ఐనను గొప్ప

కొన్ని విషయములను తలస్పర్శముగా విమర్శించి చెప్పవలసివచ్చి నప్పుడు ముందుగా నందలి యనౌచిత్యమునుగూర్చి వివరించి చెప్పక తప్పనిదానిమనని సూచింపనిదే యీయన కలము విషయమునఁ బ్రవేశింపదు. అట్టి నిశ్శంక బిరుదాంకితుఁ డింకొకఁడు లేఁడనిన నతిశయోక్తి కానేరదు.

పానుగంటివారి వాఙ్మయమునకు నామాటలు స్థాలీపులాక ములు. ఎందఱు మేధావులెన్ని యోకోణములనుండి యెంతయో నిశిత ముగా, ఎన్నియో యేండ్లు పరిశీలించినను, నా సారస్వతసాగరమున మనకంకనివి యెన్నియో మణులు శేషించియే యుండుననఁ- నావంటి వాఁడీ యల్పకాలమున నెట్లు వెల్లడింపఁగలఁడు ? కావున నాయన లార ! ఆయన రచనకు మూలకందమగు శక్త్యుత్పత్తిభను దలచికొని, ఆయనకీర్తిమూర్తికొకఁ- నమోవాకము చెప్పి సెలవుతీసికొందును.

—♦—

A

# పానుగంటివారితోడి నా స్వల్ప స్నేహపరిచయము

(శ్రీ బండారు తమ్మయ్య.)

1929 సంవత్సరముననో 1930 సంవత్సరముననోగాని ఒకనాఁడు అమలాపురములోని బజారురోడ్డుమీఁద నేదోయొక బహిరంగసభ జరుగుచుండెను. ఎవరో మహానుభావులైన వ్యక్తి సభావేదికపయి నుపన్యసించుచుండెను. అప్పుడు నేనచ్చట రిజిస్ట్రు ఇనస్పెక్టరుగాఁ బనిచేయుచుంటిని. ఏదో పనిమీఁదఁ బోవుచున్న నేనాయుపన్యసించునది పిఠాపుర సంస్థాన కవీశ్వరులు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారని తెలిసి సభలోనికిఁ బోయి కూర్చుంటిని. పంతులుగారి నంతకుముం దెన్నఁడు చూచియెఱుఁగను. వారి నాటకములలో నర్మదాపురుకుత్సీయము, కంఠాభరణము, ప్రచండచాణక్యము మాత్రమింతకు ముందుచదివియుంటిని. ఆరోజులలో ఆంధ్రపత్రిక సారస్వతానుబంధములో ప్రతివారము ప్రకటితమగుచుండిన "సాక్షి" యుపన్యాసములు కొన్ని చదివియుంటిని. అందు వలననే వారప్రతిమప్రతిభాశాలురని గుర్తించి వారియెడ విశేష గౌరవభావముగలిగియుంటిని. పంతులు వారి యుపన్యాసానంతరము, సభాధ్యక్షుల యాదేశముపయి నే నప్పుడు పంతులుగారి శక్తియుక్తులుగుఱించియు, వారికదివఱకే పండిత మండలిచేఁ బ్రసాదితములయిన "ఆంధ్ర షేక్స్పియరు" "అభినవ కాళిదాస" బిరుదములు, వహించుటకుఁగల వారియర్హతను గూర్చియుఁ గొంత ప్రసంగించితిని. ఆకాలముననే "రఘువంశకథనము" అను పేర కాళిదాస రఘువంశ మహాకావ్యమునకు నేనొనర్చిన గద్యానువాదము ప్రప్రథమముగ ముద్రితమయి వెలువడినది. పంతులుగారు నామిత్రులు శ్రీపాలెపు వేంకటసూర్యగోపాలముగారి యింట బసచేసి యున్నారని తెలిసియామధ్యాహ్నమో మఱునాఁటి యుదయముననో వారి నటసందర్శించి నా గ్రంథము ప్రతినొకటి యొసఁగి దానిని సావధానముగఁ జదివిఅభినవ కాళిదాసులగు మీరు మీయమూల్యాభిప్రాయము ననుగ్రహింపవలెనని ప్రార్థించితిని. గ్రంథమునుగైకొన్నం

## గ్రంథస్వీకారము : సమీక్ష

(శ్రీ బండారు తమ్మయ్య)

1. మాధవవర్మ- మైలమభీమ, క్రౌను, పుటలు 108+13, వెల 2-4-0. కర్త; = నాట్యాచార్య శ్రీ దుప్పూరి జగన్నాథశర్మ గారు రామచంద్రపురము, తూర్పుగోదావరిజిల్లా.

శ్రీ విజయనగర సంస్థాన పరిపాలకులు పూసపాటి వారికి మూలపురుషులయిన మాధవవర్మ నామకులయొక్కయు, తద్వంశమున జనించిన మహావీరపురుషుఁడు మైలమ భీమనయొక్కయు చరిత్రలకుఁ జెందిన పరిశోధక చారిత్రిక గ్రంథము ఇది. సుప్రసిద్ధ పరిశోధకులు శ్రీ జగన్నాథశర్మగారు చిరకాలముండి గావించిన విపుల పరిశోధన ఫలితముగ నిది నంతరింపఁబడినది. ఆంధ్ర వాఙ్మయమున విశేషముగ వ్యాప్తమయిన పలు చాటుపద్యములను, పూసపాటిరాజులలో పూర్వులు కొందఱు రచించిన కృష్ణవిజయము, ఉషాభ్యుదయము అను కావ్యములు, విజయనగర రాజుల కంకితముగా రచింపఁబడిన నరస భూపాలరాజీయము, రామకృష్ణార్జున రూపనారాయణీయము, రాజపుత్ర తేజఃపుంజము, తదితరగ్రంథములు, శాసనములు బహుళ పరిశ్రమతో పరిశోధించి శ్రీ శర్మగారు దీనిని కూర్చినారు. గ్రంథమందెచటఁ జూచినను వీరి విపులపరిశోధన వ్యక్తమగుచుండును. పూసపాటివారు విష్ణుకుండిన వంశజులు- వీరిలో మొదటి మాధవవర్మ క్రీ. శ. 455 రెండవ మాధవవర్మ. క్రీ. శ. 455-488, మూఁడవ మాధవవర్మ. జనాశ్రయ బిరుదాంకితుఁడు క్రీ. శ. 516-61 ప్రాంతమునను బరిపాలించినవారు. మూఁడవ మాధవవర్మ బెజవాడ కనకదుర్గకు భక్తుఁడయి యామె యనుగ్రహమునఁ గినకవృష్టిని, గజహయాదిక సైన్యసమృద్ధినిబడసి విశేష మహిమాన్వితుఁడయి బెజవాడ రాజధానిగాఁ బరిపాలించినవాఁడు. ఈతఁడు విద్వాంసుఁడు, విద్యాపోషకుఁడునయి జనాశ్రయ చ్ఛందోవిచితియను లక్షణగ్రంథమును

సంస్కృతమును రచించినవాఁడు- ఈగ్రంథమే ఆంధ్రభాషలో వేములవాడ భీమకవికృతముగాఁ బ్రకటితమయిన కవిజనాశ్రయచ్ఛందమునకు మూలమని శ్రీ శర్మగారి ప్రతిపాదనము. కాఁగా నీగ్రంథము మాధవవర్మ, జనాశ్రయమహారాజు-జనాశ్రయోల్లాసము, కవి జనాశ్రయోల్లాసము అను రెండుభాగలుముగా విభక్తమయినది. కవిజనాశ్రయకర్త వేములవాడ భీమనయని కొందఱు; కోమటి రేచనయని కొందఱుతలంతురు. ఉభయులరచనములు మిళితమయియే ప్రస్తుతము కవిజనాశ్రయమను పేరితోఁ బ్రకటితమయిన గ్రంథ మున్నదని కొందఱమతము. గోకర్ణచ్ఛందమను గ్రంథము కవిజనాశ్రయము నొకటే యని కొందఱమతము. గోకర్ణచ్ఛందము కవిజనాశ్రయము వేర్వేఱు గ్రంథములని, కవిజనాశ్రయము రేచనకృతమయినను భీమనకృతమైనను దానికిమూలాధారము మూఁడవ మాధవశర్మ జనాశ్రయ మహారాజు సంస్కృతమునరచించిన గ్రంథమేయని శ్రీ శర్మగారి మతము. వీనినిగూర్చినచర్చ లీగ్రంథమునఁ జాలభాగము నాక్రమించినవి- మైలమభీమన, ఏరువభీమన నొక్కఁడేయని యాతఁడు వేములవాడభీమన కాశ్రయుఁడనికూడ శర్మగారు వివరించిరి. నేఁడు పూసపాటి, అడ్డూరి; అల్లూరి; ఇందుకూరి; కంకమరాజు; గణపతిరాజు; చేకూరి; నంద్యాల; బుద్ధరాజు; బెజవాడ అని పది వేర్వేఱు గృహనామములతో వెలయు నాంధ్ర క్షత్రియ కుటుంబములన్నియుఁ బూసపాటిశాఖకుఁ జెందినవేయనికూడ నిందుఁ జర్చింపఁబడినది. మొత్తముమీఁద ఆంధ్రదేశ క్షత్రియచరిత్రకు సంబంధించిన యుత్తమ గ్రంథముగా దీనిని గణింపఁదగును. ఆంధ్రులెల్లరు నాదరింపఁదగినది. తొమ్మిదిపుటలలో శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు వ్రాసిన పీఠిక. శ్రీ వాత్సవ, పండిత పెనుమత్స సత్యనారాయణరాజు; మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి; ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ

మున్నగు పండితులొసంగిన సదభిప్రాయములుగూడ నిందు ముద్రితములయినవి. కొలఁది పరిమితిలో బహువిషయము లీగ్రంథమున గ్రథితములగుటచే సావధానముగ సవిమర్శముగఁ జూచినఁగాని యందలి విషయములను బాగుగా నవగాహనచేసికొనుట కష్టము.

సిద్ధమైనదియనుటకు 'సిద్ధమున్నది' మున్నగు విలక్షణప్రయోగములందందుఁగలవు. అచ్చుతప్పు లెక్కువగా దొరలినవి. చివరను జేర్చిన సవరణలపట్టిక సమగ్రముగాఁ దోఁపదు.

2. కొగంటి దుర్గామల్లికార్జునరావు సాహిత్యసేవ సంచిక. క్రౌనుపుటలు 88+4. వెల 2-0-0. ప్రకాశకులు భారతీసమితి చిలకలూరుపేట, సంపాదకులు షేకు అలీ బి.ఏ. తెలుఁగుపండితులు యద్దనపూడిహైస్కూలు "భారతీసమితి" అను పేర శ్రీ జాస్తి వేంకటనరసయ్యగారు అధ్యక్షులుగ, శ్రీ కొగంటి దుర్గా మల్లికార్జునరావుగారు ప్రధానకార్యదర్శిగ స్థాపించిన సారస్వతసంస్థ. చాల వత్సరములనుండి కళాకారులకు; పండితులకు; కవులకు సన్మానములు గావించుటయే ప్రధానలక్ష్యముగా గుడివాడతాలూకా పామఱ్ఱు గ్రామములోఁ గావించుచున్న సేవ ఆంధ్రసోదరులకు సువిదితము. వారిరువురు రచించిన గ్రంథముల సమీక్షలీ పత్రికలోఁ జదివిన పాఠకులకుఁ గూడ నిది వ్యక్తమే - శ్రీ దుర్గా మల్లికార్జునరావుగారికి 1964 మార్చి 29 తో షష్టిపూర్తి యైనది. దానిని పురస్కరించుకొని ఆ తేదీని మొట్టమొదట చిలకలూరిపేటలోను; తరువాత క్రిందటి విజయదశమినాఁడు బాదరులో మఱొకటియు వీరి షష్టిపూర్తి సన్మానసభలు జరిగినవి. చిలకలూరిపెటలో జరిగిన ప్రథమసన్మాన సభాసందర్భమున వెలువడినసంచికయే యిది. సంపాదకులు షేకు అలీగారు, వేంకటనరసయ్యగారి శిష్యులు ఆంధ్రదేశమందలి వివిధప్రాంతములనుండి పలువురు పండితులు,కవులు,అభిమానులు శ్రీ మల్లికార్జునరావు

గారి నిస్స్వార్థసారస్వత సేవనుగూర్చియు వారి ప్రయత్నములవలన జరగిన కవిపండిత కళాకారసన్మానములగూర్చియు వ్రాసిపంపిన పద్యములు, గద్యవ్యాసములు, నీసంచికయందుఁ జేరెనవి. సంఖ్యలో నవి రమారమి 41 యున్నవి. ఇందు తెలుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు "చాగుశే" అను శీర్షికతో వ్రాసిపంపిన పద్యములు, బండారు తమ్మయ్యగారి "ఆశీః పంచరత్నోపహారము" శాస్త్రి వెంకటనరసయ్యగారు 'పంచరత్నాని' అని తెలుఁగు వివరణముతో వ్రాసిన సంస్కృతశ్లోక పంచకము. ప్రథమ ద్వితీయ, తృతీయస్థానముల నాక్రమించినవి. 17–32 పుటలలో శ్రీ కృత్తివెంటి వేంకటేశ్వరరావుగారు వ్రాసిన వ్యాసము. శ్రీ మల్లికార్జునరావుగారి జీవితవిషయముల సంగ్రహముగ వ్యక్తమొనర్చుచున్నది. అది యెల్లరు నవశ్యము పఠింపఁదగినది. గుడివాడలో గూడ 14–2–65 తేదీని మఱియొక సన్మానసభ జరిగినదని, అందుకు సంబంధించిన మఱొక సంచిక వెలువడఁగలదని తెలియుచున్నది. శ్రీ మల్లికార్జునరావుగారి తోఽధిక సారస్వతసేవ, కవిపండిత సన్మానములు గావించుచు మఱొక షష్టిపూర్తి జరుపుకొనుటకు పరమేశ్వరుఁడు ప్రసాదించుఁగాత మని ప్రార్థించుచున్నాము.

3. కెన్నడీస్మృతి (ప్రథమభాగము) :– క్రౌనుపుటలు 24 వెల 0–8–0. సంపాదకులు: శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు కార్యదర్శి భారతీసమితి, పామఱ్ఱు, కృష్ణాజిల్లా.

అమెరికా రిపబ్లికు అధ్యక్షుఁడుగా తానున్న స్వల్పకాలములో జాను కెనడీమహాశయుఁడు శాంతిదూతగా ప్రపంచమునకుఁ గావించిన సేవయజరామరమయి దిగంత విశ్రాంతకీర్తి నందియున్నది. భారతదేశముపట్ల శ్రీ కెనడీగారికిగల సానుభూతియపారము అతివాదులగు హంతకులు కొందఱు గావించినహత్యకు లోనయి యీ మహాపురు

షుండ కాలధర్మరణమునొందిన వార్త. ప్రపంచమునంతటిని దుఃఖ సాగరమున ముంచినది. మన ప్రధాని పండిత నెహ్రూ నిలువున నీఅయి పోయినాండీ దుఃఖవార్తకు. వీరిస్మృతిచిహ్నముగ భారతీసమితి పైసంచికను ప్రథమభాగముగఁ బ్రకటించినది. భారతీసమితివారి కోరిక ననుసరించి "అమరజీవి; కెన్నడీగీతము" జోహారు, పోరాటం, కెన్నడీ కెనడీ; అయ్యో కెన్నడీ; కెన్నడి అస్తమయం; పోయితివా! చెరిగి పోని కలక; అమరజీవి శ్రీ కెన్నడి స్మృతి; కాలం కలం విరిగి పోయింది" అను వేర్వేఱు శీర్షికలతోఁ బదుమూవ్వురు యువకవులు వ్రాసిపంపిన గేయములిందు ముద్రితములు. గేయములన్నియుఁ గరుణ రస మొలికించుచున్నవి. ఉద్వేగము; ఆవేదన; అన్నిటఁ బ్రస్ఫుటమగుచున్నవి.

మచ్చునకుఁ గొన్ని పాదములు:—

ఏనాటికీ చెరిగిపోనికలత; శాంతిప్రియుల చల్లని గుండెల్లో పెల్లుబికినచల్లారనిమంట
చరిత్రమొలవనిపల్లె సీమల్లో నేడు గడ్డిపరకసైతం కంపించిది
మనిషిలో మూరుమూల కాపురంచేస్తోన్న కక్కసిని
ముక్కలుచేయాలని బాకులా నిలిచింది
నీచావుతో సమసిన సమస్య లెన్ని ?
చంపిన ఆసామీట్లు కట్టుకొన్న దేమిటి? చేతులెత్తి పిలిచే చైతన్యం నీవులేవని నిట్టూర్చింది. (శ్రీ బద్దం భాస్కరరెడ్డి రచించిన చెరిగి పోని కలతనుండి.

శ్రీ బి. వి. నరసింహారావు B.A.B Ed. గారు వ్రాసిన తొలిమాట సరసముగా నున్నది.

4. శ్రీ త్రికోటేశ్వరచరిత్రము వచనము, ద్వితీయముద్రణము పుటలు (89+6) వెల 0-8-0.

కర్త:- కీ॥ శే॥ మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారు. నరసరావుపేట, ప్రతులు దొరకుచోటు (ప్రకాశకులు: జి. పి. సూర్యరావు బి ఏ.) మేనేజరు కోటప్పకొండ దేవస్థానము, నరసరావుపేట.

విధి విరామములెఱుంగని రివెన్యూడిపార్టుమెంటు కొలువులో నుండియుసహజ భాషాభిమానమువలనసారస్వతసేవ గావించినకొలఁది యుద్యోగులలో మిత్రులు శ్రీమద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారొకరు. వీరికిఁ జారిత్రకపరిశోధనాసక్తి మెండు. కోటప్పకొండయను నీత్రికోటేశ్వర క్షేత్రచరిత్రముగాక కొండవీటి సామ్రాజ్యము, నరసారావుపేట చరిత్రమువున్నగు చారిత్రకగ్రంథములను వ్రాసినారు. కొండవీటిచరిత్రము, శ్రీకృష్ణవేణీమాహాత్మ్యము నను పద్యకావ్యములు, మఱికొన్ని నాటకములు, హరికథలు కూడ వీరు రచించిరి. కీ. శే. జయంతి రామయ్యపంతులుగారికిఁ గూడ శాసనాదికసామగ్రినేకరణమునందు వీరు సాయపడుచుండెడివారు. వీరు నరసారావుపేటతాలూకా హెడ్డుగుమస్తాగా చాలకాలము పనిచేసి రిటైరయినారు. ఈ గ్రంథము పదునొకండు ప్రకరణములుగా విభక్తమయినది. దక్షయజ్ఞమున సతీదేవి యోగాగ్నిచే దగ్ధమయి, మరల హిమవంతునింటఁ బార్వతియై తపమొనర్చి శివుని యర్ధాంగి గాకపూర్వము మధ్యకాలములో శివుఁడు బ్రహ్మచర్యమునెఱపుచు దక్షిణామూర్త్యవతారమునఁ దపమొనరించుచు మునులకు ఉపదేశమొనర్చి తరింపఁజేసిన పరమపవిత్రక్షేత్రమే. త్రికోటేశ్వరము (నేఁటి కోటప్పకొండ) అని స్థలపురాణము. ఇది నరసారావుపేటకు దక్షిణమున నాలుమైళ్ళ దూరమున, ఎలమంద, కొండకావూరు అను గ్రామములమధ్యనున్నది. ఈ కొండశిఖరమునందు మూఁడు కూటములుండుటచేఁ దానికి త్రికూటాచలమను వ్యవహార మేర్పడినది. ఈ కొండ పయిభాగమున ప్రాతకోటేశ్వరాలయము, దానికి మఱికొంతదిగువను నూతనకోటేశ్వరాల

యము; దాని చెంతనే ఆనందవల్లి (యను భక్తురాలు) గొల్ల భామ గుడియుఁ గలవు. ఇది బ్రహ్మచారియగు దక్షిణామూర్తి క్షేత్రమగుటచేకల్యాణోత్సవమును ధ్వజస్తంభము నిచటనుండవు. శివుఁడు కొరేసాలంకయ్య యనువీరశైవునకు గొల్లభామకుఁ శివైక్యమును బ్రసాదించిన క్షేత్రమిది. స్థలపురాణములు, గాథలు, శాసనములు, సత్తెనపల్లి తాలూకా కోసూరువాస్తవ్యులు శ్రీ కొప్పరాజు నరసింహకవిగారు రచించిన శ్రీ త్రికూటాచల మాహాత్మ్యముఅను మూఁడాశ్వాసముల పద్యకావ్యము మున్నగువానిని బరిశీలించి శ్రీ గురుబ్రహ్మశర్మగారీ చరిత్రగ్రంథమును గూర్చిరి. మహాశివరాత్రి కిచ్చట గొప్ప తీర్థము జరుగును. కోటప్పకొండతీర్థమునకుఁ గోటి ప్రభలు (చిన్నవి పెద్దవి) వచ్చుననుట సుప్రసిద్ధి. లక్షలకొలఁది ప్రజలిచ్చటనూఁగి, పాపవినాశన నామకతీర్థమునఁ గ్రుంకులిడి కోటీశ్వరస్వామిని సేవించి తరింతురు. ఈ క్షేత్రమునకు సంబంధించిన పెక్కువిషయములకీగ్రంథము కరతలామలకమువంటిది. శివరాత్రికి విచ్చేయు వివిధవర్ణముల భక్తుల వసతులకయి ఆయావర్ణస్థులు వెలయించిన మందిరములు, ధర్మసంస్థలుయొక్క వివరములుగూడ నిందున్నవి. అందఱును బఠింపఁదగినకృతి. కృతికర్త, క్షేత్ర ధర్మకర్త, శ్రీమలారాజు వేంకట నరసింహారావు బహద్దరు జమీందారు గారలయొక్క, ఈ క్షేత్రమందలి తొమ్మిది ప్రధాన దృశ్యములయొక్కయుఁ జిత్రపటములిందుఁ జేరినవి.

5, మహేశశతకము:- డెమి. పుటలు 28 వెల 0-60 (108 సీసపద్యములు). కర్త :- డాక్టరు మానేపల్లి కుమారస్వామిగారు. ఆయుర్వేదవైద్యులు, నరసాపురము, పశ్చిమ గోదావరిజిల్లా.

కృతికర్త మొదటినివాసస్థలము పశ్చిమగోదావరిజిల్లాలోని క్షీరారామము (నేటి పాలకొల్లు) అగుటచేఁగాఁబోలు నచ్చట వెలసిన రామలింగేశ్వరస్వామి కంకితముగా "శీతజనోల్లాస. క్షీరపురీ"

నివాస రామలింగేశరు జననిగ్రహామహేశ" అను మకుటముతో నీ శతకమును రచించిరి వీరు రజకసంఘమునకుఁ జెందినవారని తెలియుచున్నది. వంశ పారంపర్యముగ వీరిపెద్దలు. శివపూజాపరాయణులు- వీరు నిర్వ్యాజమైన శివభక్తిపరులు. జంగమవరిష్ఠుఁడు, వీరశైవమతోద్ధారకుఁడగు బసవేశ్వరుని భక్తిస్వర్ణభాండారమునకు నికషోపలమువంటివాఁడు నని ప్రసిద్ధిపడసిన నిష్ఠురవాదియగు మడివాలు మాచయ్య యంశ వీరియందును గొంత గోచరించును. నిజమైన భక్తునకు భగవంతునియెడ భక్తితోపాటు. భయసంకోచరహితమయిన చనువుకూఁడనుండును. అందుచేతనే పౌరాణికగాథలను బట్టి తెలియులోపములను దోషములను బురస్కరించికొని ధట్టించి నిందాస్తుతులు గావించుట వీరి పద్యములలోఁ గానవచ్చుచుండును. వరాహ నరసింహశతకకర్త గోకులపాటి కూర్మనాథకవి,ఆంధ్రనాయక శతకకర్త కాసుల పురుషోత్తమకవి యీకోవకుఁ జెందినవారు. శ్రీకుమారస్వామిగారు కూడ నట్టివారిగనే కనుపట్టును. మచ్చున కీక్రింది పద్యములు చూడుఁడు.

సీ॥ నాకు నీ నడవడి నచ్చకయున్నది
యీ గొప్పదనము నీ కెట్లువచ్చె
ప్రతిసోమవారను వ్రత నియతిం దిర్గు
సీమంతినికిని నిచ్చితివి ధవుని
నీకొంప నిలబెట్టి నీల్గిన మదనుని
రతికి నతనుఁ జేసి యతుకఁదగునె
దక్షునిఁదలఁగొట్టి తగగొర్రెతలఁ బెట్టి
వేదవతికినిచ్చు వేసమేల
యిట్టివ్యత్యాసములు సేయు నేమికతమొ
ఈ క్షణాన సమాధాన మిచ్చికదలు (ప 45)

సీ॥ బాల జగన్మోహిని నరసి కౌఁగిటఁబట్టి
పడిమందిలో సిగ్గు పడఁగనేల
దారుకారణ్య కాంతల రమించియు వారి
పతులతో వైరంబు పడయనేల
కాశిలో శౌండిక కాంతతోఁ గ్రీడించి
తద్భర్త కడలుచు దాఁగనేల
ఏలాపురంబున జాలరిముదితను
నరిగి చీవాట్లను దినఁగనేల
తిరిగియుమతోడ కయ్యంబు నెఱపనేల
తిన్నగా నుండలేక యీ తిప్పలేల. (ప 46)

సీ॥ చెప్పనేటికి నీవు సేయుటబద్ధమా
బాపనదానితోఁ గాఁపురంబు
పల్లెదానిని నెత్తిపైఁ బెట్టుకొంటివి
కల్లగాదిది జగమెల్ల నెఱుఁగు
సిడిగె దానితో నేకాంతమాడవే
యెవ్వా రెఱుంగని దీవిషయము
అనుమానమున నది యణుమాత్రముండునే
కొండదిగాదె నీకూర్మిరాణి
యరయ సమతత్త్వభావము నందునీదు
వర్తనముసాక్షి యౌఁగదా వసుధలోన.

ఇట్లు ఈ శతకమంతయు, నిందాస్తుతులతో కూర్పఁబడినదని తలంపవలదు. భక్తిభరితములు, లోకనీతి బోధకములు నగు పద్యము లెన్నియేని యిందుఁగలవు. చెప్పినపాదముతోనే మరలమరల తక్కిన పాదములనుగూడ రచించుట యిందుఁ దఱచుగాఁ గాననగును. అది

(6) మా అమ్మ (పార్వతీ స్తోత్ర వృత్త పద్యశతకము) డెమ్మీపుటలు 24+24 వెల 0-12-0 కర్త శ్రీ కత్తా త్రిమూర్తి కవిగారు

(7) పద్యముకుందమాల :- క్రౌను పుటలు 32 వెల 0-8-0 కర్త డిటో

(8) శ్రీరామ గీతాశతకము :— క్రౌను పుటలు 36 వెల తెలియదు

కర్త శ్రీ వాకపల్లి సూర్యనారాయణ నాయుడుగారు, టిటాఘరు

ప్రకాశకులు :—ఆంధ్రసాహితీ ప్రచారసభ కెల్విన్ లేను 1-4 తాల్పుకూరు పోస్టు 24 పరగణాల జిల్లా పశ్చిమబెంగాలు.

(6) జగజ్జననియగు పార్వతిని గూర్చి "మా యమ్మ" యను నామాంతరముతోఁ గూర్చిన శతకమిది. పార్వతి యను మకుటముతో నిది. రచింపఁబడుటచే, ఉత్పల చంపక, మత్తేభ, శార్దూలములే గాక మఱికొన్ని యితర వృత్తములు గూడ నీ రచనమునందుఁ జేరుటకు అవకాశము కలిగినది. కర్త త్రిమూర్తి కవిగారు, శ్రీకాకుళము జిల్లా నరసన్నపేట వాస్తవ్యులు, దేవాంగకులజులు శివభక్తులు వీరి 'లింగసన్నా భీమశతకము'' ఇంతకుమున్నే పత్రికా సంచికలలో సమీక్షింపఁబడినవి. వీరి కవిత ధారాళమై, నిర్దుష్టమై, శబ్దాలంకార శోభితమై, భక్తి సంభరితమై పూర్వ ప్రబంధకవుల పోకడలు గలిగి పండిత కవి హృదయంగమముగ విలసిల్లు చుండును ప్రస్తుతము వీరు కలకత్తా ప్రాంతమున జీవితము గడుపుచున్నందున, ఆ ప్రాంతమందలి యాంధ్రకవులను, సత్కృతులను బోషించుట కేర్పడిన "ఆంధ్రసాహితీ ప్రచారసంఘ" మను సారస్వత సంస్థ దీనిని బ్రకటించి లోకోపకార మొనర్చియున్నది. ఆ సంస్థకు విద్వత్కవులు శ్రీ విశ్వనాథకవిగారధ్యక్షులు, వారి సదుద్యమునకు నా జోహారులు ఈ శతకమున ఫలశ్రుతితోఁ

కలిపి 109 పద్యములున్నవి. కవిగారి కవితాగురువులు శ్రీ విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రి, వేంకట సుబ్బరావు, దీపాల పిచ్చయ్యశాస్త్రి, బాడాల రామయ్య, నోరి నరసింహశాస్త్రి మున్నగు పండితులొసంగిన సదభిప్రాయములు, శ్రీ విశ్వనాథకవిగారు దిద్దిన సింధూర రేఖ, "శ్రీనిశితాత్మ" యను పేరితోఁ గావించిన సమీక్ష యీకృతికి మూల్యాలంకారములుగనున్నవి.

మచ్చునకుఁ గొన్ని పద్యములు

చ. మునులను వెట్టివెట్టి, కడుఁబున్నెపు వేలుల మొట్టిమొట్టి, మే
కొనుపని చెట్టినెట్టి, బడికుఱ్ఱజీతము గట్టికట్టి, గో
దనములు వెట్టివెట్టి, జనదారులయడులు పుట్టిపుట్టిననీ
దనుపఁగ నాకు శక్యమగునా! నుతిచేతనుగాక పార్వతీ! (ప 12)

శా॥ దుర్గా పూర్వసుపర్వ గర్వహరణోద్యోగైక సంసర్గ, భా
సర్గ ప్రోద్ధరణ ప్రణాశ కరసైసర్గా, ప్రదత్తాతిస
న్మార్గస్థాపక యాజ్ఞవల్క్య భృగుకణ్వ వ్యాసగర్గ భ్యాంగిరో
గర్గాత్రి ప్రముఖాపవర్గసహావర్గా! కావుమం! పార్వతీ (ప 29)

ఉత్సాహము బానువహ విజిత దైత్య బాహుళి యుల్లి కన్
వాహినీకృతదివ్య పేంద్రవైరికిన్, మహోగ్రవి
ద్రోహి నాహిని సమూహ దుర్మద ప్రణాశనో
త్సాహవృత్తకున్ సమర్పితంబు నీకుఁ బార్వతీ (ప 58)

(7) శ్రీరంగ క్షేత్రపాలకుఁడు కులశేఖర మహారాజు సంస్కృతమున రచించిన "ముకుందమాల" భక్తిస్తోత్రములలో ప్రశస్తస్థానము వహించియుండుట సుప్రసిద్ధము దీనికాంధ్రానువాదములు విష్ణుభక్తులు రచించినవి యింతకు మున్నే కొన్ని యున్నవి. ముకుంద ప్రియుండగు శివుని భజించు భక్తులు రచించినవి యిదే యని చెప్పవచ్చును. శివభక్తి శ్రేష్ఠులగు శ్రీ త్రిమూర్తి కవిగారౌచిత్యమును గుర్తించి యీ కృతిరచనము గావించుట ముదావహము సహజ సుందరమగు వీరి కవిత యీ యనువాదమునందును సౌష్ఠవముతో విలసిల్లుచున్నది. మచ్చు

దివినాభువినాపమమాస్తువాసో నరకేవానరకాన్తరే ప్రకామమ్
అవధీరిత శారదారవిందౌ చరణౌ తే మరణేపి చింతయామి

చ. నరకవిరోధి! నాయుసికి నాకవసుంధర యందొలేక భీ
కర నరకంబునందొ యగుఁగాక రవంతయుఁ జింతలేదు నీ
శరదరవింద సాన్నిభల సచ్చరణ ద్వయచింతనంబునా
మరణపువేళయందునుమాధవ! యొసఁగుము సుబ్బుదున్ మదిన్ (పకి)

"ఇదంశరీరం పరిణామ పేశలం పతత్యవశ్యం శ్లథసంధిజర్ఝరమ్
కిమౌషధైః క్లిశ్యసిమూఢదుర్మతే!
నిరామయం కృష్ణరసాయనంపిబ

ఉ. బాహువులాడి లేవు; ముదిపాయము చే వెతనందు; సంధిసం।
దోహముజారి బాధపడు; దుర్బలమైనశియించునట్టి దీ
దేహము మూర్ఖ! మందులన దేటికి నూటికిఁ గష్టముందెదు।
త్సాహముతోడ వైష్ణవరసాయనమాను మనామయార్థివై (పకి)

(8) "ప్రేమరససాంద్ర శ్రీరఘురామచంద్ర" అను మకుటముతో మనోహరమగు తేటగీతులతో రచింపఁబడినది యీ శతకము. విశ్వనాథకవిగారు కృతికర్త నాశీర్వదించుచుఁ గావించిన యాముఖము, కవిగారు వివిధ పద్యములలోఁ గావించిన దేవతాస్తుతులు మును ముందుఁ గలవు. శైలి సరళముగ ధారాళముగ సాగినది. మచ్చునకు మూఁడు పద్యములు

(1) త్రాహి యనఁగ వచ్చెదవని తలఁచి తలఁచి
సాటిలేని నా పాలిటి మేటిదొరవు నీవని కలవరించితి నేనుమిగుల

(2) శబరియెంగిలి భుజియించి సంతసిల్లి। మోక్షసామ్రాజ్య
మొసఁగూర్చి రక్షణంబు।నీయఁగ రత్న్యమగునని యెంచి తౌర(ప 10)

(3) పాడుతలఁపుల వేలకో వచ్చుచుండు। నిన్ను ధ్యానించుతఱి
మనోనియతిఁ జెఱుప నిగ్రహింప నాకొనఁగునే కాగ్రబుద్ధి (ప 39)

— ♦ —

(9) A Descriptive Catalogue of the Telugu Manuscripts in the Andhra Historical Research Society Rajahmundry.

ఆంధ్రచారిత్రకమండలి వారు సేకరించిన మూలమునందలి తాళపత్ర గ్రంథనివహము లిందు క్రోడీకరింపబడినవి. కీర్తిశేషులు చిలుకూరి నారాయణరావుగారు, గిడుగు రామమూర్తి పంతులుగారు సంపాదించిన వ్రాతప్రతులు, వారు మండలి వారికిచ్చిన తర్వాత నవి జాగ్రత్తతో భద్రపఱుపబడి, వానివాని వివరములు భారత ప్రభుత్వము వారి ధనసహాయముతో నీగ్రంథములో ముద్రింపబడినవి. వీనిలో పెక్కుగ్రంథము లిదివఱకే ముద్రితములైనవి. అముద్రితములైన వ్రాతప్రతులు గ్రంథవివరణ పట్టికలో సూచింపబడినచో పరిశోధకుల కెక్కువ నుపయోగముగానుండి యుండును. ఎన్నో తప్పులు దొరలిన వని గ్రంథసంకలన సంపాదకులు వ్రాసి, వానినన్నిటిని రెండవ ముద్రణము నందు సవరించుకొందుమని సెలవిచ్చియున్నారు. ఈ ప్రచురణము మండలివారివశమున నున్న వివిధగ్రంథముల వ్రాతప్రతుల యునికి తెలిసికొన భాషాపరిశోధకులకు సహకారి కాగలదు. తెలుగు ప్రబంధములు పురాణములు ఎక్కువగానున్నవి. పీఠికతో నున్న శివయోగసారము సంస్కరించి, పీఠికను మాత్రము ప్రత్యేకముగ ప్రకటించినచో నాంధ్ర భాషకు మహోపకారము కాగలదు.

ఇట్టి సంకలనముగావించి, గ్రంథమును ప్రకటించిన మండలి వారును, సంపాదకులగు శ్రీసుబ్బారావుగారును ప్రశంసనీయులు.

ఈశ్వరదత్తు.

వ్యాఖ్యానమ్ :—

అత్ర నృత్యంతి నిత్య మిత్యనేన వర్షాకాలం వినాపి సార్వ కాలం సేంద్రచాపజలదభ్రాంతి రితి భ్రాంతిమదలంకారో వ్యజ్యతే.

పదగతం స్వతస్సిద్ధార్థశక్తిమూలకవస్తునాలంకారధ్వని ముదాహరతి. భూపాలై రితి. శ్రీసూర్యరాయాధిపం దిదృక్షుభి ర్ద్రష్టు మిచ్ఛుభిః బహుభి ర్భూపాలై స్సమం. "సాకం సత్రా సమం సహే" త్యమరః. సమాయాతాన్ పురాంతికే సంఘీభూయ స్థితా నితి శేషః. ధాతురసై ర్గైరికాదిరాగద్రవ్యైః. "ధాతవో గైరికాదయ" ఇతి కోశాత్. అభిరంజితతనూన్ మదేభవ్రజాన్ దృష్ట్వా వనే తత్సమీప వనే ప్రాంచన్మేచకసంకులా అంచితచంద్రకసంకులాః లక్షణయా బర్హా సంకులా ఇత్యర్థః. "మేచక శ్చంద్రకే ధ్వాంత" ఇతి రత్నమాలా యాం. ఫణిభుజో మయూరాః. కేకాభినీతాంతరా స్సంతః నిత్యం నృత్యంతి యోజయతి. అత్రేతి. ధాతురసాభిరంజితమదగజదర్శనరూప వస్తునా తేషు సేంద్రచాపజలదభ్రాంతి రవగమ్యత ఇతి బోధ్యమ్.

## వాక్యగత స్స యథా

శ్లో. సూర్యరాయేంద్ర! తే సౌమ్య
వంశే చాపల తోదితా
సేయం న సహతే రాజ
మండల స్యోన్నతస్థితిమ్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర విరోధాభాసో వ్యజ్యతే. వాక్యగతం స్వతస్సిద్ధార్థశక్తి మూలకవస్తునాలంకారధ్వని ముదాహరతి. సూర్యరాయేంద్రేతి. హే సూర్యరాయేంద్ర! తే తవ చాపలతా ధనుర్లతా సౌమ్యవంశే సోమదేవతాకవేణుకుంజే సాధువంశేఽపిచేతి. ఉదితా జాతా సేయం

రాజమండలస్య రాజసమూహస్య సోమమండలస్య చ ఉన్నతస్థితి మహోన్నత్యం న సహతే. సౌమ్యవంశజాతస్య చంద్రమండలౌన్నత్యా సహనం విరుద్ధం. వైరిరాజమండలోత్కర్ష మసహత ఇతి పరిహారః. యోజయతి. అత్రేతి. రాజమండలమహౌన్నత్యాసహనరూపవస్తునా విరోధాభాసో వ్యజ్యతే.

పదగత స్వతస్సిద్ధార్థశక్తిమూలకాలంకారే ణాలంకారధ్వని ర్యథా స్రగ్ధరావృత్తమ్:—

స్నిగ్ధా ముత్సృష్టశోభా మధిసరల మమిత్రావలోకప్రసంగా
ద్దీప్తిప్రాగ్భారశుంభద్ధరిమణివిలసత్సప్తకీభూషితాంగీ
ఉద్దామోద్యన్నితంబాం చరమగిరిశిలాచక్రపాశ్చాత్యసీమా
ముల్లాస్యాతీవరక్తో విలసతి తరుణ స్సూర్యరాయప్రతాపః.

వ్యాఖ్యానమ్ :—

అత్ర సమాసోక్త్యలంకారేణ స్నిగ్ధోద్యన్నితంబారక్తతరుణపదై రుభయోరనురూప్యప్రతీతే స్సమాలంకారో వ్యజ్యతే.

పదగతం స్వతస్సిద్ధార్థశక్తిమూలాలంకారే ణాలంకారధ్వని ముదాహరతి. స్నిగ్ధా మితి. తరుణోఽభినవో యువా చ. "తరుణోఽభినవే యూనేతి" విశ్వః. సూర్యరాయప్రతాపః స్నిగ్ధాం సాంద్రాం మసృణాం చ "త్రిషు స్నిగ్ధం తు మసృణే సాంద్రే క్లీబం తు తేజసీతి" శబ్దార్ణవే. అధిసరళం సరళవనమధ్యే అమిత్రావలోకప్రసంగాత్ సూర్యలోకప్రసంగాభావాత్ అప్రియావలోకనగోష్ఠేశ్చ ఉత్సృష్టశోభాం త్యక్తప్రకాశాం విసృష్టశృంగారచేష్టాం చ దీప్తిప్రాగ్భారేణ కాంత్యతిశయేన శుంభద్భిః హరిమణిభి రింద్రనీలై ర్విలసంత్యా సప్తక్యా సప్తకీభూతయా భువా ఉషితాని సహితాని అంగా న్యవయవా

మేఖలా కాంచీ" త్యమరః, ఉద్దామోద్యన్నితంబాం "నితంబ స్త్రీకటేః పశ్చాత్తు పేఽద్రికటకే కటా" ఇత్యుభయత్రాపి రత్నమాలా. చరమగిరే రస్తాద్రేః పాశ్చాత్యసీమాం అతీవోల్లాస్య రక్తోఽనురక్తో రుణ శ్చ విలసతి. యోజయతి అత్రేతి. అత్ర ప్రస్తుతచరమగిరిపాశ్చాత్యసీమావర్ణనేన అప్రస్తుతకామినీవృత్తాంతప్రతీతిమూలకసమాసోక్తేః తరుణాదీనా ముభయానురూప్యప్రతీతే స్సమాలంకారో వ్యజ్యతే.

వాక్యగత స్స యథా

శ్లో. శ్రీసూర్యరాయవసుధాపతి రేవ నిత్యమ్
భూనాయకేషు సకలైః కవిభి ర్నిషేవ్యః
కల్పద్రు రేవ నిఖిలే ష్వపి పాదపేషు
దేవై రభీక్ష్ణ మఖిలై రభిసాదనీయః.

వ్యాఖ్యానమ్ :—

అత్ర ప్రతివస్తూపమాలంకారే ణోపమాలంకారధ్వనిః. వాక్యగతస్వతస్సిద్ధార్థశక్తిమూలకాలంకారే ణాలంకారధ్వని ముదాహరతి. శ్రీసూర్యరాయేతి యోజయతి. అత్రేతి. అత్ర ఏకస్యైవ నిషేవ్యత్వస్య ఉపమానోపమేయగతత్వేన నిషేవ్యాభిసాదనీయపదద్వయేనోపాదానోపాదానా త్ప్రతివస్తూపమాయా స్సురాణాం కవీనాం చ వేంకటమహీపతిసూర్యరాయమహారాజకల్పద్రుమయో శ్చోపమ్య ధ్వని రిత్యవగంతవ్యమ్.

పదగతస్వతస్సిద్ధార్థశక్తిమూలకాలంకారేణ వస్తుధ్వని ర్యథా

శ్లో. శ్రీసూర్యరాయేంద్రజయధ్వజాగ్ర
జాగ్రత్ఖగేంద్రశ్రుతిమాత్ర ఏవ

ప్రస్ఫీతనిశ్వాససమీరణౌఘాః.

వ్యాఖ్యానమ్ :—

అత్ర ఖగేంద్రధ్వజశ్రవణమాత్రేణ రిపునృపసైన్యపిసునవిశ్వాసపరంపరావిర్భావకథనా దత్యంతాతిశయోక్తి రలంకారః. తేన శ్రుతిమాత్ర ఏవేతి సాక్షాద్దర్శనం చే త్కథం భవతి వా. న జ్ఞాయత ఇతి వస్తు వ్యజ్యతే.

పదగతస్వతస్సిద్ధార్థశక్తిమూలకాలంకారేణ వస్తుధ్వని ముదాహరతి. శ్రీసూర్యరాయేంద్రేతి. శ్రీసూర్యరాయేంద్రస్య జయధ్వజాగ్రే జాగ్రతః ఖగేంద్రస్య గరుత్మతః యోజయతి అత్రేతి.

వాక్యగత స్స యథా

శ్లో. శ్రీసూర్యరాయేంద్రకృపాణధారా
కళిందకన్యేవ కఠోరవేగా
పరం తు మాద్యద్బలభద్రబాహో
విజృంభవృత్తే రసహిష్ణు రాస్తే.

వ్యాఖ్యానమ్ :—

అత్ర వ్యతిరేకాలంకారేణ సూర్యరాయసార్వభౌమకరవాల ధారాయా యమునాపేక్షయా సముత్కర్షో వ్యజ్యతే.

వాక్యగత ముదాహరతి. శ్రీసూర్యరాయేంద్రేతి. కఠోరవేగా తీవ్రవేగా గంభీరప్రవాహా చ "వేగాః ప్రవాహ కింపాకజవా" ఇతి రత్నమాలా. పరం తు విశేష స్తు మాద్యద్బలేన భద్రాయా బాహోయా భుజాయా విజృంభవృత్తే ర్విజృంభణస్య అసహిష్ణు రస్యాత్ర మాద్యద్బలభద్రస్య బలరామస్య యోజయతి. అత్రేతి.

కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాః ప్రాగుక్తరీత్యా
చతుర్విధాః; తేషాం పదవాక్యగతత్వేన ద్వైవిధ్యేఽష్టవిధాః

అథ కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాన్ విభజతే. కవీతి. ప్రాగు

క్తరీత్యా వస్త్వలంకారభావేన పున స్తా న్విభజతే తేషా మితి.

తత్ర పదగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలకవస్తుధ్వని ర్యథా

శ్లో. స్వాంకం సమారోప్య యయా చిరాయ
సంరక్షితా స్సర్వలతా శ్చ తాసు
శ్రీసూర్యరాయేంద్రభుజాలతైకా
తా మేవ ధాత్రీ ముచితం బిభర్తి.

వ్యాఖ్యానమ్ :—

అత్ర నిర్విశేషరక్షితా స్వపి ప్రజాసు మహాపురుషాశ్రయిణ్యా ఏవ పున స్స్వరక్షకధాత్రీభరణం యుక్త మితి వస్తు ఉచిత మితి పదే నావగమ్యతే.

పదగత ముదాహరతి. స్వాంక మితి. సర్వలతాః యయా ధాత్ర్యా స్వాంకం నిజప్రదేశం చిరాయ సమారోప్య సంరక్షితాః. తాసు లతాసు మధ్యే శ్రీసూర్యరాయేంద్రభుజాలతా ఏకైవ తాం స్వపోషకధాత్రీం భువ ముపమాతరం చ "ధాత్రీ స్యా దుపమాతాపి క్షితి రప్యామలక్యపీ"త్యమరః. బిభర్తి ఉచిత మేవ యోజయతి అత్రేతి.

వాక్యగత స్స యథా

శ్లో. ప్రగల్భరిష్టిస్తుతముష్టిబంధో
ధనుర్ధరేచ్ఛానుగుణప్రకోష్ఠః
కఠోరవక్షోజసఖీభి రర్థ్యమ్
వక్షో వహన్ భ్రాజతి సూర్యరాయః.

వ్యాఖ్యానమ్ :—

అత్ర ముష్టిబంధప్రకోష్ఠనక్షస్సలే ష్వతిస్థైర్యం వస్తు వ్యజ్యతే. వాక్యగత ముదాహరతి. ప్రగల్భేతి. ప్రగల్భరిష్టినా ప్రౌఢాసినా స్తుతో

ముష్టిబంధ స్సంగ్రాహో యస్య సః. "ముష్టిబంధ స్తు సంగ్రాహ" ఇత్య మరః. ధనుషః ధరాధరణం తత్రేచ్ఛా యా అనుగుణ ఉచితః ప్రకోష్ఠః కూర్పరాధః ప్రదేశో యస్య సః. "స్యాత్కఫోణి స్తు కూర్పరః అస్యోపరి ప్రగండ స్స్యాత్ప్రకోష్ఠ స్తస్య చాప్యథ" ఇత్యమరః కఠోరా కఠినా వక్షోజా స్తనా యాసాం తాభి స్సఖీభిః ప్రియాభి రర్థ్యం ప్రార్థనీయం యద్వా కఠినాభిః ప్రౌఢాభి ర్వక్షోజసఖీభిః రాజకాంతాభిః నను "బాహూ రాజన్యః కృత" ఇతి శ్రుతే రాజ్ఞాం బ్రహ్మణో బాహుజత్వా త్కథం తేషాం వక్షోజత్వ మితిచే దుచ్యతే. "బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రా శ్చ ద్విజసత్తమ! పాదో రువక్షస్థలతో ముఖత శ్చ సముద్గతా" ఇతి పాదోరువక్షస్థలతో ముఖ తశ్చేతి బ్రాహ్మణాదీనాం ప్రాతిలోమ్యేన సంబంధ ఇతి విష్ణుపురాణే ప్రథమాంశే షష్ఠాధ్యాయే. రాజ్ఞాం వక్షఃప్రభవత్వ ముక్త మితి వక్షో వక్షస్థలం వహ్నా భ్రాజతి. యోజయతి అత్రేతి. ముష్టిబంధాదీనాం స్థైర్యం చ "వక్ష శ్చ మణిబంధ శ్చ ముష్టి శ్చ నృపతే స్థిరా" ఇత్యు క్తత్వాత్.

## పదగతః కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలక వస్తు నాలంకారధ్వని ర్యథా

శ్లో. ద్రష్టుం వేంకటసూర్యరాయవిభు ముగ్రావేశయా విస్మృతా
ధర్తుం హార మహోగళే పథిచరం త్వ్యాత్మాన మాలోక్య చ
కస్యా శ్చి ద్ధసితాంచదుజ్జ్వలదృశోహాసప్రభాభూషిత
ప్రోత్తుంగస్తనయుగ్మదత్తనయనా కాచి ద్ద్రుతం నందతి.

వ్యాఖ్యానమ్ :—

అత్ర ద్రుతం నందతీ త్యనేన కస్యాశ్చి త్సమీపగతాయాః ప్రౌఢాయా మోషితః ప్రహసితరుచా యత్నంవినైవ నిజోత్తుంగ

వక్షోజమండలధార్యముక్తావళిలాభప్రతీతేః ప్రహర్షణాలంకారో వ్యజ్యతే. ఉదాహరతి ద్రష్టు మితి. ఉగ్రావేక్షయా గాఢోత్కంఠయా యోజయతి అత్రేతి.

వాక్యగత స్స యథా

శ్లో. కైరవేష్వివ సితాంబుజేష్వహో
సూర్యరాయవిభుకీర్తి కాంతయః
సంప్రసార్య కుతుకా త్తదా సుధా
వారిరాశి మభితోఽభిజాగ్రతి.

వ్యాఖ్యానమ్ :—

అత్ర మీలనాలంకారో వ్యజ్యతే వాక్యగత ముదాహరతి కైరవేష్వితి. కైరవేషు కుముదేష్వివ "సితే కుముదకైరవ" ఇత్యమరః. సితాంబుజేషు పుండరీకేషు "పుండరీకం సితాంభోజ" మిత్యమరః. సుధావారిరాశి మభితః; అభితః పరిత ఇత్యాదినా ద్వితీయా యోజయతి అత్రేతి. కీర్తీనాం జగద్వ్యాపనరూపవస్తునా ఉత్కృష్టకీర్తికాంత్యా నికృష్టకైరవాదినిగూహనా న్మీలనాలంకారో వ్యజ్యత ఇతి.

పదగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారేణాలంకారధ్వని ర్యథా

శ్లో. కీర్తిం వేంకటసూర్యరాయనృపతే! వ్యాప్తాం మహీం సర్వతః
జానానాలలనా స్త్రిలోకమభిత స్స్వర్వాహినీం వాహినీమ్
సంఘీభూయ కటిస్థలీప్రవిలసత్కుంభం హి ముగ్ధాః పరమ్
నీవీరుద్ధపటాంచలం ప్రముదితా శ్శీఘ్రం వలంతేఽధికమ్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర జానానా ఇతి పదేన భ్రాంతిమదలంకారేణ కీర్తిమందాకిన్యో రౌపమ్యధ్వనిః.

ఉదాహరతి కీర్తి మితి. హే సూర్యరాయనృప ! మహీం సర్వతః వ్యాప్తాం తే తవ కీర్తిం త్ర్యవయవో లోక స్త్రిలోకః. శాక పార్థివాదిత్వా న్మధ్యమపదలోపీ సమాసః. లోకత్రయసముదాయోఽత్ర త్రిలోకపదేన వివక్షితః. అన్యథా తద్ధితార్థేత్యాదినా సమాహారసమాసే అకారాంతోత్తరపదత్వేన స్త్రీత్వా ద్ద్విగో రితీకారే త్రిలోకీతి స్యాత్. అత ఏవ ద్విగో ర్లు గనపత్య ఇత్యత్ర త్ర్యవయవా విద్యా తా మధీతే వేత్తి వా త్రైవిద్యః. న తు తిస్రో విద్యా అధీత ఇతి. అణ్ప్రత్యయనిమిత్త స్తద్ధితార్థేత్యాదినా సమాసః. అత ఏవ అణ్ప్రత్యయస్య లుగభావ ఇత్యాహ భగవాన్ భాష్యకారః. త మభితః "అభితః పరిత" ఇత్యాదినా ద్వితీయా. స్వర్వాహినీం మందాకినీం వాహినీం నదీం జానానా అత ఏవ ముగ్ధా లలనా స్సంఘీభూయ కటిస్థలీషు విలసంతః కుంభా భాండా యస్మిన్ కర్మణి యద్యథా భవతి తథా. పర మత్యంతం నీవీరుద్ధః పటాంచలో యస్మిన్కర్మణి యద్యథా భవతి తథా ప్రముదితా స్సత్య శ్శీఘ్రం లవంతే సంగమయతి. అత్రేతి.

## వాక్యగత స్స యథా

శ్లో. జేతు ర్వేంకటసూర్యరాయనృపతే ర్ధారాధరశ్యామలామ్
చంచత్ఖడ్గలతాం ప్రణుత్తగజతాకాలీఢముక్తాఫలామ్
పశ్యంతః పరిపంథిభూవరభటా స్సంగ్రామకేళ్యుద్భటాన్
దంష్ట్రాకోటికరాళవక్త్రకుహరాం కాళీం స్మరం త్యుద్భ్రమామ్.

వ్యాఖ్యానమ్ :-

అత్ర స్మరణాలంకారేణ ఉపమా ధ్వన్యతే. వాక్యగత ముదాహరతి జేతు రితి. జేతు ర్జిష్ణోః "జేతా జిష్ణు శ్చ జిత్వర" ఇత్యమరః. వేంకటసూర్యరాయనృపతేః ధారాధరో జలధర ఇవ శ్యామలాం

మధురసామోదంబు మధుపాళిని గలంచె
సరసుల కొఁగి విరసత జనించె
నివరథ్యవితతిధావన మందత వహించె
సలిలచరస్ఫూర్తి సన్నగించెఁ

గీ. బథికవితతి తరుచ్ఛాయఁ బవ్వళించెఁ
బ్రాణితతియెల్ల నాతపప్రథిమ నొంచెఁ
గరులు గిరులును బడియలకడ వసించె
నవనిమండలి వేసవి యాక్రమించె. 5

కం. భ్రమరక్రమసంభ్రమవి
భ్రమరమణీయములు మేదురప్రాగ్రంబుల్
ప్రమదావతంసలీలా
ప్రమదావహములు శిరీషపదములు మెఱసెన్. 6

చ. సరసిజగంధి యోర్తు జలశాల జనాళికి దప్పి తీర్పఁగా
సరసుఁ దోకందు పద్మముఖి దన్నను గన్గొని యూర్ధ్వదృష్టియై
కరము వదల్చి నీకు తమకంబునఁ ద్రావఁగ నప్పలంతి యా
పురుషునిఁ జూచు ప్రేమ జలముల్ దనుధార నొసంగె నయ్యెడన్. 7

మ. జలపూరాతివిహారమున్ సుమవనీసంచారమున్ జందనా
చలసంభూతసమీరమున్ హిమలవాంఛచ్చంద్రికాసారము
న్విలసత్కుంజకుటీరము న్గదళికానిర్ముక్తకర్పూరముం
దలఁపన్ భోగులకుం బ్రమోద మొసఁగెన్ ధాత్రీస్థలి న్వేసవిన్.

శా. కాంతారత్నము లయ్యెడన్ గనిరి తత్కాంతారకాంతావనీ
జాంతాక్రాంతతరంగరంగదమలాబ్జాళీమిళత్సౌరభా
త్యంతాకృష్టమిళిందఝంకరణగానానందసంధాయకా
శ్రాంతశ్రాంతిహరాంబుదూషితసుధాసారంబుఁ గాసారమున్. 9

సీ. కాదంబకాదంబకాదంబరుచిరంబు
ధీవరధీవరాధిష్ఠితంబు
భ్రమరవిభ్రమరవిభ్రమరవిద్యాంకంబు
గురుసత్వగురుసత్వపరివృతంబు
సారససారససారసద్విజనుతంబు
చక్రాంగచక్రాంగసౌష్ఠవంబు
పానీయపానీయపానీయవిభవంబు
నవకోకనవకోకనదయుతంబు

గీ. రాజలవ్రాతకచ్ఛపరాజిలంబు
సమకరద్వంద్వవీచికాసమకరంబు
మధురకైరవనిస్సరన్మధురసంబు
సారమగు తెంచ నచటికాసారవరము. 10

కం. సారసముఖు లయ్యెడఁ గా
సారముదరి విడిచి జిలుఁగుఁజలువులతోడన్
వారివిహారము సలిపిరి
వారివిహారాంగరుచులు వశమే పొగడన్. 11

కం. ఉత్పలములు మా నయనము
లుత్పలములకన్న నన్న నోహో యివిగో
మత్పదములు పంకజరుచి
మత్పదములు చూడు మను మది ముద మొదవన్. 12

మ. అలులం బైకొనఁదోలుచుం గమలపత్రాంబుచ్ఛటల్ ద్రోలుచుం
గలువ ల్గైకొని వ్రాలుచు న్నమదచక్రశ్రేణిపైఁ దూలుచున్
జలపూరంబునఁ దేలుచుం దరుణహర్షప్రాప్తిచేఁ గ్రాలుచున్
సలిలక్రీడ యొనర్చి రిందుముఖు లుత్సాహంబుతో నయ్యెడన్. 13

సీ. బాలకో నీమీఁద వాల న న్నంటకు
మని దూరమున నీఁదులాడి యాడి
వారికన్గవ మూయఁ జేరియున్నలతాంగి
మోము దోయిట నీట ముంచి విడిచి
పిల్వఁ బిల్వఁగ రాని పిల్లఁగల్వలఁ బూని
విసరి దగ్గఱఁ జేర పెఱచి నిలిచి
కరపద్మకలితకంకణఝణంఝణలచేఁ
గలహంసములతోడఁ గల నొనర్చి
గీ. చండకరకాండమండితపుండరీక
తండములఁ జెండు చెండాడి గండుమీలఁ
గేల గిలించి తేలించి నీల ముంచి
నెలఁత లంభోవిహారంబు సలిపి రెలమి. 14

ఉ. లీల జలంబులం బ్రతిఫలించి కనుంగొన నొప్పుచున్న యా
లోలకనీనికాకులవిలోచనము ల్గని బాల యోర్తు మ
త్తాళిసమేతకైరవము లంచుఁ గలంచిన నొక్కప్రోడ మే
ల్మే లని నవ్వెఁ జూపరులు మెచ్చ వినోదము గాఁగ నత్తఱిన్.

కం. శ్రీలలితశ్రుతిసీమలఁ
గ్రాలెడుకనుదోయినీడఁ గని వేఱొకనీ
లాళికచ దలఁచె వీనుల
నీలోత్పలయుగళి దగిలె నిజముగ ననుచున్. 16

మ. తనుసంసిక్తసితాంశుకావృతులతో ధారాళవార్వాహమో
హనలీలాలకజాలకాస్యములతో నంసద్వయాక్రాంతకం
పనిగూఢోరుపయోధరద్యుతులతోఁ బ్రవ్యక్తరూపాంగులై
తనుమధ్యల్ పయ లెక్కి యాసరసిచెంత న్నిల్చి మోదంబునన్.

కం. గడగడ నడుములు వడఁకఁగఁ
దడిపావడ లొడల నెడలఁ దిరుఁణులు నెఱుక
ల్దడఁబడఁగఁ గడఁక సన్నపు
మడుఁపులఁ దడిఁ దుడుచుకొనుచు మహితాకృతులై. 18

మ. పులకాంకూరము లుద్భవింపఁగ నవాంభోజాతపత్రేక్షణల్
వలిపెంబు ల్సవరించి సొమ్ములను ఠేవ న్మేనఁ గైసేసి శ్రీ
వెలయం గస్తురినామముల్ నొసల వేవే ల్సేయఁగా దిద్ది కెం
దలిరుంగైదువుజోదుఁ గొల్చుటకు నుద్యత్ప్రీతి సంధిల్లఁగన్. 19

ఉ. పొన్నలనీడఁ బోకనునుఁబోదియ చెంగట మావిచేరువన్
గ్రొన్ననకల్మిఁ జెన్నలరుగొజ్జఁగిపూఁబొదరిల్లు చేరి యా
కన్నెలు కమ్మదెమ్మెరలు ఘర్మకణంబులు గ్రోలుచుండ సం
పన్నలినేక్షణాత్మజప్రభావము భావమునం దలంచుచున్. 20

సీ. సిరిగన్నసురపొన్నవిరులఁ దిన్నియఁ జేసి
జగతి గొజ్జఁగినీరు చల్లి యలికి
రంగుగాఁ బుప్పొడి రంగవల్లి ఘటించి
కలువపూసింగంపుగద్దె నిలిపి
కనకంబుచే మరుఁ గావించి యందుంచి
ననదేనె నభిషేచనం బొనర్చి
నానావిధప్రసూనంబులఁ బూజించి
భ్రమరాళి ధూపధూమముగఁ జొనిపి

గీ. కిసలయంబుల దీపము ల్వెస నొనర్చి
పరిపచేళిమవినిపతత్ఫలరసంబు
భావభవునకుఁ బ్రీతి నర్పణము చేసి
ముందఱ వసించి మ్రొక్కుచు ముగ్ధ లపుడు. 21

వ. ఇట్లు నుతు లొనర్చి రంత. 22

గీ. వందనము మార యిందిరావరకుమార
దండము మనోజ పద్మబాంధవసుతేజ
శరణు భవదూర శంబరాసురవిదార
నతి యువధ్యేయ రతిసతీధృతిసహాయ. 23

గీ. ఆత్మభవుఁడ వజుఁడ వసమాంబకుఁడ వీవు
గాన నిన్నుఁ గొల్వఁగలిగె మాకు
మూఁడుమూర్తు లేకమూర్తియౌ నప్పరం
జ్యోతివౌహృదయసరణిఁ జూచుమహిమ. 24

కం. అని యారీతి మృగీలో
చన లనుపమవాక్ప్రసూనజాలంబులచే
మనసిజు నర్చించుచు న
ద్దిన మానందాంబురాశిఁ దేలిరి కడఁకన్. 25

మ. యువతీవ్రాతము చేరి కొల్వఁగ మహోద్యోగంబుతో నట్లు వా
సవదత్తాలలనావతంసము ప్రియేచ్ఛ న్మన్మథారాధనో
త్సవము ల్సేయఁగఁ జూచి తజ్జనకుఁ డుత్సాహంబుతోఁ బెండ్లి వై
భవ మిక్కన్య కొనర్తు నే నని దృఢప్రారంభుఁ డయ్యె న్మదిన్.

వ. అంత. 27

గీ. చెలువు మీఱంగ శృంగారశేఖరుండు
నపుడు వాసవదత్తాస్వయంవరమున
కవనిఁ గల రాజులను బిల్వ ననిచి కుసుమ
పురముఁ గైసేయవలె ననఁ బురమునందు.- 28

ఉ. కట్టిరి మేలుక ట్లనఁటికంబములున్ జలపూర్ణకుంభము
ల్దట్టము చేసి ద్వారములఁ దాపిరి గోడలఁ బాలసున్నము
ల్వెట్టిరి మట్టుమీఱఁ బురవీథులఁ బౌరులు సంభ్రమంబుతోఁ
బట్టపురాజపట్టికి శుభం బొనఁగూడె నటంచు వేడుకన్. 29

సీ. కస్తూరితోఁ గూర్చి కలయంపి చల్లిరి
హేమవారి వజ్రకుట్టిమములందుఁ
జెలఁగి జవ్వాదిచే నలికి ముత్తెపుమ్రుగ్గు
లిడిరి మేలిమిచాయగడపలందు
మణితోరణము లభ్రమణితోరణము సేయఁ
గట్టిరి శృంగాటకములయందుఁ
దతపురందరధనుర్ధామధ్వజంబులు
నిలిపిరి రాజమందిరములందు

గీ. ఘుగఘుగాయితసౌరభస్ఫురితవిలస
దగరుధూపంబు లందంద నెగడఁజేసి
కమలమణిహర్మ్యవాతాయనములయందుఁ
బ్రభువరాజ్ఞానుమతిచేతఁ బౌరు లంత.

కం. హయ కుంజర రథ యుతులై
రయమునఁ జనుదెంచి రఖిలరాజకుమారుల్
ప్రియమున వాసవదత్తా
స్వయంవరమహోత్సవంబు సాగినయెడలన్.

సీ. ఆంధ్ర ఘూర్జర కరూ శాంగ వంగ వరాట
కోసల కుంతల క్షోణిపతులుఁ
గురు విదర్భ కళింగ కొంకణ ఔంకణ
మగధ బర్బర లాట మనుజపతులు
సౌరాష్ట్ర మాళవ శక సింధు నేపాళ
కేరళ కర్ణాట భూరమణులు
సౌవీర మత్స్య పాంచాల ద్రవిడ మద్ర
కేకయ చోళ ధాత్రీకళత్రు

గీ. అతులబలయుతులై చమూపతులు గొలువఁ
బ్రాభవము మీఱఁ గుసుమపురంబుఁ జేర
నతిరయంబునఁ జనుదేర నపుడు ప్రేమ
చెంగలించంగ శృంగారశేఖరుండు. 32

సీ. తురగరింఖాసముద్ధూతధాత్రీపరా
గములు పురంబెల్లఁ గప్పుకొనఁగ
గిరిశృంగనిభమదద్విరదబృంహితములు
ఘనఘనస్వనములకరణిఁ దనర
వీరకాహళశంఖభేరికారావము
లుబ్బనభోవీథుల బోరుకలఁగఁ
కింకిణీటంకారసంకులధ్వజయుత
స్యందనంబులు జనానంద మొసఁగ
గీ. నెదురుగాఁ జని మది ముద మొదవ నృపులఁ
దనహజారమునకుఁ దెచ్చి కనకమంచ
సంస్థితులఁ జేసి యత్యంతసంభ్రమమునఁ
బరిజనంబులు గొలువ వైభవము మీఱ. 33

మ. కొలువై యట్లు నృపాలశేఖరుఁడు కోర్కుల్మీఱ ధాత్రీజనం
బులతో సైఁగ యొనర్ప వారలును సమ్మోదంబుతో మేడలోఁ
పలికిం బోయి తదాజ్ఞఁ దెల్పుటయుఁ దత్ప్రాసాదమార్గంబునం
గలకంఠీమణిరాక తేటపడె బంగారందియల్మ్రోయుటన్. 34

కం. జనయిత్రి తనకు నృపనం
దనులవిధం బెఱుకపఱుపఁ దగు నొకప్రౌఢాం
గనఁ బేరఁ గళావతి యనఁ
జనుదానిం బనుచుటయును సంరంభమునన్. 35

సీ. చనుదోయిభర మానఁజాలనిచందాన
గడగడ నరిపేదకౌను వడఁక
రాకానిశాకరశ్రీకరాస్యంబున
దరహాసచంద్రికాస్ఫురణ మెఱయ
మరుచేత నోరజాలు కిరుసుకత్తి యనంగ
జంఘాలమై కీలుజడ నటింప
గురునితంబద్వయీభరమనోహరయాన
మునకు నోడి మదేభములు దలంకఁ
గీ. పదయుగంబున జాళువాపాన లమర
మదనమంజరి మొదలైన సుదతులెల్లఁ
బసిఁడిబెత్తలచే బరాబరులు సేయఁ
దనజనకునాజ్ఞ వాసవదత్త వచ్చె. 36
ఉ. వచ్చి పసిండిమేడ వెలిపాకిటఁ గాంచనమంచసీమనై
నచ్చిగురాకుఁబోఁడి సకియల్ భజియింపఁగ నుండఁ జూచి తా
రచ్చెరువంది రాకొమరు లా చెలువం బనిమేషతాప్తులై
యచ్చరభావ మొప్పఁగఁ బ్రియంబునఁ జూచుచునుండి రయ్యెడన్.
సీ. మదనకృపాణి యీమానినీమణివేణి
మారుసింగిణు లీమిటారిబొమలు
భావజుతూపు లీపద్మాక్షిచూపులు
రతిపతికీర్తి యీయతివనవ్వు
వెడవిల్తుముకుర మీవిరిబోఁడినెమ్మోము
వలరాజుశంఖ మీకలికిగళము
కాముదుర్గంబు లీకలకంఠికుచములు
మరునిరథాంగ మీమగువపిఱుఁదు

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

అధ్యక్షులు
విమర్శకాగ్రేసర, ఐతిహాసిక సమ్రాట్టు
శ్రీ బండారు తమ్మయ్య

ప్రధాన కార్యదర్శి. కోశాధికారి
అభినవభోజ
శ్రీ దంటు భాస్కరరావు

సహాయ కార్యదర్శి
శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి

కార్యనిర్వాహకవర్గ సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రి
2. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి (బాలవ్యాస)
3. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (వ్యాకరణ విద్యాప్రవీణ, భాషాప్రవీణ)
4. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర)
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తు
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ
7. డాక్టరు శ్రీ ఇవటూరి జోగారావు (యం. బి. బి. యస్.,)
8. శ్రీ చిదునోలు కోటీశ్వరరావు
9. శ్రీ దామెర రాజగోపాలరావు, బి. ఏ.
10. శ్రీ వేదుల రామచంద్రకీర్తి, ఎమ్. ఏ. (ఆనర్సు)
11. శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రి (ఉభయభాషాప్రవీణ)
12. శ్రీ కావలి శ్రీరామమూర్తి, బి. ఏ. బి ఎల్.

పత్రికా సంపాదకుడు
శ్రీ కుందూరి ఈశ్వరదత్తు

ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణములు

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | |
|---|---|
| 5వ సంపుటము | రు 12—00 |
| 6వ సంపుటము | 15—00 |
| 7వ సంపుటము | 15—00 |

1–4 సంపుటములు పునర్ముద్రణములు గావింపబడనున్నవి

ప్రతియొక్కటికి వెల రు 12 లు

కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము

పెక్కుపాఠభేదములతోఁ గూడిన వెనకటి విషయ మాతృయుఁ గలిగి తిరిగి తృతీయముద్రాపీఠికతో ముద్రితమైనది రు 1—50

మాధ్యమిక కారికలు

బౌద్ధాచార్య నాగార్జున ప్రణీతము కొల్లూరు సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యాసహితము మూల్యము రు 2—50

ఆంధ్రసాహిత్యపరిషత్తు,

కాకినాడ

Printed by J Gopalam B A L T, at R puilic Pess Kakinada
Edited by K ISWARADUTT